# కమ్యూనిస్టుల
# ఐక్యసంఘటన
# అన్వేషణ

ప్రథమ సంపుటి

డి. వి. సుబ్బారావు

కాంతిరేఖ ప్రచురణ, చిలువూరు
దుగ్గిరాల మండలం, గుంటూరుజిల్లా
1999

# అంకితము





తాము నేలతల్లికి అంకితమై

నన్ను చదువుల తల్లికి అర్పించిన

త్యాగమూర్తులు, నా తల్లిదండ్రులు

కీర్తిశేషులు దేవినేని శంభయ్య, రత్నమ్మల

పాదపద్మములకు ప్రేమతో సమర్పణ....



# పరిచయం

గ్రంధకర్త శ్రీ దేవినేని వేంకట సుబ్బారావు తన "కమ్యూనిస్టుల ఐక్య సంఘటన అన్వేషణ" అన్న గ్రంధాన్ని మొదటి ప్రపంచ యుద్ధ పరిణామాలు, భారత జాతీయ కాంగ్రెసు విధానాలతో ప్రారంభించారు. ఎందువల్లనంటే, ఈ యుద్ధ కాలంలోనే 1917 అక్టోబరులో రష్యాలో మహానాయకుడైన వి. ఐ. లెనిన్ నాయకత్వాన బోల్షివిక్ విప్లవం (కార్మిక కర్షకుల విప్లవం) జయప్రదమైంది. సోషలిస్టు ప్రభుత్వం ఏర్పడింది. 1920 ప్రాంతంలో భారతదేశంలోకూడ చిన్నచిన్న కమ్యూనిస్టు గ్రూపులు రూపొందుతున్నాయి. ఆటు తరువాత 1925 డిశెంబరులో భారత కమ్యూనిస్టు పార్టీ యేర్పడింది.

గ్రంధకర్త తన గ్రంధములో అధ్యాయాలకు పర్వాలని పేరుపెట్టారు. వేద వ్యాసమహర్షి విరచిత మహాభారతములో 18 పర్వాలున్న విషయం సర్వవిదితమే.

## ఆదిపర్వం

ఈ గ్రంధం ఆదిపర్వంతో ప్రారంభమగుతుంది. ఆదిపర్వం, జాతీయ సంఘటనా పర్వం, విగ్రహపర్వం, పోరాట పర్వం, సభాపర్వాలు, ఈ మొదటి సంపుటిలో ఉన్నాయి.

ఆదిపర్వంలో ప్రధమ ప్రపంచ సంగ్రామములో యుద్ధం ఎడల మహాత్మా గాంధి, భారత కాంగ్రెసు అవలంభించిన వైఖరి, యుద్ధము ముగిసిన తరువాత జాతీయ కాంగ్రెసు ఆశించిన విధంగా బ్రిటిషు ప్రభుత్వం భారత దేశానికి స్వయం పరిపాలన యివ్వడానికి సుముఖత చూపించకపోవుటతో సహాయ నిరాకరణోద్యమాన్ని ప్రారంభించుటతో ప్రారంభమైంది.

భారతదేశములో కమ్యూనిస్టు బృందాల యేర్పాటు, మూడవ అంతర్జాతీయ కమ్యూనిసు కాంగ్రెసు సమావేశం, వలస సిద్ధాంతంపై లెనిన్-యం. యన్. రాయ్‌ల విభేధాలు రాయ్ డికాలనైజేషన్ సిద్ధాంతాన్ని కమ్యూనిస్టు మహాసభ త్రోసిపుచ్చుట వగైరా ఘటనలు వివరించబడ్డాయి.

కొమింటరన్ 6వ, కాంగ్రెసు భారత బూర్జువావర్గాన్ని గురించి ఒంపెత్తు పొరపాటు అవగాహనకు వచ్చింది దాని ఫలితంగా భారతదేశ కమ్యూనిస్టులు అవలంభించిన పొరపాటు ఎత్తుగడలు, చైనా, జర్మన్, బ్రిటిషు పార్టీలు మూడు, బహిరంగ లేఖలు వ్రాయుట, వాటి వివరణలతో ఆదిపర్వం ముగుస్తుంది.

## జాతీయ సంఘటనా పర్వం

1930 దశక ప్రారంభమునుండి యూరప్‌లో పాశిస్టుశక్తుల బలం పెరిగి, పెద్ద ప్రమాదంగా తయారైన పూర్వ రంగంలో, ఈ దుష్టశక్తులకు వ్యతిరేకంగా యూరపులోని పలుదేశాలలో శాంతి, ప్రజాస్వామ్యం, అభ్యుదయాన్ని కాంక్షించే శక్తులన్నింటితో పాప్యులర్ ఫ్రంటు ఏర్పరచబడింది. ఇదే సమయంలో కొమింటరన్ 7వ కాంగ్రెసులో అంతర్జాతీయ కమ్యూనిస్టు నాయకుడు డిమిట్రొవ్ ప్రవేశపెట్టిన

నివేదికలో ఫాశిజానికి వ్యతిరేకంగా విశాలమైన ఐక్యసంఘటనా నిర్మాణానికి, పోరాటాలకు పిలుపు యివ్వటం జరిగింది.

వలస దేశాలలోకూడ జాతీయ విముక్తికోసం సామ్రాజ్యవాదులతో జరిపే పోరాటంలో జాతీయ బూర్జువావర్గంతోసహా అన్ని వర్గాలు ఐక్యసంఘటనగా ఏర్పడి పోరాడాలని సూచించబడింది. ఈ పిలుపు ఫలితంగా, భారతదేశంలోని కమ్యూనిస్టు పార్టీ, కార్మిక సంఘాలు భారత జాతీయ కాంగ్రెసుతో కలసి ఐక్యపోరాటాలు సాగించిన విషయాలు, ఈ కాలంలోనే అఖిల భారత రైతు సంఘం, విద్యార్థి సంఘం, అభ్యుదయ రచయితల సంఘాలు ఏర్పడటం కార్మిక, కర్షక ఉద్యమాల విస్తృతి, సమరశీల పోరాటాలు, విద్యార్థి, యువకుల పోరాటాలు, అభ్యుదయ రచయితల, ప్రజా సాంస్కృతిక దళాల యేర్పాటు, విస్తృతి మొదలగు ఉద్యమాలలో భారత విముక్తి పోరాటం అత్యధిక బలాన్ని సంతరించుకోవటం మొదలగు ఘటనలు ఈ పర్వంలో వివరించబడ్డాయి.

## విగ్రహపర్వం

రెండవ ప్రపంచ యుద్ధం 1939 సెప్టెంబరు 1న, జర్మనీ పోలెండుపై దండెత్తడంతో ప్రారంభమయింది. హిట్లరు అంతకు ముందునుండీ ఆస్ట్రియా జకోస్లావేకియాలపై సాగిస్తూ వచ్చిన దురాక్రమణ, జర్మనీతో బ్రిటన్ చేసుకొన్న మ్యూనిచ్ ఒడంబడిక సోవియట్ యూనియన్‌పై హిట్లరు దాడిచేసేటట్లుగా బ్రిటన్, అమెరికాలు యిచ్చిన ప్రోత్సాహం మొదలగు ఘటనలతో విగ్రహపర్వం ప్రారంభమవుతుంది.

రెండవ ప్రపంచ యుద్ధ ప్రారంభం నుండి జాతీయ కాంగ్రెసు, మహాత్మా గాంధీ అనుసరిస్తూ వచ్చిన వైఖరి కాంగ్రెసులోని అతివాదుల వైఖరి, రాంఘర్ కాంగ్రెసు వ్యక్తిగత సత్యాగ్రహ తీర్మానం 1941 జూన్ 21న హిట్లరు సోవియట్ యూనియన్‌పై దాడి చేయడం సామ్రాజ్యవాద యుద్ధ స్వభావం మారి ప్రజాయుద్ధముగా మారిందని భారత కమ్యూనిస్టు పార్టీ అవగాహన, జాతీయ పోరాటం ఎత్తుగడలలో మార్పురావాలని వాదించటం, జాతీయ కాంగ్రెసు పోరాటాన్ని తీవ్రతరం చేయాలని నిర్ణయించి 1942 ఆగష్టు 8వ తీర్మానించడం, ఆ మహాసభలో మహాత్మా గాంధీ "చేయి లేదా చావు" (డు ఆర్ డై) అనే పోరాట నినాదంతో ఉద్రేకంగా ఉపన్యసించడం, తరువాత జరిగిన పరిణామాలు వగైరా వివరించబడ్డాయి.

రెండవ ప్రపంచ యుద్ధం సోవియట్ సైన్య విజయ పరంపరల ముందు జర్మన్ ఫాసిస్టు సైన్య పలాయనం, సోవియట్ ఎర్రసైనికులు బెర్లిన్ పార్లమెంటు (రీచ్‌స్టాక్) భవనంపై సోవియట్ జండా ఎగురవేయడంతో బెర్లిన్ పతనం, జర్మనీ ఓటమితోను, తూర్పున జపాన్ ఓటమితోను 1956 సెప్టెంబరులో మిత్ర రాజ్యాల విజయంతో ముగిసింది.

యుద్ధానంతరం 1946లో కేంద్ర, రాష్ట్ర శాసనసభలకు జరిగిన ఎన్నికలలో కాంగ్రెసు ఘన విజయం సాధించింది. భారత కమ్యూనిస్టు పార్టీ అంచనా వేసినట్లుగానే యుద్ధానంతరం దేశమంతటా అన్ని వర్గాల ప్రజల పోరాటాలు ప్రభుత్వోద్యో

గుల, పోలీసుల సమ్మెలు, బెంగాల్, తెభాగా తెలంగాణా రైతాంగ పోరాటాలు, 1946 బొంబాయి నావికా తిరుగుబాటు జరిగాయి. ఇండియా తమ చేయి జారిపోతుం దని బ్రిటిషు సామ్రాజ్యవాదులు గమనించారు. భారతదేశానికి అధికార మార్పిడి చేయక తప్పదని గ్రహించారు. 1946 ఎన్నికల తరువాత కేంద్రములో కాంగ్రెసు-ముస్లింలీగు తాత్కాలిక జాయింటు ప్రభుత్వం ఏర్పడింది.అధికార మార్పిడికి బ్రిటన్ మౌంట్‌బాటన్‌ను భారత వైస్రాయిగా పంపింది మౌంట్‌బాటన్ అవార్డు, దేశము భారత్, పాకిస్తాన్‌లుగా విభజన, 1947 ఆగష్టు 15న భారత్ స్వాతంత్ర్యాన్ని పొందడం మొదలగు ఘటనలతో విగ్రహ పర్వం ముగుస్తుంది.

## పోరాటపర్వం

భారతదేశానికి 1947 ఆగష్టు 15న వచ్చిన స్వాతంత్ర్య స్వభావంపై పి. సి. జోషి నాయకత్వంలోని కేంద్రకమిటి 1947 జూన్ తీర్మానం, వాస్తవ పరిస్థితికి దగ్గరగా వుంది. అయితే సోవియట్ యూనియన్‌లో ప్రసిద్ధి చెందిన అకడమిషియ నుల అంచనా, ముఖ్యంగా ఝుకొవ్ అంచనా భారత స్వాతంత్ర్యం గురించి వేరుగా వుంది. యూరపులోని సోషలిస్టు దేశాల అనుభవాల సమన్వయానికిగాను యేర్పడిన "కొమిన్ ఫారం" అంచనా ముఖ్యంగా దాని సెక్రటరీ జనరల్ ఝడనోవ్ అంచనా మరో విధంగా ఉంది. భారతదేశంపై సామ్రాజ్యవాదుల పెత్తనం సరోక్షంగా సాగు తూనే ఉ దని, నిజమైన స్వాతంత్ర్యం భారత దేశానికి రాలేదని, భారత బూర్జువా వర్గం, బ్రిటిషు సామ్రాజ్యవాదులకు లొంగిపోయి, దేశ పరిపాలనలో జూనియరు భాగస్వామిగా వుండటానికి అంగీకరించినదనే విశ్లేషణ చేసింది.

రణదీవె పైవిశ్లేషణవైపు మొగ్గి పార్టి కేంద్ర కమిటిలో మెజారిటీ సభ్యులను తన అవగాహనవైపు తిప్పుకొనడం, 1948 ఫిబ్రవరి చివర మార్చి ప్రారంభంలో జరిగిన కలకత్తా రెండవ పార్టీ కాంగ్రెసులో భారతదేశానికి వచ్చినది బూటకపు స్వాతంత్ర్యమని అభివర్ణించి, ఇక బూర్జువావర్గ విద్రోహానికి వ్యతిరేకంగా కార్మిక వర్గ నాయకత్వాన జనతా విప్లవ పోరాటం సాగాలన్న పిలుపు రణదివె తన ప్రధాన రాజకీయ నివేదికలో పేర్కొన్నారు.

అప్పటికి తెలంగాణాలో భూస్వాముల అక్రమాలకు, రజకార్లు, దౌర్జన్యాలకు వ్యతిరేకంగా ప్రారంభమైన తెలంగాణా పోరాటం నైజాం వ్యతిరేక దేశముఖ్, జాగీర్దారీ. ప్యూడలు దొరలకు వ్యతిరేక పోరాటంగా ఉన్నత శిఖరాలకు చేరింది. దొరల భూములను ప్రజలు పంచుకొని, గ్రామరాజ్యాలు ఏర్పాటు చేస్తున్నారు.నిజాం నవాబు ఇండియన్ యూనియన్‌లో చేరాక భారత ప్రభుత్వంతో ఒక యేడాది యధా తధపు ఒడంబడిక చేసుకొన్నాడు తెలంగాణా పోరాట స్వభావాన్ని సరియైన అంచనా వేయక చైనాలోవలె భారతదేశంలోకూడ రైతాంగ సాయుధ విప్లవ పోరాటము ప్రారంభమయిందని, తెలంగాణా పంధాయే భారత ప్రజాస్వామ్య విప్లవ పంధాయని దుందుడుకు వాద పరాకాష్టంగా కలకత్తా కాంగ్రెసు నిర్ణయించడం, అటు తరువాత కమ్యూనిస్టు పార్టీ దేశమంతటా నిషేదించబడటం, కమ్యూనిస్టుల అరెస్టులు వగైరా ఘటనలు వివరించబడ్డాయి.

రణదివె దుందుడుకు, పూర్తి సెక్టేరియన్ విధాన పంథా దుష్ఫలితాలు వెల్లడవటంతో పార్టీ అధినాయకత్వంలో విభేదాలు, రణదివేను నాయకత్వంనుండి తొలగించడం, చైనా మార్గమే మన మార్గం అంటున్న రాజేశ్వరరావు కొద్దికాలం ప్రధాన కార్యదర్శి అవడం, తరువాత అజయ్‌ఘోష్ జనరల్ సెక్రటరీగావడం, విభేదాల పరిష్కారానికి సోవియట్ నాయకత్వానికి విజ్ఞప్తి చేయడం అజయ్‌ఘోష్, రాజేశ్వరరావు, డాంగే, బసవపున్నయ్యల రహస్య మాస్కోయాత్ర, అక్కడి సంప్రదింపులు, స్టాలిన్ సలహాతో నూతన పంథా నిర్ణయంతో పోరాట పర్వం ముగుస్తుంది.

## సభాపర్వం

1950 జనవరి 26న భారత నూతన రాజ్యాంగం ప్రకారం రిపబ్లిక్‌గా ప్రకటించబడింది. దీని ప్రకారం 1952 ప్రారంభంలో వయోజన వోటింగుతో పార్లమెంటు అసెంబ్లీలకు ఎన్నికలు జరుగనున్నాయి.

నూతన పార్టీ విధానం ప్రకారం తెలంగాణా పోరాటాన్ని విరమించి, ఈ ఎన్నికలలో భారత కమ్యూనిస్టు పార్టీ పాల్గొంటుందని ప్రకటించడం, నిర్బంధ విధానం సడలింపు ఫలితంగా జైళ్ళనుండి నాయకుల విడుదల రహస్య జీవితంనుండి నాయకులు, కార్యకర్తలు బహిరంగంగా రావడం, పార్టీని రానున్న ఎన్నికలకు తయారుచేయడం, 1952 లోక్‌సభకు, శాసనసభలకు జరిగిన ఎన్నికలలో భారత కమ్యూనిస్టు పార్టి సాధించిన ఘన విజయాలు వగైరా వివరించబడ్డాయి

అటు తరువాత 1954లో తమిళనాడులోని మధురైలో జరిగిన 3వ, భారత కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెసు, దాని నిర్ణయాలు వివరించబడ్డాయి. అప్పటికి కూడ భారతదేశానికి నిజమైన స్వాతంత్ర్యం రాలేదనే కమ్యూనిస్టు పార్టీ అంచనా 1954 ఏప్రిల్‌లో ఢిల్లీలో జరిగిన కేంద్రకమిటీ సమావేశంలో "రైతాంగ ప్రజాసామాన్యములో మన కర్తవ్యాలు" అన్న ముఖ్యమైన పత్రం రూపొందించిన ప్రధాన విషయాల విశదీకరణతో సభాపర్వం ముగుస్తుంది.

ఈ ప్రథమ సంపుటము 5 పర్వాలు చదువుకున్నపుడు భారత జాతీయ కాంగ్రెసు, దేశ స్వాతంత్ర్యానికి జరిపిన పోరాట వివిధ దశల వివరాలు వివరించబడ్డాయి. 1917లో రష్యా అక్టోబరు విప్లవం తరువాత యేర్పడ్డ సోషలిస్టు ప్రభుత్వం, దాని నాయకత్వము, అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీలు భారత స్వాతంత్ర్య పోరాటంలో వివిధ వర్గాల పాత్రను గురించి వేసిన అంచనాలు, కొమింటరను, తరువాత యేర్పడిన కొమిన్‌ఫారమ్‌ల అంచనాలు ఈ గ్రంథంలో వివరించబడ్డాయి. అంతేగాక భారత కమ్యూనిస్టు పార్టీ ఏర్పాటు, స్వాతంత్ర్యమునకై అది సాగించిన పోరాటాలు వివిధ దశలలో అది అనుసరించిన ఐక్యసంఘటనా ఎత్తుగడలు వాటి ఫలితాలు, స్వాతంత్ర్యోద్యమంలో కార్మికోద్యమ పాత్ర కార్మికుల, కర్షకుల వీరోచిత పోరాటాల పాత్ర, 1934లో కాంగ్రెసులోనే కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ఏర్పాటు, కాంగ్రెసు సోషలిస్టుల మధ్య, కమ్యూనిస్టుల మధ్య ఐక్యత-విభేదాలు వివరంగా తీసుకురాబడ్డాయి.

తాను చెప్పదలచుకొన్న విషయానికివున్న ఆధారాలు గ్రంధకర్త పేర్కొన్నారు పాద సూచికలలో వీటిని పేర్కొనుట జరిగింది. ఈ పాద సూచికలలో పేర్కొన్న గ్రంధాలు, పత్రాలు, రచయితల పేర్లు పరిశీలిస్తే తన గ్రంధ రచనకు రచయిత ఎంత విస్తృతమైన సాహిత్యాన్ని సేకరించి, అధ్యయనం చేసి, తన గ్రంధ రచన సాగించారో బోధపడుతుంది. ఈ కృషి బహుశా ఒక అర్ధ దశాబ్దానికి పైగానే సాగినట్లు కన్పిస్తోంది, తాను వ్రాసిన వివిధ పర్వాలను ఎప్పటికప్పుడు నాకు యిచ్చి, వాటిలో చేయవలసిన మార్పులు, చేర్పులు, సూచనలు కోరుతూవచ్చారు. గత నాలుగేళ్ళుగా ఈ గ్రంధకర్త రచన భాగాలను చదివి అనేక సూచనలు చేస్తూవచ్చాను. మొదట నేను చదివిన వ్రాతప్రతిలో వాక్యాలు మెలికలు తిరుగుతూ, పొడవుగా సాగాయి. వాటిని విడగొట్టి సరళం చేయవలసిందిగా సలహా యిచ్చాను. రచనా పద్ధతిలో కొన్ని మార్పులను సూచించాను.వాటిని దృష్టిలో ఉంచుకొని గ్రంధకర్త కొన్ని మార్పులు చేసిన ఫలితంగా తుదిరూపం దాల్చిన గ్రంధాన్ని ప్రకటించటం జరిగింది. అయినా యిప్పటికీ వాక్య కూర్పులో పదాల ఉపయోగంలో స్పష్టత, సరళతరాలేదు. అయినా ఈ గ్రంధంలో అనేక విషయాలు తెలుసుకోటానికి ఒక ఘనిగా పాఠకులకు పరిశోధకులకు బాగా తోడ్పడుతుందనుటలో నాకెట్టి సందేహము లేదు. ఆ విధంగా కమ్యూనిస్టు పార్టీ సభ్యులకు అభిమానులకు ఎంతో విలువైన పాఠాలు తీసుకోవడానికి, సరైన ఐక్యసంఘటనా ఎత్తుగడలు అవలంబించి, విధానములో ఎత్తుగడలలో సమాజములో వస్తున్న మార్పులను బట్టి మార్పులు చేసుకొంటూ, ఉద్యమాన్ని విస్తృత పరచి, బలపడుటకు అవసరమైన గుణపాఠాలు ఈ గ్రంధములో లభిస్తాయి. కమ్యూనిస్టు కార్యకర్తలు, అభిమానులు, అభ్యుదయవాదులు తప్పక ఈ గ్రంధాన్ని అభిమానించి, ఆదరణ చూపుతారని ఆశిస్తాను. విశేష శ్రమచేసి, ఎంతో సాహిత్యాన్ని సేకరించి, వాటిని అధ్యయనం చేసి, ఈ గ్రంధాన్ని రచియించి, ప్రకటించిన శ్రీ సుబ్బారావు అభినందనీయుడు. ఈయన టెక్నికల్‌గా కమ్యూనిస్టు పార్టీ సభ్యుడు కాకపోయినా, కమ్యూనిజంలో ప్రగాఢ విశ్వాసమున్న కమ్యూనిస్టు. ఈయన ఈ బృహత్తర రచనకి నా హార్దికాభినందనాలు:

వై. వి. కృష్ణారావు

అఖిల భారత కిసాన్‌సభ గౌరవాధ్యక్షులు

ఆలిండియా అగ్రికల్చరల్ ప్రైసెస్ కమిషన్ సభ్యులు

హైదరాబాదు

20-4-1999

# ఒక మాట

ఈ రచన ప్రచార పత్రమూ, చరిత్ర, శాస్త్రీయ సమగ్ర పరిశోధనాపత్రమూ కాదు. ఆత్మవివేచనా క్రమచిత్రణ.

ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ కుప్పగా కూలిపోవుట, భారత కమ్యూనిస్టు ఉద్యమం, మూడు రాష్ట్రాలకు పరిమితమై, మిగిలిన రాష్ట్రాలలో నామమాత్రమై ఉండుట యీ అధ్యయనానికి ప్రేరణ అయింది.

భారత కమ్యూనిస్టు ఉద్యమ త్రివేణీ స్రవంతుల చిత్రగతుల సమాజ మహాయజ్ఞ ప్రయోగంగా నెంచిన శాస్త్ర విద్యార్థి అన్వేషణ, అధ్యయనం.

ఈ వివేచనా అంతర్మధనం, పఠనం, నోట్సు, అధ్యయనం, వెయ్యిన్నర పేజీల సుదీర్ఘ కథనమైంది. ఈ యజ్ఞఫలాన్ని పదుగురతో పంచుకొనుటకు భారత కమ్యూనిస్టు ఉద్యమానికి "చంద్రునికో నూలుపోగుగా" సమర్పించుకొంటున్నాను.

ఈ అధ్యయన అవగాహనలు, విమర్శనాత్మక విశ్లేషణ, నిర్ధారణలు సహజంగానే మార్క్సిస్టు-లెనినిస్టు సైద్ధాంతిక పరిధులు, విలువలను ప్రాతిపదికలుగా పరిగణించుట పాఠకులు గ్రహించగలరు.

సోషలిజం, కమ్యూనిజంలలో పూర్తి విశ్వాసంతోనే యీ రచనా వ్యాసంగం కొనసాగింది. విప్లవోద్యమాలు, పోరాటాలు అపజయాలను తాత్కాలికంగా ఎదుర్కొన్నా, శాశ్వత విజయాన్ని సాధిస్తాయనే పూర్తి విశ్వాసం ఉంది.

కమ్యూనిస్టుల నిర్మాణ రాజకీయ కార్యాచరణలలో వుద్భవించే సమస్యలు 'సైద్ధాంతిక విమర్శనాత్మక విశ్లేషణ నిజాయితీ ప్రాతిపదికపైనే పరిష్కారం కాగలవు. పీకలవరకు గతంలో కూరుకుపోయి భవిష్యత్తుపై దృష్టి సారించుట మానరాదు.

వర్తమాన తక్షణ సమస్యలపై కేంద్రీకరించి, గతం నేర్పిన కఠిన చేదు అనుభవ పాఠాలను మరువరాదు. నేటి ఆదర్శ భవిష్యత్తుతో గత అనుభవాలను ఎప్పుడూ సంలీనం, సమన్వయం చేయుటే రాజకీయ వాస్తవికత అగుతుంది.

ఈ రచన కేవలం ఘటనలతో వివరాలతో నింపబడుటను కావాలనే వదలివేసింది. సుదీర్ఘ కమ్యూనిస్ట్ వుద్యమ కార్యాచరణలో ఉద్భవించిన ఆచరణయోగ్య సైద్ధాంతిక సమస్యల అధ్యయన, అవగాహనల వివేచనా పద్ధతినే అనుసరించింది.

ఈ అధ్యయన, వివేచన, అవగాహనలు మాత్రమే సరియైనవని రచయిత భావించుటలేదు సార్వత్రిక పరిష్కారాలు లేవు.సమిష్టి ప్రయత్నంలో పరిష్కారం కాని క్లిష్ట సమస్యలు లేవు. ప్రయత్నం శాస్త్రీయమైనది, ప్రశ్నింపరాని నిజాయితి గలది, వాస్తవికతను ప్రాతిపధికగా చేసుకొన్నది మాత్రం కావాలి.

ఈ రచన వివిధ దశలలో, వ్రాతప్రతిని వోపికతో చదివి, ఎన్నో సలహాలు, సూచనలు యిస్తూవచ్చిన శ్రీ వై. వి. కృష్ణారావుగారికి ప్రత్యేక కృతజ్ఞతాభి వంద నలు సమర్పించుకొంటున్నాను. సర్వోదయ ప్రెస్ యాజమాన్యం, ఉద్యోగులు యిచ్చిన సహకారానికి నా కృతజ్ఞాతాభివందనాలు.

కమ్యూనిస్ట్ ఉద్యమ వివిధ వర్ణ ఇంద్రచాపం మీ ముందున్నది. వీక్షించండి.

చిలువూరు, మే 1, 1999

డి. వి. సుబ్బారావు

## మార్గాన్ని గురించి లెనిన్

"సోషలిజానికి వెళ్ళేమార్గం, ఎలా ఉంటుందో, చివరి వివరాలతోసహా మార్క్సుగాని, మార్క్సిస్టులుగాని ముందుగానే చూడగలిగారని మనం యెప్పుడూ చెప్పము. మనకు తెలిసిందల్లా, యీ మార్గం ఎటువైపు పయనిస్తున్నది, ఏ వర్గ శక్తులు యీ త్రోవన నడుస్తున్నాయి అని మాత్రమే. ఆచరణాత్మకమూ, నిర్దిష్టమూ, అయిన వివరాలన్నీ లక్షలాది ప్రజానీకం అనుభవం ద్వారానే వెల్లడౌతాయి."రష్యన్ విప్లవం కాలంలో లెనిన్ మాటలు. (లెనిన్ కలెక్టెడ్ వర్క్స్, వా. 25, పే 281.)

# విషయసూచిక

## ఆదిపర్వం



## జాతీయ సంఘటనా పర్వం

## పోరాటపర్వం

# సభాపర్వం





* ముద్రణలో దొరలిన పొరపాటులకు మన్నించ ప్రార్థన.

# 1

## ఆది పర్వం

## సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటన

ప్రథమ ప్రపంచయుద్ధ కాలంలో గాంధీ నాయకత్వంలో కాంగ్రెసు, బ్రిటిష్ సామ్రాజ్యవాదులు యుద్ధానంతరం భారతదేశానికి అధినివేశ ప్రతిపత్తిని యిస్తారని ఆశించి, ఆగ్లేయులకు పూర్తి సహకారాన్ని యిచ్చింది. కాంగ్రెసు, గాంధీజీ ఆశించిన విధంగా సామ్రాజ్యవాదులు భారతదేశానికి స్వపరిపాలన యిచ్చుటకు సిద్ధంగాలేరు. యుద్ధకాలంలో భారత సైనికులకు విదేశాల అనుభవాలు, రష్యాలో సోషలిస్టు విప్లవ విజయం, హంగరీ జర్మనీలలో జరిగిన విప్లవ పోరాటాలు దేశంలో స్వాతంత్ర్య పోరాటాలకు నైతిక బలాన్ని కూర్చాయి. భారత ప్రజల పోరాటాలను, సంస్కరణల ఎరనుచూపి బ్రిటిష్ప్రభుత్వం పరిష్కరించ ప్రయత్నాలు సాగించింది.

జాతీయ కాంగ్రెసు అమృతసర్ మహాసభలో భవిష్యత్ కార్యక్రమాన్ని నిర్ణయించు ప్రయత్నం చేసింది. కాంగ్రెసులో ఒకవర్గం సంస్కరణలకు సహకరించాలని, మరోవర్గం బహిష్కరించాలని, మూడోవర్గం సంస్కరణలను, ప్రభుత్వ వ్యతిరేక పోరాటాన్ని వుదృతం చేయుటకు ఆయుధంగావుపయోగించాలని, మూడు ధోరణులు వ్యక్తమైనాయి యుద్ధంలో జర్మనీపక్షం వహించిన టర్కీపై, అనేక ఆంక్షలు విధించి ఆంగ్లేయులు ఖలీఫా అధికారాలను తొలగించివేశారు. ఈ చర్య ముస్లిం దేశాలలో సామ్రాజ్యవాద వ్యతిరేక భావాలను ప్రజ్వలింపజేసింది. గాంధీజీ టర్కీకి సానుభూతిగా, భారతదేశంలో బ్రిటిష్వారిపై పోరాటం జరిపే కాంగ్రెసుతో కలసి అహింస, సహాయ నిరాకరణ మార్గాలను చేబట్టమని సలహానిచ్చారు. భారతదేశంలో టర్కీలో బ్రిటిష్ వ్యతిరేక పోరాటానికి సానుభూతి, సహకారాలనందించ ఏర్పడిన ఖిలాఫత్ కమిటి గాంధీ సూచనలను ఆమోదించి, హిందూ - ముస్లింలు ఐక్యంగా సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని కొనసాగించుటకు ఐక్య ప్రాతిపదిక రూపొందించు పరిస్థితులను కల్పించింది. అదే సందర్భంలో జలియన్‌వాలాబాగ్ ఘోర దురంతాల విచారణ కమిటి నివేదికను ప్రకటించింది. దేశమంతటా నిరసన ప్రజ్వరిల్లి, సహాయ నిరాకరణోద్యమాన్ని చేబట్టాలని ప్రజా ఆందోళన యెక్కువైంది.

ఈ వాతావరణంలో ప్రత్యేక కాంగ్రెసు మహాసభ 1920 సెప్టెంబరులో జరిగింది. అమృతసర్ కాంగ్రెసు మహాసభలో సహాయ నిరాకరణోద్యమం చేబట్టాలనే ప్రతిపాదనను వ్యతిరేకించిన గాంధీజీ పోరాట పంథాను చేబట్టారు. "ఎడారిలో స్వరాజ్యం" అన్న వినాదాన్ని యిచ్చారు. డిశెంబరులో జరిగిన నాగపూర్ కాంగ్రెసు మహాసభ సహాయ నిరాకరణోద్యమ పోరాట పంథాను ఆమోదించింది. పోరాట కార్యక్రమము ద్విముఖమైనది. ఒకటి : మద్యపాననిషేధం, అస్పృశ్యతా నివారణ, విదేశవస్తువుల బహిష్కరణ, నూలు వడకుట, తిలక్ స్వరాజ్యనిధి సేకరణాది

-

నిర్మాణ కార్యక్రమము. రెండు శాసనసభల, కోర్టుల, ఆంగ్లభాషా విద్యాలయాల బహిష్కరణాది పోరాట కార్యక్రమముయివ్వబడింది. ప్రతిభారతీయుడు కార్యక్రమం లోని యేదో ఒక అంశాన్ని ఆచరణలో పెట్టగలిగినది. ప్రజలను రాజకీయాలవైపు ఆకర్షించి, కార్యకర్తలను సమీకరించే కార్యక్రమము.

ఉద్యమంలో కార్మిక, కర్షక, విద్యార్థి, మధ్యతరగతి, నిరుద్యోగులు పాల్గొన్నారు. రాయ్‌బెరిల్లీ ఫరిదాబాద్, మాయోంగిరిద్, దార్వార్, చీరాల, పేరాల, మలబార్ రైతుల సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. పన్నులు, కౌళ్ళు, బేదఖళ్ళు సమస్యలను జోడించి ఉద్యమానికి ప్రజాపునాది నేర్పరచారు. బొంబాయిలో ప్రిన్స్ ఆఫ్ వేల్సు రాకుమారుని రాకకు నిరసనప్రదర్శనలలో,చౌరీచౌరాలో ప్రజలు హింసాచర్యలు జరిపారని, గాంధీజీ వుద్యమాన్ని విరమించారు.

**కమ్యూనిస్టు బృందాలు :**

ప్రపంచయుద్ధ కాలంలో "శత్రువుకు శత్రువు మిత్రుడు" అనే సిద్ధాంతంతో జర్మన్, జపాన్, కెనడాల సహాయంతో ఆయుధాలు సేకరించి, భారతదేశాన్ని దాస్య విముక్తి గావించనెంచి విఫలులైన విప్లవవాదులు ఖిలాఫత్ ఉద్యమంలో రష్యాకువెళ్ళి ప్రభావితులైన విప్లవకారులు, బాంబుల వాదాన్ని విడనాడి రష్యా విప్లవంతో ప్రభావితులైన యువ విప్లవ కారులు సహాయ నిరాకరణోద్యమంలో "సంవత్సరంలో స్వాతంత్ర్యం వస్తుందని" ఆశించి ఉద్యమంలో పాల్గొని అసంతృప్తి చెందిన జాతీయ వాదులు, బొంబాయి, కలకత్తా, లాహోర్, కాన్పూర్, మద్రాసులలో సోషలిస్టు భావాలతో కమ్యూనిస్టు బృందాలుగ రాజకీయరంగంలో ప్రవేశించారు. గద్దర్‌పార్టీ, బాబరు అకాలీలు, అతివాదులు కొందరు కమ్యూనిస్టు బృందాలలోచేరారు.

బొంబాయిలో శ్రీపాద్ అమృత్‌డాంగే "సోషలిస్టు", బెంగాల్‌లో ముజఫర్ అహమ్మద్, నజ్రుల్ ఇస్లాంలు. "నవయుగ"పంజాబ్‌లో గులాంహుస్సేన్ "ఇన్క్విలాబ్", మద్రాసులో సింగారవేల్ చెట్టియార్ "లేబర్ కిసాన్ గెజిట్", తమిళంలో "కార్మికుడు" అనే పత్రికల ద్వారా సోషలిజం, కమ్యూనిజం, అతివాద రాజకీయాలు ప్రచారం చేశారు. రాయ్‌ద్వారా అందే అంతర్జాతీయ, కమ్యూనిస్టు విధానాలు, నిర్ణయాలు ప్రచారంచేస్తూ రాజకీయ నాయకత్వాన్నిచ్చేవి.

కమ్యూనిస్టు బృందాలు, సంస్కరణవాదులు, కాంగ్రెసులోని మితవాద అతివాదులు, విప్లవవాదులు అందరితో కలసి కార్మిక, కర్షక, విద్యార్థి, యువజనులను తక్షణం కోర్కెలపై సంఘటితపరచి పోరాటాలు జరుపసాగారు. ప్రభుత్వం నాలుగు పెషావరు కుట్రకేసులు బనాయించి, అరెస్టులతో కమ్యూనిస్టు భావాల వ్యాప్తిని అరికట్ట ప్రయత్నించింది. కమ్యూనిస్టు బృందాలను నిషేధించకపోయినా, బహిరంగంగా పనిచేసే అవకాశాలు లేకుండా చేసింది. బహిరంగ వేదికలుగా బొంబాయిలో లేబరు సోషలిస్టు పార్టీ అఫ్ ఇండియన్ కాంగ్రెసు, బెంగాల్‌లో లేబర్ స్వరాజ్ పార్టీ అఫ్ ఇండియన్ నేషనల్ కాంగ్రెస్, పంజాబ్‌లో కార్మిక, కర్షక పార్టీయైన కీర్తికిసాన్ పార్టీ, యు.పి.లో కార్మిక, కర్షక పార్టీలను నిర్మించారు.

బ్రిటీష్ దౌర్జన్య, నిర్బంధాలకు వ్యతిరేకంగా, స్వరాజ్యం కొరకు దేశభక్తి ప్రేరితులైన జాతీయవాదులు, మధ్యతరగతి ప్రజలు సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. కార్మిక, కర్షకులు అధికవేతనాల కొరకు. భూమిశిస్తు తగ్గింపుకు; విదేశీయ వస్తువుల బహిష్కరణ, స్వదేశీ వస్తువులు వుపయోగించాలనే ప్రజోద్యమంలో ప్రజానీకమంతా పాల్గొంది

## రాయ్-లెనిన్‌ల వలస విప్లవ సిద్ధాంత చర్చలు

అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ రెండవ కాంగ్రెసు 1920 జులై, ఆగస్టులలో మాస్కోలో "వలస దేశాలలో విప్లవాలపై" సిద్ధాంత చర్చలు జరిపింది. వలస దేశాలలో సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో బూర్జువా వర్గపాత్రలపై, రెండు భిన్న వైఖరులు వెల్లడైనాయి. అవే లెనిన్-రాయ్ దృక్పథాలుగా ప్రసిద్ధికెక్కాయి.

వలసదేశాలలో బూర్జువా వర్గాన్ని విప్లవాత్మక శక్తిగా గుర్తించి, వారి నాయకత్వంలో జాతీయ స్వాతంత్ర్యోద్యమాలలో కమ్యూనిస్టులు విధిగా పాల్గొని, వుద్యమాలను పెంపొందించి, బలాన్ని చేకూర్చాలని లెనిన్ సిద్ధాంతం తెలియజేస్తున్నది. "జాతీయోద్యమం యెట్టిదైనా, దేశవిముక్తికై విప్లవ పోరాటాలను సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా, వాస్తవంగా నడుపుచున్నచో పూర్తిగా పాల్గొని సహాయాన్ని అందించాలని, తమ స్వతంత్ర ప్రతిపత్తి కాపాడుకొంటూ, సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్య సంఘటనా నిర్మాణానికై తమ శక్తికొలది పాటుబడాలని లెనిన్ చెప్పారు"[1] అని అధికారి వివరించారు ఒక్కమాటలో బూర్జువా స్వాతంత్ర్య పోరాటంలో కమ్యూనిస్టులు సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనను పోరాటానికై యేర్పరచాలని లెనిన్ స్పష్టం చేశారు.

లెనిన్ తన వలస విప్లవ సిద్ధాంతపత్రాన్ని రాయ్ అభిప్రాయానికై పంపగా, రాయ్ తన అనంగీకారాన్ని తెల్పారు రాయ్ "ఇండియాలాంటి బాగా అభివృద్ధి చెందిన వలసలలో ఆర్థికంగా, సాంఘికంగా వర్గవిభజన స్పష్టంగాలేదని, భూస్వామ్య వ్యవస్థనుండి బూర్జువావర్గం పూర్తిగ వేరై భిన్నంగాలేదని, అంచేత జాతీయ ఉద్యమ ఆదర్శాలు అభివృద్ధి నిరోధకాలని, అనగా జాతీయోద్యమ విజయంలో బూర్జువా ప్రజాస్వామ్య విప్లవం సాధింపబడదని నేను సూచించాను.మా అభిప్రాయ భేదాలకు, భారత జాతీయోద్యమంలో గాంధీ నిర్వహించుచున్న పాత్ర కీలకమైనది. రాజకీయముగా గాంధీ విప్లవకారుడుగ కన్పించవచ్చు, కాని మతానికి, సంస్కృతికి సంబంధించిన భావాలలో గాంధీ సనాతనవాది. అందుచే, గాంధీ సాంఘికంగా ప్రగతి నిరోధకుడు కాకతప్పదు" అన్నారు. అంతేగాక "వలసదేశాల్లో బూర్జువావర్గం ప్రజాస్వామ్య విప్లవాన్ని సాధించలేదు. ఇండియావంటి బాగా అభివృద్ధి చెందిన వలస దేశాలలోగూడ జాతీయ ఉద్యమాన్ని బూర్జువావర్గం నడపజాలదని ఋజువుచేసాను

1. అధికారి, జి. (1964) జాతీయ పునర్జీవనానికి, సోషలిజానికి కమ్యూనిస్టు పార్టీ భారతీయ పంథా. (ఆంగ్లంలో) పేజి 59-60.

ఈ రాజ్యాలలోని బూర్జువావర్గం సామ్రాజ్యవాదంతో రాజీపడి, భూస్వామ్య సామాజిక పరిస్థితులలో మ్రగ్గుతున్న కార్మికులను దోచుకొన్న లాభాలలో వాటా పంచుకొంటారు." అని వివరించారు. అంతేగాక "భారత జాతీయోద్యమ నాయకత్వాన్ని కార్మికవర్గం హస్తగతం చేసుకోని పక్షంలో భారత జాతీయవాదం బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో రాజీపడి తీరుతుందని"[1] చరిత్ర భవిష్యత్తు రాయ్ చెప్పారు. లెనిన్, రాయ్‌ల చర్చల ఫలితంగా లెనిన్ కోరికపై రాయ్ సిద్ధాంతాన్ని, లెనిన్ సిద్ధాంతానికి ఉప సిద్ధాంతంగా కొమింటరను ఆమోదించింది. రాయ్ తన సిద్ధాంతానికి మెరుగులు దిద్దుకొంటూ, కొన్ని పొరపాటులువున్నా ఆచరణలో "భారతవాణి" అయ్యారని దత్తా గుప్తా అభిప్రాయము.[2]

**మూడవ అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెసు అవగాహన :**

సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనా కార్యక్రమాన్ని 3వ, అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసు జూన్1921లో రూపొందించింది. గయ భారతజాతీయ కాంగ్రెసు మహాసభకు ఆచరణ కార్యక్రమాన్ని సందేశంగా పంపింది. అంతేగాక, డిసెంబరు 1922లో రాయ్ భారత జాతీయ కాంగ్రెసు ఆచరణ కార్యక్రమాన్ని "మనం కోరేదేమిటి?" అనే కరపత్రంగా రూపొందించి, గయ జాతీయ కాంగ్రెసు మహాసభ ప్రతినిధులకు పంపకంచేసే యేర్పాటు గావించారు.

జాతీయోద్యమాలకు మద్దతునివ్వాలనే లెనిన్ అవగాహననే కొమింటరను కొనసాగించింది. జాతీయోద్యమాలు సామ్రాజ్యవాద వ్యతిరేక వుద్యమాలను సాగించిన మద్దతునిస్తూ, విప్లవ వర్గాలతో నేరుగా సంబంధాలను పెంపొందించుకొంటూ వుండాలి. జాతీయోద్యమాలు రాజీమార్గాన సాగిన, విప్లవశక్తులు విప్రుత సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనను నిర్మించుటకు ప్రతిబంధకాలు యేర్పడగలవు. అవి దాటరానివి కాగలవు[3]. మనులిస్కీ 5. వ అ.క.పా. సమావేశంలో ముగింపు వుపన్యాసమిస్తూ "వలస సమస్యపై రోజాలగ్జెంబర్గు శూన్యవాదాన్ని రాయ్ ప్రతిబింబించుచున్నాడనే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. ఇంకా "సాంఘిక వుద్యమాలు, జాతీయోద్యమాల మధ్య నిజానికి, న్యాయబద్ధమైన సమతూకపు అవగాహన వుండాలి. స్వయం నిర్ణయ హక్కు విప్లవ ప్రయోజనాలకు భిన్నమౌతుందా? రాయ్ ఈ విధ

---

1. రాయ్, యం. యన్ (1965) యం. యన్. రాయ్ స్వీయగాథలు, ప్రజా సాహిత్య పరిషత్తు. తెనాలి. పే. 354.
2. అదే. 354-5.
3. గుప్త, సోబన్‌లాల్‌దత్తా (1980) కొమింటరను ఇండియా సమస్య (ఆంగ్లంలో) 1920-27, మోనోగ్రాఫ్ నం. 3 సెంటర్ ఫర్ స్టడీస్ ఇన్ సోషల్ సైన్సెస్, కలకత్తా (ఆంగ్లంలో) పే. 54లోని ఉదాహరింపు.

మైన ప్రశ్న వేసుకొనగలిగితే మనం అతనితో చర్చలు సాగించగలం[1]" అని వ్యాఖ్యానించారు, జాతీయోద్యమం సాంఘిక సమస్యల యెడల అభివృద్ధి నిరోధక పాత్ర వహించుచున్నదనే రాయ్ అవగాహనతో కొమింటరను ఛేధించకపోయినా, సాంఘిక, రాజకీయ సమస్యలతో నిర్దయాత్మకపాత్ర విషయమై ప్రధాన భేదం కన్పించుచున్నది.

ఈ సిద్ధాంత చర్యల కాలంలో భారతదేశంలో కొన్ని నగరాలలో మాత్రమే కమ్యూనిస్టులు బృందాలుగా పనిచేస్తున్నారు. ఒక రాజకీయ కార్యక్రమము, సిద్ధాంత రీత్యా, నిర్మాణరీత్యా సంఘటిత పార్టీగా యేర్పడిలేదు. టాష్కెంటులో రాయ్ నాయకత్వంలో భారత కమ్యూనిస్టు పార్టీ పనిచేస్తున్నది. దేశంలోని కమ్యూనిస్టు బృందాలు యీ చర్యలలో తీసుకొన్న పాత్ర కానరాదు. ఆచరణలో యీ బృందాలకు, కొమింటరనుకు వలస సమితి సభ్యుడుగావున్న రాయ్ సంధానకర్తగా వున్నాడు. పార్టీ శైశవదశలోనే యీ సుదీర్ఘచర్చలు పార్టీ సంఘటిత పడుటకు, సిద్ధాంతరీత్యా ఎంతవరకు తోడ్పడినదో చెప్పజాలము. అయితే, "స్వాతంత్ర్యానికి పూర్వపు రాజకీయ విధానాల అనుభవాలు మననం చేసుకొనుట అవసరం. కారణం స్వాతంత్ర్యానంతర రాజకీయ ప్రక్రికరణలకు మూలం గతంలోనే వుంది"[2] అన్న అధికారి మాటలు ఆలోచనను కలిగించకమానవు.

## కార్మిక వర్గం రాజకీయ రంగ ప్రవేశం

భారత రాజకీయరంగంలోనికి గాంధీజీ ప్రవేశానికి పూర్వమే 1908లో, బ్రిటిష్ ప్రభుత్వం తిలక్‌ను అరెస్టు చేసినపుడు మనదేశ చరిత్రలో కార్మికవర్గం మొట్టమొదటి రాజకీయ సార్వజనిక సమ్మె చేసింది; ఆ సమ్మెను "భారతదేశంలో కార్మికవర్గం పరిణితి చెందినట్లు బహిరంగ ప్రకటన చేయుటయే" అని లెనిన్ వ్యాఖ్యానించారు. "ఒక పోరాటరూపం ఆవిర్భవించింది. బెంగాల్ విభజన సందర్భంగా ప్రజలు యీ పోరాట రూపాన్ని పెంపొందించారు. అదే హర్తాల్"[3] అని నంబూద్రిపాద్ అన్నారు. అంతేగాక "యుద్ధానంతర ప్రజావెల్లువ మరొక ప్రత్యేక లక్షణాన్ని, స్వాతంత్ర్య పోరాటంలో వొక వర్గంగా తన స్వంత పోరాట రూపాలతో, కార్మికవర్గం రాజకీయ పోరాటాలలో పాల్గొనుట ఆరంభించిందని" కూడ అన్నారు. బూర్జువా నాయకత్వానగల జాతీయోద్యమానికి బలాన్ని చేకూర్చింది. కారణం, అప్పటికి కార్మికవర్గం కాని, కమ్యూనిస్టు పార్టీగానీ వొక నిర్మాణ రూపాన్ని పొందలేదు.

---

1. నంబూద్రిపాద్, ఇ. యం. యస్. (1987) భారత స్వాతంత్ర్య పోరాట చరిత్ర (తెలుగు) మొ. భా. పే. 365.
2. అధికారి, జి (1964) జాతీయ పునర్జీవనానికి, సోషలిజానికి కమ్యూనిస్టు పార్టీ భారతీయపంథా (ఆంగ్లంలో) పే 58.
3. నంబూద్రిపాద్, ఇ. యం. యస్ (1981) భారత స్వాతంత్ర్య పోరాట చరిత్ర (తెలుగులో) మొ. భా. పే. 377.

పారిశ్రామిక కార్మికులు 1918-19లలో అనేక సమ్మెలు చేసారు. మద్రాసులో బకింగ్‌హామ్ కర్నాటక మిల్లు కార్మికులు మిల్లులో జాతి విచక్షణకు వ్యతిరేకంగా, అహమ్మదాబాద్‌లో బోనస్ కోతకు వ్యతిరేకంగా సమ్మెలు జరిగాయి. ఇదే కాలంలో వేతనాలలో 10 శాతం హెచ్చింపుకు బొంబాయి జౌళిమిల్లుల, బెంగాల్ జూటుమిల్లుల కార్మికులు సమ్మెలు జరిపారు. జాతీయ ఉద్యమంలో భాగంగా అహమ్మదాబాద్‌లో "గాంధేయ కార్మిక సంఘం" మద్రాసులో వాడియా, చక్రయ్య చెట్టియార్‌లు పై సంఘానికి భిన్నంగా కార్మికోద్యమానికి నమూనాగా మరో కార్మిక సంఘాన్ని నిర్మించారు.

యుద్ధకాలంలో రైతులు, కార్మికులు సైన్యంలో చేరి ఫ్రాంస్, మధ్య ఆసియా లలో బ్రిటిష్ తరపున పోరాడుట, విదేశీయులతో యేర్పడిన సంబంధాలు, రష్యన్ విప్లవ ప్రభావం, భారతజాతీయోద్యమం, అతివాద ఉద్యమాలపై పడింది. నాడు 1916-1920 లలో నాలుగు వెల్లువలుగా సమ్మెలు కొనసాగాయి. మొదటి వెల్లువ 1917 ఆగస్టులో ప్రారంభమై సెప్టెంబరు-అక్టోబరులలో 30 సమ్మెలు జరిగాయి. తపాలా కార్మికుల సమ్మెమాత్రం దీర్ఘకాలం సాగింది. మిగిలినవన్నీ వేతన కార్మికులు 10 శాతం వేతన పెంపుకై సమ్మెలుచేసి, పెంచుకొనగలిగారు. రెండవ వెల్లువ బట్టలమిల్లు కార్మికులు 1918 ఏప్రిల్ నుండి జులై వరకు జీవన వ్యయానికి తగినట్లుగా బోనసు పెంచమని, మూడవ వెల్లువ 1919 జనవరిలో 1.70లక్షల కార్మికులు మిల్లు వేతనాల పెంపుకు, జనవరి, ఫిబ్రవరి 7లలో రైల్వేవర్క్‌షాపులలో, టంకశాలలలో, రేవులలో, ఇంజనీరింగు వర్క్‌షాపులలో వేతనాల పెంపుదలకై సమ్మెలుచేసి, తమ కోర్కెలు సాధించారు. నాల్గవసమ్మెల వెల్లువ 1920 జనవరిలో నెలరోజులు 1.70 లక్షల కార్మికులు వేతన పెంపుదలకు, తక్కువ పనిగంటలకు, రాయితీలకై సమ్మెలు చేశారు. రైల్వేవర్క్‌షాపులు, నూనె మిల్లులు, ఇంజనీరింగు, రేవు, మునిసిపలు, ట్రాంలే, దర్జీ కార్మికులకు సమ్మెలు వ్యాపించింది.

**అఖిలభారత ట్రేడు యూనియన్ కాంగ్రెసు నిర్మాణం :**

కొన్ని సంవత్సరాలుగ జరుగుచున్న సమ్మెలు యే కేంద్రకార్మిక సంఘాలు లేకుండానే జరిగినవి. బొంబాయి రాష్ట్రప్రభుత్వ అంచెనాల ప్రకారం 1920 సెప్టెంబరులో 93 కార్మిక సంఘాలున్నవి. వీటిలో పెక్కింటికి జాతీయవాదులు కొన్నిటిని భారతదేశంలో పనిచేస్తున్న బ్రిటిష్ కార్మికులు నాయకత్వం వహించుచున్నారు పరిస్థితులు ఒక కేంద్ర కార్మికసంఘ మేర్పాటుకు పరిపక్వమైనవని తెలియజేస్తున్నవి. అన్ని రాష్ట్రాల కార్మిక సంఘాల ప్రతినిధులు 1920లో అఖిలభారత ట్రేడుయూనియన్ కాంగ్రెసుగ యేర్పడినవి. జాతీయకాంగ్రెసు, ఇంగ్లండు లేబరుపార్టీ ఈ సంస్థ నిర్మాణంలో ముఖ్యపాత్ర వహించాయి. అతివాద నాయకుడు లాలాలజపతి'రాయ్' అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు. సింగరవేలు చెట్టియార్ ఎఐటియుసిని కొమింటరనుకు అనుబంధ సంస్థగా చేయగోరుతూ తీర్మానం ప్రతిపాదించారు. కాని వీగిపోయింది. అయినా, మహాసభ విదేశాలలోని కార్మికసంఘాలతో సంబంధాలను పెంపొందించుకోవాలని పిలుపునిచ్చింది. ఝూరియా మహాసభ 1922లో దేశంలో ప్రబలిన కరువుకై ప్రత్యేక నిధి సేకరణకై కార్మికులకు విజ్ఞప్తి చేసింది.

బొంబాయి, బెంగాల్ రాష్ట్రాలు 1921, 1922లలో సమ్మెలు, ఆందోళనతో కల్లోలితంగా వున్నవి. ఈ కాలంలోని 674 సమ్మెలలో 540 యీ రాష్ట్రాలలోనే జరిగాయి. సమ్మెలలో 10.5 లక్షల కార్మికులు పాల్గొనగా 109 లక్షల పనిదినాలు పరిశ్రమలు నష్టపోయాయి. ఆర్థిక పరిస్థితులే యిందుకు కారణం. ధరలు పడిపోయాయి. ధరల సూచిక 1920లో 183 నుండి 1921లో 173కు, 1922లో 164కు పడిపోయింది; సమ్మెల పరంపర అన్ని పరిశ్రమలకు వ్యాపించింది. రాయల్ కమీషన్‌కు "1920-21, 22లలో సహాయనిరాకరణోద్యమంలో కార్మిక అశాంతి పేర్కొనంతగా వుంది. కార్మిక తగాదాలు ప్రధానంగా ఆర్థికపరమైనవి. ధరలు విపరీతంగా పెరిగిపోయి, వేతనాలు వెనుకబడినవి. మరోవైపున పరిశ్రమలు విలసిల్లాయి" అని ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం తెలియజేసింది.

ప్రపంచ యుద్ధంలోను, తదనంతర కాలంలోను భారతపారిశ్రామిక బూర్జువా వర్గం అదిక లాభాలు గడించి, నూతన పరిశ్రమలను స్థాపించుటతో కార్మికవర్గం సంఖ్యలోను, గుణాత్మకంగాను పెరిగి సంఘటితమగుతున్నది. ఆర్థికమాంద్యం 1923లో ప్రారంభమై 1929 నుండి తీవ్రమైంది. కార్మికులు తమ జీవన ప్రమాణం కాపాడుకొనుటకై 1927 వరకు, 1928 నుండి 1930 వరకు కాపాడుకొనుటతో పాటు వేతన పెరుగుదలకు వుధృతంగా పోరాడారు. దేశంలో పేదరికం పెరుగుటలో మార్కెట్లు కుదించుకుపోయి, పరిశ్రమలు అధికోత్పత్తి సంక్షోభాన్ని యెదుర్కొనవలసి వచ్చింది. పారిశ్రామికులు లాభాలను అదేవిధంగా పొందుటకు వేతనాలకోత, రేషనైలేజేషన్ ద్వారా పని ఉధృతిని పెంచదలచారు. ఇవే చాల సమ్మెలకు కారణాలయ్యాయి. సమ్మెల వెల్లువ 1923 నుండి 1927 వరకు 737 సమ్మెలలో 12లక్షల కార్మికులు పాల్గొనగా, 294 లక్షల పనిదినాలు నష్టపోవుట జరిగింది.

కార్మికులకు 1928-30 మరీ గడ్డుకాలమైంది, వేతనాలకోత, అదనపుపని, నిరుద్యోగం కార్మికులు యెదుర్కోవలసి వచ్చింది. ఈ కారణంగా 492 సమ్మెలలో 13 లక్షల, 34 వేలు పాల్గొనగా, 460 లక్షల పనిదినాలు పరిశ్రమలు నష్టపోయాయి. కొన్ని సమ్మెలు దీర్ఘ కాలం బొంబాయి, షోలాపూర్‌లలో రెండు సార్వత్రిక సమ్మెలు జరిగి, ప్రత్యేకతను సంతరించుకొన్నాయి. కమ్యూనిస్టులు కార్మిక రంగంలో ప్రవేశించారు. అనేక యూనియన్‌లకు నాయకత్వం వహించారు. మరెన్నో కొత్త సంఘాలు నిర్మించారు. కార్మిక సంఘాలలో సంస్కరణ వాదులు, విప్లవకారులు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు, జాతీయవాదులు కలిసి పనిజేసే కార్మికుల ఐక్య వేదికలుగా, సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్య సంఘటనలుగా ట్రేడుయూనియన్‌లు ప్రత్యేకతను సంతరించుకొన్నాయి.

## భారతదేశంలో కమ్యూనిస్టుపార్టీ స్థాపన :

ప్రథమ ప్రపంచ యుద్ధకాలంలో, తదనంతరం జరిగిన పారిశ్రామికీకరణతో కార్మికవర్గం గణనీయంగా పెరిగి, జీవన పరిస్థితులు క్షీణించగా, సంఘటితమై యే విధంగా పోరాడింది, ఆ పోరాటాలు జాతీయ సహాయనిరాకరణోద్యమాలతో సంధాన

పరచబడుట చూశాము. అఖిలభారత ట్రేడు యూనియన్ కాంగ్రెసు 1920లో ఏర్ప డింది సంఘటిత కార్మికోద్యమం బలపడింది. అనేక సమ్మె పోరాటాలు, రెండు సార్వత్రిక సమ్మెలు నగరాలలో జరిగాయి. వివిధ నగరాలలో కమ్యూనిస్టుబృందాలు యేర్పడి వివిధభాషలలో పత్రికలు నడుపుతు, కార్మికవర్గానికి రాజకీయ చైతన్యాన్ని కలగచేస్తున్నది. ఈనేపథ్యంలో కమ్యూనిస్టుపార్టీ యేర్పడుటకు, కేంద్ర నాయకత్వ ఆవిర్భావానికి భౌతిక పరిస్థితులు ఏర్పడినవి.

కాన్పూరులో సత్యభక్త, బహిరంగ కమ్యూనిస్టుపార్టీ అఫీసు, పతనమందిరం ప్రారంభించి, అఖిలభారత కమ్యూనిస్టు సమావేశముకై పిలుపునిచ్చారు. జాతీయ కాంగ్రెసు మహాసభ డిశెంబరు 1925లో జరిగింది. అదే పెండాలులో ఆ దినాలలోనే 300 మంది కమ్యూనిస్టు ప్రతినిధులు సమావేశమయ్యారు. సకలత్‌వాలా సందేశం, డిశెంబరు 25న ప్రతినిధుల సమావేశంలో చదువబడింది. ఆహ్వాన సంఘ అధ్యక్షుడు హస్రత్ మెహాని ప్రసంగం తరువాత సింగరవేలు అధ్యక్షోపన్యాసంలో "కమ్యూనిస్టులమైన మేము స్వరాజ్య పోరాటంలో అత్యంత ప్రధానపాత్ర వహించాము. స్వరాజ్యం బూర్జువాలకొరకు గాదు. శ్రామికులకొరకు, స్వరాజ్యంలేక జీవితమేలేదు. కార్మికులు లేకుండా స్వరాజ్యమేలేదు" అన్నారు. కాంగ్రెసు కమ్యూనిస్టుల మధ్య సహకారాన్ని గురించి "స్వరాజ్యం కొరకు యే పార్టీకైనా సంఘటిత కార్మికుల సహకారం అవసరం" అన్నారు. అణచబడిన వర్గాలు, అంటరానితనాన్ని పేర్కొంటూ "ఇది ప్రధానంగా భూ సమస్య, వారి ఆర్థిక బానిసత్వాన్ని తొలగించకుండా, అస్పృస్యతా నివారణగురించి మాట్లాడుటలో నిజాయితీలేదని" అని వాక్కాణించారు.

అధ్యక్షస్థానం నుండి సింగరవేలు 26వ తేదీన జరిగిన రెండవ సమావేశంలో కమ్యూనిస్టు ఖైదీల బాధలపై బ్రిటిష్ ప్రభుత్వాన్ని నిరసించుతు, సకలత్‌వాలా మహాసభకు రాకుండా ఆటంకపరచిన అమెరికా చర్యను ఖండించారు. నిరపరాధులైన 13 మంది కమ్యూనిస్టులపై తప్పుడు కేసులుపెట్టిన ప్రభుత్వచర్యను నిరశించారు. కమ్యూనిజానికై వారి అకుంఠిత త్యాగాన్ని హర్షించుతు, కమ్యూనిస్టుపార్టీ నిర్మాణ ప్రకటన, ప్రతినం తీర్మానాలను ప్రతిపాదించగా ఆమోదించబడినవి.

మూడవ సమావేశంలో కమ్యూనిస్టుపార్టీ నిర్మాణ సూత్రాలు, ధ్యేయం, ఆశయాలు, చర్చల అనంతరం తీర్మానములుగ 27వ తేదీన ఆమోదించారు. కేంద్ర కార్యవర్గంగా 16మంది సభ్యులు ఎన్నికయ్యారు. మరో 14 మందిని అవసరాన్నిబట్టి కో ఆప్ట్ చేసుకొనుటకు అధికారమివ్వబడింది; మరుసటి దినం కార్యవర్గం సమావేశమై అధ్యక్షునిగ సింగరవేలును, ఉపాధ్యక్షునిగా బగెర్ హటాని, జనరల్ కార్యదర్శిగా యస్.వి. ఘాటేని ఎన్నుకొన్నారు. పార్టీ అంత్యధ్యేయం కార్మిక, కర్షక రిపబ్లిక్‌గా ప్రకటించారు. కేంద్ర కార్యాలయం బొంబాయిలో యేర్పాటుచేయ నిర్ణయించారు.

**కార్మిక కర్షక పార్టీ స్థాపన :**

కాంగ్రెసులోని అతివాదులు లోన, బయటవున్న మితవాద అభివృద్ధినిరోధక శక్తులతో పోరాడుటకు, కాంగ్రెసు సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని శక్తివంతంగా, నిరవధికంగా కొనసాగించుటకు వొత్తిడి చేయుటకు, సోషలిస్టు ఉద్యమ ప్రాతిపదికగా, ప్రజా ప్రభుత్వం కొరకు పెట్టుబడిని, భూమిని సమిష్టి యాజమాన్యంలో, ఉత్పత్తి పంపకం మారకం సమాజపరంచేసి ప్రజాస్వామ్యం అదుపులో కొనసాగించుటకు ఒక నూతన రాజకీయ పార్టీని, కాంగ్రెసుకు అనుబంధ సంస్థగా నిర్మించనెంచారు. ఈ ఆలోచన రాయ్, డాంగేలు విడివిడిగా ఒకేకాలంలో చేశారు[1]. అదే కార్మిక, కర్షక పార్టీగ రూపొందింది.

సింగరవేలు మే1, 1923న హిందూస్థాన్ కార్మిక, కర్షక పార్టీ ప్రణాళికను ప్రకటించారు.[2] జాతీయ కాంగ్రెసు పై వర్గాల పార్టీయని, బడుగువర్గాలు తమ కోర్కెలకై పోరాడుటకు, కాంగ్రెసుకు అనుబంధ సంస్థగా తమ పార్టీని స్థాపించుకొనాలని, ఆ పార్టీ భారత స్వాతంత్ర్యానికి పోరాడుతుందని, కర్షకులంటే భూమిలేని వ్యవసాయ కూలీలు, పేదరైతాంగమని ప్రణాళిక నిర్వచించి స్పష్టంచేసింది.

కార్మిక సంఘాల నిర్మాణం. వారి సమ్మెహక్కును గుర్తించుట, కనీసవేతనం గృహవసతి, ప్రమాద, ఆరోగ్య, వృద్ధాప్యభీమా, ప్రోవిడెంటు ఫండు, శలవులు, 8 గంటలపని, ఉచితవైద్య సౌకర్యం, ప్రసూతి శలవులు, కూలీలను చేర్చుకొనుట ముఠామేస్త్రీల ద్వారా కాక వారి సంఘంద్వారా చేర్చుకొనుటకు, కార్మికుల తక్షణ కోర్కెలుగ ప్రణాళిక పేర్కొంది.

రైతులను భూములనుండి తొలగించకుండ రక్షణ రైత్వారీ ప్రాంతాలలో 25 శాతం భూమిశిస్తు తగ్గింపు, రైత్వారీ-జమీందారీలలో ఒకేరకపు భూమిశిస్తు పర్మనెంటు సెటిల్‌మెంటు రద్దు, ధన, వస్తు రూపేణా వసూలుచేసే నజరానాలు, వెట్టిచాకిరీ రద్దు జమీందారులకు దక్షిణలు రద్దుచేసి, ఉచిత నీటి పారుదల సౌకర్యాలను కలుగజేయాలని ప్రణాళిక కోరింది. నీటితోపాటు ప్రజాస్వామ్య పౌరహక్కులు, రాజ్యాంగ సంబంధమైన శాసనసభ, పరిపాలన వ్యవస్థర యేకీకరణ, రాష్ట్రాలకు స్వపరిపాలన వాటిమధ్య ఫెడరల్ సంబంధాలు, శాశ్వతసైన్య, పోలీసు వ్యవస్థలనుమార్చి, స్వచ్ఛంద వ్యవస్థలుగా చేసి, ప్రజలను సాయుధులను చేయాలని ప్రణాళికకోరింది.

బెంగాల్, బొంబాయి, పంజాబ్, యు.పి,లలో 1926-8లలో కార్మిక కర్షక పార్టీల నిర్మాణం జరిగింది, కాని, అఖిలభారత కార్మిక, కర్షక పార్టీల ప్రధమ సమావేశం కలకత్తాలో 1928 డిశెంబరులోనే సాధ్యమైంది. ద్వితీయ మహాసభలాహోర్ జాతీయ కాంగ్రెసు మహాసభ సందర్భంలో జరిగింది. కాంగ్రెసు 1920-30లలో

---

1. అధికారి, జి (1974) భారతకమ్యూనిస్టుపార్టీ చరిత్ర అధికార పత్రాలు. (ఆంగ్లంలో) వా. నం 2. పే. 97.
2. సింగరవేలు (1974) — అదే — పే. 114-124.

సహాయ నిరాకరణ, శాసనోల్లంఘన వుద్యమాలు రాజీ విధానాలు కారణంగా ఆశిం చిన ఫలితాలను పొందజాలకపోవుటతో అసంతృప్తులైన వారందరి వేదికగా కార్మిక, కర్షక పార్టీలు రూపొందాయి. కాంగ్రెసులో అతివాదులు, నెహ్రూ, బోస్, ఆచార్య నరేంద్రదేవ్‌ల అతివాద రాజకీయాలతో ఆకర్షితులైన వారందరు కలిసి పనిచేయు టకు కార్మిక కర్షక పార్టీలు వేదికలయ్యాయి. ఈ కాలంలో జరిగిన అనేక కార్మిక, కర్షక పోరాటాలలో యీ పార్టీ నాయకత్వం వహించుటతో ప్రభుత్వం ప్రమాదకర మని తలచి, మీరట్‌కుట్ర కేసు పేరుతో అభివృద్ధి చెందుతున్న రెండవతరము నాయకత్వాన్ని జైళ్ళలో నిర్బంధించింది.

కాంగ్రెసు సోషలిస్టుపార్టీ 1934లో యేర్పడి, కమ్యూనిస్టులుతో ఒక రాజ కీయ అవగాహన 1936లో యేర్పడునంతవరకు కార్మిక, కర్షక, సంఘటిత శక్తిని పెంపొందించుతు, ఐక్య పోరాటాలద్వారా జాతీయ ఐక్య సంఘటన నిర్మాణావకా శాలు పెంపొందించే అవకాశం యేర్పడలేదు, ఆచరణసాధ్యం కాలేదు. ఇదేకాలంలో ఆరవ అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసు 1928 చివరలో జరిగి వలసదేశా లలో పోరాటపు నిర్ణయాలు, అతివాద వక్రీకరణకు ఆచరణ లోపమైనందున జాతీయ సంఘటన మొలకలు ఆదిలోనే సమసిపోయాయి.

## సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానం కమ్యూనిస్టుల కృషి :

కమ్యూనిస్టులు కాంగ్రెసులో చురుకుగా పనిచేయప్రారంభించారు. బొంబాయి, బెంగాలు రాష్ట్ర కమిటీలలో ముఖ్యపాత్ర వహించే దశకు వచ్చారు. అఖిలభారత కాంగ్రెసు కమిటీ సభ్యులుగ ఎన్నికైన కమ్యూనిస్టులు 1927లోనె, సంపూర్ణ స్వా తంత్ర్యం కాంగ్రెసు ధ్యేయంగా ప్రకటించాలని తీర్మానం ప్రతిపాదించి కోరారు[1]. కార్మిక, కర్షక ప్రజాసామాన్య తక్షణ కోర్కెలను విప్లవ జాతీయోద్యమ పోరాటా లతో అనుసంధించి, రాబోయే జాతీయ పోరాటాలలో కార్మికులు, కర్షకులు ముఖ్య పాత్ర వహించుటకు పూర్వరంగ ప్రాతిపదిక ఏర్పాటు చేశారు.

అఖిలభారత కాంగ్రెసు 42వ మహాసభ డిశెంబరు 1927లో మద్రాసులో జరి గినపుడు విషయ నిర్ణయ సభలో కమ్యూనిస్టు ప్రతినిధి జోగ్లేకర్, సంపూర్ణ స్వాతం త్ర్యం కాంగ్రెసు ధ్యేయ్యంగా ప్రకటించాలని తీర్మానాన్ని ప్రతిపాదించగా, నెహ్రూ బలపరచారు. మహాసభలో నెహ్రూ ప్రతిపాదించగా జోగ్లేకర్ బలపరచారు. ఏకగ్రీ వంగా ఆమోదించబడింది. ఇది గాంధీజీకి నచ్చలేదు. అదే స్థలంలో తరువాత జరిగిన రిపబ్లికన్ కాంగ్రెసుకు నెహ్రూ అధ్యక్షత వహించారు. "కాంగ్రెసులోని వామ పక్షీయులు ఒక సంఘటనగా యేర్పడి పనిచేయుట దాని వుద్దేశ్యం, ఆ సమావేశం నెహ్రూ అధ్యక్షుడుగా ఒక కార్యనిర్వాహక వర్గాన్ని ఎన్నుకొన్నది. అందులో ముజఫర్ అహమ్మద్ ఒక కార్యదర్శి[2]. మద్రాస్ కాంగ్రెసు మహాసభ సైమన్ కమీ

1. సర్దేశాయి, యస్.జి. (1967) ఇండియా రష్యన్ విప్లవం (ఆంగ్లంలో) పే
2. సత్యనారాయణ కె. (1983 ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిస్టు ఉద్యమచరిత్ర) పే 3.

షన్‌ను బహిష్కరించాలని తీర్మానించింది. కాంగ్రెసు సైమన్ కమీషన్‌కు వ్యతిరేకంగా జరిపిన నిరసనోద్యమంలో కార్మికవర్గం, రాజకీయ సమ్మెలు, ప్రదర్శనలు పెద్దయెత్తున జరిపి తన అగ్రగామిదళపాత్రను నిరూపించుకొంది. ఇదిచూచి కాంగ్రెసులోని మితవాదులు సామ్రాజ్యవాదంతో రాజీపడుటకు మద్రాసు స్వాతంత్ర్య తీర్మానాన్ని తిరుగతోడి, అధినివేశ ప్రతిపత్తి చాలునన్న మోతీలాల్‌నెహ్రూ నివేదికను ఆమోదించి; దానిని కలకత్తా కాంగ్రెసులో ఆమోదింపజేయుటకు గాంధీజీని తీసుకొచ్చారు. వామపక్షం సవరణ ప్రతిపాదించగా వీగిపోయింది. సంపూర్ణ స్వాతంత్ర్యం ప్రతిపాదనను బలపరుస్తూ 50వేల మంది కార్మికులు రెండు గంటలు, మహాసభను గెరావ్‌చేశారు. ఫలితంగా ఒక సంవత్సరంలో అధినివేశ ప్రతిపత్తిని యివ్వకపోతే సంపూర్ణ స్వాతంత్ర్యం కొరకు 1929 చివరలో వుద్యమాన్ని ప్రారంభించగలమని కలకత్తా కాంగ్రెసు బ్రిటిష్ ప్రభుత్వానికి హెచ్చరికచేసింది. ఈ నేపథ్యంలోనే మార్చి 1929లో మెరుపుదాడి కావించి 33 మంది కమ్యూనిస్టులను అరెస్టుచేసి, మీరట్ కుట్రకేసు బనాయించింది.

అరెస్టులు, కుట్రకేసుల ద్వారా సామ్రాజ్యవాదులు, కమ్యూనిస్టులు, కాంగ్రెస్ నాయకులమధ్య ఒక అడ్డుగోడను కట్టగలమనుకొన్నారు. అందుకు భిన్నంగా జాతీయ అంతర్జాతీయ సుహృద్భావం, సంఘీభావం వ్యక్తమై దేశంలోని కార్మికసంఘాలు, కాంగ్రెసు కలసి ఐక్యంగా "మీరట్ రక్షణసమితిని" జవహర్‌లాల్ అధ్యక్షతన ఏర్పాటు చేశారు. మోతీలాల్ మీరట్ ఖైదీల తరపున కోర్టుకు హాజరయ్యారు. కేంద్ర రాజ్యాంగ సభలో వారి ధైర్యసాహసాలను మెచ్చుకొంటూ అరెస్టులను ఖండించి, నిరశించారు. దేశీయశాఖ బ్రిటిష్‌మంత్రిని ముళ్ళతీగలు, కంచెలు, కృత్రిమ అడ్డుగోడలు, భారతదేశంలోనికి నూతన ఆలోచనా విధానాలు రాకుండా ఆపగలరాయని ప్రశ్నించారు. అట్టి ప్రయత్నాలుచేయు రోజులు గతించాయని అన్నారు. అందుకు వ్యతిరేకంగా జాతీయ సృహృద్భావ సంఘీభావాలు దేశమంతటా ప్రస్ఫుటమయ్యాయి.

మహాత్మాగాంధీ 1929 చివరలో సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానాన్ని ఆమోదించిన చారిత్రాత్మక లాహోర్ కాంగ్రెసు మహాసభకువెళ్ళుతూ మీరట్ జైలులో విచారణలోవున్న కమ్యూనిస్టు నాయకులను కలుసుకొని జాతీయ సహాయ నిరాకరణోద్యమం, స్వాతంత్ర్య పోరాటమునకు మద్దతుకోరుతూ పాల్గొనుటను ఆహ్వానించారు.

## ii

## వామపక్ష కాంగ్రెసు - కమ్యూనిస్టుల సంఘటన

కాంగ్రెసులోని వామ పక్షీయులు ఒక సంఘటనగా పనిచేయు ఉద్దేశ్యంతో నెహ్రూ అధ్యక్షతన "రిపబ్లిక్ కాంగ్రెసు", "మీరట్ రక్షణ కమిటీల ఏర్పాటులు, కాంగ్రెసు, కమ్యూనిస్టులు, అతివాద వామపక్షీయులు, అతివాద జాతీయవాదులు అందరుకలసి ఐక్యకార్యాచరణ మార్గంలో పనిచేయుటకు ప్రాతిపదిక యేర్పడింది. మద్రాసు కాంగ్రెసు మహాసభ సైమన్ కమీషన్‌ను వ్యతిరేకించుతు, బహిష్కర

ణోద్యమాన్ని సాగించుటకు నిర్ణయించింది. ఇది కాంగ్రెసు, కమ్యూనిస్టు, సోషలిస్టు అతివాద జాతీయ శక్తులన్నీ ఐక్య కార్యాచరణలో ప్రజలను సంఘటిత పరచుటకు, మహోద్యమాన్ని నిర్మించుటకు ప్రాతిపదిక నేర్పరచింది. మరోవైపున బూర్జువా మితవాద, సంస్కరణవాద పార్టీలన్నీ కాంగ్రెసు నాయకుడు మోతీలాల్‌నెహ్రూ నాయకత్వాన "అఖిలపక్ష కమిటీగ నేర్పడి, స్వయంగ రాజ్యాంగ సంస్కరణలు రూపొందించుట ప్రారంభించారు. "అదే సమయంలో కాంగ్రెసు నాయకత్వం అంత ర్జాతీయ సామ్రాజ్యవాద వ్యతిరేక సంస్థతో సంబంధాలను లాంఛనప్రాయంగా సభ్య త్వాన్ని స్వీకరించింది. చైనాలోని విప్లవ శక్తులపై సామ్రాజ్యవాదుల దాడిని ఖండిం చింది. కార్మిక, కర్షక సంఘాలకు జాతీయస్థాయిలో ప్రోత్సాహాన్నిచ్చింది. సామ్రా జ్యవాద వ్యతిరేకంగా పోరాడే శక్తులన్నిటితో అవి కాంగ్రెసులోనున్నా వెలుపల వున్నా వాటికి చురుకుగా మద్దతునిస్తేతప్ప సామ్రాజ్యవాదపు సవాలును ఎదుర్కొ నుట అసాధ్యమనే వాస్తవాన్ని వారుగుర్తించారు[1]. ఈ విధంగా ఒకవైపు మోతీలాల్ నెహ్రూ నాయకత్వంలో మితవాద, సంస్కరణవాదులు మరోవైపు జవహర్‌లాల్ నెహ్రూ నాయకత్వంలో అతివాద పోరాటవాదులు మూడోవైపు గాంధీజీ నాయక త్వంలో మధ్యేమార్గ, ఒత్తిడి-పోరాట-రాజీవాదులు ఎట్టి పరిస్థితులలోను, ఎట్టి పోరాట రూపాలలోను తమ వర్గ ప్రయోజనాల దృశ్య ప్రధానంగా కాపాడుకొనగలి గిన సామర్థ్యాన్ని కలిగివున్నారు.

భూమిశిస్తు హెచ్చుచేయుటకు వ్యతిరేకంగా, సైమన్ కమీషన్ వ్యతిరేకో ద్యమ భాగంగానే 1928 మొదటి పాదంలో గాంధీ నాయకత్వంలో బార్డోలి సత్యా గ్రహం ప్రారంభించబడింది. ఇది ప్రధానంగా భేదఖళ్ళకు, అధికవడ్డీరేట్లకు, అధిక కౌళ్ళకు వ్యతిరేకంగా, అప్పులరద్దుకు రైతులుజరిపిన పోరాటం. పోరాటం ప్యూడలు ధనిక భూస్వామ్య వ్యతిరేకపోరాటంగా పరిణమించింది. వీరి వ్యతిరేకత కారణంగా బ్రిటిష్ వ్యతిరేక పోరాట పదునును కోల్పోరాదనే లక్ష్యంతో రూపొందించిన వ్యూహం యిది. ఉద్యమంలో అహింసా, ఆచరణ ప్రాధాన్యతను నొక్కిచెప్పుట లోని అంతర్యం యిదేనని, అందుకు విధించిన షరతులు తదనంతర ఘటనలు దీనినే తెలియజేస్తున్నవి. గాంధీజీ 1920-21లలో పన్నుల నిరాకరణోద్యమాన్ని సత్యా గ్రహాన్ని ప్రారంభించి, బొంబాయి, చౌరీచౌరాలలో వుద్యమం హింసామార్గంలో పడిందని ఉపసంహరించుట, పరిమితులు విధించుటలోని వ్యూహలక్ష్యమిది, కమ్యూ నిస్టులు, సోషలిస్టులు, వామపక్ష కాంగ్రెసు వాదుల నాయకత్వంలో కార్మిక, కర్షక పార్టీల నిర్మాణం, రైతులలో వచ్చిన పోరాటోత్సాహం, జాగృతి కాంగ్రెసును కల వరపరచింది. రైతుల అభిమానాన్ని తిరిగి పొందుటకు, బార్డోలీలోనే భూమిశిస్తు హెచ్చించుటను వ్యతిరేకించుతు ఉద్యమాన్ని గాంధీజీ ప్రారంభించారు. ఈ పోరా

1. నంబూద్రిపాద్, ఇ.యం.యస్. (1987) భారత స్వాతంత్ర్య పోరాట చరిత్ర (తెలుగులో) మొ. భా. పే. 365.

టంతో గాంధీజీ నాయకత్వం పట్ల 1920లో కోల్పోయిన విశ్వాసాన్ని రైతులలో తిరిగి పెంపొందించింది[1].

**ఎ.ఐ.టి.యు.సి.లో ప్రథమ చీలిక :**

భారత కార్మికోద్యమము, అతివాద రాజకీయాలు, రాజకీయ స్వాతంత్ర్యోద్యమంతో అనుసంధించబడినవి. సామ్రాజ్యవాద యేజంటు అయిన ఆంస్టర్‌డాం ఇంటర్నేషనల్‌కు భారత కార్మికోద్యమాన్ని అనుబంధసంస్థగా బ్రిటిష్‌ప్రభుత్వం గతంలో చేయ ప్రయత్నించి విఫలమైంది. అట్టి ప్రయత్నాలనే తిరిగి 1928-29లలో నూతన ఎత్తుగడలతో చేసింది.

ట్రేడు యూనియన్ కాంగ్రెసులో అతివాద కాంగ్రెసు వాదులు, కమ్యూనిస్టులు, సోషలిస్టులు ఆధిక్యతలోవున్నా సంస్కరణవాదులు, మితవాదులు గణనీయమైన బలాన్ని కలిగియున్నారు. సోషలిస్టులు కార్మికుల తక్షణ కోర్కెల, లక్ష్యాలను చేబట్టుటతో అఖిలభారత ట్రేడుయూనియన్ కాంగ్రెసు ఆచరణలో జాతీయకాంగ్రెసు కంటె మెరుగుగావుంది. ట్రేడుయూనియన్ కాంగ్రెసు 1929 లోనే సోషలిజం లక్ష్యంగా ప్రకటించింది. కాంగ్రెసు మూడు దశాబ్దాల తరువాతగాని అట్టి ప్రకటనను లాంచనప్రాయంగా స్వాతంత్ర్యానంతరం అధికారంలో స్థిరపడిన తరువాత ప్రజల అభిమానాన్ని కోల్పోవుటనే భయంతో చేసింది. సామ్రాజ్యవాద వ్యతిరేకతలో మాత్రం ట్రేడు యూనియన్ కాంగ్రెసు, జాతీయ కాంగ్రెసుకు వెనుకబడివుంది. ప్రపంచ సామ్రాజ్యవాద వ్యతిరేక సమితిలో జాతీయ కాంగ్రెసు అనుబంధ సంస్థగా చేరింది. జవహర్‌లాల్‌నెహ్రూ ఆ సంస్థ ఉపాధ్యక్షులలో ఒకరుగా వున్నారు. అదే పనిని ట్రేడు యూనియన్ కాంగ్రెసు మితవాదుల వ్యతిరేకత కారణంగా చేరజాలక పోయింది

సైమన్ కమీషన్ బహిష్కరణోద్యమంలో కాంగ్రెసులోగల అతివాదులు, మితవాదులు ఏకమయ్యారు. కాని విట్లీ కమీషన్ వ్యతిరేకోద్యమంలో అఖిలభారత ట్రేడు యూనియన్ కాంగ్రెసులోని మితవాద, అతివాదులమధ్య అట్టి ఐక్యతలేదు. పైగా యీ సమస్యపైనే భారతట్రేడు యూనియన్ ఉద్యమంలో మొట్టమొదటి చీలిక యేర్పడింది. కార్మికోద్యమ అభివృద్ధిలో తిలక్, లాలాలజపతిరాయ్, చిత్తరంజన్ దాస్‌లవంటి కాంగ్రెసు అగ్రనాయకులు ప్రముఖపాత్ర వహించినప్పటికి గోపాలకృష్ణ గోఖలే తదితర మితవాద నాయకుల ప్రభావానికి లోనైన నాటి నాయకులు కొందరున్నారు అతివాదులపై ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ ప్రభావంవలెనె, మితవాద నాయకులపై ఆంస్టర్‌డాం ఇంటర్నేషనల్ ప్రభావం వుంది.

విట్లీ లేబరుకమిషన్‌యెడల అవలంభించ వలసిన వైఖరి విషయంలో ట్రేడు యూనియన్ కాంగ్రెసులోని జాతీయవాదులు, కమ్యూనిస్టులు తదితర అతివాదులు

1. నంబూద్రిపాద్, ఇ.యం.యస్. (1987) భారతస్వాతంత్ర్యపోరాట చరిత్ర (తెలుగులో) మొ.ఖా.పే. 366-7.

ఐక్య కార్యాచరణలో ఆంష్టర్ డాం ఇంటర్నేషనల్‌చే ప్రభావితులైన మితవాదులతో సంఘర్షించారు. బ్రిటిష్‌వారు సైమన్ కమిషన్ వ్యతిరేకోద్యమ అనుభవాలతో, ఎం. ఎన్. జోషి, దివాన్ చమన్‌లాల్‌లను భారతీయ ప్రతినిధులుగ విట్లీ కమిషన్‌లో నియమించారు. ట్రేడుయూనియన్ కాంగ్రెసుతోగాని, దానిలోని వివిధ రాజకీయ గ్రూపులతోగాని సంప్రదించకుండానే ఈ యిద్దరు నాయకులు ఏకపక్షంగా కమీషన్ సభ్యత్వాన్ని ఆమోదించారు. ట్రేడుయూనియన్ కాంగ్రెసు 1929 నాగపూర్ మహాసభ ప్రతినిధులలో వారి చర్య చర్చనీయాంశమై అసమ్మతిని రేకెత్తించింది. మహాసభ విట్లీ కమిషన్‌ను బహిష్కరించాలని నిర్ణయించింది. అంతేగాక మీరట్ కమ్యూనిస్టు కుట్రకేసులోని ముద్దాయిలను విడుదల చేయాలని, ప్రపంచ సామ్రాజ్యవాద వ్యతిరేక సమితికి అఖిలభారత ట్రేడు యూనియన్ కాంగ్రెసును అనుబంధ సంస్థగా చేయాలని కోరుతూ, రెండు తీర్మానాలను మహాసభ ఆమోదించింది.

మితవాదనాయకులు మెజారిటీ ఆమోదించిన తీర్మానంపట్ల నిరసన తెలుపుతూ, మహాసభనుండి వెళ్ళిపోయి పోటీ ట్రేడుయూనియన్ సంస్థను యేర్పాటుచేశారు. నాగపూర్ మహాసభ జవహర్‌లాల్ అధ్యక్షతన జరిగింది. ప్రతినిధులలో కమ్యూనిస్టులకు బలమున్నా మెజారిటీలేదు. జాతీయకాంగ్రెసు నాయకులు, అతివాదులు, కమ్యూనిస్టులు కలసి మెజారిటీ అయ్యారు. విట్లీ కమిషన్ బహిష్కరణ తీర్మానం చేయబడింది. జాతీయ ఐక్య సంఘటన విజయమది. తదుపరి "టియుసి" అధ్యక్షుడుగా సుభాస్ చంద్రబోస్ ఎన్నిక అయ్యారు. పరిషత్తులో ఐక్య సంఘటన అభ్యర్థిగా, జాతీయ కాంగ్రెసు అధ్యక్షుడుగా ఎన్నిక అగుటకు యిది నాంది అయింది.

## సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానం :

లాహోర్ జాతీయ కాంగ్రెసు మహాసభ 31 డిశెంబరు 1929న సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానాన్ని ఆమోదించింది; అనంతరం కాంగ్రెసు కార్యవర్గం సమావేశమై జనవరి 26, 1930న సంపూర్ణ స్వాతంత్ర్యదీక్షా దినంగా ప్రకటించి, ప్రజలను ప్రతి సంవత్సరం జండానెగురవేసి, స్వాతంత్ర్య ప్రతినను బూనమని కోరింది. మహాసభలో మితవాదులు, అతివాదులు కాంగ్రెసు అనుసరించవలసిన విధానాలపై సంఘర్షించారు. కాంగ్రెసు కార్యవర్గనిర్మాణంతో అంగీకరించని సుభాస్ చంద్రబోసు అతివాదులు కాంగ్రెస్ డెమోక్రటిక్‌పార్టీనిస్థాపించారు. కాంగ్రెసు ఉప్పుసత్యాగ్రహం, శాసనోల్లంఘనోద్యమాలను ప్రారంభించి మరో చీలిక రాకుండా కాపాడకలిగింది. కాంగ్రెసు అధ్యక్షుడుగా నెహ్రూ, తాను సోషలిస్టునని, రాచరికానికి, ప్యూడలిజానికి వ్యతిరేకినని ప్రకటించారు. కాంగ్రెసు సంస్థానాలలో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని, పౌరహక్కులు కోరుతు తీర్మానించింది.

కమ్యూనిస్టు గ్రూపులు, పార్టీ యేర్పడిన నాటినుండి సంపూర్ణ స్వాతంత్ర్యం లక్ష్యంగా కాంగ్రెసు ప్రకటించాలని, ప్రతి కాంగ్రెసు మహాసభలో కోరుతూ విజ్ఞప్తులు చేస్తూవచ్చారు. గాంధీజీ కోరిన విధంగానే శాసనోల్లంఘనపోరాటంలోకమ్యూనిస్టులు, అతివాదులు తమ కార్మిక, కర్షక సంఘటిత శక్తితో పాల్గొనే జాతీయ సంఘటనకు

జాతీయ ప్రాతిపదిక యేర్పడింది. సహాయ నిరాకరణోద్యమంలో 50 శాతం భూమి శిస్తు తగ్గించుట, ఉప్పుపై పన్ను రద్దుచేయుట మొదలగు ప్రజాసమస్యలను చేర్చుటతో వచ్చే ప్రజావుద్యమ వెల్లువను అణచుట సాధ్యంకాదని పాలకులు గుర్తించి, అగ్రగామిదళంగావున్న కమ్యూనిస్టుపార్టీపై దాడిచేసి, నాయకులను అరెస్టు చేసారు. దేశమంతా జనవరి 26, 1931న, ప్రభుత్వం తీవ్ర నిర్బంధ విధానాన్ని చేబట్టినా, లాఠీఛార్జీల నెదిరించి జండా ప్రతిష్ఠాపన చేసి, ప్రతిన బూనారు అనేక ప్రాంతాలలో కాల్పులు జరిపినా ప్రజల నణచజాల పోయారు. ఇది గ్రహించిన లార్డ్ ఇర్విన్ సామరస్య పూర్వకంగా, రౌండు టేబులు సమావేశమును ప్రకటించారు.

జాతీయవాంఛను గాంధీజీ 11 అంశాలకు కుదించి, సంపూర్ణ స్వాతంత్ర్యం కాదుగదా కనీసం అభినివేశ ప్రతిపత్తిని కూడ ప్రతిబింబించని ప్రకటన చేసారు. నెహ్రూ, అతివాదులలో ఆందోళన సందేహాలను కలుగజేసింది. ఈ 11 అంశాలలో ప్రధానంగా పారిశ్రామిక, వాణిజ్యవర్గాల కోర్కెలేవున్నవి. భూమిశిస్తు, ఉప్పుపన్ను పేదప్రజానీకపు తక్షణ కోరికలు అందులో పేర్కొనబడలేదు.

## ఉప్పుసత్యాగ్రహం, శాసనోల్లంఘనోద్యమము :

జాతీయ కాంగ్రెసు కార్యవర్గం 1930 ఫిబ్రవరిలో పోరాటానికి పిలుపునిచ్చి, గాంధీజీని నాయకత్వం వహించమని కోరి, అహింసా విధానాన్ని, గాంధీని అనుసరించమని ప్రజలకు విజ్ఞప్తి చేసింది. బ్రిటిష్ ప్రభుత్వం సంప్రదింపులకు ఎప్పుడు ఆహ్వానించినా సంసిద్ధమేనని తెలిపింది. దండీ ఉప్పు సత్యాగ్రహ శాసనోల్లంఘనోద్యమానికి పరిమితులతోకూడిన వివరమైన కార్యక్రమాన్ని నిర్ణయించింది. ఏప్రిల్ 5వ తేదీని, జలియన్‌వాల్‌బాగ్ మానవ హత్యాకాండ, 11వ వార్షికోత్సవ రోజుకు ఒక రోజు ముందున, 4వ తేదీన ఉప్పుసత్యాగ్రహపు రోజుగ గాంధీజీ నిర్ణయించుటలో వ్యూహరచనా నైపుణ్యం విదితమౌతుంది. ఒకరోజు ముందే అహింసా పోరాట సైన్యాన్ని సమీకరించి, మొహరించుటతో బ్రిటిష్ ప్రభుత్వం సంప్రదింపులకు వస్తుందనే అంచెనా యిమిడివుంది. దండీ ఉప్పు సత్యాగ్రహయాత్రకు 10 రోజులు ముందే గాంధీజీ వైస్రాయికి లేఖ వ్రాసారు. వైస్రాయి నుండి వ్యతిరేకమైన సమాధానమొచ్చింది. గాంధీజీని, ఆయనతోపాటు దండీయాత్రలో పాల్గొనేవారిని తప్ప మిగతా వారిని ప్రభుత్వం ముందే అరెస్టుచేసి, శిక్షలు విధించింది. గాంధీజీ 5వ తేదీకి దండి చేరి 6వ తేదీన ఉప్పు చట్టాన్ని ఉల్లంఘించారు. ప్రభుత్వం దమనకాండలో భాగంగా గాంధీజీని అరెస్టు చేసింది. ప్రజలు వువ్వెత్తుగా విజృంభించి గ్రామాలలో, నగరాలలో ప్రదర్శనలు జరుపుతూ, ఉప్పు చట్టాన్ని ఉల్లంఘించ ప్రారంభించారు. ప్రభుత్వం భాష్ప వాయువులు, లాఠీఛార్జీలు, తుపాకి కాల్పులు, అరెస్టులు విచ్చలవిడిగా కొనసాగించి, హింసా, దమన, దౌర్జన్యకాండలతో వుద్యమాన్ని అణచివేయ ప్రయత్నించింది.

గాంధీజీ ఉప్పుశాసనోల్లంఘన సత్యాగ్రహానికి ముందే విప్లవకారులు చిటగాంగ్ అయుధాగారంపై దాడిజరిపి, ఆయుధాలు స్వాధీనం చేసుకొని, పట్టణంలో

వందేమాతరం గీతంపాడుతూ, పోలీసుస్టేషను లన్నిటిని స్వాధీనం చేసుకొని, మిలిటరీని నిరోధించుటకు బారికేడ్లును నిర్మించారు, సైన్యాన్ని చేరవేసే రైలుని పట్టాలు తప్పించారు.

ఘర్వాలీ సైనిక బెటాలియన్ సత్యాగ్రహులైన ప్రజలపై కాల్పులు చేయుట పిరికితనమని, అది సంప్రదాయానికి విరుద్ధాన్ని నిరాకరించి తిరుగుబాటు చేసింది. గాంధీజీ సూచనలపై లొంగిపోయి, వారి నాయకుడు శిక్ష ననుభవించి, విడుదలై కమ్యూనిస్టు పార్టీలో చేరారు. అదే విధంగా చిటగాంగ్ వీరులు పెక్కురు చేరారు.

సరిహద్దు రాష్ట్రాలలో ఖాన్ సోదరులు ప్రారంభించిన శాసనోల్లంఘనోద్యమం సామ్రాజ్యవాద వ్యతిరేక సాయుధపోరాటం సాంప్రదాయంగాగల తెగలవారు, ఉద్యమంలో ప్రవేశించుటతో అహింసా పోరాటంగా వుండజాలకపోయింది. పెషావర్ లో పోలీసులతో ఘర్షణలతో ముగిసింది.

తిలక్ కాలం నుండి తీవ్రవాద రాజకీయాలకు గురైన షోలాపూర్ నగరంలో సత్యాగ్రహం, అహింసా పరిమితులను దాటింది సత్యాగ్రహంలో పాల్గొన్న ప్రజలు-పోలీసు ఘర్షణలలో పోలీసులు, ప్రజలు చనిపోయారు. ఉద్రేకులైన ప్రజలు కార్మిక వలంటీర్ల నాయకత్వంలో ఆరు పోలీసుస్టేషన్ లపై దాడిచేసి రికార్డు రూములను, బ్రిటిష్ ఆఫీసులను తగులబెట్టారు. బ్రిటిష్ ఆఫీసరులు, వారి విధేయులు పారిపోయారు ఘర్వాలీ అనుభవంతో షోలాపూర్ ప్రజలను అణచుటకు బ్రిటిష్ తెల్లసైనికులను వినియోగించారు.

గాంధీజీ ఉప్పు సత్యాగ్రహ శాసనోల్లంఘనోద్యం హింసా పోరాటమైందనే పేరుతో శాసనోల్లంఘనోద్యమాన్ని ఆపకపోవుట గమనార్హం. గాంధీజీ అరెస్టు అనంతరం కాంగ్రెసు కార్యవర్గం, క్రింది కమిటీలకు అన్ని పోరాట రూపాలలోను, పన్నుల నిరాకరణతోసహా చేపట్టమని కోరింది. "ఇది వాస్తవంగా తరువాత కాలంలో జరుగనున్న స్వాతంత్ర్య పోరాటానికి మార్గదర్శికమైందని" నంబూద్రిపాద్ వాఖ్యానించారు. పోలీసులు, సైనికులు, చట్టవిరుద్ధమైన ఆదేశాలను పాటించనవసరంలేదని, ఘర్వాలీ సైనికుల ఆదర్శంతో నడవమని మోతీలాల్ నెహ్రూ విజ్ఞప్తిచేయుట దేశములో అతివాద ప్రభావవ్యాప్తిని పరోక్షంగా తెలియజేస్తుంది.

సంఘటిత కార్మికవర్గం, కర్షకులు, యువజనులు, విద్యార్థులు, వ్యాపారులు సామ్రాజ్యవాద వ్యతిరేకపోరాటంలో తీవ్రంగా పోరాడారు. పల్లె ప్రాంతాలలో రైతుల, కార్మికుల పోరాటాలకు షోలాపూర్ మార్గదర్శికమైంది.

"సంక్షిప్తంగా, గాంధీజీ వుద్దేశ్యమేమైనప్పటికి ఉప్పు సత్యాగ్రహం ప్రజల్ని ఉత్తేజపరచింది. విస్తృతమైన, నిర్మాణయుతమైన పోరాటంగా మారటానికి, గాంధేయ (అహింసా) సిద్ధాంత పరిమితులు అడ్డుగా నిలువలేకపోయాయి.[1]" చిటగాంగ్

1. నంబూద్రిపాద్, ఇ. యం. యస్. (1987) భారత స్వాతంత్ర్య పోరాట చరిత్ర (తెలుగులో) మొ. భా. పే.

సాయుధ తిరుగుబాటు, జలాలాబాద్ కొండలలో మిలిటరీ, పోలీసు దళాలతో పోరాటాలు, ఘార్వాలీ సైనికుల తిరుగుబాటు, కొన్నిచోట్ల కొద్దిరోజులైనా ప్రజలు అధికారాన్ని తమ చేతులలోనికి తీసుకొనుట, ప్రభుత్వం, కాంగ్రెసు వూహించిన పరిణామాలగుటతో తమతమ పట్టుదలలను సడలించారు.

## గాంధీ ఇర్విన్ ఒడంబడిక :

ప్రభుత్వం గాంధీజీని, కార్యవర్గాన్ని 26 జనవరి 1931న విడుదలచేసింది, సంభాషణల అనంతరం గాంధీ-ఇర్విన్ వొడంబడిక జరిగింది. భారత భవిష్యత్తును గురించిగాని, భగత్‌సింగ్, ఠాకూర్ చంద్రసింగ్ సత్యాగ్రహుల విడుదల హామీని, ఖైదీపత్‌గారల నిషేదపు తొలగింపు హామీలేకపోవుట కాంగ్రెసు యువనాయకత్వంలో అసంతృప్తికి కారణమైంది. సుభాస్‌చంద్రబోస్, విఠల్‌భాయ్ పటేలు బహిరంగంగా ఖండించారు.

గాంధీ-ఇర్విన్ వొడంబడిక 5మార్చి 1931న సంతకాలు జరిగాయి. ఏ కోర్కెలకై శాసనోల్లంఘనం జరిగిందో వాటిలో యే ఒక్కటీ నెరవేరలేదు. కాంగ్రెసు తిరస్కరించిన అధినివేశ ప్రతిపత్తిని గురించి, బ్రిటిష్ మంత్రులతో కలసి రౌండు టేబులు సమావేశంలో చర్చించుటకు గాంధీజీ అంగీకరించారు. భగత్‌సింగ్ ఉరిశిక్షను రద్దుచేయాలన్న షరతుపెట్టనందుకు యువతరాన్ని కోపోద్రిక్తులను చేసింది.

## కరాచి కాంగ్రెసు మహాసభ :

కరాచీ కాంగ్రెసు మహాసభలో ముఖ్యతీర్మానం, గాంధీ-ఇర్విన్ ఒడంబడికను రెండవ రౌండు టేబులు సమావేశమునకు, కాంగ్రెసు హాజరగుటకు ఆమోదాన్ని తెలుపుట ప్రధానంగావుంది. తీర్మానాన్ని కార్యవర్గం రూపొందించింది. తీర్మానం తీవ్రవ్యతిరేకతను ఎదుర్కొన్నా ఆమోదంపొందింది. అదేవిధంగా భగత్‌సింగ్ ఆయన అనుచరుల ఉరితీతపై తీర్మానం, సంఘటితమైన మైనారిటి తీవ్రమైన వ్యతిరేకతను ఎదుర్కొంటూ ఆమోదంపొందింది. విషయ నిర్ణయసభలో బోస్, ఆచార్య నరేంద్రదేవ్, పురుషోత్తమదాస్ టాండన్, స్వామీ గోవిందానంద్, బులుసు సాంబమూర్తి, కాశేశ్వరరావులు అధికార తీర్మానానికి అనుకూలత ప్రకటించలేదు.

జాతీయ కాంగ్రెసు భవిష్యత్తు రాజ్యాంగంలో ఆదేశ సూత్రాలుగ చేర్చవలసిన ప్రాధమిక హక్కులను వివరించే మరొక తీర్మానాన్ని అమోదించింది. వామపక్షీయులను సంతృప్తిపరచి, తమ అనుచరులుగ చేసి, ప్రభుత్వంతో బేరాలాడి, పాలనా వ్యవస్థలో తమ వర్గ ప్రయోజనాలను పరిరక్షించుకొనుట గాంధీజీ కాంగ్రెసు నాయకుల విధానం. అందుకే నెహ్రూని లాహోర్ కాంగ్రెసు అధ్యక్షునిచేసి, కరాచి కాంగ్రెసులో తమ అభ్యర్థిని వుపసంహరించుకొని, మితవాదవర్గం నెహ్రూ అధ్యక్షతను కొనసాగించింది.

ప్రాథమిక హక్కుల తీర్మానం, ఆదాయాన్నిబట్టి పన్ను, మరణ సుంకాలు, ఉద్యోగుల జీతపు గరిష్టపరిమితిలపై తీర్మానాలు, పట్టాభి శీతారామయ్య కాంగ్రెసు

చరిత్రలో ఉదహరించినవిధంగా వామపక్షీయుల అసంతృప్తిని కొంతవరకైనా తగ్గించుటకు తోడ్పడింది.

**కరాచి కాంగ్రెసు మహాసభ, కమ్యూనిస్టుల అవగాహన:**

కరాచి కాంగ్రెసులో జాతీయవాదులు చేబట్టిన రాజకీయ విధానం, కమ్యూనిస్టులు, తదితర అతివాదులలో అసంతృప్తిని కలిగించింది. కమ్యూనిస్టులు ఆరవ అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ సమావేశం, వలస విప్లవ పోరాటాల సిద్ధాంత పత్రపు వెలుగులో జాతీయ కాంగ్రెసు విధానాలను అధ్యయనం చేశారు. ఆ అవగాహనతోనే కరాచి కాంగ్రెసు ప్రతినిధులకు, భారతకమ్యూనిస్టు పార్టీ చిత్తు కార్యక్రమాన్ని చర్చల నిమిత్తం అందజేసింది. దానిలోని ముఖ్యాంశాలు క్రిందివిధంగా వున్నవి[1].

"బ్రిటిష్ సామ్రాజ్యవాదం భారతదేశాన్ని దాస్యంలోనే ,వుంచుటకు, స్థానిక రాజులు, భూస్వాములు, వడ్డీ వ్యాపారస్థులపై ఆధారపడి జాతీయ బూర్జువాల సహాయాన్ని ఉపయోగించుకొంటున్నది,

"జాతీయ కాంగ్రెసుపై ప్రజలకు భ్రమలున్నాయి. గాంధీజీ 11 అంశాల కార్యక్రమం చేంబర్స్ అఫ్ కామర్స్ సామాన్య కార్యక్రమాన్ని ప్రతిబింబిస్తున్నది. ప్రజాపోరాటాలు బ్రిటిష్ రాజ్యాంగ చట్టపరిమితులలోనే వుండునట్లు జాతీయ కాంగ్రెసు ముఖ్యంగా అతివాద కాంగ్రెసు వర్గాలు తాము చేయగలిగినదంతా చేస్తున్నారు.

జాతీయ విప్లవ వర్గాలు బూర్జువా ప్రభుత్వానికై పోరాడుతుండగా భారత కమ్యూనిస్టుపార్టీ కార్మిక, కర్షక ప్రజాతంత్ర నియంతృత్వానికై, కార్మిక, కర్షక సోవియట్ల ప్రభుత్వానికై పోరాడుతున్నవి. ఈ పోరాటపు ప్రధాన లక్ష్యాలు 1) సంపూర్ణ స్వాతంత్ర్యం 2) సోవియట్ల ప్రభుత్వస్థాపన 3) భూమి, అడవులనన్నిటిని జాతీయం చేయుట 4) 8 గంటల పనిరోజులుగ వున్నవి.

"భారత విప్లవ విజయానికి ప్రధాన ప్రమాదకర అడ్డంగ నెహ్రూ, బోస్‌ల ఆధ్వర్యంలో "జాతీయ కాంగ్రెసు అతివాదులు జరుపు అందోళన", "గతంలో ఇండిపెండెంటు లీగ్‌ను స్థాపించి, కార్మికులను, ప్రజలను గందరగోళంలో" ముంచిన విధంగా మరోసారి జరుగకుండా, తీవ్రవిమర్శకు గురిచేయుట", స్టాలిన్ అతివాద దృక్కోణంనుంచి పార్టీ ప్రధాన కర్తవ్యంగా నెంచారు.

పార్టీ చిత్తు కార్యక్రమం జాతీయ పోరాటంపై తనవైఖరి స్పష్టంచేయకపోగా పాల్గొనుటను నిషేదించలేదు. అంచేత కమ్యూనిస్టులు ఎందరో జాతీయోద్యమంలో పాల్గొని జైళ్ళకెళ్ళారు. మరెందరో కార్మిక సమ్మె పోరాటాలలో నాయకత్వం వహించి అరెస్టు అయ్యారు. మీరట్ కుట్రకేసులో కమ్యూనిస్టు అగ్రనాయకత్వమంతా అరెస్టు చేయబడ్డారు.

---

1. సి.పి.ఐ. ఎడ్యుకేషనల్ డిపార్టుమెంటు (1974) భారతకమ్యూనిస్టుపార్టీ చరిత్ర (ఆంగ్లంలో) పే. 34-5.

జాతీయోద్యమంలో పాల్గొనమని కమ్యూనిస్టుపార్టీ పిలుపునివ్వనందున కమ్యూనిస్టులు అధికారికంగా దూరంగా వుండిపోయారు. ఆ కారణంగానే బొంబాయి కమ్యూనిస్టుపార్టీశాఖ 1930 జూన్‌లో "బొంబాయి పార్టీశాఖ వాస్తవంగా పోరాటంనుండి తిరోగమనం చేసి, మొత్తం పోరాటాన్ని కాంగ్రెసే కొనసాగించునట్లు చేసింది. మా పాత్ర అప్పుడప్పుడు కరపత్రాలు ప్రకటించుటతో ముగిసింది. ఆ కారణంగా జాతీయ పోరాటంలో కమ్యూనిస్టులు యేమీ చేయుటలేదని, కాంగ్రెసే పోరాటాన్ని చేస్తున్నదని కార్మికవర్గం తలచి, కాంగ్రెసు నాయకత్వాన్ని అనుసరించిందని[1] పేర్కొన్నది.

## సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులలో చీలికలు :

జాతీయ కాంగ్రెసు 1927లో ప్రపంచ సామ్రాజ్యవాద వ్యతిరేకలీగులో చేరింది. పండిట్‌నెహ్రూ లీగు కార్యవర్గ సభ్యునిగా ఎన్నికయ్యాడు. నూతన అతివాద వొంటెత్తువిధాన ఫలితంగా యేర్పడిన కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం, ప్రత్యేక సామ్రాజ్యవాద వ్యతిరేకలీగును యేర్పాటుచేసి బొంబాయి అక్టోబరు 1930 మహాసభలో నెహ్రూను, కాంగ్రెసు నాయకత్వాన్ని పరుషంగా విమర్శించింది. గాంధీ-ఇర్విన్ వొడంబడికతో నెహ్రూ, కాంగ్రెసు నాయకత్వం బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో చేరిపోయిందంటూ, అంతర్జాతీయ లీగు కేంద్రం, నెహ్రూను 1930 మార్చిలో కార్యవర్గంనుండి ఏకపక్షంగా తొలగించింది. అదేకాలంలో కార్మిక, కర్షక పార్టీల పని ఆగిపోవుటతో కమ్యూనిస్టులు యేకాకులయ్యారు.

## కమ్యూనిస్టుపార్టీ ట్రేడుయూనియన్ కాంగ్రెసులలో చీలికలు :

కమ్యూనిస్టుపార్టీ యీ ఆత్మహత్యా అతివాద వొంటెత్తు పోకడలు కారణంగా చీలిపోయింది. రణదివె నాయకత్వంలో మైనారిటీ సభ్యులు, దేశపాండె నాయకత్వంలో మెజారిటీ కేంద్ర కమిటి వుండిపోయాయి. మైనారిటీ "వర్కర్స్ పార్టీ" స్థాపించింది. కమ్యూనిస్టుపార్టీ యేర్పడిన నాటినుండి వలస సిద్ధాంతంపై అంతులేని చర్చలు జరుగుతున్నవి. ఆరవ కొమింటరన్ కాంగ్రెసు అతివాద వొంటెత్తు పోకడలకు ఆజ్యం 1928లోపోసింది. అనుభవంగలపార్టీ అగ్రనాయకత్వం 1929లో కాన్పూరు కుట్రకేసులో అరెస్టు అయింది. ఐక్యతను పునరుద్ధరించుటకు అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ కార్యవర్గం, ఇరుపక్షాలు తమ వాదనలను మాస్కోలో కొనసాగించమని ఆహ్వానించింది. రణదివె ఆహ్వానాన్ని నిరాకరించారు. పార్టీ 1931లో రెండుగా చీలిపోయింది. గ్రూపులమధ్య సంఘర్షణలు యెక్కువయ్యాయి. అందుకే అతివాద వొంటెత్తు విధానాన్ని బాల్యారిష్టమన్నారు" లెనిన్.

ఈ చీలికల ప్రభావం కమ్యూనిస్టులు పనిచేస్తున్న ఒకే ఒక సంఘటితపు ట్రేడు యూనియన్ కాంగ్రెసుపై పడకతప్పలేదు. జోషి, గిరిల నాయకత్వంలో 1929లో నాగపూర్ సమావేశంలో యేర్పడిన చీలికనుండి కోలుకొంటున్న కార్మికో

---

1. సి.పి.ఐ. ఎడ్యుకేషనల్ డిపార్టుమెంటు (1974) భారతకమ్యూనిస్టుపార్టీచరిత్ర. పే. 35.

ద్యమం మరో చీలికకు గురైంది. కమ్యూనిస్టులు, జాతీయ కాంగ్రెసు నాయకులు గతంలో కలసి జాతీయ సంఘటనగా పనిచేసి,సంస్కరణవాదులను ఎదుర్కొన్నారు. కమ్యూనిస్టుల సంఖ్యాబలం వాస్తవంగా తక్కువే. జాతీయ వాదులతో కలసి సంస్కరణ వాదులను ఓడించగలిగారు. ఇప్పుడు కమ్యూనిస్టుల అతివాద వొంటెత్తు విధానం కారణంగా కార్మికవర్గ స్వతంత్రపాత్ర, అంతర్జాతీయ ట్రేడుయూనియన్ కాంగ్రెసుకు అనుబంధించు విధానాల కారణంగా ఎ ఐ టి యు సి నుండి చీలిపోయి "రెడ్ ట్రేడు యూనియన్ సెంటర్"ను యేర్పాటు చేసారు.

అతివాద ధోరణితో భారత కమ్యూనిస్టు పార్టీ అధికారరీత్యా జాతీయోద్యమం, పోరాటాలలో పాల్గొనకపోయినా, అనేక ప్రాంతాలలో బెంగాల్, యు. పి., పంజాబులలో కార్మిక, కర్షక పోరాటాలలో 1930 జాతీయ ఉద్యమంలో వ్యక్తిగతంగా పాల్గొన్నారు.

## iii
## కమ్యూనిస్టుల అతివాద పోకడలు

కరాచి కాంగ్రెసుకు ముందు, తరువాత జరికిన రాజకీయ పరిణామాలకు కమ్యూనిస్టులు స్పందించిన తీరు, ఐక్యకార్యాచరణల అవగాహన, జాతీయ సంఘటనా వివేచనలు,6వ అంతర్జాతీయ కమ్యూనిస్టు కాంగ్రెసులో వలస సిద్ధాంతచర్చలు, నిర్ణయాలు, భారత కమ్యూనిస్టులపై వాటి ప్రభావం, వారి ఆలోచనా విధానం అత్యంత ఆసక్తిని కలిగిస్తున్నది. అంతర్జాతీయ 2వ, 3వ, 4వ, 5వ కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెసులలో వలస సిద్ధాంతంపై జరిగిన చర్చలు, మరోసారి పునరావృతమై, బృహత్చర్చగా పరిణమించుట పెద్దమలుపుగా నెంచవచ్చును.

అక్టోబరు 1927లో చైనానుండి తిరిగివచ్చిన రాయ్ "వలస నిష్క్రమణ సిద్ధాంతాన్ని" పరిపుష్ట మొనర్చి, వివరంగా, స్పష్టంగా చిత్తు తీర్మానరూపంలో మహాసభలో చర్చల నిమిత్తం ప్రతిపాదించాడు. రాయ్ ప్రధానంగా 1922లో వ్రాసిన "మార్పుచెందే భారతదేశం", 1926లో వ్రాసిన "భారత రాజకీయాల భవిష్యత్తు" అనే సిద్ధాంత గ్రంథాల సంక్షిప్తరూపమే "వలస నిష్క్రమణ సిద్ధాంతం" పత్రంగా చెప్పుకొనవచ్చు. కొమింటరను కార్యవర్గపు చిత్తు కార్యక్రమ సిద్ధాంతపత్రం, రాయ్, పామీదత్తులు హానీల అవగాహనలకు భిన్నంగా ఉంది. రాయ్, పామీదత్తులు అస్వస్థత కారణంగా కాంగ్రెసు మహాసభలో స్వయంగా పాల్గొనజాలకపోయినా వారి అభిప్రాయాలను ముందుగానే స్పష్టంగా తెలియపరచారు.

### అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ 6వ కాంగ్రెసు

భారతదేశ సమస్యపై రష్యన్ కమ్యూనిస్టు పార్టీవైఖరి, కొమింటరను జనరల్ సెక్రటరీ బుఖారిన్ నివేదికలో వివరించపడింది. భారత బూర్జువావర్గం కొంత కాలమైనా విప్లవపాత్రను వహించుతుందనుట వూహించరానిదని, బుఖారిన్ వాదించారు. బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా వ్యూహాత్మకంగా తన బలాన్ని పెంపొందించుకొనుటకు ప్రయత్నించవచ్చు, కైనా బూర్జువావర్గంవలె సాయుధ పోరాటాన్ని చేబట్టదని, బుఖారిన్ విశ్లేషణ క్లుప్తంగా వుంది. స్వరాజ్యపార్టీవారిని కూడ తీవ్రంగా విమర్శించాడు.

కాంగ్రెసులో సికందర్‌సుర్ (షౌకత్ ఉస్మానీ), రాజా (మహమ్మద్ షఫిక్ సిద్దకి) నారాయన్ లేక స్పెన్సర్ (సౌమ్యేంద్రనాద్ ఠాగూర్)లు వోటింగు హక్కు గల ప్రతినిధులుగాను, క్లెమెన్స్‌దత్, మహమ్మద్ అలీ (సిపాసి), లుహానీలు భారత యితర ప్రతినిధులుగాను పాల్గొన్నారు. రష్యానుండి బుఖారిన్, లొజోవస్కీ, వార్గాలు పాల్గొన్నారు. ప్రధాన నివేదికను కుసినిన్ ప్రవేశపెట్టారు చర్చల నిమిత్తం రాయ్, పామీదత్తులు తమ సిద్ధాంత పత్రాలను ముందుగానే పంపారు. అస్వస్థత కారణంగా స్వయంగా పాల్గొనలేదు.

**కాంగ్రెసు వలస సిద్ధాంత పత్రం :**

కుసినిన్ 6వ కాంగ్రెసు వలస సిద్ధాంత పత్రాన్ని సమర్పించాడు[1]. భారత దేశానికి సంబంధించినంతవరకు దాని సారాంశం యిలావుంది.

రెండవ కాంగ్రెసులో వలస సమస్యలపై ప్రధాన సిద్ధాంతం, వ్యూహం, ఎత్తుగడలు లెనిన్ సూత్రీకరించిన తరువాత అనేక నూతన అనుభవాలు లభించాయి. అనేక వలసలలో కార్మికవర్గం రాజకీయ, వర్గ పోరాటాలలో ప్రవేశించింది. చైనాంగ విప్లవ పోరాటాలకు నాయకత్వం వహించుచున్నది. నికారాగువా, సిరియా, మొరాకొ ఇండియాలలో వ్యవసాయ సంఘర్షణలు, కొట్లాటలు జరిగి అనేక అనుభవాలు సమకూరాయి. చైనాలో విప్లవ, ప్రతీఘాతక విప్లవాల అనుభవాలు మరువరానివి. అర్ధ వలస దక్షిణ అమెరికా దేశాలలో జాతీయ విప్లవపోరాటాలు జరిగాయి. రెండవ కాంగ్రెసు వలస సిద్ధాంత సాధారణ సమస్యలను పరిశీలించింది. ఆరవ కాంగ్రెసు వివిధ వలసల ప్రత్యేక సమస్యలను ఎత్తుగడలను పరిశీలించి వివరించింది. కాంగ్రెస్ పరిస్థితిని సమీక్షిస్తూ వలస రాజ్యాలలోని విప్లవాల యెడల లెనిన్ అవగాహన రుజువైందని పేర్కొన్నది.

ఇండియాలో జాతీయ విప్లవోద్యమము పునర్జీవంపొంది వివిధ రూపాలలో కార్మిక కర్షక విప్లవంగా రూపొందుతున్నది. చైనా, ఇండియాలలో వలస, వ్యవసాయ సమస్యల పరిష్కారానికి రెండు మార్గాలు కన్పడుతున్నవి. ఒకటి, సంస్కరణలతో సామ్రాజ్యవాదంతో రాజీపడి బూర్జువా ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయుట. తన చారిత్రక కర్తవ్యంగా బూర్జువావర్గం తలచుచున్నది రెండోవర్గం వలస సామ్రాజ్యవాదానికి, శేషభూస్వామ్యానికి వ్యతిరేకంగా విప్లవపోరాటాలు, విజయము. సామ్రాజ్యవాదగుత్త ఆధిపత్యానికి స్వస్తిచెప్పి, వ్యవసాయవిప్లవాన్ని పరిపూర్తిగావించి, వలస దేశాలలో పెట్టుబడిదారేతర మార్గంలో అభివృద్ధి వ్యూహం, కార్మిక, కర్షక నియంతృత్వ స్థాపన పంథాయని స్పష్టంచేసింది.

వలసలలో సామ్రాజ్యవాదపాత్రను స్పష్టంచేసి, ఇండియా తదితర వలసలు "సామ్రాజ్యవాద వ్యవసాయ అనుబంధం", "ప్రపంచ గ్రామాలు" కావు అన్నది. బ్రిటిష్ సామ్రాజ్యవాదం ఇండియాను పారిశ్రామికీకరణ చేస్తున్నదన్న అవగాహ

---

1. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర. అధికారపత్రాలు. ఎడి. అధికారి (1974) వా III C పే. 628.

నను కొమింటరను విమర్శించింది. ఈ విధమైన అవగాహన "వలస నిష్క్రమణ సిద్ధాంతానికి" దారితీస్తుంది. ఆ సిద్ధాంతాన్ని ఆమోదించుట, అనగా లెనిన్ "వలస దోపిడి సిద్ధాంతాన్ని ప్రధానంగా విడనాడుట" అగుతుంది. సామ్రాజ్యవాదం వ్యవసాయ ఉత్పత్తుల వినిమయ పరిశ్రమలు, యితర చిన్న పరిశ్రమలకు మాత్రమే అవకాశమిస్తుంది. పారిశ్రామికీకరణ అంటే భారీపరిశ్రమస్థాపన, అదే పరిశ్రమలు పెంపొందుటకు మౌలికమైనది. చిన్న పరిశ్రమలకు మాత్రమే కొద్ది అవకాశాలనిస్తూ భారీపరిశ్రమలను నిరోధిస్తూ, గ్రామసీమలలో ఫ్యూడలు అవశేషాలకు మద్దతునిచ్చే విధానాన్ని అవలంభించుచున్నది. అతిహీన జీవితాన్ని సాగించే రైతులపై వివిధ అధిక పన్నులను ప్రత్యక్షంగా, పరోక్షంగా వేస్తున్నది.

రెండవ ప్రధానాంశం, బూర్జువావర్గం యెడల అవలంభించవలసిన విధానము. చైనా అనుభవాలనుండి పాఠాలు నేర్చుకొని,ఇండియా విప్లవానికి ఎత్తుగడలను ఆలోచించాలి. రాజకీయ సిద్ధాంతపత్రంలో భారత కమ్యూనిస్టులకు కొన్ని సూచనలున్నాయి. భారత విప్లవోద్యమంలో నాయకత్వపాత్రకై, కార్మికవర్గానికి బూర్జువావర్గానికి జరుగుతున్న పోరాటంలో 1927కు పూర్వపు చైనాలో భిన్నమైన ప్రత్యేక లక్షణాలేమిటి? భారత్‌లో బూర్జువావర్గం ఆర్థికంగా, రాజకీయంగా నిస్సందేహంగా వొకవర్గంగా సంఘటితమై ఉంది.చైనా బూర్జువావర్గం కంటె పరిపక్వత చెందింది కార్మికవర్గం చైనాలో కంటె సంఖ్యా బలంలో యెక్కువైనా, రాజకీయంగా బూర్జువావర్గ ప్రభావంలో ఉంది.

బూర్జువావర్గంలో అత్యంత శక్తివంతమైన వొక భాగం ఇండియాలోని సామ్రాజ్యవాదంతో రాజీమార్గంలో పడిపోయింది. మరోభాగం స్వరాజ్యపార్టీ రాజకీయ సిద్ధాంతపత్రం పేర్కొన్న విధంగా, కార్మికులను త్రోసివేసి, రాజీ అవగాహనకు యెదురు చూస్తున్నది. అన్ని బూర్జువా పంథాలు గతంలో వ్యవసాయ విప్లవానికి ద్రోహం చేసాయి. భవిష్యత్తులోను విప్లవ వ్యతిరేకపాత్రనే చేబట్టవచ్చును.

కమ్యూనిస్టు వర్గాలను, గ్రూపులను బలమైన కమ్యూనిస్టు పార్టీగా సంఘటితపరచుట, కార్మికులను ట్రేడు యూనియన్‌లలో సంఘటితపరచుట, ట్రేడు యూనియన్‌లలోని సోషల్ విద్రోహ నాయకులకు క్రమబద్ధ పోరాటాలలో తీవ్రంగా విమర్శించి, బహిరంగపరచి, తొలగించుట, భారత కార్మికవర్గ ప్రధాన కర్తవ్యం. భారత స్వాతంత్ర్య విప్లవ పోరాటాలకు తప్పనిసరిపని, భారత కమ్యూనిస్టుల ప్రథమ కర్తవ్యం. సామ్రాజ్యవాద, శేషఫ్యూడల్ వ్యతిరేక జాతీయ పోరాటాలలో కార్మికవర్గ నాయకత్వంపై పోరాటం, కార్మికవర్గం అగ్రగామిదళమగుట, భారత కమ్యూనిస్టు పార్టీ ద్వితీయ కర్తవ్యం. కారణం, సామ్రాజ్యవాద, భూస్వామ్య, రాజీ బూర్జువాల సంఘటనను, కార్మిక, కర్షక విప్లవ మేధావివర్గాల సంఘటన కార్మికవర్గ నాయకత్వం క్రిందనే వోడించి, సామ్రాజ్యవాదుల సంఘటనను బ్రద్దలుకొట్టే భారతదేశములో వ్యవసాయ విప్లవాన్ని ఆవిష్కరించగలుగుతుంది.[1]

1. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర, (1972) అధికారపత్రాలు, ఎ డి. అధికారి. సి. సి. ఐ. ప్రచురణ. వా III C. పే. 624-629.

## రాయ్ వలస నిష్క్రమణ సిద్ధాంతం :

రాయ్ ప్రతిపాదించిన "వలస నిష్క్రమణ లేక డీకలొనైజేషన్" సిద్ధాంత సార సంగ్రహం[1] యీ క్రింది విధంగా వుంది.

మొదటి ప్రపంచ యుద్ధానంతరం బ్రిటిష్ సామ్రాజ్యవాదం, కాంగ్రెసు,ముస్లిం లీగుల సంయుక్త పోరాటాన్ని, కిలాఫత్ పోరాటరూపంలో యెదుర్కొనవలసి వచ్చింది. యుద్ధకాలంలో విప్లవ పోరాటాల భయంతో బ్రిటిష్ ప్రభుత్వం కొన్ని రాజకీయ, పారిశ్రామిక, ఆర్థిక సదుపాయాలను కలుగజేసింది. అ ప్రధాన రాజకీయ సంస్కరణలు కొన్నిటిని 1919లో చేసింది.సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రథమ పోరాటం, 1920-22లలో ద్రోహంతో ముగిసింది. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట ప్రథమశక్తి జాతీయ బూర్జువావర్గంకాదని, పెంపొందుతున్న కార్మిక, కర్షక పోరాట శక్తియని, విస్తృత కార్మిక సమ్మె పోరాటాలు, గ్రామసీమలలో పరిపక్వం చెందుతున్న వ్యవసాయ విప్లవశక్తులు ప్రధానమైనవని తెల్పింది.

యుద్ధానంతర పెట్టుబడిదారి ఆర్థిక సంక్షోభం,బ్రిటిష్ సామ్రాజ్యవాదం భారత దేశాన్ని పారిశ్రామికంగా వెనుకబడునట్లు చేయు ఆర్థిక విధానాన్ని తప్పనిసరిగా మార్చుకొనునట్లు చేసింది బ్రిటిష్ సామ్రాజ్యంలో భారతదేశం అత్యంత బలహీనమైన దేశంగా రుజువు అగుటతో యుద్ధానంతరం పారిశ్రామికీకరణను త్వరితం చేసింది. సామ్రాజ్యవాదుల పోటీతో సతమతమగుచున్న భారత ఇంజనీరింగు,లోహ, యాంత్రిక సప్లయ్‌లు బ్రిటిష్ ప్రోత్సాహంతో అభివృద్ధి చెందాయి.భారత పారిశ్రామిక కమీషన్ మన దేశంలో పారిశ్రామికాభివృద్ధికి సూచనలు చేయుటకు, 1916 లోనే యేర్పాటు చేసారు. భారత పారిశ్రామికులు సైనికావసరాలను సప్లయ్ చేయజాలక పోవుటతో, భారతదేశంపై, మార్కెట్టుపై బ్రిటిష్ గుత్త అధికారాన్ని కాపాడుకొనుటకు, జపాన్‌ను దూరంగా వుంచవలసిన అవసరం యేర్పడింది. బ్రిటిష్ విధాన మార్పుకు కీలక కారణమైంది. శతాబ్దాలపాటు లాంగ్‌షైర్ మిల్లుల యజమానులు బ్రిటిష్ ఇండియా విధానాలకు ప్రధాన నిర్ణేతలయ్యారు. వ్యాపార పెట్టుబడినుండి పారిశ్రామిక, బ్యాకింగ్ పెట్టుబడీ విధానములకు సామ్రాజ్యవాద విధానం మార్పు చెందుటను తెలియజేస్తుంది.అభివృద్ధిపథంలో ఉన్న పెట్టుబడిదారి సామ్రాజ్యవాదానికి క్షీణదశలో పడిన పెట్టుబడిదారి విధాన సామ్రాజ్యవాద విధానానికి మౌలికమైన భేదమిదే అగుట స్పష్టము.

"భారతదేశాన్ని పారిశ్రామికీకరణ చేయుటతో బ్రిటిష్ లోహ, యంత్ర పరిశ్రమలకు కావలసిన మార్కెట్టు యేర్పడుతుంది. ఉత్పత్తి శక్తులని అభివృద్ధి చేయుటతో, భారతీయుల కొనుగోలు శక్తి పెరుగుతుంది.భారత పారిశ్రామికశక్తిని నేరుగా ఉత్పత్తి రూపంలో దోపిడి చేయుటతో అదనపు విలువ మొత్తంగా యెంతో పెరుగు

2. రాయ్, యం. (1928) భారత సమస్యపై చిత్తు తీర్మానం. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర. ఎడి అధికారి. వా III C. పే 572-606.

తుంది. జాతీయ బూర్జువాలకు అందులో భాగం యిచ్చినప్పటికీ సామ్రాజ్యవాదం ముందెన్నడూ పొందని అధిక లాభాలను పొందుతుంది. కావలసిన దానికి మించి వున్న పారిశ్రామిక శక్తి అతిచౌకగా లభించుటతో పెట్టుబడి పెరుగుదల అతివేగంగా జరుగుతుంది. ఆ కారణంగా ఇంగ్లండులో జరిగే పెట్టుబడి పెరుగుదల తరుగును పూడ్చగలుగుతుంది. ఈ విధంగా భారత పారిశ్రామికీకరణ సామ్రాజ్యవాద స్థితిని బలపరస్తుంది. బ్రిటిష్ సామ్రాజ్యవాద పరిధిలో యిది జరిగినచో, పెట్టుబడిదారి విధానానికి స్థిరత్వాన్ని చేకూర్చుతుంది.[1]"

"నూతన విధానంలో క్రమేణా "వలస నిష్క్రమణ" యిమిడివుంది. "ఆధారిత ప్రభుత్వదశ" నుండి "అధినివేశ ప్రతిపత్తి దశకు" పరిణామం చెందుటకు అవకాశమివ్వబడుతుంది, భారత బూర్జువా వర్గాన్ని ప్రత్యర్థి వర్గంగా త్రొక్కిపెట్టి వుంచుటగాక. సామ్రాజ్యవాద నేతృత్వంలో దేశాన్ని అర్థికాభివృద్ధిగావించుటకు, భాగస్వాములను చేయుట, వెనుకబడిన వ్యవసాయ వలసదేశంగాకాక, నూతన పారిశ్రామిక దేశంగా, బ్రిటిష్ కామన్‌వెల్తులో భారతదేశం స్వతంత్రజాతి అగుతుంది[2]".

భూస్వాములు బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు ఎప్పుడూ మిత్రులుగానే ఉన్నారు. వ్యవసాయాభివృద్ధికి సూచనలు చేయుటకై నియమించిన రాయల్ కమిషన్ భూసంస్కరణల పేరెత్తక, చిన్న భూఖండాల యేకీకరణ సూచించి, భూస్వామ్య విధానానికి మరింత బలాన్ని చేకూర్చింది. "ఫ్యూడలు భూస్వాములను రద్దుచేసి, పెట్టుబడి దారీవిధానాన్ని అభివృద్ధిచేయుటగాక, రైతులను భూములనుండి తరిమివేయుట సూచించింది. ధనికరైతులకు అధికార సహకార బ్యాంకులద్వారా అప్పులనిచ్చి ప్రోత్సహించు విధానాన్ని చేబట్టింది.

"జాతీయోద్యమానికి నాయకత్వం వహించే బూర్జువావర్గం కోరేది "అధినివేశ ప్రతిపత్తి", బ్రిటీష్ సామ్రాజ్యంలో భాగస్వామ్యం మాత్రమే. సామ్రాజ్యవాద భారత బూర్జువావర్గం 'చట్టబద్ధ' పోరాటాన్నితప్ప మరే విప్లవ పోరాటాన్ని ప్రోత్సహించదు, జాతీయ బూర్జువా వర్గానికి నాయకత్వం వహించే కాంగ్రెసు రాజ్యాంగ సంస్కరణలు, ద్రవ్యవిధానంలో స్వాతంత్ర్యం జాతీయ పరిశ్రమల రక్షణ ప్రధాన ఆశయాలు. జాతీయ బూర్జువావర్గం విప్లవేతర మార్గాలను అనుసరించుటకు చారిత్రక కారణాలున్నవి. దాని అభివృద్ధి ఒకవైపు అభివృద్ధి నిరోధక, ఫ్యూడలు ఆర్థిక విధానానికి బ్రహ్మముడి వేసుకొనివుంది. ఆ కారణంగా వారి వర్గ ప్రయోజనాలకు భిన్నంగా జాతీయ విప్లవ కార్యక్రమాన్ని జాతీయ అభివృద్ధి నిరోధక ఫ్యూడలు భూస్వాములకు, విదేశీయ సామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవ పోరాటాన్ని నడుపజాలదు. కాన భారతీయ విప్లవం, బూర్జువా విప్లవం కాజాలదు[3].

---

1. రాయ్, యం. యన్. (1928) ఇండియా సమస్యపై చిత్తు తీర్మానం. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర అధికారపత్రాలు. వా III C. పే. 576.
2. రాయ్, యం. యన్. (1928) ఇండియా సమస్యపై చిత్తు తీర్మానం. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర. అధికార పత్రాలు. వా III C. పే. 576.
3. అదే పే. 581,

భారతదేశంలో పెట్టుబడిదారి విధానాభివృద్ధి మార్గాన్ని బ్రిటిష్ సామ్రాజ్య వాదం అవలంభిచుటతో జాతీయ బూర్జువా విప్లవపాత్ర అదృశ్యమౌతుంది. నేటి పరి స్థితులలో జాతీయ బూర్జువావర్గం సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా శత్రువుగాకాక, దాని మైనరు భాగస్వామిగ, అనుచరునిగా అభివృద్ధి అవుతుంది. ఉమ్మడి భయాలు, ప్రయోజనాలు వారిద్దరూ వర్గపోరాటానికి వ్యతిరేకంగా సంయుక్త సంఘటనగా ఏర్పడి దోపిడి, దౌర్జన్యం కొనసాగునట్లు చేస్తాయి"[1].

దోపిడి, దౌర్జన్యానికి వ్యతిరేకంగా జరిగే జాతీయ స్వాతంత్ర్య పోరాటం, సామ్రాజ్యవ్యతిరేక పోరాటమేగాక వారి స్థానిక మిత్రుల, పెట్టుబడిదారుల, భూస్వా ముల వ్యతిరేకంగా అత్యధిక ప్రజాసామాన్యం జరిపే విప్లవ పోరాటం అగుతుంది. వర్గపోరాటం జాతీయ పోరాటంలోకలిసి పోతుంది. సామ్రాజ్యవాద వ్యతిరేకపోరాటం పెట్టుబడిదారి వ్యతిరేక పోరాటంగా అభివృద్ధి చెందుతుంది[2].

ఈ కారణంచేతనే "సామ్రాజ్యవాదం అనుసరించే పారిశ్రామికీకరణ కొన్ని సౌకర్యాలనిచ్చి, భారతీయ బూర్జువా వర్గాన్ని మైనరు భాగస్వామిగా జేసి, అధినివేశ ప్రతిపత్తినిచ్చి, ప్రజాదోపిడి కొనసాగిస్తూ, అభివృద్ధిచెందుతున్న కార్మిక, కర్షక విప్లవ పోరాటాలను ప్రజాస్వామ్యం, సంపూర్ణ స్వాతంత్ర్య పోరాటాలను అణచి వేయు వ్యూహంగా రాయ్ తదితరులు భావించారని[3]" అధికారి పేర్కొన్నారు.

## వలస సిద్ధాంతంపై చర్చల సరళి :

కుసినిన్ వలస సిద్ధాంత నివేదిక మూడు వర్గాల వ్యూహం, ఎత్తుగడల రూప కల్పనగావుంది. వార్గా, అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కార్యవర్గపు వాదన లను చేబట్టి, పారిశ్రామికీకరణ ఫలితంగా భారతదేశంనుండి బ్రిటిష్ వలస నిష్క్రి మణ సిద్ధాంతాన్ని తీవ్రంగా విమర్శించాడు. భారత బూర్జువా నైజము "జాతీయ సం స్కరణ విధానం", "కార్మిక వ్యతిరేక విధానం", "విప్లవ పంథాకాదనేది కూడ స్పష్టం" అని కుసినిన్ అన్నారు. పెటీ బూర్జువా యెడల అస్పష్టతకులోనై, నగరపెటీ బూర్జువాలు, బూర్జువా మేధావివర్గాలు జాతీయోద్యమంలో ముఖ్యపాత్ర కొంతవరకు వహించగలరని అంగీకరించాడు. కార్మిక, కర్షక పార్టీలు వలస, అర్ధవలస దేశా లలో కమ్యూనిస్టు పార్టీలకు బదులుగా యేర్పరచుట ఆమోదయోగ్యం కాదని స్పష్టం చేశాడు.

బ్రిటిష్ ప్రతినిధివర్గం, కుసినిన్ వైఖరిని చివరివరకు వ్యతిరేకించింది. బ్రిటన్ ఆధిపత్యంలోనే పారిశ్రామికీకరణ జరుగుచున్నదని, దాని పరిగణించకపోయిన కార్మికవర్గ పాత్రను తక్కువగా అంచనా వేయుట అగుతుంది. కార్మికవర్గం సంఖ్యలో

---

1. రాయ్, యం.యన్. (1928) ఇండియా సమస్యపై చిత్తు తీర్మానం, భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర. అధికారపత్రాలు ఎడి. అధికారి. వా III C. పే. 582
2. అదే పే. 588
3. అధికారి, జి (1975). మార్క్సిస్టు మిసలిని. నం. 2 డిశెంబరు 1975. పే. 21

పెరుగుతుంది. పారిశ్రామికీకరణ ఫలితమే కార్మికవర్గం పెరుగుదల. క్లెమెన్స్‌దత్ సంక్షిప్తంగా "భారత బూర్జువావర్గం విప్లవ ప్రతిఘాతకశక్తి, దాని అర్థం ప్రజావిప్లవాభివృద్ధికి దానిని మనం వినియోగించుకొనరాదనికాదు" అని బ్రిటిష్ ప్రతినిధివర్గ వైఖరిని వెల్లడించాడు. కార్మిక, కర్షక పార్టీలను కొనసాగించాలన్నారు[1]. "ప్రపంచ విప్లవంలో భారతదేశపు పాత్ర" అను వ్యాసంలో "వలస సిద్ధాంతానికి వ్యతిరేకంగా భారత బూర్జువా వర్గంలోని పరస్పర వైరుధ్య లక్షణాన్ని, వూగిసలాట పాత్రను, ముఖ్యంగా సామ్రాజ్యవాదం అభివృద్ధిచెందే ప్రజాపోరాటాల కారణంగా సహజమని భారత బూర్జువావర్గ ఆచరణ, అనుభవాల సమగ్ర అవగాహన, వారి చైనా మిత్రుల ఆచరణ, వారి కార్మిక కర్షక వ్యతిరేకత వారి విదేశీయ సామ్రాజ్యవాద వ్యతిరేకత కంటె ప్రధానమైనదని" వివరించారు.

కార్మిక, కర్షక పార్టీల విషయమై, రష్యన్ ప్రతినిధివర్గం వాటిని రద్దు చేయాలని, కమ్యూనిస్టు పార్టీపైనే కేంద్రీకరించాలనే వైఖరిని స్పష్టం చేసింది. ఈ సమస్యపై ఉస్మాన్, రాజా, మాజూట్‌లు రష్యావైఖరిని బలపరచారు. నూతన వ్యూహములో, కార్మిక, కర్షక పార్టీల యేర్పాటు ఎత్తుగడను బలపరచారు. "ఎవ్వరూ, ఎప్పుడూ ప్రతిపాదించని, కార్మిక, కర్షక పార్టీలు కమ్యూనిస్టు పార్టీలకు ప్రత్యామ్నాయాలుగా వూహించుకొనుటతో వాటికి వ్యతిరేకత వచ్చింది. దేశంలో పెటీ బూర్జువా శక్తులు, కొన్నిచోట్ల కార్మికీకరణ జరిగింది.వలసలలో పెటీ బూర్జువా మేధావివర్గాలు, నగరపెటీ బూర్జువాలు విప్లవోద్యమాలలో గణనీయమైన పాత్ర వహించవలసివుంది. సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనలో వారి పాత్రయే నిర్మాణ స్వరూపాన్ని వహించాలి? ఈ పెటీ బూర్జువా శక్తులతో కమ్యూనిస్టు పార్టీ నింపివేస్తామా? ఆ పని చేయము. దానికి మారుగా, పెటీ బూర్జువాల విప్లవ కార్యాచరణను కమ్యూనిస్టు పార్టీ వినియోగిస్తుంది. సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటన కార్మిక, కర్షక పార్టీ నిర్మాణ స్వరూపాన్ని తీసుకొంటుంది. నగర మేధావి వర్గాలను, పెటీ బూర్జువాలను, కార్మిక వర్గ నాయకత్వంలో సమీకరిస్తుంది. సంస్కరణవాద నాయకత్వంలోవున్న కొన్ని ట్రేడు యూనియనులను, రైతు సంఘాలను, కార్మిక, కర్షకపార్టీ యిప్పుడు నాయకత్వాన్నిస్తున్నవి. ఇప్పుడు వీటిని రద్దు చేయమంటున్నారు. లెనిన్ మనలను అనేక సారులు హెచ్చరించిన "ప్రొఫెసర్ల పిడివాదం" అని ఠాగూర్ వాదించి రష్యా వైఖరిని తీవ్రంగా విమర్శించారు. ఠాగూర్ బ్రిటిష్ వైఖరిని యీ విషయంలో బలపరచినా, వలసలలోని కమ్యూనిస్టు పార్టీలకు బ్రిటిష్ పార్టీ మార్గదర్శక నాయకత్వాన్ని వ్యతిరేకించాడు.

సికిందర్‌సుర్ "వలస నిష్క్రమణ సిద్ధాంతాన్ని" తెలియజేస్తూ దాని మద్దతుదారులు పెట్టుబడిని, పారిశ్రామికీకరణను గందరగోళ పరుస్తున్నారన్నాడు. రాజా

---

1. జెనెడి ఓవర్‌స్ట్రీట్, మార్షల్ లిండ్ మిల్లర్ (1960) కమ్యూనిజం ఇన్ ఇండియా, పే. 25.

వలస నిష్క్రమణకు వ్యతిరేకంగా కుసినిన్‌తో ఏకీభవించాడు. స్వాతంత్ర్యం ఒక్క సోషలిస్టు విప్లవం వలనే వస్తుందన్నాడు.[1]

నారాయణ్ వలస సిద్ధాంతంలోని "నిజమైన పారిశ్రామికీకరణ, భారీ యంత్ర నిర్మాణ పరిశ్రమతో, ఉత్పత్తిశక్తుల స్వాతంత్ర్యంతో జరుగుతుందని, సామ్రాజ్య వాదం ఆ పనిచేయక నిరోధించుచున్నదని "దానితో యేకీభవించజాలనన్నాడు!" యుద్ధ అవసరాల నిమిత్తం, జపాన్, అమెరికాలు, ఇండియా మార్కెట్టులో బ్రిటిష్ స్థానానికి ప్రమాదం వలన, ఇండియాలో పారిశ్రామికీకరణవలన బ్రిటిష్ లోహ, యంత్ర పరిశ్రమలకు మంచి మార్కెట్టు లభించే కారణంగా కొంత పారిశ్రామికీ కరణ జరిగిందన్నారు. రాజకీయంగా దీని అర్థం, భారతదేశంలో పారిశ్రామికీకరణా నికి మార్కెట్టు విస్తరణ, వ్యవసాయ సంస్కరణలు యెంతో అవసరం. అవి ఎంతో చిక్కులతో కూడిన దైనందున బ్రిటిష్ సామ్రాజ్యవాదం చేబట్టజాలదు. అంతేగాక, యీ పారిశ్రామికీకరణతో రైతాంగం కడుదైన్య స్థితికి వస్తుందని, అది వ్యవసాయ విప్లవానికి, కార్మికవర్గ సంఖ్యాబలం పెరిగి సోషలిస్టు విప్లవానికి దారి తీస్తుందని, అం చేత జాతీయ బూర్జువావర్గంలో మార్పు వస్తుంది" అది, దిగజారి సామ్రాజ్యంతో సహకారాన్ని కోరుకొంటుందనుటకు, భారత బూర్జువావర్గం దాని చరిత్రలో ఎప్పుడూ విప్లవ పోరాట రూపాలను చేపట్టకుండుటే తార్కాణమని వివరించారు.

వలస సిద్ధాంతం "బూర్జువాలు విముక్తి వుద్యమాలకు దూరమగుటలేదని, ప్రజలలో ప్రాబల్యం వుందని, జాతీయ నాయకత్వం స్వాతంత్ర్య వుద్యమానికి ద్రోహం చేయలేదని, జాతీయ బూర్జువావర్గానికి సామ్రాజ్యవాదానికి సహజ వైరుధ్య మున్నదనుటను, ఇండియాలో పెట్టుబడిదారి విధానాభివృద్ధికి సామ్రాజ్యవాదం అడ్డం కిగా వున్నంతవరకు, భారత బూర్జువావర్గమే సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో చోదక శక్తియనే వుదహరింపులను "నారాయణ్ వ్యతిరేకించారు." విముక్తి వుద్య మానికి, భారత జాతీయ బూర్జువావర్గం యిప్పటికీ ద్రోహం చేసిందని, తాను విశ్వ శించుతున్నానన్నాడు." చిత్తు సిద్ధాంత తీర్మానంలో మన దాడిని బూర్జువావర్గంపై కేంద్రీకరించక, నేటి ప్రధాన శత్రువులైన సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజాలపై కేంద్రీ కరించాలన్న ప్రతిపాదనను వ్యతిరేకించారు. కార్మికవర్గ పార్టీలను, కమ్యూనిస్టు పార్టీకి ప్రత్యామ్నాయ బహిరంగ వేదికలుగా స్థాపించుటను వ్యతిరేకించారు. రెండు ప్రత్యేక వర్గాలైన కార్మికులు, కర్షకులు వొకే పార్టీలో సంఘటితపరచుటను నారా యణ్ వ్యతిరేకించారు. తన వాదనను బలపరచుకొనుటకు తూర్పు దేశాల కార్మికుల కమ్యూనిస్టు విశ్వవిద్యాలయంలో స్టాలిన్ వుపన్యాసం నుండి సుదీర్ఘ, వుదహరిం పులు నిచ్చాడు. బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో, భారత్ బూర్జువావర్గం అప్పటికే ఒక కూటమిగ యేర్పడిందని, ఆ సంఘటనను బ్రద్దలు కొట్టుటకు, సామ్రాజ్యవాద వ్యతి రేక విప్లవ సంఘటనగా ఐక్య కార్మిక కర్షక పార్టీరూపంలో నిర్మించాలన్న స్టాలిన్

---

2. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర (1975), అధికారపత్రాలు. వా III C అధికారి ఉపోద్ఘాతం. పే. 403-404.

మాటలను పేర్కొన్నాడు[1]. కొమింటరును యీ పార్టీలు కమ్యూనిస్టుపార్టీపాత్ర తగ్గకుండా వుండునట్లు జాగ్రత్త వహించాలని తెలిపింది. జాతీయ కాంగ్రెసు బయట కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యంలో స్వతంత్ర కార్మిక కర్షక పార్టీని స్థాపించాలనే ఉద్దేశాన్ని ఆచరణలో పెట్టింది రాయ్ అని గుర్తుంచుకొనాలి. ఆచరణలో ఈ పార్టీలో గూడా ఒంటెత్తు పోకడులు వొచ్చాయి. "భారత్‌లో సోషలిస్టువిప్లవం అనే పరిభాషలో మాట్లాడుతు నారాయణ్ అతివాద, సెక్టేరియన్ దృక్పథంలో మాట్లాడుట స్పష్టమని[2]" అధికారి అన్నారు.

స్టాలిన్ 1925లో తూర్పుదేశాల కార్మికుల, కమ్యూనిస్టుల విశ్వవిద్యాలయంలో భారత కమ్యూనిస్టుల కర్తవ్యంగా "....(సామ్రాజ్యవాదుల, జాతీయవాదుల సంఘటనను విచ్ఛిన్నం చేయుటకై రాజీ బూర్జువా వర్గాలపై ఘన విమర్శన దాడిని ఎక్కుపెట్టి, వారిద్రోహాన్ని బయటపెట్టి, శ్రామికజనాలను వారి ప్రభావాన్నుండి వేరు చేయాలని[1]" స్పష్టంచేశారు. అదే వరవడిలో 6వ మహాసభ రాజకీయ సిద్ధాంతం సూచించింది. అవే భారతకమ్యూనిస్టుల ఆచరణ సాధారణ ఎత్తుగడలయ్యాయి.

**నూతన వలస సిద్ధాంతం :**

చర్చల అనంతరం ఆమోదించబడిన "నూతన వలస సిద్ధాంతం; బ్రిటిష్ దృక్పథానికి కొన్ని రాయితీలను యిచ్చినా, ప్రధానంగా రష్యన్ దృక్పథానికి న్యాయాన్ని చేకూర్చింది, చైనా అనుభవాన్ని ప్రతిబింబించింది. భారత విప్లవం వ్యవసాయ దశకు చేరినదనే దానిపై ఆధారపడి, మూడువర్గాల వ్యూహాన్ని చేబట్టింది. బూర్జువా జాతీయవాదం బలహీనపడుటతో, బ్రిటిష్ సామ్రాజ్యవాదము "భారత పారిశ్రామికాభివృద్ధిని అడ్డుకొను విధానాన్ని అవలంబించుట సాధ్యమైందని, సిద్ధాంతం తెల్పుతుంది. పేద రైతాంగం, పెటీ బూర్జువావర్గం, కార్మికవర్గ మిత్రులుగ నిర్వచించి, "పెటీ బూర్జువా మేధావివర్గంతోపాటు, పేదనగర పెటీ బూర్జువావర్గం చాల వరకు, చురుకైన విప్లవశక్తుల ప్రభావంలో ఉన్నాయని అంది. వ్యాపార బూర్జువా వర్గం, సామ్రాజ్యవాద పెట్టుబడి వర్గాల ప్రయోజనాలకు నేరుగా చైనాలోని "కంప్రెడరీ బూర్జువావర్గంలాగ సేవలందించుచున్నది. జాతీయ వుద్యమాన్ని, దేశ పారిశ్రామిక ప్రయోజనాల ప్రతిబింబించే బూర్జువావర్గం బలపరస్తూవుంది, అయినా "ప్రత్యేకవూగిసలాడే, జాతీయసంస్కరణవాదంగా చెప్పబడుతున్న వైఖరి"ని కలిగి వున్నదని సిద్ధాంతం చెప్పుతున్నది. బూర్జువావర్గం సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని సాగించాలనే కోరికవున్నా దానికి యింకే మాత్రం విప్లవకరపాత్ర లేదని అస్పష్టంగా సూచించగా, యిప్పుడు అది వ్యవసాయ విప్లవానికి శత్రువుగా నెంచుచున్నది. కమ్యూనిస్టు విధానం, బూర్జువా శత్రువర్గంపై బహుముఖ సంపూర్ణదాడిగా, సిద్ధాంతం ప్రధానంగా చెప్పుతుంది.

---

1, మార్టిషిన్, ఒ.వి. (1979) కొమింటర్న్ అండ్ ది యీస్ట్(ఆంగ్లంలో)మాస్కో- పే. 439-40.

2. అధికారి. జి. (1982) ఉపోద్ఘాతం. భారతకమ్యూనిస్టుపార్టీ చరిత్ర. అధికార పత్రాలు, (ఆంగ్లంలో) వా III C. పే. 410.

బూర్జువావర్గల యెడల కమ్యూనిస్టులు అవలంభించవలసిన ఎత్తుగడలేవి? ఆ వర్గంతో ఎట్టి సంఘటననైనా నిరాకరించుట, "తాత్కాలిక వొప్పందాలు", "తాత్కాలిక కలయికలను, నిర్థిష్ట సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రదర్శనలు" సందర్భంలో చేసు కొనవచ్చును. అయినా రాజకీయంగా, నిర్మాణ సంబంధంగా, అన్ని పెటీ బూర్జువా పార్టీలు, గ్రూపులనుండి, వేరుగా అత్యంత స్పష్టంగా, కమ్యూనిస్టు పార్టీలు "లక్ష్మణ రేఖ"ను యేర్పరచుకొనాలి. "పెటీ బూర్జువా పార్టీల, గ్రూపుల, జాతీయ కాంగ్రెసు లోని అతివాద వర్గాలందరితోసహా, వారి వూగిసలాటలను, చిత్తశుద్దిగా పాల్గొన జాలకపోవుటను కమ్యూనిస్టులు, అన్ని కార్యక్రమాల ఆచరణలో తీవ్రంగా విమర్శించుతూనే వుండాలి.[1]

ఆరవ కాంగ్రెసు తరువాతకూడ చర్చలు కొనసాగినా, నూతన పంథా,భారత దేశానికి నూతన వ్యూహం అవగాహనిచ్చింది. బూర్జువా జాతీయతను బలపరచే విధానాన్ని దీర్ఘకాలంగా అనుసరించుటకు వ్యతిరేకంగా కొమిటరను నిర్ణయించింది.వలస సిద్ధాంతాన్ని ఖండించింది. రాయ్ 1920 నుండి ప్రభావితం చేస్తున్న "వలస సిద్ధాంతాన్ని", నూతన సిద్ధాంతం వ్యతిరేకించింది.కొన్ని ప్రత్యేక ఎత్తుగడల సమస్యలపై మాత్రమే కొమిటరను విభేదించింది. కొమింటర్న్ కార్మిక, కర్షక పార్టీలను రద్దు చేయుటను కోరింది; రాయ్, బ్రిటిష్ పార్టీ రద్దును వ్యతిరేకించారు.అంతేగాక బ్రిటన్ రెండు పార్టీల విధానాన్ని అశక్తిగా ఆమోదించింది. రహస్య కమ్యూనిస్టు పార్టీ ఆధిపత్యంలోగల బహిరంగ కార్మిక, కర్షక పార్టీని కోరుతున్నది. నాటి పరిస్థితులలో చట్టబద్ధ, రాజకీయ విధానాలు రెండింటిని ఆచరించుటే తగినది. కార్మిక,కర్షక పార్టీ నిర్మాణమై ఆచరణలో పనిచేస్తున్నది. అందుకు కాలం, శ్రమ, ధనం వినియోగించబడింది. వాటిని రద్దుచేయ ప్రయత్నించుటలో ప్రతిఘటనను ఎదుర్కొనవలసి వచ్చుటయే, వాటికి కొంత రాజకీయ శక్తి గలదనుటను తెలియజేస్తున్నది. భారత కమ్యూనిస్టు వుద్యమానికి ప్రయోజనాల ప్రశ్నను వదలివేసి, ఇంటర్నేషనల్ కార్మిక, కర్షక పార్టీలను బలపరచుట మానివేయుటతో రష్యా వైఖరి నిర్ణయాత్మకమైందనుట స్పష్టమైంది.

ఆరవ కాంగ్రెసులో అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ కార్యవర్గ వలస సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టిన కుసినిన్ 30 సంవత్సరాల తరువాత సోవియట్ పార్టీ 20వ కాంగ్రెసులో వలసలు, అర్ధవలసలలో జాతీయ బూర్జువా వర్గాల గురించి ప్రస్తావించుతు, "నాటి వలస సిద్ధాంతంలో కొన్ని సెక్టేరియన్ పోకడలున్నాయని" అంగీకరించారు.

సంక్షిప్తంగా వలస సమస్య చర్చలలో ప్రధానంగా బూర్జువా వర్గాలపాత్ర, విప్లవాత్మకం, విప్లవవిద్రోహాత్మకం అనే రెండు దృక్పథాలు సంఘర్షించాయి.

---

1. జె నె డి ఓవర్ స్ట్రీట్, మార్షల్ విండ్ మిల్లర్ (1960) కమ్యూనిజం ఇన్ ఇండియా. పే. 119-20.

**విదేశ సలహాలలోని వైరుధ్యాలు :**

డిశెంబరు 1927లో జరిగిన జాతీయ కాంగ్రెసు మహాసభలో సంపూర్ణ స్వాతంత్ర్యం అన్న కోర్కెను తీర్మానరూపంలో ప్రతిపాదించిన కాంగ్రెసులోని అతి వాదవర్గాలకు విజయాన్ని సాధించారు. ఈ సమావేశానికి ఫిలిప్‌స్ప్రాట్, ఆర్. ఎస్. నింబకర్, కె.యస్. జోగ్లేకర్‌లు కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధులుగా హాజరై సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానాన్ని, యుద్ధ ప్రమాద తీర్మానాన్ని, సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రపంచ లీగ్‌లో కాంగ్రెసును అనుబంధసంస్థగా చేర్చాలనే జవహర్‌లాల్‌నెహ్రూ ప్రతిపాదనలను బలపరచారు.

"సైమన్ కమిషన్" బహిష్కరణోద్యమంలో కార్మిక, కర్షక తదితర ప్రజా సామాన్యంలో సామ్రాజ్యవాద వ్యతిరేకత ప్రబలి, అశాంత పరిస్థితులు ఏర్పడినవి. పారిశ్రామిక అశాంతి ప్రబలి 1928-29లో 203 సమ్మెలు, 316 లక్షల పనిదినాలను పరిశ్రమలు కోల్పోయాయి. భారత రాజకీయాలు అతివాదమార్గంవైపు కొంత మొగ్గు దలను, పబ్లిక్ సేఫ్టీబిల్లు" యెడల జాతీయవాదుల స్పందన ముఖ్యంగా మితవాద నాయకులైన మదన్‌మోహన్ మాలవ్యా, శ్రీనివాస అయ్యంగార్, మోతీలాల్ నెహ్రూలు కేంద్ర శాసనసభలో తీవ్రంగా వ్యతిరేకించుట తెలియజేస్తుంది.

భారత కమ్యూనిస్టులకు మిత్రులెవరు! అనే సమస్య ఎదురైంది. మద్రాసు కాంగ్రెసు మహాసభలో సంపూర్ణస్వాతంత్ర్య తీర్మానాన్ని ఆమోదించి భారతరాజ్యాంగపు చిత్తును రూపొందించుటకు అఖిలపక్ష సమావేశాన్ని యేర్పాటు చేయుటకు నిర్ణయించింది అట్టి సమావేశం ఫిబ్రవరి 1928లో ఢిల్లీలో జరిగినపుడు, భారతదేశ సంపూర్ణ స్వాతంత్ర్యంపై తీవ్ర వ్యతిరేకతయేగాక, అత్యధికులు అధినివేశ ప్రతిపత్తి లక్ష్యంగా వున్నారని తేలింది. హిందూ ముస్లిం మత సమస్యతో ముడివడి సంక్షోభంలో పడింది. మోతీలాల్‌నెహ్రూ అధ్వర్యంలో యేర్పడిన సబ్‌కమిటి సంపూర్ణ స్వాతంత్ర్యంకాక అధినివేశ ప్రతిపత్తిని ధ్యేయంగా ప్రకటించింది. సోవియట్ యూనియన్ సందర్శించి, అప్పుడే వచ్చిన శ్రీనివాస అయ్యంగారు, "అధినివేశ ప్రతిపత్తిని ఆమోదించుట ఆత్మహత్యా సాదృశ్యమన్నారు". జవహర్‌లాల్‌నెహ్రూ సుభాస్‌చంద్రబోసులతో అయ్యంగారు కలసి, స్వాతంత్ర్య భారత్‌లీగ్ - ఇండియా లీగ్‌ను యేర్పాటుచేసి, నవంబరు 1928లో "సంపూర్ణ స్వాతంత్ర్యం, సామాజిక, ఆర్థిక సమానత్వ సమాజ నిర్మాణం ధ్యేయంగా" ప్రకటించారు. లీగ్ భారత జాతీయ కాంగ్రెసులోని అతివాద వర్గాలకు ప్రాతినిధ్యం వహించుతున్నదనుటలో సందేహం లేదు. భారత కమ్యూనిస్టులు లీగు, దాని కార్యక్రమాలవట్ల ఆసక్తి కనబరచారు.

అదే విధంగా, యీ కాలంలోని మరో ముఖ్య పరిణామం, కార్మిక, కర్షక పార్టీల స్థాపన, పంజాబ్, యు పి., బెంగాలులలో జరిగింది. అఖిల భారత కార్మిక, కర్షక పార్టీ సమావేశం అక్టోబరు 1928లో కలకత్తాలో సోహన్‌సింగ్‌జోష్ అధ్యక్షతన జరిగింది. సమావేశం ఆమోదించిన "సిద్ధాంతపత్రం"లో కమ్యూనిస్టు నాయకులు "బహిరంగ చట్టబద్ధ ప్రజాసంస్థను, కార్మిక, కర్షక పార్టీ నిర్మాణాన్ని ఆమో

దించి, అట్టి నిర్మాణాన్ని చేబట్ట నిర్ణయించారు. "సిద్ధాంత పత్రం" కమ్యూనిస్టు పార్టీ ప్రస్తావన వదలి, "దేశంలోని అన్ని విప్లవ ప్రజాశక్తులను ఐక్యంచేసి, నాయకత్వం వహించి నడపగలిగినది, సరియైన రాజకీయ విధానం కలది కార్మిక, కర్షక పార్టీ" యని వాక్కాణించింది. "జాతీయ కాంగ్రెసులో, అతివాద వర్గంగా కార్మిక, కర్షక పార్టీ పనిచేస్తుందని కూడ" సిద్ధాంత పత్రం స్పష్టం చేసింది. సాంప్రదాయంగా, అతి వాద వర్గాలు కాంగ్రెసులో పనిచేస్తున్న విధంగానే,అభివృద్ధి నిరోధక నాయకత్వాన్ని బహిరంగంగా విమర్శించుతు, విప్లవ పోరాట కార్యకర్తలను ఆకర్షించి నిర్మాణరీత్యా బలపడునట్లు పని చేస్తుంది. ఈ విధానం తక్షణ తాత్కాలికమైనది. జాతీయ కాంగ్రెసులో ఆధిక్యతను సంపాదించి, నాయకత్వాన్ని పట్టుకొనగలిగినంతవరకు, స్వతంత్ర బలమైన కార్మిక, కర్షకపార్టీ నిర్మాణ లక్ష్యం సాధించువరకు కాంగ్రెసులో వుండే ఆందోళన చేస్తుంటుంది.

ఈ విధానం, 6వ అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ "వలస సిద్ధాంతానికి" పూర్తి వ్యతిరేకంగా ఉంది, అందుకు ప్రధాన కారణం,కొమింటరను నుండి సరియైన నిర్దిష్ట విధానం అందకపోవటగా నెంచబడింది. ఫిలిప్‌స్ప్రాట్ తన జ్ఞాపకాలలో డిశెంబరు, 1928లో జి. యం. అధికారి యూరపునుండి భారతదేశానికి వచ్చువరకు, భారత కమ్యూనిస్టులకు, ఇంటర్నేషనల్‌తో నేరుగా సంబంధాలు లేకుండుట" యని తెలిపారు. పత్రికలలో వచ్చిన సంక్షిప్త వార్తలనుబట్టి కొమింటరనులో కార్మిక, కర్షకపార్టీ యెడల వైఖరిలో మార్పు వస్తున్నట్లు భారత కమ్యూనిస్టు నాయకులు గ్రహించారనికూడ తెలియజేసారు. కార్మిక, కర్షకపార్టీ, కలకత్తా సమావేశం మూడో రోజున, కొమింటరను కార్యవర్గంనుండి, "స్వతంత్ర లీగ్" ప్రకటించిన "రాజకీయ వేదిక" పెటీ బూర్జువా మేధావి వర్గాల, గ్రూపుల అస్పష్టతను, గందరగోళత"నాన్ని తెలియ చేస్తున్నందున దానితో ఎట్టి సంబంధాన్ని పెట్టుకొనరని అనుకొంటున్నామని తెలుపుతు లేఖ చేరింది. లీగ్‌తో ఎట్టి మైత్రి, సహకారం కార్మిక, కర్షకపార్టీ నెరపుట నిషేధించబడింది. అయితే, భారత కమ్యూనిస్టులు, కొమింటరను లేఖను పరిగణలోనికి తీసుకొనలేదు. కొమింటరను సూచనలను, స్వతంత్ర లీగుతో ఎట్టి సంబంధాలను కలిగియుండుట, నిషేధించబడుట, కార్మిక, కర్షకపార్టీని రద్దుచేయాలనే నిర్ణయాలను అధికారి స్వయంగా తీసుకొని వచ్చారు. బహుశా భారత కమ్యూనిస్టు నాయకులు అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీలో 'మౌలిక వ్యూహం'పై స్టాలిన్, బుఖారిన్‌ల మధ్య తీవ్ర అభిప్రాయలుండుట, అవి పరిష్కరింపబడకుండుట, అదే విధంగా మరో ఆరు మాసాలు కొనసాగగలవనే అవగాహన వుండుట వలనే, కొమింటరను సూచనలు, తాత్కాలికంగా ప్రక్కకు నెట్టబడినాయి అనుటకు ఆధారం కన్పడుతున్నది. మరో విషయం, భారత కమ్యూనిస్టు పార్టీకి స్ప్రాట్, బ్రాడ్లీలద్వారా సహకార సూచనలను అందిస్తున్న బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీ, కార్మిక కర్షకపార్టీ యెడల కొమింటరను తీసుకొన్న వైఖరిని ఆమోదించలేదు. ఆరవ కాంగ్రెసు తరువాత క్లెమెన్స్‌దత్ పి. సి. జోషికి "కార్మిక కర్షకపార్టీలో వాస్తవ కార్మికవర్గ కార్యకర్తలను సమీకరించుచున్నారని నేను అనుకొంటున్నాను[1]" అని లేఖలో వ్రాసారు.

---

1. జెనెడి ఓవర్‌స్ట్రీట్, మార్షల్ లింఢ్ మిల్లర్(1960) కమ్యూనిజం ఇన్ ఇండియా పే. 130లోని ఉదహరింపు.

అంతేగాక చైనాలో సంక్షోభం "తరువాత, రాయ్ అవగాహన భారత కమ్యూనిస్టులకు స్పష్టంగా తెలిసినట్లు లేదు. అప్పుడు కొమింటాంగ్ పార్టీలోని బూర్జువా జాతీయవాదులను స్టాలిన్ బలపరచుటను, భారతదేశంలో బూర్జువా జాతీయవాదులతో సహకార, మైత్రిత్వాలను నామమాత్రంగా వ్యతిరేకించు వైఖరి చేబట్టుట, భారత కమ్యూనిస్టు వర్గాల పరిధిలోనికి వచ్చినట్లు కన్పించదు. ఆరుమాసాలు తరువాత భారత కమ్యూనిస్టులకు, బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీనుండి సలహా, సూచనలు, అదే విధంగా రాయ్‌నుండి అందుతూవున్నవి. ఆ సలహాలు, సూచనలు, పరస్పర వైరుధ్యాంశాలను కలిగివుండుటయేగాక, కొమింటరను పంథాను స్పష్టంగా భేదించుచున్నవి.

మార్చి 1929లో బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీ, భారత కమ్యూనిస్టు పార్టీ, కార్మిక కర్షకపార్టీలను రద్దు చేయకుండా కొనసాగించుటను, "లేబరు మంత్లీ "లో ఆ పార్టీ రాజకీయ సిద్ధాంతపత్రాన్ని ప్రకటించి, బలపరచింది. పైగా 6వ కొమింటరను కాంగ్రెసులో "కార్మిక కర్షకపార్టీ రాజకీయ సిద్ధాంతపత్రంలోని అంశాలు చర్చించ పడలేదని విమర్శించుట తెలికే, కాని భారత సమస్య, భారత పారిశ్రామికీకరణ, దానిలో యిమిడివున్న భయ, ఆందోళనలు, బ్రిటన్‌కు ఆసక్తికరమైన ప్రధానాంశాలు, భారతదేశంలో అభివృద్ధి చెందుతున్న నూతనోద్యమాన్ని శ్రద్ధగా పరిశీలించే విధంగా చేస్తుంది. ఈ విధంగా భారతదేశం యెడల మరింత శ్రద్ధ వహించాలని బ్రిటిష్ కమ్యూనిస్టులకు రష్యా హెచ్చరికగా తలంచవచ్చును.

బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ, భారతకమ్యూనిస్టులు స్వతంత్రలీగ్‌తో ఎట్టి మైత్రి సహకార విధానాన్ని చేబట్టుట ఆమోదించలేదు. క్లెమెన్స్‌దత్ జనవరి 1929 లేబర్ మంత్లీలో లీగ్ విప్లవ సోషలిజానికి ప్రాతినిధ్యం వహించదని, సంస్కరణవాద సామాజిక ప్రజాస్వామ్యానికి అంకితమైనదని వ్రాశారు. స్వతంత్ర లీగ్ ప్రజల అభిమానాన్ని పొందజూసే జాతీయ బూర్జువాల ప్రయత్నమని. కార్మిక, కర్షక పార్టీ ప్రత్యర్థియని, బూర్జువాలు పోగొట్టుకొంటున్నదానిని నిలుపుకొనే ప్రయత్నమని వ్రాశారు[1].

సంక్షిప్తంగా బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ, కార్మిక కర్షక పార్టీ కొనసాగించమని భారత కమ్యూనిస్టులకు సలహాయిచ్చింది. అంతేగాక స్వాతంత్రలీగ్‌తో ఎట్టి మిత్రత్వం నెరపరాదనికూడా గట్టిగా సలహానిచ్చింది.

రాయ్ అభిప్రాయాలు 1928-29లలో కొమింటరను అభిప్రాయాలకు అనుగుణంగా లేకపోవుటయేగాక పరస్పర విరుద్ధంగా వున్నవి[2]. అంతేగాక అవి అధికార కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ పత్రికలో ప్రచురించుట మరింత అస్పష్టతను, గందరగోళాన్ని కలుగజేసినవి.

---

1. జె నె డి ఓవర్ స్ట్రీట్, మార్షర్ విండ్ మిల్లర్ (1960) కమ్యూనిజం ఇన్ ఇండియా పే. 131లోని ఉదహరింపు
2. అదే పే. 132

ఆగస్టు 1928లో 6వ, కొమింటరను సమావేశాలు జరుగుతున్నప్పుడే, ఇంపికార్‌లో ప్రకటించిన వ్యాసంలో రాయ్ అతివాద కార్యవర్గ సిద్ధాంత పత్రాన్ని ఆమోదించి, వార్గా అవగాహనలను బలపరచి, తదనంతరం క్లెమెన్స్‌దత్ బ్రిటీష్ కమ్యూనిస్టు అభిప్రాయాలతో ఏకీభవించాడు. వ్యాసం ప్రథమ భాగంలో భారతీయ విప్లవంలో వివిధ వర్గాల పాత్ర విషయంలో అతివాదులతో అంగీకరించాడు. "బూర్జువా నాయకత్వం ద్రోహం కారణంగా పెటీ బూర్జువా కార్యకర్తలు, వర్గాలు వారికి దూరమగుటకు అవకాశాలు చాల తక్కువని, వారు యింకా విద్రోహ సంస్కరణవాద నాయకుల ప్రభావంలో వారి నాయకత్వాన్నే అనుసరించుతున్నారని" వ్రాశారు. రాయ్ ఉత్తరభాగంలో వెలిబుచ్చిన అభిప్రాయాలు వార్గా కేంద్ర కార్యవర్గ అభిప్రాయాలకు దగ్గరగావున్నవి. ఆ వెంటనే కార్మికవర్గ స్వతంత్ర కార్యాచరణ, పెటీ బూర్జువా అతివాద జాతీయవాదులు విరుద్ధ అభిప్రాయాలతోచీలి, దూరమగుచున్నారని పేర్కొన్నారు. ఒకరు కార్మిక కర్షక పార్టీ విప్లవ మిత్రులుగ, మరొకరు వేగంగా ఫాసిజం వైపు "సుభాస్‌చంద్రబోస్ నాయకత్వంలో పయనిస్తున్నారు" అని తన వ్యాసాన్ని "వర్గశక్తులు ఈ విధంగా గ్రూపులుగ పునరీకరణ సామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవ పోరాటాలకు, స్వాతంత్ర్య పోరాటాలకు నాందియని"[1] ముగించారు. రాయ్ దృష్టిలో ఒక విధంగా వార్గా విధానం సరియైనది మరోవిధంగా క్లెమెన్స్‌దత్ అవగాహన సరియైనది. సోవియట్ కమ్యూనిస్టుపార్టీలో కొమింటరనులో జరుగుతున్న అంతర్గత పోరాటంలో రాయ్ యే నిర్ణయానికి రాలేదు. స్టాలిన్, బుఖారిన్‌ల పోరాటం నాలుగు మాసముల తరువాత తేలిపోవుటతోనే రాయ్ తన విధానాన్ని నిర్ణయించుకొనుట జరిగింది.

సంగ్రహంగా రాయ్ కొమింటరనుతో ఎప్పుడూ అతివాదిగవున్నా 30 దశకం చివరలో కొమింటరను, బ్రిటిష్ కమ్యూనిస్టు అవగాహనలకు, మితవాద వైఖరిని అవలంభించాడు. వార్గా 1928 వసంతకాలంలోని వ్యాసం కొమింటరను అతివాదం వైపు మొగ్గుటను సూచించింది. భారత కమ్యూనిస్టుపార్టీ మార్గదర్శకం వహిస్తున్న బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ అతివాదంవైపు మొగ్గుటకు యిష్టపడలేదని క్లెమెన్స్‌దత్ వ్యాసం స్పష్టం చేస్తున్నది. చర్చలు కొనసాగుతున్నప్పుడు రాయ్ యేవైపు మొగ్గక వేచియున్నాడు. ఆరవ కొమింటరను కాంగ్రెసులో అతివాదులు విజయాన్ని సాధించినా, మితవాద ప్రత్యర్థివర్గం పూర్తిగా ఓడిపోలేదు. దాని గొంతు నొక్కివేయబడలేదు. బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ భారతదేశంలో మితవాద ఎత్తుగడలనే అనుసరించుచున్నది. ఆరవ కాంగ్రెసు తరువాత రాయ్ మితవాదంవైపు పయనం ప్రారంభించాడు. 1929 ప్రారంభానికి స్వాతంత్ర్యలీగ్‌ను బలపరచుటతో బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీ వైఖరికంటె, రాయ్ అవగాహన మరింత మితవాద వైఖరిగా స్పష్టమైంది.

---

1. రాయ్, యం.యన్.(1928)"ది ఇండియన్ కాన్స్టిట్యూషన్" ఇంప్రికార్ VIII (ఆగస్టు 24, 1928) పే. 954. కమ్యూనిజం ఇన్ ఇండియా"లో ఓవర్‌స్ట్రీట్, మిల్లర్‌లు పే. 131 పే. ఉదహరింపు.

రాయ్ వైఖరిని అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీలో తన పూర్వ స్థానాన్ని పునరుద్ధరించుకొనుటకు వేచియున్నాడనుకొనుట, స్టాలిన్-బుఖారిన్ వివాద ఫలితాలను వూహించుట రాయ్‌కి న్యాయం చేకూర్చుట కాజాలదు. భారతదేశంలో నెహ్రూ నాయకత్వంలో అతివాదులు విజయం పొందుట విప్లవకర పాత్రను వహించగల అవకాశాలుండుట ప్రధానంగాను, తదితర పరిణామాల ప్రభావం కారణమై వుండవచ్చు. భారతదేశ పరిస్థితి, రాజకీయ వాస్తవ పరిస్థితుల రాయ్ విశ్లేషణ, 1928 తరువాత కొమింటరను విశ్లేషణకంటె వాస్తవ పరిస్థితులకు దగ్గరగా వుంది. కొమింటరను 10వ ప్లీనంలో ఇండొనేషియా ప్రతినిధి ముస్సో "రాయ్ మన కామ్రేడ్ కాదు, గాంధీ కామ్రేడ్ లేక బ్రాండ్లర్, థాల్‌హేమర్‌ల కామ్రేడ్" అని విమర్శించుట జరిగింది, కాని ప్లీనం రాయ్‌ని బహిష్కరించలేదు. ఇంప్రికార్, డిశెంబరు 1929లో క్రింది విధంగా ప్రకటించబడింది. "కొమింటరను 10 ప్లీనం తీర్మానం ప్రకారం 19 డిశెంబరు 1929 కేంద్రకార్యవర్గ ప్రెసిడియం ప్రకారం బ్రాండ్లియర్ నిర్మాణ సంస్థను అనుసరించుచు, ఆ పత్రికలకువ్రాసేశారు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యవర్గపు ప్రెసిడియం సభ్యులుగ వుండజాలరు. రాయ్ బ్రాండ్లియర్ పత్రికలకు వ్యాసాలు వ్రాసి తనంతట తానుగా కమ్యూనిస్టుపార్టీ ఇంటర్నేషనల్ బయట స్థానాన్ని పొందినందున, ఇంటర్నేషనల్ నుండి బహిష్కరింపబడినవానిగా పరిగణించబడింది. కొమింటరను 6వ కాంగ్రెసుకు వెళ్ళిన భారత ప్రతినిధులెవ్వరికి భారత కమ్యూనిస్టుపార్టీ ఆమోదముద్రలేదు. అందులో వొకరుమాత్రమే సౌమ్యేంద్రనాధ్ ఠాగూరు రాయ్‌ని నిరసించుతు మాట్లాడాడు. ఒకేవొక భారత ప్రతినిధి తిరిగివచ్చాడని, మిగతావారిని బ్రిటిష్ సి.ఐ డీలుగ అనుమానించి, అదేవిధంగా వారిపై చర్య తీసుకొన్నారని, రాయ్ "అవర్ డిఫిరెన్సెస్" అనే పుస్తకంలో పేర్కొన్నారు. అంతేగాక కొమింటర్న్ ప్రెసీడియం, డిశెంబరు 1929లో బహిష్కరించకముందు రాయ్ బ్రాండ్లియర్ పత్రికలలో ఒక్కవ్యాసంకూడ ప్రచురించలేదు. తరువాతే బ్రాడ్లియర్ జర్మన్ పత్రికలలో వ్యాసాలు ప్రచురించారు.

ఈ సంక్లిష్టస్థితిలో యం.యన్. రాయ్ ఇంటర్నేషనల్‌లోని పాత్రపై చివరి వాక్యం, కమ్యునిస్టు ఇంటర్నేషనల్ పురాతన పత్రాలు అందరికి పరిశీలనకుప్రవేశం యివ్వబడిన తరువాత మాత్రమే వ్రాయబడుతుంది. స్టాలిన్ విధానాలను తీవ్రంగా ఖండించి, దశాబ్దాలు గడిచినా అవి యీ మధ్యనే పరిశీలనకు అందుబాటులో వుంచారని తెలుస్తున్నది, బహుశా కొంతకాలం తరువాత ఎవరైనా అసలు కథనం వ్రాయవచ్చు. అంతవరకు వేచివుందాము.

## భారత కమ్యూనిస్టుపార్టీలో ఐక్యతా పునరుద్ధరణ :

అతివాదధోరణిలో పార్టీ విచ్ఛిన్నత వొకవైపు జరుగుతున్నది. మరోవైపు గాంధీ-ఇర్విన్ వొడంబడికకు వ్యతిరేకంగా కరాచీ కాంగ్రెసులో అతివాద జాతీయవాదులను సమీకరించే ప్రయత్నాలు జరిగాయి. సమ్మె పోరాటాలలో చొరవ, సాహసము కనబరచిన కార్మిక యువకులకు, పార్టీ శిక్షణ యిచ్చి, పార్టీ సభ్యత్వాలు యిచ్చారు. యువకార్మిక సమితులను వివిధ ప్రాంతాలలో యేర్పరచారు.

కమ్యూనిస్టు పార్టీ నూతన నాయకత్వం అనుసరించిన అతివాద ధోరణి ఫలితంగా ట్రేడు యూనియన్ రంగంలో డిశెంబరు నాగపూరు చీలిక అనంతరం, తిరిగి 1931 జులై కలకత్తా సమావేశంలో కమ్యూనిస్టులు ఎ. ఐ. టి. యు. సి. నుండి బయటకుపోయి రెడ్‌ట్రేడు యూనియన్ సెంటర్‌ను చీలిక కార్మిక సంఘాలను యేర్పాటు చేయుట, కార్మికవర్గంలో అనైక్యతకు తమ వంతు పాత్రను నిర్వహించుట తప్ప మరొకటి కాదు. అందులో చీలికకు ప్రధాన కారణం, ఎ.ఐ.టి.యు.సి. ని అంతర్జాతీయ ట్రేడు యూనియన్‌కు అనుబంధసంస్థగా చేర్చు సమస్యపై వచ్చిన వివాదం అగుట దురదృష్టకరము, అతివాద ఒంటెత్తు పోకడల ఫలితంగా జరుగుట నగ్నసత్యం. అంచేతనే భారత కమ్యూనిస్టు వర్గాలు జాతీయవర్గాల నుండేగాక, జాతీయ తదితర అతివాద వర్గాలనుండి వేరై వొంటరి వారగుటకు స్వయంకృతాపరాధమే కారణంగా కన్పడుతున్నది. ఈ పరిస్థితినుండి బయట పడుటకు ఐక్యతా పునరుద్ధరణకు పార్టీ, తదితరులు చేసిన ప్రయత్నాలను అధ్యయనం చేయవలసివుంది.

కరాచి జాతీయ కాంగ్రెసు మార్చి 1931 మహాసభ ముందే, నవంబరు-డిశెంబరు 1930లో అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ పత్రిక ఇంప్రికార్‌లో ప్రకటితమైన "భారత కమ్యూనిస్టు పార్టీ కార్యాచరణ వేదిక ముసాయిదాను" భారత కమ్యూనిస్టు వర్గాలు, కాంగ్రెసు మహాసభ ప్రతినిధు లందరికి విస్తారంగా పంపిణీ చేసారు. జాతీయవాదులలోనేగాక, కమ్యూనిస్టు వర్గాలలో దానిపై విస్తారంగా చర్చలు కొనసాగాయి. కార్యాచరణ వేదిక ముసాయిదాలోని ముఖ్యాంశాలు యీ క్రింది విధంగా వున్నవి.[1]

అవి ; 1) బ్రిటిష్ ప్రభుత్వం మన దేశాన్ని బానిసత్వంలోనే కొనసాగించుటకు సంస్థానాధీశులు, రాజులు, జమీందారులు, భూస్వాములు, వడ్డీ వ్యాపారులు, వ్యాపారులపై ఆధారపడుతూ, జాతీయ బూర్జువావర్గపు సహాయాన్ని పొందుతున్నది. 2) కాంగ్రెసు యెడల ప్రజలు భ్రమలను కలిగియున్నారు. 3) గాంధీజీ 11 అంశాల కార్యక్రమం, ఛాంబర్సు ఆఫ్ కామర్సు మితవాద కార్యక్రమము. 4) జాతీయ కాంగ్రెసు ప్రజాపోరాటాలను బ్రిటిష్ రాజ్యాంగం అసెంబ్లీలకు పరిమితం చేయు ప్రయత్నాలను, అతివాద వర్గాలు తమ శక్తినంతా వినియోగించి వ్యతిరేకించుచున్నారు. 5) జాతీయ విప్లవవర్గాలు బూర్జువా పాలన, బూర్జువా ప్రభుత్వం కొరకు పోరాడుతుండగా, కమ్యునిస్ట్ పార్టీ కార్మిక, కర్షక, ప్రజాస్వామిక నియంతృత్వం, భారత ప్రభుత్వం కొరకు పోరాడుతున్నది. 6) ఈ పోరాటపు ప్రధాన నాలుగు లక్ష్యాలు 1) సంపూర్ణ స్వాతంత్ర్యం 2) సోవియట్ల ప్రభుత్వ నిర్మాణం 3) భూమి, అడవులు అన్నిటిని ( భుత్వం స్వా నం చేసుకొనుట 4) 8 గంటల పని దినమును నిర్ణయించుట పేర్కొనదగినవి. 8) భారత విప్లవ విజయానికి అత్యంత నష్టదాయకము, ప్రమాదకరమైనది, జాతీయ కాంగ్రెసులోని అతివాదవర్గాలు, నెహ్రూ, బోస్ తదితర అతివాద వర్గాలు చేయు ప్రచారము. ఇండియా ఇండిపెండెంటు లీగులాంటి వాటిని వీరు మరోసారి యేర్పాటు చేసి, ప్రజా సామాన్య కార్యకర్తలను తప్పుదారిని పట్టించ

1. గైడ్‌లైన్స్ ఆఫ్ ది హిస్టరీ ఆఫ్ ది కమ్యునిస్ట్ పార్టీ ఆఫ్ ఇండియా (1974)సి.పి.ఐ, కేంద్ర పార్టీ ఎడ్యుకేషనల్ డిపార్టుమెంటు ప్రచురణ. పే.34.

కుండా వుండగలందులకు, వారిపై తీవ్రవిమర్శ గావించి వారి విధానాలను బట్టబయలు చేయాలి, యిదే ప్రధాన కర్తవ్యం. కార్మిక, కర్షక, యితర ప్రజా సామాన్యంనుండి అతివాద, జాతీయ, సంస్కరణవాదులను వేరు చేయుటకు వారిపై నిర్దాక్షిణ్య పోరాటం సాగించాలి

కార్యాచరణ వేదిక ముసాయిదా తీవ్ర వొంటెత్తు పోకడల అవగాహనలను కలిగివున్నందున, కమ్యూనిస్టువర్గాలు జాతీయోద్యమంలో పాల్గొన పిలుపు యివ్వనందున, కాంగ్రెస్ నాయకత్వం యెడల అసహన విధానాన్ని ముఖ్యంగా జాతీయోద్యమంలోని అతివాద వర్గాల యెడల చేబట్టినందున, కమ్యూనిస్టు నాయకత్వ వర్గాలు జాతీయోద్యమంలో పాల్గొననందున ప్రజలనుండి వేరుపడిపోవుట జరిగింది బొంబె కమ్యూనిస్టు పార్టీ జూన్ 1930లో కార్యాచరణవేదిక ముసాయిదాపై వ్యాఖ్యానించుతూ "కాంగ్రెసు యెడల పూర్తి వ్యతిరేక విధానాన్ని అవలంబించి ఉద్యమాన్ని పూర్తిగ కాంగ్రెసుకే వదలివేయుట జరిగింది అప్పుడప్పుడు కరపత్రాలను పంపిణీ చేయు గ్రూపుగా వుండిపోయాము,[1]" అని పేర్కొని వాస్తవాన్ని తెలియజేసింది ఈ కారణంగా కార్మికవర్గంలోకూడ కాంగ్రెసే జాతి స్వాతంత్ర్యంకై పోరాడుతుందనే అభిప్రాయాన్ని కలుగజేయుట జరిగింది కార్మికవర్గంలో, జాతీయోద్యమంలో కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం అంటే, కార్మిక, కర్షక నాయకత్వాన్ని నెలకొల్పుట పార్టీ ధ్యేయమైంది. కాని పార్టీ ఆచరణ, పోరాటక్రమంలోనే అట్టి నాయకత్వం లభించ గలదనే మౌలికసూత్రాన్ని పాటించనందున, పూర్తి వ్యతిరేక ఫలితాల నిచ్చింది పార్టీ ప్రజలనుండి వేరుపడిపోయింది.

కలకత్తా కమ్యూనిస్టు పార్టీ కమిటి అతివాద విచ్ఛిన్న కరచర్యలు, అనైక్యత అవగాహనల నుండి కొంతవరకు బయటపడి ఐక్యతా పునర్నిర్మాణానికి అన్ని పార్టీ బృందాలకు పిలుపు నిచ్చింది. మీరటు కుట్రకేసు నిందితులు 18 మంది కమ్యూనిస్టు నాయకులు జైలు నుండి ఐక్యత కొరకు వొక సంయుక్త ప్రకటన చేసారు.[2] సంగ్రహంగా ప్రకటనలోని అంశాలు : 1. మీరట్ అరెస్టుల నాటికి పార్టీ, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ లో చేరలేదు. 2. వలసలలో కార్మిక విప్లవానికి ముందు, బూర్జువా ప్రజాస్వామ్య విప్లవం రావలసివుంది. భారత విప్లవం స్వాతంత్ర్యాన్నేగాక, ఫ్యూడలు శక్తులపై విజయాన్ని పొందవలసి వుంది. స్వతంత్ర ప్రజాస్వామ్య రిపబ్లిక్‌ను యేర్పరచవలసివుంది. 3. బూర్జువావర్గం, కార్మిక, కర్షక, నగర బడుగువర్గాలు, పెటీ బూర్జువా విప్లవశక్తులు, సామ్రాజ్యవాదం దాని మిత్రులు సంస్థానాధీశులు, భూస్వాములు, విప్లవ వ్యతిరేక శక్తులు, పైవర్గాలతో స్వామి భక్తిపరాయణులు పొగిస లాడుతు వుంటారు. 4. బ్రిటిష్ సామ్రాజ్యవాద విముక్తి, ఫ్యూడలు వ్యతిరేక వ్యవసాయ విప్లవం, కార్మిక కర్షక నియంతృత్వంలో సోవియట్ల నిర్మాణం, 6వ ఇంట

---

1. హెడ్‌లైన్స్ అఫ్ ది హిస్టరీ ఆఫ్ ది కమ్యూనిస్టు పార్టీ అఫ్ ఇండియా: పే. 35.
2. అదే. పే. 37.

ర్నేషనల్ వలస సిద్ధాంత అవగాహన, కమ్యూనిస్టుల ముఖ్య కర్తవ్యం. 5. భారత్ కార్మిక, కర్షక రిపబ్లిక్ సోషలిస్టు రిపబ్లిక్‌కాదు. దాని విధానం పెట్టుబడిదారేతర పారిశ్రామిక విధానం, తదుపరి సోషలిస్టు ప్రభుత్వంగా పరిణామం చెందుతుంది. 6. సోవియట్ల యేర్పాటు తక్షణ కర్తవ్యం కాదు. కార్మికులు తమ మిత్రులకు బూర్జువా ప్రజాస్వామ్యం, కృత్రిమ బూర్జువా విప్లవ పోరాటాల నగ్న స్వరూపాన్ని తెలియజేసి వాటి యెడల విముఖులగునట్లు చేయాలి. ఈ ప్రకటన, ఈ అంశాల వివేచన నూతన అవగాహన దశకు దారితీసింది.

ఈ సందర్భంలో "కార్యాచరణ వేదిక ముసాయిదా" విషయమై గయా ప్రసాద్ సింగ్ కేంద్ర" లెజిస్లేటివ్ అసెంబ్లీలోని స్టార్డ్ ప్రశ్నకు సమాధానంగా సర్ హెన్రీక్లార్క్, భారత కమ్యునిస్టుపార్టీ "కార్యాచరణ వేదిక ముసాయిదా"లోని అంశాలు అంటూ పేర్కొన్నవాటిలో "బలప్రయోగంతో బ్రిటిష్ పాలనను అంత మొందించుట", "నేటి సమాజవ్యవస్థను బలప్రయోగంతో కూలద్రోయుట", "భారత దేశ స్వాతంత్ర్యాన్ని సాయుధ విప్లవం ద్వారా సంపాదించుట" తక్షణ ధ్యేయాలుగ వున్నవని సమాధానం చెప్పాడు[1]. అని పేర్కొనవలసివుంది. అంతేగాక కార్యాచ రణ వేదికలోని మూడు అంశాల కర్తవ్యాలను పేర్కొని; ధ్యేయాన్ని సాధించుటకు నాలుగు పద్ధతులను లేక విధానాలను వివరించారు.

"మీరట్ ఖైదీలు 1931కి నాటి ఎత్తుగడల ఫలితంగా పార్టీకి కలిగిన విపరీత నష్టాన్ని పరిగణలోనికి తీసుకొన ప్రారంభించారు. ఫిలిప్స్‌స్ప్రాట్, జరిగిన నష్టాన్ని గుర్తించారు. కాని మా విమర్శనదాడిని కొమింటరనుపై కేంద్రీకరించక జయిలు బయటవున్న పార్టీ నాయకులమధ్య, ప్రధానంగా రణదివె, దేశపాండేల తగాదాలపై కేంద్రీకరించాము. జోషి యీ తగాదాలను అర్థంచేసుకొని, సందేహాలను వెలి బుచ్చాడు. డాంగేకూడ కొమింటరను ఎత్తుగడలవలన జరిగిన నష్టాన్నిగుర్తించివుండ వచ్చు కాని జయిలులో వచ్చిన తగాదాల కారణంగా అతనిని పార్టీనుండి బహిష్క రించాము. మీరట్ జైలులోవున్న కామ్రేడ్స్ ఎత్తుగడలలో మార్పు అవసరమని గుర్తించాము. పరిస్థితులను విశ్లేషణ గావించి, రహస్యంగా కొమింటరనుకు పంపించి దానిని బహిరంగ లేఖగా ప్రకటించమని విజ్ఞప్తిచేశారు. కొమింటరను స్పందించి భారత కమ్యునిస్టులకు బహిరంగలేఖగా"[2] ప్రకటించింది. ఇంప్రికార్ జూన్ 1932లో చైనా, బ్రిటన్, జర్మన్ కమ్యునిస్టుపార్టీలు ముందు సంతకంచేసిన బహిరంగ లేఖగా ప్రకటించింది.

మూడు పార్టీల బహిరంగలేఖలోని ముఖ్యాంశాలు ఈ క్రిందివిధంగా వున్నవి. 1) కార్మికోద్యమం గణనీయంగా అభివృద్ధి చెందింది. కమ్యూనిస్టుపార్టీ చిన్న చిన్న బృందాలుగ, ప్రజలనుండి వేరై, పరస్పర సంబంధాలులేకుండా, రాజకీయ ఐక్యత లేక సంస్కరణవాదంనుండి పూర్తిగ వైదొలగకుండా వుంది. స్థానికతత్వం,

---

1. కమ్యూనిజం ఇన్ ఇండియా, అన్ పబ్లిషడ్ డాక్యుమెంట్సు, 1925-34 ఎడి. సుబోధ్‌రాయ్. పే. 199-200
2. జె నె డి ఓవర్‌స్ట్రీట్, మార్షల్ విండ్ మిల్లర్ (1960) కమ్యూనిజం ఇన్ ఇండియా. పే. 151

రాష్ట్రీతత్వంతో ప్రజలకు దూరమై, అఖిలభారత కమ్యూనిస్టుపార్టీ కేంద్రం లేకుండా ప్రమాదస్థితిలో వుంది. పార్టీ అగ్రగామీదళపాత్రను వెంటనే పునరుద్ధరించాలి. పార్టీ కార్యాచరణవేదిక నంగీకరించిన వారందరి ప్రధాన కర్తవ్యం యిదే.

2) ప్రజోద్యమాలలో బూర్జువా జాతీయ వాదుల, అతివాదుల విధానాలను బహిరంగంగా విమర్శించుట ద్వారా కార్మిక నేతృత్వాన్ని నిర్మించగలం. రాజీలేని సామ్రాజ్యవాద వ్యతిరేక స్వాతంత్ర్య పోరాటాన్ని కార్మిక నాయకత్వం దృఢతరం చేయగలదు. అతివాదుల జాతీయ సంస్కరణవాదంతో పోరాడునపుడు వారినను సరించే ప్రజలు, ప్రజోద్యమాలు నుండి వేరుపడకుండనట్లు జాగ్రత్త వహించాలి. కాంగ్రెసు బూర్జువా నాయకత్వాన్ని వారిననుసరించే కార్మిక కర్షక విప్లవ వర్గాలను వేరువేరుగా చూడాలి.

3) అన్ని జాతీయ కాంగ్రెసు వూరేగింపులలో, ప్రజోద్యమాలలో పార్టీ తప్పనిసరిగా తన నినాదాలతో పాల్గొనాలి. ఇంకా లేఖ ఐక్యజాతీయ సంఘటన "గురించి కలలు కంటున్నది,

4) బూర్జువా వ్యతిరేక పోరాటాలలో బూర్జువాలను పెటీ బూర్జువాలను వేరు వేరుగా చూడాలి. యాంత్రికంగా కార్మికవర్గ ప్రయోజనాలను స్వాతంత్రోద్యమ ప్రయోజనాలకు వ్యతిరేకంగా చూస్తారు. కమ్యూనిస్టులు దీనికి వ్యతిరేకంగా పోరాడు నపుడు బూర్జువాలను, పెటీ బూర్జువాల అస్థిరత్వాన్ని అనిశ్చితను, వూగిసలాటను మరచి ఆచరణలో వారితో కలిసిపోవుట లేక అనుసరిస్తూ కార్మికులను జాతీయ బూర్జువా నాయకత్వం పాలుచేస్తారు.

5) సిద్ధాంత, నిర్మాణ ఐక్యతగల రహస్య అఖిలభారత కమ్యూనిస్టుపార్టీ, వాస్తవమైన కొమింటరను శాఖ; కమ్యూనిస్టు కార్యక్రమానికై, కమ్యూనిస్టు ఇంట ర్నేషనల్ కార్యక్రమం పోరాట నినాదం కావాలి.

బహిరంగలేఖ, జాతీయ, సామాజిక విముక్తి విప్లవపోరాటాల, వొక "మూల మలుపు దశకు చేరిందని ప్రకటించుతు, ప్రారంభించబడింది. దీనర్థం వ్యూహాత్మక మార్పును సూచించుతున్నది. అయితే 6వ కొమింటరను సమావేశానంతరం, వర్గాల పొందికలో వచ్చిన మార్పులను సూచించలేదు. బూర్జువావర్గం "బ్రిటిష్ సామ్రాజ్య వాదంతో విప్లవ ప్రతీఘాతక రాజీ విధానాన్ని కొనసాగిస్తు విప్లవ ప్రజా సామాన్యా నికి విద్రోహం చేస్తున్న"దని ప్రకటిస్తున్నది[1] ఈ విద్రోహానంతరంకూడ బూర్జువా వర్గం "జాతీయ కాంగ్రెసు కార్మికవర్గంలో గణనీయమైన ప్రభావాన్నికలిగియున్నది. దానిని కొనసాగించుకొనగలుగుతున్నది." "జాతీయ కాంగ్రెసును, అన్ని అతివాద జాతీయ సంస్కరణ వాదులను కార్మిక, బడుగు వర్గాలనుండి వేరుచేయుట" కమ్యూ నిస్టుల ప్రథమ కర్తవ్యం. గతంలోవలెనె జాతీయ కాంగ్రెసు యెడల కమ్యూనిస్టుల వైఖరిని సూచించుటలో మాత్రం యే భేదంలేదు.

---

1. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్, 1× (జూన్ 1, 1932) పే. 347లోని దానిని "కమ్యూనిజం ఇన్ ఇండియా"లో ఓవర్‌స్ట్రీట్ - 157 పేజీలోని ఉదాహరింపు సమాచారము.

బహిరంగ లేఖ తదుపరి కమ్యూనిస్టు ప్రధాన తప్పిదము "సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాపోరాటాలకు దూరంగా వుండుట" అని స్పష్టం చేసింది. "ఈ స్వయముగా వేరుపడిపోవుట", కమ్యూనిస్టులలో గందరగోళాన్ని సృష్టించిందని, దీనిని దిద్దుకొనుటకు "స్వాతంత్ర్య పోరాటంలో అత్యంత శక్తివంతమైన పాత్ర" వహించాలంటున్నది. "సామ్రాజ్యవాద వ్యతిరేకంగా శ్రామిక ప్రజా సామాన్యం జరిపే" అన్ని పోరాటాలలో, సంఘర్షణలలో, ప్రదర్శనలలో ముందు పీఠిన" కమ్యూనిస్టులు వుండాలంటున్నది. అయితే యీ విధానాన్ని కమ్యూనిస్టులు అనుసరించునపుడు, తప్పనిసరిగా వారు "జాతీయ కాంగ్రెసును, ముఖ్యంగా అతివాద జాతీయవాదులపై నిర్దిష్ట, తీవ్ర, స్పష్టమైన రాజీలేని పోరాటాన్ని సాగించాలని, నిర్దాక్షిణ్యంగా వారి విధానాలను విమర్శించి బహిరంగ పరచాలని" అంటున్నది. ఈ ద్వంద్వవైఖరి ఎలా సాధ్యమో లేఖ వివరించలేదు. అందులో పార్టీలో చీలికలు, అనైక్యత, ప్రజలనుండి వేరుపడి అతివాదంలో, కొన్నిచోట్ల జాతీయ సంస్కరణవాదంలో మునిగి తేలుతున్నప్పుడు యెలా సాధ్యమో లేఖ వివరించలేదు. అంతేగాక, పార్టీ యంత్రాంగంలో బహిరంగ, రహస్య విధానాలను కలగా పులగం చేయుట, అత్యంత ప్రమాదకరం, పార్టీ రహస్య మౌలిక యంత్రాంగాన్ని కాపాడుకొనగలగాలి, ఎట్టి పరిస్థితులలోను "రహస్య సెల్లు"లకు ప్రమాదం రాకూడదు.

బహిరంగ లేఖ ప్రకటన అనంతరం సంవత్సరానికి మీరట్ ఖైదీలను విడుదల చేయ ప్రభుత్వం ప్రారంభించింది. డా. అధికారిని నవంబరు 1933లో విడుదల చేయగా, కలకత్తా వెళ్ళి "పార్టీ తాత్కాలిక కేంద్రకమిటీని, పి. సి. జోషి, యస్.జి. పట్కార్, అబ్దుల్ హలిమ్‌తో యేర్పాటు చేసారు. అదే కాలంలో ఇంప్రికార్ లో చైనా కమ్యూనిస్టు పార్టీ; భారత కమ్యూనిస్టులకు వ్రాసిన బహిరంగ లేఖ ప్రకటించబడింది. లేఖ అధికారి తాత్కాలిక కేంద్ర కమిటీని యేర్పాటు చేయుట, సరియైన మార్గంలోని ప్రథమ చర్యయని ప్రశంసించింది. చైనా బహిరంగలేఖ జూలై 1933లో వ్రాయబడింది, అందులోని ముఖ్యాంశాలు యీ క్రింది విధంగా ఉన్నవి.[1]

1) "త్వరితంగా కమ్యూనిస్టు పార్టీని నిర్మించుట భారత విప్లవపు కేంద్ర కర్తవ్యం.

2) "అంచేత, అఖిల భారత కమ్యూనిస్టు పార్టీని యేర్పరచుటకు కలకత్తా కమ్యూనిస్టు కమిటి శక్తివంతమైన పిలుపు నిచ్చుటను మేము ఆహ్వానించుచున్నాము. పార్టీ కార్యక్రమాలను అఖిల భారత కేంద్ర కార్యక్రమాలుగా చేబట్టుట, అట్టి అవగాహన, పార్టీ చరిత్రలోని పెటీ తగాదాలకు, చీలికలకు స్వస్తిచెప్పి, శక్తివంతమైన ఐక్యపార్టీ నిర్మాణ ప్రతిపాదనకు మా స్వాగతం.

3) "భారత విప్లవానికి, కార్మికవర్గ నాయకత్వ పాత్ర చోదకశక్తియని, "కార్యాచరణ వేదిక" సరియైన బోల్షివిక్ విశ్లేషణ చేసింది. విప్లవ ప్రజా సామా

---

1. గైడ్‌లైన్స్ ఆఫ్‌ది హిస్టరి ఆఫ్‌ది కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా. సెంట్రల్ పార్టీ ఎడ్యుకేషనల్ డిపార్టుమెంటు, సి పి. ఐ. పబ్లికేషన్. పే. 40.

న్యాన్ని ఆచరణలో విజయానికి నడిపించగల సామర్థ్యం, ఆ పోరాటాలలో శక్తివంతంగా పాల్గొంటున్న కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంలోగల కార్మికవర్గానికి మాత్రమే కలదని ప్రజాసామాన్య తెలుసుకొనగలిగింది.

4) "చైనా కమ్యూనిస్టులమైన మేము ఎంత తీవ్ర పొరపాట్లు చేసినా, జాతీయ బూర్జువావర్గంతో విప్లవ ఐక్యసంఘటనను ఎంత చెడ్డగా కొనసాగించినా, ఐక్య సంఘటనా ఎత్తుగడల కారణంగా, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో విజయాలను సాధించాము, మా పార్టీని బలమైన శక్తిగా రూపొందించాము.

5) "కాని లేఖ" భారత దేశంలో బూర్జువావర్గం రాజీమార్గాన్ని అవలబించినందున, సర్వసహా జాతీయ ఐక్యసంఘటన, ఎత్తుగడలు సామ్రాజ్యవాద వ్యతిరేక, వ్యవసాయ విప్లవపు ప్రారంభదశలో అనుసరించుట సత్ఫలితాల నివ్వలేదు. భారత దేశంలో, కార్మికుల, పెటీ బూర్జువా మౌలికవర్గాల విప్లవ కూటముల విధానాల సమస్య మాత్రంగానే రూపొందింది.

6) "గాంధీ, నెహ్రూ, బోసులను లేఖ తీవ్రంగా విమర్శించింది." రాజ్యాంగానికి వ్యతిరేకంగా కార్మిక, కర్షక, విద్యార్థి, నగర బడుగువర్గాలతో ఐక్య సంఘటనను యేర్పరచి, కాంగ్రెసువాదులకు, కార్యకర్తలకు, వారి అనుయాయులకు పోరాటానికై మద్దతు నివ్వవలసిందిగా విజ్ఞప్తి చేయుట భారత కమ్యూనిస్టుల కర్తవ్యం. అదే కాలంలో అతివాద జాతీయ సంస్కరణవాదుల ప్రయత్నాలను బట్టబయలు చేయాలి. సమ్మె పోరాటాలకు ప్రతిగా సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలను పోటీ పెట్టుట పెద్ద పొరపాటు. రెండిటిని వొకే కాలంలో కొనసాగించుట అత్యవసరము.

7) "కొందరు భారత కమ్యూనిస్టులు, పార్టీపాత్ర, ట్రేడు యూనియన్‌ల పాత్రలను గందరగోళపరచి, తీవ్ర పొరపాటులను చేసి, కార్మిక వర్గపోరాటాల ఐక్యతను నిర్మించుటలో విఫలులు అగుటను గుర్తు చేయదలచుకొన్నాము. ఆధ్యతన 1929-32 కాలంలో విప్లవ కార్మికవర్గాన్ని జాతీయ సంస్కరణవాదం నుండి వేరు చేయు క్రమంలో, కమ్యునిస్టు పార్టీ బలమైన శక్తిగా లేనందున, కార్మిక సంఘాలను "టి యు" సీలను చీల్చుట జరిగింది. సంస్కరణవాద వ్యతిరేక పోరాటమంటే ప్రజా సంఘాలను చీల్చుటకాదని కొంతమంది భారత కమ్యునిస్టులు అర్థం చేసుకొనజాలక పోయారు. కార్మిక నాయకులైన కందాల్కర్, తదితర జాతీయ సంస్కరణ వాదుల వ్యతిరేక పోరాటం అంటే అర్థం సంస్కరణవాద ట్రేడు యూనియనులలో పనిచేయకుండుట కాదని, కార్మికవర్గ సంఘాలలో ఐక్యసంఘటన ఎత్తుగడలను అనుసరించుటను వ్యతిరేకించుటకాదని, కమ్యునిస్టుల జాతీయ సంస్కరణవాదుల కార్మిక సంఘాలు కలిసి పనిచేయుటఅని అర్థం చేసుకొనజాలక పోయారు.

లేఖ "భారత కమ్యూనిస్టుల ప్రధమ, అత్యంత ముఖ్యమైన కర్తవ్యం, వారు తమ శక్తులలో ఐక్యతను సాధించుట, అఖిలభారత ఐక్య ఫ్రంటుని రూపొందించుటకు సాగిరండి" అని పిలుపునిస్తూ ముగించింది.

రెండు లేఖలు' తీవ్రమైన సెక్టేరియన్ పోకడలను కలిగివున్నా సరిగా పార్టీ నిర్మాణం అవసరాలను, అందుకుగాను అన్ని ప్రజాసంఘాలలో, వాటి కార్యక్రమాలలో పాల్గొనుటను నొక్కిచెప్పాయి.

పార్టీ నిర్మాణ రూపాలపై రెండు లేఖలలోని సలహాలలో గణనీయమైన భేదమేమీలేదు. "ప్రధానమైన నిర్ణయాత్మకమైనసమస్యయేమంటే చురుకైన(మిలిటెంటు) ప్రజా భారత కమ్యూనిస్టు పార్టీని నిర్మించుట" అని లేఖ తెల్పుతున్నది. పార్టీ, బోల్షివిక్ పార్టీ నిర్మాణ నమూనాలో, వుక్కు క్రమశిక్షణను శాంతియుత పార్టీగాక చురుకైనది, సాహసంగల విప్లవ పార్టీగ, సి.పి.యస్.యు. పార్టీవలె వుండాలి. "భారత కమ్యూనిస్టుపార్టీ నిర్మాణంలోని "నింపాది, నెమ్మది క్రమానికి మేము సహనాన్ని కోల్పోయి, కలత చెందుతున్నామని" చైనా లేఖ హెచ్చరించింది అధికారి తాత్కాలిక కేంద్రకమిటీని యేర్పాటుచేయుట సరియైన మార్గంలో ప్రధమచర్య అని చైనా లేఖ స్వాగతం పలికింది.

పరస్పర విరుద్ధంగా లేఖలలోని ప్రకటనలున్నా, లేఖల సూచనలలోని ప్రధాన భేదాభిప్రాయం కార్మిక సంఘాలలోని పని విధానానికి సంబంధించినదిగావుంది. ఉదాహరణకు ట్రేడు యూనియనులోని కమ్యూనిస్టుల ఆచరణ, సెక్టేరియన్ విధానంగా వుందని విమర్శించబడింది. కాని అదే కాలంలో రాజకీయ సమ్మెలను మరింతగా ప్రోత్సహించాలని సలహాయివ్వబడింది. రెండవలేఖ, "అతివాద జాతీయ సంస్కరణవాదులకు వ్యతిరేకంగా జరిగేపోరాటం అంటే అర్థం సంస్కరణవాద ట్రేడ్ యూనియన్‌లలో పనిచేయుట నిరాకరించుట కాదని స్పష్టం చేసింది. అంతేగాక కమ్యూనిస్టు (రెడ్) ట్రేడుయూనియన్‌లను, జాతీయ ప్రజాట్రేడు యూనియనులను రెంటిని కలిపివేయుట కాదని వివరించింది. సంస్కరణవాద యూనియనులతో "కలసిపోపుట" "ఐక్యమగుట"కు సలహాయిచ్చుట, బహిరంగ లేఖలోని వైఖరి తిరుగతోడునదిగా కన్పడుతుంది అయినా రెండు లేఖలలోని పైరుధ్యాంశాలు ఈ విషయాన్ని స్పష్టం చేయజాలవు. ఉదాహరణకు మొదటి లేఖ "కాందిల్కార్‌తో ఐక్యతను సాధించాలనే వారి వైఖరి పూర్తిగా సరియైనదికాదు." అయినా అది కూడ "స్వయంసిద్ధంగా పేరుపడివుండుట, ముఖ్యంగా కార్మిక సభలు, సంస్కరణవాదుల ప్రభావంలో వున్న ప్రజా ట్రేడు యూనియనులకు దూరంగా వుండుట గొప్ప తప్పిదము అగుతుంది" అని స్పష్టంచేసింది.

భారత కమ్యూనిస్టులకు సంస్కరణవాద ప్రభావంలో వున్న ట్రేడు యూనియనులలో ప్రవేశించి, పనిచేయమని సలహా యిచ్చి రెండవ లేఖ, 6వ అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ సమావేశ ఫలితంగా జనించిన వికృత (అల్ట్రా) అతివాదంనుండి దూరమగుటకు తీసుకొనే ప్రధమచర్య అగుతుంది. అయితే భారత కమ్యూనిస్టుపార్టీ కార్యాచరణ వేదిక ముసాయిదా సంస్కరణవాదంపై యుద్ధాన్ని ప్రకటించింది. కాని రెండవ బహిరంగ లేఖ కమ్యూనిస్టులు సంస్కరణవాద ట్రేడు యూనియనులలో చేరాలని సలహానిచ్చింది. స్వయంగా, స్వతంత్రంగా అధ్యయనం, పరిశీలనచేసి, తమ విధానాల రూపొందించుకొనజాలని శైశవదశలోవున్న భారత కమ్యూనిస్టులను పెద

గందరగోళంలో పడవేశాయి తప్ప యీ లేఖలు భారత పరిస్థితులలో రూపొందించ వలసిన వ్యూహం, ఎత్తుగడల అవగాహనలను పెంపొందించుటకు యేమాత్రం తోడ్పడలేదని అనుకొనవలసి వుంటుంది.

"వాస్తవికతను, పిడి సూత్రాల కనుగుణంగా వికృతపరచే ప్రయత్నాన్ని రెండులేఖలు చేశాయి. భారత ప్రజానీకం మనస్సులలో వెలుగును ప్రభావితంచేసి వారి వూహలు, ఆలోచనలు ఆకాశంలో విహరించునట్లుచేసి గాంధీపై వారివిశ్వాసాన్ని పూర్తిగా గైకొని, పేర్కొనదగిన ఎట్టి రాజకీయ కార్యక్రమం ఆచరణ భారత జాతీయ కాంగ్రెసు ప్రభావ వలయంలో వుంటున్నదని, ప్రతి భారతీయునకు తెలిసిన యీ విషయాన్ని విదేశ కమ్యూనిస్టుపార్టీలు పరిగణలోనికి తీసుకొనవలసి వుంటుంది ఒక అహింసా మత ప్రవక్తకు వొక బూర్జువా రాజకీయపార్టీకి అంతటి ఔన్నత్యాన్ని గుర్తించుట, ఆపాదించుట తమ మర్యాద, గౌరవాన్ని పెంచుతుంది కాని తగ్గించదు. మార్క్సిస్టు-లెనినిస్టు పరిభాషలో వివరించి, అప్రధానమైనదిగా, తాత్కాలికమైనదిగా సూచించాలి. గాంధీ, కాంగ్రెసు ప్రజా సహకారాన్ని పొందుట కొనసాగగలదని ఆమోదించజాలరు. ఆ విధంగా సౌహార్ద పార్టీలు భారత కమ్యూనిస్టుపార్టీకి ప్రజల విశ్వాసాన్ని పొందిన నాయకులను, వారి రాజకీయ సంస్థను తీవ్ర విమర్శనా దాడికి గురిజేసి ప్రజాభిప్రాయాన్ని చూరగొనమని సలహానిచ్చాయి, అట్టి నిరుపయోగ సలహాలు భారత కమ్యునిస్టులకు అందుతున్నందున రాజకీయ అడవిలో మార్గంపోగొట్టు కొన్న వారయ్యారు. అనేక సంవత్సరాల తరువాత 1943లో అధికార కమ్యునిస్ట్ వ్యాఖ్యాత రెండు లేఖలపై "పార్టీ తక్షణ బాధ్యతలను అవగాహన చేసుకొనుటకు, పార్టీ బలహీనతలను రూపుమాపుకొనుటకు, భారత పరిస్థితులకు తగిన పార్టీని రూపొందించుటకు తోడ్పడినవని" అన్నారు[1].

అంతర్జాతీయ కార్మికవర్గ సౌభాతృత్వం తేలికగా యితరుల ఒత్తిడికిలోనయ్యే విశ్వాసంపై ఆధారపడివుండుట శోచనీయము.

1. సంగ్రహంగా 1920 దశకంలో జాతీయ కాంగ్రెసు సహాయ నిరాకరణో ద్యమాన్ని చేబట్టి రాజకీయ సమస్యలకు, రైతాంగసమస్యలను జోడించి జాతీయోద్య మానికి ప్రజా పునాదిని యేర్పరచ మొదలిడింది. ఇదే కాలంలో కాంగ్రెసులోని అతి వాదులు కొందరు మార్క్సిజం, సోషలిజంలచే ఆకర్షితులై బొంబాయి, కలకత్తా, లాహోర్, మద్రాసులలో కమ్యునిస్టు బృందాలుగ ఏర్పడి, పత్రికలనుస్థాపించి సోష లిస్టు ప్రచారాన్ని ప్రారంభించారు. నగరాలలోని ఫ్యాక్టరీ కార్మికవర్గంలో వారి తక్షణ కోర్కెలపై సమ్మె పోరాటాలు ప్రారంభించారు.

2. భారత కమ్యూనిస్టుపార్టీ ఏర్పడలేదు. కాని అంతర్జాతీయ కమ్యూనిస్టు 2వ కాంగ్రెసులో లెనిన్ వలస దేశాలలో బూర్జువా వర్గాన్ని విప్లవాత్మకంగా గుర్తించి, జాతీయోద్యమాలలో కమ్యూనిస్టులు, స్వతంత్ర ప్రతిపత్తి నిలబెట్టుకొంటూ

1. రావు. భారత కమ్యూనిస్టుపార్టీ.... పే. 71 నుండి, ఓవర్‌స్ట్రీట్, విండ్‌మిల్లర్‌లు కమ్యూనిజం ఇన్ ఇండియా (ఆంగ్లం) పే. 53-54లలోని ఉదహరింపు.

తప్పనిసరిగా పాల్గొనాలనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు భారత ప్రతినిధి రాయ్ లెనిన్‌తో విభేదించి, ఇండియావంటి అభివృద్ధిచెందిన వలసలలో వర్గవిభజన స్పష్టంగా లేదని, భూస్వామ్య వ్యవస్థనుండి సంబంధాలను బూర్జువావర్గం తెగతెంపులు చేసు కొనలేదని, కాన జాతీయోద్యమ విజయంతో బూర్జువా ప్రజాస్వామ్య విప్లవవిజయం సాధించబడదని, బూర్జువావర్గం సామ్రాజ్యవాదంతో రాజీపడి, దోచుకొన్న లాభా లలో వాటా పంచుకొంటుందని, నాయకత్వాన్ని కార్మికవర్గం హస్తగతం చేసుకొనని పక్షంలో జాతీయవాదం బ్రిటిష్ ,సామ్రాజ్యవాదంతో రాజీపడి తీరుతుందని రాయ్ ప్రత్యామ్నాయ సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. లెనిన్ కోరికపై రాయ్ సిద్ధాంతాన్ని లెనిన్ సిద్ధాంతానికి ఉప సిద్ధాంతంగా కొమింటరను ఆమోదించింది. రాయ్ కొమింట రనులో భారతవాణి అయ్యాడు.

3. ఈ దశకంలోనే జరిగిన విస్తృత కార్మిక సమ్మె పోరాటాల ఫలితంగా 1925లో కమ్యునిస్టుపార్టీ స్థాపించబడింది. అఖిలభారత జాతీయకాంగ్రెసు కమిటీలో సభ్యులైన కమ్యూనిస్టులు 1927లోనే సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానాన్ని ప్రతిపాదిం చారు. తరువాత కొంతకాలానికి జరిగిన మద్రాసు కాంగ్రెసు మహాసభలో కాని ఆమోదం పొందలేదు సైమన్‌కమీషన్ బహిష్కరణోద్యమంలో కార్మికవర్గం పెద్ద యెత్తున సమ్మెపోరాటాలు నడిపి, తన అగ్రగామి పాత్రను నిరూపించుకొంది. ఈ నేపథ్యంలో ప్రభుత్వం మార్చి 1929న కమ్యూనిస్టు నాయకులను అరెస్టుచేసి, 'మీరట్ కుట్ర' కేసు బనాయించింది కార్మిక సంఘాలు కాంగ్రెసు కలసి జవహర్ లాల్‌నెహ్రూ అధ్యక్షతన "మీరట్ రక్షణ కమిటీ"ని యేర్పాటు చేశారు. కాంగ్రెసు-కమ్యూనిస్టుల ఐక్య కార్యాచరణ, ఆందోళనలలో ఐక్య సంఘటన రూపొందుటకు మార్గమేర్పడింది సైమన్ కమిషన్ వ్యతిరేకోద్యమం అట్టి ఐక్య కార్యాచరణకు చక్కని నమూనా అయింది. జాతీయ కాంగ్రెసు అంతర్జాతీయ సామ్రాజ్యవాద వ్యతి రేక ఐక్య సంఘటనలో సభ్యత్వాన్ని స్వీకరించింది భారత ట్రేడు యూనియన్ కాంగ్రెసు 1929లోనే సోషలిజం లక్ష్యంగాప్రకటించింది. జాతీయ కాంగ్రెసు మూడు దశాబ్దాల తరువాతగాని అట్టి ప్రకటన చేయజాలకపోయింది. కార్మిక విట్లీ కమిషన్ బహిష్కరించు సమస్యపై ట్రేడు యూనియన్ కాంగ్రెసు నాగపూరులో నెహ్రూ అధ్యక్షతన జరిగిన సమావేశంలో మితవాదులు జోషి, చమన్‌లాల్‌లు చీలిపోయి మరో సంఘాన్ని ఏర్పాటు చేశారు. ట్రేడు యూనియన్ కాంగ్రెసు సుబాస్‌చంద్ర బోస్‌ను అధ్యక్షునిగా యెన్నుకొంది.

జాతీయ కాంగ్రెసు 1930లో "దండీ ఉప్పు సత్యాగ్రహం-సహాయ నిరాకర ణోద్యమాలను గాంధీజీ నాయకత్వంలో సాగించింది. గాంధీజీని అరెస్టుచేయగా, కాంగ్రెసు కార్యవర్గం అన్ని పోరాట రూపాలను అహింసామార్గంలో చేపట్టమని ప్రజలను కోరింది. షోలాపూర్ మరెన్నో నగరాలలో సంఘటిత కార్మికోద్యమం సమ్మె పోరాటాలు బార్డోలీ, పెదనందిపాడు రైతాంగ పోరాటాలు మార్గదర్శకమ య్యాయి. ఉప్పు సత్యాగ్రహం విస్తృత ప్రజా పోరాటంగా మారుటకు "గాంధీజీ సిద్ధాంత పరిమితులు" అడ్డుగా నిలువజాలకపోయాయి.

4. అంతర్జాతీయ కమ్యూనిస్టు 6వకాంగ్రెసు రాజకీయ అవగాహనతో భారత విప్లవానికి, భారత జాతీయ కాంగ్రెసులోని అతివాదులు, నెహ్రూ, సుభాస్‌చంద్ర బోస్‌లు ప్రమాదకర ప్రధాన అడ్డంకి యని భారత కమ్యూనిస్టుపార్టీ కార్మిక, కర్షకులు తదితరులలో గల కాంగ్రెసుపై భ్రమలను తొలగించాలనే ధ్యేయంతో తీవ్ర అతివాద వొంటెత్తు విధానాన్ని అవలంబించి, కాంగ్రెసును, నాయకులను తీవ్రవిమర్శకు గురిచేసి, దుయ్యబట్టసాగారు. ఫలితంగా ప్రపంచ సామ్రాజ్యవాద వ్యతిరేక లీగునుండి జవహర్‌లాల్‌నెహ్రూ దూరమగుట, ప్రజలు బడుగుపర్గాలనుండి కమ్యూనిస్టులు దూరమగుట జరిగింది. ఈ అతివాద పోకడల ఫలితంగానే భారత కమ్యూనిస్టుపార్టీలో మొట్టమొదటి చీలిక యేర్పడి, అతివాదవర్గం రణదివె నాయకత్వంలో "వర్కర్స్ పార్టీ"ని స్థాపించుట, కమ్యూనిస్టులు పనిచేస్తున్న ఒకేఒక సంఘటిత కార్మికోద్యమం "ఎఐటియుసి"లో చీలికవచ్చి "రెడ్ ట్రేడ్‌యూనియన్ సెంటర్"ను యేర్పాటుచేసి కార్మికవర్గంలో అనైక్యత సృష్టించుట జరిగింది.

వలసలలో విప్లవ పోరాటాల లెనిన్ సిద్ధాంతం కొమింటరను 2వ, కాంగ్రెసులో, అన్నివర్గాల సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ ఐక్య సంఘటనగా ఆమోదించబడింది. అంతర్జాతీవ 6వ కాంగ్రెసులో కార్యవర్గం సామ్రాజ్యవాద వ్యతిరేక వలస పోరాటాలను సమీక్షించి అతివాద ధోరణిలోని తీర్మానాన్ని ప్రతిపాదించగా ఆమోదించబడింది. భారత జాతీయోద్యమానికి తీర్మానం రెండే మార్గాలను నిర్దేశించింది. ఒకటి సామ్రాజ్యవాదంతో రాజీపడి సంస్కరణలను ఆమోదించి బూర్జువా ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయుట. రెండు వలస సామ్రాజ్యవాదానికి, శేష ఫ్యూడలిజానికి వ్యతిరేకంగా వ్యవసాయ విప్లవ పోరాటాలను సాగించి, పెట్టుబడిదారేతర మార్గంలో అభివృద్ధి వ్యూహం, కార్మిక కర్షక నియంతృత్వ స్థాపన పంథాగ వివరించింది.

భారత బూర్జువావర్గం ఆర్థిక,రాజకీయంగా సంఘటితవర్గం, కొంత పరిపక్వత చెందింది.కార్మికవర్గం గణనీయమైన సంఖ్యాబలాన్ని కలిగివున్నా అనైక్యతకు గురై రాజకీయంగా బూర్జువావర్గ ప్రభావంలో వుంది. బూర్జువా వర్గంలో అత్యంత శక్తివంతమైన ఒక భాగం సామ్రాజ్యవాదంతో రాజీమార్గంలో పడింది. మరోభాగం అట్టి అవగాహనకు యెదురుచూస్తున్నదని రెండూ వ్యవసాయ విప్లవ వ్యతిరేకులని తీర్మానం విశ్లేషణగావించింది.

కమ్యునిస్టు గ్రూపులను బలమైన పార్టీగ సంఘటితపరచుట కార్మికులను ట్రేడు యూనియన్‌లలో సంఘటిత పరచుట, కార్మికోద్యమంలోని సోషల్ డెమాక్రటిక్ విద్రోహులను తొలగించివేయుట కార్మిక పార్టీల ప్రథమ కర్తవ్యంగా 6వ కాంగ్రెసు నిర్ధారణచేసింది. అన్ని వర్గాల జాతీయ ఐక్య సంఘటనా వ్యూహాన్ని త్రోసిబుచ్చి, కార్మిక కర్షక విప్లవ మేధావి వర్గాల సెక్టేరియన్ ఐక్య సంఘటనగా నిర్వచించి, కార్మికవర్గ నాయకత్వంలో వ్యవసాయ విప్లవాన్ని లక్ష్యంగా తెలిపింది. సామ్రాజ్యవాద శేష ఫ్యూడలు వ్యతిరేక పోరాటాలలో కార్మికవర్గ నాయకత్వంలో పార్టీ అగ్రగామిదళమగుట ద్వితీయ కర్తవ్యంగా కాంగ్రెసు నిర్ణయించింది. థాయ్

"వలస నిష్క్రమణ సిద్ధాంతం త్రోసివేయబడింది. సామ్రాజ్యవాదుల, బూర్జువా రాజీవాదుల కలయికను బద్దలుచేయుటకై రాజీ జాతీయబూర్జువా వర్గంపై విమర్శనా దాడిని ఎక్కుపెట్టి వారి విద్రోహాన్ని బయటపెట్టి, శ్రామిక జనాలను వారి ప్రభావాన్నుండి వేరుచేయాలనే స్టాలిన్ వ్యూహాన్ని, 6వ కాంగ్రెసు ఆమోదించినదానిని అనుసరించి, భారత కమ్యూనిస్టు పార్టీ ప్రధాన స్రవంతినుండి వేరుపడి ప్రజలకు దూరమైంది. సోవియట్ 20వ పార్టీ కాంగ్రెసులో 30 సంవత్సరాల తరువాత వలస సిద్ధాంత పత్రం కొన్ని సెక్టేరియన్ పోకడలున్నాయని అంగీకరించారు.

5 భారత కమ్యూనిస్టులను సంస్కరణవాద ట్రేడు యూనియనులలో పని చేయమని సలహాయిచ్చిన సౌహార్ద విదేశ పార్టీ లేఖ, 6వ కాంగ్రెసు ఫలితంగా వికృత అతివాదంలో మునిగిన వారిని రక్షించుటకు ప్రథమ చర్య అయింది. కాని భారత కమ్యూనిస్టుపార్టీ కార్యాచరణ వేదిక ముసాయిదా సంస్కరణవాదంపై యుద్ధం ప్రకటించింది. కాని రెండవ లేఖ సంస్కరణవాద కార్మిక సంఘాలలో పని చేయమని సలహానిచ్చింది. స్వతంత్రంగా అధ్యయనం, పరిశీలనచేసి తమ విధానాలను రూపొందించుకొనజాలని శైశవదశలోవున్న భారత కమ్యూనిస్టుపార్టీని యీ లేఖలు పెద్ద గందరగోళంలో పడవేశాయితప్ప, భారత పరిస్థితులలో రూపొందించ వలసిన వ్యూహం, ఎత్తుగడల అవగాహనలను పెంపొందించజాలకపోయాయి. అంచేత పార్టీ పాక్షిక విజయాలనే పొందగలిగింది.



# 2

# జాతీయ సంఘటనా పర్వం

## i

## జాతీయ సంఘటన

జవహర్‌లాల్ నెహ్రూ ఐరోపా పర్యటన అనంతరం 1933లో "భారత దేశం ఎటువైపు" అనే శీర్షికతో అనేక వ్యాసాలలోను, పత్రికా గోష్ఠిలలోను ప్రపంచంలో పెట్టుబడిదారీ విధానం విచ్ఛిన్నమగుతున్నదని, సోషలిస్టు విధానం అభివృద్ధి చెందుచున్నదని వ్యక్తంచేశారు. "సోవియట్ యూనియన్ అమలుజరిగే సోషలిజానికి యితర కమ్యూనిస్టులు, సోషలిస్టులు ప్రభోదించే సోషలిజానికి భిన్నమైన సోషలిజమే భారతదేశానికి ఏకైకమార్గమని నెహ్రూ నాడు చెప్పారు."[1] అంతేగాక "బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా భారత స్వాతంత్ర్య పోరాటాన్ని ప్రపంచ ఫాసిస్టు వ్యతిరేక పోరాటానికి అనుసంధానం చేయాలని" ఆయన సూచించారు.

జాతీయ కాంగ్రెసు దండి ఉప్పు సత్యాగ్రహంతో ప్రారంభమైన ద్వితీయ శాసనోల్లంఘనోద్యమాన్ని విరమించి, ఎన్నికలలో పాల్గొని, పోరాటాన్ని అసెంబ్లీలలో కొనసాగిస్తామని ప్రకటించింది. కాంగ్రెసు కార్యవర్గం 1934 డిశెంబరులో కేంద్ర అసెంబ్లీలోని కాంగ్రెసుపార్టీ సభ్యులు, కాంగ్రెసేతర సభ్యులను కలుపుకొని రాజ్యాంగసంస్కరణలకువ్యతిరేకంగాపోరాడమని ఆదేశించింది. స్వాతంత్ర్యదినసందేసంగా 1935 జనవరి 26న "స్వాతంత్ర్యం మన జన్మహక్కు, దానిని సాధించేవరకు విశ్రమించమని" తీర్మానంలో గుర్తుచేసింది.

బొంబాయి కాంగ్రెసు మహాసభ అక్టోబరు 1934లో జరిగిన పెండాలు స్థలంలోనే మహాసభకు వచ్చిన ప్రతినిధులలోని సోషలిస్టు భావాలు కలిగిన అత్యధికులు కాంగ్రెసు సోషలిస్టుపార్టీ సంస్థాపనా సమావేశాన్ని జరిపారు. కేరళ, ఉత్తరప్రదేశ్ మరికొన్ని రాష్ట్రాల కాంగ్రెసు ప్రతినిధులలో సగంపైగా సోషలిస్టు భావాలు కలిగిన వారున్నారు. సమావేశం రాజకీయ విధాన ప్రకటన, నియమావళిని ఆమోదించింది. కాంగ్రెసు సోషలిస్టుపార్టీ, కాంగ్రెసులోపలవుండే కాంగ్రెసును సోషలిస్టు మార్గంలో పెట్టి పురోగమనం సాధించుటకు ప్రయత్నిస్తుందని విధాన ప్రకటన స్పష్టంచేసింది కాంగ్రెసులో సభ్యులై కార్మిక, కర్షక సంఘాలలో పనిచేస్తూ వాటి ఆందోళన పోరాటాలలో పాల్గొనాలని నిర్ణయించింది.

కాంగ్రెసులో 1934 నాటికి స్వరాజ్య పార్టీలోని అతివాద భావాలు కలిగిన వర్గమొకటి, సోషలిస్టు భావాలుకలిగిన వర్గమొకటి యేర్పడినవి. వామపక్ష కాంగ్రెసు వాదులు, సోషలిస్టువర్గాన్ని బలపరస్తున్నారు. కాంగ్రెసులో రెండు ప్రధాన ధోరణులు

---

1. నంబూద్రిపాద్, ఇ. యం. యస్, (1988) భారత స్వాతంత్ర్య పోరాటచరిత్ర ద్వి. భా. పే. 45.

ఏర్పడి, ఘర్షణలు ప్రారంభమైనవి. "కాంగ్రెసులో వారు (సోషలిస్టులు) పైకి వస్తే నేను కాంగ్రెసులో వుండలేను. తీవ్రంగా వ్యతిరేకించే పరిస్థితిని నేను వూహించజాలని విషయం" అని గాంధీజీ సెప్టెంబరు 17న ప్రకటించారు. ఇది వామపక్ష భావాలు గలవారికి వ్యతిరేకంగా మితవాదులను బలపరచుటకై చేసిన ప్రకటనతప్ప మరొకటి కాదు.

నెహ్రూ తన ఐరోపా పర్యటనలో ఇటలీ, జర్మనీ, స్పెయిన్‌లలో ఫాశిజం ప్రబలుట, బీజప్రాయంగా పాప్యులర్ ఫ్రంటులు యేర్పడుట, ఫాశిస్టు వ్యతిరేక సంఘటనల ప్రారంభ సమస్యలు, యూరప్ సమస్యలు, రష్యా విధానాలు సన్నిహితముగా అధ్యయనం చేసారు. బ్రిటన్‌లో రజనీ పామీదత్తు, బెన్‌బ్రాడ్లీలను కలుసుకొని రాజకీయ సమస్యలు చర్చించారు ఫాశిజంకు వ్యతిరేకంగా యూరపులో కమ్యూనిస్టుల పాత్ర నెహ్రూ ఫాశిస్టు వ్యతిరేకతను యినుమడింపజేసింది. కమ్యూనిస్టులకు దగ్గరయ్యాడు. "అదే సమయంలో గాంధీజీ నాయకత్వంలోని కాంగ్రెసు సంస్థ మాత్రమే స్వాతంత్ర్య పోరాటాన్ని నడుపగలదని విశ్వశించాడు. కమ్యూనిస్టులు యీ వాస్తవాన్ని గుర్తించి తదనుగుణంగా పనిచేస్తే, తాను కమ్యూనిస్టు పార్టీతో సహకరించుటకు సిద్ధముగా వున్నానని నెహ్రూ, దత్తు, బ్రాడ్లీలకు హామీ నిచ్చారు."[1]

ఎన్నికలలో పాల్గొని మంత్రివర్గాలను యేర్పాటు చేయు సమస్యలపై కాంగ్రెసులో అతివాద, మితవాద రెండు దృక్పథాలు వెల్లడైనాయి. మంత్రివర్గాలను యేర్పాటు చేస్తే కాంగ్రెసు బలపడుతుందని, పాలకవర్గాలతో జరిపే రాజీ బేరాలలో వారి వాదనలకు బలమేర్పడుతుందని మితవాదులు తలచారు. అధికారాన్ని స్వీకరిస్తే కాంగ్రెసు పోరాట స్వభావాన్ని కోల్పోతుందని, బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో పోరాటం వదలి, ఆంగ్లపాలనలో భాగంగా ప్రజల నణచే చర్యలు చేపట్టేసితి యేర్పడుతుందని అతివాద వర్గాల భయం. నెహ్రూ 1936 లక్నో కాంగ్రెసు మహాసభ అధ్యక్షోపన్యాసంలో యిదే పేర్కొన్నారు.

బొంబాయి 1934 అక్టోబరు కాంగ్రెసు మహాసభ, గాంధీజీ సెప్టెంబరు 17 ప్రకటనలోని ముఖ్యాంశాలన్నిటిని తీర్మానాల రూపంలో ఆమోదించి, మితవాదంపైపు పయనించుటయేగాక, వామపక్షవాదుల పెరుగుదలను అరికట్టే ఆటంకాలను కలుగజేసింది. కాంగ్రెసు సంస్థా నిర్మాణరూపాన్ని మితవాదులకు అనుకూలంగా మార్చారు. కాంగ్రెసు సూత్రాలను ఆమోదించి నాలుగు అణాలు చెల్లించిన భారతీయ పౌరుడు సభ్యుడై, ఎన్నుకొనబడే హక్కు, ఎన్నుకొనే హక్కు కలిగివున్నాడు; దీనికి మారుగ 2000 కండెలు దారం స్వయంగా వడికి, కాంగ్రెసు డిపోలో జమచేసిన వ్యక్తిని సభ్యత్వానికి అర్హునిగా చేస్తూ, ఆరు నెలలు ఖద్దరు ధరించనిచో సభ్యత్వం కోల్పోతాదని, ప్రతినిధుల సభలోను, మహాసభలోను సవరణలు ఆమోదింపజేసారు. గాంధీజీ పూర్తి మద్దతుతోనే మితవాదులు యీ సవరణల నన్నిటిని నెగ్గించుకొనగలగారు.

1. నంబూద్రిపాద్, ఇ. యం. యస్. (1988) భారత స్వాతంత్ర్య పోరాటచరిత్ర ద్వి. భా. పే. 101.

వీటితోబాటు కాంగ్రెసు ప్రజాసంస్థ ప్రభావాన్ని తగ్గిస్తూ ప్రతిపాదించి మితవాదుల సవరణలు నెగ్గాయి. వాస్తవానికి యీ సవరణలన్నీ గాంధీజీ సెప్టెంబరు 17 ప్రకటనలో సూచించిన అంశాలై వున్నవి.

ఈ విధంగా 1930 దశకంలో జాతీయ కాంగ్రెసులో అభివృద్ధి చెందుతున్న వామపక్ష భావాలకు, సామ్రాజ్యవాదంతో రాజీలేని పోరాటం సాగించాలనే వర్గాలు, మరోవైపు బ్రిటిష్ ప్రభుత్వంతో రాజీపడి ఎన్నికలద్వారా రాష్ట్ర ప్రభుత్వాలలోచేరి పనిచేస్తూ కాంగ్రెసు బలపడుటతో "తమ రాజీ బేరాలకు" బలాన్ని చేకూర్చుకొనాలనే వర్గాలకు సంస్థలో అంతర్గత పోరాటం కొనసాగింది. కాంగ్రెసు 1937లో రాష్ట్ర మంత్రివర్గాలకు నాయకత్వం వహించుటతో సంఘర్షణ రూపాలు మారినా కొనసాగాయి. సోషలిస్టులు, కమ్యూనిస్టులు సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటానికై జాతీయైక్య సంఘటనా వ్యూహాన్ని రూపొందించారు. ఆ అధ్యయన ప్రయత్నమే యిది.

**కమ్యూనిస్టుపార్టీ పరిస్థితి :**

కమ్యూనిస్టు పార్టీ పెరుగుదల, అభివృద్ధి మీరట్ కుట్రకేసు, తదనంతరదమన విధానంతో పరిమితంగానే 1934లో సభ్యత్వం 150కు పెరిగింది. అయితే 1934 జులైలో పార్టీ నిషేధించబడింది. పార్టీతోపాటు రెడ్ట్రేడు యూనియన్ కాంగ్రెసు, వర్కర్స్ పబ్లిషింగ్ హౌస్, బొంబాయి యంగ్ కమ్యూనిస్టలీగ్, తదితర కమ్యూనిస్టు సంస్థలు నిషేధించబడినవి. కమ్యూనిస్టు పార్టీ తాత్కాలిక నిర్మాణ సూత్రాలు ప్రకారం "రహస్యంగా పనిచేయు నిర్మాణం గలది." ప్రపంచ ఆర్థిక, రాజకీయ ఇన్‌స్టిట్యూట్ సమావేశం 1934 మధ్యలో జరిగినపుడు,సోవియట్ అకెడిమీషియన్ పావెల్‌మిఫ్, భారతస్థితి అత్యంత ఆశాజనకంగా పేర్కొన్నాడు. "వలస సంక్షోభం తీవ్రమౌతున్నది" అని, "కార్మిక, కర్షక ఆచరణ వెల్లువ కొనసాగుతున్నదని" వుదహరించారు. అంతేగాక, భారత కార్మికవర్గం "జాతీయ బూర్జువావర్గాన్ని ఛాలెంజి చేయుట రోజు రోజుకి విజయవంతమౌతుందని" భారత కమ్యూనిస్టుపార్టీ బలమైన పాత్రను నెరవేర్చుతున్నదని" అన్నట్లు ఉదహరించబడింది.[1] మీరట్ కమ్యూనిస్టు ఖైదీల విడుదల అనంతరం సంవత్సరకాలంలో పార్టీ జనరల్ సెక్రటరీగా, అధికారి, ఘాటే, మిరాజ్‌కర్‌లు వరుసగా మారారు పార్టీ బహిరంగంగా కాని, రహస్యంగా కాని ఒక్కపేరు అయినా తీసుకొని వచ్చుట జరుగలేదు. అయితే అంతర్జాతీయంగా 6వ కొమింటర్న్ కాంగ్రెసు "అతివాద విధానం"లో కొంత సుముఖ మార్పువచ్చుటతో పరిస్థితిలో ఆశాజనకమేర్పడింది. కమ్యూనిస్టుపార్టీ అతివాద సెక్టేరియనిజం, ప్రజలనుండి వేరుపడియుండుట నుండి బయటపడి అభివృద్ధి చెందుటకు అవకాశాలేర్పడినవి. మూడు పార్టీలలేఖ, చైనాపార్టీ లేఖ అందుకుతోడ్పడినవి. భారత కమ్యూనిస్టులు సంస్కరణవాద ట్రేడు యూనియనులతో సహకారాన్ని నెరపాలనే సలహా పర్యవసానంగానే 1933 మధ్యనుండి రెడ్ ట్రేడు యూనియన్

1. జె నె డి ఓవర్‌స్ట్రీట్, మార్షల్ లిండ్‌మిల్లర్ (1960) కమ్యూనిజం ఇన్ ఇండియా. పెరినియల్ ప్రెస్. బొంబాయి. పే. 155 లోని ఉదహరింపు.

కాంగ్రెసు, కమ్యూనిస్టేతర అఖిల భారత ట్రేడు యూనియన్ కాంగ్రెసుతో కలసి పనిచేయుట ప్రారంభించింది.

ఈ పంథాలో మరో ముందడుగే పామెల్ మిస్, వలసదేశాలలో కమ్యూనిస్టులు "జాతీయ విప్లవ శక్తులతో" సంస్కరణవాద రాజకీయ పార్టీలలో, మంచి సంబంధాలను ఏర్పరచుకొని పనిచేయాలని ప్రకటించుట, ఆ కాలంలోని ఇంప్రికారులోని రచనలు, భారత కమ్యూనిస్టులు భారత జాతీయ కాంగ్రెసులోని ముస్లిం లీగులోని పెటీబూర్జువాలతో సత్సంబంధాలు పెంపొందించుకొనాలనిపిలుపునిచ్చాయి. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా అతివాద పార్టీలతో సహకారాన్ని నెరపాలని స్పష్టంచేశాయి. భారత కమ్యూనిస్టుపార్టీ కార్మిక రంగంలో అనుసరించుతున్న ఐక్య సంఘటనగా వ్యూహాన్ని రాజకీయ రంగంలోనికి విస్తరించుటగా క్లుప్తంగా చెప్పుకొనవచ్చును. కమ్యూనిస్ట్‌పార్టీ 1934 చివరలో యీ పంథాలోని మొట్టమొదటిసారిగా నూతనంగా ఏర్పడిన కాంగ్రెసు సోషలిస్ట్ పార్టీతో ప్రాథమిక సంబంధాలు నెలకొల్పు కొనుటకు చర్యలు తీసుకొన్నది.

స్పెయిన్ కమ్యూనిస్ట్‌పార్టీ 1033లోనే మాడ్రిడ్ నగర ఎన్నికలలో సోషలిస్టులు, రిపబ్లికనులతో కలసి ఐక్య సంఘటనగా ఏర్పడి పాల్గొన్నది. తదనంతరం జరిగిన పార్లమెంటు ఎన్నికలలో పాసిస్ట్‌వ్యతిరేక ఐక్యసంఘటన ఫిబ్రవరి 1936లో అత్యధిక సీట్లలో గెలుపొంది అభివృద్ధి నిరోధక పార్టీలపై విజయాన్ని సాధించింది. దేశంలో ప్రజాస్వామిక విప్లవం అభివృద్ధి చెందుటతో, భయపడిన మితవాదులు జులై 1936లో జర్మన్, ఇటలీ పాసిస్ట్‌శక్తుల మద్దతుతో రిపబ్లిక్ ప్రభుత్వంపై తిరుగుబాటు చేశారు. ప్రజలు పాప్యులర్ ఫ్రంటు-ఐక్య సంఘటన - ఆధ్వర్యంలో ప్రభుత్వరక్షణ పోరాటాన్ని సాగించారు. విదేశ ఫాశిస్ట్‌ల ఆయుధాల మద్దతుతో దేశాన్ని మితవాద అభివృద్ధి నిరోధకులు రక్తపాతంలోముంచారు. అంతర్జాతీయ కమ్యూనిస్టు స్వచ్ఛంద సైనికులుగా స్పెయిన్ ప్రజలతో కలసి పోరాడినా, ఫాసిస్టులే విజయాన్ని పొందగలిగారు. జర్మన్, ఇటలీ ఫాసిస్టులు తాత్కాలికంగా విజయం పొందారు.

నార్వే, బ్రిటన్, ఇటలీ, ఫ్రాంసు, హాలెండు. పోలెండు, జర్మనీలలోని ఏడు సోషల్ డెమోక్రటిక్ పార్టీలకు ఫ్రాంసు, జర్మనీ, పోలెండు కమ్యూనిస్ట్‌పార్టీలు మరోసారి కార్మికవర్గ ఐక్య సంఘటనా నిర్మాణానికి కలసిరండని విజ్ఞప్తిచేయుటయేగాక, ఫిబ్రవరి 1933లో కొమింటరను, సోషలిస్టు లేబరు ఇంటర్నేషనల్ ఫాశిస్టులకు వ్యతిరేకంగా పోరాడుటకు ఐక్య కార్యాచరణకు కార్యక్రమాన్ని ప్రతిపాదించి, పోరాటానికై ఐక్య సంఘటనా నిర్మాణానికి కలసిరండని విజ్ఞప్తిచేసింది.

ఫ్రాంసులో దౌర్జన్య ప్రదర్శనలలో అధికారాన్ని చేబట్టుదశకు ఫాశిస్టులు వచ్చుటతో కమ్యూనిస్టుపార్టీ,ఐక్య కార్యాచరణమార్గంలో సోషలిస్టులు,కమ్యూనిస్టులు 1934 ఫిబ్రవరిలో ఐక్య సంఘటనగా ఫాశిస్టు వ్యతిరేక సార్వజనీన సమ్మె పోరాటాలు జరిపారు. సమ్మెలలో 45 లక్షల కార్మికులు వీరోచితంగా పోరాడారు. జులై

1934లో కమ్యూనిస్టు, సోషలిస్టులు కార్మిక ఐక్య సంఘటన వొడంబడికపై సంతకాలు చేశారు. అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమాలకు ఈ అనుభవము అమూల్యమైనది.

అల్జీరియాలో కమ్యునిసుపార్టీ ఫాశిస్టు వ్యతిరేక ఐక్య సంఘటనను ఏర్పాటు చేయుటతో అరబ్ కార్మికవర్గంలో బలపడింది. అల్జీరియా, ఫ్రెంచి వలస సిరియా కమ్యూనిస్టులుపార్టీ, జాతీయ విప్లవ పార్టీలతో సన్నిహితంగా పనిచేసి, చొరవతో ఐక్య సంఘటనను ఏర్పాటుచేసి బలపడింది. లాటిన్ అమెరికన్ దేశాలలో బ్రెజిల్ కమ్యూనిస్ట్‌పార్టీ, సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులన్నిటిని సంఘటితపరచి విజయాలను సాధించింది. దక్షిణ అమెరికా కమ్యూనిస్ట్‌పార్టీల సమావేశం మాంటెవిడో 1934 అక్టోబరులో జరిగినప్పుడు జాతీయ విముక్తి పోరాటాలలో వ్యవసాయ విప్లవ పోరాటాల ప్రాముఖ్యతను నొక్కిచెప్పింది. ఇది క్యూబా, చిలీ, కమ్యూనిస్ట్‌పార్టీల ఎత్తుగడలలో ప్రధానాంశమైంది.

## చారిత్రాత్మక 7వ అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ మహాసభ

విప్లవ పరిస్థితులకు ప్రతిచర్యే ప్రతీఘాతక విప్లవం. అదే ఫాశిజం. ఫాశిజమే సంక్షోభాన్నుండి తనను కాపాడే పెట్టుబడిదారి విధానంగాతలచింది. జర్మనీలో 1918-20లలో కార్మికవర్గ విప్లవ వైఫల్యమే, అందుకై కార్మికవర్గం అనుభవించే శిక్షే ఫాశిజం అని పామీదత్తుపేర్కొన్నారు కమ్యూనిస్ట్‌లు సోషల్‌డెమోక్రేటులు 1932లో కలసి ఎన్నికలలో పోరాడినా జర్మనీలో ఫాశిజం అధికారంలోనికి వచ్చేదికాదు. విప్లవాన్ని రక్తంలోముంచేదికాదు. సోషల్ డెమోక్రేటులకు బూర్జువా వర్గాలపై భ్రమలు కమ్యూనిస్ట్ వ్యతిరేకత, కమ్యూనిస్టుల ఒంటెత్తు పోకడల ఫలితంగా జర్మనీ, యూరపు దేశాలలో ఫాశిజం బలపడింది. బూర్జువ ప్రజాస్వామ్యానికి భరతవాక్యమే ఫాశిజం. అంతర్జాతీయ కమ్యూనిస్ట్ ఉద్యమం 1933 తరువాత యెదుర్కొన్న మౌలిక సమస్య, జర్మనీలో శక్తివంతమైన ఫాశిజం వుద్భవించుట. ప్రతిగా స్పందించిన సోవియట్ యూనియన్ నూతన మిత్రులను సంపాదించుకొనుటకై "అతివాద వొంటెత్తు" పోకడలను సరళీకృతం చేయు ప్రయత్నాల ఫలితమే 7వ అంతర్జాతీయ కమ్యునిస్ట్ పార్టీ 1935 నూతన విధాన ప్రకటన.

ప్రపంచ కమ్యునిస్టు వుద్యమ ప్రధాన స్రవంతిలో ప్రముఖులైనడిమిట్రావ్, కుసినిన్, టోగ్లియాటి, బెలాకున్, వాంగ్‌మింగ్, మానువిస్కీ, వార్గాలు నూతన ఫాశిస్టు వ్యతిరేక ఐక్యసంఘటనా విధానకర్తలు. కొమింటరను కార్యవర్గపు 28 మే 1934 సమావేశంలో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ ప్రతినిధి మానువిస్కీ, ఎజెండాలో కార్మికవర్గ నియంతృత్వ పోరాటం వొక్కటే చాలదని, ప్రజలు విస్తృతంగా పాల్గొనాలన్నాడు. మహాసభ ప్రాథమిక సమావేశంలోని ఎజెండాపై కార్యవర్గానికి డిమిట్రావ్ వ్రాసిన లేఖ సమావేశంలో ఎజెండాపై డిమిట్రావ్ వుపన్యాసం, చర్చలకు ప్రధాన భూమికలయ్యాయి. కొమింటరను సోషల్ డెమోక్రసీని, సోషల్ ఫాశిజంగా నిర్వచించుటను తీవ్రంగా విమర్శించి, ఫాశిస్టు వ్యతిరేక పోరాటానికి సోషల్ డెమో

క్రాట్ల పూర్తి సహకారాన్ని పొందుట తప్పనిసరియని, ముఖ్యావసరమని డిమిట్రావ్ నొక్కి చెప్పాడు. విప్లవ పరిస్థితులను, పరిపక్వతను అతిగా అంచనావేయుటను, వొంటెత్తు పోకడలను కుసినిన్ విమర్శించాడు. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ములో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ, స్టాలిన్‌లు, అతి ముఖ్యులైనప్పటికి, సోవియట్ రాజకీయ ప్రభావం అంతగా పనిచేసినట్లు కనపడదు. వలసలలో కొమింటర్లను విధా నాన్ని పునఃపరిశీలించాలని, దాని అవసరాన్ని జెలాకున్, లొజోవస్కీ, వాంగ్‌మిం గులు గట్టిగా వుద్ఘాటించారు.

యూరపులోని బూర్జువా ప్రభుత్వాలపై బలమైన ప్రజా సమీకరణచే వొత్తిడి చేయుటకు వలస దేశాలలోని కమ్యూనిస్టు పార్టీలు తమ కర్తవ్యాన్ని నిర్వహించు టకు, లెనిన్ చెప్పిన సామ్రాజ్యవాద వ్యతిరేక వ్యూహాత్మక గమ్యాన్ని నొక్కి చెప్పాలి. ఆయా దేశాలలోని బూర్జువా జాతీయోద్యమాలతో సహకారాన్ని నెరపుటను పునరుద్ధరించాలిసిన అవసరమున్నది. అంచేతనే యూరోపియన్, వలస కమ్యూనిస్టు పార్టీలు నాలుగువర్గాల వ్యూహాన్ని తిరిగి చేబట్టాలి. కాంగ్రెసులో వలసలలో కమ్యూ నిస్టులు అనుసరించవలసిన విధానాన్ని ప్రతిపాదించిన వారిలో ముఖ్యుడు వాంగ్ మింగ్. సమావేశం అయిన వెంటనే వలసలలో పంథా ప్రకటనను ప్రచురించుటకు సిద్ధం చేసాడు.

ప్రపంచ కమ్యూనిస్ట్ ఉద్యమ అధికారపత్రికలో 7వ కొమింటరను కాంగ్రెసుకు ముందు 1935లో,వలసలలోని జాతీయ విముక్తి వుద్యమం యెడల అనుసరించవలసిన రాజకీయ విధానాన్ని ప్రకటించారు. సంగ్రహంగా క్రింది విషయాలు తెల్పింది.

1) వలస దేశాలలో జాతీయ విముక్తి వుద్యమాలకు వ్యతిరేకంగా,భూస్వాములు, కంప్రెడరీ బూర్జువావర్గాలు సామ్రాజ్యవాదానికి ప్రధాన మద్దతుదారులు. ఈ వర్గాలను జాతీయ బూర్జువావర్గానికి వ్యతిరేకంగా సామ్రాజ్యవాదం వుపయోగించుకొంటున్నది. జాతీయ బూర్జువావర్గ సంస్కరణవాదులు జాతీయ విముక్తి వుద్యమాన్ని బలపరచుట, ప్రజలు కమ్యూనిస్టులవైపు మొగ్గకుండగలందుకై ఎత్తుగడ మాత్రంగా ఎంచరాదు. జాతీయ విప్లవం-సామ్రాజ్యవాదాల మధ్య, జాతీయ బూర్జువావర్గం వూగిసలాడుట ఆ వర్గసైద్ధాంతికంగా ఎంచాలి. జాతీయ సంస్కరణవాద పార్టీలలో వామపక్షాలను,ప్రజలు విప్లవమార్గాన్ని అనుసరించుటకు, వంతెనలుగ పత్రం గుర్తించింది. కొమింటరను కార్యవర్గం, చైనా కమ్యూనిస్ట్ పార్టీ సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్య సంఘటనా నిర్మాణ ప్రయత్నాలను, బ్రెజిల్ కమ్యూనిస్టు పార్టీ జాతీయ విముక్తి ఐక్యతను హర్షించింది.

2) వెనుకబడిన దేశాలలో సోవియట్ల నిర్మాణ నినాదాన్ని తీవ్రంగా విమర్శిం చింది. విప్లవదశను పరిగణించకుండా పైనినాదాన్ని, నష్టపరిహారం లేకుండా భూస్వా ముల భూములను స్వాధీనం చేసుకొన కోరుటను విమర్శించింది. భారత కమ్యూని పార్టీ విధానం వారిని ప్రజలనుండి వేరు పరచిందని సెన్సూరు చేసింది.

3) జాతీయ సంస్కరణవాద పార్టీలతో తాత్కాలిక సహకారాన్ని నెరపినా, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో జాతీయపార్టీలతో కలసి సంఘటనను ఏర్పాటు చేసినా, తన నిర్మాణ, రాజకీయ స్వతంత్రపాత్రను కొనసాగించిననూ, కమ్యూనిస్టు పార్టీ తన నాయకత్వపాత్రను కోల్పోతుందనే అభిప్రాయం తప్పని వ్యాసం స్పష్టం చేసింది.[1]

ఈ విధంగా పెట్టుబడిదారి దేశాలలో ఫాసిస్టు వ్యతిరేక ఐక్యసంఘటనకు, వలసదేశాలలో సామ్రాజ్యవాద వ్యతిరేక విస్తృత్వ ఐక్య సంఘటనకు ప్రాథమిక సిద్ధాంతచర్యల ప్రాతిపదిక యేర్పడి, 7వ కాంగ్రెసులో సమగ్రచర్యలకు, నిర్ణయాలకు అవకాశము యేర్పడింది.

వాంగ్‌మింగ్, చైనా ప్రతినిధి, కొమింటర్న్ కార్యవర్గసభ్యుడు వలసల ముఖ్యంగా చైనా, బ్రెజిల్, ఇండియాలలో కమ్యూనిస్టులు అవలంబించవలసిన నూతన ఐక్యసంఘటనా విధానాలపై ముచ్చటించారు.

చైనాలో కమ్యూనిస్టులు, సైనికవాదులు, జాతీయ సంస్కరణవాదులు సామ్రాజ్యవాద వ్యతిరేకులందరితో, అభివృద్ధి నిరోధక కొమింగ్‌టాంగ్ నాయకత్వానికి వ్యతిరేకంగా తాత్కాలికంగా సహకారమైత్రిని నెరవదలచారు చైనా కమ్యూనిస్టు పార్టీ "చైనా ప్రజలందరి జాతీయ, సామాజిక విముక్తికై పోరాడు పార్టీ" కార్మికులను, కర్షకులను, పెటీ బూర్జువాలను, జాతీయ బూర్జువావర్గాన్ని అందరినీ కార్మికవర్గ నాయకత్వం క్రింద ఐక్యపరచుట చైనా కమ్యూనిస్టు పార్టీ ధ్యేయమని వాంగ్‌మింగ్ వివరించారు.

బ్రెజిల్‌లో కమ్యూనిస్టులు సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జాతీయ బూర్జువా వర్గంతో పొత్తునెరపే, వ్యూహాన్ని అనుసరించుతున్నారని వాంగ్‌మింగ్ అన్నారు. ఎత్తుగడలకు సంబంధించినంతవరకు చైనా, బ్రెజిల్‌లు భిన్నమార్గాలను అనుసరించుతున్నవి. చైనా కమ్యూనిస్టుల ప్రధాన ఎత్తుగడ, నాలుగు వర్గాలను తమ పార్టీలోనే సంలీనం చేసుకొంటూ, పార్టీని నిర్మించుటకాగా, బ్రెజిలియన్ కమ్యూనిస్టులు సామ్రాజ్యవాద వ్యతిరేక వివిధ రాజకీయపార్టీల, నాలుగు వర్గాలకు ప్రాతినిధ్యం వహించే గ్రూపుల విస్తృత, సంకీర్ణ-సంయుక్త సంఘటనను యేర్పాటుచేయ ప్రయత్నిస్తున్నదని వాంగ్‌మింగ్ స్పష్టంచేసారు.

భారత కమ్యూనిస్టులు, చైనా, బ్రెజిలు రెండు దేశాల అనుభవాలను వినియోగించుకోవాలని వాంగ్‌మింగ్ క్రింది విధంగా వివరించారు[2] అతని సలహా అర్థం, ఒకవైపు భారత కమ్యూనిస్టులు నాలుగు వర్గాలలోని వారిని చేర్చుకొంటూ, పార్టీని

---

1. దత్తాగుప్తా, యస్. (1980) కొమింటర్న్ ఇండియా వలస సమస్య 1920-37 (ఆంగ్లంలో) పే. 212-3.
2. జెనెడి ఓవర్‌స్ట్రీట్, మార్షల్ లిండ్ మిల్లర్ (1960) కమ్యూనిజం ఇన్ ఇండియా పెరినియల్ ప్రెస్, బొంబాయి. పే. 158.

విస్తృతి పరచి బలోపేతం చేయాలి. మరోవైపు విస్తృత సామ్రాజ్యవాద వ్యతిరేక సంస్థ, బూర్జువా జాతీయ కూటమి శక్తులలో చేరాలి. దీని అర్థం జాతీయోద్యమం లోనికి చొచ్చుకొనిపోవాలి. నేరుగా సామ్రాజ్య నభ్యులకు విజ్ఞప్తులుచేయాలి. జాతీయ నాయకత్వంలోని కనీసం కొన్ని వర్గాలతోనైనా, సమిష్టి కార్యాచరణను పెంపొందించాలి. అంటే అర్థం భారత కమ్యూనిస్టుపార్టీ క్రిందినుండి ఐక్య సంఘటన, పైనుండి ఐక్య సంఘటన అనే రెండు ఎత్తుగడలను ఏకకాలంలో జాతీయ నాయకత్వంపై పోరాటం, సమిష్టి ప్రయోజనం కొరకు సహకారం కొనసాగించాలి అని వివరించాడు వాంగ్‌మింగ్. అరవై దశకంలోని అజయ్‌ఘోష్ "ఐక్యత - పోరాటంగా" అర్థం చేసుకొనవచ్చు. దానినుండి సైద్ధాంతిక వివరణ లభించగలదు.

సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో చురుకుగా గతంలో పాల్గొనజాలక పోయినందుకు భారత కమ్యూనిస్టు పార్టీని నిరసించాడు. "ఇండియాలోని మన కామ్రేడ్స్, అతివాద సెక్టేరియ నిజానికి లోనై చాలాకాలం జాతీయ కాంగ్రెసు, దాని అనుబంధ సంస్థల ప్రజా ప్రదర్శనలలో పాల్గొనని కారణంగా వేరైపోయారని విసర్జించి, స్వతంత్ర శక్తిగా, వాస్తవంగా సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తివంతమైన ప్రదర్శనలను బలహీనంగా వున్నందున జరుపజాలకపోయారని" వివరించాడు.

ప్రజలను విస్తృతంగా ఆకర్షించగలిగిన కార్యక్రమాన్ని భారత కమ్యూనిస్టులు రూపొందించ జాలకపోయారని నిశితంగా పేర్కొన్నాడు. "సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యసంఘటనా ఎత్తుగడలను యే విధంగా అమలు చేయకుండా వుండాలనే దానికి మన భారత కామ్రేడ్స్ ఉదాహరణ" అన్నారు వాంగ్‌మింగ్. గతంలో "కార్మిక, కర్షక రిపబ్లికులకొరకు సార్వజనక సమ్మె అనే కార్యక్రమముపై, ఐక్యసంఘటనను నిర్మించ ప్రయత్నించాట" అని విమర్శించారు.

ఇంప్రెకార్ 9, మార్చి 1935న "ఇండియాలో సామ్రాజ్యవాద వ్యతిరేక సమస్యలు" అన్న శీర్షికలో భారత కమ్యూనిస్ట్ పార్టీ ఒంటెత్తు పోకడలను, ఫలితాలను, మొట్టమొదటి ఆత్మవిమర్శనా సమీక్ష ప్రచురించింది. రాజకీయ సిద్ధాంత పత్రంలో పునరాలోచన బీజాలు కనుపించినా, యీ నూతన అధికారపత్రంలో కూలంకషము, పరిపూర్తిమైన ఆత్మవిమర్శన కన్పడుతుంది. సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక విజ్ఞప్తులతో కమ్యూనిస్టు పార్టీ సరిబుచ్చుకొంటూ, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో ప్రజలు వెల్లువలై పాల్గొంటూవుంటే, పార్టీవారితో కలసి, నాయకత్వం వహించి పాల్గొనకుండా తీవ్రతప్పులను చేసిందని ఆ వ్యాసంలో అంగీకరించబడింది. ఫలితంగా సంస్కరణవాదులపై జరిపే పోరాటం, సామ్రాజ్యవాదంపై జరిపే పోరాటాన్నుండి వేరుచేయబడింది. కార్మికులు, కర్షకులు వారి కోర్కెలకై జరుపు పోరాటాలనుండి కూడ వేరు చేయబడింది. ఈ విధంగా రెండు పోరాటాలను సంఘటితం చేయుటలోని విఫలతను, ఫలితంగా పిడివాద ఒంటెత్తు పోకడలు, వేర్పాటువాదం పెరుగుటను ఆ పత్రం వివరించింది. ఐక్యసంఘటనా ఎత్తుగడల ప్రాముఖ్యతను

వొక్కాణించిందని[1]" దత్తాగుప్తా వ్యాఖ్యానించారు.అంతేగాక ఆ పత్రంలోని యీ క్రింది పేరాను వుదహరించారు.

"సమిష్టిగా కాంగ్రెసు సభ్యులుగ యీ సంస్థలు, కార్మిక, కర్షక, విద్యార్థి, యువజన సంఘాలు చేరితే వాటిబలం అంతులేకుండా పెరిగిపోతుంది. సభ్యులుగా చేరినా స్వతంత్ర పాత్ర పోయేదికాదు.సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని విస్తృత పరచుటకు కాంగ్రెసులో సమిష్టిగా సభ్యత్వం స్వీకరించుట అవసరం, అది యెంతో వుపయోగపడుతుంది. కాంగ్రెసులో చేరిన తరువాత సామ్రాజ్యవాద పోరాటానికి సంసిద్ధులైన వారివందరిని ఐక్యపరచి, గాంధీమార్గంలో కాకుండా వాస్తవంగా పోరాటాన్ని కొనసాగించవచ్చు.

కమ్యూనిస్టు పార్టీ 1934లో నిషేధించబడింది. కాంగ్రెసు వొక్కటే చట్టబద్ధమైన రాజకీయసంస్థగా పనిచేస్తున్నది.కాంగ్రెసులోచేరి,స్వతంత్ర ప్రతిపత్తిని కాపాడుకొంటూ, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటానికి కనీస కార్యక్రమాన్ని ప్రజల ముందుంచి, ప్రజా కార్యాచరణలో కలసి, కార్మికుల వేతనాల తగ్గింపుకు, రైతుల బేదఖళ్ళకు వ్యతిరేకంగా ఐక్యపోరాటాలను కొనసాగించుట నూతన అంతర్జాతీయ కమ్యూనిస్టు రాజకీయ విధానం. అందుకు పైనుండి, క్రిందినుండి ఐక్యసంఘటనా నిర్మాణ ప్రయత్నం ఆమోద యోగ్యమైనదే. అదే సమయంలో కార్మికవర్గ నాయకత్వంలో సామ్రాజ్యవాద, భూస్వామ్య వ్యతిరేక రైతు విప్లవ కార్యక్రమాన్ని కొనసాగించాలి.

"ఐక్యసంఘటనా యెత్తుగడలు అంటే సంస్కరణవాద వ్యతిరేక సిద్ధాంత పోరాటాన్ని రాజీతో విరమించుకొనుటని అర్థంకాదు.కమ్యూనిస్టులు రాజీవాద సంస్కరణ వూబిలో మునిగిపోకుండా వుండాలంటే, జాతీయ సంస్కరణ వాదంతో నిరంతరం పోరాటం జరుపుతు వుండవలసిందే. అప్పుడే సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటము బలపడుతుంది. అదే కాలంలో కమ్యూనిస్టు పార్టీ కాంగ్రేసేతర సంస్థలద్వారా స్వతంత్ర సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని మహోద్యమంగా ప్రజా సమీకరణతో చేస్తుంది. జాతీయవాదుల ఎత్తులను ఎప్పటికప్పుడు బహిర్గతం చేస్తుండాలని వొక్కాణించింది."[2]

జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులలో వచ్చిన మార్పులవలన వలస అర్థవలస దేశాలలో సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యసంఘటనకు అత్యంత ప్రాముఖ్యత కలదని డిమిట్రావ్ తెలిపారు. వలస, అర్థవలస దేశాలలో విస్తృత సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యసంఘటన యేర్పాటు చేయునపుడు, ఆయా దేశాలలోని విభిన్న ప్రత్యేక పరిస్థితులను, జాతీయ వుద్యమాలస్థితి, పరిపక్వతా దశలను, ఆయా వుద్యమాలలో కార్మికవర్గ పాత్రను, ప్రజాసామాన్యంలో కమ్యునిస్టు పార్టీకిగల ప్రాపకాన్ని, బలాన్ని, శక్తి, సామర్థ్యాలను పరిగణలోనికి తీసుకొనాలి.

---

1. దత్తాగుప్తా, యస్. (1980) కొమింటర్న్ ఇండియా వలస సమస్య (ఆంగ్లంలో) 1920-37. పే. 214.
2. దత్తాగుప్తా, యస్ (1980) కొమింటర్న్ ఇండియావలస సమస్య (ఆంగ్లంలో) 1920-27. పే. 215.

డిమిట్రావ్ తన నివేదికలో "ఇండియాలో కమ్యూనిస్టులు జాతీయ సంస్కరణ వాద నాయకత్వంలోని, తదితర అన్ని సామ్రాజ్యవాద వ్యతిరేక వుద్యమాలలో పాల్గొంటూ, విస్తరణచేస్తూ, తప్పనిసరిగా మద్దతునివ్వాలి. తమ స్వతంత్ర రాజకీయ నిర్మాణపాత్రను కొనసాగిస్తూనే, జాతీయ కాంగ్రెసులో పాల్గొనే అన్ని సంస్థలలోను చురుకుగా పాల్గొంటూ భవిష్యత్తులో బ్రిటిష్ సామ్రాజ్యవాద వ్యతిరేక విముక్తి ఉద్యమంలో పాల్గొనే జాతీయశక్తులను, గ్రూపులను బలపరిచి స్థిరీకరణ చేయు విధానాన్ని సుగమం చేయాలి[1] అని వివరించారు.

కొమింటర్న్ నాయకత్వం ఐక్య సంఘటనా ఎత్తుగడలను ప్రతిపాదించుతు, కమ్యూనిస్టు పార్టీలు జాతీయ విముక్తి వుద్యమాల బూర్జువా నాయకత్వాలతో సహకారమైత్రిని తాత్కాలికంగా కొనసాగిస్తున్నప్పటికీ వర్గ పోరాటాన్ని వదలివేయ వలసినస్థితి రాకూడదని ఇచ్చిన హెచ్చరికను గుర్తుంచుకొనాలి. కామ్రేడ్స్ ఎర్కోలి (టోగ్లియాటె) యిట్టి అభిప్రాయాన్నే వెలిబుచ్చుట గమనార్హం. ఈ హెచ్చరికకు ప్రాతిపదిక చైనాలో మొదట యేర్పడిన ఐక్యసంఘటనను కొమింగుటాంగు విచ్ఛిన్నంచేసి, దేశాన్ని రక్తపుటేరులలో ముంచిన చేదు జ్ఞాపకాలనుట సత్యం.

డిమిట్రావ్ నివేదికపై వాంగ్‌మింగ్‌ల వ్యాఖ్యలలో వలస దేశాలకు సంబంధించిన కొన్ని ముఖ్యాంశాలున్నవి. చైనాలో 1935 సన్‌యీ సమావేశంవరకు అనుసరించిన వొంటెత్తు పోకడలను విస్మరించి, బయటపడి వలసల, అర్ధవలసల విప్లవోద్యమాలపై చేసిన వ్యాఖ్యలు అతిముఖ్యమైనవి. చిలియన్ నావికాదళ తిరుగుబాటు, ఇండోనేషియా నావికాదళ తిరుగుబాటు, భారతదేశంలో కార్మిక కర్షక పోరాటాలు, ఫిలిప్పైనులో రైతుల సాయుధ పోరాటం, కొరియాలో సమ్మెల పోరాటాలు, పరిష్యాలో నూనెగనుల కార్మికుల విస్తృత సమ్మెలు, తూర్పు అరేబియాలో సాయుధ తిరుగుబాటులు, నీగ్రోలలో విప్లవ పోరాటాల పెరుగుదల, మూడు ముఖ్య విషయాలను తెలియజేస్తాయన్నారు. ఒకటి సామ్రాజ్యవాద దేశాలయెడల జాతీయ అసంతృప్తి పెరిగిపోయి ఐక్య సంఘటన యేర్పాటుకు పరిస్థితులు అత్యంత సానుకూలంగా ఉన్నాయి. రెండు వలస దేశాలలోని బూర్జువావర్గం, సామ్రాజ్యవాదదేశాల బూర్జువా వర్గాల మధ్యగలవైరుధ్యం, ఈ రెంటిమధ్య భూస్వామ్యవర్గాల మధ్యగల వైరుధ్యం తీవ్రమైన కారణంగా విప్లవ ప్రజావుద్యమాల అభివృద్ధికి సానుకూల పరిస్థితులు మరింత యెక్కువయ్యాయి. మూడు సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం ప్రజలలో జాతీయ సంస్కరణ వాదులను బలహీన పరచుటతో ఆ పార్టీలలో పెటీ బూర్జువాల పార్టీలలో అతివాద జాతీయ విప్లవవర్గాలు ఏర్పడుటకు మార్గం ఏర్పడుతున్నది.

చైనా ప్రతినిధి వాంగ్‌మింగ్ భారత కమ్యూనిస్టుపార్టీ ఎత్తుగడలను సవివరంగా విమర్శించి, వాటిని అధిగమించుటకు మార్గాలను సూచించాడు. ఒంటెత్తు పోకడల కారణంగానే, గాంధీయిజం, జాతీయ సంస్కరణవాద ప్రభావాలు ప్రజలలో

1. డిమిట్రోవ్, జి. (1950) కార్మికవర్గ ఐక్యత, పాశిజాన్ని నిరోధించుట (ఆంగ్లంలో) 7వ. అ. క; పా. కాంగ్రెసు నివేదిక. పి.పి.హెచ్. పే. 51-52

వాస్తవంగా నడలకుండా వున్నవన్నారు. వీటినుండి భారత కమ్యూనిస్టులు బయట పడుట ఆరంభమైందని అంగీకరిస్తూ అదేకాలంలో జాతీయ కాంగ్రెసుతో సామ్రాజ్య వాద వ్యతిరేక ఐక్య సంఘటనకు పిలుపు, కార్మిక కర్షక సోవియట్లకు నష్టపరిహారం లేకుండా భూస్వాముల భూమిని స్వాధీనం చేసుకొనుటకు పిలుపునిచ్చుట తీవ్రంగా విమర్శించారు. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం ఈక్రింది ముఖ్యాంశాలపై జరగా లని సూచించారు. 1) బానిస రాజ్యాంగ 1935 చట్టానికి వ్యతిరేకంగా 2) రాజకీయ ఖైదీలనందరిని విడుదల చేయాలని 3) ప్రజావ్యతిరేక, అత్యవసర తదితర చట్టా లను రద్దుచేయాలని 4) వేతనాల తగ్గింపుకు, రిట్రెంచిమెంటుకు వ్యతిరేకంగాను 5) పన్నుల భారానికి. అధిక భూమిశిస్తుకు, శిస్తుకట్టనివారి భూములను జప్తుచేయుటకు వ్యతిరేకంగా 6) ప్రజాస్వామ్య హక్కుల కొరకు పోరాటాలు సాగించాలన్నారు.

భారత కమ్యూనిస్టులు కాంగ్రెసు, దాని అనుబంధ సంస్థలలో అవి సంస్క రణ వాదాన్ని అనుసరించుతున్నా, వారు కలిసివచ్చినా రాకపోయినా తమ స్వతంత్ర నిర్మాణం కొనసాగిస్తూ ఎట్టి పరిస్థితులలోను వాటిలో పనిచేయుట మానరాదని, సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనా విధానాలలో పని కొనసాగించి తమ అగ్రగామి దళపాత్రను నిరూపించుకొనాలని బ్రెజిల్ అనుభవాలను ఉదహరించుతు వాంగ్‌మింగ్ వివరించారు. ఎట్టి పరిస్థితులలోను జాతీయ కాంగ్రెసులో పనిచేయుట మానరా దన్నారు[1].

ఇండియా ప్రతినిధి తాంబె ఒంటెత్తు పోకడ తప్పులను సంస్కరణవాద కార్మిక సంఘాలలో పనిచేయకుండుట, అకారణంగా కార్మికవర్గంలో చొరవను కోల్పోవుటను అంగీకరిస్తూ "తన ప్రధాన దాడిని జాతీయ బూర్జువా నాయకత్వపు సంస్కరణవాదపు ప్రమాదంపై కేంద్రీకరించాడని[2]" దత్తాగుప్తా రచనవలన తెలుస్తు న్నది. అధికారి మార్క్సిస్టు మినలిని 1971లో 7వ కాంగ్రెసులో భారత ప్రతినిధి వర్గం పాల్గొనలేదని వ్రాశారు. జెనెడి ఓవర్‌స్ట్రీట్, మార్షల్ విండ్ మిల్లరులు, 'కమ్యూనిజం ఇన్ ఇండియా' అను గ్రంథంలో భారత ప్రతినిధులుగ 7వ కాంగ్రెసు వెళ్ళుతున్న దేశపాండె, మిరాజ్‌కర్‌లను ప్రభుత్వం సింగపూరులో అరెస్టు చేసిందని పేర్కొనుట, అధికారి వ్రాతనే బలపరస్తున్నది. దత్తాగుప్తా ఇంప్రికార్ 15 (36) 17 ఆగష్టు 1935, 946-47 పేజీలలోని తాంబె ఉపన్యాసం ఉదహరించుటతో చారి త్రకాంశాలలో యింకా అస్పష్టత సందిగ్ధతవున్నా, బూర్జువా వర్గంతో సహకారం, సంఘటనలపై భారత కమ్యూనిస్టు పార్టీలో 1930 దశకంలోనే రెండు దృక్పథాలు కలవనుట స్పష్టం.

---

1. దత్తాగుప్తా, సో (1980) కొమింటర్న్ ఇండియా వలస సమస్య 1920-37 (ఆంగ్లంలో) పే. 220
2. అదే పే. 217

## దత్తు-బ్రాడ్లీల సిద్ధాంత పత్రము

వలస దేశాలలో జాతీయ విముక్తి పోరాటాలను సమీక్షించి; 7వ అంతర్జాతీయ కమ్యూనిస్టు మహాసభ రూపొందించిన, జాతీయ ఐక్యసంఘటనా కార్యక్రమాన్ని ఆధారం చేసుకొని భారతదేశ పరిస్థితులకు అన్వయించి ప్రముఖ బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ నాయకులు పామీదత్తు, బెన్‌బ్రాడ్లీలు ఒక సిద్ధాంత పత్రాన్ని భారత దేశానికి పంపారు.

భారత కమ్యూనిస్టుపార్టీ జాతీయ కాంగ్రెసుతో ఐక్య సంఘటనా ఎత్తుగడలు అవలంభించి సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ ఐక్య సంఘటనా కార్యక్రమాన్ననుసరించి స్వాతంత్ర్య పోరాటాన్ని కొనసాగించాలనే మౌలిక విధానాన్ని దత్తు-బ్రాడ్లీల సిద్ధాంతం సూచించింది, ముఖ్యాంశాలు క్లుప్తంగా యిలా వున్నవి.[1]

జాతీయ కాంగ్రెసు శాసనోల్లంఘనోద్యమం విరమించి పోరాటాన్ని ఎన్నికల రంగానికి పరిమితం చేసింది. ఎన్నికల అనంతరం మంత్రివర్గాలను స్వీకరించాలా కూడదా? అనే సమస్యపై తీవ్ర భేదాభిప్రాయాలతో చీలివుంది. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రతిఘటనోద్యమమేది లేదు. ఇదీ భారతదేశ పరిస్థితి.

కార్మిక కర్షక తదితర ప్రజాసామాన్యం అర్థిక యిబ్బందులకులోనై జీతాల కోతకు, వడ్డీవ్యాపారుల, రెవెన్యూ అధికారులపీడనకు వ్యతిరేకంగా లక్షలకొలది సమ్మెలు తదితర పోరాటాలలో పాల్గొంటున్నారు. కాని ఐక్య కేంద్రీకృత నాయకత్వమేదిలేదు. ప్రజా కోర్కెలను సాధించేందుకు ఐక్య ప్రజా సంఘటనోద్యమాన్ని నిర్మించుటయే నేటి కీలకసమస్య.

జాతీయ కాంగ్రెసు లక్నోలో సమావేశం కాబోతుంది. వామపక్షశక్తులు సామ్రాజ్యవాద వ్యతిరేక రాజీలేని పోరాటం కొరకు సోషలిస్టు భావాల ప్రభావాన్ని ప్రతిబింబించే కార్యక్రమాలకొరకు, కార్మిక, కర్షక సంఘాల నిర్మాణంకొరకు ఒత్తిడి చేస్తున్నాయి. తరతమ భేదాలతో సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకించే వారందరిలో ఐక్యత సాధించే ప్రయత్నం చేస్తున్నాయి.

భారత జాతీయ విముక్తిపోరాటానికి ఐక్యత ప్రథమావశ్యకతయని అందరూ అంగీకరిస్తారు. ఇది సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులందరి పుమ్మడి పోరాట ఐక్యత. కాంగ్రెసు నాయకులు కొందరు మితవాద, లిబరల్ శక్తులు, బ్రిటిష్‌పాలకుల మిత్రులతో ఐక్యత అవసరమంటున్నారు అట్టి ఐక్యత సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని బలపరచదు పైగా పోరాటాన్ని విసర్జించుటద్వారా ఏర్పడుతుంది స్వతంత్ర పోరాటాన్ని బలహీనపరుస్తుంది పార్లమెంటరీ ఎన్నికలు, మంత్రివర్గాల పంపకాల ఐక్యత.

సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్య సంఘటనలో భాగస్వాములయ్యే ప్రజల వర్గ వ్యవస్థను దృష్టిలో వుంచుకొనాలి. సామ్రాజ్యవాదంచే అణచబడుతున్న అత్యధిక

---

1. సత్యనారాయణ, కంభంపాటి (1983) ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర పే. 255-72.

ప్రజల వుమ్మడి పోరాటంలో పాల్గొనుటకు సిద్ధంగావున్న వర్గాలన్నీ ఐక్యం కాగలవు అట్టి ఐక్యతకు జాతీయ కాంగ్రెసులోని శక్తులన్నిటిని, కార్మిక, కర్షక, యువజన సంఘాలన్నిటిని బ్రహ్మాండ ఐక్య సంఘటనలో ఉమ్మడివేదికపై ఐక్యమొనర్చగల ప్రాతిపదికలో యీ క్రింది అంశాలు భూమికగా వుండాలి. 1) సామ్రాజ్యవాదానికి బానిస రాజ్యాంగానికి వ్యతిరేకంగా భారతదేశానికి సంపూర్ణస్వాతంత్ర్యంనకు పోరాట పంథా 2) శ్రామిక ప్రజల ప్రధాన అవసరాలకై తీవ్రపోరాటం. ఇవే ఐక్య ప్రజా సంఘటనా ముఖ్యాంశాలు.

జాతీయ కాంగ్రెసు స్వాతంత్ర్యానికై పోరాడే ప్రజల ఐక్య సంఘటన ప్రజలలో విస్తృత భాగాలను ఐక్యపరచి బ్రహ్మాండమైన కర్తవ్యాన్ని నిర్వహించింది. జాతీయ విముక్తికోరే అన్ని వర్గాల ప్రధాన ప్రజా సంస్థగా వుంది. ప్రతిపాదిస్తున్న సూచనలు ఈ ఐక్యతను మరింత విస్తృతపరచు ప్రయత్నం మాత్రమే సామ్రాజ్య వాద వ్యతిరేక ఐక్య సంఘటనను నిర్మించుటలో జాతీయ కాంగ్రెసు ప్రధానపాత్ర వహించగలదు. నిర్మాణ కార్యక్రమాన్ని మార్చుకొనుటద్వారా కాంగ్రెసు సామ్రాజ్య వాద వ్యతిరేక ఐక్య సంఘటనగా రూపొందుతుంది. వామపక్షమైన కమ్యూనిస్టులు శాసనోల్లంఘనాన్ని 1922లో విరమించినపుడు స్వాతంత్ర్య నిర్వచనంలోని అస్పష్టత, సామ్రాజ్యవాద వ్యతిరేకతలోని వూగిసలాటను రైతులకు వ్యతిరేకంగా భూస్వాములను బలపరచుటను గాంధీ-ఇర్విన్ వొడంబడికను రౌండుటేబులు సమావేశంతో సహకారమార్గం చేబట్టుట. 1934లో పోరాట విరమణను పూనాలో నిర్ణయించుటను, అ విధానాలకు మూలం బూర్జువా నాయకత్వమని విస్మరించారు ఆ వర్గం యొక్క ప్రయోజనాలు తరచు ప్రజా ప్రయోజనాలతో, జాతీయ పోరాట ప్రయోజనాలతో ఘర్షణపడుతున్నాయని విమర్శించారు. అట్టి విధానాలను కాంగ్రెసు అవలంభించుటను విమర్శించుట స్వాతంత్ర సమరయోధులను, వారి పోరాటాన్ని బలపరచు సదుద్దేశ్యంతో మాత్రమే జరిగింది. ఆ విమర్శన నాయకత్వాన్ని వొక నూతనదశకు అభివృద్ధి చేస్తుంది.

జాతీయ కాంగ్రెసు స్వాతంత్ర్య పోరాటాన్ని బలపరచే కార్మిక, కర్షక యువజన శక్తులందరిపై ఆధారపడక వ్యక్తులకు పరిమితమయ్యే సభ్యత్వంమీద ఆధారపడివుంది. వీరి సంఘాలు కాంగ్రెస్ వెలుపల వున్నాయి. కాంగ్రెసుతో ఐక్యసంఘటనా వొప్పందం ద్వారాకాని, సమిష్టి ప్రాతినిధ్యం ద్వారాగాని అవి ఐక్యత సాధిస్తేనే నిజమైన సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాసంఘటనగా, విస్తృత జాతీయ ఐక్యసంఘటనగా అది రూపొందగలదు. అధిక సంఖ్యాక కార్మిక, కర్షక, మధ్యతరగతి, యితర ప్రజానీకాన్ని ఏకైక స్వాతంత్ర్య సంగ్రామ సైన్యంగా సమీకరించగలుగుతుంది. కార్మికవర్గం అగ్రగామిపాత్ర నిర్వహించుతుంది. "దత్తు, బ్రాడ్లీల 'సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాసంఘటన' భారత జాతీయ కాంగ్రెసు పునాదిగా 'ఐక్య జతీయ సంఘటన పంథా కార్మిక, కిర్షక సంఘాలు అనుబంధసంస్థలుగా యేర్పడి, పోరాటాలకు నాంది ప్రస్తావన అయింది. జవహర్‌లాల్ నెహ్రూ నుండి సుముఖ స్పందనలతో, "భారత కమ్యూనిస్టు పార్టీ జాతీయ

రంగంలో అత్యధిక మిత్రులు లభించుటకు," అతివాదం అభివృద్ధి చెందుటగా తోడ్ప డింది. సోషలిస్టు పార్టీతో ఐక్యసంఘటన యేర్పడుటకు, నెహ్రూవాదులు అందులో చేరుట జరిగింది కొన్ని రాష్ట్ర కాంగ్రెసులు అతివాదుల నాయకత్వంలోనికివచ్చాయి. జాతీయోద్యమం విస్తరించి బలాన్ని చేకూర్చుకొంది. అతివాదులు, వారి మిత్రులు, కాంగ్రెసులో బలమైన శక్తిగా రూపొందారు[1]."

కాంగ్రెసు నిబంధనావళిని మార్చవలసిన అవసరముంది. ప్రజానీకంతో ప్రత్యక్ష సంబంధం నిరంతరం కలిగివుండుటకు కార్మిక, కర్షక, యువజన సంఘాలు, కాంగ్రెసు రాష్ట్ర, జిల్లా, తాలుకా, గ్రామస్థాయిలలో తమ ప్రతినిధులను పంపే హక్కు, నిబంధనావళిలో చేర్చాలి. ఈ సమిష్టి ప్రాతినిధ్య పద్ధతి, ప్రజా సంఘాలకే గాక, అంతకంతకు ప్రజానీకాని కంతటికి విస్తృతంగా వ్యాపిస్తుంది. ఈ పద్ధతి యూరోపియన్ లేబరు పార్టీలకేగాక, ప్రథమంలో చైనా కొమింగ్‌టాంగ్ పార్టీలో సత్ఫలితాలను యిచ్చింది. కాంగ్రెసు నిబంధనావళిలో సమిష్టి ప్రాతినిధ్యసూత్రం చేర్చుటకు కొంతకాలం పట్టవచ్చును కాన అన్ని స్థాయిలలో కాంగ్రెసు కమిటీలు, కార్మిక, కర్షక, యువజన సంఘాలు, కాంగ్రెసు సోషలిస్టు, తదితర సామ్రాజ్యవాద వ్యతిరేక సంస్థల గ్రూపులతో సంయుక్త సంఘాలను యేర్పరచాలి. ఐక్యసంఘటనలో సంయుక్తంగా సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రచారం సాగించుట అత్యవసరం. బొం బాయి, కలకత్తాలలో యిట్టి సంఘటనలు తాత్కాలికంగా పనిచేస్తున్నాయి. వాటిని శాశ్వత ప్రాతిపదికపై నిర్మించాలి. బొంబాయిలో రాజ్యాంగచట్టానికి వ్యతిరేకంగా ఐక్యసంఘటన ప్రదర్శనలు జరిగాయి. ఇవి ప్రాథమికచర్యలే అయినా సామ్రాజ్య వాద వ్యతిరేక ఐక్యసంఘటనకై ప్రజలలో ప్రబలే వాంఛను, ఆశయాలను, అవకా శాలను ప్రతిబింబించుచున్నవి. ఈ కర్తవ్యాల కనుగుణంగా ప్రజలపాత్రను యినుమ డింప జేయుటకు, కాంగ్రెసు యంత్రాంగాన్ని ప్రజాతంత్రం చేయాలి. తదను గుణంగా నిబంధనావళిని సవరణచేయాలి.

**ఐక్యసంఘటన కార్యక్రమము : ప్రజాపోరాట పద్ధతులు :**

జాతీయ కాంగ్రెసుకేగాక, సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యసంఘటన కంతటికి వొక స్పష్టమైన ఆచరణ కార్యక్రమ ముండాలి. లాహోర్ కాంగ్రెసు సంపూర్ణ స్వాతంత్ర్యమనగా సైనిక, రక్షణ, దేశ, విదేశ వ్యవహారాలపైన పన్నులు, వ్యాపా రం, ద్రవ్య, ఆర్థిక విధానాలన్నిటిపై సంపూర్ణ అధికారం కలిగియుండుటయని నిర్వ చించగా, కాంగ్రెసు వర్కింగు కమిటి, సెప్టెంబరు 1934 వార్ధా సమావేశంలో సం పూర్ణ స్వాతంత్ర్య తీర్మానానికి విరుద్ధంగా, అధినివేశ ప్రతిపత్తిని పునరుద్ఘాటించింది.

సంపూర్ణ స్వాతంత్ర్యమే పోరాట లక్ష్యమని, సామ్రాజ్యవాదంతో రాజీని, రాజీ సంభాషణలను, నూతన రాజ్యాంగచట్టాన్ని తిరస్కరించాలి. స్వాతంత్ర్య పోరాట కార్యక్రమాన్ని, సామ్రాజ్యవాద వ్యతిరేక తక్షణ రాజకీయ కోర్కెలతో, కార్మిక, కర్షక, యువజన తక్షణ కోర్కెలతోను జతపరచాలి. ఆయా సంఘాల ప్రతి

1. జోషి, పి. సి. (1971) ఇండియన్ లెఫ్ట్ రివ్యూ. వా. 1. నం. 4. పే. 33.

నిధులు కార్యక్రమాలను ఉమ్మడిగా రూపొందించుకొనవచ్చు. ఈ క్రింది కనీస కోర్కెలపై యేకాభిప్రాయానికి రావచ్చు. అవి : 1) భారతదేశ గమ్యం సంపూర్ణ స్వాతంత్ర్యం 2) వాక్సభా, పత్రికా, సంఘ సమావేశ స్వాతంత్ర్యం, సమ్మె, పికిటింగు స్వాతంత్ర్యం గ్యారంటీ చేయాలి. 3) సకల నిర్బంధచట్టాలు, ఆర్డినెన్సులు, కార్మిక వ్యతిరేకచట్టాలు రద్దుచేయాలి. 4) రాజకీయ ఖైదీలందరినీ, డిటెన్యూలు, ఇంటర్నీలును విడుదల చేయాలి. 5) కార్మికుల జీతాలను తగ్గించరాదు, భర్తరఫ్ చేయరాదు, 8 గంటల పని, కనీసజీతం నిర్ణయించాలి. రైతుల శిస్తులు సగానికి తగ్గించాలి. సామ్రాజ్యవాదులు, సంస్థానాధీశులు, జమీందారులు, వడ్డీ వ్యాపారస్తులు రైతుల భూములను లాక్కొనరాదు. భేదఖలు చేయరాదు.

పోరాటానికి సంబంధించిన తక్షణ కోర్కెలను స్థానిక పరిస్థితులబట్టి, పోరాట దశలబట్టి రూపొందించుకొనవచ్చు.

ప్రజా సమీకరణకు, వృద్యమాని క(ం)తటికి ఒక కేంద్ర రాజకీయ నినాదం అవసరం. రాజ్యాంగ నిర్ణయసభను సమావేశపరచాలనేదే ఆ కేంద్ర నినాదం.

ప్రజలు యిప్పటికి అహింసా సిద్ధాంతంపై విశ్వాసం కలిగివున్నమాటనిజమే. అయితే దాన్ని పిడివాదంగా చేసి అన్నితరగతులవారు కట్టుబడి వుండాలనే షరతును విధించుట జాతీయసంఘటన ఐక్యతకు ఆటంకంకలిగించుటయే అగుతుంది. అహింసావాదం వ్యక్తిగత హింసావాద నిరర్థ విధానాలకు అల్ప సంఖ్యాకుల దుందుడుకు చర్యలకు వ్యతిరేకంగానే గాక పటిష్టమైన ప్రజా కార్యాచరణను బంధించి వుంచుటకు, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా అత్యంత బలీయమైన వర్గపోరాట రూపాలు అభివృద్ధికాకుండా మాత్రమే వుపయోగపడుతుంది సామ్రాజ్యవాదుల హింసాకాండకు స్వేచ్ఛనిచ్చి జాతీయ పోరాటంలో ప్రభుత్వ హింసాకాండకు వ్యతిరేకంగా జరిపే ప్రతిఘటనను నీరుకార్చింది. జాతీయ పోరాటం పురోగమించకుండా నిరోధించి నిర్వీర్యశక్తిగా తయారైంది.

భారత జాతీయోద్యమం తన శత్రువును ఓడించదలచకొంటే అహింసా సిద్ధాంతానికి స్వస్తిచెప్పాలి, ఈ సమస్యపై నిశితమైన సిద్ధాంత పోరాటం అవసరం. ఈ పోరాటం నిరంతరం విశదీకరించే రూపంలో ఒప్పించే విధానంలో వుండాలి. జాతీయైక్య సంఘటనను చీల్చేవిధంగా వుండరాదు, ప్రాధాన్యత ప్రజపోరాటాన్ని అభివృద్ధిచేయుటకివ్వాలి. నిర్మాణ రంగంలో ప్రధాన కర్తవ్యం కార్మిక, కర్షక, మధ్యతరగతి తదితరులను సంఘటిత పరచుట, వారి ప్రధాన కోర్కెలపై పోరాడుట, ఆ పోరాటాన్ని సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో జతపరచుటగ నెంచాలి.

సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్య ప్రజాసంఘటనకు కాంగ్రెసు తన వ్యవస్థను నిబంధనావళిని, విధానాన్ని మార్చుకొనునట్లు చేయుటకు వామపక్ష శక్తులన్నీ పై ప్రధాన కోర్కెలకై సమిష్టిగా పోరాడుట అవసరం. వామపక్ష శక్తులమధ్యగల భేదాభిప్రాయాలను సమగ్రంగా, సహృదయ్భావంతో చర్చించి పరిష్కరించుకొనుట అవసరం. వాంఛనీయం. రోజువారి పోరాటాల్లో యే యే సమస్యలపై కాంగ్రెసుతో

ఒప్పందాలు సాధ్యమా, ఆయా సమస్యలపై సహకరించుకొనుటకు అభిప్రాయ భేదాలు అడ్డుకారాదు. వామపక్ష శక్తులను పటిష్టమొనర్చుట ద్వారా ఉమ్మడి పోరాటంలో సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజా ఐక్య సంఘటన తొలిదశను నిర్మించవచ్చు. ఈ దశలలో ఐక్య సంఘటన స్థానిక, జిల్లా ప్రాతిపదికలపై నిర్మించబడేటట్లు శ్రద్ధ వహించాలి.

రానున్న ఎన్నికలలో సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యసంఘటన పంథాను సంపూర్ణ స్వాతంత్ర్యం కొరకు ఖచ్చితంగా పోరాడాలనే విధానాన్ని ప్రజల ముందుంచాలి. సామ్రాజ్యవాదులకు, వారి మిత్రులకు వ్యతిరేకంగా ఐక్యసంఘటన పోరాడుతు, ఐక్యసంఘటన వోట్లు చీలకుండా చూడాలి. ఈ లక్ష్యాన్ని సాధించుటకు మార్గం విషయమై పోరాటవాదుల దృష్టిని కేంద్రీకరించి, సమాలోచనలు జరపాలి. సంపూర్ణ స్వాతంత్ర్యం, ప్రజానీకపు కోర్కెలకై పోరాడే ప్రాతిపదికపై నిర్మించబడే సామ్రాజ్యవాద వ్యతిరేక కూటమి ఈ కార్యక్రమంపై కొన్ని స్థానాలలో తన అభ్యర్థులను నిలబెట్టేందుకు కాంగ్రెసు నాయకత్వంతో ఒప్పందం కుదుర్చుకొంటుంది. కనీసం ప్రయత్నిస్తుంది లేదా తమ కార్యక్రమ ప్రాతిపదికపై కొన్ని కాంగ్రెసు స్థానాలు తమకు కేటాయించునట్లు చూడాలి. వారు జాతీయ ఐక్య సంఘటనా అభ్యర్థులుగ గుర్తించబడాలి. మిగతా స్థానాలలో వారు కాంగ్రెసు కార్యక్రమాన్ని ఆమోదించి, అధికార కాంగ్రెసు అభ్యర్థులను బలపరచాలి. ఉభయపక్షాలు యిట్టి ఒప్పందాన్ని జాగ్రత్తగ రూపొందించుకొనాలి సుహృద్భావంతో యిది సుసాధ్యం. అయితే ఈ ఐక్యత సామ్రాజ్యవాద వ్యతిరేక కూటమి, వామపక్ష శక్తుల గొంతునులుముటకుపయోగపడకుండునట్లు ఉభయులూ చూడాలి.

బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశంపై బానిస రాజ్యాంగ చట్టాన్ని రుద్దుతున్నది. దానిని తిరస్కరించి, సహకరించమని ప్రకటించుట మాత్రమే చాలదు. ప్రత్యామ్నాయంగా రాజ్యాంగ నిర్ణయ సభను సమావేశపరచాలనేది మన కేంద్ర రాజకీయ నినాదంకావాలి. అందుకు సమాన, సార్వజనీన, వయోజన, ప్రత్యక్ష రహస్య ఓటింగుపై ఎన్నికైన ప్రతినిధులు సమావేశపరచబడాలి. ఈ కేంద్ర నినాదం ప్రజల పాక్షిక, తక్షణ కోర్కెలపై జరిగే పోరాటాలన్నిటిని ఐక్యపరచాలి.

ప్రపంచ యుద్ధ ప్రమాదం స్పష్టంగావుంది. కాన భారతదేశంలో జాతీయైక్య సంఘటన ప్రాధాన్యత హెచ్చింది. అంతర్జాతీయ పరిస్థితి అతి విస్తృత సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్య సంఘటనను వేగంగా నిర్మించవలసిన అవసరాన్ని తెలియజేస్తుంది.

స్వాతంత్ర పోరాటాన్ని బలపరచే వారందరూ ఆలోచించుటకు తాము ఈ ప్రతిపాదనలు చేస్తున్నామన్నారు. ప్రజా ఐక్యసంఘటన ఏర్పడితే భారత జాతీయోద్యమం త్వరితంగా నూతన స్వభావాన్ని సంతరించుకొంటుంది.

దత్తు, బ్రాడ్లీలు ఆశించిన విధంగా ఈ సిద్ధాంత పత్రంపై కమ్యూనిస్టులే గాక, సోషలిస్టులు, వామపక్ష కాంగ్రెసువాదులు విస్తృతంగాచర్చించారు. ఈ పత్రం భారత

జాతీయోద్యమంలో నూతన స్వభావాన్నేగాక కమ్యూనిస్టు, సోషలిస్టు, తదితర వామ పక్షాలకు నూతన ఆలోచన, ఆచరణ ఆయుధాన్ని యిచ్చింది.

**అంతర్జాతీయ 7వ, కమ్యూనిస్టు మహాసభ నిర్ణయాలు, భారత కమ్యూనిస్టుల అవగాహన**

దత్తు-బ్రాడ్లీల సిద్ధాంత పత్రం ప్రకటించిన వెంటనే భారత కమ్యూనిస్ట్‌పార్టీ, దానికి తమ ఆమోదాన్ని ఆ అవగాహనను బలపరస్తు ప్రకటనగావించింది. దేశంలోని కమ్యూనిస్ట్ వర్గాలన్నిటికి ఆమోదయోగ్యమౌతుందని, సామ్రాజ్యవాద వ్యతిరేక వుద్యమాన్ని అంతర్జాతీయ అవగాహనకు అనుసంధించుటకు, రాజకీయ విధానాన్ని ఆ మార్గంలో తిరిగి రూపొందించుటకు జోషినాయకత్వంలో ప్రయత్నించింది. అదే కాలంలో 6వ అంతర్జాతీయ కమ్యూనిస్ట్ కాంగ్రెసునిర్ణయాలను, 7వ కాంగ్రెసు నిర్ణయాలు ఏ విధంగాను త్రోసిబుచ్చలేదనే అవగాహనను కొనసాగించింది. అనగా ఆరవ కాంగ్రెసు నిర్ణయాల ప్రాతిపదికపైనే మారిన నూతనపరిస్థితులలో నూతన ఎత్తుగడలను రూపొందించు ప్రయత్నం జరిగింది. అంటే 6వ కాంగ్రెసు "అతివాద" అవగాహననుండి పూర్తిగ బయటపడజాలకపోవుటను తెలియజేస్తుంది. బహుశా వలస సమస్యపై 6వ కాంగ్రెసు నిర్ణయాలకు 7వ కాంగ్రెసు నిర్ణయాలు భిన్నమైనవని స్పష్టంగా పేర్కొన్నందున కావచ్చు[1] అని దత్తాగుప్తా అభిప్రాయం.

భారత జాతీయ కాంగ్రెసు చట్టబద్ధ రాజకీయ సంస్థగా పని చేస్తున్నది.దానిలో కమ్యూనిస్టులు విడివిడిగాచేరి పనిచేయాలని 7వ అంతర్జాతీయ కమ్యూనిస్టు కాంగ్రెసు చేసిన సూచనపై కమ్యూనిస్టు పార్టీలో యేకాభిప్రాయంలేదు. భారత కమ్యూనిస్టు పార్టీ పొలిట్‌బ్యూరో, కాంగ్రెసులో కమ్యూనిస్టులుచేరి పని చేయాలనే నిర్ణయాన్ని 1936 మధ్యకుగాని చేయజాలకపోయింది. కొందరు ఆ నిర్ణయాన్ని అంగీకరించక, భిన్నాభిప్రాయ పత్రాన్ని సమర్పించుట, పార్టీలో 6వ అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ నిర్ణయాల "అతివాద-ఒంటెత్తు పోకడల" ప్రభావం యెంతగా వుందో తెలియజేస్తుంది.

"సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజా ఐక్యసంఘటనను" రూపొందించు విధానాలను దత్తు-బ్రాడ్లీలు వివరించుతూ ప్రత్యేకంగా కాంగ్రెసుపై కేంద్రీకరించారు. "భారత ప్రజల జాతీయ పోరాటంలో యిప్పటికే జాతీయ కాంగ్రెసు ఐక్యసంఘటనగా లేదా?" అని కూడా ప్రశ్నించారు. కమ్యూనిస్టులకు యిట్టి ప్రశ్న ఊహించరానిది.ఆ ప్రశ్నకు "అవును" అని దత్తు-బ్రాడ్లీలు, జాతీయ విముక్తికి విస్తృత భారత ప్రజానీకాన్ని ఐక్యపరచే "మహత్తరకార్యాన్ని" కాంగ్రెసు చేసిందని ప్రకటించారు. అంతేగాక, "జాతీయ పోరాట ప్రజాసైన్యం"గా కాంగ్రెసు ప్రాతినిధ్యం వహించుతుందని తెలిపారు. అది సామ్రాజ్యవాద వ్యతిరేక అన్ని పక్షాలవేదికగా వుపయోగపడదాయని ప్రశ్నించారు. "జాతీయ కాంగ్రెసు, సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజా సంఘటనను

1. దత్తాగుప్తా సో. (1980) కొమింటర్న్ ఇండియా వలస సమస్య 1920-37 పే 227

వాస్తవం చేయుటలో మహత్తర పాత్ర వహించగలదు.[1]" ఇంకా "జాతీయ కాంగ్రెసు తన నిర్మాణ నిబంధనలను, కార్యక్రమాన్ని మార్పులుచేసి, సామ్రాజ్యవాద ప్రజా సంఘటనగా కాంగ్రెసును చేయగల అవకాశాలున్నవి, పేరులో యేమున్నది వాస్తవికత కావాలి-" అని దత్తు-బ్రాడ్లీలు వివరించారు.

"దత్తు, బ్రాడ్లీల రెండోపత్రం భారతదేశంలో ట్రేడు యూనియన్‌ల ఐక్యతా మార్గం" మార్చి 1936లో ప్రకటించబడింది. అన్ని ట్రేడు యూనియనులు విశేషముగా ఆదరించాయి. దానిలోని నిజాయితీ, యన్. యం. జోషిని కదలించింది. కార్మికవర్గ ఐక్యత నిర్మాణానికి, పోరాటానికి తోడ్పడి, ఎ. ఐ. టి. యు. సి. ఆధ్వర్యంలో ఐక్య కార్మికోద్యమానికి తోడ్పడింది. పోరాటాల నూతనశకం ప్రారంభమైంది [2]"

కాంగ్రెసు నిజమైన ఐక్యసంఘటన కాగలదని ఆశించిన దత్తు-బ్రాడ్లీలు తమ ప్రకటనలో తదితర అవకాశాలను విస్మరించి, ఆ కాంగ్రెసును ఆ విధంగా రూపొందించుటపై కేంద్రీకరించారు. అయితే యీ పని భారత కమ్యూనిస్టులు నిర్వహించాలి. కాంగ్రెసులో యీ మార్పుకు నాలుగు సంస్కరణలు అది ఆమోదించవలసి వుంటుంది. "సమిష్టి సభ్యత్వం" అనగా ప్రజాసంస్థలు సమిష్టిగా కాంగ్రెసులో సభ్యత్వం స్వీకరించు అవకాశాన్ని కలుగజేయుట, కేంద్రీకృత అజమాయిషీకాక సంస్థ నిర్మాణాన్ని ప్రజాస్వామీకరణ" చేయుట, సామ్రాజ్యవాద వ్యతిరేకతలోని అస్పష్టతను విడనాడి సంపూర్ణ స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని కోరుట, చివర అంశంగా "అహింసా పిడివాదాన్ని" విడనాడుట, దత్తు-బ్రాడ్లీల ప్రకారం కాంగ్రెసు అనుసరించాలి. ప్రధమ అంశం ప్రాధమికమైనది, యితర అంశాలుకు అది నాంది అగుతుంది ట్రేడు యూనియన్‌ల వంటి ప్రజాసంస్థలకు సమిష్టి సభ్యాత్వాన్నిచ్చుట అతివాదశక్తులను బలపరచుట అగుతుంది. అయితే వామపక్షాలు సాటిలేని ఐక్యతను సాదించవలసివుంది. అంచేత భారత కమ్యూనిస్టులు యితర వామపక్షాలతో సమిష్టి ప్రయోజన వొప్పందాలను చేసుకొనవలసి వుంటుంది దత్తు-బ్రాడ్లీలు తమ సిద్ధాంతములో కాంగ్రెలులోని వామపక్షాల ఐక్యత కాంగ్రెసు సోషలిస్టు పార్టీద్వారా సాధించవలసి వుంటుందని స్పష్టం చేసారు.

"సంపూర్ణ స్వాతంత్ర్యం కొరకై సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంకై ఒక కనీస కార్యక్రమ ముఖ్యాంశాలపై కాంగ్రెసు సోషలిస్టులు, ట్రేడు యూనియనిస్టులు, కమ్యూనిస్టులు, వామపక్ష కాంగ్రెసువాదులు ఐక్యం కాగలగాలి. ప్రజాసంస్థలను ప్రజా పోరాటాల అభివృద్ధికై, కాంగ్రెసు నిర్మాణ నిబంధనలలో, విధాన కార్యక్రమాలలో మార్పులకొరకు, యీ లక్ష్యసాధనకై నాయకత్వంలో మార్పులకై పోరాడుటకు ఐక్యం

---

1. జె నె డి ఓవర్‌స్ట్రీట్, మార్షల్ విండ్ మిల్లర్ (1960) కమ్యూనిజం ఇన్ ఇండియా. పెరినియడ్ ప్రెస్. బొంబాయి పే. 159-60లో, ఇంప్రికార్ XVI ఫిబ్రవరి 29, 1936. పే. 297-300 పేజీల నుండి ఉదహరించబడింది.
2. జోషి, పి. సి. (1971) ఇండియన్ లెఫ్ట్ రివ్యూ. వా. 1. నం 4. పే. 53.

కాగలగాలి. కాంగ్రెసులోని అన్ని వామపక్ష గ్రూపుల సంస్థగా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ప్రధానపాత్ర వహించవలసి వుంది. కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో కార్యక్రమం, ఎత్తుగడల సమస్యలపై సమగ్ర వివరణ, యీ సందర్భంలో అత్యంత ప్రాధాన్యత వహిస్తుంది" అని దత్తు-బ్రాడ్లీలు వివరించుట మరింత వెలుగును ప్రసరించింది దత్తు-బ్రాడ్లీలు కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ప్రధాన మైనారిటి అని, కాంగ్రెసులో మూడవ వంతు బలాన్ని కలిగివుందని, మెజారిటీ కాగల అవకాశాలున్నవని అంచెనా వేసారు. కమ్యూనిస్టులు, ప్రజాసంస్థలు కాంగ్రెసులో చేరుటతో, వామపక్షాలు కాంగ్రెసులో తప్పనిసరిగా మెజారిటీని పొందగలవని ఆశించారు. కాంగ్రెసులో ఆధిక్యత సంపాదించుట ధ్యేయమని అవకాశాలున్నవని పరోక్షంగా ప్రకటించారు.

దత్తు-బ్రాడ్లీలు తమ సిద్ధాంతంలో కాంగ్రెసు బూర్జువా గాంధీ నాయకత్వాన్ని ఖండించకపోయినా,నర్మగర్భంగా సిద్ధాంతపత్రం అంతటాయిమిడివుంది. కమ్యూనిస్టు పార్టీ 'అహింస'ను వ్యతిరేకిస్తుందని స్పష్టంచేయుట, ఎట్టి సారూప్యతలేకుండా గాంధీయన్ నాయకత్వాన్ని వ్యతిరేకించుతామని ఖండితంగా చెప్పుటయే అగుతుంది. దీని అర్థం బూర్జువా వర్గాలు సభ్యులుగా వుండుటను వ్యతిరేకించుటగాదు. అనేకచోట్ల సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాసంఘటన కార్మికులు, కర్షకులు, పెటీ బూర్జువాలపై ప్రధానంగా ఆధారపడుతుందని, కమ్యూనిస్టులు కాంగ్రెసు విస్తృతిని అన్నివర్గాల నైజాన్ని కొనసాగిస్తుందని అందులోని యేవర్గాన్ని బూర్జువావర్గంతోసహా త్రోసివేయకుండా జాగ్రత్త పడుతుందని నొక్కిచెప్పారు.

క్లుప్తంగా దత్తు-బ్రాడ్లీల సిద్ధాంతం డిమిట్రావ్ విధానాన్ని అనుసరించుతు, కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెసులోని వామపక్షాన్ని బలపరుస్తూ మితవాద నాయకత్వ పక్షంపై దాడిచేస్తుంది. దీని అర్థం కాంగ్రెసు సోషలిస్టుపార్టీతో సహకారమైత్రి-అంటే పైనుండి ఐక్య సంఘటన-కాంగ్రెసులో ప్రతిబింబించుట అంటే క్రింది నుండి ఐక్య సంఘటన అనుట స్పష్టం.భారత కమ్యునిస్టులు జాతీయ నాయకత్వాన్ని క్రింది కార్యకర్తలనుండి వేరుచేసి, కాంగ్రెసును సామ్రాజ్యవాద వ్యతిరేక, మరింత విప్లవ ఆయుధంగా కమ్యూనిస్టులు తప్పనిసరిగా రూపొందించాలి.[1]

## కమ్యూనిస్టుల-సోషలిస్టుల మైత్రీ సహకారం

కాంగ్రెసు సోషలిస్టు పార్టీని స్థాపించుధ్యేయంతో మే 1934లో జయప్రకాశ్ నారాయణ్‌ను కన్వీనరుగా, సోషలిస్టు భావాలు కలిగిన వారి సమావేశం పాట్నాలో ఎన్నుకొంది. రాజకీయ సన్నాహక కమిటీని మసానిగోరె, గౌతమ్, నంబూద్రిపాద్ లతో యేర్పాటు చేశారు. నంబూద్రిపాద్ ఒక సంయుక్త కార్యదర్శిగా అయ్యారు. జాతీయ కాంగ్రెసు మహాసభ అక్టోబరు 1934లో బొంబాయిలో జరుగునపుడు కొన్ని రోజులు ముందుగా కాంగ్రెసు సోషలిస్టుపార్టీ సంస్థాపక మహాసభ జరిగింది. రాజకీయ విధానం, కార్యక్రమం ఆమోదించబడింది. ప్రతి కాంగ్రెసు, సోషలిస్టు కాంగ్రెసులో విధిగా సభ్యుడై వుండాలని నిర్ణయించారు· "భారత జాతీయ కాంగ్రెసుచేత

1. జె వె డి ఓవర్‌స్ట్రీట్, మార్షల్‌లిండ్ మిల్లర్ (1960) కమ్యూనిజం ఇన్ ఇండియా పే. 161.

సోషలిజాన్ని లక్ష్యంగా ఆమోదింపజేయుట, దానిని సోషలిష్టు సంస్థగా మార్చుట కాంగ్రెసుసోషలిస్ట్‌పార్టీ లక్ష్యంగా[1]" ఆ మహాసభ ఆమోదించింది. అంతేగాక రైతు పోరాటాలద్వారా అనేక సోషలిస్ట్ బార్డోలీలను నిర్మాణంచేసి, ఆ పోరాటాలనుండి వచ్చిన కార్యకర్తలతో పార్టీ నిర్మాణంగావించి తద్వారా "అధికార పీఠాలైన పోలీసు ఠానాలను ఆక్రమించుట అనే వ్యూహరచన "సోషలిజం ఎందుకు?" అనే రచనలో జయప్రకాశ్‌నారాయణ్ ఒక పోరాటపంథాను కాంగ్రెసు కార్యక్రమానికి ప్రత్యామ్నాయంగా ప్రజలముందు, ముఖ్యంగా యువకుల ముందుంచారు.

బొంబాయి కాంగ్రెసు మహాసభముందు 1934లో జరిగిన ఎఐసిసి సమావేశంలో గాంధీజీ నాయకత్వాన్ని వ్యతిరేకించుటలో కాంగ్రెసు సోషలిస్ట్‌లు, కమ్యూనిస్ట్‌లు కలిశారు. ప్రధానపాత్ర సోషలిస్ట్‌లు వహించారు. సమావేశంలో జయప్రకాశ్ నారాయణ్ యితర సోషలిస్ట్‌లు పార్లమెంటరీ విధానాన్ని, గాంధేయ పోరాట విధానాన్ని తీవ్రంగా వ్యతిరేకించి, నిరసన తెలియజేశారు. "అక్టోబరులో జరిగిన బొంబాయి కాంగ్రెసు రాజకీయ మహాసభ అతివాద, మితవాదులమధ్య యుద్ధరంగమైంది. గాంధీజీ అనుచరులు, మితవాద పార్లమెంటరీవాదన నాయకులైన బులాబాయ్‌దేశాయి మున్షీలు ఒకవైపు, జయప్రకాశ్‌నారాయణ్, నరేంద్రదేవ్, సంపూర్ణానంద్, కమలాదేవి చటోపాధ్యాయ, యూసఫ్ మెహరాలీ కాంగ్రెసు సోషలిస్ట్ నాయకులు మరో వైపు సంఘర్షించారు· గాంధీయన్ కార్యక్రమానికి వ్యతిరేకంగా జయప్రకాశ్‌నారాయణ్ అతిముఖ్యమైన ఉపన్యాసమిచ్చారు[2].

బొంబాయి 1934 కాంగ్రెసు మహాసభలో ఎఐసిసిలో కాంగ్రెసు విధానాలను, గాంధీజీ నాయకత్వాన్ని సోషలిస్ట్ వర్గాలు తీవ్రంగా విమర్శించి, పార్లమెంటరీ విధానాన్ని నిరసించుట, కాంగ్రెసు సోషలిస్ట్‌పార్టీ ఏర్పాటుపట్ల కాంగ్రెసు నాయకత్వం సుముఖత చూపకపోగా వ్యతిరేక భావాన్ని కలిగివుంది. ఫలితంగా కాంగ్రెసు నాయకత్వం వొకవైపు మరింత మితవాదం వైపు పయనించుట, మరోవైపు అభివృద్ధికర సోషలిస్ట్ భావాలపెంపును పరోక్షంగా అరికట్టుటకు రాబోవు ఎన్నికలు, తదనంతర రాజీ విధానాల దృష్ట్యా సోషలిస్ట్ భావాలుకల నెహ్రూని అధ్యక్షునిచేసి, తమ విధావాలను కొనసాగించ నిర్ణయించాయి. లాహోర్ కాంగ్రెసులో కాంగ్రెసు అధ్యక్షునిగా నెహ్రూని చేసికొనసాగించ నిర్ణయించారు. లాహోర్ కాంగ్రెసు ప్రెసిడెంటుగా నెహ్రూ పేరును గాంధీజీ స్వయంగా ప్రతిపాదించారు లక్నో 1936 కాంగ్రెసులో గాంధీజీ స్వయంగా నెహ్రూపేరు ప్రతిపాదించారు. తదుపరి మరో సంవత్సరం పొడిగించారు. వామపక్ష నాయకుడైన సుభాస్‌చంద్రబోస్‌ను నెహ్రూ తరువాత అధ్యక్ష పదవికి ఎన్నికచేశారు. ఈ విధంగా వరుసగా మూడు సంవత్సరాలు వామపక్షీయు

---

1. నంబూద్రిపాద్, ఇ.యం.యస్. (1987) ఒక ఇండియన్ కమ్యూనిస్ట్ జ్ఞాపకాలు. (ఆంగ్లంలో) పే. 58.
2. నంబూద్రిపాద్ (1988) భారత స్వాతంత్ర్యపోరాట చరిత్ర (తెలుగులో) ద్వి భా. పే. 96

లైన నాయకులు సుభాస్‌చంద్రబోస్‌ను నెహ్రూ తరువాత కాంగ్రెసు అధ్యక్షపదవికి ప్రతిపాదించారు. ఈ విధంగా వరుసగా మూడు సంవత్సరాలు వామపక్ష నాయకులను కాంగ్రెసు అధ్యక్షులుగా చేసింది. వామపక్షవాదుల ఒత్తిడిగాక మితవాదులు యిష్టాను సారమే అంతా చేశారని నంబూద్రిపాద్ వివరించారు.[1]

కాంగ్రెసుచే సంపూర్ణ స్వాతంత్ర్యలక్ష్యాన్ని అమోదింపజేసిన విధంగానే క్రమేణా, కాంగ్రెసును సోషలిజం కొరకు పోరాడే సంస్థగా మార్చవచ్చు అనే ఆశ తోనే సోషలిస్టులు ముఖ్యంగా కార్మిక, కర్షక, యువజన, యితర ప్రజాసంస్థలద్వారా పొందగలిగే వర్గపోరాట బలంతో దేశ స్వాతంత్రం కొరకు జరిగే పోరాటంలో కాం గ్రెసును సమిష్టివేదికగా మార్చవచ్చని తలచారు. అందువలనే కాంగ్రెసు సభ్యత్వం, కాంగ్రెసు సోషలిస్టు పార్టీ పభ్యత్వానికి తప్పని షరతుగా నియమావళిలో చేర్చారు.

జనవరి 1936లో కాంగ్రెసు సోషలిస్టు పార్టీ మీరట్ సమావేశం జరిగింది. ఈ ద్వితీయ మహాసభలో సెక్రటరీ జయప్రకాశ్ నారాయణ్ చొరవతో కాంగ్రెసు సోషలిస్టు పార్టీ జాతీయ కార్యవర్గం, కమ్యూనిస్టులను సభ్యులుగా చేర్చుకొనుటను ఆమోదించుతూ, యేకగ్రీవంగా తీర్మానించింది. వ్యక్తిగతంగా పెట్టుకొన్న దరఖాస్తు లను కార్యవర్గం పరిశీలించి అమోదిస్తుందని స్పష్టం చేసింది. భారత కమ్యూనిస్టు పార్టీ రహస్యంగా వున్నందున యీ నిర్ణయం రహస్యంగానే వుంచబడింది.

అప్పట్లో మాస్కోలో బ్రిటిష్ సద్భావనా చర్యలకు సంబంధం లేకుండానే కమ్యూనిస్టు-సోషలిస్టులు భారతదేశంలో సహకారమైత్రీ చర్యలు భారత సోషలిస్టుల చొరవతోనే గైకొనబడినవి. కొన్ని సంవత్సరాల తరువాత ప్రకటించిన తన కథన ములో, మీరట్ సోషలిస్టు పార్టీ మహాసభకు కమ్యూనిస్టు పార్టీ తన సౌహార్ద్ర ప్రతి నిధిని పంపినా, పార్టీనుండి ఎట్టి అభ్యర్ధన లేదు, అధికార కమ్యూనిస్టు పార్టీ వైఖరి యింకా యేర్పాటువాదంలోనే వుంది, కాని సోషలిస్టు పార్టీ వ్యతిరేకధోరణిలో మాత్రం లేదు. జాతీయ కార్యవర్గ నిర్ణయం యేకపక్షంగా చేయబడింది.జయప్రకాశ్, కమ్యూనిస్ట్ పార్టీలో, ముఖ్యవర్గాలు ఐక్యసంఘటనకు సుముఖంగా వున్నారనే విశ్వా సంతోనే ఆ తీర్మానం చేయబడిందని నివేదించారు.[2]

ఆ కాలంలోని కమ్యూనిస్టుల వైఖరినిబట్టి, అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ ఐక్యసంఘటనా పంథాని ఆమోదించుటకు కమ్యూనిస్టులు విముఖులుగా వున్నారు. జనవరిలో దత్తు-బ్రాడ్లీల సిద్ధాంత ప్రకటన ప్రతివారికి అందేటప్పటికి, సెక్రటేరియన్

1. నంబూద్రిపాద్ (1988) భారత స్వాతంత్ర్య పోరాటచరిత్ర (తెలుగులో) ద్వి. భా. పే. 100
2. జెనె డి ఒవర్‌స్ట్రీట్, మార్షల్ విండ్ మిల్లర్ (1960) కమ్యూనిజం ఇన్ ఇండియా. పే. 161 లో, "టువర్డ్స్‌స్ట్రగుల్" బొంబె, పద్మ పబ్లికేషన్, జయ ప్రకాశ్ రచన 298 పే. నుండి ఉదహరింపు.

వైఖరిని కొనసాగిస్తూ, నూతన పంధాపై తీవ్రంగా ఆలోచించనే లేదు.[1] అనేకమంది సభ్యులు "బూర్జువా" జాతీయ కాంగ్రెసులో చేరుటకు వెనుకాడారు. ఇది సోషలిస్టులతో కలిసి పనిచేస్తున్నా కొనసాగించి, వీరితో కలసి సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటన యేర్పరుచుట ప్రమాదకరంగా నెంచరు. కాంగ్రెసు సోషలిస్టు పార్టీ సభ్యులుగా చేరమని కమ్యూనిస్టులను ఆహ్వానించిన తరవాత రెండు మాసాలకు మార్చిలో, సంవత్సరం క్రితం యేర్పడిన నూతన కేంద్రకమిటి, దత్తు - బ్రాడ్లీల సూచనలను, వాటిని అమలుచేయు పద్ధతులను, యంత్రాంగ విషయమై ఎట్టి ఆలోచన, చర్చలు, సమాలోచనలు, సంప్రదింపులు జరుపలేదు. పార్టీ కమిటిలోని "అతివాదుల" ప్రతిఘటనను ఎదుర్కొనవలసి వచ్చింది.

అంచేతనే పార్టీ మొత్తంగా, ఐక్యసంఘటనా పంధాకు చాల నెమ్మదిగా స్పందించింది, సమర్ధవంతమైన కేంద్ర నాయకత్వం లేనందున నిరవధికంగా నూతన పంధాపై వివిధ ప్రాక్షనులు అంతర్గత పోరాటం సాగించాయి.ఏ ప్రాక్షన్‌కు చెందని, నాయకత్వం చేబట్టగలిగిన పి. సి. జోషి గుర్తింపబడి, జనరల్ శెక్రటరీ అయ్యారు. శక్తివంతమైన అతని నాయకత్వంలో, కాంగ్రెస్ సోషలస్టు పార్టీ ప్రతిపాదనలు,అవకాశాలను, ఆచరణ కార్యక్రమాలుగ రూపొందించబడ్డాయి,

జోషి సూచనల ప్రకారం కమ్యూనిస్టులు కాంగ్రెసు సోషలిస్టు పార్టీ సభ్యత్వానికి దరఖాస్తు చేయ ప్రారంభించారు. నూతన కర్తవ్యాలను నిర్వహించుటకు యంత్రాంగ నిర్మాణం చేయ మొదలుపెట్టారు. రహస్యంగా వొక జర్నలు ప్రారంభించారు. అదే "కమ్యూనిస్టు" పత్రిక, వొక క్రమంలో సోషలిస్ట్ పార్టీలో కమ్యూనిస్ట్ ప్రాక్షనులను యేర్పాటు చేసింది. అదే విధంగా అనేక యితర బూర్జువా సంస్థలలో కూడ చురుకుగా సాగించింది. అవి చక్కని క్రమశిక్షణతో కాంగ్రెసు, కాంగ్రెసు సోషలిస్ట్ పార్టీ, తదితర అన్ని ప్రజా సంఘాలలో చురుకుగా పనిచేస్తూ నూతన నాయకత్వాన్ని అభివృద్ధి చేయసాగారు.ఈ విధంగా భారత కమ్యునిస్టు పార్టీ, సోషలిస్ట్ పార్టీ వర్గాలలో, జాతీయ కాంగ్రెసులోని జాతీయవర్గాలలో పేర్కొనతగిన శక్తిగా త్వరగానే అభివృద్ధి చెందింది.

**కమ్యూనిస్టులు, సోషలిస్టుల మధ్య అభిప్రాయ భేదాలు:**

కాంగ్రెసు సోషలిస్ట్ పార్టీ జాతీయ కార్యావర్గానికి 1936 ఉత్తర అర్ధ భాగానికే, కమ్యూనిస్టు ప్రాక్షనులు సోషలిస్ట్ పార్టీ నిర్మాణాన్ని చిన్నాభిన్నం చేస్తున్నవని, సోషలిస్ట్‌లను కమ్యూనిస్ట్‌లుగా మార్చుతున్నారని, కాంగ్రెసు సోషలిస్ట్ పార్టీ శాఖలను మెజారిటీలతో పట్టుకొంటున్నారని, ట్రేడు యూనియనులలో సోషలిస్ట్‌లతో పోటీపడుతున్నారని ఫిర్యాదులు రాసాగాయి. కేంద్ర కార్యవర్గం, రాష్ట్ర సోషలిస్టు

1. చలసాని వాసుదేవరావు. భారత కమ్యూనిస్టు పార్టీ నిర్మాణ చరిత్ర. విజయవాడ ప్రజాశక్తి ప్రెస్. 1943. పే. 116-117. నుండి, పై రచయితలు తమ కమ్యూనిజం ఇన్ ఇండియాలోని 162 పే. ఉదహరింపు.

పార్టీల కమిటీలకు వొక హెచ్చరికను మాత్రంచేసి వూరుకొన్నది. కొన్ని సందర్భాలలో యీ హెచ్చరిక, అప్పటికే కొన్ని రాష్ట్ర కమిటీలు కమ్యూనిస్టులు లేక వారి అభిమానుల అధీనంలో వుండుటచే హెచ్చరిక నిరుపయోగమైంది. దక్షిణ భారతంలో సోషలిస్టు వ్యవహారాలన్నిటిని ఇ. యం. యస్. నంబూద్రిపాద్, సంయుక్త కార్యదర్శి ఆధ్వర్యంలో వుండుట జరిగింది. దక్షిణాదిన సోషలిస్టు పార్టీ వ్యవహారాలను, సోషలిస్టుపార్టీ జాయింటు కార్యదర్శి నంబూద్రిపాద్ చూస్తుండుటవలన 1936 చివరకు తమిళనాడు సోషలిస్టుపార్టీ వ్యవహారాలనుచూచుటకు పి. రామమూర్తి, పి. జీవానందంలను అధికారరీత్యా నియమించారు కొద్దికాలానికే ముగ్గురూ బహిరంగంగా కమ్యూనిజం ప్రచారంచేయ మొదలుపెట్టారు. ఈ ముగ్గురు నాయకుల ప్రభావంతో రాష్ట్రశాఖలు మొత్తంగా క్రమేణా భారత కమ్యూనిస్టుపార్టీ శాఖలైనవి. ఉత్తర భారతంలోని కార్మిక కేంద్రాలలో రహస్యంగానో, బహిరంగంగానో ఆ శాఖలు కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యంలోనికివెళ్ళాయి. ఆంధ్ర సోషలిస్టు పార్టీశాఖ అందరెరిగిన పి. సుందరయ్య నాయకత్వంలో కమ్యూనిస్టుపార్టీ రాష్ట్రశాఖగా రూపొందింది. ఉదాహరణకు బొంబాయిలో కార్మికోద్యమంలోని ప్రధాన శాఖలు, కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటి సభ్యులైన సోలి బాట్లీవాలా నాయకత్వంలో కమ్యునిస్ట ఆధ్వర్యంలోనికి వెళ్ళాయి.

కాంగ్రెసు సోషలిస్టుపార్టీ జాతీయ కార్యవర్గం కమ్యూనిస్టు విచ్ఛిన్నకర చర్యలను పరిగణలోనికి తీసుకొని ఒక ప్రకటన చేసింది. "ప్రాక్షన్‌లిజాన్ని అవసరమైతే క్రమశిక్షణా చర్యల విధానంతో అరికట్టగలనని" కార్యవర్గం పునరుద్ఘాటించింది.

ఈవిధంగా కాంగ్రెసుసోషలిస్టుపార్టీ తో కమ్యూనిస్టుపార్టీ మైత్రీసహకారాన్ని ప్రారంభించిన నాటినుండి, సోషలిస్టు వర్గాలలోనికి రాజకీయంగా విస్తరించుట కొనసాగించింది. అదే కాలంలో కాంగ్రెసు నాయకత్వ విధానాలను వ్యతిరేకించు రాజకీయ విధానాలలో సమిష్టిగ రెండు పార్టీలు మైత్రీ సహకారాన్ని కొనసాగించాయి. సోషలిస్టులు, కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమంలో తేలికగావిస్తృత సారూప్యత, ఆమోదం చూడగలిగారు. అది ప్రధానంగా సామ్రాజ్యవాద వ్యూహలు వ్యతిరేక కార్యక్రమం. అంతేగాక కొమింటర్న్ "అతివాద" విమర్శనను విశ్వాసంతో ఆమోదించారు.

అభిప్రాయ భేదాలు కమ్యూనిసులు-సోషలిస్టులమధ్య కమ్యూనిస్టులు మితవాదులుగ అయ్యారనే కారణంగా వచ్చాయి. ఉదాహరణకు కమ్యూనిస్టు పత్రిక 1937 మార్చి సంచిక సంపాదకీయంలో నాలుగు వర్గాల ప్రయోజనాలు మిశితమనే పేరుతో "బ్రిటిష్ ద్రవ్య పెట్టుబడి ఆదిక్యతకు వ్యతిరేకంగా భారత పెట్టుబడిదారి వర్గ పోరాటాన్ని బలపరచుటను, మార్క్సిజానికి ద్రోహంగా సోషలిస్టులు తీవ్రంగా విమర్శించారు.

కమ్యూనిస్టు పార్టీ పొలిట్‌బ్యూరో ఫిబ్రవరి 1937లో ఆమోదించిన తీర్మానం ప్రధాన వివాదాంశమైంది. అది కమ్యూనిస్టుల నాలుగువర్గాల వ్యూహప్రకటన. కమ్యూ

నిస్టు పార్టీ సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనలో జాతీయ కాంగ్రెసు, కాంగ్రెసు సోషలిస్టు పార్టీ, కమ్యూనిస్టు పార్టీ, కార్మిక, కర్షక ప్రజా సంఘాలు మాత్రమేగాక, భారతీయ వ్యాపార, పారిశ్రామిక సంఘాలుకూడ కొన్ని వుండవచ్చని తీర్మానంలో తెలిపింది. పార్టీ రాజకీయ విధానంలో యీ తీర్మానం ముఖ్యమైన మైలురాయియని కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం గొప్పగా చెప్పుకొంటున్నది కాని కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో యిది పెద్ద దుమారాన్ని రేపింది. సోషలిస్టులు కమ్యూనిస్టులను మితవాదులని నిందించారు, "కమ్యూనిస్టులు సోషలిస్టులను" అతివాద సెక్టేరియనులని" నిందించారు.

సోషలిస్టుల విమర్శలకు తమ సమాధానంగా కమ్యూనిస్ట్ పార్టీ అనేక దీర్ఘ ప్రకటనలను, వివరణలను భారత బూర్జువావర్గం యెడల తమ వైఖరిని వివరించుచు చేయవలసి వచ్చింది. ఈ ప్రకటనలలో ఫిబ్రవరి తీర్మానం అభ్యుదయకర వర్గాలలోనే గాక కమ్యూనిస్టు వర్గాలలో కూడ పెద్ద సంచలనం కలిగించిందని వొప్పుకొనక తప్ప లేదు. దాని తీవ్రతను తగ్గించుటకు తీర్మానం పెట్టుబడిదారి వ్యతిరేక పోరాటాన్ని విడనాడుటకాదని, వాయిదావేయుట మాత్రమేనని స్పష్టం చేసింది. అయినప్పటికీ, ఐక్యసంఘటనలో చేరమని బూర్జువావర్గానికి విజ్ఞప్తిచేయు అవకాశాలను జారవిడువజాలమన్నారు. ఒక ప్రకటన, అన్నివర్గాలు భారత బూర్జువావర్గంలోని అత్యధిక వర్గాలను, సామ్రాజ్యవాద అనుకూల కొద్ది బడా బూర్జువావర్గాలను, పెద్ద భూస్వాములను, రాజాలను మినహా అందరికి విజ్ఞప్తి చేయాలంది కమ్యూనిస్టు పార్టీ.

సైద్ధాంతిక భేదాభిప్రాయాలున్నా కమ్యూనిస్టులు, సోషలిస్టులు, నిర్దిష్ట,ఆర్థిక, సామాజిక సమస్యలపై సామాన్య ప్రాతిపదికను చూడగలిగారు. మధులిమాయి కొన్ని సంవత్సరాల తరువాత ప్రకటించిన కథనంలో, కమ్యూనిస్ట్ పార్టీ, సోషలిస్టు పార్టీ ఒకే రీతిలో 1937 ప్రధమభాగంలో పనిచేస్తాయని వ్రాసారు. కమ్యునిస్టులు సోషలిస్టుల వైఖరికి దగ్గరగా వచ్చినట్లు కన్పడిందని అన్నారు. రెండు పార్టీలు ఆ కాలంలో "లక్నో వొప్పందం" అనే దానిని చేసుకొన్నవి. సోషలిస్టు వివరణ ప్రకారం, యిద్దరూ చివరకు ఒకే నిర్మాణంలో ఐక్యమయ్యేంతటి ప్రాముఖ్యత గలది. ఆ స్థాయిలో సహకారం పూర్తిగా అమలు జరిగియుండిన కాంగ్రెసు కార్యక్రమముపై కాంగ్రెసు అభివృద్ధిపై భారత వామపక్షాలు శక్తివంతమైన ప్రభావాన్ని కలుగజేసి వుండేవి" అన్నారు.

అయితే సైద్ధాంతిక, నిర్మాణపోటీలు దాటరాని అడ్డంకులయ్యాయి. లక్నో వొప్పందం ఎప్పుడూ అమలు చేయబడలేదు. ఫిర్యాదులు, ప్రతి ఫిర్యాదులతో వివాదాలు అనేక రూపాలలో నిర్మాణ సమస్యలలో తలెత్తి తీవ్రతరమైనాయి. జూన్ 1937కు కమ్యూనిస్టులు తమను వ్యతిరేకతతో వేటాడుతున్నారని సోషలిస్టు కార్యవర్గాన్ని విమర్శించుచున్నవారిని "విద్రోహులని" భయపడుతు, బహిష్కరిస్తామని బెదరించుచున్నారని ప్రచారం చేసారు. సోషలిస్ట్ పార్టీలో నూతనంగా కమ్యూనిస్టులను చేర్చుకొనుటలేదని, వారి విమర్శనను సోషలిస్ట్లపై యెక్కువచేసి, ఐక్య కార్యాచరణ అసాధ్యమని, వివాదాన్ని పెంచసాగారు.

ఆగస్టులో కాంగ్రెసు సోషలిస్ట్ పార్టీ కార్యవర్గం సమావేశమైనపుడు, కమ్యూనిస్టు పార్టీ డాక్యుమెంటు అని చెప్పబడే దానిని చర్చించుటను ప్రవేశపెట్టారు. జయప్రకాశ్ నారాయణ కథనం ప్రకారం, డాక్యుమెంటు కమ్యూనిస్టు పార్టీ ఒక్కటే నిజమైన సోషలిస్టు పార్టీయని, కమ్యూనిస్టులెప్పుడు రాజకీయ రంగంలో మరో సోషలిస్టు పార్టీని సహింపజాలరని స్పష్టం చేసింది. ఈ డాక్యుమెంటును బహిరంగ పరచుట సోషలిస్టులకు "బాధాకరమైన షాకును, పెద్దగా కోపోద్రేకాలను" కలుగ జేసిందని జయప్రకాశ్ వ్రాసారు. జాతీయ కార్యవర్గం లక్నో వొప్పందం, ప్రాణం కోల్పోయిందని నిర్ణయించింది, యేకగ్రీవంగా కమ్యూనిస్టులను సోషలిస్టు పార్టీలో చేర్చుకొనుట ఆపివేయబడింది. ఈ విధంగా రెండు మాసముల తరువాత కమ్యూనిస్టు పార్టీ ఆరోపణవాస్తవమైంది. ఇంత జరిగినా, సోషలిస్ట్ పార్టీలో అప్పటికే వున్న కమ్యూనిస్ట్లను బహిష్కరించరాదని తలచుట "పొరపాటు నిర్ణయమని" జయప్రకాశ్ తరువాత ఆమోదించారు.

ప్రతిగా కమ్యూనిస్టులు, లక్నో వొప్పందానికి కట్టుబడివున్నామని, వారి నిజాయితీకి రుజువుగా వెంటనే రెండు పార్టీలు కలసి, వొక్క పార్టీగ సంలీనం చేయుటకు సంసిద్ధులమనే ప్రతిపాదన చేసారు. ప్రతిపాదనలో నిజాయితీలేదని సోషలిస్టులు తిరస్కరించారని, జయప్రకాశ్ వ్రాసారు. రెండు పక్షాల మధ్య సంబంధాలు "క్రమేణా విషమించాయి" అని పేర్కొన్నారు. కాంగ్రెసు సోషలిస్టు పార్టీ, కమ్యూనిస్టుల విచ్ఛిన్నకర చర్యలతో "నిద్రాణమైంది" ఎటువంటి నిర్ణయాత్మక చర్యలు గైకొనజాలకపోయింది.[1]

సోషలిస్టు పార్టీ జాయింటు శెక్రటరీ, మినూమసాని 1938 ప్రథమభాగంలో, సోషలిస్టు పార్టీ శాఖలను పట్టుకొనుటకు తగిన పద్ధతులు వివరించుతున్న కమ్యూనిస్టు పార్టీ రహస్య సర్క్యులర్‌ను మరోదానిని బయటపెట్టారు, కమ్యూనిస్టులపై క్రమశిక్షణా చర్యలకు వొత్తిడిచేసారు. జాతీయ కార్యవర్గం నిర్ణయాన్ని తీసుకొనుటకు వెనుకాడింది.

ఇంతలో కమ్యూనిస్టులు, సోషలిస్టుపార్టీ జాతీయ కార్యవర్గాన్ని తమ ఆధిక్యతతో దాదాపుగా పట్టుకొనగలిగినంతటి విజయాన్ని సాధించారు. సోషలిస్టుపార్టీ లాహోర్ కాన్ఫరెన్సులో, కార్యవర్గంలో మూడవవంతు కమ్యూనిస్టులు వుండునట్లు అభ్యర్థుల జాబితాను ప్రతిపాదించారు వారిని యిదిసంతృప్తిపరచలేదు. వాట తమకు మెజారిటీ వుండునట్లు 'కుట్రచేసి' కార్యవర్గానికి మరో అభ్యర్థుల జాబితాను ప్రతిపాదించారు. కొద్ది మెజారిటితో జయప్రకాశ్ అభ్యర్థుల జాబితా ఆమోదించబడింది[2].

లాహోర్ కాన్ఫరెన్సు తరువాత రెండు పార్టీలమధ్య సహకారం పరిమిత కార్యాచరణలోమాత్రం జయప్రకాశ్, పి.సి. జోషీల మధ్య వ్యక్తిగత ఒప్పందం

---

1. జయప్రకాశ్ నారాయణ్, "టువర్డ్స్ట్రగుల్. పే. 172-4 లోని దానిని, కమ్యూనిజం ఇన్ ఇండియాలో. పే. 162లో ఉదహరించబడింది.
2. మసాని, యం.ఆర్. (1942) ది కమ్యూనిస్ట్‌పార్టీ ఆఫ్ ఇండియా(లండన్) పే. 69-70.

ద్వారా కొనసాగింది. సోషలిస్టులు, కమ్యూనిస్టుల మధ్యగల నామమాత్ర ఐక్యతా బంధాన్ని కొనసాగించుటకు జయప్రకాశ్ తన శక్తినంతటిని వినియోగించాడు. జయ ప్రకాశ్, జోషీలు తమ అభిప్రాయాలను పరస్పరం తెలియపరచుకొంటూ, సంయుక్త రాజకీయ చొరవ ప్రకటనలను రాజకీయ సమస్యలపై చేస్తూవచ్చారు. అయితే అప్ప టికే సోషలిస్టు పార్టీలోని కమ్యూనిస్టుల చేతులలోనికి జారిపోయింది.

సోషలిస్టుపార్టీలో చేరి పనిచేసినందున 1939 ప్రారంభానికే కమ్యూనిస్టుపార్టీ చాల విస్తృత లాభాన్ని పొందింది. దానికి సోషలిస్టుపార్టీ అనేక శాఖలను తమ ఆధీ నంలోనికి తెచ్చుకొనే అవకాశం లభించింది. భారతదేశంలో సోషలిజం ప్రభావంలో గల ప్రజలలో కమ్యూనిజాన్ని ప్రచారం చేయగలుగుట జరిగింది ఈ మూడు సంవ త్సరాలలో కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వం, ప్రభావం మహోన్నతంగా అనేకరెట్లు పెరి గింది[1]. బలమైన కట్టుదిట్టాలుగల రహస్య పార్టీ యంత్రాంగాన్ని నిర్మించుకొనగలిగి అనేక రహస్య పత్రికలను వివిధభాషలలో నడుపగలిగినసామర్థ్యం సంపాదించింది. అన్నిటికి మించిన ప్రధానలబ్ధి భారత జాతీయ కాంగ్రెసులోనే చెప్పుకొనదగిన బలాన్ని సంతరించుకొంది.

## కాంగ్రెసులో కమ్యూనిస్టుల విస్తరణ

భారత జాతీయ కాంగ్రెసుసంస్థలో కాంగ్రెసు సోషలిస్టుపార్టీ అనుబంధసంస్థ అయినందున, సోషలిస్టుపార్టీలో కమ్యూనిస్టులు సభ్యులైనందున జాతీయసంస్థనిర్మాణ మంతటిలోనికి వారి ప్రవేశానికి అవకాశం లభించింది. గ్రామస్థాయి క్రింది కమిటీల నుండి, అత్యున్నతస్థాయి అఖిలభారత కాంగ్రెసు కమిటి వరకు వారి ప్రవేశం తేలిక అయింది. ప్రజలతో సంబంధాలను పెంపొందించుకొనుటకు లభించిన అవకాశం మాటలలో లెక్కగట్టలేనంత విలువైనది "కాంగ్రెసు వాదులుగ" లభించిన ముద్ర కమ్యూనిస్టులకు ఎనలేని గౌరవాన్ని, పలుకుబడిని కలుగజేసింది.

కాంగ్రెసులో క్రిందినుండి ఐక్యసంఘటనా ఎత్తుగడ సాధారణ సభ్యులలో ప్రాథమికవర్గాలలో పనిచేసి కమ్యూనిస్టులు తమ పలుకుబడిని విస్తరింప జేసుకొనుట గాంధియన్ జాతీయ నాయకత్వాన్ని తీవ్ర విమర్శకుగురిచేస్తూ సాగుటతో వారి పార్టీ సభ్యత్వాన్ని పెంచుకొనుటకేగాక, కాంగ్రెసు పై కమిటీలలో ప్రాతినిధ్యం పెంచు కొనుటకూడా ముఖ్యాంశంగావుంది, కమ్యూనిస్టుల ఈ పనివిధానం ఎంత విజయ వంతమైనదంటే 1939కి అఖిలభారత కాంగ్రెసు కమిటిలో 20 మంది కమ్యూనిస్టు లున్నారు. అక్కడ కమ్యూనిస్టులు నిరవధికంగా అహింసా హింసా సమస్యలను చర్చకు తీసుకొనివచ్చి గాంధీజీ తన అభిప్రాయాలను వెల్లడి చేయునట్లు చేసేవారు. ఉదాహరణకు ఫెయిజ్‌పూర్ కాంగ్రెసు మహాసభలో కమ్యూనిస్టులు "స్వపరిపాలన, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఒక్క రాజీలేని విప్లవ ప్రజాపోరాటం వలన

1. జోషి, పి.సి. (1942) రిపోర్ట్‌టు సెంట్రల్ కమిటి పార్టీసభ్యత్వం 1934లో 150 కాగా 1943లో 5000 అయింది.

మాత్రమే లభించగలదని" రాజకీయ తీర్మానానికి సవరణను ప్రతిపాదించారు. ఈ సవరణకు అఖిలభారత కాంగ్రెసు కమిటీలోని 128 సభ్యులలో 45 మంది వోటు చేశారు. మహాసభలో 713 ప్రతినిధులలో 262 మంది వోటుచేశారు.

"క్రిందినుండి ఐక్య సంఘటన" అనే విధానాన్ని కమ్యూనిస్టుపార్టీ ఎట్టి రాజీ విధానాలు అనుసరించకుండా శక్తివంతంగాకొనసాగించింది. ఫెయిజ్‌పూర్‌లో పంచిన కరపత్రం చురుకైన కాంగ్రెసు కార్యకర్తలను "గాంధియన్ 'నిర్మాణ కార్యక్రమ అభివృద్ధి నిరోధక మార్గాన్నుండి" ఆకర్షించుటకై చేసిన ప్రయత్నం స్పష్టంగా కానవస్తుంది.

ఈ విధానం కమ్యూనిస్టు పార్టీని సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజా సంఘటన"లో జాతీయోద్యమాన్ని ఐక్య పరచాలనే లక్ష్యానికి అదే కాలంలో కాంగ్రెసులో నాయకత్వాన్ని సంపాదించే ఎత్తుగడలమధ్య సందిగ్ధావస్థలో పడవేసింది. ఈ లక్ష్యాలు మౌలికంగా పరస్పర వైరుధ్యాలు కమ్యూనిస్టుపార్టీరెంటిలో దేనిని త్యాగంచేయాలనే ప్రశ్న – ఐక్య కాంగ్రెసుకై ప్రచారమా, లేక గాంధీ జాతీయ నాయకత్వానికి వ్యతిరేక ప్రచారమా, దేనిని చేబట్టాలి? ఈ ప్రశ్న ప్రతిసారి కమ్యూనిస్టుపార్టీ ముందు ప్రత్యక్షమగుతుంది. "సందిగ్ధావస్థ"కు మూలమైంది.

ఇట్టి ఒక "సందిగ్ధావస్థ"లోనే కమ్యూనిస్టుపార్టీ అగ్రనాయకులలో ఒకరైన డాంగే ఐక్యతను త్యాగం చేయనిర్ణయించాడు. కమ్యూనిస్టుల ఆధ్వర్యంలో వున్న ట్రేడు యూనియన్ కాంగ్రెసు ప్రసిడెంటు, మరోవైపు అఖిలభారత కాంగ్రెసు కమిటి సభ్యుడు. పెక్కుమంది కాంగ్రెసు అభ్యర్థులను 1937 ఎన్నికలలో ట్రేడు యూనియన్ కాంగ్రెసు బలపరచింది. కాని బొంబాయిలో రెండు సంస్థలు విడివిడిగా ఒకే స్థానానికి అభ్యర్థులను నిలబెట్టాయి డాంగే బహిరంగంగా ట్రేడు యూనియన్ కాంగ్రెసు అభ్యర్థిని బలపరచారు. కాంగ్రెసునాయకత్వం క్రమశిక్షణాచర్య దండంతో బెదరించింది. "నా ఓటు ట్రేడు యూనియన్ కాంగ్రెసుకు, కార్మికుల కొరకు,జాతీయ పోరాటానికి " అవసరమైతే కాంగ్రెసు సభ్యత్వానికి రాజీనామా యిచ్చుటకు తన సంసిద్ధతను తెలియజేశారు.[1]

కొంతకాలానికి యీ సందిగ్ధతను పరిష్కరించుటకు, సంక్షోభ పరిస్థితులలో రాజకీయ విధానంలోనే మౌలిక మార్పులను కమ్యూనిస్టు పార్టీ చేయవలసి వచ్చింది. కాంగ్రెసును సోషలిస్టు పార్టీగ మార్చాలనే సోషలిస్టు పార్టీ అభిప్రాయాలను కమ్యూనిస్టు పార్టీ తీవ్రంగా వ్యతిరేకించింది. కాంగ్రెసు బూర్జువా పార్టీయని స్వాతంత్ర్య పోరాటంలో బూర్జువావర్గం, కార్మికవర్గం కలసినా పరస్పరం ఘర్షణలు పడుతుంటాయని, ఆ కారణంగా కాంగ్రెసుచే సోషలిజం ఆమోదింపజేసే ప్రయత్నం ఆత్మ వంచన యేగాక, ప్రజా వంచనయని కమ్యునిస్టులు విమర్శించారు. కాంగ్రెసు కార్యకర్తలను, ప్రజాస్వామ్యవాదులను, సోషలిస్టు భావాలు కలవారినందరిని, అభ్యుదయ

---

1. డాంగే, యస్.ఏ. 1937 స్టేటుమెంటు పండితజవహర్‌లాల్‌నెహ్రూ, న్యూ మనోహర్‌ప్రెస్ 1937.

వాదులను, సంఘటితపరచి కాంగ్రెసు వూగిసలాటను రాజీ విధానాలను తీవ్రంగా వ్యతిరేకించుట సోషలిజంపై విశ్వాసంగల వారందరి కర్తవ్యమని కమ్యూనిస్ట్ పార్టీ వివరించింది.

బూర్జువా నాయకత్వంలో కాంగ్రెసు 1930 నుండి సాగించిన పోరాటంలో పాల్గొనకుండా వారి విధానాలలోని లోపాలను ఎత్తిచూపే విధానాన్ని కమ్యూనిస్టులు, కాంగ్రెసు వర్గ స్వభావాన్ని అర్థం చేసుకొనక సోషలిస్ట్ సంస్థగా దానిని మార్చాలను కొన్న కాంగ్రెసు సోషలిస్టులు తమ విధానాలను మార్చుకొనవలసి వచ్చింది. ఈ నవ రణల ఫలితమే సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనను ఏర్పాటు చేయాలనే భావనకు మూలమని నంబూద్రిపాద్ జాతీయఐక్యసంఘటన అవగాహనక్రమాన్ని వివరించారు.[1]

కమ్యూనిస్టు పార్టీ, కాంగ్రెసు నాయకత్వానికి కార్యకర్తలకు గల భేదాలను, వర్గప్రాతిపదికలను గమనించి కాంగ్రెసు మొత్తాన్ని వ్యతిరేకించే ధోరణి విడనాడి, కాంగ్రెసులోచేరి చురుకైన పాత్ర వహించి కార్యకర్తలను, సామాన్య ప్రజానీకాన్ని సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనలో సంఘటితపరచాలని నిర్ణయించింది. సోషలిస్టు పార్టీగూడ కాంగ్రెసును సోషలిస్టు పార్టీగ మార్చే ఆశయాన్ని వదలి కాంగ్రెసును సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యసంఘటనగా మార్చాలనే నూతనవిధానాన్ని చేబట్టింది.

ఈ క్రమ పరిణామాన్ని నంబూద్రిపాద్ "రెండు ముఖ్య పరిణామాల వలన యిది సాధ్యమైందని" వివరించారు. ఒకటి : సోషలిస్టు పార్టీలోను రెండవది ; కాంగ్రెసులోని పరిణామము. జనవరి 1936లో రెండవ సోషలిస్టు పార్టీ మహాసభ మీరట్‌లో జరిగింది. "మీరట్ థీసిస్ అను సిద్ధాంతపత్రాన్ని ఆమోదించింది. అన్ని సోషలిస్టు కమ్యూనిస్టు గ్రూపులు, సి. పి. ఐ. తో సహా ఐక్యమవ్వాలని పిలుపునిచ్చింది. కమ్యూనిస్టు పార్టీ, సోషలిస్ట్ పార్టీలు ఒక అంగీకార పత్రంపై ఆమోదం తెలి పాయి. సోషలిస్టు పార్టీ ఆమోదంతో కమ్యూనిస్టులు అనేకులు చేరారు. అందులో కె. యం. అష్రాఫ్ జడ్. ఎ. అహమ్మద్. యస్. యస్. జహీర్‌లు అందరకు తెలి సిన కమ్యూనిస్టులు, కాంగ్రెసు సోషలిస్ట్ పార్టీ జాతీయ కార్యవర్గంలోనికి తీసుకొన బడ్డారు. నంబూద్రిపాద్,బాట్లీవాలా, దినకర్ మెహతా కమ్యూనిస్టు ప్రాతినిధ్యంగా పని చేసారు.

రెండో ముఖ్య పరిణామము లక్నో జాతీయ కాంగ్రెసు 1936 ఏప్రిల్ మహా సభ అధ్యక్షునిగా జవహర్‌లాల్ నెహ్రూ సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యసంఘటనకై పిలుపునిచ్చారు. ఫెయిజ్‌పూర్ 1936 డిశెంబరు జాతీయ కాంగ్రెసు మహాసభ తిరిగి నెహ్రూనే అధ్యక్షునిగా ఎన్నుకొంది. సుభాస్ చంద్రబోస్ 1938లో కాంగ్రెసు అధ్య క్షుడుగా ఎన్నుకొనబడుటతో కాంగ్రెసులోని వామపక్షవాదులు, సోషలిస్టులు కమ్యూ నిస్టులు సంఘటితులయ్యారు.[2]

---

1. నంబూద్రిపాద్, ఇ. యం. యస్. (1988) భారత స్వాతంత్ర్య పోరాటచరిత్ర (తెలుగు) ది. భా. పే. 60.
2. అదే పే 108

ఈ పరిణామములు సోషలిస్ట్ కమ్యూనిస్టు పార్టీలు సహకరించుకొనుటకు రంగం సిద్ధం చేసాయి. సోషలిస్ట్ పార్టీ ప్రధాన కార్యదర్శి జయప్రకాశ్ నారాయణ్, కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి పి. సి. జోషి మీరట్ మహాసభ ముందూ, తరువాత సంభాషణలు జరిపి కాంగ్రెసును" జాతీయ ఐక్యసంఘటనగా" మార్చాలనే అంగీకారానికి వొచ్చారు.

**కమ్యూనిస్టులు లక్నో కాంగ్రెసు మహాసభ :**

లక్నో 1936 కాంగ్రెసు మహాసభ సందర్భంలో కమ్యూనిస్టుల, సోషలిస్ట్ల చొరవతో జరిగిన సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రదర్శన ప్రతినిధులను ఆకర్షించింది. కాంగ్రెసులో మితవాద నాయకత్వానికి వ్యతిరేకంగాను, రాజ్యాంగచట్టానికి వ్యతిరేకంగాను ప్రజా పోరాటాలను యెలా నిర్వహించాలో, పోరాటాలలో కాంగ్రెస్ బలహీనతలపై జరిగిన చర్చలలోని వివరణలు సామాన్య కాంగ్రెసు వాదులను చైతన్యపరచాయి.

కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెసు మహాసభలో వివిధ సమస్యలపై తమ వైఖరులను వివరించే కరపత్రాలను పంచింది. సాధారణ కాంగ్రెసు సభ్యులలో, ప్రతినిధులలో గణనీయమైన భాగం సోషలిస్టు సిద్ధాంతాలవైపు ఆకర్షితులయ్యారు.

కాంగ్రెసు మహాసభలో అధ్యక్షుడైన నెహ్రూ, వామపక్షనాయకులు,కాంగ్రెసు నాయకులు కొందరు రెండు ప్రధాన సమస్యలు లేవనెత్తారు. ఒకటి : ఎన్నికల అనంతరం అధికారాన్ని స్వీకరించుటకు వ్యతిరేకత, రెండు ప్రజా సంఘాలను అంటే కార్మిక, కర్షక సంఘాలను కాంగ్రెసు అనుబంధ సంస్థలుగా గుర్తించి వాటితోసహా కాంగ్రెసు ప్రజాస్వామ్యయుతం చేయుట.[1]

నెహ్రూ, సోషలిస్టులు, కమ్యూనిస్టులు, యితర వామపక్షవాదులు, ఎన్నికల అనంతరం అధికారాన్ని స్వీకరించరాదని వాదించారు. కాంగ్రెసు మహాసభ తన నిర్ణయాన్ని వాయిదా వేసింది. ఇది వామపక్ష వాదనను తిరస్కరించుటయే అయింది. పరిస్థితులు అనుకూలంగా మారినపుడు అధికారాన్ని ఆమోదించే నిర్ణయం చేసుకొనుటకు మితవాదులు అవకాశాన్ని అట్టిపెట్టుకున్నారు.

కాంగ్రెసు ప్రజా సంఘాలను అనుబంధ సంస్థలుగ చేర్చుటకు గుర్తించి, కాంగ్రెసును ప్రజాస్వామ్యయుతం చేయుటకు బహిరంగంగా వ్యతిరేకించింది. ప్రజా సంఘాలు కాంగ్రెసు నాయకత్వాన్ని ఆమోదించాలనే షరతును విధించింది. అట్టి నాయకత్వాన్ని వహించుటకు ఒక కార్మిక వుపసంఘాన్ని నిర్మించాలని నిర్ణయించింది.

ఈ విషయంపై "ఇది కేవలం సంస్థాపరమైన సమస్యకాదు. సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనను నిర్మించే సమస్యపై వామ పక్షీయులకు, మితవాదులకు భేదాభిప్రాయాలున్నవి. వామపక్షవాదుల సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటన అంటే

---

1. నంబూద్రిపాద్. ఇ. యం. యస్. (1988) భారత స్వాతంత్ర్య పోరాట చరిత్ర (తెలుగులో) ది. భా. పే. 108.

కాంగ్రెసు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు, వారి పార్టీల ప్రజానీకాన్ని, ప్రజా సంఘాలను సామ్రాజ్యవాద శక్తులకు వ్యతిరేకంగా సమీకరించే పెద్ద ప్రజా ఉద్యమాన్ని నిర్మించుట. సోషలిస్టు, కమ్యూనిస్టుపార్టీలు, ప్రజాసంఘాలు కాంగ్రెసు నాయకత్వాన్ని ఆమోదించి కాంగ్రెసును సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనగాగుర్తించాలనే షరతు మితవాద కాంగ్రెసు నిర్ణయం వామపక్ష వాదనను తిరస్కరించుట అంటే కాంగ్రెసు వ్యాఖ్యానాన్ని ఆమోదించడమనే అర్థం[1]" అని నంబూద్రిపాద్ వివరించారు.

బూర్జువావర్గ పార్టీయైన కాంగ్రెసు, కాంగ్రెసునే సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనగా, తన నాయకత్వాన్నే గుర్తించాలని షరతులకు విధించుట, బూర్జువావర్గం సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటన నాయకత్వాన్ని వివిధపార్టీల, ప్రజా సంఘాల, వర్గాలతో పోరాటంలోనైతం పాలుపంచుకొన నిరాకరించుట, బూర్జువావర్గం నాయకత్వాన్ని గుత్తగాచేబట్టి, శాశ్వతంగా పదిలపరచుకొనుట తప్ప మరొకటికాదు. అంతేగాక, అధికారాన్ని స్వీకరించిన పక్షంలో బూర్జువావర్గపు గుత్తాధికారం ఏకపక్షంగా స్థిరంగా వుంటుందనే అవగాహన దీనిలో స్పష్టం.

ప్రజా సంఘాలను అనుబంధ సంస్థలుగా "మితవాద నాయకత్వంలోగల కాంగ్రెసు చివరకు నిరాకరించిందని" అయినా కాంగ్రెసులో కమ్యూనిస్టుల, వామపక్షాల పెరిగేబలాన్ని, ప్రభావాన్ని అరికట్టజాలకపోయింది. అనేక రాష్ట్రకమిటీలలో కమ్యునిస్టులు, సోషలిస్టులు, యితర వామపక్షవాదులు ఉన్నత బాధ్యతాయుత పదవులోనికి వచ్చారు. అఖిలభారత కాంగ్రెసు కమిటీలో 1939 నాటికి 40 శాతంపైగా వామపక్షశక్తులు రాజకీయ నిర్ణయాలలో ముఖ్యపాత్ర వహించారు"[2] అని చెడులో మంచని సర్దేశాయి చెప్పారు.

లక్నో కాంగ్రెసులో నెహ్రూ "సోషలిజంలోనే ప్రపంచ, భారత సమస్యల పరిష్కారమున్నదని నా విశ్వాసం. సోషలిజం అనే పదాన్ని అస్పష్టంగా, మానవత్వ పరిభాషలోగాక, శాస్త్రీయ, ఆర్థిక అర్థంలోవాడాను సోషలిజం ఆర్థిక సిద్ధాంతమేగాక, జీవిత వేదాంతంగా నన్ను ఆకర్షించింది. ఈ విస్తారమైన భారతదేశంలోని నిరుద్యోగానికి, దారిద్ర్యానికి,అధోగతికి సోషలిజం తప్పితే మరోమార్గంలేదు[3]" అని సోషలిజం యెడల అచంచల విశ్వాసాన్ని స్పష్టంగాప్రకటించుట వామపక్ష కాంగ్రెసువాదులు సోషలిస్టులు, కమ్యునిస్టులు, యితర అభ్యుదయ వాదులకు ఎంతో నైతిక బలాన్ని యిచ్చుటతో 1930 దశకం ఉత్తరార్థభాగంలో అనేక ప్రజాసంఘాలను, ఎన్నో మహోద్యమాలను నిర్మించి చరిత్ర సృష్టించారు.

---

1. నంబూద్రిపాద్, ఇ.యం యస్ (1988)భారతస్వాతంత్ర్య పోరాటచరిత్ర (తెలుగులో) ద్వి భా. పే. 109.
2. సర్దేశాయి, యస్.జి. (1967)ఇండియా అండ్ ది రష్యన్ రివల్యూషన్. (ఆంగ్లంలో) పే. 90-91.
3. అదే. పే. 64. లోని ఉదహరింపు.

## ii

# ఐక్య ప్రజా సంఘాల నిర్మాణం

బ్రిటిష్ పాలన 18, 19 శతాబ్దాలలో మధ్యయుగాల భూస్వామ్య విధానాలను ప్రవేశపెట్టుటతో రైతుల హక్కులు హరించివేయబడి దుర్భరదారిద్ర్యంలో మునిగి పోయారు. నాటినుండి, నీలిపంట రైతుల తిరుగుబాటులు, సంతాలు రైతుల తిరుగుబాటులు, దక్కన్ రైతుల తిరుగుబాటులు, మోప్లారైతుల తిరుగుబాటులు, వాహబి వుద్యమం, సన్యాసులు బెంగాలులో తిరుగుబాటులు జరుపుతునే వున్నారు రైతులు 1929-30 ఆర్థిక సంక్షోభంలో వడ్డీ వ్యాపారులకు తమ భూములను కోల్పోయారు. ఆ పరిస్థితులు అనేక అసంఘటిత రైతు పోరాటాలకు దారితీశాయి అవే అఖిలభారత కిసాన్‌సభ నిర్మాణానికి దారితీశాయి.

### అఖిల భారత కిసాన్ సభ నిర్మాణం :

కాంగ్రెసు సోషలిస్టు పార్టీ జనవరి 1936, మీరట్ మహాసభ సందర్భంలో రైతు వుద్యమాలలో పనిచేసే కార్యకర్తలు, నాయకులు ప్రత్యేకంగా 15వ తేదీన సమావేశమై, అఖిల భారత కిసాన్‌సభ నిర్మాణానికై ఆచార్య రంగా, జయప్రకాశ్ నారాయణలను సన్నాహ సంఘ కన్వీనరులుగ నియమించారు. లక్నో జాతీయ కాం గ్రెసు మహా సందర్భంలో అఖిల భారత కిసాన్‌సభ అవతరణ మహాసభ జరిగింది. స్వామి సహజానంద సరస్వతి. ఇందులాల్ యాగ్నిక్, మోహన్‌లాల్ గౌతమ్. కె. యం. అష్రాఫ్, సోహన్‌సింగ్ జోష్, ఆచార్య రంగా, జయప్రకాశ్ నారాయణ్, రామమనోహర్ లోహియాలు పాల్గొన్నారు.

పండిట్ నెహ్రూ కాంగ్రెసు ప్రెసిడెంటుగా సౌభ్రాతృత్వ సందేశాన్ని, అభి నందనలను తెలిపాడు. కిసాన్‌సభ నిర్మాణాన్ని ఆహ్వానించాడు. కాంగ్రెసు రైతుల తరపున నిలబడుతుందని, కిసాన్ సభను సమిష్టిగా జాతీయ కాంగ్రెసుకు అనుబంధ సంస్థగా చేయుటకు తాను అనుకూలుడనని తెలిపారు,

కిసాన్ సభ అధ్యక్షుడుగా స్వామి సహజానంద సరస్వతి నాటి భూమి అమ రకపు విధానాన్ని తీవ్రంగా విమర్శించని, జమీందారీ భూములను స్వాధీనం చేసుకొని జమీందారీ విధానాన్ని రద్దుచేయాలని, రైతులు భూములపై హక్కులకు పోరాడే రోజులు వచ్చాయని, తాను నెహ్రూ, పటేలుల మద్దతును ఆశిస్తున్నానని అన్నారు. రామమనోహర్ లోహియా భూమిశిస్తు తగ్గింపు సమస్యను గాంధీజీ చేబట్టారు కాని, రైతులనుండి 18 కోట్లు వసూలుచేసి, 3 కోట్లును మాత్రమే చెల్లించే బెంగాల్ తది తర జమీందారీ రద్దు సమస్య చేబట్టలేదని, యిది దాని ఆవశ్యకతను తెలియజేస్తుం దన్నారు. సోహన్ సింగ్‌జోష్ జమీందారీ విధానాన్ని రద్దు చేయాలంటూ, వారికి రక్షణ కల్పించే సామ్రాజ్యవాదాన్ని ముందుగ వదలించుకోవాలన్నారు.

కిసాన్‌సభ మూడు ముఖ్య తీర్మానాలను ఆమోదించింది. మొదటిది, ఆశయం. రైతులకు ఆర్థికదోపిడి నుండి సంపూర్ణ విముక్తి, రైతు, కార్మిక యితర బడుగు వర్గాల ఆర్థిక, రాజకీయాధికారాన్ని నెలకొల్పుట. తక్షణ ఆర్థిక, రాజకీయ కోర్కెలకై రైతులను సంఘటితపరచుట ప్రధాన కర్తవ్యం. భారత స్వాతంత్ర్య పోరాటంలో చురుకుగా పాల్గొనుట ద్వారానే రైతు విముక్తి అని కిసాన్‌సభ విశ్వాసం. రెండు : నేటి జమీందారీ, తాలుక్దారీ, ఎస్టేట్‌మర్దారే, ఖోతే, జెన్మి, ఈనాందారీ భూస్వామ్య విధానాలన్నిటిని రద్దుచేయాలి,భూములపై సర్వహక్కులు రైతులకివ్వాలి. మూడు : రైత్వారీ ప్రాంతాలలో భూమిశిస్తు, రీశెటిల్‌మెంటు విధానాలు దారిద్ర్యానికి కారణాలు గాన వాటిని రద్దుచేసి, క్రమానుగతశిస్తును, నిఖర ఆదాయం రు 500లు తక్కువగావున్న శిస్తుని రద్దుచేయాలి. పన్నుల విచారణ కమిటీ సూచనలను అమలు చేయాలి.[1]

కిసాన్ సభ అఖిల భారత కిసాన్ కమిటిని, కేంద్ర కిసాన్ కౌన్సిలును,అధ్యక్షునిగా స్వామి సహజానంద సరస్వతిని, జనరల్ శెక్రటరీగ ఆచార్యరంగాను ఎన్నుకొంది.

అఖిల భారత కిసాన్ కమిటి బొంబాయిలో ఆగస్ట్ 1936లో సమావేశమై, ఎన్నికల సందర్భంగా 1937, "మానిఫిస్టో లేక ప్రణాళికను ఆమోదించి, కాంగ్రెసు వర్కింగు కమిటీకి పంపింది. జాతీయ కాంగ్రెసు ఫెయిజ్‌పూర్ వ్యవసాయ కార్యక్రమము, ఎన్నికల ప్రణాళికలపై దాని ప్రభావం చాలవుంది.

కిసాన్ కమిటి, సెప్టెంబరు 1న, "అఖిల భారత కిసాన్ దినోత్సవం"గా ప్రకటించి, వాడ వాడనా, పల్లె పల్లెనా రైతుల పండుగగా, కోర్కెల ప్రకటన దినోత్సవంగా జరుపమని కోరింది. మూడు సంవత్సరాలలో 1939కి, కిసాన్‌సభ సభ్యత్వంలో 8 లక్షలమంది వివిధ రాష్ట్రాలలో సంఘటిత పరుచబడ్డారు.

**అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్ నిర్మాణం :**

మొట్టమొదటి సంఘటిత విద్యార్థి వుద్యమంగా అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్ 1936లో యేర్పడింది.విద్యార్థుల సాధారణ కనీసహక్కుల ప్రణాళిక రూపొందించబడింది. ఈ కనీస హక్కుల ప్రణాళిక విద్యార్థి సంఘాలు యేర్పడుటకు పని చేయుటకు యెంతగానో తోడ్పడింది.

గాంధీజీ పిలుపుపై 1920 దశకంలో విదేశీవిద్యను బహిష్కరించి, లక్షలాది విద్యార్థులు సహాయ నిరాకరణోద్యమంలో చేరారు. ఈ నూతన విద్యార్థి వుద్యమ వెల్లువ వామపక్ష సోషలిస్టు చైతన్యంతో, మార్క్సిజం, సిద్ధాంత రాజకీయ విజ్ఞానం సంపాదించుకొంటూ, నూతన తరపు విద్యార్థి వుద్యమంగా కొనసాగింది. వారిలో చురుకైన కార్యకర్తలు సోషలిస్టు, కమ్యూనిస్ట్ పార్టీలలో చేరి కార్యకర్తలయ్యారు, వారే అతివాద, కమ్యూనిస్ట్ వుద్యమాల వ్యాప్తికి అనన్య కృషిచేసారు.

---

1. రసూల్,యం.ఎ.(1974)అఖిల భారత కిసాన్‌సభ చరిత్ర(ఆంగ్లంలో)పే. 5-6.

విద్యార్థి కార్యకర్తలు స్కూళ్ళు, కాలేజీలలో, విశ్వవిద్యాలయాలలో విద్యార్థుల సమస్యలపై ఆందోళనచేస్తూ, విద్యార్థులను సంఘటితపరచి, జాతీయోద్యమంలో పాల్గొనునట్లు చేసారు. విద్యార్థులలో సామ్రాజ్యవాద వ్యతిరేక భావాలను, స్వాతంత్ర్యాభిలాషను, సోషలిజాన్ని విద్యార్థి, యువజనులలోనేగాక, గ్రామగ్రామాన ప్రచారం గావించి, ప్రజల రాజకీయ చైతన్యాన్ని, పోరాటశక్తిని పెంపొందించి, నూతన తరం నాయకులయ్యారు.

**అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం :**

జాతీయ కాంగ్రెసు 1936లో సమావేశమైన లక్నో సభాస్థలిలోనే అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘ నిర్మాణ సమావేశాన్ని రచయితలు ప్రత్యేకంగా జరిపారు. యూరప్‌లో మాక్సింగోర్కీ ప్రేరణతో అభ్యుదయ రచయితల నాయకత్వములో యేర్పడిన, ఫాశిస్టు వ్యతిరేక రచయితల సంఘం పరోక్ష సహాయ, సహకారాలతో, కమ్యూనిస్టుల చొరవతో యేర్పడిన యీ సంఘానికి రవీంద్రనాథ్ ఠాగూర్, సరోజినీనాయుడు, ప్రేమచంద్, ముల్కరాజ్ ఆనంద్, వల్లతోలు నాయకత్వంగా వ్యవహరించారు. వీరితోపాటు, మనిక్‌బంధోపాధ్యాయ, సుజరబ్, కృష్ణచందర్, సుమిత్రనందన్‌పంత్, నిర్మలా. అన్నాభౌసాఠేలు పాలొన్నారు.

అభ్యుదయ రచయితల ఆశయం సాహిత్యాన్ని ప్రజలకు సన్నిహితంగా చేయుట, వారి కష్ట, సుఖాలను, ఆశలను, ఆవేదనలను సాహిత్యంలో ప్రతిబింబించుట. సహజంగానే యీ రచయితలు, వామపక్షవాదులు, సోవియట్, సోషలిజపు మిత్రులు, ప్రజాసాహిత్య ప్రేమికులు. సామ్రాజ్యవాద, ఫాశిస్టు వ్యతిరేక అంతర్జాతీయ అభ్యుదయవాదులు.

**కార్మిక ఉద్యమము ఐక్య సంఘటన :**

కమ్యూనిస్టులు ప్రధానంగా కమ్యూనిస్టేతరుల సహాయంతోనే భారతదేశంలో కార్మిక సంఘాలను, ప్రజోద్యమాలను నిర్మించారు. కార్మికోద్యమం 1929లో వొకసారి 1930లో మరోసారి చీలికలై కార్మికులనుండి దూరమైందని మరువలేము. అంతర్జాతీయ 7వ కమ్యూనిస్టు పార్టీ మహాసభలో డిమిట్రావ్ కార్మికుల ఐక్యతావసరాన్ని, అందుకు చేసిన సూచనలు అన్ని కాలాలకు వర్తించేవిగా ఉన్నవి. భారతదేశంలో ముఖ్యంగా కార్మికవర్గ ఐక్యతను నిర్మించే ప్రయత్నాలు 7వ, అంతర్జాతీయ కమ్యూనిస్ట్ కాంగ్రెసు అనంతరం ద్విగుణీకృతమయ్యాయి. అంతర్జాతీయ సూచనలను దేశ పరిస్థితులకు అన్వయించి, ఆచరణలోని అనుభవాలతో వాటిని పరిపుష్ఠ మొనర్చుకోవాలనుట నిర్వివాదాంశము,

"దత్తు-బ్రాడ్లీల రెండోపత్రం, "భారతదేశంలో ట్రేడు యూనియనుల ఐక్యతామార్గం" మార్చి 1936లో ప్రకటించబడింది. అన్ని ట్రేడు యూనియనులు విశేషముగా ఆదరించాయి. పత్రపు నిజాయితీ, యన్. యం. జోషిని కదలించింది. కార్మిక

వర్గ ఐక్యతా నిర్మాణానికి, పోరాటానికి తోడ్పడి, ఎ. ఐ. టి. యు. సి. ఆధ్వర్యంలో ఐక్య కార్మికోద్యమ అభివృద్ధికి తోడ్పడింది పోరాటాల నూతన శకం ప్రారంభమైంది."[1]

కార్మికవర్గ ఐక్యసంఘటనా నిర్మాణక్రమంలో కార్మికవర్గ తక్షణ ఆర్థిక కోర్కెలకై ఐక్య పోరాటాలద్వారా ఐక్యతను నిర్మించే క్రమంలోనే జరుగుతుందని కామింటర్న్ నొక్కి చెప్పింది పరిశ్రమలో కార్మిక సంఘాల ఐక్యతను సాధించుటకై ఆచరణలో అవసరమైన అన్నిచర్యలు తీసుకొనుటే కమ్యూనిస్టుల కర్తవ్యం. పరిశ్రమలోని ఐక్యత క్రమేణా జాతీయపరిధికి విస్తరించు చర్యలు తీసుకొనాలి. కమ్యూనిస్టుల ఆధ్వర్యంలోని కార్మిక సంఘాలను, మితవాదుల చేతులలోవున్నా విస్తృత సంఘాలలో తమ అభిప్రాయ ప్రకటనా స్వాతంత్ర్యాన్ని కాపాడుకొంటూ వాటితో పనిచేసే ప్రయత్నం చేయాలి. సమాన బలమున్న రెండు కార్మిక సంఘాలున్న పెట్టుబడిదారుల దాడిని త్రిప్పికొట్టుటకు పోరాట సమాన నిర్మాణ ప్రాతిపదికపై "కలయిక లేక ఐక్యతను" తప్పనిసరిగా ప్రయత్నం విజయం పొందాలి. కార్మిక సంఘాల ప్రజాస్వామిక పద్ధతులు అనుసరిస్తే యిది అసాధ్యంకాదు. అట్టి ఐక్యత కార్మిక సంఘాలలోగాని, మితవాద కార్మిక సంఘాలలోగాని, చురుకుగా పనిచేస్తూ, అసంఘటిత కార్మికులను సంఘటితపరస్తూ నిజమైన కార్మికవర్గ పోరాటసంస్థలుగా అభివృద్ధి చేయుట కమ్యూనిస్టుల విధి.

కార్మిక సంఘాల హక్కులను కుదించుట, రద్దుచేయు ప్రయత్నాలను కార్మిక వర్గాన్ని సమీకరించి, చీల్చే ప్రయత్నాలను వమ్ముచేయాలి. మితవాద నాయకత్వాలు విప్లవ పోరాట కార్యకర్తలను, నాయకులను, కార్మిక సంఘ శాఖలను బర్తరఫ్, యితర ఆంక్షలు విధించుట కార్మికులను సమీకరించి ఎదుర్కొనుట కమ్యూనిస్టుల కర్తవ్యం. బర్తరఫ్ చేయబడిన వారితో సంబంధాలు పెట్టుకొని, కలసి పనిచేస్తూ, సంయుక్త పోరాటాలు జరుపుతూ తిరిగి చేర్చుకొనబడునట్లు చేస్తూ, చీలికలనుండి కార్మిక సంఘాల ఐక్యతను కాపాడాలి. ఈ విధంగా జాతీయ, అంతర్జాతీయ రెడ్ ట్రేడు యూనియనులన్నీ సంయుక్త పోరాటంలోనికి వచ్చునట్లు కమ్యూనిస్టులు ప్రయత్నించాలి. దీనికి వర్గపోరాటం, కార్మిక సంఘాలలో ప్రజాస్వామ్యం, ఐక్య కార్యాచరణ విధానాలు ప్రాతిపదిక కావాలి.[2]

కార్మికోద్యమంలో వామపక్షశక్తులు దృఢదీక్షతో కార్మికుల హక్కులకై పని చేయుటతో ఎ. ఐ. టి. యు. సి. బలం పెరిగి ఆధిక్యతను సంపాదించగలిగారు. నాగపూర్ సమావేశంలో యీ బలం రుజువైంది.ఆ కారణంగానే కార్మికోద్యమంలో క్లిష్టపరిస్థితులు యేర్పడినాయి. సంస్కరణవాద నాయకత్వం ప్రజాస్వామ్యపద్ధతిలో తీసుకొన్న మెజారిటీ నిర్ణయాలను ఆమోదించక ఎ. ఐ. టి. యు. సి. ని చీల్చి,

---

1. జోషి, పి. సి. (1971) ఇండియన్ లెఫ్ట్ రివ్యూ. వా. నం. 4. పే. 53,
2. డిమిట్రాఫ్, జి. (1935) కార్మికవర్గ ఐక్యత-శక్తివంతమైన పాశిస్టు నిరోధకం. (ఆంగ్లంలో) పి. పి. హెచ్. 1950. పే 115-16.

వారిని అనుసరించే యూనియనులలో "ట్రేడు యూనియన్ ఫెడరేషన్" అను పోటీ కార్మికసంస్థను యేర్పాటు చేసారు. "మెజారిటి సభ్యులు మేము పూర్తిగ వ్యతిరేకించే విధానంపై నిర్ణయాన్ని గైకొన్నారని" జోషి, శివరావు, గిరి, చమన్‌లాల్ ప్రభృతులు ప్రకటించారు. "వారికి మెజారిటి వున్నది కాన వారి నిర్ణయాలను ట్రేడు యూనియన్ కాంగ్రెసు ఆమోదించుతుండనుటలో మాకెట్టి సందేహం లేదు. ఈ పరిస్థితులలో కార్యవర్గ నిర్ణయాలనుండి పూర్తిగ దూరంగా వుండుట తప్పనిసరి. మహాసభ కార్యక్రమంలో మేము కొనసాగుట ప్రయోజనకారికాదని మేము తలంచుతున్నాము[1]" అని స్పష్టం చేసారు. మహాసభ యస్. వి. దేశపాండేను కార్యదర్శిగా ఎన్నుకొని, తదుపరి మహాసభ డిశెంబరు 1930లో బొంబాయిలో జరగాలని నిర్ణయించింది.

'వామపక్షం' అంత సంఘటితంగా లేదు. అధికార కమ్యూనిస్టు పక్షం క్రమేణా తమ బలాన్ని కోల్పోవుట యం. యన్. రాయ్ తదితర వర్గాలు బలపడినవి. దేశ్‌పాండే 1930 డిశెంబరులో జరుపవలసిన మహాసభను తాత్సారంచేస్తూ, సుభాస్ చంద్రబోసు మద్దతు లభించుతుందనే ఉద్దేశ్యంలో కలకత్తాలో జులై 1931లో జరిపారు. కార్మికులు రాజకీయ స్వతంత్రపాత్ర సమస్యపై మరోసారి చీలిక యేర్పడింది. రాయ్‌వర్గం అఖిల భారత ట్రేడు యూనియన్ కాంగ్రెసులో పూర్తి మద్దతును సంపాదించింది. అధికార కమ్యూనిస్టు పార్టీ నాయకులు దేశ్‌పాండె రణదివె, బుఖారి, సోమనాధ లాహిరి తదితరులు పోటీ"-అఖిల భారత రెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు" అను కార్మిక సంస్థను వారి ననుసరించే కార్మిక సంఘాలచే యేర్పాటు గావించారు.

ఈ విధంగా అఖిల భారత ట్రేడు యూనియన్ కాంగ్రెసు రాయ్ అనుచరుల ఆధ్వర్యంలో, భారత ట్రేడు యూనియన్ ఫెడరేషన్ జోషి, గిరీల ఆధ్వర్యంలో, అఖిల భారత రెడ్ ట్రేడు యూనియన్ కాంగ్రెసు దేశపాండే, రణదివె ఆధ్వర్యంలో, భారత కార్మికవర్గం మూడు కార్మికసంస్థలలో చీల్చబడివుంది. అంతర్జాతీయ, దేశీయ ఆర్థిక సంక్షోభ ఫలితంగా కార్మిక, కర్షక, యితర బడుగువర్గాల జీవితం దుర్భరమైంది. కార్మికవర్గానికి ఐక్యకేంద్ర నాయకత్వం లేకుండాపోయింది. పెట్టుబడిదారులు పరిశ్రమల రేషనలైజేషన్, వేతనాలకోతలు, లాకవుటులుతో సంక్షోభభారాన్ని ప్రజలపై త్రోసివేస్తున్నారు. కార్మికోద్యమం చీలికలతో బలహీనపడింది. అయినా వారి ఆర్థిక కోర్కెలు, హక్కులపై సమ్మెలు జరిపారు. అందువలన 1929లో 141, 1930లో 148, 1931లో 166 సమ్మెలు జరిగాయి. ప్రతి సంవత్సరం లక్షల కార్మికులు పాల్గొన్నారు. రేషనలైజేషన్‌కు వ్యతిరేకంగా 1934లో సమ్మెల వెల్లువ ఉధృతమై, 1933లో 21.68 లక్షల పనిదినాలు, 1934లో 47.75 లక్షల పనిదినాలు పరిశ్రమలు నష్టపోయాయి. బొంబాయి, షోలాపూర్, గుడ్డల మిల్లుల కార్మికులు 3-4

1. దత్తు, ఆర్. పి. (1949) ఇండియా టు డే. (ఆంగ్లంలో) పి. పి. హెచ్. పే. 202.

మాసాలు దీర్ఘకాలసమ్మె పోరాటాలను సాగించారు. సమ్మెల వుధృతి, తీవ్రత, దీర్ఘ కాలనైజాన్నిబట్టి కార్మికవర్గ చైతన్యాన్ని, నాయకత్వ నిర్మాణదక్షతను కొనియాడక తప్పదు. కార్మికవర్గం చీలిపోయిన తమవర్గ పోరాటశక్తిని కొంత కూడ గట్టుకొని, కనీస పోరాట ఐక్యతను తిరిగి సాధించుకొంది. నూతన కార్మిక నాయకులు కార్మిక పోరాటాలనుండి ఉద్భవించారు. ప్రభుత్వం ఎమర్జెన్సీ అధికారాలతో, ఆర్డినెన్సులతో, విచారణ లేకుండా అనేకమందిని నిర్బంధించింది కమ్యూనిస్టు పార్టీని, 12 కార్మిక సంఘాలను చట్టవిరుద్ధమైనవిగా ప్రకటించి, నిషేధించింది. కార్మికుల నణచుటకై అనేకచోట్ల కాల్పులుజరిపింది.

ఈ బృహత్తర పోరాటాలనుండి కార్మిక సంఘాల నన్నిటిని ఐక్యపరచాలనే ప్రతిపాదన వుద్భవించింది. రెడ్‌ట్రేడు యూనియన్ కాంగ్రెసు, అఖిలభారత ట్రేడు యూనియన్ కాంగ్రెసు, 1935లో దగ్గరై రెడ్‌ట్రేడు యూనియన్ కాంగ్రెసు షరతులు లేకుండా తమ సంస్థను రద్దు చేసుకొని ట్రేడు యూనియన్ కాంగ్రెసులో కలసిపోయింది. సంయుక్తంగా జరిగిన 15వ, ట్రేడు యూనియన్ కాంగ్రెసు మహాసభ 1936 సభాస్థలినుండి సంస్కరణవాద జాతీయ ట్రేడు యూనియన్ ఫెడరేషన్ ఐక్యతకై విజ్ఞప్తి చేసింది. కార్మికవర్గ ఐక్యతకై, ట్రేడు యూనియన్ ఉద్యమానికై, వర్గపోరాట ప్రాతిపదికను, ట్రేడు యూనియనుల అంతర్గత ప్రజాస్వామ్యానికి కట్టుబడి ఉండుటకు వారంగీకరించితే, తాము వారు విధించే ఎట్టి షరతులకైనా అంగీకరించుటకు సిద్ధమని తెలిపారు. ఫెడరేషన్ నాయకులు వెంటనే ఐక్య నిర్మాణానికి విముఖతను చూపారు. ఒక సంయుక్త బోర్డును 1936లో యేర్పాటు చేసారు నాగపూరు 1938 అఖిల భారత ట్రేడు యూనియన్ కాంగ్రెసు మహాసభలో రెండుసంస్థలకు సమాన ప్రాతినిధ్య ప్రాతిపదికపై తిరిగి భారత ట్రేడు యూనియన్ ఫెడరేషన్, అఖిల భారత ట్రేడు యూనియన్ కాంగ్రెసులోచేరి, కార్మికవర్గ సంస్థల ఐక్యతను, వర్గఐక్యతను పునరుద్ధరించారు. ఒక్క అహమ్మదాబాద్‌లో గాంధీ తత్వప్రభావంలో నడుపుతున్న అహమ్మదాబాద్ గుడ్డల మిల్లుల కార్మికుల అసోసియేషన్ తప్ప దేశంలోని అన్ని కార్మిక సంఘాలు ఒకే జండా క్రిందికి వచ్చాయి. ఈ విధంగా రెండవ ప్రపంచయుద్ధానికి పూర్వం కార్మికవర్గంలో ఐక్యత యేర్పడి, యుద్ధకాలంలో భారత దేశంలో యేర్పడిన దుర్భర పరిస్థితులలో కార్మికవర్గం తన చారిత్రాత్మక పాత్ర నిర్వహించుటకు ఐక్యకార్యాచరణ ప్రాతిపదిక యేర్పడింది.

# రాష్ట్ర కాంగ్రెస్ ప్రభుత్వాలు : ఐక్య సంఘటనా సమస్యలు

కాంగ్రెసు, అసెంబ్లీలు, స్థానిక స్వపరిపాలన సంస్థల బహిష్కరణ నినాదంతో ప్రజలను సమీకరించింది. ఒకవైపు బహిష్కరణ మరోవైపు బ్రిటిష్‌వారితో రాజీ రాయబారాలు అనే ద్వంద్వ విధానాన్ని అనుసరించింది. రాజీమార్గాన తక్షణ గమ్యం చేరుటకు బ్రిటిష్ వారిపై వొత్తిడి అవసరమని తలచినపుడు, ఆందోళన, పోరాట కార్యక్రమాన్ని చేబట్టుట, ఆ బలంతో రాయబారాలు, రాజీపడుట అను ఎత్తుగడలు కాంగ్రెసు అవలంబించింది. కాని, పోరాట మార్గాన స్వాతంత్ర్య సంపాదన విధానాన్ని ఎప్పుడూ చేబట్టలేదు.

మహారాష్ట్రంలోని ఫెయిజ్‌పూర్‌లో డిశెంబరు 1936లో కాంగ్రెసు మహాసభ జరిగింది. లక్నో మహాసభలో కాంగ్రెసు మెజారిటి నాయకత్వంతో తనకుగల అభిప్రాయ భేదాలను నెహ్రూ స్పష్టం చేసినప్పటికి ఫెయిజ్‌పూర్ మహాసభలో గాంధీజీ, మితవాద నాయకత్వం తిరిగి నెహ్రూ పేరును అధ్యక్ష పదవికి ప్రతిపాదించారు. మితవాద అభ్యర్థిగా ప్రతిపాదించబడిన వల్లభాయిపటేలు విరమించుకొంటూ చేసిన ప్రకటనపై "సంక్షిప్తంగా చెప్పాలంటే నెహ్రూను అధ్యక్ష స్థానానికి మచ్చిక చేసుకోవాలన్న మితవాద పక్షం ఎత్తుగడ ఫలించింది" అని నంబూద్రిపాద్ వ్యాఖ్యానించుట గమనార్హం. ఇంకా "ఆయన (నెహ్రూ) అధ్యక్షుడుగా వుండుటవలన వామపక్షం భావాలుగల యువకులు, శ్రామికులు, కాంగ్రెసువైపుకు ఆకర్షింపబడతారు. ఈ ఎత్తుగడ ఫలిస్తుందనే విశ్వాసం పటేల్ ప్రకటనలో మనం గమనించవచ్చు....పురోగమిస్తున్న వామపక్షశక్తులను తమ వర్గ ప్రయోజనాలకు అనుకూలంగా పూర్తిగ వినియోగించుకొనేందుకు మితవాద నాయకత్వంయొక్క జిత్తులమారి ఎత్తుగడలుకూడ వ్యక్తమయ్యాయి.[1]"

ఫైజ్‌పూర్ కాంగ్రెసు మహాసభలో పాలకుల రాజ్యాంగ సంస్కరణలకు వ్యతిరేక ఆందోళన, ఎన్నికలు, భవిష్యత్తు కార్యక్రమాలపై మితవాదులు, వామపక్షవాదుల మధ్య జరిగిన తీవ్రవాదోపవాదాలు ప్రతినిధుల, ప్రజల చైతన్యాన్ని పెంచాయి. కేంద్ర, రాష్ట్ర అసెంబ్లీలకు ఎన్నికైన సభ్యులతోను, ఎ ఐ సి సి సభ్యులతోను, ఆహ్వానింపబడిన వారితో కలసి మరో మహాసభ జరిపి, రాజ్యాంగరచన కమిటీని నియమించాలని, మితవాదుల వొత్తిడితో మహాసభ నిర్ణయించింది. మహాసభ అనంతరం కొన్ని వారాలకే 1935 సంస్కరణల చట్టాన్ననుసరించి రాష్ట్ర అసెంబ్లీలకు ఎన్నికలు జరిగాయి. నిర్ణీత భూమిశిస్తు కట్టేవారికి, చదువుకొన్నవారికి మాత్రమే వోటు హక్కులు యివ్వబడినవి.

---

1. నంబూద్రిపాద్, ఇ. యం. యస్. (1988) భారత స్వాతంత్ర్య పోరాట చరిత్ర ద్వి. భా. (తెలుగులో) పే. 127.

కాంగ్రెసు, వామపక్షాలు, యితర సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తులు రాష్ట్రాల స్వపరిపాలనను అమలు జరుపుటకుగాక, రాజ్యాంగంలోని ఫెడరల్ స్వభావాన్ని ధ్వంసం చేయుటకు, ప్రజలను సమీకరించుటకు ఎన్నికలలో పాల్గొంటున్నామని ప్రచారం గావించారు. రాష్ట్రాలలోని భూస్వామ్యవర్గాల వివిధ పార్టీలు, హిందూ మహాసభ, ముస్లింలీగ్, అంబేద్కర్ లేబర్ పార్టీలు గ్రామాల స్వపరిపాలనను సృజనాత్మకంగా అమలుచేయు వైఖరిని అవలంబించారు. అనగా రాజ్యాంగానికి వ్యతిరేకంగా ప్రజలను సమీకరించే మితవాద, వామపక్ష శక్తుల సామ్రాజ్యవాద వ్యతిరేక పక్షం, వివిధ గ్రూపుల వ్యక్తుల కలయికతో బ్రిటిష్ ప్రభుత్వపు అండదండలతో సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తులను వ్యతిరేకించే పక్షం ప్రత్యర్థులుగా ఎన్నికల పోరాటంలోకి దిగారు.

కాంగ్రెస్ ఎన్నికల ప్రణాళికను నెహ్రూ రూపొందించారు. దీనిపై "సంక్షిప్తంగా, కాంగ్రెసు ఎన్నికల ప్రణాళిక వామపక్షవాదులు, వారి అభిప్రాయాల కనుగుణంగా ప్రచారం చేసుకొనుటకు అవకాశాలు కల్పిస్తూ, వామపక్ష ధోరణివలన ఆకర్షింపబడిన ప్రజల మద్దతుతో గెలిచి, ఎన్నికల తరువాత మితవాద నాయకత్వం వారి కనుగుణంగా నిర్ణయాలు గైకొనుటకు దోహదపడేదిగా వుందని" నంబూద్రిపాద్ వ్యాఖ్యానించారు "ఎన్నికలలో గెలిచిన రాష్ట్రాలలో మంత్రివర్గాలను యేర్పాటు చేయాలని మితవాద నాయకత్వం అంతకు ముందే నిర్ణయం చేసినప్పటికి ఎన్నికల ప్రణాళిక యీ విషయంలో మౌనం వహించింది.[1]" ఎన్నికల ప్రణాళికలు అమలు చేయవలసిన అవసరముండదని 55 సంవత్సరముల నాడే కాంగ్రెసు మితవాద నాయకత్వానికి గల అవగాహన కావచ్చు.

కమ్యూనిస్టులు, సోషలిస్టులు, యితర వామపక్షవాదులు కాంగ్రెసు అభ్యర్థులను గెలిపించుటకై కార్మిక, కర్షకులలో తీవ్రమైన ప్రచారం కావించారు. ఎన్నికలలో ఐక్య సంఘటనగా, నిస్వార్థంగా కృషిచేసి ప్రజల మన్ననలకు పాత్రులయ్యారు. జాతీయవాదుల హృదయాలలో చెరగని ముద్రవేసారు. వామపక్షాల బలం ప్రజలలో పెరిగింది. ప్రజలలో జాగృతి కలిగించారు. బ్రిటిష్ ఇండియాలో 11 రాష్ట్రాలలో 6 రాష్ట్రాలలో కాంగ్రెసు మెజారిటి సంపాదించింది.

ఎన్నికల అనంతరం ఫిబ్రవరి 1937లో వార్దాలో సమావేశమైన కాంగ్రెసు కార్యవర్గం, అధికారాన్ని స్వీకరించాలా అనే సమస్యను చర్చించి, నిర్ణయానికిరాలేక, వివాదాస్పదమగుటతో వాయిదావేసి, మార్చి కార్యవర్గపు సమావేశంలో అధికారం స్వీకరించాలనే నిర్ణయాన్నే చేసింది. వామపక్షాలు కోరిన విధంగా అధికారాన్ని తిరస్కరించరాదని, మితవాదులు కోరిన విధంగా మెజారిటి లభించిన రాష్ట్రాలలో అధికారాన్ని స్వీకరించాలనే వాదనకు కార్యవర్గం తన వ్యతిరేకతను తెలియజేస్తూ, గవర్నరు రాజ్యాంగ కార్యకలాపాలలో జోక్యం చేసుకొనననీ, మంత్రుల సలహాలను

---

1. నంబూద్రిపాద్; ఇ. యం. యస్. (1988) భారత స్వాతంత్ర్య పోరాటచరిత్ర. (తెలుగులో) ద్వితీయభాగం. పే. 121.

త్రోసిపుచ్చుటకు ప్రత్యేక అధికారాలను వినియోగించనని వాగ్దానం చేస్తే అధికారాన్ని ఆమోదించగలమని నిర్ణయించింది. వాగ్దానం చేయుట రాజ్యాంగానికి విరుద్ధమని కాన చేయజాలమని వైస్రాయి, గవర్నరులు స్పష్టం చేసారు. కొత్త రాజ్యాంగం అమలు కొచ్చిన ఏప్రియల్ 1వ తేదీన దేశవ్యాప్తంగా హర్తాళు జరిగింది ప్రజలు ప్రత్యక్షంగా పాల్గొనడం, బ్రిటిష్ పాలకవర్గాన్ని, కాంగ్రెసు మితవాద నాయకత్వాన్ని కలవర పరచింది ప్రజల నిరసనకు సామ్రాజ్యవాద వ్యతిరేకపోరాట స్వరూపాన్నిచ్చుటకు కమ్యూనిస్టులు, సోషలిస్టులు ప్రయత్నించారు వైస్రాయి "గవర్నరు ప్రత్యేకాధికారాలను వుపయోగిస్తాడని భయపడ నవసరంలేదని, అనవసరంగా మంత్రుల దైనందిన వ్యవహారాలలో జోక్యం కలుగ జేసుకొనడని" ప్రకటించారు. కాంగ్రెసు కార్యవర్గం జులై 1937న సమావేశమై అధికారాన్ని స్వీకరించుటకు ఆమోదాన్ని తెలిపింది. నెహ్రూ వామపక్షవాదులు కొద్దిమంది యీ నిర్ణయాన్ని వ్యతిరేకించారు. మెజారిటిగల ఐదు రాష్ట్రాలలోను, బొంబాయి, సింధూ, అస్సాంలలో కాంగ్రెసు మంత్రివర్గాలు యేర్పడినవి.

### కాంగ్రెసు మంత్రివర్గాలు. జాతీయ సంఘటన. ప్రజాపోరాటాలు :

కాంగ్రెసు మంత్రివర్గాలు యేర్పడుటతో, ఎన్నికల కాలంలో కాంగ్రెసు చేసిన వాగ్దానాలను నెరవేర్చుతుందని ఆశించారు. ప్రధాన సమస్యలైన రాజకీయ ఖైదీల విడుదల, జమిందారీ, భూస్వామ్య విధానాన్ని రద్దుచేయుట, భూములపై అన్ని హక్కులు, రైతులకు సంక్రమింపజేయుట, రైతువారి ప్రాంతాలలో రీసెటిల్‌మెంటు రద్దు, భూమిశిస్తు తగ్గింపు, క్రమానుగత గ్రైడెడ్ శిస్తు విధానాన్ని అమలుచేయుట, ముఖ్యంగా కిసాన్‌సభ రైతుల "మానిఫెస్టో" అంశాలను కాంగ్రెసు తన ఎన్నికల ప్రణాళికకు అనుబంధంగా ప్రకటించి, వాటి అమలు. కార్మికులకు 8 గంటల పని, జీతభత్యాలు తగ్గించకుండుట, పనినుండి తొలగించకుండుట, నిరుద్యోగభృతిని వాగ్దానం చేసింది,వీటితోపాటు సంస్థాన ప్రజోద్యమాలు, ముస్లిం సమస్య ప్రధాన సమస్యలుగా, తక్షణం పరిష్కరించవలసిన సమస్యలుగా మంత్రివర్గాలు ముందుకొచ్చాయి. నూతనంగా కాంగ్రెసు పరిపాలనా బాధ్యతలను స్వీకరించుటతో ప్రభుత్వం - బ్రిటిష్ పాలకులు, ప్రభుత్వం, కాంగ్రెసు సంస్థ ప్రభుత్వం-ప్రజలు సంబంధాలు ఆచరణలో ముఖ్య సమస్యలైనవి.

### రైతుల ఆందోళన, ఐక్య పోరాటాలు :

కిసాన్‌సభ స్థాపించిన సంవత్సరంలో ఎన్నికలు జరిగి రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రివర్గాలు యేర్పడినవి. కాంగ్రెసు నిర్ణయాల ఫలితంగా కార్యకర్తలు రైతుల సమస్యలను చేబట్టారు రైతాంగంనుండి సమర్థులైన కార్యకర్తలు తయారయ్యారు. కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికలో ఫైజ్‌పూర్ కాంగ్రెసు తీర్మానంలో చేసిన వాగ్దానాలననుసరించి కౌలురేటు తగ్గించమని, ఋణభారాన్ని తగ్గించమని, జప్తులు ఆపివేయమని, జమిందారీ; మాలుజారీ, యీనాందారీ విధానాలను రద్దుచేయమని దేశవ్యాప్తంగా సమావేశాలు, ప్రదర్శనలు, ఆందోళనలు కొనసాగించారు. ఈ ఆందోళనలో కాంగ్రెసు,

సోషలిస్టు, కమ్యూనిస్ట్, తదితర వామపక్షకార్యకర్తలు కాంగ్రెసు త్రివర్ణ పతాకంతో పాటు ఎర్ర జెండాలతో వొక జాతీయ ఐక్య కార్యాచరణను రూపొందించారు.

కిసాన్‌సభ అవతరణకు ముందే వివిధ ప్రాంతాలలో అనేక రైతుపోరాటాలు జరిగాయి. వాటిని రైతువిప్లవ పోరాటాలుగ అభివృద్ధిచేయుటకు మారుగ "అహింస కట్టుకొయ్యకు" కట్టిపేసి, బూర్జువా ప్రయోజనాలకు పరిమితం చేసినారు. కిసాన్‌సభ నాయకత్వంలో రైతులు కార్మికుల వలెనే "మే" దినోత్సవాన్ని ఎర్రజెండానెగురవేసి పండుగగా జరుపుతూ, స్వతంత్రంగా రైతువిప్లవ పోరాటాలను కొనసాగించ ప్రారంభించారు. వీలైన అన్నిచోట్ల కాంగ్రెసు సహకారాన్ని పొంద ప్రయత్నించారు. కాంగ్రెసు బూర్జువా నాయకత్వంతో విభేధించుటకు వెనుకాడలేదు. సహజంగానే కిసాన్‌సభ పెరుగుదల, ఆ పెరుగుదలకు సాధారణ కాంగ్రెసుసభ్యులు, కార్యకర్తలు కాంగ్రెసుకమిటీలు నిర్వహించినపాత్ర, కాంగ్రెసు మంత్రులను, మితవాద కాంగ్రెసు నాయకత్వాన్ని కలచిపేసింది. ఆ కారణంగా పై కాంగ్రెసు కమిటీలు కిసాన్‌సభపై రాజకీయదాడులు ప్రారంభించాయి. జమీందారులు, భూస్వాములకు వ్యతిరేకంగా కిసాన్‌సభ నాయకత్వంలో జరిగే పోరాటాలు, అహింసామార్గంలో కాక హింసామార్గంలో జరుగుతున్నవని ప్రచారం చేయబడింది. వాస్తవానికి కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికలో వాగ్దానంచేసిన రైతులకోర్కెలను అమలు చేయమని కోరుతూ, జమిందారుల, భూస్వాముల దౌర్జన్యాలకు వ్యతిరేకంగా జరిగే రైతుల సత్యాగ్రహం పోరాటాలు అవి.

జాతీయ కాంగ్రెసు ఫెయిజ్‌పూర్ మహాసభలో ఆమోదించిన రైతు కార్యక్రమ ముఖ్యాంశాలు తెలుసుకొనతగినవి. భూమి అమరకపు విధానాన్ని, శిస్తు విధానాన్ని మార్చేముందు తీసుకొనే తక్షణచర్యలను వివరంగా పేర్కొంది. కౌలుదారుల విషయమై కౌలురేట్లు 50 శాతం తగ్గించాలి, కౌలు బాకీలు రద్దుచేయాలి, కౌలుదారులను తొలగించుట చట్టవిరుద్ధంచేయాలి. వారు ఇండ్లుకట్టుకొనుహక్కు, వారు పెంచిన చెట్లపై హక్కునివ్వాలి. గ్రామీణుల అప్పులపై మారుటోరియం ప్రకటించి రద్దు చేయాలి. ఋణసౌకర్యాలు కల్గించాలి. ప్యూడలు బాకీలు, లెవీలు, నజరానాలు, వెట్టి రద్దుచేయాలి. శిస్తుమినహా మరేమి వసూలు చేయరాదు. వ్యవసాయ కూలీలకు కనీస జీవన కూలిని చట్టరిత్యా నిర్ణయించాలి. పనిచేయుటకు తగిన పరిస్థితులు కలిగించాలి. ఉమ్మడి గో భూములను, బావులు, చెరువులు, అడవులుపై ప్రజాహక్కులనుగుర్తించి అన్యాక్రాంతాలను రద్దుచేయాలి. చిన్న భూఖండాలను ఏకీకరణచేస్తూ సహకార వ్యవసాయాన్ని పెంపొందించాలి. ఆర్థికంగా నిలబడజాలని భూ ఖండాలకు భూమిశిస్తును రద్దుచేసి, భూమిశిస్తు 50 శాతం తక్షణం తగ్గించాలి, వ్యవసాయ ఆదాయాన్నిబట్టి భూమిశిస్తు పన్నువృద్ధి క్రమానుగతంగా విధించాలి. మరణ సుంకం రద్దుచేయాలి. పారుదల నీటిచార్జీలను తగ్గించాలి. భూముల అమరికపు విధానాన్ని శాశ్వతంగా నిర్ణయించాలి. రైతు సంఘాలను యేర్పాటు చేయుటను ప్రోత్సహించి, గుర్తించాలి. ఈ 14 అంశాల కార్యక్రమాన్ని కాంగ్రెసు ఆమోదించి, వాగ్దానంచేసింది.

వివిధ రాష్ట్రాలలో రైతులు తమ కోర్కెలు సాధించుకొనుటకై ప్రచారం, ఆందోళన, ప్రదర్శనలు,పోరాటాలు, కాంగ్రెసు మంత్రివర్గాలకు విజ్ఞప్తులు సమర్పించారు.

బీహారులో జమిందారీ విధానాన్ని, పోలీసుల దౌర్జన్యాలను రద్దు చేయాలని మోన్గీర్ రైతులు "బకాస్టు" సత్యాగ్రహాన్ని చేయగా, ప్రభుత్వం రెండువందల మంది రైతులను, 16 మంది ఆడవారిని అరెస్టుగావించి, సంవత్సరం జైలుశిక్ష విధించింది. అసెంబ్లీముందు పెద్ద రైతుప్రదర్శన చేశారు. పాట్నాలో 26 నవంబరు 1937న లక్షమంది రైతులు జమిందారీ విధానాన్ని రద్దుచేయాలని, కౌలురేట్లు సగానికి తగ్గించాలని, మారుటోరియం ప్రకటించి అప్పులను రద్దుచేయాలని, చెఱకుకు అధిక ధర నిర్ణయించాలని, బీహారు కౌలుదారులచట్టాన్ని 'నీరుగార్చుట'కు కాంగ్రెసు జమిందారుల మధ్యజరిగిన అగ్రిమెంటును రద్దుచేయాలని కోరుతు ప్రదర్శించారు.

పంజాబులో మౌంట్‌గోమరీ జిల్లాలోని 'నీలిబార్' కాలని రైతులు 40వేల మంది భూస్వాములు, కౌలుదారులమధ్య దళారులకు వ్యతిరేకంగా పంటలో 50:50 భాగముండాలని, మార్చి1938లో కిసాన్‌సభ ఆధ్వర్యాన పోరాటంజరిపారు. రైతులు నివసించే యిండ్లకు, పశుశాలలకు అద్దెవసూలు చేయరాదని, వెట్టిని నిరోధించాలని కోరారు. వారికోర్కెలు ఆమోదించబడి పోరాటం సఫలమైంది.[1]

కిసాన్‌సభ యేర్పడుటకుముందే పనిచేస్తున్న ఆంధ్రరాష్ట్ర రైతుల అసోసియేషన్‌కు ఆంధ్ర జమీన్ రైతుల అసోసియేషన్, ఆంధ్ర రైతురక్షణ కమిటి అనుబంధ సంస్థలుగ వున్నవి. జూన్ 1937లో రాష్ట్రకిసాన్ సభ జరిగింది. కిసాన్‌సభ ఆధ్వర్యంలో 5000 మంది రైతులు 130 రోజులు, 500 గ్రామాలలో సమావేశాలు జరుపుకొంటూ, ప్రదర్శనలు చేస్తూ 1500 మైళ్ళు తొమ్మిదిజిల్లాలగుండా రైతుయాత్ర జరుపుతూ 400 పిటీషనులు, విజ్ఞప్తులు, వివిధకోరికలపై పత్రాలు మార్గమధ్యంలో సేకరించి మద్రాసు ప్రభుత్వానికి సమర్పించారు[2]. ఇంతటి విస్తృత రైతుల యాత్ర దారిపొడవునా రైతులలో చైతన్యాన్ని కలుగజేస్తూ జరిగిన రైతుయాత్ర మరొకటి చరిత్రలోకానరాదు.

ఆంధ్రాలో మునగాల రైతుల జమీంధారీ వ్యతిరేక పోరాటం ప్రత్యేకతను సంతరించుకొన్నది. అభ్యుదయ, వామపక్ష కాంగ్రెసువాదులు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు, యువరైతు కార్యకర్తలు పాల్గొన్నరైతుల సత్యాగ్రహపోరాటం. అంతేగాక పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసు, యం. యల్. ఎ. కాట్రగడ్డ నారాయణరావు, నాయకులు పేట బాపయ్యలు పోరాటానికి మద్దతునిచ్చుటతో, జమీందార్‌కు సన్నిహిత హిత మిత్రులైన అయ్యదేవర కాళేశ్వరరావు, పట్టాభి శీతారామయ్యలు వ్యతిరేకులుగా వున్నప్పటికి ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘం జమీందారి విచారణ సంఘాన్ని యేర్పాటు చేయక తప్పలేదు. కారణం, ఆ పోరాటం అన్ని వర్గాల, అన్ని రాజకీయ పక్షాల ఐక్య కార్యాచరణగా బలవత్తరమైన ఐక్యసంఘటన పోరాటమగుట, ప్రజాబలాన్ని, ప్రజా సహకారాన్ని పూర్తిగ పొందగలిగిన దగుటయేయని చెప్పకతప్పదు.

---

1. రసూల్, యం. ఎ. (1974) అఖిల భారత కిసాన్‌సభ చరిత్ర (ఆంగ్లంలో). పే 24.
2. రసూల్, యం.ఎ.(1974) అఖిలభారత కిసాన్‌సభ చరిత్ర (ఆంగ్లంలో)పే. 27.

విచారణకమిటి నివేదిక వచ్చిన తరువాత కాంగ్రెసులోవున్న అతివాద యువకుల కృషి ఫలితంగా ఆమోదించబడింది. ఇందులాల్ యాజ్ఞిక్, ఆచార్య రంగాలు మునగాల పరగణా పర్యటించారు. రైతులు, జమీన్, రైతు సంఘాన్ని పునరుద్ధరించు కొన్నారు. డిశెంబరు 1938లో కలువకోన వ్యవసాయ కూలీల సమ్మెపోరాటంతో ప్రారంభమైంది. రాష్ట్ర కాంగ్రెసు రైతులకు జమీందారుకు మధ్య రాజీ కుదిర్చింది. అదే బ్రహ్మయ్య అవార్డుగా పేరు పొందింది. ఇది రైతు సంఘాలకు విజయం. జమీందారు వెట్టి కొనసాగించరాదని, వ్యవసాయ కూలీలకు రైతులకు సరియైన వేతనాలు సకాలంలో యివ్వాలని, సేవలకు సరియైన వేతనాలు యివ్వాలని, గ్రామాలలోని అన్ని బాటలు, దారులు, డొంకలు, గ్రామీణులు రవాణాల కొరకై అందరూ వినియోగించుకొనాలన్న రైతుల కోర్కెలను అంగీకరించక తప్పలేదు.

ఈ పోరాటం ఆంధ్ర రైతాంగాన్ని మొత్తంగా చైతన్యం కావించింది. వామపక్షాలు ప్రజాభిమానంతో బలపడినవి మంతెనవారి పాలెం, కొత్తపట్నం రాజకీయ పాఠశాలలు. రాజకీయ పరిజ్ఞానాన్నియిచ్చి చైతన్యానికి రాజకీయ పునాదిని, బలాన్ని చేకూర్చాయి. మునగాల పోరాటపు ఆచరణానుభవాలతో వామపక్ష పార్టీల నిర్మాణ కార్యకర్తలను తయారు చేసుకొనుట, ప్రజా కార్యక్రమాలను చేబట్టి ప్రజా సంఘాలను విస్తరింపజేయుట, బలమైన ఉద్యమాలను నిర్మించి నాటి నాయకత్వం నిర్మాతలుగా పేరుగాంచారు.

అస్సాంలో 200 గ్రామాల రైతులు, రైతు సమస్యలపై ముఖ్యపోరాటాన్ని జరిపారు కౌలు తగ్గించాలని, పెంచిన కౌలు చెల్లించేదిలేదని, పెట్టిన కేసులు కొట్టివేయాలని కరన్‌సింగ్ యం. యల్. ఎ. నాయకత్వంలో రైతులు సంఘటిత పోరాటం జరిపారు జమీందారుకు కౌలు యిచ్చేదిలేదని పన్నుల నిరాకరణోద్యమం ఆరు మాసాలు, అన్ని నిర్బంధాలు సహించి సాగించారు. అస్సాం అసెంబ్లీలో ప్రతిపాదించుటకై "స్వాట్ కౌలుదారుల సవరణ బిల్లును తయారుచేసారు కాని ప్రభుత్వం దానిని తిరస్కరించింది. డిశెంబరు 12, 1937న గవర్నరు బిల్లును తిరస్కరించిన కారణంగా "అసమ్మతి సమావేశాలు" జరిగాయి.[1] ఈ పోరాటాలలో కౌలును కట్టుటను నిరాకరించుట ఉన్నత పోరాట రూపమనుటలో సందేహంలేదు.

## వ్యవసాయ కూలి సమస్యలు, ప్రాథమిక అవగాహనలు :

కొమిల్లా అఖిల భారత కిసాన్‌సభ అధ్యక్షోపన్యాసంలో స్వామి సహజానంద సరస్వతి" నేటి రోజులలో కొంతమంది వ్యవసాయకూలీల పేరుతో, వారి సమస్యల పేరుతో కిసాన్‌సభపై దండెత్తుతున్నారు. వారి దృష్టిలో రైతులుకూడ యితరులను పీడించేవారే. వారి ఆశయం జమీందారులతో భుజాలు రాసుకొని తిరుగుట, నిజానికి వారు రైతులకు, వ్యవసాయకూలీలకు సామాన్య శత్రువులు. వ్యవసాయ కూలీలు జమీందారులకు సేవలుచేయుట, స్నేహం చేయుట పరస్పర వైరుధ్య విషయాలు"

---

1. రసూల్, యం.ఎ (1974) అఖిలభారత కిసాన్ సభ చరిత్ర(ఆంగ్లంలో)పే. 26

అల అన్నారు. ఈ సందర్భంలో బాబు రాజేంద్రప్రసాద్ సూచనలతో కిసాన్‌సభను బలహీనపరచుటకై కాంగ్రెసు నాయకులు కొందరు వ్యవసాయ కూలీల సంఘం అని చెప్పబడే సంస్థను స్థాపించారు.

అధ్యక్షులు స్వామీజీ తదుపరి కొన్ని సిద్ధాంత సమస్యలను చర్చించారు. "వ్యవసాయ కూలీలు వాస్తవంగా భూములు కోల్పోయిన రైతులు. చిన్న రైతులు కిసాన్‌సభకు వెన్నెముక వంటివారు. నిన్న భూములు గలవారికి నేడు భూములు లేవు. నేడు ఉన్నవారు రేపు భూములు కోల్పోవచ్చు. ఈ విధంగా భూములు కలిగి వున్నపుడు పేద రైతులు, పోయిన తరువాత వ్యవసాయ కూలీలు అంటున్నాము. ఈ పరిణామం అనంతంగా సాగుతున్నది.అందువలన వారిద్దరిని వేరుచేసే అంతరం అంతగా లేదు. వారిద్దరికి మధ్య అడ్డుగీత గీయాలనే వారు యిద్దరికీ మిత్రులుకారు. శతృవులు అగుతారు.

"కిసాన్ సభనుండి వ్యవసాయకూలీలను దూరంచేయాలనే ప్రయత్నాలు నష్టదాయకమైనవి. గ్రామసీమలలో దోపిడికి, దౌర్జన్యానికి లోనగువారిని కిసాన్‌సభ సంఘటిత పరస్తుంది. నేటివరకు వ్యవసాయ కూలీలను, రైతులలో భాగంగానే కిసాన్‌సభ యెంచుతున్నది. వాటి జీవన వేతన మివ్వాలని కోరుచున్నది. గయ, మోన్గీర్, పాట్నా, ధర్భాంగా, ముజఫర్‌పూర్ జిల్లాలలో వ్యవసాయ కూలీలవెట్టి పనికి వ్యతిరేకంగా, తక్కువ వేతనాలకు వ్యతిరేకంగా, భుములకై వారు జరిపే పోరాటాలన్నిటికి పూర్తి మద్దతునిచ్చింది కిసాన్‌సభ సమాజంలో అట్టడుగునవున్న వర్గాలే విప్లవాన్ని సాధిస్తాయని, విప్లవం వారివలనే బలాన్ని చేకూర్చుకుంటుందని కిసాన్ సభ నమ్ముతున్నది."[1] ఈ విధంగా పేదరైతుల వ్యవసాయ కూలీలపోరాటాలలో సాన్నిహిత్యాన్ని విప్లవ రైతుపోరాటాలలో వారి ఐక్యతావసరాన్ని గుర్తించినా, యీ సమస్యను శాశ్వత భూమి అమరికపు ప్రాంతాలు, రైత్వారీ భూ అమరికకపు ప్రాంతాలలోగల భిన్నత్వాలను అధ్యయనం చేయజాలకపోయింది.

## కార్మిక, కర్షక ఐక్యత, రైతు, కూలీ రాజ్యనినాదం :

గయ కిసాన్‌సభ ఏప్రియల్ 1939లో జరిగింది. రాజకీయ తీర్మానం కార్మిక, కర్షక ఐక్యత, రైతు, కూలీ రాజ్యనినాదంపై కొంత అవగాహన యిచ్చింది. రైతు పోరాటాలలో వారికి శక్తివంతమైన మిత్రులు కార్మికవర్గం, వారి సంఘాలలో బలమైన శక్తిగా సంఘటిత పరచబడింది. కార్మికోద్యమంలో ఐక్యత నెలకొల్పబడింది. వారి రాజకీయ చైతన్యం అభివృద్ధి చెందింది. కార్మిక, కర్షక సంఘాల, వుద్యమాల మధ్య మరింత దగ్గరి సంబంధాలు, ఐక్యత నెలకొల్పబడాలని కిసాన్ సభ సూచించుచున్నది. అందుకు కిసాన్ కౌన్సిలు తగిన ప్రయత్నాలు చేయాలంటున్నది. ఆచరణ కార్యక్రమాన్ని అమలు చేయుటయే అందుకు మార్గమున్నది.

1. రసూల్, యం. ఎ (1974) అఖిలభారత కిసాన్ సభ చరిత్ర (ఆంగ్లంలో) పే 54-55.

ఆచరణ కార్యక్రమము : 1) ఫెడరేషన్ వ్యతిరేక అఖిల భారత పోరాటాన్ని ప్రజలకు వివరించుట 2) రైతుల పాక్షిక పోరాటాల వాడిని పెంచి, ఐక్య పోరాటాలుగ సమన్వయపరచాలి. 3) సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యసంఘటనను కాంగ్రెసు, కమ్యూనిస్టు, సోషలిస్టు, తదితర వామపక్ష పార్టీలు, అభ్యుదయ కాములు, ట్రేడు యూనియనులు, కిసాన్ సభలు, యితర సంస్థలతో కలసి, ఐక్యముగా యేర్పాటు చేయాలి. 4) రాష్ట్రీ కాంగ్రెసు ప్రభుత్వాలు ఎన్నికల ప్రణాళికలో వాగ్దానం చేసిన రైతుల కోర్కెలను అమలుచేయాలి. 5) అందరు కలసి ఆర్థిక రాజకీయ కోర్కెలను,మైనారిటీల రక్షణ అమలుకు పోరాడుతు, మత శక్తులను నిర్వీర్యం చేయాలి. 6) బలమైనరైతు స్వచ్ఛంద సేవాదళాన్ని నిర్మించాలి. 7) సంస్థానప్రజల పోరాటాలకు పూర్తి మద్ధతునివ్వాలి. ఈ 7 అంశాల కార్యక్రమాన్ని అమలుచేస్తూ, కార్మిక, కర్షక ఐక్యత, దగ్గరి సంబంధాలను నెలకొల్పాలి.

ప్రపంచయుద్ధ ప్రారంభానికి ముందే 1939లో కిసాన్‌సభ సామ్రాజ్యవాద వ్యతిరేక సంపూర్ణ స్వాతంత్ర్య, వ్యవసాయ విప్లవ పోరాటాలకై రైతుకూలి రాజ్యనికై అనగా జనతా ప్రజాస్వామ్యానికై దారితీసే భారత ప్రజల ప్రజాస్వామ్య ప్రభుత్వానికై, కార్మిక, కర్షక వర్గాలను దోపిడిచేయు విధానంలేని సోషలిజానికి దారితీసే ప్రభుత్వానికై పిలుపునిచ్చిందని రసూల్ వ్యాఖ్యానించారు.[1]

## వ్యవసాయ కూలీల సమస్యలు

గయ కిసాన్ మహాసభ వ్యవసాయ కూలీల సమస్యలను చర్చించి తీర్మానాలు చేసింది గ్రామీణ జనాభాలో గణనీయశాతంగా వున్న వ్యవసాయ కూలీలకు రక్షణ, పని, కనీస జీవనవేతనం, మానవత్వాన్ని గౌరవించే పరిస్థితులను కల్పించనిచో, రైతులలో భాగమైనవారిని బానిస, వెట్టిబంధనాలనుండి విముక్తి చేయనిచో గ్రామీణ జీవనాన్ని పునర్జీవింపజేయు ప్రశ్నలేదని కిసాన్‌సభ అవగాహనను వెల్లడించింది. ప్రతి సంవత్సరమూ పేదరైతులు భూములను కోల్పోతు, కౌలుదారులుగ, కూలీలుగ మారుతున్నారని తెలిపింది. రైతులందరి ప్రయోజనాలకై సామాజిక, రాజకీయ హక్కులను కలుగజేసి ఆర్థిక పరిస్థితిని రక్షించుటతోనే వ్యవసాయకూలీల ప్రయోజనాలున్నవని తెలిపింది. కిసాన్‌సభ తన కార్యకర్తలందరికి యితర కార్యక్రమాలతో పాటు ఈ క్రింది తక్షణ కోర్కెలు సాధించుటకు పిలుపునిచ్చింది.

అవి : 1) అప్పులను పూర్తిగరద్దుచేయుట 2) సాగుకు పనికివచ్చే ప్రభుత్వ భూములను వ్యవసాయకూలి సంఘాల, సహకార సంఘాలకు సాగుకుయిచ్చుట· 3) వేతన నిర్ణయానికి కూలి, రైతుల ప్రతినిధులతో వేతన సంఘాన్ని యేర్పాటు చేయుట. 4) కార్మికుల నష్టపరిహార చట్టాన్ని వ్యవసాయకూలీలకు వర్తింపజేయుట. 5) నివాసగృహాలు, రక్షిత త్రాగునీరు అందజేయుటకు ఒక జాతీయ విధానం. 6) అన్నిరకాల అనధికార వసూళ్ళను, బానిసత్వాన్ని, బలవంతపు వెట్టిని చట్టరీత్యా

1. రసూల్, యం. ఎ.(1974) అఖిలభారత కిసాన్‌సభచరిత్ర (ఆంగ్లంలో)పే. 56.

శిక్షార్హం చేయాలి. 7) పోలీసులు కూలీలపై వుపయోగించే ఐ.పి.సి. సెక్షనులను నేర స్థుల జాతుల చట్టాన్ని రద్దుచేయాలి.[1]

వ్యవసాయకూలి సంఘాలుయేర్పడి పనిచేస్తున్న రాష్ట్రాలలో రాష్ట్ర కిసాన్ కౌన్సిలు వాటితో స్నేహ సంబంధాలను నెలకొల్పి రైతుల, కూలీల మధ్యవచ్చే తగాదాలను సంభాషణలు, రాజీమార్గాలద్వారా పరిష్కరించుటకుతోడ్పడాలి. జమిందారులు భూస్వాములకు వ్యతిరేకంగా ఐక్యసంఘటన మార్గాన పోరాటం, బ్రిటిష్ సామ్రాజ్య వాద వ్యతిరేక పోరాటంతోపాటు జరపాలని స్పష్టంచేసింది

**కాంగ్రెసు రాష్ట్ర ప్రభుత్వాలు, జమీందారీ భూస్వామ్య వ్యతిరేక పోరాటాలు. అనుభవాలు.**

రాష్ట్రంలో కాంగ్రెసు మంత్రివర్గాల పాలనలో వామ పక్షాలు జమిందారీ, భూస్వామ్య వ్యతిరేక రైతు పోరాటాలు జరుపునపుడు, సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్య కార్యాచరణశక్తుల ఐక్యతలో అంతర్గత అభిప్రాయభేదాలు వచ్చుట సహజం. రెండవ ప్రపంచయుద్ధం వచ్చుపరకు అట్టి అనుభవాలను యీ క్రింది విధంగా చెప్పుకొనవచ్చు.

1) కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికలో జమిందారీ వగైరా మధ్యదళారులను రద్దుచేసి, నేరుగా ప్రభుత్వానికి రైతే శిస్తుచెల్లించే విధానాన్ని ప్రవేశపెట్టగలనని వాగ్దానంచేసింది. కిసాన్‌సభ ఆగస్టు 1936 బొంబాయి సమావేశంలో ప్రకటించిన "రైతుల కోర్కెల మానిఫెస్టోను" కాంగ్రెసు తన ఎన్నికల ప్రణాళికకు అనుబంధంగా ప్రకటించింది. ఎన్నికల ఫలితంగా రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రివర్గాలు యేర్పడుట రైతులలో యెంతో ఆశనురేకెత్తించింది. ఫెయిజ్‌పూర్ కాంగ్రెసు మహాసభ వారి కోర్కెలను ఆమోదించుతూ తీర్మానం చేయుట మరింత ప్రోత్సాహాన్ని యిచ్చింది.

రైతులు బీహారులో "బకాష్ట్ సత్యాగ్రహాన్ని, ఆంధ్రలో మునగాల జమిందారు ఆక్రమించిన రైతు భూమిని రైతులు పాతికనాగళ్ళతో ప్రవేశించి దున్నుటతో రైతు సత్యాగ్రహం జరిగింది. ఈ పోరాటం కాంగ్రెసు వాదులు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు, యువరైతు నాయకులు చేశారు. వామపక్షవాదులు బలంగావున్న పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసు మద్దతు ప్రకటించింది. తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెసు పట్టాభి శీతారామయ్య, అయ్యదేవర కాళేశ్వరరావుల ఆధ్వర్యంలోవున్నా బయట పడలేదు. ఫలితంగా ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు జమిందారీ రైతు విచారణ కమిటీని వేయక తప్పలేదు.

2) పంజాబ్‌లో 40 వేలమంది రైతులు భూస్వాములను, కౌలుదారులకు మధ్యదళారులకు వ్యతిరేకంగా పంటలో సగభాగమునకు, వెట్టి నిర్మూలనకు పోరాటం

---

1. రసూల్, యం.ఎ. (1974) అఖిలభారత కిసాన్‌సభ చరిత్ర(ఆంగ్లంలో) పే. 59.

జరిపి విజయం పొందారు. అస్సాంలో కౌలు తగ్గింపు సమస్యపై 200 గ్రామాలలోని రైతులు పన్నుకట్టేదిలేదని పన్నుల నిరాకరణోద్యమాన్ని ఆరుమాసాలుసాగించారు.

రైత్వారీ ప్రాంతాలలో "కౌలు తగ్గింపు సమస్య" ప్రధానరైతుసమస్య రైతు ఉద్యమ ప్రారంభదశలోనే ముందుకు వచ్చినప్పటికి, తదుపరి కాలంలో తగినంత ప్రాధాన్యత ఆచరణలో కన్పించదు.

3) ఈ సమస్యలపై కిసాన్‌సభ పోరాటాలు నడుపుట, కాంగ్రెసు ఆధ్వర్యం లోని రాష్ట్ర ప్రభుత్వాలకు తలనొప్పిగా పరిణమించింది. హరిపుర కాంగ్రెసు మహా సభలో మితవాద కాంగ్రెసు నాయకత్వం కిసాన్‌సభ నాయకులు ఎర్రజండా, కిసాన్ సభ జండాను ఎగురవేస్తుండుటవలన కిసాన్‌సభలపై తీవ్రమైన దాడిని చేశారు. ఒక తీర్మానం చేశారు. "కాంగ్రెసులో వామపక్ష మితవాదుల మధ్య ఘర్షణతీవ్రమైందను టకు యీ ఘర్షణనుండే కాంగ్రెసు - కిసాన్ సభలమధ్య సంబంధమనే సమస్య ఉత్పన్నమైనదని తీర్మానం స్పష్టం చేస్తున్నదని"[1] నంబూద్రిపాద్ వాఖ్యానించారు.

హరిపుర కాంగ్రెసు ఆమోదించిన తీర్మానంలో "....ప్రధానంగా ప్రజలలో కాంగ్రెసు సంబంధాలు పెరగడంతో రైతులు అధికసంఖ్యలో చేరి, దాని విధానాన్ని ప్రభావితం చేయుటతో కాంగ్రెసు పెద్దరైతు సంస్థ అయింది. వాస్తవంగా కాంగ్రెసు రైతుల కోర్కెలసాధనకు వారి ప్రతినిధిగా నిలబడింది. రైతు సభలను నిర్వహించు కొనే రైతుల హక్కులను పూర్తిగ గుర్తిస్తునే కాంగ్రెసు ప్రాథమిక సూత్రాలకు భిన్నమైన కార్యక్రమాలతో కాంగ్రెసువాదులు కిసాన్‌సభ సభ్యులుగావుండి, కాంగ్రెసు సూత్రాలకు, విధానాలకు వ్యతిరేక వాతావరణాన్ని సృష్టించే కార్యకలాపాలకు కాంగ్రెసు మద్దతుయివ్వజాలదు[2]" అని స్పష్టం చేసింది. ఈ తీర్మానం కిసాన్‌సభలు నిర్వహించిన ఆందోళనలు, ప్రదర్శనలు, పోరాటాలు, సత్యాగ్రహాలు భూస్వాములకు బ్రిటిష్ పాలకులకేగాక రాష్ట్ర మంత్రివర్గాలను నిర్వహించే కాంగ్రెసు నాయకత్వా లకు ఇష్టంలేదని స్పష్టంచేస్తుంది. కాంగ్రెసుసంస్థ ఎన్నికల ప్రణాళికలకు, కాంగ్రెసు మంత్రివర్గాల ఆచరణకుగల అఘాతం నాటినుండే ప్రారంభమైనదనికూడ స్పష్టమే. ఒక బూర్జువాపార్టీ మాటలు ప్రజలనుద్దేశించి వారి బలాన్ని పొందుటకైనా వారి ఆచరణలు ఆ పార్టీలో నాయకత్వం వహించేవర్గాల ప్రయోజనాల పరిధికి పరిమితమై వుంటాయనుటకు మరే యితర వివరణ అవసరంలేదు.

4) కిసాన్‌సభ 1936లో యేర్పడిన నాటినుండి వ్యవసాయ కూలీలనుకూడ కిసాన్‌సభలలోనే సమీకరించుచున్నది. జమిందారి, కౌలుదారి సమస్యలనే ప్రధా నంగా ప్రతిబింబించుచున్నది. గయ, మోన్గీర్, పాట్నా, ధర్భంగా ముజఫర్‌పూర్ లలో జరిగిన వ్యవసాయకూలీల పోరాటాలు, వెట్టిచాకిరి వ్యతిరేక పోరాటాలు, పేత

1. నంబూద్రిపాద్, ఇ. యం. యస్. (1988) భారత స్వాతంత్ర్య పోరాట చరిత్ర ద్వి. భా. పే. 160.
2. అదే ఉదహరించినది పే. 160

నాల పెంపుకి పోరాటాలు, భూములకై వారు జరిపే పోరాటాలలో కిసాన్‌సభ నాయ కత్వంవహించి నడిపింది. జమిందారులు, జాగీర్దారులు మినహాయించి వ్యవసాయంలో స్వయంగా పాల్గొనే వారందరిని రైతాంగంగా వొకేవర్గంగా నాటి ఉద్యమదశలో, కిసాన్‌సభ అవగాహన, కాన వ్యవసాయ కూలీలను గ్రామీణ వేతన కార్మికులుగా ప్రత్యేకవర్గంగా నెంచే, తత్సంబంధ అవగాహన, నిర్మాణాభివృద్ధి దిశవైపు తమ ఆలోచనా విధానాన్ని పోనియ్యలేదు. వ్యవసాయ విప్లవం అనే పదాలువాడినా దాని పునాది వర్గాల ఆలోచనరాలేదు. బహుశా శక్తినంతా విదేశీ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంపై కేంద్రీకరించి వుండుటవలన కావచ్చు. అయితే అప్పుడే యీ అవగా హనలోని బలహీనతను బీహరు కాంగ్రెసు బూర్జువావర్గాలు వినియోగించుకొని రైతులు-వ్యవసాయకూలీలమధ్య అఘాతాన్ని సృష్టించుట కనువిప్పు కావలసినది.

ఆచరణలో జమీందారీ, వెట్టిచాకిరి వ్యతిరేక పోరాటాలలో రైతువర్గాన్ని మొత్తంగా కిసాన్‌సభలో సమీకరించే ప్రయత్నం జరిగింది. సామ్రాజ్యవాద వ్యతి రేక, ఫ్యూడలు వ్యతిరేక పోరాటరూపమే ప్రధానమైంది

అంతేగాక, గయ కిసాన్ మహాసభ ఏడు అంశాల వ్యవసాయ కూలీల తక్షణ కోర్కెల తీర్మానాన్ని ఆమోదించి, ఆ కోర్కెల సాధనకై పోరాటానికి పిలుపు నిచ్చింది. రైతు, కూలీల జమీందారీ, ఫ్యూడలు, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటా నికి కావలసిన ఆర్థిక పోరాటాల పునాదిని యేర్పరచి, జాతీయ ఐక్యసంఘటనకు ప్రాతిపదికను యేర్పాటు చేసింది.

5) మరో ముఖ్య విషయం, గయ కిసాన్ మహాసభ కార్మిక, కర్షక, ఐక్యత, రైతు కూలీ రాజ్యనినాదాన్ని యిచ్చింది. కార్మిక, కర్షక, ఐక్యత నెలకొల్పుటకై 7 అంశాల రాజకీయ, ఆర్థిక, ఆచరణ కార్యక్రమాన్ని అమలుచేయుట కోరింది. సిద్ధాంతరీత్యా, ఆచరణరీత్యా కార్మికవర్గం, కర్షకవర్గం ఐక్యతతోనే సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడలు వ్యతిరేక పోరాటాన్ని సాగించగలిగినపుడే విజయాన్ని సాధించ గలరని స్పష్టం చేసింది. సోషలిస్టులు, కమ్యూనిస్టులు, యితర వామపక్ష కాంగ్రెసు వాదులు అదే విధమైన అవగాహనలో వున్నారు.

రైతు, కూలీ రాజ్యనినాదం పెటీ బూర్జువా జాతీయ తత్వవాదులు, నాడు సోష లిస్ట్, కమ్యూనిస్టు, యితర వామపక్షాల, కార్మిక కర్షక ప్రజారాజ్య నినాదానికి ప్రత్యా మ్నాయంగా ధనిక మధ్యతరగతి రైతులలో భ్రమలు కలుగజేయుటకు యిచ్చిన నినాదంగా తలచుటలో తప్పులేదు.

రైతు, కూలీ ప్రజారాజ్య నినాదాన్ని, యుద్ధానంతరం కాంగ్రెసులో తన బలాధిక్యతను పెంచుకొనుటకు ఆచార్యరంగా, కాంగ్రెసునుండి చీలిపోయి ప్రకాశం పంతులు ఆచార్య రంగాలు యిద్దరూ కలసి; తదుపరి 80 దశకంలో చరణసింగ్, చివరకు నేడు రూపభేదంలో దేవీలాల్‌లు రైతాంగంలో ముఖ్యంగా నూతన ధనిక రైతువర్గంలో తమ బలాన్ని కాంగ్రెసుకు వ్యతిరేకంగాను, అదే సమయంలో వామ పక్ష పార్టీల ఆధ్వర్యంలోని కిసాన్ సభలలోని రైతాంగంలో భ్రమలు కల్పించి,

చీల్చి, మధ్యతరగతి, ధనిక రైతాంగాలలో తమ బలాలను పెంపొందించుకొనుటకు చేసే ప్రయత్నాలను చూచినపుడు, వీటికి ఎంతకాలం క్రిందట మూల ప్రాతిపదికను రూపొందించారో తెలిసినపుడు, వామపక్షాలు మూడు దశాబ్దాలు పైగా అనైక్యతకు గురై, కిసాన్‌సభల, వుద్యమాల ఐక్యతకు దూరమై; నేడు వివిధ రాష్ట్రాలలో పెటీ బూర్జువాశక్తుల ప్రభావాలకులోనై తలెత్తుతున్న రైతు ఉద్యమాలను చూచినపుడు, వామపక్షశక్తులు ఐక్యరైతు వుద్యమాలను, ఐక్య ప్రజాపోరాటాలను సాగించుటకై చేయవలసిన బృహత్తరకార్యం అర్థం కాగలదు. ఐక్య రైతు వుద్యమాన్ని నిర్మించ వలసిన ఆవశ్యకతను 20వ శతాబ్దపు చివర దశకంలో చరిత్ర వామపక్ష పార్టీలపైన, ముఖ్యంగా కమ్యూనిస్టు పార్టీలపైన వుంచిన బాధ్యత హిమాలయంలా కన్పడు తున్నది. ఈ కర్తవ్యాన్ని యీ దశకంలో నిర్వహించనిచో చరిత్ర దయచూడదు, క్షమించజాలదు.

**కార్మికుల పోరాటాలు, జాతీయ సంఘటనా సమస్యలు :**

భారత్ ఆర్థిక మాంద్యము, దుస్థితి 1930లో ప్రారంభమై, 1934 నుండి మెరుగుపడుతు, 1937 నాటికి కోలుకొంది. వాణిజ్యం, పరిశ్రమలు తిరిగి ప్రారంభం కాగా వస్తువులకు, సేవలకు గిరాకి పెరిగింది. కార్మికులు కాంగ్రెసు మంత్రివర్గాలు వచ్చినందున తమ కోర్కెలను పరిశీలించవలసిందని అడిగే స్థితికి వచ్చారు. బొంబాయి కాంగ్రెసు మంత్రివర్గం కార్మిక విధానాన్ని గురించి యిలా ప్రకటించింది.

"ప్రభుత్వం శాంతికై కృషి చేస్తుంది, కార్మికులకు న్యాయంకై ప్రయత్నిస్తుంది. సమ్మెలు, లాకౌటులు నిరోధించే శాసనం చేస్తుంది. వేతనాలలో తగ్గింపు వుండరాదని, మధ్యవర్తిత్వం లేకుండా వివాదగ్రస్త విషయాలు అమలుజరుపరాదని, ప్రభుత్వ వుద్దేశ్యం....కార్మిక సంఘాలు పెంపొందుటకు అడ్డువచ్చే పరిస్థితులను తొలగించి, యాజమాన్యాలు ఉద్యోగుల మధ్య సత్సంబంధాలు పెంపొందిస్తుంది.[1]"

కాన్పూరు బట్టల మిల్లుల కార్మికులు, బ్రిటిష్ యాజమాన్యానికి వ్యతిరేకంగా హెచ్చుకూలికి, యూనియన్ గుర్తింపుకు, జూన్ 1937లో చారిత్రాత్మకమైన సమ్మె చేసారు. కమ్యునిస్టు, సోషలిస్టు, కాంగ్రెసు వామపక్షవాదులు సమ్మె అగ్రభాగాన నిలబడి పనిచేసారు. స్థానిక కాంగ్రెసు కమిటి చురుకైన పాత్ర వహించింది. కాంగ్రెసు, కార్మికులు వొక నమూనా ఐక్యతను సాధించారు. సంయుక్త రాష్ట్ర కాంగ్రెసు కమిటి తన తీర్మానంలో కాన్పూరు కార్మికులు తమకొరకై పోరాడుటలేదు. మొత్తం భారత-కార్మికవర్గంకై పోరాడుతున్నారు. మానవహక్కులకై పోరాడుతున్నారు. ఈ మహాపోరాటంలో సమ్మె కార్మికులకు అన్ని విధాలైన సహాయాన్ని అందించమని ప్రజలకు పిలుపిచ్చింది. యాజమాన్యం తన యేజంట్లద్వారా హిందూ-ముస్లిం మత కలహాలకు రెచ్చగొట్ట ప్రయత్నించింది. హిందూ ముస్లిం కార్మికులు అవిచ్ఛిన్న ఐక్యతతో నిలబడి పేర్కొనదగిన విజయాన్ని సాధించారు. వారి యూనియన్

1. కార్నిక్, వి. బి. (1990) భారతదేశంలో సమ్మెలు, తెలుగు అకాడమి. పే. 175-76.

"గుర్తింపుకూడ పొందగలిగారు"[1] అని సమ్మెపై పామీదత్తు వ్యాఖ్యానించారు దేశ వ్యాప్తంగా సమ్మె పోరాటాల వెల్లువను, కొనివచ్చిన యీ సమ్మెను "కాన్పూరు సమ్మె దేశవ్యాప్తంగా కార్మికులకు 'ఒక నమూనా' అయింది. కమ్యూనిస్టులు, సోష లిస్టులు, సాధారణ కాంగ్రెసువాదులు కార్మికులకు చేదోడువాదోడుగా వుంటే దేశ వ్యాప్తంగానున్న సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తులు యెలాంటి ఫలితాలను సాధిస్తాయో తెలిపే చైతన్యాన్ని పెంపొందించటానికి అది దోహదపడిందని[2]" ఆ సమ్మెయొక్క ప్రభావంపై వ్యాఖ్యానించారు నంబూద్రిపాద్.

విదేశీయుల ఆధ్వర్యంలోని అస్సాం ఆయిల్ కంపెనీలో కార్మికులు సమ్మె చేశారు. అస్సాంలో కాంగ్రెసు, యితరులు కలసిన మిశ్రమ మంత్రిమండలి పాలన వుంది. ఎనిమిది మాసాలు జరిగిన యీ సమ్మె కార్మికుల ఐక్యతకు చిహ్నంగా నిల చింది. కాంగ్రెసు ప్రభావంలో కార్మికులకు సహాయపడదలచి విచారణకోర్టును, కన్సి లియేషన్ బోర్డును నియమించింది. ఆయిల్ కంపెనీ ఎటువంటి రాజీకి సిద్ధపడలేదు. జాతీయ కాంగ్రెసు కంపెనీ కన్సలియేషన్ బోర్డు సూచనలకు ఆమోదించకపోతే లీజు రద్దుచేయవలసి వుంటుందని హెచ్చరించింది. హెచ్చరిక అమలులోనికి రాకముందే రెండవ ప్రపంచయుద్ధం వచ్చుటతో కంపెనే అధికారాలన్నిటిని వైస్రాయి స్వీకరిం చారు. రాబోయే విజయాన్ని కార్మికులు పొందజాలకపోయారు. ఆయిల్ కంపెనీలు సామ్రాజ్యవాదపు పట్టుగొమ్మలు. ఈ విషయంలో కాంగ్రెసు అత్యంత కార్మిక సహ కార విధానాన్ని అవలంభించింది. ఇది సామ్రాజ్యవాద వ్యతిరేకత లేక వారి కంపె నీల వ్యాపార వ్యతిరేకతతో కాని దేనిని ప్రధానంగా తెలియజేస్తుందో చెప్పజాలము.

కలకత్తా జౌళిమిల్లు కార్మికులు, కాన్పూరు కార్మికులు ఫిబ్రవరి 1937లో వారి చిరకాలపు కోర్కెలకై సమ్మెచేశారు. వారి వేతనాలు, భత్యాలు తగ్గించారు. రేషనైలే జేషన్‌తో పనిభారం పెరిగింది, నిరుద్యోగం ఎక్కువైంది. జూట్ మిల్లులలో విడి విడిగా 1937లో సమ్మెలు జరిగి, 2 లక్షలమంది పాల్గొన్న సార్వత్రిక సమ్మెగా మారింది. పరిశ్రమనంతటినీ ప్రభావితం చేసింది. రాష్ట్రప్రభుత్వం ముస్లింలీగు అధి కారంలోవుంది. కాంగ్రెసుపార్టీ సమ్మెను బలపరచింది అలహాబాద్‌లో 1937 ఏప్రి యల్ కాంగ్రెసు కార్యవర్గ సమావేశం తీర్మానంలో కార్మికుల వీరోచిత పోరాటాన్ని అభినందించింది. యూనియన్‌ను స్థాపించుకొనే హక్కును గుర్తించాలంది. న్యాయ మైన వారికోర్కెలను తీర్చాలని, యజమాన్యపు చర్యలను గర్హించింది. కార్మికనాయ కుల అరెస్టులకు, పోలీసు సైన్యపు హింసాచర్యలకు నిరసన తెలియజేసింది. చివరకు సమ్మె విఫలమైంది. ముస్లింలీగు ప్రభుత్వపు కార్మిక వ్యతిరేక చర్యలు వెల్లడైనాయి.

బొంబాయి కాంగ్రెసు మంత్రివర్గం 1938లో "పారిశ్రామిక వివాదాలచట్టం" చేసింది. దీని మూలపురుషుడు గుల్జరీలాల్‌నందా. అహమ్మదాబాద్ వస్త్రపరిశ్రమ కార్మిక

---

1. పామీదత్తు. రజనీ. (1949) ఇండియాటుడే. (ఆంగ్లంలో) పే. 396.
2. నంబూద్రిపాద్, ఇ. యం. యస్. (1988) భారత స్వాతంత్ర్య పోరాటచరిత్ర (తెలుగులో) ద్వితీయ భాగము పే. 140.

సంఘం గాంధీ సిద్ధాంతాలపై నడుపబడుతున్నది. శ్రీ నందా దానిప్రధాన కార్యదర్శి. సంప్రదింపులు, మధ్యవర్తిత్వం, ముందుతెలుపుట లేకుండా యజమానులు, కార్మికులు ఉన్న పరిస్థితులలో ఎట్టిమార్పులు చేయరాదని చట్టం పేర్కొన్నది. అవార్డు ఉభయ పార్టీలు తప్పనిసరిగా పాటించాలని చట్టం నిర్దేశించుచున్నది. ఈ చట్టాన్ని యితర రాష్ట్రాలు అనుకరించాయి. పారిశ్రామిక వివాదాలను పరిష్కరించుటకు చట్టం రూపొందించిన యంత్రాంగం ప్రాతిపదిక అయింది. కాంగ్రెసు మంత్రివర్గాలు కార్మిక సమస్యలను విచారించి సిఫారసులు చేయుటకు పారిశ్రామిక వివాదాల విచారణ సంఘాలను యేర్పరచాయి[1]. ఈ సంఘాలకు తుదినివేదికలు వచ్చునప్పటికి కాంగ్రెసు ప్రభుత్వాలు రాజీనామాచేశాయి.

బొంబాయిలో కార్మికులు చట్టాన్ని 'బ్లాక్‌బిల్లు' అని వ్యతిరేకంగా ఒకరోజు సార్వజనీన సమ్మెగావించారు. ఈ చట్టాన్ని కార్మిక సంఘాలన్నీ ముఖ్యంగా కమ్యూనిస్టులు తీవ్రంగా వ్యతిరేకించారు. సమ్మెలలో చాలమంది కార్మికులు పాల్గొన్నారు.

మద్రాసు రాష్ట్రంలోని మధురైలో 1938లో యజమానులు మూడు మాసాలు లా కౌటు ప్రకటించారు. మద్రాసు కాంగ్రెసు ప్రభుత్వం మిల్లుయజమానులకు వ్యతిరేకంగా 144 సెక్షను అమలు పరచింది. కార్మికులనందరిని చేర్చుకొంటేతప్ప మిల్లు తెరచుటకు వీలులేదనుటతో యజమానుల లేబర్ కమీషనర్ మధ్యవర్తిత్వానికి అంగీకరించి, వేతనాల పెరుగుదలకు, వేతనంతో 13 రోజులు శలవులకు, ఇళ్ళకు వడ్డీలేకుండా రుణాలు, రిజిష్టరైన యూనియన్‌లకు బేషరతుగా గుర్తించుటకు అంగీకరించారు,

జంషెడ్‌పూర్ పరిసరప్రాంతాల ప్యాక్టరీలు, గనులలో 1938లో అనేక సమ్మెలు జరిగాయి. ఇండియన్ కేబుల్ కంపెని, తాతాగనులు, బర్డ్ అండ్ కంపెని, ఇండియన్ కాపర్ కార్పొరేషన్‌లలో సమ్మెలు రాష్ట్ర కాంగ్రెసు నాయకుడు ప్రొఫెసర్ అబ్దుల్‌బారి నాయకత్వాన జరిగాయి. ఏప్రియల్ 1938లో గోల్‌మురిటిన్‌ప్లేట్ కంపెనీలో కొద్దిరోజులు సమ్మె జయప్రదంగా నిర్వహించారు. కార్మికుల కోర్కెలకు మైకేల్‌జాన్, జె.యన్. మిత్రాలు ప్రొ. బారికి అండగా నిలచారు. వీరందరికి కాంగ్రెసు పార్టీతో దగ్గరి సంబంధాలున్నాయి.

తాతా ఇనుము ఉక్కు కర్మాగారంలో షీటు మిల్లులో షిప్టులు తగ్గుటతో కార్మికుల భత్యాలుతగ్గిపోయాయి. ప్రొ. బారి అధ్యక్షుడుగా, మైకేల్‌జాన్ సహాయకుడుగా తాతా కార్మిక సంఘాన్ని జంషెడ్‌పూర్‌లో స్థాపించారు. సంఘం బలపడింది. ఆందోళన కారణంగా బోనస్ విషయాన్ని మధ్యవర్తిత్వానికి నివేదించాలని కంపెనీ అంగీకరించింది. మధ్యవర్తులుగ సుబాస్‌చంద్రబోస్, ఆర్దేషీర్ దయాల్, అబ్దుల్‌బారిలను మధ్యవర్తులుగ నియమించారు. మిగిలిన సమస్యలపై బాబురాజేంద్రప్రసాద్ అధ్యక్షతన యేర్పడిన సంఘం సిఫార్సులు చేయువరకు ఆగాలన్నారు.

---

1. కార్నిక్, వి.బి.(1990) భారతదేశంలో సమ్మెలు, తెలుగు అకాడమీ. .పే 181

అనేక సమస్యలు పరిష్కారం కానందున కంపెనీ యాజమాన్యానికి, కార్మిక సంఘానికి సంబంధాలు మెరుగుపడలేదు అంతలో ముగ్గురు కార్మికులను తొలగించారు. కార్మికులు 1939లోని తాతా శతజయంతి ఉత్సవాలలో పాల్గొనలేదు. బాబు రాజేంద్రప్రసాద్, జవహర్‌లాల్ నెహ్రూల మధ్యవర్తిత్వానికి అప్పజెప్పారు. కంపెనీ యాజమాన్యం వివాదస్పదమైన అంశాలన్నిటిని మధ్యవర్తిత్వ సంఘానికి నివేదించాలని సూచించింది. కార్మికులు తమ కార్యకలాపాలను అణచుటకై యాజమాన్యం రౌడీలనుపయోగించారని కంపెనీ ఆరోపణగావించారు తగాదా అపరిష్కృతంగానే వుండగా కాంగ్రెసు మంత్రివర్గం రాజీనామాయిచ్చి దిగిపోయింద.

భారతదేశంలో 1937, 1938 లలో రాష్ట్రాలలో కాంగ్రెసు పాలన కాలంలో సమ్మెలు గణనీయంగానే జరిగాయి. కార్మికులు 1937 లో 379 సమ్మెలలో 6.48 లక్షల కార్మికులు పాల్గొనగా 89.82 లక్షల పనిదినాలు నష్టపోయాయి, 1938 లో 399 సమ్మెలలో 4.01 లక్షల కార్మికులు పాల్గొనగా 91 99 లక్షల పనిదినాలు నష్టమైనాయి విశ్లేషణలో 1938లో సమ్మెలలో పాల్గొన్న కార్మికులు మూడవవంతు తగ్గినా నష్టపోయిన పనిదినాలు పెరుగుటను బట్టి వాటి దీర్ఘకాలనైజాన్ని తెలుసుకొనగలము.

మితవాద కార్మిక నాయకులు బి. శివరావు నాటి సమ్మెల వ్యాఖ్య గమనించతగియున్నది. "లోగడ కార్మికులు అలవాటుపడిన జీవన ప్రమాణాన్నికూడ ఆర్థిక మాంద్యకాలంలో కోల్పోవుటతో బాధలుపడ్డారని గ్రహించలేకపోయారు. ప్రస్తుతం జరుగుతున్న సమ్మెలు రాష్ట్ర ప్రభుత్వాల ఉదాశీన విధానానికి వ్యతిరేకంగా సాగాయని విస్మరించరాదు. సంస్కరణలు త్వరగా జరగాలని కాంగ్రెసు వారిచ్చిన హామీలు కొత్త రాష్ట్ర ప్రభుత్వాలు అమలు జరపాలని కార్మికులు కోరుకొంటున్నారు. పాత పరిపాలనా వ్యవస్థ పారిశ్రామిక అసంతృప్తిని తొలగించలేకపోయిందని" కార్నిక్ శివరావు వ్యాఖ్యను వుదహరించారు.[1]

రాష్ట్ర కాంగ్రెసు ప్రభుత్వాలు, కాంగ్రెసు సంస్థ కార్మికులు, వారి కోర్కెలు, సమ్మెల యెడల తీసుకొన్న వైఖరుల విశ్లేషణ కొన్ని తాత్కాలిక అవగాహనలకు ప్రాతిపదిక అవుతుంది.

1) సమీక్షించిన ఆరు పారిశ్రామిక వివాదాలలో అస్సాం ఆయిలు, కలకత్తా జనపనార పరిశ్రమలు బ్రిటిష్ పెట్టుబడి యాజమాన్యంలో, కాన్పూర్ మద్రాసు గుడ్డల మిల్లుల పరిశ్రమలలో అత్యధికభాగపు పెట్టుబడి బ్రిటిష్‌వారి ఆధ్వర్యంలోను, బొంబాయి గుడ్డల మిల్లుల పెట్టుబడిలో అత్యధికభాగం, జంషెడ్‌పూర్ ఇనుము, ఉక్కు పరిశ్రమలో అత్యధిక భాగం దేశీయ పెట్టుబడి క్రిందవున్నది. కలకత్తా పారిశ్రామిక వివాదప్రాంతం ముస్లింలీగు రాష్ట్ర పరిపాలనలో వుంది లీగు బ్రిటిష్ వారితో మిత్రత్వంతో వుండి, తన ఆర్థిక, రాజకీయావకాశాలను పెంపొందించుకొనా

1. కార్నిక్, వి. బి. (1990) భారతదేశంలో సమ్మెలు, తెలుగు అకాడమి. పే.177.

లను కొంటున్నది. మరువజాలని మరో ముఖ్య విషయం, భారత బూర్జువావర్గం ఒకే ఒక రాజకీయసంస్థగా కాక రెండు రాజకీయ పార్టీలు జాతీయ కాంగ్రెసు, ముస్లిం లీగుల నాయకత్వాలలో రెండుగా చీలిపోయివుంది. కాంగ్రెసులో గూడ మితవాద, జాతీయవాద, సోషలిస్ట్ వామపక్షవాద ధోరణులున్నాయి.

బొంబాయి, మద్రాసు రాష్ట్ర కాంగ్రెసు ప్రభుత్వాలు కార్మికుల ప్రచారం, వూరేగింపులు, ప్రదర్శనలు, సమ్మెలు యెడల తీసుకొన్న వైఖరి, కాన్పూరు, జంషెడ్‌పూర్ సమ్మెల యెడల కాంగ్రెసు నాయకత్వం తీసుకొన్న వైఖరికి తేడా-లేక-భిన్నంగా వున్నట్లు కన్పడుతున్నది, బొంబాయి కాంగ్రెసు రాష్ట్ర ప్రభుత్వం, ముఖ్యమంత్రి బి. జి. కేర్, కార్మికమంత్రి గుల్జారీలాల్‌నందా ఆధ్వర్యంలో "బ్లాక్ బిల్లు"గా పేరొందిన "1938 బొంబాయి పారిశ్రామిక వివాదాల చట్టాన్ని" చేసి, సమ్మె చట్టవిరుద్ధమని ప్రకటించి, లాఠీఛార్జీలు, అరెస్టులుచేసి, తీవ్ర దమన, దౌర్జన్య కాండతో, తమ యేజంట్లను పంపి కార్మికులలో తగాదాలు సృష్టించి, పోలీసులు కలుగజేసుకొని అన్ని విధాల కార్మికులను అణచప్రయత్నించారు. మద్రాసులో రాజగోపాలాచారి ఆధ్వర్యంలోని ప్రభుత్వం యిదే విధంగా దౌర్జన్యాలకు, కార్మిక వ్యతిరేక చర్యలకు వొడిగట్టింది "మద్రాసులో రాజగోపాలాచారి, బొంబాయిలో మున్షీ (హోంశాఖ మంత్రి.) నిర్బంకాండ బ్రిటిష్ పాలకులకు ఎంతో తృప్తిని కలిగించింది. రాష్ట్రస్థాయిలో పాలనా బాధ్యతలు కాంగ్రెసు మంత్రుల కివ్వడంతో శాంతి భద్రతలను చాల సంతృప్తికరంగా కాపాడటానికి సిద్ధపడ్డారు. కనుక కేంద్రస్థాయిలో పాలనా బాధ్యతలు అప్పజెప్పినప్పటికి వారి సామ్రాజ్యవాద ప్రయోజనాలకు నష్టం వాటిల్లదని బ్రిటిష్ పాలకులు గుర్తించడం ప్రారంభించారు[1]" అని నంబూద్రిపాద్ వ్యాఖ్యానించుట ఎంతో హేతుబద్ధంగాను, వాస్తవంగాను వుంది. అంతేగాక యీ పరిశ్రమలలో దేశీయ పెట్టుబడులు గణనీయంగా వుండుటకూడ కొంత కారణమై ఉండవచ్చునుకొనుటకు ఆస్కారం లేకపోలేదు.

2) జాతీయ కాంగ్రెసు, కార్మిక సమస్యల అవగాహన, ఆచరణ విధానాలు, పోరాటమార్గాల యెడల కూడ వామపక్షవాద కాంగ్రెసు, కమ్యూనిస్టులు, సోషలిస్ట్‌లతో ప్రాథమికంగానే భేదించుచున్నది. అహమ్మదాబాద్‌లో మహాత్మాగాంధీ ఆధ్వర్యములో మిల్లు యజమానుల పూర్తి సహకారంతో వొక ప్రత్యేక తరహా భారతట్రేడు యూనియన్ కాంగ్రెసు విధానాలకు భిన్నంగా వర్గ సామరస్య ప్రాతిపదికగా అహమ్మదాబాద్ లేబర్ అసోసియేషన్ పని చేస్తున్నది. అహింసామార్గంలో, శాంతియుత పోరాటాలకు, యజమానులు‌ కార్మికులు సంప్రదింపులద్వారా కార్మిక తగాదాలను పరిష్కరించుకొనుట, మధ్యవర్తి నిర్ణయాలను యాజమాన్యం, కార్మికులు తప్పనిసరిగా అంగీకరించాలనే గాంధేయ సిద్ధాంతాల అవగాహనను కాంగ్రెసు నాయకత్వం అమలుచేయ ప్రయత్నించింది.

1. నంబూద్రిపాద్, ఇ. యం. యస్. (1988) భారత స్వాతంత్ర్య పోరాట చరిత్ర (తెలుగులో) ప్రజాశక్తి ప్రచురణ. పే. 178-79.

ఇదే విధంగా 1938లో తాతా ఇనుము-ఉక్కు కంపెనీకి, కార్మికులకు మధ్య వచ్చిన కార్మిక వివాదంలో వేతనాల కోత, బోనసు ప్రధాన సమస్యలైనాయి. వివాదాన్ని మధ్యవర్తి సంఘానికి నివేదించుటకు అంగీకరించారు మధ్యవర్తులుగ సుభాస్ చంద్రబోస్, ఆర్దేషర్ దయాల్, అబ్దుల్ బారీలను నియమించారు. కంపెనీ కొంతమంది కార్మికులను తొలగించగా తాతా శతజయంతి ఉత్సవాలను గార్మికులు బహిష్కరించారు. వివాదాన్ని నెహ్రూ, రాజేంద్రప్రసాద్‌ల మధ్యవర్తిత్వానికి అప్పజెప్పారు. వీరి నివేదిక, సిఫార్సులు రాకముందే మంత్రివర్గాలు రాజీనామా చేసాయి. ఇక్కడ సమస్య మధ్యవర్తి సంఘాలు కార్మికులకు యెంతవరకు న్యాయం కలుగచేయగలుగుతాయి, యాజమాన్యం వాటిని యెంతవరకు అమలుచేస్తాయి అనే ప్రశ్నలు అలాగే వుండిపోయాయి. సమ్మెల విజయానంతరం జరిగిన వొప్పందాలనే యాజమాన్యం అమలును నిరాకరించుటతో తిరిగి సమ్మెలు చేయవలసిన పరిస్థితులను సృష్టించుట కార్మిక సంఘాల అనుభవంలోనిదే. యాజమాన్యపు హృదయ పరివర్తన మానవతాదృక్పథంతో స్పందించదు, ఆర్థిక దృక్పథంతోనే స్పందించుతుందనే విషయం ప్రపంచ కార్మికోద్యమ అనుభవం

కార్మికరంగంలో గాంధేయ సిద్ధాంతం వర్గ సామరస్యం, సంప్రదింపులు, మధ్యవర్తి సంఘాలు నిర్ణయాలకు కార్మికులు, పారిశ్రామికయజమాన్యం తప్పనిసరిగా కట్టుబడి వుండాలనే శాంతి మార్గాలను కార్మికోద్యమంలో ప్రవేశపెట్టారు. కమ్యూనిస్టుల, సోషలిస్టుల, ఇతర అతివాద కాంగ్రెసువారి ప్రాబల్యాన్ని వారి పెరుగుదలను కార్మికవర్గంలో తగ్గించుటకు ఈ విధానాన్ని కాంగ్రెసు మంత్రివర్గాలు, కాంగ్రెసు సంస్థ అనుసరించాయి. ఇవి శుద్ధ సంస్కరణవాదం, కార్మికులలో భ్రమలు కల్పించుటతప్ప మరొకటి కాజాలదు.

3) చారిత్రాత్మకమైన కాన్పూర్ బట్టలమిల్లుల కార్మికుల సమ్మెను కమ్యూనిస్టులు, సోషలిస్టులు, వామపక్ష కాంగ్రేసు వాదులు నాయకత్వం వహించి నడిపారు. అధికార పార్టీయైన కాంగ్రెసు స్థానికశాఖ చురుకైన పాత్ర వహించి కార్మికవర్గం వైపు నిలబడింది. అందుకే పామీదత్తు "కాంగ్రెసు, కార్మికుల ఒక నమూనా ఐక్యతను సాధించారు.... సంయుక్త రాష్ట్ర కాంగ్రెసు కమిటి సమ్మెను బలపరుస్తూ తీర్మానించింది" అని వాఖ్యానించగా "దేశవ్యాప్తంగా కార్మికులకు 'ఒక నమూనా' పోరాటం" అయిందని నంబూద్రిపాద్ పేర్కొన్నారు. కార్మికరంగంలో ఏడవ కొమింటర్న్ మహాసభ అవగాహనలో పనిచేస్తున్న కమ్యూనిస్టులకు ఆచరణయోగ్యమైన 'ఒక నమూనా' ప్రజా ఐక్యకార్యాచరణ పోరాటంగా లేక ఐక్య సంఘటనా పోరాటంగా అయిందనుటలో సందేహంలేదు. వామపక్షాలైన కమ్యూనిస్టులు, సోషలిస్టులు, రాడికల్ డెమోక్రాట్సు, తదితర అతివాద కాంగ్రెసు వాదులు కలసిన ఐక్యతాపునాది గల మధ్యతరగతి, బూర్జువా సెక్షనులు కొన్ని సహకారాన్నిచ్చే ఆచరణ ఐక్యతగల ఒక సంఘటన నమూనాగా రూపొంది, నూతన సంఘటనోత్సాహాన్ని కలుగజేసింది.

## కొన్ని రాజకీయ సమస్యలు ఐక్య కార్యాచరణ

కాంగ్రెసు ఎన్నికల ప్రచారంలో రాజకీయ ఖైదీలందరిని విడుదలకై ప్రయత్నిస్తామని, కొత్త రాజ్యాంగ చట్టాన్ని వ్యతిరేకంగా పోరాడుతామని ప్రకటించి ఏడు రాష్ట్రాలలో తానుగాని, యితరులతో కలసిగాని మంత్రివర్గాలు యేర్పాటుచేసి పాలనమొదలిడింది. రాజకీయ ఖైదీలలో లాహోర్, కాకోరి, కాన్పూరు, చిటగాంగ్ కేసులలోనివారు, కమ్యూనిస్టులు మరెందరో వున్నారు. కాంగ్రెసు ప్రెసిడెంటు జవహర్‌లాల్‌నెహ్రూ రాజకీయ ఖైదీలనందరిని విడుదల చేయవలసిందిగా రాష్ట్రమంత్రి వర్గాలలోని కాంగ్రెసు నాయకత్వాలకు ఆదేశాలు పంపారు.

1. అధికారాన్ని స్వీకరించినవెంటనే యు.పి. ముఖ్యమంత్రి గోవింద్ వల్లభ పంత్ రాజకీయ ఖైదీల విడుదలకై ఉత్తరవులు జారీచేశారు. బొంబాయి హోంశాఖ మంత్రి కె. యం. మున్షి, బ్రిటిష్ రాజు యెడల విధేయతతో నెహ్రూ ఆదేశాలను విస్మరించి కమ్యూనిస్టు యితర వామపక్ష నాయకులను పట్టుకొనుటకు తమ సి ఐ డీ.ల సహకారం అందజేయవలసిందిగా బెంగాలు వైస్రాయిని అర్థించారు. ఈ విషయంలో మున్షిని నెహ్రూ "నీవు పోలీసు ఆఫీసరువే అయ్యావు" అని మందలించారు. మద్రాసు గవర్నర్ లార్డ్ ఎర్స్కిన్ రాజగోపాలాచారి గురించి వ్రాసిన లేఖలో "అతడు (రాజగోపాలాచారి) నాకంటే కరుడు గట్టిన 'టోరీ'.... అతడు 2వేల సంవత్సరాలు వెనక్కు పోవాలని కోరుకొంటాడు"[1] అని వ్రాశాడు. యు.పి. ముఖ్యమంత్రివలెనె బీహారు ముఖ్యమంత్రి రాజకీయ ఖైదీలను విడుదలచేయు ప్రయత్నాలను గవర్నరు తిరస్కరించారు మంత్రివర్గాల పని విధానంలో గవర్నరులు జోక్యం చేసుకొనుటతో గోవింద్ వల్లభపంత్, శ్రీకృష్ణసిన్హాలు రాజీనామాలు సమర్పించుటతో రాజకీయ సంక్షోభపు ఛాయలు ఏర్పడినవి.

అంతేగాక హరిపుర కాంగ్రెసు మహాసభ 1938 ఫిబ్రవరిలో ఆమోదించిన తీర్మానంలో కాకోరికేసు ఖైదీలకు స్వాగత వచనాలకు గవర్నరు అభ్యంతరం తెలుపగా, కాంగ్రెసు వాటిని బాహాటంగా తొందరపాటని వొప్పుకొనుటతో రాజీనామా చేసిన ముఖ్యమంత్రులు అధికారంలో కొనసాగారు

రాజకీయ ఖైదీల విడుదల, నిర్బంధాల నిలుపుదల సమస్యలపై కాంగ్రెసు మంత్రివర్గాలతో వామపక్ష వుద్యమం ఘర్షణపడకతప్పలేదు. బొంబాయి మద్రాసు రాష్ట్రాలలో రాజకీయ ఖైదీలపై నిర్బంధ చర్యలు పునఃప్రారంభమయ్యాయి. వామపక్ష పత్రికలను, ముద్రణాలయాలను, అణచే ప్రయత్నాలు యెక్కువయ్యాయి. రాజకీయ ఖైదీలను విడుదలచేయకపోగా అరెస్టులు, జైళ్ళలో హింసలు యెక్కువైనవి. ఈ చర్యలకు వ్యతిరేకంగా వామపక్ష పార్టీల చురుకైన కార్యకర్తలేగాక, నెహ్రూ, బోస్‌లతోసహా, కాంగ్రెసు కమిటీలు ఖండించాయి. కాని ఎలాంటి ప్రయోజనం లేకపోయింది. ఈ నిర్బంధకాండ ఎదుర్కొంటూనే కార్మిక, కర్షక. విద్యార్థి

---

1. నంబూద్రిపాద్, ఇ.యం.యస్. (1988) భారతస్వాతంత్ర్య పోరాటచరిత్ర. ద్వితీయ భాగం పేజి. 178లో వుదహరించినది.

ఆందోళనలు, పోరాటాలు పురోగమించాయి. ఈ పోరాటాలకు వొక సంఘటిత స్వరూపమిచ్చి సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనకు బలం చేకూర్చుటకు కమ్యూనిస్టులు, సోషలిస్టులు నిరంతరం కృషిచేస్తూ వచ్చారు. కొన్ని కాంగ్రెసు కమిటీలూ పాల్గొన్నాయి.[1] ఒక సమగ్రమైన ఐక్యకార్యాచరణ, ఐక్య సంఘటనా అవగాహన లేనందున, వామపక్షాలు రాజకీయ ఖైదీల విడుదలకై కాంగ్రెసు, కమ్యూనిస్టు, సోషలిస్టు, అతివాద కాంగ్రెసు వాదులతో కలసి ఐక్యకార్యాచరణ మహోద్యమాన్ని నిర్మించి, జాతీయ ఐక్యసంఘటనా మార్గాన్ని సుగమంచేసే అవకాశాన్ని జారవిడుచుకొన్నారు.

2) సంస్థానాలలో బాధ్యతాయుత ప్రభుత్వంకొరకు సంస్థాన ప్రజోద్యమాలు జరిపే పోరాట సమస్యలపై కాంగ్రెసు మితవాద నాయకత్వం, వామపక్ష పార్టీలు అతివాద కాంగ్రెసు నాయకత్వంతో కలసి రాజకీయ సంఘర్షణ పడకతప్పలేదు, సంస్థానాలలో ప్రజామండలులు పోరాట సంస్థలుగా అవతరించాయి. అఖిలభారతసంస్థ కూడ 1936లో ఏర్పడింది. ఈ సంస్థ ఆచరణాత్మక మద్దతు అందజేయమని కాంగ్రెసును కోరింది. మితవాద కాంగ్రెసు నాయకత్వం సంస్థాన ప్రజోద్యమాలకు పూర్తి మద్దతు యిచ్చుటవలన సంస్థాన పాలకులను వ్యతిరేకం చేసుకొనుట అవుతుందని అంచేత సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ ఐక్య సంఘటన బలహీనపడుతుందని తలస్తున్నారు. కాంగ్రెసు అగ్రనాయకత్వంలో యీ విషయంలో అభిప్రాయ భేదాలున్నాయి. నెహ్రూ, బోస్‌లేగాక సంస్థాన ప్రజోద్యమాలతో సంబంధమున్న కాంగ్రెసు నాయకత్వాలు, మితవాద కాంగ్రెసు అగ్రనాయకత్వంతో భేదించారు.

కాంగ్రెసు ప్రజలనుసమీకరించి ఆ బలంతో సంస్థానాధీశులతో బేరాలాడే మితవాద నాయకత్వం అనుసరించింది. వామపక్షాలు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు, అతివాద కాంగ్రెసు వాదులు సంస్థానాధీశుల నిరంకుశపాలనకు వ్యతిరేకంగా పోరాట పంథా చేపట్టారు. తిరువాన్కూర్, కాశ్మీర్ సంస్థానాలలో వామపక్షాలు అతివాద కాంగ్రెసువాదులు జరిపిన పోరాటాలు ప్రసిద్ధికెక్కాయి. రాజకోట సంస్థానంలో కాంగ్రెసు మితవాద నాయకత్వం క్రింద జరిగిన పోరాటం, సంస్థానాధీశుడు, పటేల్ రాజీ సంప్రదింపులతో ఒక అంగీకారంపై సంతకాలు చేయుటతో ముగిసింది. సంస్థానాధీశుడు ఒడంబడికను గాలికి వదలివేయుటతో నిరసనగా గాంధీజీ నిరాహారదీక్ష చేయవలసివచ్చింది.

వామపక్షశక్తులున్న సంస్థానాలలో అతివాద కాంగ్రెసు జాతీయవాదులు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు, యితర అభ్యుదయ వాదులందరూ కలసి ఆచరణలో ఐక్య సంఘటనా పోరాటాలు సాగించారు, అట్టి ప్రాంతాలలో సంస్థాన ప్రజామండలులు నిజమైన ఐక్యపోరాట సంస్థలుగా అభివృద్ధి చెందాయి.

---

1. నంబూద్రిపాద్, ఇ.యం.యస్. (1988) భారతస్వాతంత్ర్య పోరాటచరిత్ర, ద్వితీయ భాగం. పే. 149.

3) సరిహద్దు రాష్ట్రంలో కాంగ్రెసు బలంగావుంది. మిగతా ముస్లిం మెజారిటి రాష్ట్రాలలో కాంగ్రెసు అంతబలంగాలేదు. అనేకచోట్ల ముస్లిం నాయకులు కాంగ్రెసు సహకారాన్ని కోరారు ముస్లిం లీగు యెడల కాంగ్రెసు అవలంబించిన పట్టువిడుపులులేని వైఖరి ప్రత్యేకించి మంత్రివర్గాల ఏర్పాటులలో కాంగ్రెసు ప్రెసిడెంటు నెహ్రూ అవలంబించిన విధానం ముస్లింలీగు పెరిగి, బలపడుటకు దారితీసిందని మౌలానా అజాద్ జ్ఞాపకాలలో వ్రాయబడింది. ముస్లింలీగుతో సహా ముస్లిం సంస్థల నాయకులందరూ గతంలో కాంగ్రెసులో చురుకైన కార్యకర్తలే, జిన్నాలాగానే ఈ నాయకులుకూడ కొత్త రాజ్యాంగం ప్రకారం ముస్లిం ప్రాతినిధ్య సమస్యపై తప్ప మితవాద రాజకీయాలపై ముస్లింలు అన్ని విషయాలలో కాంగ్రెసుతో ఏకీభవిస్తూ వచ్చారు.[1]

ముస్లింలు మెజారిటీవున్న రాష్ట్రాలలో ముస్లిం ప్రతినిధులు గెలిచారు. కాని ముస్లింలీగుకు మెజారిటి ప్రతినిధులు లేని కారణంగా పంజాబ్, బెంగాలులలో గూడ లీగు స్వతంత్రంగా ప్రభుత్వాన్ని యేర్పాటు చేయలేకపోయింది. భూస్వాములు, బ్రిటిష్ అనుయాయులు,కాంగ్రెసు, లీగుకు రెంటికి వ్యతిరేకులు చాలమంది గెలిచారు. బెంగాల్, పంజాబ్‌లలో కృషిక్‌పార్టీ, యూనియనిస్ట్ పార్టీలు యితర గ్రూపులతో కలసి ప్రభుత్వాన్ని యేర్పాటు చేసాయి. ఈ రెండు ప్రభుత్వాలలో పెక్కురు బ్రిటిష్ అనుకూలురు. ఈ విధంగా యి త రు ల తో క ల సి ముఖ్యంగా బ్రిటిష్ అనుకూలురతోకలసి మంత్రివర్గాన్ని యేర్పాటు చేయుట, ముస్లింలీగు యు. పి. నాయకుడైన చౌదరి ఖాలీకుజ్మామ్‌కు యిష్టంలేదు. గతంలో చౌదరి ఖాలీకుజ్మామ్ కాంగ్రెసు కార్యకర్త. ఈయన గోవిందవల్లభపంత్, కిద్వాయిలతో రాయబారాలు జరిపారు. ఫలితంగా బ్రిటిష్ ప్రభుత్వ విధేయుల తాత్కాలిక ప్రభుత్వంతో చేతులు కలుపుటను చౌదరి ఖాలీకుజ్మామ్ తిరస్కరించారు. కాంగ్రెసు, ముస్లింలీగుల మధ్య కుదిరిన అంగీకారం మేరకు కాంగ్రెసు యేర్పాటుచేసే మంత్రివర్గంలో ముస్లింలీగు భాగస్వామిగా వుంటుంది. కాంగ్రెసు నాయకులు నెహ్రూతోసహా పెక్కుమంది యీ అవగాహనను వ్యతిరేకించి, లీగునుండి కొన్ని షరతులతో మంత్రులను తీసుకోవాలని నిర్ణయించారు. లీగు సభ్యులు కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీలో చేరాలి, కాంగ్రెసు క్రమశిక్షణకు కట్టుబడివుండాలి, అసెంబ్లీలో లీగు ప్రత్యేక గ్రూపుగా పనిచేయరాదు, లీగు పార్లమెంటరీబోర్డును రద్దుచేయాలి,మంత్రివర్గం రాజీనామా చేయాలని కాంగ్రెస్ నిర్ణయిస్తే లీగు సభ్యులు, కాంగ్రెసు సభ్యులతోపాటు రాజీనామా చేయాలి. ఇవి ముఖ్యషరతులు,వీటిని ఒప్పుకొనిలీగు మంత్రివర్గంలో చేరుట వాస్తవానికి లీగు సభ్యులను కాంగ్రెసులో చేరమనుటతప్ప మరొకటి కాదు, ఆ విధంగా యేర్పడిన ప్రభుత్వం పద్ధతులేదని స్పష్టమైనకాంగ్రెసు ప్రభుత్వమగుతుంది కాని సంకీర్ణ ప్రభుత్వం కాదు. కాంగ్రెసుకు ముస్లింల తరువాతకూడ ముస్లింల నిజమైన ప్రతినిధులకు మంత్రివర్గంలో అవకాశం కలిగించకుండా కాంగ్రెసు ఏకపార్టీ పాలనకై ప్రయత్నిస్తున్నదని యు.పి.

---

1. నంబూద్రిపాద్, ఇ.యం.యస్.(1988) భారతస్వాతంత్ర్య పోరాటచరిత్ర. ద్వితీయ భాగం పేజి. 142-3

ఉదాహరణను ఎత్తిచూపి, జిన్నా ముస్లిం రాజకీయసంస్థలన్నీ కలిసికట్టుగా పని చేయాలని పిలుపునిచ్చి బలపడుటకు తోడ్పడింది.

సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం దృష్ట్యా కాంగ్రెసు లీగు అస్థిరతనే ప్రశ్నించే షరతులను విధించుట చరిత్ర పొరపాటు. అందుకే అజాద్ తన జ్ఞాపకాలలో ఆ విధమైన ఆత్మవిమర్శన చేసుకొన్నారు. వర్గ దృక్పథంతో "1937-40లలో ముస్లింలీగు పెరుగుదలకు మూలం, భారతీయ బూర్జువావర్గాల అంతర్గత పోరాటం" అని నంబూద్రిపాద్ వ్యాఖ్యానించారు. వామపక్షాలు కమ్యూనిస్టులు, సోషలిస్టులు, అతివాద కాంగ్రెసువాదులు 1933 రాజ్యాంగచట్టపు వలలో పడవద్దని ప్రచారం చేసినా, చారిత్రిక ఘటనలో స్పందించ లేకపోవుటయేగాక బూర్జువావర్గపు రెండు పాకలైన కాంగ్రెసు-ముస్లిం లీగులపై వొత్తిడితో మార్పుతీసుకొని రాగలిగినంతటి శక్తివంతముగా లేవు[1].

**ఐక్యసంఘటనా అభ్యర్థిగా బోస్ కాంగ్రెసు అధ్యక్షుడిగా ఎన్నిక, కాంగ్రెసులో సంక్షోభం :**

హరిపుర కాంగ్రెసు మహాసభకు మితవాద కాంగ్రెసు నాయకత్వం సూచనపై సుభాస్ చంద్రబోస్ కాంగ్రెసు అధ్యక్షులయ్యారు. హరిపుర, త్రిపుర మహాసభల మధ్యకాలంలో మితవాదులు, వామపక్షవాదుల మధ్య తీవ్ర విభేదాలు వచ్చాయి. సెప్టెంబరు 1938లో జరిగిన ఎ ఐ సి సి నాటినుండి కార్యవర్గ సభ్యుడైన ఆచార్య నరేంద్రదేవ్ నాయకత్వాన వామపక్షవాదులు కాంగ్రెసుతో తీవ్ర అంతర్గత పోరాటం సాగిస్తున్నారు. దేశవ్యాప్తంగా జరుగుతున్న రైతాంగ పోరాటాల యెడల రాష్ట్రమంత్రివర్గాల వైఖరి, వివిధ స్వదేశీ సంస్థానాలలో జరుగుతున్న ప్రజాస్వామ్య పోరాటాల యెడల గాంధీజీ యితర మితవాద నాయకుల వ్యతిరేక వైఖరి, వామపక్షీయులకు అసంతృప్తి, ఆగ్రహం కలిగించాయి. ఈ వివాదాలలో, అటువంటి సమస్యలపై బోస్ దృఢంగా వామపక్ష దృక్పథాన్ని అనుసరించారు, దృఢంగా నిలబడ్డారు అంతేగాక బోస్ ఫెడరల్ రాజ్యాంగాన్ని అవసరమైతే అహింసాయుత సహాయ నిరాకరణోద్యమంతో, న్యాయ, చట్ట సమ్మతమైన పద్ధతులల్లో నిరోధిస్తామని ప్రకటించారు. తెరవెనుక మితవాద కాంగ్రెసు నాయకత్వానికి, బ్రిటిష్ ప్రభుత్వానికి రాజీ సంభాషణలు జరుగుతున్నవి. కాంగ్రెసు పోరాట పంథాను చేబట్టాలంటే బోస్ అధ్యక్షునిగా కొనసాగాలనే అభిప్రాయం అతివాదులలో ప్రబలింది, బోస్ వెనుక సంఘటితులయ్యారు. బోస్‌ను తిరిగి అధ్యక్షునిగా ఎన్నుకొనాలనే ప్రతిపాదనను మితవాదులు వ్యతిరేకించి, అజాద్‌ను ప్రతిపాదించగా, అజాద్ పోటినుండి విరమించుకొనగా, పట్టాభిశీతారామయ్యను మితవాద నాయకత్వం తమ అభ్యర్థిగా ప్రకటించారు[2].

---

1. నంబూద్రిపాద్, ఇ. యం. యస్. (1988) భారత స్వాతంత్ర్యం పోరాట చరిత్ర. ద్వి. భా. పే. 147.
2. నంబూద్రిపాద్, ఇ.యం.యస్. (1988) భారతస్వాతంత్ర్య పోరాటచరిత్ర, ద్వితీయ భాగం. పే. 173.

తీవ్రంగా జరిగిన పోటీలో బోస్ మెజారిటీతో ఎన్నికయ్యారు. వాస్తవానికిది మితవాదంపై వామపక్ష విజయం, కాంగ్రెసులో తీవ్ర సంక్షోభానికి దారి తీసింది. ఎన్నికైన వెంటనే గాంధీజీ "పట్టాభి ఓటమి నా వోటమి" అని ప్రకటించారు. కాంగ్రెసు అధ్యక్షుడైన బోస్‌తో సహకరించజాలమని మితవాద నాయకులు కార్యవర్గం నుండి రాజీనామా చేసారు. అత్యధికులు బోస్ అధ్యక్షునిగా ఎన్నుకొన్నా, గాంధీ నాయకత్వం తప్పని సరియనే అభిప్రాయం పెక్కుమందిలో వుంది దీనిని తమ కనుకూలంగా చేసుకొనుటకు మితవాద నాయకత్వం ఒక తెలివైన ఎత్తుగడ వేసింది. బోస్ అధ్యక్షునిగా కొనసాగుతూ, కార్యసర్గ సభ్యుల్ని గాంధీతో సంప్రదించి నియామకం చేయాలనే సూచన తీర్మానాన్ని ఆమోదింప చేసుకొన్నారు. గాంధీ, యితర మితవాద నాయకత్వం సూచించిన కార్యవర్గాన్ని బోస్ నామినేటు చెయ్యాలి, యిది పంత్ తీర్మాన సారాంశం. దీనిని అమలుచేయుటకు బోస్, గాంధీజీలు వొక అంగీకారానికి రాలేకపోయారు. మార్గాంతరం లేక బోసు రాజీనామా చేసారు. కలకత్తా ఎ ఐ సి సిలో రాజీనామా ఆమోదించబడింది దీనిపై "బోస్‌ను కాంగ్రెసు అధ్యక్షునిగా ఎన్నుకొనుట, మితవాద రాజకీయశక్తిని తుడిచిపెట్ట లేకపోయినట్లే, బోస్‌ను బలవంతంగా రాజీనామా చేయించటం వామపక్ష రాజకీయశక్తిని ధ్వంసం చేయలేకపోయింద"ని[1] నంబూద్రిపాద్ వ్యాఖ్యానించారు. తదుపరి కాలంలోకూడ కాంగ్రెసు అధిష్ఠాన వర్గాన్ని మితవాద శక్తులు ఎదిరించునంతటి శక్తి నెప్పటికీ పొందజాలకపొయ్యాయి.

కాంగ్రెసు ప్రభుత్వాల ప్రజా వ్యతిరేక చర్యలవలన ప్రజా వ్యతిరేకత పెరిగింది. కార్మిక సమ్మె పోరాటాలు, రైతుల సత్యాగ్రహాలు, ప్రత్యక్ష పోరాటాలు ఎక్కువయ్యాయి ఈ పోరాటాలలో వామపక్ష శక్తులతో కాంగ్రెసు వాదులు కలిసారు. అన్ని రాష్ట్రాలలో జిల్లా కాంగ్రెసు కమిటీలు, స్థానిక కాంగ్రెసు కమిటీలు బెంగాల్, కేరళ, యు. పి. లలో రాష్ట్ర కాంగ్రెసు కమిటీలు పోరాటాలలో పాల్గొన్నారు. రాష్ట్ర కాంగ్రెసు ప్రభుత్వాల నిర్బంధచర్యలు కాంగ్రెసు కార్యకర్తలలో ఆందోళన కలిగించింది

కమ్యూనిస్టు పార్టీ, సోషలిస్టుపార్టీ, బోస్ నాయకత్వంలో ఏర్పడిన పార్వర్డు బ్లాక్, రాయ్ గ్రూపులు, కిసాన్‌సభలతో యేర్పడిన "వామపక్ష సంఘీభావ కమిటీ" బొంబాయి జూన్ 1939 ఎఐసిసి రెండు తీర్మానాలకు అనగా రాష్ట్రకమిటీల ఆదేశాల మేరకే క్రింది కమిటీలు పోరాటాలు సాగించాలని, రాష్ట్ర కాంగ్రెసు ప్రభుత్వాల విమర్శనను నిషేధించుతూ చేసిన తీర్మానములకు నిరసనగా, జులై 9న నిరసన దినాన్ని పాటించమని ప్రజానీకానికి పిలుపునిచ్చింది. దేశవ్యాప్తంగా పెద్దయెత్తున నిరసన దినం జరిగింది. వామపక్ష ఐక్యతను గుర్తించిన మితవాద నాయకత్వం క్రమశిక్షణ పేరుతో బోస్ తదితర వామపక్ష కాంగ్రెసు వాదులపై క్రమశిక్షణా చర్యలు తీసుకొంది. నెలలోపలే సెప్టెంబరు 1, 1939న ప్రపంచయుద్ధం ప్రారంభమైంది. శిక్షణాచర్యల, వామపక్ష మితవాద చీలికల అనౌచిత్యాన్ని చరిత్ర ఎత్తిచూపింది.

---

1. నంబూద్రిపాద్, ఇ. యం. యస్. (1988) భారత స్వాతంత్ర్య పోరాట చరిత్ర ద్వితీయ భాగం. పే. 177

## వామపక్ష ఐక్యత

సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక అన్నివర్గాల ఐక్యసంఘటనకు పునాది వామపక్ష ఐక్యత. ఈ ఐక్యత పోరాటాలలోనే ఏర్పడుతుంది. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలలో కాంగ్రెసు ఒక బలమైన శక్తిగా గుర్తించి, దానిలోని మితవాద సంస్కరణ వాదులకు వ్యతిరేకంగా పోరాడుట అదేకాలంలో కాంగ్రెసు అట్టి పోరాటాలు జరుపునపుడు మద్దతునిచ్చుట జాతీయ సంఘటన వ్యూహం. మితవాద కాంగ్రెసువాదులకు వ్యతిరేక పోరాటంలో కమ్యూనిస్ట్, సోషలిస్టులు, ఫార్వర్డుబ్లాక్‌వారు, రాయిస్టు గ్రూపులు, కిసాన్ సభ, ట్రేడు యూనియన్‌లు కలసివచ్చినా, వారిమధ్య గల ప్రాధమిక భేదాలను గమనించుట అత్యవసరం.

వామపక్ష పార్టీలలో మార్క్సిజం, సోషలిజం సిద్ధాంత దృక్పధంతో ఆశయ సాధనకు నిర్మాణం క్రమవిధానంగలది కమ్యూనిస్టుపార్టీ. బ్రిటిష్ ప్రభుత్వం కమ్యూనిస్టు వ్యతిరేకంతో భారతదేశంలో కమ్యూనిస్ట్ పార్టీ స్థాపనకు, విస్తరణకు ఎన్నో కుట్రకేసులను బనాయించి, చట్టరీత్యా పనిచేయు అవకాశాలు లేకుండా చేసింది. ఆ కారణాన దగ్గరి దగ్గరిగా రహస్యంగా పనిచేస్తున్నది. పార్టీ 1934లో బాల్వారిష్ట అతివాద రుగ్మతనుండి బయటపడి పునర్నిర్మాణం చేయబడింది. కమ్యూనిస్ట్ పార్టీ అంతర్జాతీయ దృక్పధంతో కామింటర్న్‌లో భాగంగా పనిచేస్తూ దేశంలో సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో కార్మికవర్గ నాయకత్వాన్ని నెలకొల్పుటకై బూర్జువా వర్గాలకు అయిష్టమైనా కార్మిక కర్షక ప్రజాసంఘాలను నిర్మించి వారి తక్షణ సమస్యలపై పోరాటాలు జరుపుతున్నది.

భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమారంభానికి యం.యన్. రాయ్ ఎనలేని కృషిచేశారు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌చే బహిష్కరింపబడిన తరువాత దేశంలో రాడికల్ డెమోక్రటిక్ పార్టీని స్థాపించి, దేశంలో వామపక్ష రాజకీయాల అభివృద్ధికి కృషిచేస్తారు. ఒకటి రెండుచోట్ల కార్మికవర్గంలో బలాన్ని కలిగివుంది. మేధావి వర్గాలలో ప్రధానంగా కొంత రాజకీయ బలాన్ని కలిగివుంది.

కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కాంగ్రెసులోవున్న తీవ్రవాద భావాలకు స్వరూపం యిచ్చే ప్రయత్నాలనుండి వుద్భవించింది. కాంగ్రెసులో సోషలిస్టులు తప్పనిసరిగా సభ్యులై వుండాలి, వారు కాంగ్రెసులో వామపక్ష పార్టీగా తలంచుతారు. సోషలిస్ట ఇంటర్నేషనల్ విధానాన్ననుసరించే బ్రిటిష్ లేబరుపార్టీప్రభావం సోషలిస్ట్ పార్టీలోని కొందరిపై వుంది. మసాని, అశోక్ మెహతా,లోహియా ఆ వైఖరి వారిలో ముఖ్యులు, కమ్యూనిస్ట్ వ్యతిరేకులు. కమ్యూనిస్టు పార్టీని మిత్రపార్టీగా యెప్పుడూ యెంచని వారు. దీనికి భిన్నంగా జయప్రకాశ్ నారాయణ,ఆచార్య నరేంద్రదేవ్,సంపూర్ణానంద్ దినకర్ మెహతాలు సోషలిస్ట్ పార్టీ , కమ్యూనిస్టు పార్టీలు కలసి సంయుక్త సంఘటనను నిర్మించాలనే అభిప్రాయంతో వున్నారు. ఈ వైఖరే వామపక్ష ఐక్యతకు

పునాది.[1] కమ్యూనిస్టులు, సోషలిస్టులు కలసి పనిచేయుటతో కమ్యూనిస్ట్ వ్యతిరేకత తగ్గిపోయింది, సోషలిస్టులుగూడ వర్గ ప్రాతిపదికపై కాంగ్రెసు మితవాద నాయకత్వాన్ని పరిశీలించుట మొదలైంది. సోషలిస్టులలో కొందరు కమ్యూనిస్టులుగా మారుట జరుగుతున్నది. ఈ కారణంగా మసానీ గ్రూపు పలుకుబడి పెరిగింది. సోషలిస్టులు "మారుట వుమ్మడి కార్యాచరణ, పరస్పర అభిప్రాయాల వ్యక్తీకరణవలన వచ్చే సహజ పరిణామంగా వారు గుర్తించక, కమ్యూనిస్టుల కుట్ర అని తీవ్ర ప్రచారం చేసారని" నంబూద్రిపాద్ వివరించారు.[2]

కాంగ్రెసులోని వామపక్ష జాతీయవాదులకు నెహ్రూ, బోస్‌లు నాయకత్వం వహించుతున్నారు. నెహ్రూ సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫాశిస్టు వ్యతిరేక శక్తులన్నిటిని సమైక్యపరచి సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యసంఘటన యేర్పాటు చేయాలని, ఆ ఫ్రంటుకు కాంగ్రెసు వేదిక కావాలని, దానిలో కార్మిక, కర్షక సంఘాలు ప్రముఖ పాత్ర వహించాలనే దృక్పధం కలిగివుండుటతో కమ్యూనిస్టులకు సన్నిహితుడు. అయినా సంఘటనల సమస్యపై మితవాద కాంగ్రెసు నాయకత్వంతో సంఘర్షణలకు దూరంగా వుండుటకై అంతర్జాతీయ రాజకీయాలలో నిమగ్నులయ్యారు. నెహ్రూ అనూయాయులందరూ సమిష్టిగా కార్యక్రమాలలో కమ్యూనిస్టులు, సోషలిస్టులతో కలసి పనిచేస్తున్నారు. సుభాస్ చంద్రబోస్ ఆయన అనుచరులైన బెంగాల్ కాంగ్రెసు తీవ్రవాద జాతీయవాదులు సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనలో చురుకుగా పాల్గొంటున్నారు,కాంగ్రెసు మితవాద రాజకీయాలను, నాయకత్వాన్ని తిరస్కరించుచున్నారు.

వీరేగాక యే పార్టీకి చెందని మధ్యతరగతి మేధావి వర్గాలలో సోషలిజం, కమ్యూనిజం, వామపక్ష రాజకీయాలపై అభిమానంగల వారెందరో వున్నారు.వీరితోబాటు విద్యార్థి, యువజనులను వామపక్ష రాజకీయాలు ఆకర్షించుచున్నవి.

దత్తు-బ్రాడ్లీల సిద్ధాంతపత్రం వామపక్షాలను సంఘటితపరచుటపై ప్రత్యేకంగా కొన్ని సూచనలు యిచ్చింది అవి భారతదేశానికి సంబంధించినవి[3].

1. వామపక్షశక్తులు చెల్లాచెదురుగా పనిచేస్తున్నాయి. అవి చీలికలై నిందారోపణలు చేసుకొనుటతో మితవాద నాయకత్వంపుది పైచేయి అయింది. వివిధ వామపక్షశక్తులు రాజకీయ విభేదాలను సుహృద్భావంతో సమగ్రంగా చర్చించుకొని పరిష్కరించుకొనుట అవసరం. కాంగ్రెసులోను రోజువారి పోరాటాలలోను యేయే సమస్యలపై ఒప్పందాలు సాధ్యమో ఆ సమస్యలపై సహకరించుకొనుటకు అవి అడ్డురాకూడదు.

---

1. నంబూద్రిపాద్, ఇ. యం. యస్. (1988) భారత స్వాతంత్ర్య పోరాట చరిత్ర ద్వితీయ భాగం పే. 177
2. నంబూద్రిపాద్, ఇ. యం. యస్. (1988) భారత స్వాతంత్ర్య పోరాటచరిత్ర. (తెలుగులో) ద్వి. భా. పే. 186.
3. సత్యనారాయణ, కంభంపాటి 1983) ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర అనుబంధం. 17 పే. 268-9.

2. కాంగ్రెసు సోషలిస్టులు, ట్రేడు యూనియనిస్టులు, కమ్యూనిస్టు,కాంగ్రెసు వామపక్షీయులు అందరూ సంపూర్ణ స్వాతంత్ర్యం కొరకు జరిగే సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటపు కనీస కార్యక్రమముపై ప్రజల్ని సంఘటితపరచే క్రమములో ఐక్యతను సాధించవచ్చు కాంగ్రెసు విధానాలను, నాయకత్వాన్ని మార్చుకొనేటట్లు చేసే కార్యక్రమముపై ఐక్యత ఏర్పడగలదు. కాంగ్రెసు సోషలిస్ట్‌పార్టీ యీ విష యంలో ప్రముఖపాత్ర వహించగలదు.

3. సామ్రాజ్య వ్యతిరేక ప్రజాసంఘటన తొలిదశ ఉమ్మడి పోరాటంలో రూపొందుతుంది. ఇది స్థానిక, జిల్లా, రాష్ట్రస్థాయిలో సాధ్యపడగలదు.

4. వామపక్షశక్తులన్నిటిని పటిష్ట మొనర్చుటలో పోరాటక్రమంలో రాజకీయ స్పష్టతను చేకూర్చుటలో ఆచరణలో ఐక్యతను సాధించుటలో ప్రజోద్యమాలను నడుపుటలో కమ్యూనిస్టులుబాధ్యతాయుత పాత్రను నిర్వహించవలసి వుంటుంది.

ఈ అవగాహన కాంగ్రెసు సోషలిస్టు, కమ్యూనిస్టు, వామపక్ష కాంగ్రెసు వాదులు, రాడికల్ డెమోక్రాట్సు మధ్య సదవగాహనతో అనేక రాజకీయ, తక్షణ సమస్యలపై పోరాట ఐక్యతనుసాధించుటకెంతో తోడ్పడింది. వామపక్షపార్టీలు అన్ని వర్గాల ప్రజలలో బలపడుటకు సోషలిస్టు అభిప్రాయాలు ప్రజలలో వ్యాపించుటకు మరెంతో తోడ్పడింది. కార్మిక, కర్షక, విద్యార్థి యువజన వుద్యమాలు ప్రజా సమ స్యలపై పోరాటాలు సాగించుటతో యెంతో బలపడినాయి. ఐక్య కార్యాచరణ వామ పక్ష పార్టీల ప్రధాన పోరాట మార్గమైంది.



# 3

# విగ్రహపర్వం

## i

## స్వాతంత్ర్య పోరాటము

జర్మనీ, ఆస్ట్రియా, జకోస్లావియాలపై దురాక్రమణ జరిపి ఆక్రమించినా, బ్రిటన్ నానాజాతి సమితిలో జర్మనీ చర్యలను సమర్థించింది. జర్మనీతో బ్రిటన్ మ్యూనిచ్ ఒడంబడిక చేసుకొని యూరపు దేశాలకు వెన్నుపోటు పొడిచింది. బ్రిటన్ వ్యూహం ఫాశిజానికి బద్ధశత్రువైన సోవియట్‌ను జర్మనీతో యుద్ధంలోనికి దింపి, హిట్లరు రష్యాను నాశనము చేయుటకు అవకాశం కలుగజేయుట. ఈ సామ్రాజ్యవాద ఎత్తుగడకు ప్రతిగా సోవియట్ యూనియన్ - జర్మనీ నిర్యుద్ధ ఒడంబడిక చేసుకొన్నవి. సోవియట్ యూనియన్ రక్షణను పటిష్టం చేసుకొన మొదలిడింది. పోలెండు పతనానంతరం ఫ్రాన్సుతోసహా పశ్చిమ యూరపు మొత్తాన్ని జయించి, బ్రిటన్‌పై దండయాత్రకు సిద్ధమౌతున్నది జర్మనీ. ఈ దాడి సోవియట్‌పై జరుగునట్లు బ్రిటన్ చేసిన ప్రయత్నాలు విఫలమయ్యాయి.

రెండవ ప్రపంచ యుద్ధం యెడల భారత బూర్జువావర్గం ఒకే అభిప్రాయాన్ని కలిగిలేదు. ఒక వర్గం యుద్ధం స్వాతంత్ర్యసాధనకు మంచి అవకాశాన్ని కలుగచేస్తుందనే వ్యూహంతో, సాయుధ తిరుగుబాటు కార్యక్రమం చేబట్టాలని కాంగ్రెసులోని వామపక్షవాదులు, సోషలిస్టులు, కాంగ్రెసులోని ఒకవర్గపు ఆలోచన; ఫాశిస్టుజర్మనీ, జపాన్ యుద్ధ భయోత్పాతాన్ని కలుగజేసినపుడు, బోసు నాయకత్వంలోని వర్గం అదే అభిప్రాయాన్ని కలిగివుంది. నెహ్రూ, గాంధీలతోసహా మితవాద కాంగ్రెసు నాయకత్వం భిన్నాభిప్రాయాన్ని కలిగియున్నది. అయితే ఇంగ్లాండు కష్టదినాలు, భారత్‌కు అవకాశం అనే అభిప్రాయం లేకపోలేదు. అట్టి అవకాశాన్ని భారత్‌కు సానుకూలంగా వినియోగించుకొను విధానాల సమస్యమీదనే బోస్‌కు యితర నాయకులకు మధ్య భేదాభిప్రాయాలున్నవి. బోస్‌లాగ గాంధీ, యితర నాయకులు ఫాశిస్టుశక్తులు భారత స్వాతంత్ర్య పోరాటానికి సహాయపడునని తలచలేదు. బ్రిటన్ క్లిష్ట పరిస్థితులలో వున్నపుడే బేరాలాడి అధికారాన్ని పొందాలని కాంగ్రెసు రాజకీయ విధానంగా వుంది. ముస్లింలీగు నాయకుడు జిన్నాకూడ బ్రిటిష్‌వారితో బేరమాడి, ఒత్తిడితో తన ఆశయాన్ని పొంద ప్రయత్నిస్తున్నాడు. కాని, చీలిన భారత బూర్జువావర్గంలో కాంగ్రెసు, ముస్లింలీగు యేదీ పోరాట మార్గాన్ని చేబట్టలేదు.

కమ్యూనిస్టులు 1935 నుండి ఫాశిస్టు వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక, బ్రిటిష్ వ్యతిరేక పోరాటానికై జాతీయ సంఘటనకు పిలుపునిచ్చి రాజీలేని పోరా

టాన్ని కొనసాగించుతున్నారు. బ్రిటిష్‌వారితో రాజీ బేరాలాడే మితవాద కాంగ్రెసు వైఖరికి వ్యతిరేకంగా వున్నారు. కార్మిక సమ్మెలు, రైతాంగ పోరాటాలు, యితర విప్లవ పోరాటరూపాలను సంఘటితపరచి, ప్రపంచ ఫాశిస్టు వ్యతిరేక పోరాటంతో భారత స్వాతంత్ర్య పోరాటాన్ని అనుసంధానంచేయు ప్రయత్నం చేసారు. యుద్ధం ప్రారంభమయ్యేవరకు కాంగ్రెసు సోషలిస్టు పార్టీ, నెహ్రూకూడ అదే విధానాన్ని అనుసరించారు.

నాజీ జర్మనీ 1 సెప్టెంబరు 1939న పోలెండుపై దండెత్తుటతో రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభమైంది. బ్రిటన్, ఫ్రాంసు, పోలెండు పరస్పరం రక్షణ ఒప్పందం వున్నప్పటికి పేరుకు జర్మనీపై యుద్ధం ప్రకటించినా ఆచరణలో యుద్ధానికి దిగలేదు. జర్మనులు వార్సాను సెప్టెంబరు8న ఆక్రమించారు. పోలిష్ ప్రభుత్వం లండన్ చేరింది.

జాతీయ కాంగ్రెసు సెప్టెంబరు 14న సమావేశమై, ఇంగ్లండు, ఫ్రాంసుల యుద్ధలక్ష్యం యెడల కాంగ్రెసుకు సానుభూతి కలదని తెలిపింది. భారతదేశం శాంతి, స్వేచ్ఛ తిరస్కారణలకు వ్యతిరేకంగా దీర్ఘకాలంగా పోరాడుతున్నది. ఈ యుద్ధంలో బ్రిటన్ తరపున అధినివేశ ప్రతిపత్తిగల దేశాల ప్రజలు కెనడియనులు, ఆస్ట్రేలియనులు, ఆయాదేశాల పార్లమెంటుల నిర్ణయాల మేరకు పాల్గొంటున్నారు. భారత ప్రజలను సంప్రదించకుండా భారతదేశం యుద్ధంలోనికి లాగబడింది ప్రజలకు బాధ్యత వహించని కేంద్ర ప్రభుత్వం నిర్ణయించింది. భారతదేశం దీనిని అంగీకరించజాలదు; యుద్ధాన్ని చేయు అధికారాలు ఆ ప్రభుత్వాలకు వుండాలి. గత అనుభవంతో, బ్రిటిష్ ప్రభుత్వం యుద్ధకాలంలో చేసిన ప్రకటనలను భారత ప్రభుత్వం నమ్మజాలదు. ప్రభుత్వం తన వైఖరిని స్పష్టం చేయుటకు సిద్ధపడనంతవరకు ప్రభుత్వ యుద్ధ ప్రయత్నాలతో కాంగ్రెసు సహకరించజాలదని కార్యవర్గం స్పష్టం చేసింది.

### వామపక్షాల ఆందోళన, కాంగ్రెసు రాష్ట్ర మంత్రివర్గాల రాజీనామా

కాంగ్రెసు సెప్టెంబరు కార్యవర్గపు తీర్మానంలో, బ్రిటిష్ ప్రభుత్వం భారత స్వాతంత్ర్య సమస్య యెడల, తన వైఖరిని స్పష్టం చేయజాలనిచో కాంగ్రెసు ప్రభుత్వ యుద్ధ ప్రయత్నాలలో సహకరించజాలదని స్పష్టం చేసినా, తీర్మానంలో రాజీ చర్చలకు అవకాశం పొందుపరచబడివుంది. బోస్ రాజీకి వ్యతిరేకంగా అఖిల భారత సమావేశం యేర్పాటు చేయుటకు ప్రయత్నాలు ప్రారంభించాడు.

సుభాస్ చంద్రబోస్, కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెసు మంత్రివర్గాల కొనసాగింపుకు వ్యతిరేకంగా తీవ్ర ఆందోళన గావించారు. కాంగ్రెసు కార్యకర్తలలో ప్రభుత్వం యుద్ధ లక్ష్యాలను ప్రకటించుటకు, కేంద్రపాలనా వ్యవస్థలో మార్పుకు ఆమోదించనందువ, మంత్రివర్గాలలో కొనసాగుట తగదనే అభిప్రాయం ప్రబలింది. నెహ్రూ, పెక్కురు కాంగ్రెసు నాయకులు చాలామంది యిట్టి అభిప్రాయాన్నే కలిగి వున్నారు. బ్రిటిష్ యుద్ధ ప్రయత్నాలకు సహాయ నిరాకరణ, రాష్ట్ర కాంగ్రెసు మంత్రివర్గాల కొనసాగింపువంటి పరస్పర విరుద్ధచర్యలు, కాంగ్రెసు కార్యకర్తలలో, నాయకులలో విశ్వాసాన్ని సడలిస్తున్నాయి.

కమ్యూనిస్టుల చొరవతో బొంబాయి కార్మికవర్గం అక్టోబరు 2న, రెండవ ప్రపంచ యుద్ధకాలంలో మొట్టమొదటి యుద్ధ వ్యతిరేక సమ్మె పోరాటం జరిపింది. యుద్ధ కారణంగా అత్యవసర వస్తువుల ధరలు పెరిగినందున కరువుభత్యాన్నికోరుతు 90 వేల కార్మికులు సమ్మె చేసారు. బొంబాయి, అహమ్మదాబాద్‌లలో పోలీసు కాల్పులతో ప్రాణనష్టం జరిగింది. చివరకు కరువు భత్యం చెల్లించుటకు వొప్పందం జరిగింది. కార్మిక వివాదాలలో 49 లక్షల పనిదినాలు నష్టమయ్యాయి. కార్మికులలో యుద్ధ వ్యతిరేక పోరాట పటిమ పెరిగింది.

మంత్రివర్గాల కొనసాగింపుకు వ్యతిరేకంగా ఆందోళన రోజు రోజుకు ఎక్కువైంది ఈ పరిస్థితులలో గాంధీజీతోసహ మితవాద కాంగ్రెసు నాయకత్వం, రాష్ట్ర మంత్రివర్గాలు రాజీనామా చేయాలనే కోరికను ఆమోదించక తప్పలేదు.

అక్టోబరు 8-10లలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు కమిటి సమావేశం, మంత్రివర్గాల రాజీనామా చేయాలనే తీర్మానం ఆమోదించింది. సెప్టెంబరు 14 తీర్మానం వలెనె యీ అక్టోబరు10తీర్మానమూ రాజీ చర్చలకు "తలుపులు తెరచే" వుంచింది. అందుకే రాజీనామాల తరువాత ఎట్టి పోరాట కార్యక్రమం తీర్మానం సూచించలేదు.

కాంగ్రెసు మంత్రివర్గాలు నవంబరు 1న రాజీనామా చేసిన తరువాత, వైస్రాయి అవకాశాన్ని జారవిడువక, గాంధీజీని, కాంగ్రెసు అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్, లీగ్ అధ్యక్షుడు జిన్నాను సంభాషణలకు ఆహ్వానించాడు. బ్రిటిష్ ప్రభుత్వ విధానాలలో ఎట్టిమార్పు లేనందున సమావేశం విఫలమైంది. ప్రభుత్వ నిర్బంద చట్టాల తీవ్రత యెక్కువైంది, కార్మికులు పెరిగిన ధరలతో జీతాలు పెరగాలని పోరాటాలు ఎక్కువయ్యాయి పోరాటాలకు కమ్యూనిస్టులు, సోషలిస్టులు, అతివాద కాంగ్రెసువాదులు నాయకత్వం వహించారు. ప్రజావుద్యమాల వొత్తిడి ఎక్కువకాగా, కాంగ్రెసు కార్యవర్గం పరిస్థితులను సమీక్షించి, నాటి జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులలో పోరాటాన్ని ఆపు చేయజాలమని, యుద్ధ వ్యతిరేక పంథాను చేపట్టవలసి వచ్చింది.

## రాంఘర్ కాంగ్రెసు-లాహోర్ లీగ్ మహాసభలు :

బ్రిటిష్ మొండివైఖరితో విసిగిపోయిన కాంగ్రెసు, 1940 మార్చిలో జరిగిన రాంఘర్ మహాసభలో వ్యష్టి సత్యాగ్రహ వుద్యమాన్ని చేబట్టాలని నిర్ణయించింది. ముస్లింలీగు 1940 మార్చి లాహోర్ మహాసభలోనే చరిత్రాత్మకమైన పాకిస్తాన్ తీర్మానాన్ని ఆమోదించింది. బూర్జువా కాంగ్రెసు, లీగులు రెండూ 'ఒత్తిడి' ఎత్తుగడలతో బ్రిటన్‌తో రాజీ సంప్రదింపుల రాజకీయాలు ప్రారంభించాయి.

సత్యాగ్రహం పోరాట నాయకత్వాన్ని గాంధీజీ చేబట్టాలని కాంగ్రెసు నిర్ణయించింది. గాంధీజీ "నా సైన్యంలో మీరు సైనికులుగా వుంటే ఆ సంస్థలో ప్రజాసౌమ్యానికి అవకాశం లేదని అర్థం....ఏ సైన్యంలోనైనా సేనాపతి మాట చట్టం, రాజీ నా స్వభావం," ఎవరిని సత్యాగ్రహులుగా నమోదుచేయాలో చెబుతు, "అంటరానితనాన్ని చిత్తశుద్ధితో నిరాకరించే వారిని, నూలువడికే వారిని, ఖద్దరు ధరించే వారిని నమోదుచేయాలి" అని, "సత్యాగ్రహ కేంద్రాలు నూలువడకే కేంద్రాలు అగు

తాయి" అన్నారు."గాంధేయ నిర్మాణ కార్యక్రమాలలో నిమగ్నులయ్యే వారిని తప్ప, గాంధేయ నాయకత్వంలో కాంగ్రెసు చేబట్టే పోరాటంలో మరెవ్వరికీ అవకాశ ముండదు. అలాంటి ప్రజాపోరాటాలు, బ్రిటిష్ పాలకులు రాజీపడుటకు చిన్న అవకాశం కూడ జారవిడువవు" అన్నారు.

కాంగ్రెసు గతంలోని పోరాటాల కంటె శక్తివంతమైన పోరాటాలను చేబట్టుతుందని, యూరపులోని పరాజయాలతో బ్రిటన్ లొంగుతుందని లీగు తలచింది. అందుకే లీగు ప్రజాపోరాటానికి పునాది వేయుటకు భవిష్యత్తు రూపకల్పన దృష్టితో లాహోర్‌లో పాకిస్తాన్ తీర్మానాన్ని ఆమోదించిందని, పరిస్థితి పూర్తిగా మారిపోయిందని, నంబూద్రిపాద్ వ్రాసారు.

కరువు భత్యాన్ని కోరుతు మార్చి 4 నుండి 40 రోజులు బట్టల మిల్లుల కార్మికులు లక్ష 70 వేలమంది సమ్మె చేసారు. సమ్మె నాయకులను అరెస్టుచేయగా ట్రేడు యూనియన్ కాంగ్రెసు పిలుపుపై 3 1/2 లక్షల కార్మికులు మార్చి 10న సానుభూతి సమ్మె చేసారు. బొంబాయి అడుగు జాడలలోనే కాన్పూరులో 20 వేలమంది, కలకత్తా మునిసిపలు కార్మికులు, బెంగాల్ జూట్ మిల్లుల కార్మికులు, అస్సాం ఆయిల్, ధన్‌బాద్ ఝరియా బొగ్గు, జంషెడ్‌పూర్ ఉక్కు కార్మికులు సమ్మెలు చేసారు. ప్రభుత్వ నిర్బంధ విధానం తీవ్రమై 1940లో 700 మందిని డిటెన్యూ చేసారు.

కాంగ్రెస్ సుదీర్ఘచర్చలు తరువాత ప్రజలకు ఎట్టి సంబంధంలేని, వ్యక్తి సత్యాగ్రహాన్ని, గాంధీ అహింసా సిద్ధాంతంలో విశ్వాసం ఉన్నవారు సత్యాగ్రహం చేయ నిర్ణయించింది. సత్యాగ్రహులను గాంధీజీ ఎన్నిక చేస్తారు. వినోబాజీ, నెహ్రూలను ప్రథమ, ద్వితీయ సత్యాగ్రహులుగ నిర్ణయించారు. బోస్ తన సేవలను వినియోగించుకొనవలసినదిగా గాంధీజీకి లేఖ వ్రాసారు. గాంధీజీ తిరస్కరించారు. సత్యాగ్రహి తాను యుద్ధాన్ని వ్యతిరేకిస్తున్నానని, ప్రజలెవ్వరూ యుద్ధ కార్యకలాపాలకు తోడ్పడ రానని విజ్ఞప్తి చేస్తారు. ప్రభుత్వం అరెస్టుచేస్తే జైలుకు వెళుతారు, లేనిచో మరో గ్రామంలో అదే ప్రచారం చేస్తారు. ప్రభుత్వం దేశంలో 20 వేలమందిని అరెస్టు చేసింది.

జాతీయ స్తబ్దత కాలంలోనే అంతర్జాతీయ పరిస్థితులు అతివేగంగా, జర్మనీ ఆక్రమణలతో మారిపోయాయి. సోవియట్‌పై జర్మనీ 22 జూన్ 1941న, దురాక్రమణ జరుపుటతో దేశంలోని పార్టీలన్నీ తమ రాజకీయ విధానాలన్నిటిని పునః పరిశీలించు కొనవలసి వచ్చింది.

**సామ్రాజ్యవాద యుద్ధవ్యతిరేక పోరాటాలు : కాంగ్రెసు, కాంగ్రెసు సోషలిస్టు, కమ్యూనిస్టు పార్టీలు :**

ప్రపంచ యుద్ధం 1, సెప్టెంబరు 1939న ప్రారంభమైంది, జాతీయ కాంగ్రెస్ కార్యవర్గం 14న సమావేశమై, ప్రభుత్వ యుద్ధ ప్రయత్నాలకు, బ్రిటిష్ ప్రభుత్వం యుద్ధకాలంలో చేసిన ప్రకటనలను, గత అనుభవంతో, కాంగ్రెసు నమ్మజాలదు. ప్రభుత్వం తన వైఖరిని స్పష్టం చేయనంతవరకు ప్రభుత్వ యుద్ధ ప్రయత్నాలకు

కాంగ్రెసు సహకరించజాలదని కాంగ్రెసు కార్యవర్గం స్పష్టం చేసింది. అయినా తీర్మానంలో రాజీచర్చలకు అవకాశంవుంది. అన్ని విధాల నిరాశ చెందిన కాంగ్రెసు,అఖిల భారత కమిటీ సమావేశం అక్టోబరులో రాష్ట్ర మంత్రివర్గాలు రాజీనామాలు చేయాలని మాత్రమే నిర్ణయించి, యెట్టి పోరాటం సూచించక, రాజీకి తలుపులు తెరచి వుంచింది. చివరకు మంత్రి వర్గాలు నవంబరు 1న రాజీనామాలు చేయవలసి వచ్చింది. జాతీయ కాంగ్రెసు 1938, 1939 లలో అనేకసార్లు సామ్రాజ్యవాదపు వలసగా వున్నంత వరకు, బ్రిటన్-జర్మనీల మధ్య యుద్ధం సామ్రాజ్యవాద యుద్ధమగుతుంది కాన భారతదేశం అందులో భాగస్వామి కాజాలదు అని పునరుద్ఘాటించింది.

కాంగ్రెసులో అతివాదవర్గాలు బాగా 1939 కి బలపడినవి. భారత రాజకీయాలలో కొంత పాత్ర వహించగల స్థాయికి ఎదిగాయి. కాంగ్రెసులో ఫార్వర్డ్‌బ్లాక్, తదితర అతివాద శక్తులు సోషలిస్టులు, కమ్యూనిస్టులతో కలసి అతివాద సంఘటన కమిటీని యేర్పాటు చేసారు. అతివాదులు మైనారిటీ అయినప్పటికి నిర్మాణయుతమైన బలాన్ని కలిగివున్నారు. అతివాదులు పూర్తి యుద్ధ వ్యతిరేక విధానాన్ని తీవ్రతరం చేస్తున్నారు. యుద్ధం ప్రారంభమైన తరువాత కాంగ్రెసు సోషలిస్టు పార్టీ, కాంగ్రెసు విధానాన్నే పూర్తిగ అవలంబించగా, బోస్ ఫార్వర్డ్‌బ్లాక్ స్వాతంత్ర్యం కొరకు సత్వర పోరాటం అనే మార్గాన్ని అవలంభించింది.

యుద్ధం ప్రారంభమైన వెంటనే రష్యన్, కొమింటరన్ నాయకత్వం, ఐక్య సంఘటనా పంధాని అనుసరించవలసిందని స్పష్టం చేసారు. తెలిసో, తెలియకో,చేయాలని వక్రీకరించో జాతీయ కాంగ్రెసును, "యుద్ధ సంక్షోభాన్ని కాంగ్రెసు సంపూర్ణ స్వాతంత్ర్యం" కొరకు అన్ని సంస్థలబలంతో వుపయోగించుకొనుటను, కాంగ్రెసును పొగిడారు. అదే కాలంలో ముస్లింలీగు తీవ్రంగా, ప్రధానంగా సంస్థానాలను బలపరస్తువున్నందుకు విమర్శించారు. కాంగ్రెసు వారి దృష్టిలో "సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటన," సామ్రాజ్యవాద వ్యతిరేక నాయకత్వాన్ని కలిగివుంటుంది. కొమింటర్న్ ప్రకారం, కాంగ్రెసు రెండు ప్రధాన పక్షాలను గలిగివుంది. అతివాదపక్షం నెహ్రూ నాయకత్వంలో ప్రజాస్వామ్య, అభ్యుదయకరశక్తులకు ప్రాతినిధ్యం వహించువర్గం, బూర్జువాలకు ప్రాతినిధ్యం వహించే మితవాదవర్గం రాజీపడుటకు సిద్ధమైనప్పటికి, అంటే కొన్ని రాయితీలతో యుద్ధాన్ని బలపరచుటకు తయారుగవున్నా మొత్తంమీద సామ్రాజ్యవాద వ్యతిరేకత కలది. అందుచేత రష్య. కొమింటర్న్ వర్గాలు ప్రధానంగా నొక్కిచెప్పేది జాతీయ కాంగ్రెసుతో ఐక్యతనెరపవలసిన అవసరము అంటే, మరో మాటలలో కాంగ్రెసు నాయకత్వంతో బాధ్యత కమ్యూనిస్టులు పార్టీ, సహకారం, మైత్రిని సత్సంబంధాలను పెంపొందించాలి.

ఈ పంథాలో ధ్వనించేది కాంగ్రెసులోని అతివాదశక్తులు కమ్యూనిస్టులతో సహా బలపడతారని భవిష్యత్తులో జాతీయ కాంగ్రెసు నాయకత్వాన్ని చేబట్టుతారనే అంచెనావుంది. ఈ అంచెనాలో కొమింటర్న్, భారతదేశంలో అభివృద్ధిచెందుతున్న వర్గచైతన్యం, వర్గపోరాటాల విజృంభణ యిమిడివుంది. వారు 1937 తదనంతర

సంవత్సరాలలో జాతీయోద్యమంలో "వెల్లువ" దిశయని కార్మికవర్గం "బలమైన రాజకీయశక్తి" అయిందని, "మరింత బలాన్ని పొందిందని" చెపుతున్నారు. అందుకు ఆధారంగా, పోలీసు నివేదికలో బెంగాలీ కార్మికులు "మే" దినోత్సవాన్ని, "యుద్ధ వ్యతిరేక దినాన్ని", "లెనిన్ దినోత్సవం", నవంబరు విప్లవ దినోత్సవం, పాలస్టైయిన్ దినోత్సవం, స్పెయిన్ దినోత్సవం, సకలత్‌వాలా దినోత్సవం, సుభాస్ దినోత్సవం, రాజకీయ ఖైదీలదినోత్సవాలను జరుపుటను వర్గచైతన్యాభివృద్ధికి సాక్ష్యంగా చూపెడుతున్నారు. కాంగ్రెసులో నాయకత్వవర్గాలలో కమ్యూనిస్టుపార్టీ గణనీయమైన శక్తిగా వున్నదని పేర్కొంటున్నారు.

కాంగ్రెసులో ఐక్యతను, అతివాదుల బలాన్ని కాంగ్రెసులో పెంపొందించాలని కొమింటర్న్ నొక్కిచెప్పింది, అంతేగాక పురోగామిశక్తులైన కమ్యూనిస్టు, సోషలిస్టులమధ్య సహకారాన్ని "అతివాద ఐక్యకమిటీ" ద్వారా పెంపొందించాలన్నది. బోస్ సహచరులు, జాతీయ అతివాదులు అతని ఓటమి తాత్కాలికమైనదని కొమింటర్న్ నాయకులు తలచారు.

కాంగ్రెసులోనే కమ్యునిస్టులు పనిచేస్తు దానిలోని ఐక్యతా పరిమితులలోనే కాంగ్రెసులో వెలకొన్న నాయకత్వం మితవాదచర్యలపై విమర్శనను యెక్కువ చెయ్యాలి. దీని ఉదాహరణగ, బొంబాయి రాష్ట్ర కాంగ్రెసు ప్రభుత్వంపై తీవ్ర విమర్శలుచేసి, కార్మికుల బ్లాక్ బిల్లుకు వ్యతిరేకంగా జరిగిన కార్మిక ప్రదర్శనలు, సమ్మెపోరాటాలను అంతర్జాతీయ కమ్యూనిస్టు నాయకత్వం పేర్కొన్నది.

వాస్తవానికి జాతీయ కాంగ్రెసు యుద్ధానికి అంత వ్యతిరేకికాదు. అయినా సోవియట్ నాయకత్వం, కాంగ్రెసు యుద్ధ వ్యతిరేకతను అతిగా అంచెనావేస్తున్నది. ఆ కాలంలో బ్రిటన్ కమ్యునిస్ట్‌పార్టీ రచనలలో బహుశాకారణం కన్పించవచ్చు. బ్రిటిష్ కమ్యునిస్టుపార్టీ పత్రికలో బ్రిటన్, ఇరాన్, ఇండియాలగుండా సోవియట్ యూనియన్‌పై దండయాత్ర వ్యూహ ప్రణాళికలు ప్రకటించబడ్డాయి. భారతదేశం వ్యూహాత్మక దండయాత్ర కేంద్రంగా వుపయోగపడుతుందని వ్రాయబడింది. సోవియట్ యూనియన్‌పై దండయాత్రకు వొక నెలముందు పామీదత్తు ప్రధానమైన ప్రమాదం సోవియట్ సరిహద్దుల సమీపంలో కేంద్రీకరించబడిన బ్రిటిష్, జర్మన్ సైన్యాలనుండి కలుగుతున్నదని వ్రాశారు. ఈ అవకాశంలేకుండా చేయుటకు భారతదేశంలో కమ్యూనిస్టుల వూగిసలాటలాడే జాతీయ కాంగ్రెసుల యుద్ధ వ్యతిరేకతను ఎక్కువచేస్తే అట్టి ప్రయత్నానికి ప్రోత్సాహం లభించదు. కాంగ్రెసులో దాని నాయకత్వంపై ఎక్కువ ప్రభావాన్ని, శక్తిని సమకూర్చుకొనుట ప్రధానమైనా, ఐక్య సంఘటన, ఐక్యతల పరిధిలోనే అది జరగాలని కొమింటర్న్ విధానము, అయినా ఈ కాలంలో భారత కమ్యూనిస్టుపార్టీ ఈ విధానాన్నుండి దూరమై క్రిందినుండి అన్ని రాజకీయ పార్టీల నాయకత్వాలపై దాడిని కాంగ్రెసుపైనేగాదు, అతివాద పార్టీలపైకూడ దాడిని సాగించింది. బహుశా చివరకు ఐక్యతనుగాక,నాయకత్వాన్ని (హెజిమొని) పెంపొందించనెంచిందనేది స్పష్టమగుతున్నది.

యుద్ధం ప్రారంభమైన వెంటనే యుద్ధాన్ని జాతీయ విముక్తి విప్లవ యుద్ధం మార్చండనే సాంప్రదాయ లెనినిస్టు నినాదాన్నియిచ్చింది. ఈ నినాదం కమ్యూనిస్టు పార్టీ విధానాన్ని స్పష్టంచేస్తుంది. అక్టోబరు 1939లో కమ్యూనిస్టుపార్టీ పొలిట్ బ్యూరో ఆమోదించిన తీర్మానంలో యిది స్పష్టంచేయబడింది. తీర్మానం "సామ్రాజ్య వాద యుద్ధాన్ని" ఖండించింది. బ్రిటిష్ ప్రభుత్వానికి వలసలకు భారతదేశానికి స్వాతంత్ర్యాన్నిచ్చే కోరికలేదని, భారతప్రజల కర్తవ్యం యుద్ధ సంక్షోభాన్ని విప్లవాను కూలంగా చేయుట భారత స్వాతంత్ర్యాన్ని సాధించుటయని స్పష్టంచేసింది. ఈ కర్తవ్యం పార్టీ ఒక్కటే నిర్ణయించజాలదని యుద్ధవ్యతిరేక మహోద్యమాన్ని రూపొందించి జాతీయ కాంగ్రెసు పోరాట పంధాను చేబట్టునట్లు వొత్తిడి కలిగించాలంది. బ్రిటిష్‌వారితో రాజీమార్గాలు పరిశీలించుచున్నందుకు విమర్శించే ప్రజలలో బహిరంగంగా, తీవ్రంగా విమర్శించుచు కాంగ్రెసులోనే ఉండిపనిచేయుటకు తీర్మానించింది. ఈ విదంగా కాంగ్రెసు సంస్థ యంత్రాంగాన్నంతా విప్లవ కార్యాచరణకు వినియోగించాలనే ప్రయత్నం స్పష్టం. ఈ ఎత్తుగడ కాంగ్రెసు కమిటీలలోనే చొరవతీసుకొని పోరాటానికి తగిన ప్రయత్నాలనన్నిటిని చేయాలని పార్టీ ప్రకటించుటలో మరింత స్పష్టం. కాంగ్రెసు చేబట్టే సత్యాగ్రహ పోరాటాన్ని, ప్రజాతిరుగుబాటుగా మార్చాలనీ కోరింది. దీనికి కొంతకాలం పట్టుతుందని, కాంగ్రెసులో పార్టీ యెంత బలమైన స్థానాన్ని పొందగలుగుతుందో దానినిబట్టి వుంటుందని వివరించింది. అంత వరకు కాంగ్రెసు ఆమోదించని యే పోరాటాన్ని తొందరపడి చేబట్టరాదన్నది. అట్టిది 'సాహసిక వాద, తొందరపాటువై జాతీయ విప్లవశక్తులను నిర్వీర్యం చేస్తుందని వివరించింది. కాంగ్రెసు, సోషలిస్టుపార్టీ, పార్వర్డ్‌బ్లాకులు చేబట్టిన పోరాటాన్ని పార్టీ విధానం, ప్రకటన ఖండించింది.

భారత కమ్యూనిస్టుపార్టీ 1940 జనవరి 26 స్వాతంత్ర్యదినోత్సవానికి ఒక మానిఫెస్టోని ప్రకటించింది. అందులో నూతన విధానం, తిరుగుబాటుకు ఒక స్పష్టమైన పిలుపునిచ్చింది. "పెట్టుబడిదారి విధానం తీవ్ర సంక్షోభంలో పడిందని" ఐరోపా ప్రజాసామాన్యం "తిరుగుబాటు ఎర్రజండానెత్తారని" ప్రపంచ పరిస్థితిని గురించి చెప్పింది. ప్రపంచం తుఫాన్ అంచునవుంది. వారు సృష్టించిన తుఫాన్‌లో ప్రపంచ పెట్టుబడిదారి పాలకులు చిక్కుకొని, లక్షల ప్రజాసామాన్యాన్ని హతమార్చి బయట పడదలచుకొన్నారు........పాత ప్రపంచం కూలిపోతున్నది. భయంకరయుద్ధ మారణ హోమం, కరువుకాటకాలనుండి నూతన ప్రపంచం జన్మిస్తుంది. మనం ఒక చారిత్రక సంధికాలంలో వున్నాం[1]" అని మానిఫెస్టో ప్రకటించింది.

మానిఫెస్టో ప్రకారం భారత పరిస్థితి మహోన్నత ప్రజావెల్లువ విప్లవ అవకాశాలను కలిగివుంది. "బ్రిటన్ ఇంక యేమాత్రం పరిస్థితిని తన చేతులలోవుంచుకొని మన భవిష్యత్తును నిర్ణయించగల స్థితిలోలేదు. సామ్రాజ్యవాదం అదుపుచేయ

1. జె నె డి ఓవర్‌స్ట్రీట్, మార్షల్ విండ్‌మిల్లర్ (1958) కమ్యూనిజం ఇన్ ఇండియా. పే. 78లోని ఉదహరింపు. వరల్డ్‌న్యూస్ అండ్ వ్యూస్ ×× మార్చి 16, 1940 పే. 166-7 పేజీలనుండి రచయిత ఉదహరింపు.

లేనిస్థితిలో పురోగమిస్తున్నాం." మనపోరాటం "లక్షోపలక్షల భారతీయులను నిర్మాణ యుతంగా సమీకరించి, సామ్రాజ్యవాదపు కంచుకోటలను బ్రద్ధలు చేస్తుంది." అని ప్రకటిస్తూనే మానిఫెస్టో కాంగ్రెసుపై విశ్వాసాన్ని ప్రకటిస్తూ జాతీయ పోరాటానికి కాంగ్రెసే సాధనమని, "కాంగ్రెసు వాదులమై విజయానికి పొలిమేరలలో వున్నా గుర్తించాలి." అని కాంగ్రెసు నుండి వేరుపడక అదే కాలంలో కార్మిక, కర్షక, విద్యార్థుల పోరాటానికై కాంగ్రెసుపై ఒత్తిడితెచ్చుటకు ప్రజా ప్రదర్శనలు, వూరేగింపులు యాత్రలు సాగించి ప్రజా సమీకరణ కావించ పిలుపునిచ్చింది.

కాంగ్రెసులో వుండి, కాంగ్రెసుపై ఈ విధమైన విప్లవాత్మకమైన ఒత్తిడిని కమ్యూనిస్టుపార్టీ రూపొందించుయత్నంలో కాంగ్రెసు నుండి బయటకువచ్చే విధానం చేపట్టనందున తాను అనుకొనే విప్లవ పరిస్థితులను పూర్తిగ వినియోగించుటకు పరిమితులున్నందున, ప్రమాదకరమైనది. ఇతర అతివాద పార్టీలు కాంగ్రెసు సోషలిస్టు పార్టీ, పార్వర్డ్‌బ్లాకులు కాంగ్రెసును విడిచిపోవుటకు, ప్రధానంగా పోరాట పంథాకు సిద్ధంగా వున్నందున విప్లవ చొరవను కమ్యూనిస్టు పార్టీనుండి అవి చేజిక్కించుకొనగలవు ఈ అవకాశమున్నందుననే ఆ పార్టీలను బలహీనపరచుటకు చేయగలిగినదంతా చేస్తూ అదే కాలంలో కాంగ్రెసులోని మితవాద నాయకత్వాన్ని తొలగించి, ఆ స్థానాలను భర్తీచేయుట. కమ్యూనిస్ట్ లక్ష్యంగా, ఓవర్‌స్ట్రీట్ మార్షల్‌ను వాఖ్యానించినా, కమ్యూనిస్టులు 1930 దశకంలోనే కాంగ్రెసు నాయకత్వాన్ని ఆక్రమించుట, దానిని సోషలిస్టులు లేక కమ్యూనిస్టు సంస్థగా చేయాలనే పంథాను వదలిపేశారు: కమ్యూనిస్టులేకాక ఆ విధానాన్ని ప్రధానంగా నెంచిన సోషలిస్టులు ఆ విధానాన్ని వదలివేయుట జరిగింది. అంచేత వీరి అభిప్రాయంతో యేకీభవించజాలము.

## కమ్యూనిస్టులు అతివాద మిత్రులతో తెగ తెంపులు

డిశెంబరు 1939 చివరిలో కాంగ్రెసు సోషలిస్టుపార్టీ నాయకుడు జయప్రకాశ్ నారాయణ "వార్ (యుద్ధం) సర్క్యులర్ నం. 2. రాష్ట్రశాఖలకు, పార్టీ సభ్యులకు విడుదల చేశారు." గత కొద్ది వారాలుగ కమ్యునిస్టులు, సోషలిస్టు పార్టీలోని ఐక్యతను విచ్ఛిన్నం చేయుటకు చేయగలిగినదంతా చేశారు అని సర్క్యులర్‌లో తెలిపారు. సోషలిస్టు రాజకీయవిధానాలపై అసత్యప్రచారంచేస్తూ, గందరగోళం సృష్టిస్తూ తిరుగుబాటును లేవదీశారు. ఇందులో భాగంగా కాంగ్రెసు ఆమోదంలేకుండా అతివాద దుందుడుకు వివాదాన్ని అవలంబిస్తూ శాసనోల్లంఘనోద్యమాన్ని ప్రారంభించుటకు ప్రచారోద్యమాన్ని సాగిస్తున్నారు వాస్తవమేమంటే, కమ్యునిస్టుపార్టీవలెనె, సోషలిస్టుపార్టీ కాంగ్రెసు నిర్ణయాత్మక పోరాటాన్ని ప్రారంభించునట్లు చేయుటయే సోషలిస్టు పార్టి విధానమని జయప్రకాశ్‌నారాయణ వివరించారు.

జయప్రకాశ్ నారాయణ "భారత కమ్యూనిస్టు పార్టీ సోషలిస్ట్‌పార్టీ నగ్న శత్రువుగానే కాక, కలసి పనిచేసిన ప్రతి అభ్యుదయకర పార్టీ శత్రువుగా బయట పడింది" అని అన్నారు. మార్చి 1940 రాంఘర్‌సమావేశంలో కాంగ్రెసు సోషలిస్టు పార్టీ జాతీయ కార్యవర్గం ఆ కారణంచేత కమ్యూనిస్టులను సోషలిస్ట్ పార్టీనుంచి

బహిష్కరించుటకు నిర్ణయించింది. ఈ నిర్ణయం చాల ఆలస్యంగా జరిగింది. అప్పటికే సోషలిస్టుపార్టీలోని గణనీయమైన శాఖలు కమ్యూనిస్టుల నాయకత్వంలోనికి వెళ్ళాయి. కార్యవర్గపు క్రమశిక్షణాచర్య సోషలిస్టుపార్టీ ఆంధ్ర, తమిళనాడు, కేరళ రాష్ట్రశాఖలు పూర్తిగ కమ్యూనిస్టు ఆధ్వర్యంలోనికి వెళ్ళి కమ్యూనిస్టుపార్టీ శాఖ లయ్యాయి. దక్షిణాది శాఖలు దగ్గరి దగ్గరిగా అన్నీ కమ్యూనిస్టులవి అయ్యాయి. చాలమంది సోషలిస్టు పార్టీలోనివ్యక్తులు కొంతమంది కార్యవర్గ సభ్యులు రహస్యంగా కమ్యూనిస్టుపార్టీలో చేరినవారే. సోషలిస్టు నాయకుని మాటల ప్రకారం "సోషలిస్టు పార్టీ అంతా నాశనమైపోయింది"[1].

కమ్యూనిస్టులతో సహకారమైత్రిపై కాంగ్రెసు సోషలిస్టుపార్టీ అనుభవాన్ని జయప్రకాశ్‌నారాయణ "కమ్యూనిస్టుపార్టీలో అస్పష్టంగా ఐక్యత విషయమై మాటాడుట వాంఛనీయంకాదు" అని వ్రాశారు. కమ్యూనిస్టు ఉద్యమము అంతర్జాతీయ ఉద్యమానికి అనుబంధంగా ఉన్నందున భారత కమ్యూనిస్టులతో పొత్తు తప్పనిసరిగా అపజయం పొందుతుంది. భారత కమ్యూనిస్టుపార్టీ, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌శాఖ అయినందున మరోపార్టీతో అదికూడ ఇంటర్నేషనల్ అనుబంధ సంస్థ అయితేతప్ప వాస్తవంగా ఐక్యత నెరపజాలదు. ఏమైనా ఐక్యత అనునది తప్పుడు అవగాహన[2]" సోషలిస్టు భావనగావుంది,

అతివాద శక్తులన్నిటిని సమీకరించి ఐక్యపరచాలని సోవియట్ యూనియన్ నుండి గట్టి సూచనలున్నా కమ్యూనిస్టులు సోషలిస్టులతో తమ సంబంధాలలో విషమ పరిస్థితులు తీసుకొచ్చి రెండు పక్షాలమధ్య పచ్చిగడ్డి మండునట్లుచేశారు. అదేకాలంలో సుభాస్‌చంద్రబోసుకూడ తెగతెంపులు చేసుకొని విడిపోయారు. డిశెంబరు 1939 "అతివాద ఐక్యతాసమితి" సమావేశంలో వారు అంతకుముందు ఫార్వర్డ్‌బ్లాకు వారిని "విప్లవ ప్రతిఘాతకశక్తులు" అని చేసిన నిందను ఉపసంహరించుకొననందున ఆ సమితి విచ్ఛిన్నమైంది బెంగాల్ కాంగ్రెసు కమిటీలో మాత్రం మరికొన్ని మాసాలు కొనసాగారు. ఈ లోపల బోసు నాయకత్వంలోని బెంగాల్ రాష్ట్ర కాంగ్రెసు కమిటీని అఖిలభారత కాంగ్రెసు వర్కింగు కమిటి రద్దుచేసి అడ్‌హాక్ కమిటీని వేయగా కమ్యూనిస్టులు అందులో చేరారు. అదేమాసం చివరలో ఫార్వర్డ్‌బ్లాక్ రాజీ వ్యతిరేక కాన్ఫరెన్సు జరుపునపుడు కలిసి రాజాలకపోయారు. ఫలితంగా కమ్యూనిస్టు పార్టీ ఫార్వర్డ్‌బ్లాకు పార్టీలమధ్య సంబంధాలు పూర్తిగ తెగిపోయాయి.

ఆ విషయమై బోసు ప్రస్తావిస్తూ "అతివాద ఐక్యతా కమిటీని కమ్యూనిస్టులు ప్రచారానికి వేదికగా వుపయోగించుకొంటూ, ఫార్వర్డ్‌బ్లాకు వ్యతిరేకప్రచారం కావించారు. నేడు కమ్యూనిస్టులు సిగ్గువిడచి వారి సహచర మిత్రులను దూరంచేసుకొనగలిగారని" అన్నారని జెనెడి ఓవర్‌స్ట్రీటు ఉదహరించారు.

---

1. జెనెడి ఓవర్‌స్ట్రీట్, మార్షల్ విండ్‌మిల్లర్ (1958) కమ్యూనిజం ఇన్ ఇండియా పే. 181
2. అదే పే. 181.

కమ్యూనిస్టు పార్టీ బెంగాల్‌లో అఖిల భారత కాంగ్రెస్ పార్వర్డ్ బ్లాక్ నాయకుడయిన బోసు నాయకత్వంలో రాష్ట్రి కాంగ్రెసు వున్నట్లు ఎటువైపు అనే సందిగ్ధావస్థలో పడిపోయింది. బోసు, బెంగాల్ రాష్ట్రి కాంగ్రెసు, అఖిలభారత కాంగ్రెసు నాయకత్వాన్ని ఎదిరించినపుడు, యిద్దరిలో ఎవరినో వొకరిని ఎన్నుకోవలసి వచ్చినపుడు ప్రత్యామ్నాయ నాయకత్వాన్ని వెలుగుకుతెస్తున్న బోసుకు సహాయాన్ని అందించజాలక పోయింది. కాంగ్రెసుతో పొత్తును విడువజాలకపోయింది. కాంగ్రెసులోనే వుండి పనిజేయాలనే దానిని త్రోసిబుచ్చకుండా అంతర్జాతీయ అవగాహన ప్రకారం, అతివాద శక్తులన్నిటిని ఐక్యపరచి సమీకరించాలన్న దానిని ఆచరణలో పెట్టజాలకపోగా విరుద్ధంగా చేసింది.

అతివాద పార్టీలనుండి విడిపోయి భారత కమ్యూనిస్ట్ పార్టీ నాటి కాంగ్రెసు నాయకత్వంపై దుష్ప్రచారం మొదలుపెట్టారు. ఆ కాలపు ప్రకటనలో పి సి జోషి, "వాస్తవమైన జాతీయ పోరాటం మహోన్నత పోరాటం వాస్తవ నినాదమైంది. ఆచరణ ప్రతిపాదనైందని, దాన్ని పోరాటంగా మార్గదర్శకంగా నడుపనందున కాంగ్రెసు తీవ్రంగా విమర్శించబడింది" అన్నారు.

రాంఘర్ కాంగ్రెసు మహాసభలో భారత కమ్యూనిస్టుపార్టీ నూతన రాజకీయ విధాన ప్రకటన గావించింది. అదే కార్మికవర్గ పంధా యుద్ధ సంక్షోభాన్ని విప్లవ ప్రయోజనానికి ఉపయోగించమని ప్రకటన కోరింది. దానికి మొట్టమొదటి అడుగు దేశమంతా కౌలు, శిస్తు యిచ్చేదిలేదు అనే నినాదాల ఆచరణతోపాటు, అన్ని ప్రధాన పరిశ్రమలలో రాజకీయ సార్వజనీన సమ్మె, తరువాత జాతీయోధ్యమం నూతన అత్యున్నత దశ "సాయుధ తిరుగుబాటు" రాబోయే ఈ ప్రధాన పోరాటం, కార్మిక వర్గ పంథా ప్రకారం, పోలీసు, మిలటరీ కేంద్రాలపై ప్రజలు తుఫాన్‌లా విరుచుకపడుట, సాయుధ పోరాటాన్ని జాతీయ సైన్యం నగరాలలో, గ్రామీణ ప్రాంతాలలో సాగించుట ప్రభుత్వ యంత్రాంగాన్ని ద్వంసంచేయుట ప్రభుత్వ సాయుధ దళాలపై విస్తృత ప్రాంతాలలో పోరాడుట నిజమైన పోరాటంగ సూచించింది.

భారత కమ్యూనిస్టు పార్టీ గాంధీయన్ కాంగ్రెస్ నాయకత్వం యీ రకమైన పోరాటాన్ని చేబట్టునట్లు చేయుట అసాధ్యంకాన, అట్టి విప్లవ పంథాని ప్రచారంచేసి సాధ్యమైనంత తొందరగా ఆ నాయకత్వాన్ని తొలగించి, పరో నాయకత్వాన్ని యేర్పాటుచేయుట పార్టీ లక్ష్యం. రాంఘర్ కాంగ్రెసు మహాసభలో కమ్యూనిస్టు ప్రతినిధులు కె. యం. అష్రాఫ్, వి. డి. చిటాలెలు, కాంగ్రెసు ప్రధాన తీర్మానానికి సవరణలు ప్రతిపాదించుతు వెంటనే పోరాటాన్ని ప్రారంభించాలని బ్రిటిష్‌వారితో ఏ విధమైన రాజీకూడదని వ్యతిరేకించారు.

కమ్యూనిస్ట్ల "కార్మిక పంథా" ప్రకటించిన విధానం ప్రాతిపదికగా రాజకీయ సార్వజనీన సమ్మెకు పిలుపు మార్చిలో యిచ్చారు. బొంబాయిలో గుడ్డల మిల్లుల కార్మిక వర్గపు సమ్మెలో 1 లక్ష 50 వేల కార్మికులు చేరుటతో ప్రధాన పోరాటం ప్రారంభమైనట్లు తలచారు. ఆ సమ్మె పరిశ్రమనంతటిని చిన్నాభిన్నం చేసింది.

కమ్యూనిస్టులు గిర్నీకాంగార్ యూనియన్‌లోని కొంతమంది అతివాదులు యితర కార్మిక సంఘాలతో కలసి జరిపిన ఈ కార్మిక పోరాటం, వారు ఆశించే బ్రిటిష్‌వారిపై బహుముఖ పోరాటంలో భాగంగా నెంచబడింది.

**కమ్యూనిస్టులపై నిర్భంద చర్యలు తీవ్రమగుట**

కమ్యూనిస్టుల ఈ "కార్మిక పంథా" ప్రకటనలతో ప్రభుత్వ నిర్బంధచర్యల తీవ్రతయెక్కువైంది. ప్రకటించకపోయినా 'కాన్పూరు, మీరట్' నిర్బంధ చర్యలను మించిన తీవ్ర చర్యలు చేపట్టింది. మార్చి 1940 మొదట్లోనె గుడ్డలమిల్లుల సమ్మె ప్రారంభం అయినవెంటనే ప్రముఖ కార్మిక నాయకులు డాంగె, రణదివె, మీరాజ్‌కర్ ఫెరులేకర్, అయ్యంగార్‌లు అరెస్టుచేయబడ్డారు. కొద్దిరోజులలోనే అరెస్టులు వివిధ ప్రాంతాలకు విస్తరించి, సజ్జాద్‌జహీర్, ఘాటేలు అరెస్టయ్యారు. మార్చి 15 జాతీయ కాంగ్రెసు రాంఘర్ మహాసభకు ముందు కేంద్రప్రభుత్వం దేశరక్షణ చట్టం క్రింద కమ్యూనిస్టు నాయకులందరిని డిటెయిన్ చేయదలచిందని ప్రకటించింది. కమ్యూనిస్టులు దేశంలో శాంతి భద్రతలను రహస్య ప్రచారంలో నిర్మాణాత్మకంగా యుద్ధ ప్రయత్నాలను సమర్థవంతంగా కొనసాగించుటను భగ్నం చేస్తున్నారని ప్రభుత్వం ప్రకటించింది. మరి రెండు వారాలలో నింబకర్, పాట్కార్‌లు జైళ్ళపాలయ్యారు. కమ్యూనిస్టులుకాని ఆచార్యరంగా, రాహుల్ సాంకృత్యాయన్, జయప్రకాశ్‌నారాయణ్, స్వామి సహజానందసరస్వతిలను అరెస్టుచేశారు. గిర్నీకాంగార్ యూనియన్ అఖిలభారత కిసాన్‌సభ, అఖిలభారత ట్రేడు యూనియన్ కాంగ్రెసు నాయకత్వాలలో అధికభాగం భారత రాజకీయ రంగంనుండి అరెస్టులు జైళ్ళలోవేసి తొలగించివేశారు. ఏప్రిల్ చివరకు ఎంతమందిని అరెస్టుచేసి డిటెన్యూచేసంది తెలియకపోయినా 480 మంది కమ్యూనిస్టులను, కమ్యూనిస్టు మద్ధతుదారులను, కమ్యూనిస్ట్ అభిమానులను డిటెన్యూలుగ అరెస్టుచేశారు. చాలామందిని కమ్యూనిస్టుపార్టీ నిర్మాణాన్ని, దాని యంత్రాంగాన్ని నాశనంచేయుటకు అరెస్టులు చేశామని బ్రిటిష్ మినిష్టరు రెజినాల్డ్ మాగ్సివెల్ చెప్పారు. ఆ విధంగా కమ్యునిస్టుపార్టీ కేంద్ర నాయకత్వంలో అధిక భాగాన్ని అరెస్ట్‌చేసి, కమ్యూనిస్ట్‌పార్టీ యంత్రాంగాన్ని నాశనం చేశారు.

కమ్యునిస్టులు తమ ఎత్తుగడల ఫలితాలను, పెద్ద నష్టాలను అరెస్టులతోపొందారు. మొత్తం దేశరక్షణ చట్టంక్రింద అరెస్టయిన 180 మంది కమ్యునిస్టులు దేశంలో అరెస్టయినవారిలో మూడవవంతుగా వున్నారు. అధికార కమ్యునిస్ట్‌పార్టీ చరిత్ర పార్టీ రహస్య జీవితానికి ముందే ఏర్పాటులు చేసుకొననందున ప్రభుత్వం అరెస్టులు చేబట్టుట పార్టీని తీవ్రంగా బలహీనపడించని పేర్కొంది.

యూరపు యుద్ధపు ప్రారంభదినాలలో కమ్యునిస్టుపార్టీ రాజకీయ విధానం, అతివాద దుందుడుకు విధానంవైపు పయనించింది. పార్టీ చేబట్టిన రాజకీయ విధానం ప్రధానమైన మార్పులకు లోనయింది. పార్టీ విధానం అంతర్జాతీయ కమ్యునిస్టుపార్టీచే ఆమోదించబడలేదనుట స్పష్టం. ఈ విషయంలోఏమాత్రం అనుమానమున్నా కమ్యునిస్టుపార్టీ మే 1940లో ప్రకటించిన భారత కమ్యూనిస్టు మానిఫెస్టోతో విదితమగుతుంది.

భారత కమ్యూనిస్టు మానిఫెస్టోని కొమింటర్న్ ప్రకటించునపుడు ప్రపంచ విప్లవం ప్రారంభమైనదన్న పేరాను, యూరోపియన్ ప్రజా సామాన్యం విప్లవ ఎర్రజెండాను ఉన్నతంగా ఎగురవేశారన్న పేరాలనువదలివేసి. పోరాట జండానెగుర వేశారని మాత్రం ప్రకటించింది. విప్లవ పదజాలాన్ని వదలివేసింది. అంతేగాక కొమింటర్న్ మానిఫెస్టోలోని భారత పరిస్థితులను బ్రిటన్ యింకేమాత్రం అదుపు నందుంచలేదని, సామ్రాజ్యవాదపు కంచు కోటలను బ్రద్దలు చేయ టకు లక్షల ప్రజా సామాన్యం కదులుతున్నారనే మాటలనువదలవేసి, పోరాటం లక్షలప్రజలను విజయ మార్గంలో నడుపుతున్నదని మాత్రం ఉదహరించింది. అంతేగాక సామ్రాజ్యవాద ఏజంట్లు వివిధ మత జండాలక్రింద తలెత్తి ప్రజాపోరాటాలకు అడ్డుగోడలయ్యారని, ప్రధాన దాడిని దేశీయ అభివృద్ధి నిరోధకులపైగాక సామ్రాజ్యవాదంపైనే కేంద్రీక రించింది.

భారత కమ్యూనిస్టుపార్టీ జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులలో విప్లవ అవకా శాలను అతిగా అంచెనావేసి, అతివాదాన్ని చేబట్టుటకు హెచ్చరికగా కొమింటర్న్ కలుగచేసుకొని స్పష్టంచేసింది. కొమింటర్న్ పత్రిక అదే సంచికలో డి. ప్రతాప్ వ్యాసం జాతీయ విముక్తి ఉద్యమం, విస్తృతిని, వాడిని రోజు రోజుకు అభివృద్ధి చేస్తుందని "విప్లవం తప్పని పరిస్థితి" అను మాటలను వదలివేసింది. ప్రత్యామ్నా యంగా భారతదేశంలోని అన్ని అభ్యుదయకరశక్తులు బ్రిటిష్ సామ్రాజ్యవాద వ్యతి రేక పోరాటానికై "జాతీయ ఐక్య సంఘటనలో" సమీకరించబడుతున్నవని పేర్కొంది. రాజీవైఖరులు కొన్ని వున్నవని పేర్కొన్నా కాంగ్రెసు నాయకత్వాన్ని తీవ్ర విమర్శకు గురిచేయలేదు.

బ్రిటిష్ కమ్యూనిస్టులు గూడ భారతదేశంపై వారి రచనలలో భారత కమ్యూ నిస్టుపార్టీని హెచ్చరిస్తూనే వచ్చారు. "విప్లవం వచ్చి తలుపులు తట్టుతున్నదన్న" భారత కమ్యూనిస్టుల అవగాహనను వారు బలపరచలేదు. అంతేగాక ఒక వ్యాసంలో "అతివాద వర్గాలలోని అభిప్రాయ భేదాలను అధిగమించాలని సూచించారు". సోషలి స్టులు పార్వ్వర్డు బ్లాకులతో తిరిగి ఐక్యమవ్వాలన్నారు[1].

## భారత కమ్యూనిస్టు అతివాదవైఖరి కొమింటర్న్ ఆమోదముద్ర

అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం కొంత ఆలస్యంగానైనా భారత సమస్యను అతివాద పదజాలంతో 1940 మధ్యభాగంలో తిరిగి చర్చించ మొదలు పెట్టారు. ఈ నూతన విధానపు ప్రథమ సూచన 1940 జూన్‌లో కొమింటర్న్‌లోని వ్యాసం "ప్రజలలో గాంధీయిజంపైగల భ్రమలను" తుడిచివేయుట భారత కమ్యూ నిస్టు పార్టీ కర్తవ్యాలలో వొకటిగా యితర కర్తవ్యాలతోపాటు పేర్కొంది. గత కొద్ది సంవత్సరాలుగ వదలివేయబడిన యీ కర్తవ్యం తిరిగి పునరుద్ధరించబడింది. ఒక నెల తరువాత కోచరియాన్ట్స్, అధికారరీత్యా "బోల్షివిక్" పత్రికలోని వ్యా

1. ఓవర్‌స్ట్రీట్, మార్షల్ (1958) కమ్యూనిజం ఇన్ ఇండియా. పే. 183-5.

సంతో భారత కమ్యూనిస్టుపార్టీ వివిధ సమస్యలపై చేబట్టిన "అతివాద వైఖరికి" ఆమోదముద్ర లభించింది. వ్యాసం ఇండియాలో పరిస్థితి ముఖ్యంగా కలకత్తాలో "పోరాట దశకు చేరిందని" అంటూ భారత కమ్యునిస్ట్‌పార్టీ విప్లవం ఏజెండాలోనికి వచ్చిందన్న వైఖరిని "సామ్రాజ్యవాద యుద్ధాన్ని విప్లవ విముక్తి పోరాటంగా" చేయాలన్న అవగాహనను బలపరచింది. అందుకు కాంగ్రెసును బలపరచపోయినా కమ్యునిస్టులు జరిపిన సమ్మె పోరాటాలను పేర్కొంది.

కొమింటర్న్ యీ వ్యాసంలో జాతీయ కాంగ్రెసుపై తీవ్రదాడి చేసింది, ఇంతకుముందు కాంగ్రెసు నాయకత్వంలోని కొన్ని రాజీ అంశాలను నామమాత్రంగా వుదహరించేవారు. కాంగ్రెసు దేశీయాంగ విధానాన్ని వ్యాసం తీవ్రంగా విమర్శించింది. యుద్ధం ప్రారంభమైన నాటినుండి భారత పెట్టుబడిదారి వర్గ స్వార్థ ప్రయోజనాలను కాపాడుట కాంగ్రెసు చేస్తున్నదని అది పారిశ్రామిక బూర్జువా వర్గానికి ప్రాతినిధ్యం వహిస్తున్నదని విశ్లేషణ చేసింది.

అంతేగాక కొమింటర్న్ వ్యాసం పార్వర్డుబ్లాక్ ప్రజాభిమానాన్ని పొందలేదని సుబాస్ చంద్రబోసును దూరమగుటను ఆమోదించింది. కమ్యునిస్టులు "అతివాద దుందుడుకు సెక్టేరియన్ వాదులను" అనగా సోషలిస్టుపై తీవ్ర విమర్శనాదాడికి ఆమోదం తెలిపింది కాంగ్రెసుతో ఐక్యతను కొనసాగించాలని ఉదహరించినా, బూర్జువా కాంగ్రెసు నాయకత్వం పై విమర్శనను కొనసాగించుతు, ఇతర అతివాద పక్షాలను పోటీ నుండి తొలగించి, జాతీయోద్యంపై నాయకత్వం సంపాదించవలసివుంటుందని స్పష్టంచేసింది.

ఈ వ్యాసంతో అంతర్జాతీయ కమ్యునిస్టు నాయకత్వం భారత కమ్యునిస్టు పంథాను ఆమోదించింది అంతకుముందు అనుసరించుతున్న సమతూకపు విధానాన్ని వదలివేసి విప్లవ వెల్లువలో అధికారాన్ని పొందనెంచే భారత కమ్యునిస్టుపార్టీ ప్రయత్నానికి ఆశీస్సులనిచ్చింది [1]

అంతర్జాతీయ కమ్యునిస్ట్‌పార్టీ, అంతకంటే మరో మెట్టు ఎక్కువగా భారత దేశ రాజకీయ వాస్తవ పరిస్థితులను ఎంతటి అవాస్తవ, అశాస్త్రీయ అవగాహనో ఆశ్చర్యాన్ని కలుగచేయకమానదు.

స్వీయ మానసిక దృక్పథం, వాస్తవ పరిస్థితులను చూడజాలని దృష్టిమాంద్యాన్ని కలుగ జేస్తుందనుటలో సందేహంలేదు.

**భారత కమ్యూనిస్టు పార్టీ ఒంటరిదై వేరగుట**

అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ, భారత కమ్యూనిస్టుపార్టీ పంథాను బలపరచు స్థానానికి వచ్చుటతో భారత కమ్యూనిస్టు పార్టీ మరింత అతివాదంవైపు పయనించ మొదలిడినది.

---

1. జె నె డి ఓవర్‌స్ట్రీట్, మార్షల్ విండ్‌మిల్లర్ (1958) కమ్యూనిజం ఇన్ ఇండియా పే. 186

భారత కమ్యూనిస్టు పార్టీ 1940 అక్టోబరులో గాంధేయ నాయకత్వం "దిశాకోరు తనంపై" "ద్వంద్వ విధానాన్ని" అవలంభించుతు, జాతీయ పోరాటాన్ని నీరుగార్చుతు వీలైనా రాజీ బేరాలకు తగిన యేర్పాటులను,పరిస్థితులను రూపొందించుతు, పోరాటానికి వెన్నుపోటు పొడుస్తున్నదని ప్రకటన చేసింది. ప్రకటనలో కమ్యూనిస్ట్ పార్టీ కాంగ్రెసులోని మితవాద వర్గాలను నిరసించుటయేగాక, కాంగ్రెసులోని కొన్ని అతివాద వర్గాల మిత్రులను, నెహ్రూవాదులను సైతం తన శత్రువర్గాలలో చేర్చింది. "కమ్యూనిస్ట్‌లపై దాడి, కాంగ్రెసు వర్కింగు కమిటీకి విప్లవ ఆచ్ఛాదనలను తొడుగుట"[1] చేస్తున్నారని నెహ్రూని విమర్శించింది.

కాంగ్రెసువాదుల నుండి కమ్యూనిస్టులు యెంత దూరంగా వొంటరివారైపోయారో సెప్టెంబరులో బొంబెలో జరిగిన ఎఐసిసిలో ఏడుగురు కమ్యూనిస్టు ప్రతినిధులు, మిగతా సభ్యులనుండి చర్చలలో మొండిగా ప్రవర్తించుటను బట్టి తెలుస్తుంది కాంగ్రెసు అధికార తీర్మానానికి కమ్యూనిస్ట్‌లు 7 గురు మాత్రమే వ్యతిరేకంగా ఓటు చేశారు నెహ్రూ కోపంతో వ్యతిరేకుల పేర్లను నమోదు చేయమని కోరాడు. వార్తాపత్రికలన్నీ ఆ పేర్లను ప్రకటించాయి. కనీసం మరొక్కరైనా తీర్మానాన్ని వ్యతిరేకించలేదు.

పార్టీ 1940 చివరకు "అతివాదం" వైపుకు పూర్తిగ పయనించింది అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్‌లో అనేక సంవత్సరాలనుండి కమ్యూనిస్టులు, కమ్యూనిస్టేతరులు పనిచేస్తున్నారు. కాని 1940 డిసెంబరులో జరిగిన నాగపూరు విద్యార్థి ఫెడరేషన్ మహాసభలో, గాంధీ సూచనలను ఆమోదించుట అను సమస్యపై అంటే రాజకీయాలలో విద్యార్థులు పాల్గొనరాదు అను సమస్యపై ఫెడరేషను చీలిపోయింది. జాతీయవాదులు విద్యార్థి కాంగ్రెసును యేర్పాటుచేసుకొన్నారు. పార్టీ "అతివాద" విధానం స్టూడెంట్సు ఫెడరేషన్ అన్ని విధాలయిన అభిప్రాయాలుగలవారు వుండవలసిన విద్యార్థులందరి ప్రజా సంస్థగా వుండవలసింది ప్రజా సంస్థలలో అవలంభించవలసిన విధానాల ప్రశ్న వుదయించింది. వివిధ రాజకీయాభిప్రాయాలుగలవారు యెట్టి రాజకీయాభిప్రాయాలు లేకుండా విద్యార్థి, రైతు కార్మికుల సమస్యలపైమాత్రమే కలిసివచ్చేవారు ప్రజా సంస్థలో వుండజాలని పరిస్థితులు ప్రజా సంస్థలలో యేర్పడుట శోచనీయము.

కమ్యూనిస్టు విద్యార్థి ఫెడరేషన్ సమావేశానికి కె. యం. అష్రాఫ్, హిరన్ ముఖర్జీలు నాయకత్వం వహించారు. కమ్యూనిస్ట్‌లు మొట్టమొదటిసారి తమ జాతుల విధానాన్ని సూచనప్రాయంగా సూచించారు.

నెలరోజుల తరువాత జరిగిన అతివాద విద్యార్థుల సమావేశంలో భారత కమ్యూనిస్టుపార్టీ తీర్మానంలో కాంగ్రెసు మత సమస్యలను పరిష్కరించి అన్ని మత

1. బొంబాయి ఎ ఐ సి సి తరువాత అనే "కమ్యూనిస్టు ||" అక్టోబరు 1940 పే 1-3 "కమ్యునిజం ఇన్ ఇండియా"లో పే 187 లోని ఉదహరింపు.

సంస్థలమధ్య ఐక్యత పెంపొందించుటలో విఫలమైదని స్పష్టచేసింది. తీర్మానంలో ప్రాంతీయ రాష్ట్రాలు ఐచ్ఛికంగా పరస్పర విశ్వాసంతో ఫెడరేషనులో చేరతామని విశ్వాసంప్రకటించింది. భారతీయులందరు కలసి ఒకే జాతిగా కాక భారతదేశం బహు జాతులసమాఖ్యగా,అన్యాపదేశంగా చెప్పింది తీర్మానము.ఈ విధాన ప్రకటన పరిపక్వ దశలో జరగలేదని పార్టీని క్లిష్ట పరిస్థితులలో పెట్టిందని ఆ దుష్ఫలితాలను సరిచేయ ప్రయత్నించింది. సరియైన విధానాన్ని రూపొందించ ప్రయత్నించింది. ఇది అంతా పార్టీని పెద్ద గందరగోళంలో పడవేసింది. కమ్యూనిస్టుపార్టీ వెంటనే పొరపాటును సరిచేయ ప్రయత్నించింది.కమ్యూనిస్టుపార్టి విద్యార్థిరంగంలో ఐక్య సంఘటనా విధానాన్ని పునరుద్ధరించి ఒక నెల తరువాత నూతన విద్యార్థి ఫెడరేషన్ ఫరూఖి నాయకత్వంలో గాంధియన్ విద్యార్థి సంఘాలకి పునరైక్యతకై యీ సూచనలు చేసింది. ఈ సమస్య జాతీయ నాయకులు గాంధీతోసహా అందరివద్దకు వెళ్ళినా ఒక ఒప్పందానికి రాజీ రాలేకపోయారు.

కమ్యూనిస్టుపార్టీ రాజకీయ విధానం 1941 మొదటి భాగంలో యెట్టి మార్పు లేకుండా అదేవిధంగా కొనసాగింది. బ్రిటన్ సోవియట్ యూనియన్ పత్రికలలో భారత రాజకీయాలపై ఎట్టివ్యాఖ్యలు రాలేదు. యుద్ధంలోనికి సోవియట్‌పై జర్మనీ దండయాత్ర ఫలితంగా సహజంగానే తరువాత మార్పులు వచ్చాయి.

భారత కమ్యూనిస్టుపార్టీ భారతదేశ పరిస్థితి, పురోగమన మార్గాలపై తన అధ్యయనం, అవగాహనలకే ప్రధానంగా స్పందించుతు వ్యూహం, ఎత్తుగడలను రూపొందించుచున్నట్లు కన్పడుతున్నది. ఊహాగానంగాను, వాస్తవంగాను వున్న విప్లవ అవకాశాలను దేశీయాంతర్గత రాజకీయాలలోని పరిస్థితులనుబట్టి పురోగమించ తలపెట్టారు. అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం కొంత సరళీకృత దృక్పథాన్ని 1938 నుండి కొనసాగుతున్న దానిని అవలంబించుచున్నది. ఒక్క 1940 మధ్యలో మాత్రమే భారత కమ్యూనిస్టులు, అంతర్జాతీయ కమ్యూనిస్టుల అవగాహన వెలుగులోనికివచ్చాయి. అంతర్జాతీయ కమ్యూనిస్టుల అవగాహన మార్చుకొని భారత కమ్యూనిస్టుల అవగాహనకు చేరువైంది. అంతర్జాతీయ సోవియటు అవగాహనలో వచ్చిన మార్పుల ఫలితంగా యీ సమన్వయం ఎంతో అవసరమైంది.

ఫ్రాన్సు పతనం వ్యూహాత్మకంగా సోవియట్ యూనియన్‌లో ఏర్పడిన బలహీనతల కారణంగా బ్రిటన్ ఇంకా బలహీనపడుట, బయటనుండి సైనిక సామాగ్రిని తెచ్చుకొనుట, సోవియట్ ప్రయోజనాలకు విరుద్ధమైనది. అంచేత సోవియట్ యూనియన్ ఇండియాలో కమ్యూనిజాన్ని బలపరచనెంచింది. సామ్రాజ్యవాదానికి భిన్నంగా కాంగ్రెసును బలపరచే విధానానికి మారుగ కమ్యూనిస్టులనే బలపరచనెంచింది.

## ii

# ఆగస్టు క్విట్ ఇండియా ఉద్యమం

అతివేగంగా మారుతున్న ప్రపంచ యుద్ధ పరిస్థితి దేశ విదేశీయ పరిస్థితులలో అఖిల భారత కాంగ్రెసు కమిటీ మహాసభ ఆగష్టు 1942లో బొంబాయిలో జరిగింది.

ప్రపంచ ప్రజలు ఐక్యరాజ్య సమితి ఫాసిజానికి వ్యతిరేకంగా స్వాతంత్ర్యం కొరకు దాని పరిరక్షణకై జరుపుతున్న పోరాటాన్ని అభినందించుతు పరిస్థితులు విషమించుటకు ఆందోళన చెందుతున్నామని, ప్రపంచ ప్రజల, భారతప్రజల ప్రయోజనాలకు, బ్రిటన్ భారతదేశంలో తమ పాలనకు స్వస్తి చెప్పాలని కోరింది. బ్రిటన్ భారతదేశానికి స్వాతంత్ర్య ప్రధానంచేసిన ఆసియా, ఆఫ్రికా ప్రజలను ఉత్తేజపరచి యుద్ధ స్వభావంలో మార్పువచ్చి, ప్రపంచ ఐక్యరాజ్య సమితి విజయానికి దోహద పడగలదన్నది. భారతదేశం ఫెడరల్ రాజ్యాంగ విధానాన్ని అనుసరిస్తోంది. ఫెడరేషన్‌లోను రాష్ట్రాలకు విస్తార స్వపరిపాలనా ప్రతిపత్తిని కేంద్రంలోలేని శేష అధికారాలను యిస్తుంది.

ఈ ప్రమాదకర పరిస్థితులలో కాంగ్రెసు భారతదేశ స్వాతంత్ర్యం, దేశ రక్షణ ప్రధానంగా యెంచుతున్నది. భారతదేశాన్ని జపాను నుండి సమర్థవంతంగా రక్షించుటకు వీలులేని పరిస్థితులను బ్రిటన్ కల్పించుతున్నది. భారతదేశ స్వాతంత్ర్యం, జపాన్ ఆక్రమిత ప్రాంతాలలోని స్వాతంత్ర్య పోరాటాలను ఫాశిస్టు వ్యతిరేక పోరాటాలుగ ప్రభావితం చేస్తుంది.

జాతుల స్వాతంత్ర్యం, ప్రపంచ ఫెడరేషన్‌యేర్పాటు, ఫెడరేషన్ సైన్యాలు శాంతి పరిరక్షణ, నిరాయుధీకరణలకు తోడ్పడుతుంది.

ప్రపంచ భారతప్రజల ప్రయోజనాలకై బ్రిటన్‌కు, ఐక్యరాజ్య సమితికి మరో సారి కాంగ్రెసు విజ్ఞప్తి చేసింది. బానిస భారతదేశపు ప్రజల స్వాతంత్ర్య పోరాటాన్ని యింకెంతో కాలం ఆపివుంచుట అన్యాయమని కాంగ్రెసు స్పష్టంచేసింది స్వేచ్ఛా, స్వాతంత్ర్యం, సార్వభౌమాధికారానికై విస్తృత శాంతి, అహింసా పోరాటాన్ని కొనసాగించ తీర్మానించింది. గాంధీజీని నాయకత్వం వహించి స్వాతంత్ర్య పోరాటాన్ని నడుపమని కాంగ్రెసు కమిటీ కోరింది సుశిక్షితులైన సైనికులవలె గాంధీజీ సూచనలను పాటించమని కోరింది. కాంగ్రెసు పనిచేయజాలని సూచనలు యివ్వజాలని పరిస్థితులలో ప్రతి స్వాతంత్ర్యప్రియుడు శాంతి, అహింసా మార్గంలో తనకుతానే మార్గదర్శకుడై స్వాతంత్ర్య గమ్యానికి చేరాలి. స్వతంత్ర భారత దేశంలో ప్రభుత్వాధికారం కాంగ్రెసు ఆధ్వర్యంలోనే వుండాలనిలేదు, అది భారతీయు లందరికి చెందియుంటుంది. ఇదీ స్థూలంగా అఖిలభారత కాంగ్రెసు కమిటి 1942 ఆగష్టు "క్విట్ ఇండియా" తీర్మాన సారాంశం.

ఈ ఆగష్టు కాంగ్రెసు తీర్మానానికి 13గ్గురు కమ్యూనిస్ట్ ప్రతినిధులు సవరణలు ప్రతిపాదించి వివరించారు. ఈ సంక్షోభ పరిస్థితులలో ఆంగ్ల పాలనకు స్వస్తి చెప్పుటకు ముస్లిం లీగుతో సంయుక్త సంఘటన యేర్పాటుకు తాత్కాలిక జాతీయ ప్రభుత్వ మేర్పాటుకు కాంగ్రెసు హృదయపూర్వకంగా ప్రయత్నిస్తుంది. కాంగ్రెసు

స్వతంత్ర ఐక్య ఫెడరల్ రాజ్యాంగాన్ని వాగ్దానం చేస్తుంది. ఫెడరేషన్‌లో ఒకే భాష, చరిత్ర, సంస్కృతి, ఆర్థికజీవనవిధానం, మనోప్రవృత్తికలిగిన నిర్దిష్ట విస్తృత ప్రాంతంలోని ప్రజలు స్వతంత్ర ప్రతిపత్తిని గలిగిన స్వపరిపాలన ప్రాంతాలుగ యేర్పడవచ్చు. యిష్టములేనిచో విడిపోయే హక్కును కలిగివుంటారు. ఇది ఐక్య జాతీయ సంఘటనకు, తాత్కాలిక సంయుక్త జాతీయ ప్రభుత్వం యేర్పాటుకు తగిన భూమిక కాగలదు. కాంగ్రెసు, ముస్లింలీగులు ఐక్యతను సాధించి, అన్ని పార్టీలను కూడగట్టి, తాత్కాలిక ప్రభుత్వ యేర్పాటుకై భారత ప్రజానీకం యేకమయ్యారని బ్రిటన్‌కు, ఐక్యరాజ్యసమితికి తెలియజేయాలి. జాతీయ ప్రభుత్వం ఐక్యరాజ్యసమితి సైన్యాల సహాయంతో దురాక్రమణకు సాయుధ ప్రతిఘటన చేస్తుందని వాగ్దానం చేస్తుంది. దేశమంతటా కాంగ్రెసు, ముస్లింలీగులు సంయుక్తంగా జాతీయ ప్రభుత్వానికై ప్రచారోద్యమాన్ని ప్రజా సమీకరణతో ప్రజా ప్రదర్శనలు చేయాలి. అధికార మార్పిడిని వెంటనే చేయాలని, దురాక్రమణకు వ్యతిరేకంగా జాతీయ ప్రభుత్వం ప్రజలనుత్సాహపరచి సమాయత్తం చేస్తుంది. అట్టి అధికారప్రయత్నాలకు కాంగ్రెసు పూర్తి సహకారాన్ని యిస్తుందని తీర్మానంలో సవరణ ప్రతిపాదించబడింది.

తీర్మానంలోని పూర్వ భాగాలకు ఉత్తర భాగాలకు సమన్వయంలేదు. పూర్వ భాగంలోని ధ్యేయానికి, ఉత్తరభాగంలోని ఆచరణాంశాలకు వైరుధ్యం స్పష్టం. కమ్యూనిస్టు ప్రతినిధులు సవరణను వీగిపోవుటతో తీర్మానానికి వ్యతిరేకంగా వోటు చేశారు. సమావేశంలో యిది ఎవరూ జాతివ్యతిరేకమన సాహసించలేదు. గాంధీజీ ముగింపు ఉపన్యాసంలో "తీర్మానానికి వ్యతిరేకంగా వోటుచేసిన పదముగ్గురు మిత్రులను అభినందించుచున్నాను.నమ్మినదానికి ధైర్యంగా నిలబడుట శ్లాఘనీయం.అందరూ అలా నడుచుకొనాలి. అట్టి సూత్రబద్ధతను అలవర్చుకొనుటకు గత 50 సంవత్సరాలుగ ప్రయత్నించాను ఆ కారణంగా యీ మిత్రులపై ఖరి నన్నెంతో ఆనందపరచింది" అని ప్రస్తుతించారు.

గాంధీజీ వైస్రాయిని కలుసుకొననున్నానని, ఒప్పంద మార్గాలు అన్వేషిస్తానని ప్రకటించారు. ఆంగ్ల ప్రభుత్వం గాంధీజీకి అట్టి అవకాశాన్ని యివ్వక మూకుమ్మడిగా కాంగ్రెసు నాయకత్వాన్ని గాంధీజీతో అరెస్టుచేసి ప్రజలను రెచ్చగొట్టింది. సహజంగానే కోపోద్రిక్తులైన ప్రజలు నిరసన ప్రదర్శనలు, వూరేగింపులు, హర్తాళులు, బంద్‌లు చేశారు ప్రభుత్వం విచ్చలవిడిగా లాఠీచార్జీలు, కాల్పులు, హింసా, దౌర్జన్యకాండలతో ప్రజలను అణచివేయ ప్రయత్నించారు. తెల్లసైన్యాలనుదించి, రక్తపాతం జరిపింది. ప్రజలకు నాయకత్వంలేదు, ప్రభుత్వ దమనకాండకు వ్యతిరేకంగా, తీవ్రపోరాటాలలో పతిఘటన సాగించారు.

కాంగ్రెసు, సోషలిస్టుపార్టీ, ఫార్వర్డ్‌బ్లాక్, ఇతర అతివాద జాతీయ వాదులు 1942 ఉద్యమంలో వివిధ రాజకీయ అవగాహనలు కార్యక్రమాలలో పాల్గొనుటతో అంతకుముందు ఏర్పడుతున్న ఐక్య కార్యాచరణల ద్వారా,సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని తీవ్రతరంచేస్తూ ఐక్య జాతీయ సంఘటన, జాతీయ ప్రభుత్వనిర్మాణ ప్రయత్నం, నూతన పరిస్థితులలో, జాతీయోద్యమంలో చిన్నాభిన్నమైంది. కమ్యూనిస్టుపార్టీ ప్రధాన స్రవంతినుండి దూరమై వేరుపడి ఏటికి ఎదురీత ప్రారంభించింది.

జాతీయ సంక్షోభంలో జపాన్ బర్మాను ఆక్రమించి సరిహద్దులలో పొంచి యున్నప్పుడు జాతి రక్షణ జాతీయ ప్రభుత్వం అందుకు కాంగ్రెసు ముస్లింలీగుల సంయుక్త సంఘటన, దానికి గాంధీజీ, కాంగ్రెస్ నాయకుల విడుదలకై ప్రధానంగా కమ్యూనిస్టులు ప్రచార, ఆందోళనోద్యమాలను సాగించారు. నాయకులను విడుదల చేసి సంభాషణలు ప్రారంభించాలని అరెస్ట్ అయిన 3 గంటలలోనే కమ్యూనిస్టు పార్టీ నిర్భయంగా కోరింది. గాంధీజీ జాతీయ నాయకుల విడుదల కరువునుండి, ప్రజలను కాపాడుట, కాంగ్రెసు ముస్లింలీగుల ఐక్యత, జాతీయ ప్రభుత్వం, ప్రపంచ ఫాసిస్టు వ్యతిరేక ప్రజా పోరాటం నినాదాలుగ, నూతన ప్రాతిపదికలపై ఐక్య కార్యాచరణ, సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనకు ఫాశిస్టు వ్యతిరేక సంఘటన రూపాన్నియివ్వ ప్రయత్నించింది నిరాశ, నిస్పృహ వ్యాపించిన ప్రజలలో నూతనవెలుగుబాటనువేయ ప్రయత్నించి, పాక్షిక విజయాన్నే పొందుటకు కారణం జాతీయ వాదులకు పార్టీకి యేర్పడిన "గండి" లోతుపాతులను తక్కువగా అంచనా వేయుటగ చెప్పవచ్చు.

రాజకీయ ప్రతిష్టంబన పరిష్కారానికై గాంధీజీ కాంగ్రెసు నాయకుల విడుదల స్వయం నిర్ణయ సూత్రంపై కాంగ్రెసు-ముస్లిలీగుల ఒడంబడిక, సంయుక్త సంఘటన, జాతీయ ప్రభుత్వం యేర్పాటు ఐక్యరాజ్య సమితి ఆధ్వర్యంలో ఫాశిస్టు వ్యతిరేక సైనిక ప్రతిఘటనలు మార్గదర్శికమవ్వాలని కమ్యూనిస్టు పార్టీసూచించింది. గాంధీజీ నిరాహారదీక్ష కాలంలో రాజాజీ మరికొందరు మితవాద కాంగ్రెసు నాయకులు కాంగ్రెసు-ముస్లింలీగుల మధ్య సంభాషణలు జరగాలని సూచించారు. భారత సమస్య పరిష్కరించుటకు విదేశ ప్రభుత్వాల, ప్రజల ఒత్తిడి యెక్కువైంది. నిరాహారదీక్ష పురస్కరించుకొని గాంధీజీని కాంగ్రెసు అగ్రనాయకుల విడుదలతో గాంధీ-జిన్నాలు సంభాషణలు జరిపారు. పాకిస్తాన్ కోర్కెలోని ముస్లిం స్వాతంత్రేచ్ఛను వారిని సంయుక్త పోరాట సంఘటనలో పాత్రదారులగునట్లు చేయు ప్రయత్నం ప్రధాన సమస్యగా గాంధీజీ భారత స్వాతంత్ర్య పోరాటంలో భాగంగానే సంయుక్త పోరాటంలో పాకిస్తాన్‌ను సంపాదించవలసి వుంటుందని జిన్నా గుర్తించని కారణంగానే సంభాషణలు విఫలమయ్యాయి.

కమ్యూనిస్టుపార్టీ నిరాశకు తావివ్వక, గాంధీ-జిన్నాలు తిరిగి కలవాలంటూ పంచసూత్ర ప్రాతిపదికను సూచించింది. అవి 1) స్వాతంత్ర్యసాధనకై కాంగ్రెసు-ముస్లింలీగులు సంయుక్త సంఘటనగా ఏర్పడాలి. బ్రిటిష్ ప్రభుత్వంతో ఏ పార్టీవిడిగా ఒడంబడిక చేసుకొనరాదు. 2) ముస్లింలీగు లాహోర్ తీర్మానంను గుర్తించాలి 3) ప్రత్యేక రాజ్యాంగ నిర్మాణసభద్వారా పాకిస్తాన్‌రాజ్యం ఏర్పాటుకావాలి రాజ్యాంగ నిర్మాణసభ ముస్లిం, ముస్లింయేతర వయోజన ఓటుతో ఏర్పడాలి 4) పాకిస్తాన్ సరిహద్దుల ఏర్పాటు సూత్రాలు స్పష్టంగా నిర్వచింపబడాలి. ముస్లింల సర్వసత్తాకత ముస్లిమేతరుల హక్కుల నేలరాయుట, వారి ప్రాంతాలను కోరుటకాదు. ముస్లింలు స్పష్టమైన మెజారిటీ ప్రాంతాలతో రాజ్యాంగనిర్మాణసభద్వారా పాకిస్తాన్‌ను ఏర్పాటు చేసుకొనవచ్చు. ప్రధాన సరిహద్దు విస్తీర్ణ ప్రాంతాలను కోరేహక్కులేదు. సరిహద్దు వివరాలు పరస్పర ఒప్పందాలద్వారా పరిష్కరించుకొనాలి. 5) స్వతంత్ర దేశాలైన హిందూస్తాన్, పాకిస్తాన్‌లు పరస్పర రక్షణ, ఆర్థిక పునర్నిర్మాణ సహాయ ఒప్పందాలు చేసుకోవాలి.

ఒక నిర్దిష్ట విస్తార ప్రాంతంలో ఒకే భాష, సంస్కృతి, ఆర్థిక, సామాజిక జీవన సరళి, చారిత్రక వారసత్వం, మనోప్రవృత్తి, ఆచార వ్యవహారాలుగల ప్రజా సమూహం జాతి లేక ఉపజాతి భారత యూనియన్ లేక ఫెడరేషన్‌తో స్వపరిపాలన రాజ్యంగావుండే హక్కు, కోరితే విడిపోయే హక్కును గుర్తించాలి. స్వతంత్ర భారత్‌లో నేటి బ్రిటిష్‌రాష్ట్రాల సరిహద్దులు రద్దుచేయబడి యేర్పడిన ఆంధ్ర, తమిళ కేరళ, కర్నాటక, మహారాష్ట్ర, గుజరాత్, సింధు,పంజాబ్,బెంగాల్, ఒరిస్సా, అస్సాం సిక్కిస్తాన్, రాజస్తాన్, పాకిస్తాన్, హిందూస్తాన్‌లు స్వపరిపాలన రాజ్యాలు ఐచ్ఛికంగా కలియుటతో భారత యూనియన్ లేక ఫెడరేషన్ ఏర్పడుతుంది. ఇది ముస్లింలు అత్యధిక మెజారిటీగ వున్న స్వపరిపాలన రాజ్యాలుగ ఏర్పడి ఫెడరేషన్ లేక పాకిస్తాన్‌లుగ ఏర్పడుటను గుర్తిస్తుంది. కమ్యూనిస్టుపార్టీ విడిపోవుటను స్పష్టంగా వ్యతిరేకించినా, విడిపోయే హక్కును గుర్తించాలని స్పష్టంచేసినా అపోహలకు గురైంది. ఇదీ కమ్యూనిస్టుపార్టీ స్వయం నిర్ణయ సూత్రానికి యిచ్చిన భారతీయ వివరణ అనేది స్పష్టం. బహుశా విడిపోయే హక్కును గుర్తించి, ఒక అర్ధదశాబ్దం కలసివుండుటకు ప్రయత్నించి, విఫలులైతే, గుర్తించిన విడిపోయేహక్కును అమలు చేయుట అనునది చేర్చి యుండిన ఐక్య భారతదేశంగావుండుటకు మరికొన్ని అవకాశాలు, విశ్వాసాలు ఏర్పడేవి.

రాజీలేని ముస్లింలీగు పాకిస్తాన్ కోర్కె, స్వాతంత్ర్య పోరాటానికి విస్తృత పోరాట ప్రాతిపదిక, ప్రజాసమీకరణ లక్ష్యంతో కమ్యూనిస్టుపార్టీ మితవాద అవకాశవాదానికిలోనై, మతాన్ని జాతుల స్వరూప నిర్మాణంలో ఒక అంశమైనా, ముఖ్యంగా ముస్లింలు సిక్కుల విషయంలో అంగీకరించి, అణగద్రొక్కబడిన జాతుల స్వయం నిర్ణయాన్నిచేబట్టి లీగుననుసరించి, లీగువిడిపోయే ధోరణిని "ఎండగట్టుట"లో విఫలమైంది. మార్క్సిస్టు లెనినిస్టుజాతుల స్వయం నిర్ణయసూత్రాన్ని సంక్లిష్ట భారతదేశ పరిస్థితులకు అన్వయించుటలో కమ్యూనిస్టుపార్టీ అధ్యయన అవగాహనలను కొంత వరకు పెంపొందించినా, జారిస్టు రష్యాలో నిరంకుశదోపిడికి గురైన రష్యనేతర జాతులు యూనియన్‌లో కలసివుండే భావనను పెంపొందించి, బలాన్ని చేకూర్చుటకు, విడిపోయే హక్కుతో సహజాతుల స్వయం నిర్ణయ సూత్రాన్ని ప్రవచించి, లెనిన్ యూనియన్‌కు ప్రాధాన్యతనివ్వగా భారతకమ్యూనిస్టుపార్టీ భారతస్వాతంత్ర్య పోరాట ఐక్యత లక్ష్యంపేరుతో విడిపోయే హక్కును గుర్తించుటను ప్రచారంగావించింది. "ఐక్యంగా ఉండుటకే" ప్రాధాన్యత నిచ్చివుండవలసింది. అట్లుగాక యాంత్రికంగా స్వయం నిర్ణయ సూత్రాన్ని "విడిపోవుటకు" ప్రాధాన్యత లభించేవిధంగా, మతాల ప్రధాన ప్రాతిపదికయైన పాకిస్తాన్ విడిపోయేసిద్ధాంతానికి పరోక్షంగా సహాయపడునట్లు చేసిన వివరణ అవకాశవాద తప్పిదము అనుట నిర్వివాదాంశము.

రెండవది ఆగష్టు వుద్యమంపై కమ్యూనిస్టుల దృక్పథం, ఆచరణ ప్రధానంగా ప్రశ్నార్థకంగానే వుంది. ఆగష్టు తీర్మానాన్ని వ్యతిరేకించుట మౌలికంగా సరియైనదే. అయినా, గాంధీజీ నాయకుల అరెస్టులతో ప్రజాసమూహాలు, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలు సాగించునపుడు కమ్యూనిస్టులు పాల్గొని వుండవలసింది. కమ్యూనిస్టుల

నాయకత్వంలోని కార్మికవర్గం, తదితర ప్రజాసామాన్యం సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలు సాగించునపుడు ప్రజలతో కలిసి పోరాడవలసింది. దశాబ్దాల తరువాత కమ్యూనిస్టులలోని అన్నివర్గాలు ఈ తప్పిదాన్ని ఒప్పుకొనుట ముదావహము.

జాతీయ కాంగ్రెసు నాయకత్వపు తటస్థత, షరతులతో కూడిన సహాయం సామ్రాజ్యవాద వ్యతిరేకతయేగాని ఫాశిస్టు అనుకూలత యేమాత్రం కాజాలదు. ఇక్కడ రెండు విషయాలు గుర్తుపెట్టుకొనాలి. ఒకటి దేశం బానిసత్వంలోవుంది. రెండు ఫాశిస్టు ప్రమాదం వాస్తవమే అయినా అది ప్రత్యక్షపీడనకాలేదు, ఆ భేదాన్ని పరిగణలోనికి తీసుకొని ఎత్తుగడల రూపొందించుటలోని వైఫల్యమే పార్టీపొరపాటు లకు కారణంగా కన్పించుతుంది. ఫాశిస్టు వ్యతిరేక పోరాటాన్ని జాతీయశక్తులతో కలిసే చేయగలుగుతుందికాని, పార్టీ యేకాకిగా సమర్థవంతంగా చేయజాలదు గ్రామాలలో సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటవాడిని కాపాడుకొంటూనే ఫాశిస్టు వ్యతిరేక పోరాటాలను సాగించగలదు రెండు పోరాటాలను సంలీనం చేయవలసి వుంటుందనే ఆలోచనలేమియే పార్టీ వైఫల్యానికి కారణంగా కన్పించుచున్నది.

## III

## ప్రపంచ ప్రజాయుద్ధం, కమ్యూనిస్టులు

నాజీ జర్మనీ సోవియట్ యూనియన్‌పై దండయాత్ర ప్రారంభించుటతో యుద్ధనైజంలో మార్పు వచ్చింది. ఈ మార్పు ప్రధానమైనదేగాక మౌలిక మార్పు. అప్పటివరకు యుద్ధంలో చేరకుండా తటస్థంగావున్న సోవియట్ యూనియన్ సామ్రాజ్యవాద కూటమియైన ఇంగ్లండు, ఫ్రాంసు, అమెరికా తదితర పెట్టుబడిదారి దేశాలతో కలసి; మరో బలమైన పెట్టుబడిదారి దేశం, ప్రపంచాన్ని పాదాక్రాంతం చేసుకొనతలచుచున్న నాజీ జర్మనీ నాయకత్వంలోని ఇటలీ, జపాన్‌ల కూటమితో పోరాడవలసి వచ్చింది.

సోవియట్ యూనియన్‌పై ఫాశిస్టు జర్మనీ సైనిక దండయాత్ర భారతదేశ ప్రజలలో కోపోద్రేకాల ప్రతి స్పందన కలిగించింది. కాంగ్రెసు వర్కింగు కమిటి యీ అభిప్రాయాలకు తీర్మానంలో రూపమిచ్చి ప్రకటించింది. సోవియట్ యూనియన్ మానవ, సాంస్కృతిక, సామాజిక విలువలకు గొప్ప ప్రాధాన్యత నిచ్చింది. వారి మాతృదేశ రక్షణకై సోవియట్ ప్రజలు ప్రదర్శించుచున్న త్యాగాన్ని, ధైర్య, సాహసాలను ప్రశంసిస్తూ, హృదయపూర్వక సానుభూతిని తెలియజేసింది.

జాతీయ కాంగ్రెసు సోవియట్ యెడల చూపిన సానుభూతిని, బ్రిటన్ అతిగా అంచెనావేసి, యుద్ధం మొదలకూడ కాంగ్రెసు తన విధానాన్ని మార్చుకొంటుందని తలచింది, జాతీయ భావాలను తక్కువగా అంచెనా వేసింది. "ఇండియా, ఇంగ్లండుల మధ్య సంబంధాలలో జాతీయవర్గాలలో మార్పులేదని" నెహ్రూ చెప్పారు. భారత ప్రజల అభిప్రాయం, భారతీయుల లక్ష్యమైన స్వాతంత్ర్యేచ్ఛను, భరతఖండము వెలుపల జరిగే యే ఘటనలు సడలించ జాలకపోయాయి.

**అంతర్జాతీయ, కమ్యూనిస్టుల స్పందనలు :**

యుద్ధంలో సోవియట్ యూనియన్ ప్రవేశించిన అనేక మాసాలవరకు సోవియట్ యూనియన్, ఇంగ్లండులలోని కమ్యూనిస్టుల పత్రికలు భారతదేశంలో అవలంభించవలసిన రాజకీయ విధానాలపై ఎట్టి వ్యాఖ్యలు చేయలేదు. అయినా, అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ సాధారణ పంథా, వ్యూహాలక్ష్యం, కమ్యూనిస్టుల ఎత్తుగడలు ప్రధానంగా సోవియట్ రక్షణ అనేది స్పష్టంగానే వుంది. కమ్యూనిస్టుల వ్యూహం, ఎత్తుగడలు ప్రతి దేశంలో అవి ఎంతవరకు సోవియట్ అంత్య విజయానికి తోడ్పడుతున్నవో అనే విశ్లేషణకే ప్రాధాన్యత యిచ్చారు గాని, ఆయా దేశాలలో ప్రజోద్యమాల, ప్రజల, వలస దేశాల స్వాతంత్ర్యోద్యమాలు, వాటి సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలను పెంపొందించుటలో ప్రత్యక్షంగా పెంపొందే కమ్యూనిస్టు బలాన్ని తక్కువగా అంచెనావేసి, ఆ పోరాటాలవలన పాశిస్టు వ్యతిరేక పోరాటం బలపడుటను అతిగా అంచెనావేయుట, కమ్యూనిస్టు వుద్యమం మొత్తంగా జరిగింది. పాశిజం ప్రత్యక్ష సమస్యయైన దేశాలలో పాశిస్టు వ్యతిరేక పోరాటం, సహజంగానే అన్నిటికంటె ప్రాధాన్యత తప్పనిసరి జీవన్మరణ పోరాటమగుతుంది. సామ్రాజ్యవాదం ప్రత్యక్షపీడన కొనసాగించుతున్నపుడు, పరోక్షంగా పాశిస్ట్ ప్రమాదం వుండినపుడు సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం సడలించకుండా విముక్తి పోరాటాలను వలస దేశాలలో తీవ్రతరం చేసిన ప్రజాశక్తుల బలం యినుమడించుతుంది, అంటే అర్థం పాశిస్ట్ వ్యతిరేకశక్తులు బలపడుటయే అగుతుంది కాని బలహీనపడవు. అయితే సామ్రాజ్యవాదం బలహీనపడిన మేరకు పాశిస్ట్ వ్యతిరేకశక్తుల ప్రజాబలం పెరుగుతుంది, కాని మొత్తంగా పాశిజం బలహీనపడుతుంది కాని బలపడదు. వ్యూహం రీత్యా పాసిస్టు వ్యతిరేక శక్తుల ఐక్యత పెంపొందించి బలపరచుట సరియైనదే అయితే అదే కాలంలో సామ్రాజ్యవాద శక్తులు బలపడే ఎత్తుగడలకంటే ప్రజాశక్తుల బలాన్ని పెంచే ఎత్తుగడలు అవలంభించుటలోనే "ప్రజాయుద్ధ పంధాను" అవగాహన చేసుకొని వుండవలసింది. అట్లుగాక పాశిజానికి దూరంగా వున్న ప్రాంతాలలోగూడ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని మొద్దు పారించుట సరియైన ఎత్తుగడ కాజాలదు

బ్రిటిష్ కమ్యూనిస్టు పత్రిక లేబర్ మంత్లీలో నూతన పంధా మౌలిక అవగాహన జులై-ఆగస్టులలో యివ్వబడింది. బ్రిటిష్ కామ్రేడ్స్, వొక రచయిత నిర్మొఖమాటంగా, లెనినిస్టు, మార్క్సిస్టు సాంప్రదాయకంగా యుద్ధాన్ని విప్లవంగా మార్చే దానిని యాంత్రికంగా అనుసరించరాదన్నారు. "ఇతర సామ్రాజ్యవాద దేశాలలో కార్మికవర్గ ప్రధాన కర్తవ్యం. సోవియట్ యూనియన్ రక్షణ, సాధారణంగా మానవత్వ రక్షణచేయాలి. కార్మికవర్గ పోరాటంలోని ప్రతి అంశము అత్యున్నత పోరాటమైన సోవియట్ విజయాన్ని సాధించే పోరాటానికి అనుబంధంగా ప్రతిదేశంలోని పోరాటం వుండా"లని స్పష్టంచేసింది.

ఈ అత్యున్నత లక్ష్య ఆమోదం, సోవియట్ యూనియన్ స్వచ్ఛందంగా ప్రతిదేశ ప్రజల ప్రయోజనాలను దృష్టిలోవుంచుకొంటుందని మౌలిక అవగాహనతో

జరిగింది. బ్రిటిష్ కమ్యూనిస్టు "బ్రిటిష్ సామ్రాజ్యవాదుల ప్రయోజనాలు తాత్కాలికంగా సోవియట్ యూనియన్ ప్రయోజనాలతో కలసిపోయాయి. అంచేత బ్రిటిష్ ప్రజల ప్రయోజనాలతోకూడ కలసిపోయాయి[1]"

భారతదేశ సమస్య చివరకు సెప్టెంబరులో రష్యన్, బ్రిటిష్ కమ్యూనిస్టులు చేసిన ప్రకటన భారతదేశము వలసగా వున్నప్పటికి భారత కమ్యూనిస్టులు బ్రిటిషు సామ్రాజ్యవాద ప్రభుత్వాన్ని అది సోవియట్ యూనియన్‌తో కలసి పోరాడుతున్నంతవరకు బలపరచాలి. సూత్రబద్ధమైనరీతిగా కమ్యూనిస్టు అవగాహనను పరిమితి షరతులు లేకుండా అమలుచేశారు బోల్షివిక్ పేపరు సెప్టెంబరులో "నేటి యుద్ధంలో బ్రిటిష్ సామ్రాజ్యపుపాత్ర" అనే ఐ. లెమిన్ వ్యాసం ప్రకటించారు. అది బ్రిటిష్ వలసదేశాలకు మాత్రమే, ప్రత్యేకంగా భారతదేశానికి సంబంధించి యుద్ధకాలంలో ప్రకటించిన ఒకేవొక వ్యాసం భారతదేశ సమస్యపై భరతవాక్యంగా వ్రాయబడిందని చెప్పవచ్చు. అందులో లెమిన్ బ్రిటిషు సామ్రాజ్యానికి సోవియట్ యూనియన్‌తో పాటు సమాన అత్యున్నత స్థానాన్ని, ప్రజాస్వామ్య మహా సంకీర్ణకూటమిలో యిచ్చారు. సూచనప్రాయంగానైనా సంకీర్ణకూటమిలో చేరుటకు భారతదేశం స్వాతంత్రాన్ని కోరవచ్చని ప్రస్తావించలేదు. భారతదేశంపై అతని అవగాహన అంతా అధినివేశ ప్రతిపత్తిగల దేశాల విషయంలోలాగవుంది. భారతదేశానికి యింకా స్వాతంత్ర్యం రాలేదన్న విషయం కప్పిపెట్టినట్లుగా వుంది. లెమిన్ "భారతదేశం మహత్తర పాత్ర యుద్ధంలో వహించాలి. అందుకు భారతీయులు ఉత్సాహంగా ఆతురతపడుతున్నారని నొక్కిచెప్పాడు[2]. యుద్ధకాలంలో సమాచార నిమిత్తం బ్రిటిష్ సామ్రాజ్యం అనే పుస్తకంలో భారతదేశ విషయమై "విస్తృత భారత ప్రజానీకం బ్రిటిష్ ప్రభుత్వ సైనికచర్యలను బలపరచుటకు సంసిద్ధుగావున్నారని[3]" పేర్కొంది.

ఈ వైఖరిని వివరించేపని బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ నాయకుడు పామీదత్తు సెప్టెంబరు లేబర్ మంత్లిలో భారత కమ్యూనిస్టులకు వారు బ్రిటిష్‌ప్రభుత్వపు యుద్ధ ప్రయత్నాలకు షరతులు లేని మద్దతునివ్వాలని, స్వాతంత్ర్యాన్ని సంపాదించే దానిపై ఆధారపడరాదని స్పష్టంచేశారు.

దత్తు భారతదేశానికి కొన్ని రాయితీలనివ్వాలంటూ కోరుతునే వున్నారు. నెహూర్, తదితర రాజకీయనాయకులను విడుదల చేయాలని వారితో నేరుగా సంప్రదింపులు జరపాలని దత్తు కోరుతునే వున్నారు. అయితే యివన్ని భారతదేశప్రజలు యుద్ధంలో పాల్గొనుటను వారి వ్యతిరేకతను, అడ్డంకులను తగ్గించుటకొరకు ఉద్దేశించబడినవి.

---

1. లేబర్‌మంత్లి, XXIII (ఆగస్టు 1941) పే 361-2" కమ్యూనిజం ఇన్ ఇండియాలోని ఉదాహరింపు సమాచారము.
2. ఓవర్‌స్ట్రీట్, మార్షల్ (1958) కమ్యూనిజం ఇన్ ఇండియా పే. 192-3లలో ఉదాహరింపులు.
3. అదే పే. 194

భారత కమ్యునిస్టుపార్టీ అన్ని లక్ష్యాలు, ధ్యేయాలు వదలివేసి బ్రిటిష్ పాలకుల అవసరాలకు అన్ని వనరులను సమీకరించాలని అదే సోవియట్ యూనియన్ విజయాన్ని చేకూర్చుతుందని సలహా యివ్వబడింది. యుద్ధంలో విప్లవ పరిణామాలు యిమిడి వున్నవనే సూచనను సైతము దత్తు యిచ్చుటలో విఫలులయ్యారు[1].

## భారతకమ్యూనిస్టుపార్టీలో చర్చలు

జాతీయ అంతర్జాతీయ పరిస్థితులు జూన్ 1941 తరువాత భారత కమ్యూనిస్టు పార్టీలో కలుగజేసినంతటి తర్జన భర్జనలు గతంలో ఎప్పుడూ యేది కలుగజేసివుండలేదు. అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ యుద్ధాన్నిబలపరచాలని స్పష్టంచేసింది. భారతదేశ స్వాతంత్ర్యం లేదా అనే ప్రశ్నతో సంబంధంలేకుండా యుద్ధాన్ని బలపరచాలని కొమింటరను, యుద్ధంవున్నా యుద్ధం లేకపోయినా భారత స్వాతంత్ర్య కోరికను బలపరచాలని జాతీయ కాంగ్రెసు, భారతదేశంలో ఏ రాజకీయ పార్టీయైనా సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని తాత్కాలికంగా ఏ పేరుతో సడలించినా అప్రదిష్టపాలు కాకతప్పదు.

నాడు వాస్తవానికి ఆచరణలో రెండు కమ్యూనిస్టుపార్టీలున్నవి. అనుభవం కలిగిన పార్టీ అగ్రనాయకత్వం 1940-41లో అరెస్టు అయి రాజస్థాన్‌లోని ఢియోలీ కాంపు జైలులోవుంది. బయట నిర్మాణం చిన్నాభిన్నమైన రహస్య కమ్యూనిస్టుపార్టీ జోషీ నాయకత్వంలో వుంది. ఈ రెండుపక్షాలు ఒకదానికొకటి సంబంధంలేకుండా దూరమైవున్నవి. యుద్ధంలో సోవియట్ యూనియన్ ప్రవేశించిన వెంటనే పార్టీ విధానాన్ని దేనికదే పునర్విచారణ చేపట్టాయి. విడివిడిగాజరిగిన చర్చలు, నిర్ణయాలు రెండు రాజకీయ విధానాలుగ రూపొందాయి.

ఢియోలీ జైలులో పార్టీ నిర్మాతలైన డాంగే, ముజఫర్ అహమ్మద్, మిరాజ్‌కర్‌లు, యువనాయకులైన రణదివె, అజయ్‌ఘోష్‌లువున్నారు, సోవియట్‌పై దండయాత్రపై వీరి రాజకీయ స్పందనలు వెంటనే యెలా వున్నది అంతగా తెలియక పోయినా వారి ఆందోళనా పరిస్థితిని అర్థంచేసుకొనవచ్చు. ఉద్రేక రహితంగా వారు చర్చలు జరిపి, బ్రిటిష్ ప్రభుత్వానికి యుద్ధంలో పూర్తిసహాయంచేయుట, సోవియట్ రక్షణకు తోడ్పడుతుందనీ అవగాహన బలంగావున్నట్లు కన్పించుచున్నది. ఏమైనా ఢియోలీజైలులోని వారి సిద్ధాంతం "ప్రజాయుద్ధ వినాదాన్ని" రూపొందించి రహస్యంగా బయటవున్న పార్టీనాయకత్వానికి పంపించారు.

ఈ ఢియోలీ "ప్రజాయుద్ధపు" సిద్ధాంతం పార్టీ రహస్య పత్రికలో అక్టోబరు 1941లోగాని ప్రచారంలోనికి రాలేదు. ఢియోలీజైలులోని కమ్యూనిస్టు అగ్రనాయకత్వం ఈ నిర్ణయానికి వచ్చుటకు తీవ్ర వాగ్వివాదాలను యెదుర్కొనవలసి వచ్చివుంటుందనుటలో సందేహంలేదు. ఢియోలీ డిటెన్యూల జైలుకాంపులో ఒక్క కమ్యూ

---

1. ఓవర్ స్ట్రీట్, మార్షల్ (1958) కమ్యునిజం ఇన్ ఇండియా పే 194 లో ఉదహరింపు.

నిస్టులేగాదు అనేకమంది కాంగ్రెసువాదులు, సోషలిస్టులు వున్నారు. బ్రిటిష్ అధికారులకు వ్యతిరేకంగా నవంబరులో జరిగిన నిరాహారదీక్షలో జాతీయ వాదులతో పాటు కమ్యూనిస్టులు కొందరు పాల్గొన్నారు. బహుశా థియోలీ సిద్ధాంతాన్ని ఆమోదించిన కొందరు తమ అసమ్మతిని పరోక్షంగా ఆ విధంగా వెల్లడించి యుండవచ్చు, లేదా జాతీయవాదులనుండి పూర్తిగ వేరుపడిపోతామనే ఉద్దేశ్యముతోనైనా కావచ్చు[1].

థియోలీ "ప్రజాయుద్ధ" సిద్ధాంతాన్ని ఆమోదించినవారు అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంపై విశ్వాసం గలవారు. వీరు దగ్గరిదగ్గరిగా సోవియట్ బ్రిటిష్ కమ్యూనిస్టులు ఈ అవగాహనకువచ్చిన కాలంలో వీరూ స్వతంత్రంగా అదే అవగాహనకువచ్చారు. వారి నిర్ణయం యాధృచ్ఛిక,స్వచ్ఛంద నిర్ణయం. అయితే లేబర్ మంత్లిలో వచ్చే సమాచారం నూతన విధానంపై కొంత వెలుగును ప్రసరించియుండ వచ్చును. బ్రిటిష్ అధికారులు అట్టి సమాచారాన్ని కమ్యూనిస్టు ఖైదీలకు అందించుటలో ఉపయోగముంటుందని తలచి వుండవచ్చును.

బయటవుండి రహస్యంగా పనిచేస్తున్న కమ్యూనిస్టువర్గాలు స్పందించినతీరు పూర్తిభిన్నంగావుంది. వారి ప్రథమ స్పందన జాతీయ కాంగ్రెసు వాదుల స్పందనల ననుసరించేవుంది. రహస్యపార్టీ థియోలీ జైలులోవున్న కమ్యూనిస్టు వర్గాలకంటె తేలికగా స్థానిక లేక జాతీయ వాతావరణ ప్రభావానికి యెక్కువగాలోనైనట్లు కన్పించుచున్నది. యుద్ధలక్ష్యం సోవియట్ యూనియన్ విజయంకన్నా ప్రపంచ విస్తృతి కలది. "ప్రపంచ ప్రజాసామాన్య విజయం" ఒక్కమాటలో ఫాసిజం నుండేకాక పాత ప్రపంచ విధానంనుండి కూడ విముక్తిని కోరుతుంది. జులై పొలిట్‌బ్యురో తీర్మానం ప్రకారం భారత కమ్యూనిస్టుపార్టీ "సామ్రాజ్యవాద యుద్ధాన్ని విప్లవ విముక్తి యుద్ధంగా మార్చుతుంది."

కారణమేమైనా నవంబరు కమ్యూనిస్టుపార్టీలో తిరిగి సామ్రాజ్యవాద వ్యతిరేక విధానం పునఃపరిశీలించబడి కిసాన్‌సభలో పనిచేస్తున్న కమ్యూనిస్టులు నాగపూర్ కిసాన్‌సభ, స్టాండింగు కమిటి సమావేశంలో "ప్రజాయుద్ధ" సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టారు. కాని దానిని ముందుకు తీసుకువెళ్ళే ప్రయత్నం చేయలేదు. భారత దేశానికి స్వాతంత్ర్యం వస్తేనే యుద్ధం ప్రజాయుద్ధమౌతుందని ప్రకటించింది, మరో నెల గడిచేటప్పటికి సామ్రాజ్యవాద వ్యతిరేక వైఖరికి స్వస్తిచెప్పి డిశెంబరు 15న పొలిట్‌బ్యురో "ప్రజాయుద్ధ పంథా"ని ఆమోదించి, అంతర్జాతీయ కమ్యూనిస్టు అధికార విధానం మార్గంలో పడింది.

కమ్యూనిస్ట్‌పార్టీ యీ రాజకీయ విధాన పరిణామక్రమాన్ని పరిశీలించితే జాతీయ, అంతర్జాతీయ రాజకీయ ప్రభావాలు కమ్యూనిస్టుపార్టీ రాజకీయ విధాన నిర్ణయంలో పనిచేశాయి. అంత్య నిర్ణయంలో అంతర్జాతీయ కమ్యూనిస్టు ప్రభావపు

1. నిరాహారదీక్షపై సమాచారాన్ని ఓవర్‌స్ట్రీటు, మార్షలులు 1941 నవంబరు 6. పే. 6, 10, పే. 2, 12, పే. 8, 25తేది పే. 2, హిందూ (మద్రాసు) నుండి సేకరించారు.

ఆధిక్యత స్పష్టమౌతుంది. తాత్కాలికంగా మాస్కో, లండన్ కమ్యూనిస్టు మార్గ దర్శకత్వం లేనప్పుడుకూడ పార్టీలో రెండువైఖరులు స్పష్టంగా కన్పించాయి. ఒక వైఖరి ప్రధానంగా అనుభవం కలిగిన ఆచరణ అగ్రనాయకత్వం, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంపైగల విశ్వాసంతో వివేచనాత్మకంగా ప్రజా యుద్ధ పంధాను ఆమోదించింది. వారు జైలులో వున్నందున వారు వెంటనే ఆచరణలో పెట్టవలసిన అవసరం కలుగదు. అంతర్జాతీయ మార్గదర్శకత్వం లభించిన వెంటనే అంతర్జాతీయ కోర్కెలను, జాతీయ ప్రభావాన్ని దేశీయ సౌలభ్యతలను, ప్రయోజనాలను ప్రక్కకు నెట్టి అంతర్జాతీయ "ప్రజాయుద్ధ" పంధాను ఆమోదించింది.

ఈ సంఘటనలను తదనంతర కాలంలో వాసుదేవరావు ఇలా వివరించారు.

"భారతదేశానికి కూడ యుద్ధం "ప్రజాయుద్ధమే"నని అర్థంచేసుకొనుటకు కమ్యూనిస్టుపార్టీకి ఆరుమాసాలు ఎందుకు పట్టింది? ఇది కమ్యూనిస్టేతర అతివాద జాతీయ దృక్పధపు ఫలితము బ్రిటిషు వ్యతిరేక ప్రజావైఖరి కమ్యూనిస్టులపై ప్రసరించిన ప్రభావఫలితం. భారతీయులు వారి రాజకీయ పార్టీలు 50 సంవత్సరాలుగ బ్రిటిషువారికి వ్యతిరేకంగా పోరాడుతున్నవి. వారు స్వాతంత్ర్య పోరాటం బ్రిటిష్ వ్యతిరేక పోరాటంగా నమ్ముతున్నారు అంచేత బ్రిటిషువారితో కూటమినేరపుతున్న వారిని బలపరచుటతో తమ స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొనగలమనే నమ్మకం వారికిలేదు. ప్రజలు యుద్ధాన్ని బలపరచుట అంటే బ్రిటిషు ప్రభుత్వాన్ని బలపర చుట, స్వాతంత్ర్య పోరాటాన్ని బలహీన పరచుటయని వారి అభిప్రాయం. కమ్యు నిస్టుపార్టీపై యీ విధమైన బ్రిటిషు వ్యతిరేక ప్రభావం పనిచేయక తప్పలేదు ఈ జాతీయత బురదలోనుండి బయటపడుటకు కమ్యునిస్టులుగ ఆలోచించుటకు నూతన పరిస్థితులలో స్వాతంత్ర పోరాటానికి నూతన కార్యక్రమాన్ని యిచ్చుటకు ఆరు మాసాలు పట్టింది."

దీనిని బలపరచే మరో కధనంవుంది. మద్రాసు కేసులోని నిందితులు వారి సహచరులు "నూతన ప్రజాయుద్ధ పంధాని" దృఢంగా మరో ఆరుమాసాలవరకు వ్యతిరేకించుతునేవున్నారు వారు 1942 మధ్యలో ఖైదీలలోని ఒకరి సోదరి తాజాగా రజనీ పామీదత్తును, హారీపోలిట్‌ను కలుసుకొని చర్చించి వచ్చి జోక్యం కలుగజేసు కొనుటతోనే తమ వైఖరిని మార్చుకొన్నారు, నూతన విధానాన్ని ఆమోదించుటతో వ్యతిరేకత విస్తృతంగా చాలావుంది. ఆ విధమైన పరిస్థితులలోకూడ కమ్యునిస్టు పార్టీ సంక్షోభంలో పడకపోవుట, కమ్యునిస్టుల విశ్వాసం, దాని నిర్మాణాన్ని పొగడ కుండా వుండలేము.

**కమ్యూనిస్టులు "ప్రజాయుద్ధ" నినాదంపై సమీకరణ**

కమ్యునిస్టుపార్టీ దృఢ విశ్వాసం, క్రమశిక్షణతో ఫాసిస్టు వ్యతిరేక వ్యూహానికి తన శక్తులను సమీకరించ మొదలుపెట్టింది. జోషీ నూతన విధానాన్ని కార్యకర్త లలో నాటకీయంగా ఉద్రేకవంతమూ, భావయుక్తమూచేసి ప్రజాయుద్ధ పంధాని ప్రచారంచేశారు. ప్రప్రధమంగా ఫిబ్రవరి 1942లో సుదీర్ఘ పార్టీ విధాన పత్రం

తయారుచేశారు. నూతన విధానాన్ని ప్రజానురంజకంగా చేయుట బ్రిటిషు, రష్యను కమ్యూనిస్టులు పేర్కొనని, యుద్ధాన్ని బలపరచే క్రమంలో భారతదేశానికి స్వాతంత్ర్యం వస్తుందని చెప్పేటంతవరకు వెళ్ళారు. దీనిని యుద్ధానికి పూర్వపు ప్రపంచ విధానాన్నుండి ప్రపంచ వ్యాప్తంగా విముక్తి లభించుతుందనుటకు సోవియట్ యూనియన్ నాయకత్వం వహించుట ఉదాహరణగా చెప్పారు అంతేగాక యుద్ధాన్ని నిర్వహించుక్రమంలో ఏర్పడే జాతీయ ఐక్యత బ్రిటిషుప్రభుత్వం భారతదేశానికి స్వాతంత్ర్యాన్ని యిచ్చునట్లు చేయుశక్తి పొందుతుందనిచెప్పి పార్టీ విధానాన్ని సమర్థించారు. మిత్రరాజ్యకూటమిలో సోవియట్ యూనియన్ ఆధిక్యత వహించి యుద్ధక్రమంలో విప్లవధ్యేయాలను పెంపొందించుతుందని అన్నారు. ప్రతి పెట్టుబడిదారి దేశంలో వర్గశక్తుల బలాలతో అభ్యుదయశక్తులవైపు తూకం పెరుగుతుందన్నారు. ఒక్కమాటలో సోవియట్ యూనియన్ ప్రభావం బ్రిటన్‌లో ప్రజల వొత్తిడితో చర్చిల్ భారతదేశానికి స్వతంత్రం యివ్వవలసి వస్తుందన్నారు. ఈ విధమైన వాదనతోపాటు యుద్ధానికై ఐక్యమయ్యే విధానక్రమంలో భారత ప్రజానీకం స్వాతంత్ర్యాన్ని సామ్రాజ్యవాద ప్రభుత్వాన్నుండి తీసుకొనగలశక్తి పొందగలదన్నాడు. అందేత "జాతీయ రక్షణకు, జాతీయ ప్రభుత్వానికి జాతీయ ఐక్యత" అనే నినాదాన్ని యిచ్చాయి. ఇదే యుద్ధకాలంలో కమ్యూనిస్టుపార్టీ రాజకీయ విధానం.

భారత, బ్రిటిష్, కమ్యూనిస్టుపార్టీలు తమ అవగాహనను సమన్వయం పరచుకొన్నవి. భారత కమ్యూనిస్టుపార్టీలాగకాక బ్రిటిషు కమ్యూనిస్టుపార్టీ గౌరవ ప్రదమైన రాజీ బ్రిటిష్ ప్రభుత్వం, భారత జాతీయ కాంగ్రెసుల మధ్య కుదరగలదని చాల విశ్వాసంతోవుంది.

భారత జాతీయ కాంగ్రెసు అధికార ప్రతినిధి వి.కె. కృష్ణమీనన్ ఆగస్టు 1940 నుండి జూన్ 1942 మధ్య లేబర్‌మంత్లీలో మూడు వ్యాసాలు వ్రాశారు. సోవియట్ యుద్ధంలో ప్రవేశించుటతో వలసదేశాల ప్రజలకు యుద్ధనైజములో మార్పు వచ్చిందని, భారతదేశం యుద్ధకార్యకలాపాలలో పాల్గొనుటకు వుత్సాహంతో ఉన్నదని, బానిసత్వంలో వుండుటవలన ఆపని చేయజాలకపోతుందని వ్రాసారు. సోవియట్ యూనియన్‌పై దండయాత్ర స్వాతంత్ర్య ప్రియులైన అన్నిదేశాల ప్రజలను సమీకరించవలసిన అవసరాన్ని చాటుతుంది. "ప్రపంచ ఫాశిస్టు వ్యతిరేక ప్రజాసంఘటన"లో పాత్రవహించుట భారతదేశ విధానమైంది. స్వాతంత్ర్యేచ్ఛ ఆ విధానంలో భాగం"కూడ అవుతుంది అని తెలిపారు.

భారతదేశ స్వాతంత్ర్యాన్ని గుర్తించుతు, బ్రిటిష్ ప్రభుత్వం తిరిగి సంప్రదింపులు ప్రారంభించాలని కోరారు. వాటికి మొదట యుద్ధకార్యకలాపాలకు సహకారాన్ని అందించుటతో ప్రారంభంకావాలని కోరారు, భారత ఆర్థికవనరుల సమీకరణలో బ్రిటిషు వైఫల్యాన్ని ఖండించారు. "ఉత్పత్తి, అధికారోత్పత్తి నేటి పిలుపు" అన్నారు. భారతదేశంలో రాజకీయ ఖైదీలనందరినీ విడుదల చేయాలని కోరారు.

కమ్యూనిస్టులు, సోషలిస్టులు, తదితర కార్మికవర్గ నాయకులు ఇండియాలో ఫాశిస్టు వ్యతిరేక "దృఢతర శక్తులని" మీనన్ అన్నారు, జాతీయ శక్తివంతమైన

ప్రధానవర్గాలు ప్రభుత్వ నాయకత్వం మాత్రమే దేశప్రజలందరిని సమీకరించగల దని వ్రాశారు[1].

కాంగ్రెసు అధికార ప్రతినిధి అభిప్రాయాలను అధ్యయనం చేసిన బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీ, భారత జాతీయసంస్థ వెనుకా ముందుగా యుద్ధ కార్యకలాపాలను బలపరచే నిర్ణయం చేస్తుందనే నిర్ధారణకు వచ్చింది. "క్విట్ ఇండియా" కాంగ్రెసు ఆగష్టు తీర్మానంతో యీ ఆశలు అడియాశలయ్యాయి. మొట్టమొదటి షరతులులేని స్వాతంత్ర్యం, తరువాత యుద్ధ కార్యకలాపాలకు పూర్తి సహకారం అనే నిర్ణయం తరువాత, జోషీ ఎత్తుగడలను బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీ బలపరచింది.

**భారత కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగింపు :**

నూతన విధానంపై పార్టీ వర్గాలను సమీకరించిన, పార్టీ నాయకత్వం, వివిధ రంగాలలో దానిని అమలుచేయుటకు దృష్టిని మళ్ళించింది. "ప్రజాయుద్ధ" నూతన విధానం, ఎన్ని పరిమితులకులోనైనా, భారత రాజకీయాలలో కమ్యూనిస్టు పార్టీకి చట్టసమ్మతమైన స్థానాన్ని; అనుకూల అవకాశాన్ని కలుగజేసింది. పార్టీని పునర్ని ర్మాణం గావించి, చట్టసమ్మత హక్కులను పొంద నారంభించింది.

కమ్యూనిస్టు పార్టీ 1942 ప్రథమార్థభాగంలో వారం వారానికి తన బలాన్ని పెంపొందించుకొనగలిగింది. నైరుతి ఆసియా అంతటా జపాన్ సైన్యాలు బ్రిటిష్ వారిపై తీవ్రదాడులు సాగిస్తూనే వున్నవి. భారతదేశంలో ప్రజలనుండి మద్దతు పొందు టకై ప్రభుత్వం సర్వప్రయత్నాలు చేస్తున్నది ఇండియా ఉపఖండమే పసిఫిక్ యుద్ధా శములా కన్పడుతున్నది. బర్మాలో జపాన్ వ్యతిరేక బ్రిటిషు సైన్యాలు ప్రతిఘటన కుప్పగా కూలిపోతున్నది. జపాన్ పదాతిదళాల, నావికాదళాలు భారతదేశంపై దండె త్తుట తప్పనిసరిగా కన్పడుతున్నది. ఫిబ్రవరి 1942లో కమ్యూనిస్టు ఖైదీలను విడుదల చేయుటకు ప్రభుత్వం సుముఖత చూపింది.

జపాన్ సైన్యాలు మార్చి, ఏప్రిల్‌కు భారత సరిహద్దులకు సమీపించాయి. క్రిప్స్ రాయబారవర్గం భారత జాతీయపార్టీలతో సంప్రదింపులు ప్రారంభించింది. చర్చలు ప్రభుత్వం యివ్వదలచిన రాయితీలు కాంగ్రెసు. ముస్లింలీగులను సంతృప్తిపరచ జాలకపోయాయి యుద్ధంలో వారి సహకారాన్ని పొందుటలో క్రిప్స్ రాయబార వర్గం విఫలమైంది.

భారత కమ్యూనిస్టు పార్టీ పొలిట్ బ్యూరో, అందుకు భిన్నంగా క్రిప్స్ రాయ బార వర్గ ప్రణాళికను బలపరచి, "క్రిప్స్ ప్రతిపాదనలు ప్రాతిపదికగా ఒప్పందానికి రావలసిందిగా" కాంగ్రెసు, ముస్లింలీగులకు విజ్ఞప్తి చేసింది. అట్టి ఒప్పందాన్ని కమ్యూనిస్టుపార్టీ బలపరస్తుందని వాగ్దానం చేసింది. అంతేగాక జపాన్‌కు వ్యతిరే కంగా ఇండియా రక్షణకు పోరాడుతామని సందేహం లేకుండా స్పష్టం చేసింది. భారత కమ్యూనిస్టు పార్టీ సభ్యులకు, సానుభూతిపరులకు, మిత్రులకు రక్షణ కార్యకలాపా లను బలపరచవలసిందిగా విజ్ఞప్తి చేసింది.

---

1. ఓవర్‌స్ట్రీట్, మార్షల్ (1958) కమ్యూనిజం ఇన్ ఇండియా పే. 203-4.

జులై 1942 ప్రభుత్వం భారత కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగించి, జైళ్ళలోని కమ్యూనిస్టుల విడుదల చేయ ప్రారంభించింది జపాన్ వ్యతిరేక పోరాటానికి ఆయుధాలు ధరించుట సిద్ధమని కమ్యూనిస్టు పార్టీ ప్రకటించింది. ఈ అవకాశాన్ని వదలకుండా కమ్యూనిస్ట్ వలంటీర్లలకు గెరిల్లా సైనిక శిక్షణ యిచ్చుటకు కార్యక్రమాన్ని రూపొందించింది. బ్రిటిషు అధికారులు భారతదేశంలో ఎర్రసైన్యాన్ని తయారుచేయుటలోవున్న ప్రమాదాన్ని అంచెనావేసి, అయినా రిస్కు తీసుకొనదలచారు. ఈ నిర్ణయం తీసుకొనుటకు సైనిక పోరాట పరిస్థితి అధ్వాన్నంగా ఉండుటయే కారణము. దానికితోడు భారత ప్రజలలో బ్రిటిషు వారితో సహకారానికి సుముఖ అభిప్రాయం లేకుండుటకూడ మరో కారణము. ప్రభుత్వం గెరిల్లా సైన్యపు శిక్షణ యిచ్చుట జూన్‌లో ప్రారంభమైంది. రక్షణ సన్నాహాలవలన ప్రభుత్వం గెరిల్లా సైన్యశిక్షణ కార్యక్రమముపై ప్రచారం కావించలేదు. కాని కమ్యునిస్ట్ పత్రికలలో అట్టి ప్రచారం చేసారు. అట్టి శిక్షణ పొందిన ఒకని డైరీని. పీపుల్సువార్ పత్రిక ప్రచురించింది. అందులో గెరిల్లా సైనికుని పూర్తిశిక్షణ యివ్వకపోయినా, బాయినెట్ చార్జి, మాటువేసి శత్రువుపై దాడిచేయుట, శత్రు క్యాంపులపై ప్రాకుకుంటూ వెళ్ళి దాడిచేయుట, మ్యాపు రీడింగు, నైసర్గిక పరిస్థితులను సైనికచర్యలకు వినియోగించు విధము, వంతెనలు, బిల్డింగులు పేల్చివేయుట, రక్షణ కొరకు ముళ్ళతీగ కంచెలు వేయుట, వాటిని ఛేదించి పురోగమించుట, నదులు, లోతట్టు ప్రాంతాలలో తాత్కాలిక వంతెనల నిర్మాణం, టాంకుని ఎదుర్కొని నాశనం చేయుట, మాల్టార్ కాక్ షేల్స్ ఎలా తయారుచేయాలి శిక్షణ యిచ్చారు. శిక్షణలో మా శక్తిని ప్రదర్శించాము, అని డెయిరీలో పేర్కొన్నాడు. తమ గ్రూపులో 300 మంది, దేశంలోని వివిధ ప్రాంతాల నుండి ఎన్నిక చేయబడిన వారికి శిక్షణ యివ్వబడిందని, 12 రోజులు బ్రిటిషు సైనికాధికారులు శిక్షణ యిచ్చారని ఉదహరించబడింది. పూనా కొండలలో 15 మంది వొక్క గ్రూపుగాచేసి, అమెరికన్ సైనికాధికారులు గెరిల్లా ఎత్తుగడలలో శిక్షణ యిచ్చారని, చైనా సైనికాధికారులుకూడ యీ శిక్షణ యిచ్చుటలో పాల్గొన్నారని, వారి పేర్లు బయటపెట్టలేదు. జపాన్ దండయాత్ర ప్రమాదం తగ్గిపోయిన వెంటనే యీ శిక్షణ కార్యక్రమాన్ని బ్రిటిషు అధికారులు ముగించి వేసారు. ఎర్రగెరిల్లా సైన్యాన్ని యేర్పాటు చేయగల అవకాశం జారిపోయింది. జపాన్ సైన్యాలు దేశంపై దండయాత్ర సాగించినచో, ప్రతి ఘటనోద్యమం, నాయకత్వంలో కొనసాగినట్లయితే చైనా చరిత్ర ఇండియాలో పునరావృతమగుటకు అవకాశా లేర్పడేవి, చరిత్ర పురోగమనం మరో విధంగా వుండేది.

"అన్నీ యుద్ధరంగానికి" అనే నినాదంతో కమ్యునిస్ట్ పార్టీ ప్రచారంచేసి, సమ్మెల భయం ప్రభుత్వానికి లేకుండా చేసింది. చివరకు గెరిల్లా దళాల నిర్మాణానికి, కమ్యునిస్ట్ వలంటీర్ల దళాలను, ప్రధానంగా యుద్ధభయంవున్న రాష్ట్రాలకు, శత్రువు ఆక్రమిత ప్రాంతాలకు పంపుటకు సిద్ధంగా ఉన్నామని ప్రకటించింది.

### కమ్యూనిస్టు పార్టీ నిర్మాణాభివృద్ధి :

వివిధ రంగాలలో కమ్యూనిస్ట్ పార్టీ నిర్మాణాభివృద్ధి 1942 మధ్యనుండి గణనీయంగా పెరిగింది పార్టీపై నిషేధం తొలగింపు, యితర రాజకీయపార్టీలు రంగంలో లేకపోవుటతో యీ కార్యక్రమం విజయవంతంగా జరిగింది. కాంగ్రెసు 'క్విట్ ఇండియా' వుద్యమం కారణంగా అనేకమంది జైళ్ళపాలయ్యారు. వివిధ రంగాలలో వాని నిర్మాణ కార్యక్రమాలకు పోటీ, ప్రతిఘటన లేదు.

రైతు వుద్యమం అప్పటి బలాన్ని, సమీకరణ శక్తి పెంపొందించుకొని విస్తరించింది అనేకమంది జాతీయాభిమానులైన రైతు వుద్యమ నాయకులను స్వామి సహజానంద, ఇందులాల్ యాగ్నిక్, తదితర అనేకమంది ముఖ్య కార్యకర్తలను కమ్యూనిస్టు పార్టీలో చేర్చుకొనిన, ఫలితంగా కమ్యూనిస్ట్‌పార్టీ రైతు వుద్యమమూ రెండూ బలపడినవి. రాష్ట్రి కిసాన్ సభల నాయకత్వం వొకటి తరువాత వొకటి కమ్యునిస్టుల నాయకత్వంలోనికి వచ్చాయి. వీటన్నిటి ఫలితంగా క్రమేణా కేంద్ర కిసాన్ కౌన్సిలోగూడ బలపడ్డారు సోషలిస్టల, పార్వర్డ బ్లాకిస్టలు 1941 చివరకు కిసాన్‌సభను వదలి వెళ్ళిపోయారు. మే 1942లో జరిగిన అఖిల భారత కిసాన్‌సభ సమావేశంతో కమ్యునిస్టులు తమ బలాన్ని పెంచుకొని నిర్మాణ రూపమిచ్చారు. కిసాన్‌సభలోని చివరి కమ్యునిస్టు వ్యతిరేకులు అక్టోబరులో ఆచార్య రంగా బలం తగ్గిపోవుటతో నిష్క్రమించిన కారణంగా, కిసాన్‌సభలో కమ్యూనిస్టుల ఆధిక్యత యేర్పడింది. ఆచార్యరంగాతోపాటు ఆరు రాష్ట్రి కిసాన్‌సభలు అఖిల భారత కిసాన్ సభనుండి బయటకిపోవుటతో కిసాన్ వుద్యమంలో చీలికలు వచ్చాయి.

ప్రజా సంఘాలలో వివాదాస్పదమైన తన రాజకీయ విధానాలను తీర్మానాల రూపంలో ప్రవేశపెట్టి, కమ్యూనిస్టుపార్టీ, కమ్యునిస్ట్ వ్యతిరేక చీలికవాదులకు అవకాశం తనకు తానే యిచ్చింది. ప్రజాసంఘాలు యేకగ్రీవంగా ఆమోదించే రాజకీయ తీర్మానాలు పెట్టే ఐక్య సంఘటనా విధానాన్ని విడిచిపెట్టుట తప్ప యిది మరొకటి కాదు, నవంబరు 1941లోనే కిసాన్‌సభ స్టాండింగు కమిటీ నాగపూర్ సమావేశంలో "ప్రజాయుద్ధ" తీర్మానాన్ని కమ్యునిస్ట్ పార్టీ ప్రయత్నించి, ప్రతిఘటన తీవ్రంకాగా, వోటుకు పెట్టుటకు వెనుకాడి, తమ స్థానాలను బలపరచుకొని, తిరిగి అవకాశం వచ్చిన వెంటనే నెగ్గించుకొని చీలికకు ప్రధాన కారకులయ్యారనుటలో సందేహం లేదు. ఈ సంఘటన, తదితర ప్రజాసంఘాల యిట్టి సంఘటలు యీ కాలంలో ప్రజాసంఘాలు చీలిపోవుటతో మార్క్సిజం, ప్రజా సంఘాలలో కమ్యునిస్టల పని విధానం, అనే ప్రశ్నలు అప్పుడే ఉదయించి వుండాలి. పిడివాదంలో దిట్టలై, కమునిస్టలు తమ బాల్యారిష్ట విధానాలను కొనసాగించారు.

అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్, డిశెంబరు 1941లో పాట్నా సమావేశమునకు వచ్చిన ప్రతినిధులలో అధిక సంఖ్యాకులను "ప్రజాయుద్ధ విధాన" అనుకూలురు, యీ విజయాన్ని "ది స్టూడెంటు" పత్రిక "ఆలోచించండి కామ్రేడ్స్, సమర్ధులు చురుకైన వారందరూ నూతన విధానాన్ని మనస్ఫూర్తిగా ఆమోదించారు" అని

చెప్పుకొన్నది. తరువాత సంచికలో నూతన విధానంపై అతి తీవ్రమైన చర్చ మూడు మాసాలు జరిగిందని వ్రాసింది. అయితే యీ సందర్భంలో డిశెంబరు 1940లో నాగపూరులో జరిగిన అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్ మహాసభలోనే, జాతీయ కాంగ్రెసును అనుసరించేవారు, యితర అతివాద విద్యార్థులు, యుద్ధం, స్వాతంత్ర్య పోరాటం, కమ్యూనిస్టుల విధానాలు, అనే రాజకీయ సమస్యలపై చీలిపోయి "విద్యార్థి కాంగ్రెసు" యేర్పరచుకొనుట మరువరాదు. అయితే పాట్నాలో మరోసారి పార్టీ విధానాలను విద్యార్థి సంఘంలో తీర్మానాల రూపంలో తీసుకొనివచ్చి కమ్యూనిస్టేతరులను దూరం చేసుకొనదలచలేదు. వివిధ అభిప్రాయాలకు తావుండాలనే అవగాహనను చేబట్టి, ఎవరి రాజకీయాభిప్రాయాలు వారికి వుండవచ్చని, విద్యార్థి సమస్యలపై కలసి పోరాడాలని, ప్రజాసంఘాల సరియైన నిర్ణయాన్నే తీసుకొని, చీలికల విధానానికి భరతవాక్యం చెప్పారు.

భారత ట్రేడు యూనియన్ వుద్యమంలో కమ్యూనిస్టులు పై కమిటీలలో అంత తేలికగా ఆధిక్యతను సంపాదించజాలకపోయారు. అందువలన కమ్యూనిస్టులు తమ ఎత్తుగడలను మార్చి, క్రింది కమిటీల విషయమై శ్రద్ధ వహించి, చురుకుగా పనిచేయ సాగారు. క్రమంగా అఖిల భారత ట్రేడు యూనియన్ కాంగ్రెసులో తన ప్రభావాన్ని యెక్కువ చేసుకొన్నా "ప్రజాయుద్ధ పంథా" ఆమోదాన్ని వెంటనే పొందజాలక పోయింది. ఫిబ్రవరి 1942లో జరిగిన ఎ ఐ టి యు సి సమావేశంలో కమ్యూనిస్టులు క్రింది కార్యకర్తలలో మంచిబలాన్ని కలిగియున్నా, వారి నూతన విధానానికి, నాయకత్వం వర్గాలలో తీవ్ర వ్యతిరేకత, ప్రతిఘటన వచ్చింది. ప్రారంభోపన్యాసం చేసిన మెహ్రా. కమ్యూనిస్టు పార్టీ విధానాలను స్పష్టంగా ఖండించి, భారతీయులు తమ స్వాతంత్ర్యానికై పోరాడాలని, తరువాతే యితర సమస్య చేబట్టాలని ప్రకటించారు, ఎ ఐ టి యు సి అధ్యక్షుడైన వి. ఆర్. కాలప్ప "ఫాశిస్టు వ్యతిరేక సంఘటన" అని చెప్పే మాటలన్నీ మనలను గమ్యాలకి చేర్చవని, యుద్ధ అంత్య ఫలితంగా స్వాతంత్ర్యం వస్తుందని చెప్పే కమ్యూనిస్టు మాటలను, బ్రిటిష్‌వారు ప్రస్తావించ లేదని విమర్శించారు. ప్రఖ్యాత కార్మిక నాయకుడు యన్. యం. జోషీ తాను "ప్రజాయుద్ధ పంథా" వ్యతిరేకినని ప్రకటించుకొన్నారు. కమ్యూనిస్టులు తమ విధానాలకు మెజారిటి బలాన్ని సమకూర్చుకొన్నా, ప్రధానాంశాలపై నిర్ణయాలకు 75 శాతం అనుకూలంగా వుండాలనీ, ట్రేడు యూనియన్ కాంగ్రెసు నిర్మాణసూత్రాల నిబంధనలు పేర్కొన్నబలం లేదు.

తరువాత, మే 1943లో జరిగిన మహాసభలో యీ పోటీ పునరావృతమైంది. సమావేశం కార్యక్రమాలని నిర్వహించుచున్నప్పుడు కమ్యూనిస్టుల, కమ్యూనిస్టు వ్యతిరేకుల నినాదాలు మారుమ్రోగాయి. ఉద్రేకాలు పెరిగిపోయాయి. సమావేశపు హాలు బయట 'బాహా బాహి' ఘర్షణలు జరిగాయి. ఈ సమావేశంలో కమ్యూనిస్టుల ప్రధాన తీర్మానానికి 616 వోట్లలో 424 వచ్చాయి, తీర్మానం ఆమోదింపబడుటకు 75 వోట్లు తక్కువయ్యాయి.యుద్ధం కొరకు అధికోత్పత్తిని కొనసాగించాలనే మరో తీర్మానం వుపసంహరించుకొనబడింది. యన్, యం. జోషీ జనరల్ సెక్రటరీగా,

అగ్ర నాయకత్వంలో కమ్యూనిస్టేతరులతో కార్యక్రమాలు కొనసాగాయి కమ్యూనిస్టు లకు పోలైన వోట్లు వారికి స్థానిక సంస్థలలోగల బలాన్ని, దాని పెరుగుదలను తెలియచేస్తున్నది.

కమ్యూనిస్టులు కిసాన్‌సభ, ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు విద్యార్థి ఫెడ రేషనుల క్రింది పునాది వర్గాలలో కేంద్రీకరించి, చురుకుగా పనిచేసి, ఆధిక్యతను సంపాదించ ప్రారంభించారు. ఈ విధంగా పార్టీ పునాదివర్గాల స్థాయిలో పనిచేస్తూ, యీ సంస్థలపై కమిటీలలో జాగృతి, మెలకువలతో పార్టీ విధానాలను. అవగాహన లను, ప్రభావితం చేయుటలో జాగ్రత్తలు తీసుకొన్నారు. పార్టీ పంథాను ముందుకు తోయుటలో తొందరపాటుతనాన్ని విడనాడారు. ఏ సంస్థలోనైనా పార్టీ నాయకత్వాన్ని కలిగివుండుటను త్రోసిపుచ్చుతూ వచ్చారు. కమ్యూనిస్టు నాయకత్వం, పార్టీ సభ్యులు ప్రజాసంస్థలను "పార్టీ వేదికలు" గా వుపయోగించరాదనే హెచ్చరికను చేస్తూ, అనగా కమ్యూనిస్టు పార్టీ విధానాన్ని ప్రజాసంస్థలలో మక్కీకిమక్కీగా తీర్మానాలను కాపీలుగా చేయుటను నిరసించింది. పార్టీ నాయకత్వం యే సంస్థలోనైనా పార్టీ ఆధి క్యతా నాయకత్వాన్ని వుత్సాహపరస్తూ, వివిధ రాజకీయ అభిప్రాయాలు గలవారి ఐక్యతావేదిక అవ్వాలని అన్నారు. ఈ ఎత్తుగడలు ప్రజాసంస్థలలో, అనుకొన్న దాని కంటె సమర్ధవంతంగా, జాతీయోద్యమం సాధారణంగా వ్యతిరేకంగా వున్నప్పుడు, పనిచేయుటకు తోడ్పడినవి.

ఈ అవగాహనలతోనే జోషీ నాయకత్వంలో, ప్రజానాట్యమండలిలు, అభ్యు దయ రచయితల సంఘాలు, సోవియట్ మిత్రమండలు, మహిళా సంఘాలు, బాల సంఘాలు పనిచేసి, బహుళవ్యాప్తిని పొందాయి, ప్రజాభిమానాన్ని చూరగొన్నాయి. పరోక్షంగా పార్టీ విస్తరణకు, బలపడుటకు తోడ్పడ్డాయి.

ఆ సంక్షోభ, సంక్లిష్ట పరిస్థితులలో కష్టతరమైన పార్టీ నిర్మాణాన్ని, అత్యంత నైపుణ్యంతో ఆశ్చర్యం గొల్పేవిధంగా, ధృఢదీక్షత, విశ్వాసంతో, అవిశ్రాంతితో గణనీయంగా పనిచేసి, పార్టీ వుత్తరోత్తరా ప్రజాపార్టీ అగుటకు బలమైన పునాదుల నేర్పరచారు. ఈ పార్టీ నిర్మాణకృషి చరితార్థికము. పార్టీ వర్గాల ప్రకారం, 4,500 లుగా ఉన్న పార్టీ సభ్యత్వం, 1943లో జరిగిన ప్రధమపార్టీ కాంగ్రెసు నాటికి 9,200కు పెరిగి, 1943 మధ్య భాగానికి 15,000, 1945కు 30,000కు చేరుకొన్నది, యిది 1000 శాతం పెంపుదలను సూచిస్తున్నది అయితే ఈ సభ్యత్వ పెరుగుదలకు, సభ్యత్వ అర్హతలను కొంత సరళీకృతం చేయుటవలన సాధ్యమైనదని చెప్పవచ్చును. కేంద్రకమిటి "ప్రజాపార్టీ"గ కమ్యూనిస్టు పార్టీ అగుటకుగల అడ్డంకులను తొలగిం చింది.

ఈ అభివృద్ధి, పార్టీ పత్రికలను "పీపిల్సువార్," అనేక యితర భాషాప్రాంతీ వారపత్రికలను ప్రచురించి, 66,350 ప్రతులు పంపకం చేయుటలోను కన్పడుతుంది. పార్టీ పుస్తకాలు, చిరు పుస్తకాలు, కరపత్రాలు వివిధ భాషలలో, జాతీయ అంత ర్జాతీయ, ప్రాంతీయ, స్థానిక సమస్యలపై ప్రచురించుట అతివేగంగా అభివృద్ధి చెం దింది.

కమ్యూనిస్టు పార్టీ, అంతర్గత నిర్మాణంపై అత్యంతశ్రద్ధ వహించింది. పార్టీకి 1943కు 2,637 మంది పూర్తికాలాన్ని వినియోగించే కార్యకర్తలు, కనీస అలవెన్సులతో పనిచేయు కార్యకర్తల బృందాలు యేర్పడినవి. వీరు అత్యంతశ్రద్ధ, చురుకుదనము, చొరవతో "నూతన సందేశదూతలు"గ పనిచేసారు. పార్టి లెటర్సు, సమాచార వుత్తరాలు, పార్టీ సభ్యులకు మాత్రం వుద్దేశించబడినవి, నిరవధికంగా, ప్రతి విషయంపై సూచనలు యిస్తూ, అనేక విధానాల పార్టీ అగ్రనాయకత్వాలకు, స్థానిక సభ్యులకు సజీవ సంబంధాలను యేర్పరచారు, పార్టీ వ్యతిరేకులు మాస్కో-ప్రచార 'బాకా', బొంబాయిద్వారా గ్రామాలలో "మెగాఫోన్ డబ్బా బాకాగా" మ్రోగేదని వ్యంగ్యంగా అనుట సాధారణమైంది.

ప్రథమపార్టీ కాంగ్రెసు 1953 అనంతరం, మధ్యలో పార్టీ 260 రాష్ట్రపార్టీల ఆర్గనైజర్సును, 1720 స్థానిక ఆర్గనైజర్సును, 6,250 సెల్ సెక్రటీరలను,మొత్తం మీద 6020 మంది పూర్తికాలాన్ని వినియోగించే కార్యకర్తల లక్ష్యంగా నిర్ణయించింది. దీనితోపాటు సభ్యత్వాన్ని 56.000 వేలకు పెంచాలని, 5 లక్షల రూపాయల పార్టీ ప్రత్యేక నిధిని సేకరించాలని నిర్ణయించింది.[1] పార్టీ సభ్యులకు పార్టీలెటర్‌లో నిధి సేకరణకై పిలుపునిచ్చారు. వ్యవసాయ కూలీలనుండి, పారిశ్రామికులవరకు ఈ నిధి సేకరణ పార్టీసభ్యులు యీ నిధిని సేకరించారు.ప్రజాసామాన్యంనుండి అణాలు, రూపాయిలుగా యీ నిధి సేకరించుట వొక ప్రజావుద్యమంగా జరిగింది.

కమ్యూనిస్టు పార్టీ 1942-43లో మూడు ప్లీనం సమావేశాలు జరిపింది. ఈ సమావేశాలలో 'ప్రజాయుద్ధ విధాన' పరిమితులలో వివరణాత్మక ఎత్తుగడలను రూపొందించింది. ఈ ఎత్తుగడలే తదనంతర యుద్ధకాలంలో పార్టీచే అనుసరించబడినవి, ఆచరణాత్మకంగా క్రమంగా మెరుగులు దిద్దబడినవి. పార్టీ ఆచరణలో పెట్టిన "జాతీయ ఐక్యతా వుద్యమము, అధికోత్పత్తి వుద్యమం"లో యీ ఎత్తుగడలు ప్రతిబింబించాయి.

**జాతీయ ఐక్యతా ఉద్యమము :**

భారతదేశ ప్రజలలోగల మత, భాషా భిన్నత్వం, అనేక మతాలు, అనేక భాషలు మధ్యయుగాలలో రవాణా సౌకర్యాల శూన్యత లేక ప్రాథమికదశలో, విసరివేయబడిన ప్రాంతాలలో వివిధ ఆచార వ్యవహారాలు, సంస్కృతులువలనే భిన్నత్వం విస్తారంగా అభివృద్ధి చెందింది. ఈ వారసత్వ ప్రాతిపదికగానే భారత రాజకీయరంగములో రెండు ప్రధాన సమస్యలు చరిత్రనుండి వుద్భవించాయి. అవే, హిందూ-ముస్లిం సమస్య: భాషా రాష్ట్రాల సమస్యలు. ఈ సమస్యల చుట్టూ "ఇండియన్ జాతి"ని నిర్వచించుట అనే మౌలికసమస్య యెదురైంది. భారతదేశమంతా ఒకే

1. పార్టీ సెప్టెంబరు 1943, ప్లీనం సమాచారాన్ని-పీపిల్సువార్, అక్టోబరు 4న ప్రచురించగా, యన్. కె. క్రిష్ణన్, "మాతృభూమి రక్షణకై జాతీయ ఐక్యత" అనే చిరుపుస్తకం-(1943) పే. 1-15 ల లోని సమాచారాన్ని ఓవర్‌స్ట్రీట్, మార్షల్‌లు "కమ్యూనిజం ఇన్ ఇండియా"లో పే. 210-211 పేజీలలో ఉదహరించారు.

జాతియా? లేక హిందువులు, ముస్లింలు వేరువేరు జాతులలో ప్రతివొక్కరికి ప్రత్యేక ప్రభుత్వం కలిగివుండాలా? అయితే బెంగాలీలు, తమిళులు, ప్రత్యేక రెండు జాతులా? ఫెడరల్ రాజ్యాంగంలో ప్రతి వొక్కరు స్వయం ప్రతిపత్తిని, పాలననూ కలిగి వుండాలా లేక స్వతంత్రతను సార్వభౌమాధికారాన్ని కలిగి వుండాలా అనే చరిత్ర తెచ్చిన సమస్యలు.

నేటివరకు భారతదేశ కమ్యునిస్టులు భారతదేశంలో ఒకే జాతి స్వాతంత్ర్యం కొరకు ఐక్యపోరాటాన్ని సాగించుతున్నదని తలంచుతున్నారు. కాంగ్రెసుతో పొత్తు ఎత్తుగడల రీత్యా నెరవవలసిన ఐక్యతకై, కాంగ్రెసును భారత ప్రజలందరి ఆశా జ్యోతియని ముస్లింలీగును మతసంబంధమైన అభివృద్ధి నిరోధక, విదేశీయులను బల పరస్తుందనే, మౌలిక అవగాహనతో కమ్యునిస్ట్ పార్టి కార్యక్రమాలను కొనసాగి స్తున్నది ఐరోపాలో యుద్ధం ప్రారంభం అయిన తరువాత సోవియట్ శాస్త్రవేత్తలు భారతదేశం హిందూజాతులు, ముస్లింజాతులుగల బహుళజాతుల దేశమని, జాతులన్నీ దివాళాకోరుతనాన్ని, అభివృద్ధి నిరోధకులని విశ్లేషించ మొదలుపెట్టారు. డిశెంబరు 1940లో డైకోవ్, బుష్లిక్‌లు భారత ప్రజల స్వాతంత్ర్య పోరాట సంఘటనను విచ్ఛిన్నం చేస్తున్నందుకు ముస్లింలీగ్ ఖండించారు. ముస్లింలీగ్ వ్యతిరేక ముస్లిం గ్రూపులు తాజాగా జరిపిన సమావేశాన్ని ఆమోదయోగ్యంగా వర్ణించారు, యీ ముస్లిం గ్రూపులన్నీ కాంగ్రెసుకు తమ మద్దతును ప్రకటించాయి.[1]

అదే మాసంలో అతివాద విద్యార్థి కాన్ఫరెన్సులో భారత కమ్యూనిస్టులు,అధి కార తీర్మానంలో కాంగ్రెసు మతసమస్యను పరిష్కరించుటలో విఫలమైందని,అన్ని మతాల గ్రూపుల మధ్య ఐక్యతను సాధించజాలక పోయిందని ప్రకటించింది.ముస్లిం లీగువలె, భారతీయులందరి తరపున మాట్లాడే హక్కును ప్రశ్నించే ముఖ్య నిర్ణ యాన్ని చేసింది తీర్మానం "భవిష్యత్భారతదేశం ప్రాంతీయ రాష్ట్రాల, పరస్పరం విశ్వాసాలతో యేర్పడే స్వచ్ఛంద ఫెడరేషన్" అని నిర్దిష్ట రాజకీయ ప్రతిపాదన చేర్చిన నూతన పంథా స్పష్టం చేసింది. భారతీయులందరూ ఐక్యమైన ఒక జాతిగా కాక బహుళజాతుల రాజ్యం (స్టేటుగా)గా, ధ్వనించునట్లు చెప్పారు.[2]

ఈ రాజకీయ విధాన వివరణ, అపరిపక్వ రూపంలో యిబ్బందికరంగా కన్పించుటతో, కమ్యూనిస్ట్ పార్టీ వెంటనే సరిగాదిద్దుకొన ప్రయత్నించింది కొంత కాలం తరువాత, తమ జాతుల విధానాన్ని మెరుగుపరస్తూ, "విద్యార్థి కాన్ఫరెన్సులో సరియైన విధానాన్ని ప్రతిపాదించుతూ కలగాపులగం" చేసి గందరగోళాన్ని సృష్టిం చింది."[3] అని అధికారి పేర్కొన్నారు.

---

1. బుషేలిక్, వి, డయకోల్, ఎ, (1940) ఇండియా అండ్ ది సెకండ్ ఇంపిరియ లిస్టువార్ పే 53-68కమ్యూనిజం ఇన్ ఇండియాలో పే.188లోని ఉదహరింపు.
2 మిత్ర. సం. ది ఇండియన్ యాన్యువల్ రిజిస్టర్. 1940 2. 415. పై పుస్తకం లోనే 189 పే. ఉదహరింపు.
3. అధికారి, జి. యం. (1943) పాకిస్తాన్ అండ్ ఇండియన్ నేషనల్ యూనిట్. లండన్; లేబర్ మంత్లి, (1943) పే. 24.

కమ్యూనిస్ట్ పార్టీ రాజకీయ విధానం 1941 పూర్వార్థభాగంలో అదే విధంగా కొనసాగింది.

"ప్రజాయుద్ధ" వ్యూహాన్ని ప్రచారంచేయ తలపెట్టిన కమ్యూనిస్టుపార్టీ దాని ఆచరణ ఎత్తుగడలవైపు దృష్టి సారించింది ప్రధాన సమస్య కాంగ్రెసులో ఐక్యతను పెంపొందించుటగాక, యుద్ధానికి పూర్వకాలంలోవలె, నేడు జాతీయ కాంగ్రెసుస్థానం ముస్లింలీగుకు సమానస్థానంలోనికి దిగజార్చి, జాతీయ ఐక్యత కాంగ్రెసు-ముస్లిం లీగుల రెండు రాజకీయ సంస్థల ఐక్యతస్థాయికి తెచ్చింది. కమ్యునిస్టు పార్టీ "భారత బూర్జువావర్గ ప్రధాన ప్రాతినిధ్యసంస్థ కాంగ్రెసు" అనే అవగాహనను విడనాడి ముస్లింలీగు "మనదేశంలోని రెండవ అధిక కమ్యునిటి ముఖ్య రాజకీయసంస్థ" అదే అవగాహన మొదటిదానికి అనుబంధంగా చేర్చింది. ఫలితంగా భారత రాజకీయాలలోనికి మత ప్రాతిపధిక అదియే మాటలలోనైనా తీసుకొని రాబడింది, కాంగ్రెసును ఇండియా ఉపఖండంలోని హిందువుల వారణిగా దానిస్థానాన్ని దిగజార్చి, ముస్లిం లీగును అభివృద్ధి నిరోధకమైనదిగా త్రోసిపేయుట పొరపాటు అవాస్తవికతగా పేర్కొంది. లీగుతోపాటు కాంగ్రెసుకూడ మతసామరస్యము, ఐక్యత లేనందుకు బాధ్యతవహించవలసి వుంటుంది. కాంగ్రెసులో గాంధేయ మితవాదవర్గాలను, విధానాన్ని విమర్శించి, ఖండించి, ముస్లింలీగులో అట్టి శక్తులను ప్రస్తావించక కాంగ్రెసు, ముస్లింలీగు రెండిటిలోని అభ్యుదయకర శక్తులను జోషి పొగుడుట జరిగింది[1]

రెండు రాజకీయపార్టీలమధ్య ఐక్యతను సాధించుటకు జోషి కాంగ్రెసు అవసరమైన రాయితీలను ముస్లింలీగు కోరిన పాక్షిక కోర్కెలను ధైర్యంగా యివ్వాలని ప్రకటించారు. దీని అర్థం ముస్లింలీగు 1940లో కోరిన ఉపఖండంలో రెండు సార్వభౌమాధికారాలుగల రాజ్యాలయేర్పాటును అనగా విభజనను ఆమోదించమని కాంగ్రెసును కోరారు. దానికి ప్రాథమికచర్యగా రాష్ట్రాలలో సంయుక్త మంత్రివర్గాలను చొరవతో కాంగ్రెసు లీగుతో కలసియేర్పాటు చేయాలని కోరారు[2].

కాంగ్రెసు-లీగు ఐక్యత అనే భారత కమ్యూనిస్టుల మౌలిక ఎత్తుగడ, కాంగ్రెసు, ముస్లింలీగులలో ప్రవేశానికి,ఆ సంస్థలలో తమవాణికి బలాన్ని చేకూర్చు లక్ష్యాన్ని కలిగియున్నట్లు కన్పడుతున్నది. అయితే భారత కమ్యునిస్టుల ఈ విధానం బ్రిటిష్ కమ్యునిస్టుపార్టీ నాయకత్వం ప్రతిపాదిస్తున్నదానికి భిన్నంగావుండుట కుతూహలాన్ని కలిగించకమానదు. ఇంతకుముందు రజనీ పామీదత్తు తదితరులు కాంగ్రెసు వొక్కటే భారతదేశమంతటిని గుర్తించి మాట్లాడుటకు అర్హతకలదని సూచించియున్నారు. అదే బ్రిటిషు కమ్యూనిస్ట్‌పార్టీ పత్రికలతో పునరుద్ఘాటించబడింది. కొంత కాలం తర్వాత భారత కమ్యునిస్టుపార్టీ దానిని ఖండించింది. లేబర్ మంత్లీలో జోషి

---

1,2. జె వె డి ఓవర్‌స్ట్రీట్, మార్షల్‌విండ్ మిల్లర్ (1958) కమ్యునిజం ఇన్ ఇండియా పే. 200-201లో యిచ్చిన సమాచార ఆధారం. ది ఇండియన్ కమ్యూనిస్ట్ పార్టీ, పి.సి. జోషి బ్రిటిషు కమ్యూనిస్టుపార్టీ ముద్రణ నుండి రచయిత సమాచారాన్ని తీసుకొన్నారు.

రాజకీయ విధానం ప్రకటించిన రెండుమాసముల తరువాత, డి.యస్. ప్రిట్ "బ్రిటిష ప్రభుత్వం కాంగ్రెసు భారతదేశ ప్రజానీకానికంతటికి ప్రాతినిధ్యం వహించగలదని గుర్తించి, అది ఆమోదించగల మైనారిటీలకు రక్షణలు కల్పించాలి[1]" అని వ్రాశారు.

ముస్లింలీగు బ్రిటిష సామ్రాజ్యవాదులచే సృష్టించబడినదని ప్రిట్ ఖండించి దానికి ముస్లింప్రజల గురించి మాట్లాడేహక్కు లేదని అన్నారు అది కోరే పాకిస్తాన్ ఆచరణ సాధ్యంకాదని త్రోసిబుచ్చారు. మేలో బెన్‌బ్రాడ్లీకూడ బ్రిటిష ప్రభుత్వం కాంగ్రెసుతో సమానంగా లీగును చూచుటను ఖండించి భారతప్రజల తరపున బ్రిటిష ప్రభుత్వంతో ఒప్పందానికివచ్చే హక్కు కాంగ్రెసుకు కలదని నొక్కిచెప్పారు.

బ్రిటిష, భారత కమ్యూనిస్టుపార్టీలలో భిన్న అభిప్రాయాలుపోయి సెప్టెంబరులో జోషి పార్టీ విధాన ప్రకటనను పునర్ముద్రించుటతో తమ ఆమోదాన్ని తెలిపారు. దానికి హారీపోలిట్ ఉపోద్ఘాతం వ్రాశారు, తదనంతర పరిణామాలు జోషి అవగాహన సరియైనదిగా స్పష్టమైనదని వ్రాశారు. అదేకాలంలో పామీదత్తు లేబర్ మంత్లీలో తన పూర్వ అవగాహననుమార్చుకొన్నారు. గతంలో కాంగ్రెసు ఒక్కటే భారత ప్రజలతరపున మాట్లాడగలదని తదనంతరం బ్రిటిష ప్రభుత్వం కాంగ్రెసుతోనేగాక అన్ని పార్టీలతో సంప్రదించాలన్నారు. జోషీవలెనె దత్తుకూడ కాంగ్రెసు ముఖ్యమైన రాయితీలను ఐక్యతకొరకు యివ్వాలని యిందుకొరకు ఆ పార్టీలు ఆ ప్రజలకు ప్రాతినిధ్యం వహించుచున్నవా, వహించుటలేదా అనే ప్రశ్నలను విచారించవలసిన అవసరం లేదన్నారు[2].

హిందూ, ముస్లిం సమస్య 1940 దశకంలో కమ్యూనిస్టుపార్టీ ముందుకు ఎలా వచ్చింది, "ప్రజాయుద్ధ" నినాదాన్నిచేబట్టినపార్టీ గతంలో కాంగ్రెసులో అన్ని వర్గాల ఐక్యత క్రమంగా హిందూ-ముస్లిం ఐక్యత రూపాంతరంగా కాంగ్రెసు-ముస్లింలీగుల ఐక్యతగా అభివృద్ధి చెందుటపై కమ్యూనిస్టుపార్టీలో ప్రాథమిక అభిప్రాయాల అభివృద్ధి, తత్సంబంధంగా జాతిని నిర్వచించే ప్రయత్నం ఈ సమస్యపై బ్రిటిష కమ్యూనిస్టుపార్టీ, భారత కమ్యూనిస్టుపార్టీ ప్రాథమిక అభిప్రాయాలలో భేదాలు చివరకు భారత కమ్యునిస్టుపార్టీ అభిప్రాయాలను క్రమంగా బ్రిటిష కమ్యూనిస్టుపార్టీ నాయకత్వవర్గాలు ఆమోదించుట చూశాము. ఇవన్నీ కలసి ఈ సమస్యను "ప్రజాయుద్ధ" రాజకీయవిధానంతోమేళవించి వ్యూహాన్ని ఎత్తుగడలను శాస్త్రీయకంగా అధ్యయనంచేసి వివరించవలసిన అవసరము ప్రధానంగా జాతీయ ఐక్యతా వుద్యమాన్ని కమ్యూనిస్టుపార్టీ చేబట్టుటతో వెన్వెంటనే చేయవలసిన కర్తవ్యంగా పార్టీ ముందుకువచ్చింది. ఈ సమస్యపైవున్న 'గందరగోళాన్ని', అస్పష్టతను తొలగించవలసిన పరిస్థితి యేర్పడింది.

---

1 డి.ఎన్, ప్రిట్ (1942) ఇండియా. లేబర్ మంత్లీ XXIV ఏప్రిల్ 1942 పే. 107

2. ఆర్. పామీదత్తు (1942) "నోట్సు ఆఫ్ ది మంత్" లేబరు మంత్లీ XXIV సెప్టెంబరు 1942 పే. 266. "కమ్యూనిజం ఇన్ ఇండియా" పే. 202లోని 2 ఉదహరింపులు

భారత కమ్యూనిస్టు పార్టీ జాతీయ ఐక్యతా ఎత్తుగడల వ్యూహం ప్రధానంగా జాతీయ కాంగ్రెసు-ముస్లింలీగులు, భారత స్వాతంత్ర పోరాటానికై అవసరమైన ఐక్యతకై సంప్రదింపులు జరిపి ఐక్యత నిర్మించాలని విజ్ఞప్తిచేయుటగా రూపొందింది. ఈ ఐక్యతకు కాంగ్రెసు, ముస్లిం ప్రజానీకం తరపున ముస్లింలీగు మాట్లాడేహక్కును గుర్తించి, లీగు రాజకీయ వాంఛితాలను రాయితీలను యివ్వవలసి వుంటుంది. ఈ విధమైన ఎత్తుగడలను చేబట్టిన భారత కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెసుతో పూర్వసత్సంబంధాలను కొనసాగించుట చాల కష్టంగా వుంది. కాంగ్రెసును సంతృప్తిపరచుటకై జులై 1942లో కాంగ్రెసు వర్కింగు కమిటీకి వొక బహిరంగలేఖను కమ్యూనిస్టు పార్టీ వ్రాసింది. కాంగ్రెసు సంస్థలో వుండుట పార్టీ జన్మహక్కుగా అది దేశభక్తుల సంస్థగా పేర్కొంటూ, వర్కింగు కమిటీని గర్వించదగిన జాతీయోద్యమపు గౌరవించదగిన నాయకత్వంగా చెప్పి, ఆ వుద్యమానికి కాంగ్రెసు ప్రాతినిధ్యము వహించుచున్నది.అది దేశభక్తుల రక్తంతో నిర్మింపబడిందని, లక్షోపలక్షలు ప్రజానీకం దానిని బలపరస్తున్నారన్నది. కమ్యూనిస్టులమైన తాము ఆ వుద్యమనందిలో పుటి 15 సంవత్సరాలు వయసు గలవారం, దానిని బలపరచుటకు తాము చేయగలిగినదంతా చేస్తామన్నారు. గర్వంతో కాంగ్రెసు సభ్యత్వకార్డును ధరిస్తామని, స్వాతంత్ర్యానికై భుజం భుజం కలిపి పోరాడగలమన్నారు. ఈ పొగడ్తలన్నీ కాంగ్రెసు, కమ్యూనిస్టుల మధ్య గల మౌలిక భేదాభిప్రాయాలను కప్పిపెట్ట జాలకపోయాయి

ఆగష్టు 1942లో అఖిల భారత కాంగ్రెసు వర్కింగు కమిటీ మహాసభలు బొంబాయిలో జరిగాయి.ఆగష్టు 9న "క్విట్ ఇండియా" తీర్మానాన్ని కాంగ్రెసు ఆమోదించింది. వెంటనే ప్రభుత్వ కాంగ్రెసు నాయకత్వాన్ని డిటెయిన్ చేసింది ఎ ఐ సి సి లోని కమ్యూనిస్టు ప్రతినిధులు అష్రాఫ్, సజ్జాద్ జహీర్‌ల నాయకత్వంలో "ప్రజా యుద్ధ" విధానం ప్రాతిపదికగా సవరణలు ప్రతిపాదించి తీవ్రంగా పోరాడారు, కాంగ్రెసు అగ్రనాయకత్వంతో యేకీభవించజాలకపోయారు.

"క్విట్ ఇండియా" వుద్యమం మహోన్నత చారిత్రిక మహోద్యమంగా, ప్రజానీకం నాయకత్వం జైళ్ళపాలైనా, మహోన్నతంగా, ఆఖరి పోరాటంగా నడచింది. తత్ఫలితంగా జాతీయ పోరాటం దేశమంతా దవానంలా వ్యాపించింది. కమ్యూనిస్టు రాజకీయ విధానం విశ్వాసంపై సడలిపోయింది కమ్యూనిస్టు వర్గాలలో గందరగోళం వ్యాపించింది, మా కుర్రవాళ్ళు బురదలోనుండి కదలజాలకపోయారు అన్నారు జోషి. అంచేత, పార్టీ కాంగ్రెసుతో అవగాహనావకాశాలను చూడవలసి వచ్చింది. దేశమంతటా పార్టీ చేబట్టిన జాతీయ ఐక్యతా వుద్యమాన్ని యీ లక్ష్యమార్గంలోనే చూడవలసి వుంటుంది జాతీయ ఐక్యతా వుద్యమంతోపాటు, కాంగ్రెసుపై నిషేధం తొలగించాలని, కాంగ్రెసు నాయకులందరిని విడుదల చేయాలనే ఆందోళనను కమ్యూనిస్టు పార్టీ చేపట్టింది. పార్టీ సెప్టెంబరు ప్లీనం సమావేశం, యిచ్చిన వుద్యమ ఆందోళన నినాదాలు; మహాత్మాగాంధీ తదితర జాతీయ నాయకులను విడుదల చేయాలి, నిర్భంధ విధానాన్ని అంతం చేయాలి, విధ్వంసం, విద్రోహచర్యలు, అరాచకం ఆపివేయాలి; కాంగ్రెసుపై నిషేదం తొలగించాలి; సమగ్ర వొప్పందానికి సంభాషణలు,

భారతదేశరక్షణకు తాత్కాలిక జాతీయ ప్రభుత్వాన్ని యేర్పాటు చేయాలనే నినాదాలు ప్రచారం చేయబడినవి.

భారత కమ్యూనిస్టు పార్టీ "క్విట్ ఇండియా" తీర్మానాన్ని "తప్పుదారిని పట్టించిన, ప్రమాద భరిత"మైనదిగా విమర్శించి; కాంగ్రెసు తప్పిదాలకు బాధ్యత బ్రిటిష్ ప్రభుత్వం వహించవలసి వుంటుందని ప్రకటించింది. గాంధీజీపై తీవ్రప్రచార వుద్యమాన్ని చేబట్టింది, కాంగ్రెసుపై విమర్శన వాడిని తగ్గించివేసింది. విద్రోహ చర్యలకు పాల్పడుతున్న "పంచమాంగదళ" వర్గాలపై, జాతీయవర్గాలలోవున్న అరాచక వాదులపై మాత్రమే విమర్శనను కేంద్రీకరించింది జాపనీసు వర్గాలతో చేతులు కలుపుతు యుద్ధ ప్రయత్నాలకు విద్రోహం చేస్తున్న వారిపైనే కేంద్రీకరించింది. సుభాస్ చంద్రబోస్, జపానుతో చేతులు కలుపుతున్న భారతజాతీయ సైన్యంపై సోషలిస్టులపై కమ్యూనిస్టు పార్టీ తన విమర్శనా దాడిని కేంద్రీకరించింది. దశాబ్దాల తరువాత బోసును, జాతీయ సైన్యాన్ని ఆ విధంగా విమర్శించి వుండవలసిందికాదని, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని, కార్మికవర్గ దైనిక పోరాటాలను, వాటి వాడిని కోల్పోవుట సరికాదని, కమ్యూనిస్టు పార్టీ ఆమోదించింది.

అయితే, కమ్యూనిస్టు పార్టీ విధానం ముస్లింలీగుతో సుహృద్భావాన్ని కలిగియుండుటయే, కాంగ్రెసు వ్యతిరేక దృష్టిని పరోక్షంగా వుండుటను చూడగలము. లీగును కాంగ్రెసు సమానస్థాయికి తీసుకొచ్చి, లీగు కోర్కెలను ఆమోదించవలసినదిగా ప్రకటించుట ఆ అభిప్రాయాన్నే బలపరస్తుంది. ఈ సందర్భంలో కేంద్ర కమిటీ సభ్యుడు సజ్జాద్ జహీర్ అభిప్రాయం పేర్కొనవలసి వుంది. "ముస్లింలీగు పెరుగుతు, తన చుట్టూ లక్షల కొలది స్వాతంత్ర్య ప్రియులను సమీకరించుకొనగలుగుట భారత ముస్లిములకు, భారతదేశానికి మంచిది, సంతోషకరమైనది. అభ్యుదయ, ప్రజాస్వామ్య మార్గంలో ముస్లిం ప్రజాసామాన్యాన్ని సమీకరించుకొనగల శక్తి రోజు రోజు ముస్లింలీగు పెంచుకొనుటలో కోట్ల ముస్లిం ప్రజల విముక్తి, కాంగ్రెసు-లీగుల ఐక్యతావకాశాలు సాధ్యపడుతవి[1]" అని సజ్జాద్ జహీర్ మాట్లాడుటపై అభిప్రాయాన్నే బలపరస్తుంది.

కమ్యూనిస్టు పార్టీ, ముస్లింలీగు, దాని లక్ష్యాల యెడల సానుభూతిని చూపుటకంటె మిన్నగానే వ్యవహరించింది. భారత మతసమస్య పరిష్కారానికి వొక కార్యక్రమాన్ని రూపొందించింది. అది కమ్యూనిస్టుల సిద్ధాంతానికి, లక్ష్యమునకు సరియైనదే అయినా అది లీగు ధ్యేయానికి, చర్యలకు సహకారి అయింది. పార్టీ "జాతుల విధానం" 1940లో మొదట ప్రాథమికంగా కన్పించినా, తదనంతరం పూర్తి సిద్ధాంత రూపాన్ని పొందింది.

1. సజ్జాద్ జహీర్. (1944) ఏకేసీ ఫర్ కాంగ్రెస్-లీగ్ యూనిట్. పి.పి.హెచ్. 1944. పే. 20, 86.

కమ్యూనిస్టు పార్టీ 1942 మధ్యకు, భారతదేశం అనేక జాతుల కూటమి అని షరతులేని స్వయంనిర్ణయ హక్కు ప్రతి జాతికి యివ్వబడాలనే అవగాహనకు వచ్చింది జులైలోని వొక పత్రికా ప్రకటన "మన జాతుల ఐక్యతకు ఆధారసూత్ర మేది? స్వయం నిర్ణయ సూత్రాన్ని, విడిపోయే హక్కుతోసహా, మన ఉపఖండం లోని అన్ని జాతులకు కలదని గుర్తించుటయే[1]"నని స్పష్టం చేసింది.

కమ్యూనిస్టు పార్టి కేంద్ర సమితి, సెప్టెంబరు 1942లో సమావేశమై అధికారి నివేదిక ఆధారంగా రూపొందించిన తీర్మానంలో నూతన పార్టి రాజకీయ విధానం స్పష్టం చేయబడింది. అందులోని పేరా ;

"భారత ప్రజానీకంలోని ప్రతిభాగం ఒక నిర్దిష్ట ప్రాంతంలో నివశించుతు, ఒకే చరిత్ర, సాంప్రదాయము, సంస్కృతి, మనోప్రవృత్తి ఆర్థిక జీవనం గలవారిని ప్రత్యేకజాతిగ స్వపరిపాలన రాష్ట్రం(State)గా స్వతంత్ర భారత యూనియన్‌లో లేక ఫెడరేషనులో వుండవచ్చు. వారు కోరేటట్లయితే విడిపోయే హక్కుగలదు. ఆ విధంగా రేపటి స్వతంత్ర భారతదేశం వివిధ జాతుల స్వపరిపాలిత రాష్ట్రాలు ఫెడ రేషన్ లేక యూనియన్‌గ వుంటుంది. ఆ విధంగా పఠానులు, పశ్చిమ పంజాబీలు, శిక్కులు, సింధీలు, హిందూస్తానీయులు, రాజస్తానీయులు, గుజరాతీయులు, బెంగాలీలు అస్సామీయులు. బీహారీలు, ఒరియావారు, ఆంధ్రులు, తమిళులు, కర్నాటకులు, కేరళీ యులు, మహారాష్ట్రులు భారత ఫెడరేషన్ లేక యూనియన్‌లో స్వపరిపాలిత రాష్ట్రా లలో వుంటారు.

అంత్య విశ్లేషణ అన్ని జాతులు విడిపోతాయా అన్న ప్రశ్నకు పార్టీనేరుగా సమాధానం యివ్వలేదు అధికారి. "విడిపోయే హక్కును యిచ్చుట, వాస్తవానికి ఆ హక్కును అందరు వినియోగించమనుటగా గందరగోళము చేయరాదని వాస్తవంగా విడిపోవుటగా నెంచరాదు. అధిక సంఖ్యాకులుగావున్న ముస్లింజాతులు విడిపోదలచు కొంటే విడిపోవచ్చు. అది వారి నివాశదేశం, వారి స్వపరిపాలన రాష్ట్రాన్ని వారు కోరి యేర్పాటు చేసుకొనవచ్చు. ఈ అంశంపై పార్టి ముస్లింజాతులు కలసి ఒకేజాతి రాష్ట్రం పాకిస్తాన్‌గా ఏర్పరచాలని అనలేదు. కాని ఆ అవకాశం వుంది జాతుల స్వయం నిర్ణయం సూత్రములోనే అట్టి అవకాశంవుంది తదనంతరం ప్రతితీర్మానం ప్రకటనపార్టీ దానిని ఆమోదించినట్లుతెలుపుతున్నవి. సెప్టెంబరు రాజకీయ తీర్మానం ఒకచోట "ముస్లిం స్వాతంత్రం"మని, అక్టోబరు మానిఫెస్టోలో "స్వపరిపాలన" మాటకు బదులుగా "సార్వభౌమాధికారం" అనేమాటను ముస్లిం రాజ్యాన్ని పేర్కొ నుట జరిగింది. ఒక సంవత్సరంతరువాత పార్టీ బహిరంగంగా పాకిస్తాన్ ఏర్పాటును బలపరచింది. సజ్జాద్ జాహీర్ కాంగ్రెసు, ముస్లింలీగు సామ్రాజ్యవాద వ్యతిరేక విముక్తి పాత్రను చూడజాలకపోయిందని విమర్శించి, ముస్లిం స్వయంనిర్ణయం అంటె పాకిస్తాన్ న్యాయసమ్మతం, అభ్యుదయకరమైన జాతీయ కోరికయని సుముఖ

---

1. ఈ ఉదహరింపులు, కమ్యూనిజం ఇన్ ఇండియా-పే. 214లో పేర్కొనబడినవి. ఎన్,కె. కృష్ణన్. సం. నేషనల్ యూనిటీ ఫర్....పే. 24-27.

స్వాతంత్ర, ప్రజాస్వామ్య అభిప్రాయ ప్రకటన అట్టిదానికొరకే గత కాలమంతా ప్రయత్నించి అనేక కష్టాలను ఎదుర్కొంది" అని వ్యాఖ్యానిస్తూ స్పష్టంగా పాకిస్తాన్‌ను బలపరచారు[1].

భారత కమ్యూనిస్ట్ పార్టీ రాజకీయ పరిష్కారానికి ప్రతిపాదించిన సూత్రాంశాలు రాయితీలు ఏకపక్షంగా వున్నవనేది స్పష్టం.

**అధికోత్పత్తి ఉద్యమము**

జాతీయ ఐక్యతా వుద్యమములాగానే భారత కమ్యూనిస్టు పార్టీ అధికోత్పత్తి ఉద్యమము యుద్ధరక్షణ ప్రయత్నాలకు అత్యధిక ప్రయోజనానికి ఉద్దేశించబడింది. కాంగ్రెసు-లీగు ఐక్యత దేశంలోని రాజకీయ శక్తులన్నిటి మధ్య సహకారాన్ని పెంపొందించుటకు ఉద్దేశించబడిన విధంగానే అధికోత్పత్తి వుద్యం అన్ని ఉత్పత్తి శక్తుల సహకారాన్ని పెంపొందించి యుద్ధావసరాలు, ప్రజాదైనిక అవసరాల ఉత్పత్తులను బహుళంగా పెంచి, ఫాశిస్టు వ్యతిరేక పోరాటానికి జాతీయ ఐక్యతా, ఆర్థిక పునాదులను బలపరచుటకుద్దేశించబడింది. అదేకాలంలో జాతీయ వర్గాలలో మరోవైపు కార్మిక, కర్షక, మధ్యతరగతి వర్గాలలో పార్టీని విస్తరించుట, బలాన్ని పెంపొందించుటకుకూడ ఉద్దేశించబడింది.

కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటి 1942 ప్లీనం ఆర్థిక పారిశ్రామిక విధానంపై తీర్మానం కార్మికవర్గపు సాంప్రదాయ ప్రయోజనాలను కాపాడుకొంటూ అధికోత్పత్తి గమ్యంగా విధానాన్ని నిర్ణయించింది. ఆర్థిక సంస్కరణలు, కోర్కెలను వదలివేసింది. ప్రభుత్వ అసమర్థతను తీవ్రంగా తీర్మానం విమర్శించింది. కొన్ని కనీస కార్మికుల కోర్కెలను కోరింది. సమ్మెలు తక్కువగా జరుగతవని ప్రకటించింది. సమ్మె ఆయుదాన్ని వదలివేయుటకు నిరాకరించింది, మరో మార్గంలేనపుడు సమ్మెలు తప్పవు అని వివరించింది.

సాంప్రదాయ కార్మిక విధానం, అధికోత్పత్తి వ్యూహం విధానానికి తావు ఇవ్వవలసిన అవసరం 1943 మధ్యకు యేర్పడింది. పార్టీమొదటి కాంగ్రెసులో రణదివె "షరతులతో అధికోత్పత్తికి మద్దతునిచ్చుట, జాతీయ అతివాద పెడదారి" అగుతుందని "సమ్మెలు గట్టిగా నిరోధించాలి" అన్నారు. ఆర్థిక వివాదాల పరిష్కారానికి త్రైపాక్షిక,కార్మికులు, యజమానుల ప్రభుత్వసంస్థల బోర్డులను యేర్పాటుచేయాలని ప్రతిపాదించారు[2].

కమ్యూనిస్టుపార్టీ ఆహార అధికోత్పత్తి విధానం కూడ పారిశ్రామిక విధానపు అవగాహన పంథాలోనే వుంది. భూ సంస్కరణలు అనే సాంప్రదాయక కోర్కెను వదలివేయుట జరిగింది. భూస్వాములు, గ్రామీణ వ్యాపారులతో అధిక ఆహారోత్ప

---

1. జె నె డి ఓవర్‌స్ట్రీట్, మార్షల్‌విండ్ మిల్లర్ (1958) కమ్యూనిజం ఇన్ ఇండియా పే. 214-215
2. రణదివె, బి.టి. (1943) కార్మికవర్గం జాతీయ రక్షణ పి.పి.హెచ్. 24 పే.

త్తికి సహకరించమని రైతులను కోరుతు, "ప్రజా-ఆహార కమిటీల"ను యేర్పరచి ఒక్క నిల్వదారులతోపాటు అందరికి యిబ్బంది కలిగించుట జరిగింది. వ్యాపారులకు "న్యాయమైన లాభాలను," రైతులకు న్యాయమైన ధరలను పంటలకు" గ్యారంటీ చేయాలనే వ్యవసాయ విధానాన్ని ప్రకటించింది

అధికోత్పత్తుల ఉద్యమం "పార్టీ కార్యక్రమాలన్నీ అత్యధిక, ఆర్థిక తోడ్పాటును యుద్ధరంగానికి యివ్వనిచో చెప్పే మాటలన్నీ వొట్టి కబురులే" అని జోషీ, వుద్యమ ప్రాధాన్యతపై వ్యాఖ్యానించారు. అధికాహారోత్పత్తి వుద్యమంపై కేంద్ర కమిటి సభ్యులు సర్దేశాయి "అధి ఆహారోత్పత్తి రంగంలో పార్టీ సరియైన విధానాలకు, విజయాల కొలమానము, ఆ రంగంలో, పార్టీ సంఖ్యాబలం, రాజకీయ ప్రాబల్యము యెంతగా అభివృద్ధి చెందిందనది" అని స్పష్టం చేసారు. అంతేగాక, "అధికోత్పత్తి ప్రచారోద్యమం ద్వారా పార్టీ అభివృద్ధికి, నిర్మాణానికి ప్రయత్నించుట" సెక్టేరియనిజంగా యెంచరాదన్నారు.[1]

**నూతన విధానాల ఫలితాలు :**

కమ్యూనిస్టు పార్టీ తమ శక్తి, యుక్తుల అన్నిటిని "ప్రజాయుద్ధ" విధానాన్ని, ఎత్తుగడలను అమలుచేయుటలో రోజు రోజుకు కష్టాలను, ప్రతిఘటనను, నిరోధకతను, దాని ధ్యేయాలను సాధించుటలో ఎదుర్కొనవలసి వచ్చింది. కాంగ్రెసు సామాన్య భారత ప్రజాభిప్రాయాన్ని ప్రకటించుతు, యుద్ధ ప్రయత్నాలను వ్యతిరేకించుచున్నది. ఆ విధంగా కమ్యూనిస్టుల లక్ష్యమైన పాశిస్టు వ్యతిరేక పోరాటానికై జాతీయ ఐక్యత సాధించబడలేదు. కాంగ్రెసు, ముస్లింలీగుల వైఖరి, లక్ష్యం మౌలికంగా వైరుధ్యంగా ఉన్నవి. ఆ విధంగా కమ్యూనిస్ట్ ఎత్తుగడలైన, కాంగ్రెసు-లీగు ఐక్యత ఏర్పడలేదు. తదనంతర సంవత్సరాలలో ముస్లింల ప్రజాసామాన్యంలో జాతుల స్వయంనిర్ణయ సిద్ధాంతాన్ని ప్రచారంచేసి ఎంతటి అభిమానాన్ని చూరగొంది, స్పష్టంగా కనిపించదు, సమ్మెలను ప్రోత్సహించనందున కొంతవరకు అధికోత్పత్తికి తోడ్పడి వుండవచ్చు కాని పార్టీ అర్థికరంగంలో పారిశ్రామిక, వ్యవసాయ రంగాలలోని ఎత్తుగడలు కార్మికులు, కర్షకులు తదితర మధ్య తరగతి వర్గాలలో పార్టీ శాశ్వతంగా తన స్థానాన్ని బలపరచుకొనుటకు, విస్తరణకు వుపయోగపడినట్లు కన్పించదు. ట్రేడు యూనియన్, కర్షక వుద్యమాలలో నిర్మాణరీత్యా గణనీయమైన విజయాలను సాధించుట, ప్రత్యర్థి వర్గాలు లేనందున లభించినవే

కమ్యునిస్టు పార్టీ యుద్ధకాలంలో అవలంబించిన విధాన ప్రధాన ఫలితం జాతీయోద్యమం, కాంగ్రెసునుండి దూరమగుట, దీనిని అధిగమించుటకు యుద్ధపు చివర రోజులలో కనీస సంబంధాలను కలిగియుండే ఆశతో కొన్ని ప్రయత్నాలు చేసినా, మరోవైపు కాంగ్రెసు కార్యకర్తలలో, వారి ననుసరించే ప్రజాసామాన్యంలో కమ్యూనిస్టు వ్యతిరేకత, ప్రతిఘటన యెక్కువైంది. కమ్యూనిస్టులు యింకా కాంగ్రెసులోనే ఉన్నారు. సంస్థ ఆఫీసులలో ముఖ్య కార్యకర్తలుగాను ఉన్నారు.రష్యా ప్రయోజనాల

1. రంగనేకర్ అండ్ పరీఖ (1943) కాంగ్రెసు-కమ్యూనిస్టు టాంగిల్. 16-17.

రక్షణకై, జాతీయోద్యమ ప్రయోజనాలకు ద్రోహం చేసిందని,కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారం జాతీయవర్గాలలో కొనసాగింది.[1], బొంబాయి రాష్ట్రకమిటి ప్రచురణ "కమ్యూనిస్టులు, ఎప్పుడో ఒకప్పుడు కాంగ్రెసులోని ప్రతివర్గాన్ని విమర్శించి, నిందా ప్రచారం చేసారు" అని ప్రకటించింది.

కమ్యూనిస్టు పార్టీ రహస్యంగా బ్రిటిషు అధికారవర్గంతో సహకరిస్తుందనే అనే అనుమానంతోకూడ జాతీయ కాంగ్రెసుతో సంబంధాలు విచ్ఛిన్నమయ్యాయి. భారతదేశంలోని అనేక పత్రికలు, సర్ రెజినాల్డుకు పి. సి. జోషీ వ్రాసిన లేఖ అని ప్రతిని ప్రకటించాయి ప్రభుత్వం నుండి ఆర్థిక సహాయం లభించుచున్నదని, ముస్లిం లీగుతో రహస్య ఒప్పందం పార్టీ చేసుకొన్నదని, కాంగ్రెసును అనేక విధాల క్రిందికి లాగుతున్నదని ప్రచారం సాగింది. పార్టీ లేఖ విషయాన్ని ఖండించింది, ఫోర్జరీ అంది దాని వాస్తవికత అనుమానాస్పదము. బహిరంగంగానే బ్రిటిషు యుద్ధ ప్రయత్నాలను, స్వయం నిర్ణయసూత్రం అనే పేరుతో పరోక్షంగా ముస్లింలీగును బలపరచుటలో రహస్యం యేమీలేదు. అయితే, పార్టీ నుండి బయటకి వెళ్ళిన, సోలి బాట్లివాలా, మాజీపార్టీ కేంద్ర కమిటి సభ్యుడు తన రచనలలో యీ నిందలు వేయుటతో కొంత ప్రచారం లభించింది.

"జాతీయ కాంగ్రెసులోని అత్యధికులలో కమ్యూనిస్ట్ వ్యతిరేకత బలంగా వున్నదని[2]" 1944 చివరకు జోషీ గుర్తించక తప్పలేదు. అనేక రాష్ట్రాలలో రాష్ట్ర కాంగ్రెసు కమిటీలు, ఆఫీసులలో కమ్యూనిస్టులు బాధ్యతా కార్యకర్తలుగా వుండ రాదని తీర్మానాలు చేసాయి. ప్రతిస్పందించిన జోషీ కాంగ్రెసును పొగుడుతూ,సత్సంబంధాలను పునరుద్ధరించిమని విజ్ఞప్తి చేసారు. "కాంగ్రెసే భారత స్వాతంత్ర్య పతాకాన్ని ప్రతిష్టించింది. కాంగ్రెసు నాయకులనుండే మేము ప్రాధమిక దేశభక్తి పాఠాలు నేర్చుకొన్నాం, ఈ రోజు కాంగ్రెసువాదులతో భుజం భుజం కలిపి పోరాడే అవకాశం లేకుండా చేస్తున్నారు. మాకు కాంగ్రెసు మాతృసంస్థ, దాని నాయకులు మాకు పితృ సమానులు, దాని అనుచరులు సోదర పోరాటవాదులు[3]" అని జోషీ విజ్ఞప్తి చేసారు.

కాంగ్రెసు-కమ్యూనిస్ట్ సంబంధాలు విషమించాయి. వాటిని పునరుద్ధరించు ప్రయత్నంగా గాంధీజీని కలుసుకొని సంభాషణలు జరిపారు. జోషీ చొరవతీసకొని "గౌరవాభివందనాలతో" గాంధీజీకి "భారత ప్రజల దేశభక్తి సంస్థనాయకుడు ప్రజలచే అత్యధికంగా ప్రేమించబడు" నాయకుడు అని వ్రాశారు. సంభాషణల తరువాత గాంధీజీ కొన్ని ప్రశ్నలు లేవనెత్తి సమాధానాలు అడిగారు. "ప్రజాయుద్ధం" అంటే యేమిటి వివరించమన్నారు. జోషీ కమ్యూనిస్ట్పార్టీ అవగాహనను వివరించారు. పార్టీ

---

1. టెండుల్కర్, ఎ. జి. (1945) ఎ నేషన్ బెట్రేయిడ్. ఎ కేస్ ఎగనెస్ట్ కమ్యూనిస్ట్. పే. 3.
2. దీనితోపాటు 1, 2. రిఫరెన్సులు. కమ్యూనిజం ఇన్ ఇండియా-పే 218-19 లలోని ఉదహరింపులు.
3. అదే. అదే. పే. 220.

నిధివసూలు, ఖర్చులువగైరాలు ఆడిట్ చేయబడుతున్నవా అనిఅడిగిదానికి జోషి రాజకీయపార్టీల అక్కౌంట్సు ఆడిట్ చేయించే సాంప్రదాయంలేదని గాంధీజీగాని, గాంధీజీ ప్రతినిధియెవరైనాగాని పరిశీలించవచ్చని విన్నవించారు. సమ్మె నాయకులు అరెస్టుకాబడుటకు కమ్యునిస్టుపార్టీ ప్రభుత్వానికి సహాయపడినదా అన్నప్రశ్నకు నేరుగా సమాధానమివ్వ నిరాకరించి గాంధీజీని యన్. యం. జోషి, అభిప్రాయంపై మీ నిర్ణయం చేసుకొనండనికోరారు. కమ్యునిస్టులు కాంగ్రెసు వ్యతిరేక దృష్టితో కాంగ్రెసులో ప్రవేశించారా అన్నప్రశ్నకు హక్కుగాను, "ఉన్నతగౌరవంగాను" యెంచి కాంగ్రెసు సభ్యత్వం స్వీకరించామన్నారు. మీ పార్టీవిధానం విదేశాలచే డిక్టేటు చేయబడుతున్నదా అన్న ప్రశ్నకు "అన్ని కమ్యూనిస్టుపార్టీలకు ఒకే సిద్ధాంతంపై విశ్వాసాలున్నవి. భారత కమ్యూనిస్టుపార్టీ తన ప్రజా ప్రయోజనాలను ప్రపంచ ప్రజలను తాను అర్థం చేసుకొన్న విధానమునుండి తన విధానాన్నితానే నిర్ణయించుకొంటుందని ప్రత్యుత్తరం వ్రాశారు. అంతేగాక గాంధీజి ప్రశ్నలు మమ్ము "బంధించాయి" కారణం "ముందుగనే యేర్పరచుకొన్న దురభిప్రాయాలను కలిగివున్నవి "అని అన్నారు. గాంధీజీ "నాకు దురభిప్రాయాలున్నవి. నాతో ప్రశాంతంగా నీకు చేతనైనంత బాగా వాటిని తొలగించు" అనివ్రాసారు. అదే కాలంలో జోషి సమాధానాలన్నిటిని త్రోసిబుచ్చారు. "ప్రజాయుద్ధ" సిద్ధాంతం తప్పుదారిని పట్టించేదిగా వుంది" అని గాంధీజీ వ్రాశారు. పార్టీ నిధుల విషయమై జోషి విశ్వాసాన్ని అంగీకరిస్తున్నారు జోషి వ్రాసిన వాటికి నిర్దిష్ట ఆధారాలు కావాలన్నారు గాంధీజీ. గాంధీజీ రాజకీయ విషయం తరువాత వదలి నీతిరాహిత్యం, మాంసభక్షణ, ఖాదీధరించకపోవుట, అహింసకాక హింసావాదాన్ని చేబట్టు అనే విషయాలనుగూడ లేవనెత్తారు. చివరకు కమ్యూనిస్టుపార్టీ తానుతీర్పుచెప్పజాలనని, ఆ సాక్ష్యాధారాలుగల కాంగ్రెసే పరిశీలించి తగునిర్ణయం చేయగలదన్నారు. గాంధీజీని, కాంగ్రెసును కమ్యునిస్టుపార్టీ శాంతపరచజాలకపోయింది. కాంగ్రెసుతో సత్సంబంధాలు నెరపుట కష్టసాధ్యమైంది.

యుద్ధానంతరం, కాంగ్రెసు వర్కింగు కమిటి నెహ్రూ, వల్లభాయ్‌పటేల్, గోవిందవల్లభపంత్‌లతో ఉన్నతస్థాయి సబ్ కమిటిని ఏర్పాటుచేసి, కాంగ్రెసులో కమ్యునిస్టుల కార్యక్రమాలను, చర్యలను పరిశీలించవలసిందిగా కోరింది. కమిటి త్వరగానే కాంగ్రెసు విధానాలకు వ్యతిరేకంగా పనిచేశారని ఎందుకొరకు వారిపై క్రమశిక్షణా చర్యను తీసుకొనరాదో సంజాయిషీ చెప్పుకొనవలసిందిగా కోరింది. కమ్యూనిస్టుపార్టీ సాధారణ కాంగ్రెసు సభ్యులుగావున్న కమ్యునిస్టుల అందరిని కాంగ్రెసుకు రాజీనామా చేయవలసిందిగా కోరింది.

అఖిలభారత కాంగ్రెసు కమిటీలోని కమ్యునిస్టు సభ్యులు కమిటీ అడిగిన సంజాయిషీకి సుదీర్ఘ సమాధానాన్ని రెండు సంపుటాలుగల పుస్తకాలుగ ప్రకటించారు. సబ్‌కమిటి నివేదికపై ఆధారపడి అఖిల భారత కాంగ్రెసు కమిటీ, కమ్యూనిస్టులను కాంగ్రెసునుండి తొలగించింది.

# IV

# సంయుక్త స్వాతంత్ర్య సంఘటన

కమ్యూనిస్టు పార్టీపై నిషేధం జులై 1942లో తొలగించారు. ప్రథమ భారత కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెసు బొంబాయిలో మే-జూన్ 1943లో జరిగింది. "జాతీయ రక్షణకు జాతీయ ప్రభుత్వం, జాతీయ ప్రభుత్వానికై జాతీయ ఐక్యత" అనే వ్యూహాన్ని సరిగానే రూపొందించింది. ప్రపంచ ఫాసిస్టు వ్యతిరేక "ప్రజాయుద్ధం" ధోరణిలో, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని వాయిదా వేసింది. జాతీయ, అంతర్జాతీయ కర్తవ్యాలను మేళవించుటలో వైఫల్యమైంది. అవసరమైన చోట్ల పరిమిత సమ్మెలు, పోరాటాలు జరుపక, సామ్రాజ్యవాద దౌర్జన్యానికి వ్యతిరేకంగా ప్రజలు రెచ్చిపోయి చేసిన విధ్వంసనాన్ని "పంచమంగదళ" చర్యలుగా చిత్రించుట, స్టాలిన్ గ్రాడు యుద్ధం తరువాత వచ్చిన ప్రధాన మలుపును గమనించి పట్టువిడుపుల ఎత్తుగడలను నిర్ణయించుటలో పార్టీ విఫలమైంది. వీటితోపాటు జాతీయ స్వయం నిర్ణయ సూత్రాన్ని పొరపాటుగ పాకిస్తాన్‌కు అన్వయించుటతో జాతీయ ప్రధాన స్రవంతి నుండి విడివడి దూరమగుట జరిగింది.

పార్టీ యింతటి అననుకూల వాతావరణంలో అచంచల విశ్వాసంతో దైనందిన సమస్యలతోపాటు రాజకీయ సమస్యలను జోడించి, శక్తివంతమైన ప్రజోద్యమాల నిర్మించి, ఆహారసమస్యపై ప్రభుత్వ వ్యతిరేక పోరాటాన్ని సాగించింది,అఖిల భారత ట్రేడు యూనియన్ కాంగ్రెసు సభ్యత్వం 1943లో 3 లక్షలుకాగా 1945లో 5 లక్షలకు పెరిగింది. కిసాన్‌సభ సభ్యత్వం 1943లో 3 లక్షలు కాగా 1945 లో 8 లక్షలకు పైగా పెరిగింది. అదే విధంగా విద్యార్థి, మహిళ, యువజన సంఘాల సభ్యత్వం, ప్రజానాట్య మండలలు గణనీయంగా అభివృద్ధి చెందాయి.

కాంగ్రెసు నాయకులు 1945లో విడుదలానంతరం సాగించిన కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారదాడులను, ఆత్మ విశ్వాసంతో పార్టీ సభ్యులు, నాయకత్వం త్రిప్పి కొట్టగలిగింది. ప్రజాసమస్యలను చేబట్టి ప్రజా వుద్యమాలను నిర్మించుతు ప్రజలలో నిలబడి, విస్తరించిగలిగింది.

**యుద్ధానంతర ప్రజావెల్లువ :**

సోవియట్ రష్యా, మిత్రపక్షాల విజయంతో యుద్ధానంతరం ప్రపంచమంతటా ప్రజోద్యమాల వెల్లువ ప్రారంభమైంది. అందులో భాగంగానే కార్మికుల సమ్మె పోరాటాలు వెల్లువగా సాగాయి. కార్మికుల సమ్మెలవలన 1945లో మొత్తం 70 లక్షల 62 వేల కార్మికులు పాల్గొనగా, 33 లక్షల పనిదినాలు, 1946లో 19 లక్షల 62 వేల మొత్తం కార్మికులు పాల్గొనగా 127 లక్షల పనిదినాలు, 1947లో 18 లక్షల 41వేల కార్మికులు పాల్గొనగా 165 లక్షల 63 వేల పనిదినాలు పరిశ్రమలు నష్టపోవుట జరిగింది. యుద్ధానంతర కార్మికోద్యమ వెల్లువ వీటినిబట్టి స్పష్టం కాగలదు.

గోల్డెన్‌రాక్‌లో సెప్టెంబరు 1946లో బ్రహ్మాండమైన రైల్వే కార్మికుల సమ్మె జరిగింది. అదే నెలలో సరిహద్దు రాష్ట్రాలలో రైల్వే సమ్మె, అఖిల భారత పోస్టల్ సమ్మె జరిగాయి. అనేకచోట్ల ఉద్యోగులు, విద్యార్థులు సమ్మెలలో చేరారు. ఆర్థిక

సమ్మెలు రాజకీయ పోరాటాలుగ పరివర్తన చెందాయి. కొన్ని ప్రాంతాలలో పోలీసులతో ప్రజలు సాయుధ ఘర్షణలుపడ్డారు. బ్రిటిష్‌వారి కుట్రలతో కొన్ని నగరాలలో మతకలహాలు చెలరేగాయి.

బ్రిటిషు ప్రభుత్వం 25 డిశెంబరు 1945న భారత సైన్యాన్ని ఇండోనేషియాలో సామ్రాజ్యవాద వ్యతిరేక తిరుగుబాటును అణచివేయుటకు పంపుటకు వ్యతిరేకంగా జరిగిన ప్రదర్శనలలో అనేక నగరాలలో పోలీసులుతో ప్రజలు ఘర్షణలుపడ్డారు. భారత జాతీయసైన్యపు (ఐ ఎన్ ఏ) అధికారులైన సెగాల్, ధిలాన్, షానవాజ్‌లను నవంబరు 1945లో రెడ్‌పోర్ట్‌లో విద్రోహనేరానికి విచారణ మొదలు పెట్టగానే విస్తార ప్రాంతాలలో ఉద్రేకపూరిత ప్రదర్శనలు జరిగాయి. కాంగ్రెసు వారి తరపున డిఫెన్సు కమిటి యేర్పాటు చేసింది. ముస్లింలీగ్ మిన్నకుంది. కఠిన శిక్షలను ప్రకటించుటతో ముస్లిం ప్రజానీకం ప్రజాప్రదర్శనలలో పాల్గొంది. కలకత్తాలో నవంబరు 22న ప్రజాప్రదర్శన పోలీసుల దౌష్ట్యానికి గురియగుటతో ఘర్షణలు, వీధి పోరాటాలు, బారికేడ్సు నిర్మాణాలు జరిగాయి. మునిసిపలు కార్మికులు సమ్మెజేసారు. ఒక మిలిటరీ వ్యానును తగులబెట్టారు. గవర్నరు కె సీ తెల్లసైన్యాన్ని రంగంలోనికి దించాడు. ప్రజలు వొక్క శరత్ చంద్రబోస్ విజ్ఞప్తితో మాత్రమే వెనుకకు తగ్గారు. పోలీసులతో బొంబాయి, మధుర యితర నగరాలలో ఘర్షణలు జరిగాయి.

కెప్టెన్ అబ్దుల్‌రషీద్‌కు ఫిబ్రవరి 1946న కఠినశిక్ష విధించుటతో పోలీసులతో నూతన సంఘర్షణలు ప్రారంభమైనాయి. కలకత్తా, ఢిల్లీ, బొంబాయి, పెషావర్, మీరట్‌లలో మతకలహాలున్నప్పటికి ఐక్యప్రజాపోరాటాలు ప్రారంభమయ్యాయి. బ్రిటిషువారు, వారి యేజంట్లు యెన్నోచోట్ల మతకలహాలను రేకెత్తించినప్పటికి, హిందూ-ముస్లిం ప్రజా సామాన్యం ఐక్యపోరాటాలు సాగించింది. ప్రజాప్రదర్శనలు మిన్నుముట్టాయి. సమ్మె పోరాటాలు యెక్కువై తీవ్రం కాజొచ్చాయి.

జమీందారుల,భూస్వాముల దోపిడికి వ్యతిరేకంగా కౌలు తగ్గింపుకు, పంటలో భాగానికి, గిరిజనుల దోపిడికి వ్యతిరేకంగా యు. పి. బీహార్, బెంగాలు, పశ్చిమ పంజాబు, పాటియాలా, తెలంగాణా, మలబారు, తమిళనాడులలో రైతు పోరాటాల వెల్లువ వుధృతమైంది. మధ్యయుగపు భూస్వాముల వ్యతిరేక పోరాటాలతోపాటు కాశ్మీర్, హైదరాబాద్ తిరువాన్కూర్, కొచ్చిన్‌లలో ప్రజా వుద్యమాలు, పున్నప్రావలయార్, చారిత్రాత్మిక తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటాలలో కమ్యూనిస్టు పార్టీ ప్రధానపాత్ర వహించింది. తిరువాన్కూర్‌లో 23 అక్టోబరు 1946న సార్వత్రిక సమ్మెపై కాల్పులు జరిగాయి, 27న మార్షల్‌లా ప్రకటించారు. వైలార్ కార్మికులపై చుట్టుముట్టి కాల్పులు జరుపగా 400లు చనిపోయారు.

దేశభక్తుల, స్వాతంత్ర్య ప్రియుల వుద్యమ వెల్లువ ప్రభావం పోలీసులు, సైనికులు వైమానిక, నావికా సైన్యాలమీద, సిగ్నలు దళాలపైనా పడి వారిని ప్రభావితులను గావించింది. జనవరి 1946న 1500 మంది వైమానికులు సమ్మెచేశారు. చరిత్ర ప్రసిద్ధికెక్కిన రాయల్ ఇండియన్ నేవీదళాల సమ్మె తల్వార్ నౌకపైన

బ్రిటిషు ఆఫీసర్ల వర్ణ వివక్షత తలబిరుసు ప్రవర్తనతో సాయుధ తిరుగుబాటుగ రూపొందింది. ఫిబ్రవరి 18న వ్యాప్తిచెంది, 19వ తేదీకి 20 వేలమంది సమ్మెలో చేరారు. సమ్మె కమిటినాయకుడు ఖాన్ కాంగ్రెసు, కమ్యూనిస్టు, ముస్లింలీగు మూడు జండాలను కట్టారు. నావికాసమ్మె బొంబాయినుండి థాణా, కరాచి, కలకత్తా, విశాఖ పట్టణం వ్యాపించింది. నావికాసైన్యం మొత్తం ఫిబ్రవరికి సమ్మెలో చేరింది. తెల్ల సైన్యాన్ని పిలిచారు. సంఘర్షణలు, కాల్పులు జరిగాయి. బొంబాయిలో 21న హర్తాళ్ లేక సార్వత్రిక సమ్మె జరిగింది. కార్మికుల విద్యార్థుల సమ్మెలతో ప్రజాప్రదర్శనలతో ప్రజలు సైనికులకు సానుభూతిని, సహకారాన్ని అందించారు. ఫిబ్రవరి 23న తెల్లసైనికులు రక్తపాతం జరిపారు. ప్రజలు బారికేడ్సు నిర్మించారు. 23, 24 తేదీలలో జరిగిన రక్తపాతంలో 270 మంది నిరాయుధులైన ప్రదర్శకులు మరణించారు. గాయపడినవారు 1700 మంది జబల్‌పూర్‌లో సైనికసిగ్నలర్స్ సమ్మెలో చేరారు. ఒక్కమాటలో చెప్పాలంటే బ్రిటిషు నావికాసైన్యాధిపతి మొత్తం నావికా సైన్యాన్ని నావలను సముద్రగర్భంలో ముంచేస్తానని బెదిరించాడు. కాంగ్రెసు అధ్యక్షుడు మౌలానా అజాద్, వల్లభాయి పటేలును బొంబాయి పంపించారు పటేలు-జిన్నాల విజ్ఞప్తులపై నావికా సైనికులు ఆయుధాలు అర్పించి నిరాయుధులయ్యారు. కార్మిక వర్గం, విద్యార్థిలోకం విప్లవ నావికాసైన్యానికి మద్దతుగా నిలబడుట చారిత్రాత్మక ప్రాముఖ్యతకలిగి. సువర్ణాక్షరాలతో లిఖింపబడిన చరిత్ర. అదే విధంగా నావికా సైన్యానికి మద్దతుగా వైమానిక పదాతి దళాలు ఐక్యతను ప్రదర్శించునట్లు ప్రయత్నించింది వొక్క కమ్యూనిస్టుపార్టీయే. చరిత్ర స్వర్ణపుటలలో లిఖింపబడివుంది.

### సోవియట్ వైఖరి అవగాహన

యుద్ధం ముగింపుకు వచ్చునప్పటికి భారత జాతీయోద్యమం భగ్గునమండే అగ్నిగుండంలా వుంది కాంగ్రెసు అగ్రనాయకత్వంలో అత్యధికులు మార్చి, ఏప్రిల్ 1945కు రెండు సంవత్సరాలుపైగా జైలులోవుండి విడుదలకాబడ్డారు. నెహ్రూ వ్రాసినట్లు "కోపం, ద్వేషం, ఉద్రేకాల ఉన్మత్తత ప్రకోపించిన రాజకీయ వాతావరణం[1]" వుంది. రాజకీయ ప్రతిష్టంభనతో జాతీయోద్యమం నిరాశ, నిస్పృహ, దర్శకత్వం లేక గందరగోళంలో పడివుంది. కాంగ్రెసు ముస్లింలీగుల మధ్యగల భేదాభిప్రాయాలను పరిష్కరించునిమిత్తం గాంధీ-జిన్నాలు జరిపిన సంప్రదింపులు విఫలమయ్యాయి చర్చిల్ ప్రభుత్వం బ్రిటిషు పార్లమెంటులో రాజకీయ విధాన ప్రకటనచేస్తూ ఎటువంటి చొరవను ప్రదర్శించలేదు. కాని 1942నాటి క్రిప్స్ ప్రతిపాదనలను పునరుద్ఘాటించింది వైస్రాయ్, భారత రాజకీయనాయకుల మధ్య తదుపరి సంభాషణలు విఫలమగుటతో భారతప్రజానీకంలో అభిప్రాయాల అగ్నికి వాయువు తోడైనట్లు అయింది. ఇంతలో ఇంగ్లండులో లేబరుప్రభుత్వం వచ్చి భారతీయులకు స్వపరిపాలనను భారతీయులకు అప్పజెప్పుతామని ప్రకటించింది. ఆ మార్గంలోనే రాజ్యాంగ నిర్ణయసభకు వైస్రాయి కేంద్ర, రాష్ట్ర శాసనసభలకు ఎన్నికలు ప్రకటించారు. ఎన్నికలు 1945-46 శీతాకాలంలో జరిగి, హిందూ మతస్థులపై ఆధిక్యతను కాంగ్రెసు కలిగియున్న

1. జవహర్‌లాల్ నెహ్రూ (1951) డిస్కవరీ ఆఫ్ ఇండియా. లండన్, పే. 512

దని, ముస్లిం ప్రజానీకం తరపున మాట్లాడే హక్కు ముస్లింలీగుకు కలదని స్పష్ట మైంది. ఈ విధంగా కాంగ్రెసు ముస్లింలీగులు రెండూ తమతమ బలమైనస్థానాల నుండి ప్రత్యర్థులుగా నిలబడినవి.

బ్రిటిషు లేబరు ప్రభుత్వ స్వాతంత్ర్య వాగ్దానం, భారత స్వాతంత్ర పోరాట వెల్లువలను యేమాత్రం సమసిపోవునట్లు చేయజాలక పోయినదనుటకు ఫిబ్రవరి 1946నావికాతిరుగుబాటు తదనంతర ఘటనలు తెలిపాయి. యుద్ధానంతర మాసాలలోని భారతదేశ ఘటనలకు సోవియట్ యూనియన్ చాలా మామూలుగానే స్పందించింది. సాంప్రదాయకంగా వర్గప్రాతిపదికపై స్పందించి, విప్లవ పోరాటాలకు ఉత్తేజకరమైన మార్గదర్శకత్వాన్ని యివ్వజాలకపోవుటయే గాక, అస్పష్టంగా, అతిజాగ్రత్తగా వ్యాఖ్యానించింది. బెర్లిన్ యే నిమిషంలోనైనా మూడో ప్రపంచ యుద్ధానికి నాంది ప్రస్తావనకావచ్చనే వూహాగానాలు, పశ్చిమ దేశాలలో వినవస్తున్నా, పసిఫిక్‌లో జపాన్ పరిస్థితి క్లిష్టంగావున్నా చైనా, ఆసియాలో వలస విప్లవ పోరాటాలు విజృంభణ కొనసాగుతున్నా దృష్ట్యా చైనా, సోవియట్ కమ్యూనిస్టుపార్టీలు ఆలోచించక పోవుట, చైనా కమ్యూనిస్టుపార్టీకి ఛంగై షేక్ తీవ్రవిస్తృత దండయాత్రలు సాగించునపుడు, సంప్రదింపులు జరిపి రాజీ చేసుకొనమని సలహా యిచ్చుట తెలిసినపుడు ఆశ్చర్యం కలుగజేయదు. అంతేగాక యుద్ధానంతరం యూరపు కమ్యూనిస్టుపార్టీలకు ఆయాదేశాలలోని యుద్ధానంతర బూర్జువా ప్రభుత్వాలకు సహకారాన్ని అందించమని యిచ్చిన సలహా అందరకు తెలిసివున్న విషయము. సాంప్రదాయకంగా, ఫాశిజం ఓటమితోపాటు ఆయా దేశాలలోని బూర్జువా వర్గాలపై విజయాన్ని సాధించి, అధికారాన్ని స్వాధీనం చేసుకొనవలసిన వ్యూహం, ఎత్తుగడలు లోపించుటకు యుద్ధానంతరం మిత్ర రాజ్యాలు శాంతి కాపాడగలవని, బూర్జువావర్గాల, కమ్యునిస్టుల సహకార పునర్నిర్మాణాల కార్యక్రమాలకు అలాగె కొనసాగగలదనే అతిగా అంచెనా వేయుటస్పష్టం. యూరోపియన్ మ్యునిస్ఠ్‌పార్టీల సమావేశంలో జదనోవ్ 1947లో నూతన రాజకీయ సిద్ధాంతం ప్రతిపాదించువరకు ఆ వైఖరి అలాగే కొనసాగింది. ఈ అవగాహన వచ్చుటకు ఫ్రాన్సు, ఇటలీలలో మంత్రివర్గాలనుండి కమ్యూనిస్టులను త్రోసివేయువరకు ఈ విజ్ఞత కలుగపోవుటయే విచారించవలసినది.

వలసదేశాల విధానాలయెడల సోవియట్ వైఖరి, సామ్రాజ్యవాదము, ఐక్య రాజ్య సమితుల యెడల భ్రమలకులోనై వున్నది. ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వంలో భారతదేశాన్ని వుంచాలనే కొన్ని సామ్రాజ్యవాద దేశాల ప్రతిపాదనలను సోవియట్ సుముఖంగా ఆలోచించుటకు ఆమోదించింది. ఆసియా అధ్యయనశాఖ ముఖ్యుడు ఇ. ఝుకోవ్, ధర్మకర్తృత్వ ప్రతిపాదనను ఆమోదించుతు, బ్రిటిషు, అమెరికన్ సామ్రాజ్యవాద శక్తులు అట్టి విధానాన్ని తమ ప్రయోజనాలకు వినియోగించగల అవకాశాలు యెక్కువగలవని హెచ్చరిక మాత్రం చేశాడు[1]. సంవత్సరం

1. ఇ. ఝుకోవ్, (1945) "ది కలొనియల్ క్వచెన్ ఎట్ ది ప్రజెంట్ స్టేజ్" మార్క్సిస్టు మిసెలెని, బొంబాయి, 11 మే 1945. పే. 118-119. వార్ అండ్ వర్కింగు క్లాస్(మాస్కో) మార్చి 15, 1945, పే 5-10 నుండి పునర్ముద్రితము

తరువాత ఝుకోవ్ వలస దేశాల సమస్యలు వాటిని పరిష్కరించుటకు సూత్రాలను తెలుపుతు ఐక్యరాజ్య సమితి ధర్మకర్తృత్వంలో వలస దేశాలనుంచుట ఆదర్శవంత మైనది కాదని అంటూనే వలసలు ధర్మకర్తృతంలో "వలసల పురోగమనాభివృద్ధి త్వరితంగా సంపూర్ణ స్వాతంత్ర్య మార్గంలో జరుగగలదని"[1] ప్రకటించారు. వలస సమస్యలపై లెనిన్ అవగాహనలతో సాంప్రదాయక విమర్శనను విడనాడి "ప్రజా స్వామ్యం ముందుకుతీసుకొనిపోయే" ఆంగ్లో-అమెరికన్-సోవియట్ సంకీర్ణ ఆధ్వ ర్యంలో రూపొందిన ఐక్యరాజ్య సమితి అట్లాంటిక్ చార్టర్‌ను అనగా ధర్మకర్తృత్వ విధానాన్ని వలసలకు వర్తింపజేయాలని కోరాడు. అదే కాలంలో ఎ, డయకోవ్ "ఐక్యరాజ్య సమితి సభ్యదేశమైన ఇండియాకు స్వయంనిర్ణయాధికారము లేకుండుట విషాదాంతం[2]"మనే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. అంతేకాక "వలసలలో సాధారణ రాజకీయ హక్కులు లేకుండుట, అంతర్జాతీయ శాంతి భద్రతలకు మరిన్ని అడ్డంకు లను సృష్టించుతుంది" అని వ్యాఖ్యానించారు.

సోవియట్ రచయితలలో ఆసియాలో సామ్రాజ్యవాద విధానాలపై ఒక రచ యిత వెలిబుచ్చిన అభిప్రాయం. భవిష్యత్కాలంలో వలసల యెడల సోవియట్ వైఖరికి మౌలికాంశమైంది. ఝుకోవ్ రాజకీయ స్వాతంత్ర్యంతో పాటు ఆర్థిక స్వా తంత్ర్యం పొందనిచో సార్వభౌమాధికారాన్ని మామూలుగ యిచ్చుట, "వలసలలో సాగే దోపిడి బానిసత్వాలకు ముసుగువేయుట మాత్రమే అగుతుంది" అన్నారు. ఫిలి ప్పైన్స్‌లో అమెరికా సామ్రాజ్యవాదం అనుసరించే విధానమిదేనని అన్నారు. భారత దేశీయ సమస్యలపై తాత్కాలిక అభిప్రాయాలనే సోవియట్ రచయితలు వెలిబు చ్చారు. భారత దేశానికి వొక సాధారణ పంథాను, వ్యూహాన్ని సూచించినా ఎత్తు గడలలో అస్పష్టతయే చోటుచేసుకొన్నది. యుద్ధం అంతం కాకముందే యుద్ధానికి పూర్వం అనుసరించిన సామ్రాజ్యవాద వ్యతిరేక వ్యూహాన్ని భారత కమ్యూనిస్టుపార్టీ అనుసరించాలనే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. అంటే, భారత బూర్జువావర్గంతో సహకారాన్ని నెరపాలని, "సామ్రాజ్యవాద వ్యతిరేక విముక్తి వుద్యమంలో భారత దేశంలోని అన్ని వర్గాలకు పాత్ర వుందని, మినహాయింపు ప్యూడలు రాజులు" బడా బూర్జువావర్గంలోని వొక శేషను అని[3]" స్పష్టం చేసారు.

గతంలోని "ఐక్య సంఘటన పంథా"కు 1945-46లోని సోవియట్ వైఖరి, జాతీయ విముక్తి వుద్యమం, జాతీయ కాంగ్రెసులో ప్రతిబింబించుచున్నదని చెప్పి

1. ఇ. ఝుకోవ్. (1945) ది డిఫీట్ ఆఫ్ జపాన్ ఇంపిరియలిజం అండ్ దినేషనల్ లిబరేషన్ స్ట్రగుల్ ఆఫ్ ది పీపిల్స్ ఆఫ్ ది ఈస్ట్ ఏసియా బోల్షివిక్, డిసెంబరు 1945. పే 85 86. ఓవర్‌స్ట్రీట్, మార్షల్‌లు "కమ్యూనిజం ఇన్ ఇండియా"లో పే. 225లోని ఉదహరింపులు.

2. ఎ. డయకోవ్. (1946) "యుద్ధానంతర భారతదేశం" న్యూటైమ్స్, జనవరి 15, 1946 నుండి పై నుదహరించిన దానిలో పే 226లో పేర్కొనబడినది.

3. అదే పే. 226.

యుండలేదు, పైగా భారత కమ్యూనిస్ట్ పార్టీ అనుసరించుతున్న "కాంగ్రెసు-లీగు ఐక్యత" అనే విధానానికి ఆమోద ముద్ర వేయలేదు. అంటే మౌలిక ఎత్తుగడల విషయమై, సోవియట్ ప్రకటనలో స్పష్టమైన సూచనలు లేవు.

డయకోవ్ విశ్లేషణకూడ యితర రచయితల వలెనె, జాతీయ కాంగ్రెసు వివిధ వర్గాలను, అభిప్రాయాలుకల సంస్థయని, విస్తృత ప్రజాభిమానాన్ని పొందినదని, యే వర్గం ఆధిపత్యం వహించుచున్నది చెప్పక "బూర్జువావర్గం పెద్దపాత్ర వహించు చున్నదని" మాత్రమే పేర్కొన్నది కాంగ్రెసు లక్ష్యం భారతదేశ సంపూర్ణ స్వాతంత్ర్యమని దాని ఆర్థిక, సామాజిక కార్యక్రమము "అభ్యుదయకరమైనదని, నెహ్రూ "అభ్యుదయకర ప్రజాస్వామ్యవాది, ప్రధానంగా అతని అంతర్జాతీయ పరిస్థితి అవగాహన సరిగా" వున్నదని వ్రాసారు. ఇతర కాంగ్రెసు నాయకులపై డయకోవ్ వ్యాఖ్యానించుతూ; అజాద్, గాంధేయ సనాతనులలైన పటేలు, రాజేంద్రప్రసాద్‌వలె "జాతీయ తత్వవాది" కాదని "అంత అభ్యుదయవాది కాదని[1]" అన్నారు.

సోవియట్ వ్యాఖ్యాతలు యెక్కువగా కాంగ్రెసు విషయమై శ్రద్ధ వహిందనా లీగు విషయంగాను సానుభూతిగానే అధ్యయనం చేశారు. వారు "అత్యధిక ప్రభావం కల ముస్లింల సంస్థగా పేర్కొని కాంగ్రెసు ముస్లింల సమస్యలయెడల శ్రద్ధవహించ" లేదని ముస్లింలీగుయెడల ఎట్టి స్పష్టమైన వైఖరి వెల్లడించలేదు.

ప్రధాన సమస్యయైన 'పాకిస్తాన్' యెడల సోవియట్ జాగ్రత్తగా తటస్థవైఖరి అవలంబించింది. డయకోవ్ ఒకవైపు, కాంగ్రెసు ముఖ్యనాయకులలో వొకరైన సి రాజగోపాలాచారి ముస్లిం ప్రాంతాలు ప్రత్యేక రాజ్యంగా ఏర్పాటుకావచ్చని ప్రతిపాదించుచున్నాడని అఖిలభారత ట్రేడు యూనియన్ కాంగ్రెసు దానిని ఆమోదించిందని, కాని కాంగ్రెసు తన కార్యక్రమాలలో పేర్కొనలేదని విమర్శించాడు. మరోవైపు "భారతదేశాన్ని విభజించుట హిందూ ముస్లిం సమస్యను పరిష్కరించ జాలదని, దేశాన్ని బలహీనపరస్తుందని అనేకమంది భారత అభ్యుదయ నాయకులు తలంచుతున్నారని పేర్కొన్నాడు కాంగ్రెసు నాయకత్వం వివిధ జాతీయ పాలక ప్రాంతాలు ఫెడరేషన్‌గా ఏర్పడితే భారత అభివృద్ధి ప్రయోజనాలకు మత ప్రాతిపదికపై రెండు లేక మూడుగ విభజన అగుటకంటె ప్రయోజనకారి అగుతుందని విశ్వసిస్తున్నారని స్పష్టంచేశారు. అంటే డయకోవ్ భారతదేశంలోని వివిధ అభిప్రాయాలను సమీక్షచేసారు కాని భారత కమ్యూనిస్టుపార్టీ విభజన పంథాను స్పష్టంగా ఆమోదించలేదు. అయితే డయకోవ్ జాతీయ కాంగ్రెసు విధానాన్నే బలపరచాడని వ్యాఖ్యానించవచ్చు. భారతదేశం-జాతుల సమస్యపై సోవియట్ రచయిత వైఖరిని వెల్లడించుట వాయిదావేశాడు. సోవియట్ యూనియన్ వివిధ జాతుల దేశంగా సామాన్య సూత్రీకరణ మాత్రమే చేయగా భారత కమ్యూనిస్ట్‌పార్టీ జాతుల జాబితాను కార్యక్రమాన్ని సూచించగా దానిని సోవియట్ ఆమోదించలేదు. జాతుల నిర్వచనాన్ని భారతదేశానికి అన్వయించ ప్రయత్నించలేదు, నిరాకరించిందనే చెప్పాలి.[2]

---

1, 2. ఓవర్‌స్ట్రీట్, మార్షల్ (1960) కమ్యూనిజం ఇన్ ఇండియా. పే. 217.

డయకోవ్ బెంగాలీలు, తమిళులు తదితర భాషలుమాట్లాడే పెద్ద సమాజాలనే గాక. సంతాలు, గోండ్లు, ఓరానులు, ముండ్రాల తెగలనుకూడ వివిధ జాతులుగ గుర్తించారు. ఆ విధమైన అశాస్త్రీయ విశ్లేషణ భారత కమ్యునిస్టుపార్టీ అవగాహనను, కార్యక్రమాన్ని వ్యతిరేకించుటయే అగుతుంది.

భారతదేశంలో నేటి ఘటనల ప్రత్యేకతను పరిగణించుటలో సోవియట్ వ్యాఖ్యాతలు అతిగా జాగ్రత్త వహించుతున్నారు. భారతజాతీయ సైన్యంలో నుండి బయటకు వచ్చిన తిరుగుబాటు సైనికులకు, ఆఫీసరులకు, నావికాసైన్య తిరుగుబాటు దారులకు విధించిన శిక్షలరద్దుకై జరిగిన ప్రజా ప్రదర్శనలు భారత రాజకీయ పరిస్థితులలోని తీవ్రతను తెలియజేస్తున్నవని పేర్కొన్నారు. సోవియట్ వ్యాఖ్యాతల ప్రధానాంశము. భారత కమ్యూనిస్టుపార్టీపై యెట్టి వ్యాఖ్యానం చేయకుండుట జాతీయ కాంగ్రెసు, లీగుల గురించి విశ్లేషించినా, జాతీయ విముక్తి వుద్యమ నాయకత్వపు అగ్రగామిదళంగా కమ్యూనిస్టుపార్టీ గుర్తించలేదు. ఇండియాపై మొత్తంగా సోవియట్ యూనియన్ ఉపేక్షాభావం కలిగియుండుటకు కారణము డయకోవ్ యొక్క క్రింది వ్యాఖ్యనుబట్టి తెలియగలదు. "భారతదేశంలోని ప్రజాసామాన్యపు సామాజిక రాజకీయ కార్యాచరణ చాలాతక్కువస్థాయిలోవుంది. వాటి నిర్మాణ శక్తిసామర్థ్యాలు ప్రజాస్వామ్య దేశాలలోని కంటె బలహీనంగా వుంది. అంచేత జాతీయ కాంగ్రెసు లాంటి రాజకీయ పార్టీ పరిమిత వర్గాలో వ్యాపించివున్నప్పటికి ప్రజాసామాన్యంలో గణనీయమైన విస్తృత బలాన్ని కలిగివుంది[1]" అనే అభిప్రాయం బలంగావుంది.

భారతదేశంలో ఆ కాలంలో నిట్టి విప్లవాత్మక మార్పులకు అవకాశముందని సోవియట్ నాయకత్వ వర్గాలు వూహించలేదు. బ్రిటిషు తమ అధికారాన్ని అన్యాయించుతుందని వారు విశ్వసించినట్లు కన్పించదు. భారత రాజకీయ నాయకత్వం అధికారాన్ని సంపాదించగలదని తలచలేదు. ఈ విధంగా భారతదేశీయపరిస్థితులు అంతర్జాతీయ పరిస్థితులలోగల అనిశ్చిత పరిస్థితులను తాత్కాలికాంశాలను గమనించుతున్నారు. అస్పష్టంగా నాలుగు వర్గాల "జాతీయ ఐక్య సంఘటన వ్యూహాన్ని" సూచించినప్పటికి సోవియట్ ప్రకటనలు అవసరమైన వెలుగును ప్రసరించకపోగా, భారత కమ్యూనిస్టుపార్టీని నిరుత్సాహపరచేవిగా వున్నవి[2].

## భారత కమ్యూనిస్టుపార్టీ ఎన్నికల ప్రణాళిక

యుద్ధానంతర మొట్టమొదటి ఎన్నికలలో భారత కమ్యూనిస్టుపార్టీ 1945-46 శీతాకాలంలో జరిగిన కేంద్ర, రాష్ట్ర, శాసనసభల ఎన్నికలలో పాల్గొంటూ తమ రాజకీయ విధానాన్ని ఎన్నికల ప్రణాళికలలో వివరించింది. పార్టీ ప్రచారంలో చేబ

1 ఎ. డయకోవ్ (1946) యుద్ధానంతర భారతదేశము-న్యూటైమ్సు జనవరి 15, 1946 పే. 11. కమ్యూనిజం ఇన్ ఇండియా. పే. 228 లోని ఉదహరింపు.

2. ఓవర్‌స్ట్రీట్, విండ్‌మిల్లర్ (1960) కమ్యూనిజం ఇన్ ఇండియా. పే. 228.

ట్టిన వివిధఅంశాలు, వాటి అధ్యయనం పార్టీ వ్యూహాన్ని, ఎత్తుగడలను అవగాహన చేసుకొనుటకు ఉపయోగపడుతున్నవి. పార్టీ ఎన్నికల రాజకీయ విధానం పి. సి. జోషి నాయకత్వంలో రూపొందించబడింది. అయితే ఆ ఎన్నికల ప్రణాళికగాని, 1943 తదనంతరం పార్టీ అనుసరించిన రాజకీయ విధానాలకు పార్టీ కాంగ్రెసు జరుపబడి, ఆమోదం లభించలేదు. పార్టీ ప్రథమ 1943 కాంగ్రెసులో ఆమోదించబడిన, నిర్మాణ సూత్రాల ప్రకారం ప్రతి సంవత్సరం పార్టీ కాంగ్రెసు జరగాలి. పార్టీ విధానాల సమీక్ష నూతన కార్యక్రమాలను రూపొందించుట, దానిని అమలు చేయుటకు నూతన నాయకత్వం ఎన్నిక జరుగవలసివుంది. కనీసం 1946 ఎన్నికల ముందు అయినా పార్టీ కాంగ్రెసు జరుగవలసినది కొన్ని 1948 ఫిబ్రవరివరకు పార్టీ కాంగ్రెసు జరుగలేదు. జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులు, రాజకీయాలలో వచ్చిన ప్రాథమిక మార్పులుకూడ, పార్టీ కాంగ్రెసును జరపాలనే ఆలోచనను కలుగచేయక పోవుట శోచనీయము. రెండవ కాంగ్రెసు పునరుద్ఘాటించిన నిర్మాణసూత్రాలు గూడ, పార్టీ బహిరంగంగా పని చేయునపుడు ప్రతి సంవత్సరం పార్టీ కాంగ్రెసు జరగాలనే సూచించుచున్నవి.

బహిరంగ పార్టీగ భారత కమ్యూనిస్టు పార్టీ కి ఎన్నికలలో పాల్గొనే అవకాశం లభించినా, విప్లవాత్మకంగా ఎన్నికలను వినియోగించజాలకపోయింది. భారత రాజకియాలలో ప్రత్యేక స్థానాన్ని పొందగల అవకాశాన్ని కోల్పోయింది. సామ్రాజ్యవాద వ్యతిరేక వ్యూహాన్ని, వర్గ సామరస్య వైఖరితో బూర్జువావర్గంతో మైత్రి, సహకారాలను సామ్రాజ్యవాద, భూస్వాములు వ్యతిరేక విధానాన్ని రూపొందించింది. గతంలో వలెనె యీ ఐక్యత సహకార విధాన విజయాన్ని క్రిందినుండి ఐక్య సంఘటనను నిర్మించు ప్రయత్నము, కమ్యూనిస్ట్ పార్టీని, జాతీయ కాంగ్రెసునుండి దూరం చేసింది. ముస్లింలీగుతో మిత్ర సహకార సంబంధాలను అభివృద్ధిపరచుటలో విఫలమైంది. వివిధ పార్టీల నాయకత్వాలతో పైనుండి సాధారణ ఐక్య సంఘటనా యేర్పాటు, భారత కమ్యూనిస్టు పార్టీ సామాన్య ఐక్య సంఘటనను కమ్యునిస్టు పార్టీ యేర్పాటు చేయుటకు యితర పార్టీలకు విజ్ఞప్తులు చేయుటకంటె మరేమీ చేయజాలకపోయింది.

ఫిబ్రవరి 1946లో భారత కమ్యునిస్టు పార్టీ విడుదల చేసిన ఎన్నికల ప్రణాళికలో వ్యూహాన్ని, ఎత్తుగడలను వివరించింది. ప్రణాళిక పార్టీ వ్యూహ దృక్పథాన్ని, బ్రిటిషు వలసత్వానికి వ్యతిరేకంగా "స్వాతంత్ర్య ప్రియులందరి ఐక్య పోరాటానికి పిలుపు నిచ్చింది, తన విమర్శనను బడా భూస్వామ్యవర్గం, బడా పెట్టుబడిదారివర్గంపై కేంద్రీకరించింది, స్పష్టంగా బూర్జువాలకు విజ్ఞప్తి చేసింది. అంతేగాక, మధ్యతరగతి గ్రామీణ, పట్టణవర్గాలకు స్పష్టమైన వాగ్దానాలను చేస్తు, సాధారణ సంస్కరణలకై విజ్ఞప్తిని చేసింది. ప్రచార నిమిత్తం ఎన్నికల కాలంలో చిరు పుస్తకములు పార్టీ అభిప్రాయాలను వెల్లడించుతు ప్రకటించింది. పారిశ్రామిక విధానంపై రణదివె ప్రకటన "కార్మిక, కర్షక, మధ్యతరగతుల వారిని, పుద్యోగులను ప్రణాళికాబద్ధ జాతీయాభి

వృద్ధికి సమీకృతులు కండి[1]" అనే విజ్ఞప్తిని, మరొకటి వ్యవసాయ విధానంపై అధికారి, "రైతాంగంలోని అన్ని వర్గాల ఐక్యతకై విజ్ఞప్తిచేస్తూ, పార్టీ కార్యక్రమంలో మధ్యతరగతి, ధనిక రైతులు పేద రైతులకంటె బాగుపడుట ఎక్కువ అవకాశాలున్నవని[2]" ఆమోదించారు. రెండు చిరు పుస్తకములు బూర్జువా వర్గాలకు తమ స్నేహహస్తాలను సాచినప్పటికి, సాంప్రదాయక "పెట్టుబడిదారులు, వ్యాపారవర్గాలు, స్వార్థపరవర్గాలు" అనే పడికట్టు పదాలతో "దాడి" కొనసాగింది. రచయితలు యిద్దరూ, ఉపఖండంలో బ్రిటిషు, భారత "బడా బూర్జువావర్గం, స్వార్థపరవర్గాల" దోపిడి కొనసాగించుటకు భాగస్వాములయ్యే ప్రమాదముందని గుర్తించారు. పార్టీ అనుసరించే యీ విధానానికి డిశెంబరు 1945కి అసంతృప్తి యెక్కువై "అతివాద వ్యతిరేక వర్గం" పార్టీలో రణదివె, అధికారి, అజయ్ ఘోష్‌లు "తీవ్రవాదపువాణి"గ రూపొందాయి. తదుపరి మాసాలలో "మితవాద, అతివాదుల" మధ్య పార్టీలో తీవ్ర చర్చలు కొనసాగాయి. జోషి జనరల్ శెక్రటరీగా కొనసాగాడు

ఎన్నికల ప్రణాళికలోని ఆర్థికాంశాల వేదిక కంటె ప్రధానమైనది, భారత రాజ్యాంగాభివృద్ధికి యిచ్చిన కార్యక్రమము. ఈ విషయంలో ప్రాంతీయ ప్రత్యేకాంశాలను వెలుగుకు తెచ్చి, ప్రజలకు విజ్ఞప్తిచేయుటద్వారా బలపడే అవకాశాలు ఎక్కువగా వున్నవని పార్టీ అవగాహన. ఇంతకుముందే పార్టీ, వివిధ భాషా ప్రాంతాల, జాతుల వేర్పాటు ధోరణులలో,అన్నివర్గాల ప్రజలను, రాష్ట్రాలలోని మధ్య తరగతి వర్గాలను ప్రాంతీయ ప్రత్యేకతలపై విజ్ఞప్తులద్వారా ఆకర్షించవచ్చని కమ్యూనిస్టు పార్టి అవగాహనగా కన్పడుతున్నది. కేంద్రంలో దేశంలోని ప్రధాన రాజకీయ పక్షాలు అధికారం స్వీకరించగలిగినా రాష్ట్రాలలో బలపడుటకు ప్రాంతీయ సమస్యల ప్రాధాన్యతను పార్టీ గుర్తించింది.

వెంటనే స్వాతంత్ర్యం అనే కోర్కెను ప్రణాళికలో కోరినా, అధికారాన్ని ఒకటి, రెండు హిందూస్థాన్, పాకిస్తాన్ ప్రభుత్వాలకుగాక 17 తాత్కాలిక సార్వభౌమాదికారంగల జాతీయ రాజ్యాంగ నిర్ణాయక అసెంబ్లీలు లేక 1942లో నిర్వచించిన జాతీయ అసెంబ్లీల యేర్పాటు కావాలని కమ్యూనిస్టు పార్టీ వివరించింది. పార్టీ పూర్వపు అవగాహనకు బెలుచీలకుకూడ సార్వభౌమాధికారం కలిగివుండాలని ప్రణాళికలో అదనంగా చేర్చింది. ముఖ్యమైన సమస్యే అయిన, ఈ సార్వభౌమాధికారం గల రాష్ట్రాల సరిహద్దులను నిర్ణయించు సూత్రాల విషయమై దృష్టి ప్రసరించలేదు. స్వతంత్ర భారతంలో యీ రాష్ట్రాలు కేంద్రంతో సంప్రదింపులు జరిపే హక్కు కలదని, తమ కిష్టమైన ఫెడరేషనులో చేరే హక్కు వుంటుందని వివరించింది.

కమ్యునిస్టు పార్టీ తాత్కాలిక ప్రభుత్వ విషయమై, సోవియట్‌లోవలె రాష్ట్రాల ఫెడరేషన్‌గాక స్వతంత్ర్య రాజ్యాల ఫెడరేషన్‌గా ప్రతిపాదనలు చేసింది.రాజ్యాంగ నిర్మాణ అంత్య నిర్ణయాలుగ కాన్ఫెడరేషన్ కొరకు వాదించుతుందని పార్టీ స్పష్టం

1. రణదివే, బి. టి. (1945) జాబ్స్‌ఫర్ ఆల్. పే. 30. (ఆంగ్లంలో)
2. అధికారి, జి. యం. (1945) అందరికి ఆహారం (ఆంగ్లంలో) పే. 26.

కూడ చేసింది. రాజ్యాంగ నిర్ణయసభ జరిగినపుడు జాతీయ కాంగ్రెసు ఒకే వొక భారత ఫెడరేషన్‌ను కోరుతుందని, ముస్లింలీగు రెండు ఫెడరేషన్‌లు విడివిడిగా కోరుతుందని, కమ్యూనిస్టు పార్టి సార్వభౌమాధికారంగల జాతీయరాజ్యాలు ఐచ్ఛికంగా యూనియన్‌గా యేర్పడి, పరస్పరం సహాయకారిగ, ప్రజాస్వామ్యాన్ని పెంపొందిస్తూ, బాగా అభివృద్ధి చెందినది, తక్కువగా అభివృద్ధి చెందిన రాజ్యం లేక రాష్ట్రానికి, కేంద్ర ఫెడరేషన్ ద్వారా సహాయపడాలి. అట్టి కేంద్రపు నైజాన్ని స్పష్టం చేయకపోయినప్పటికి, రాష్ట్రాలు సార్వభౌమాధికారాన్ని కలిగి వుండాలంటే "ఫెడరల్" స్వభావం కలిగి వుండదు.

కమ్యూనిస్టుల జాతుల విధానం భారతదేశంలో, చివరి దశకు చేరింది. కమ్యూనిస్టులు 1940 వరకు భారతదేశంలో వొకే వొక జాతిగా తలచారు, తరువాత అనేక దశలలో చివరకు ప్రాంతీయ వేర్పాటు రాయితీల వరకు వచ్చారు. మొదట బహుళ జాతుల భారతదేశంలో కమ్యూనిస్టులు స్వయం నిర్ణయ హక్కును యిచ్చేవరకు వచ్చి, తమ స్వంత రాజ్యాన్ని (స్టేటు) యేర్పాటు చేసుకొనగోరితే ముస్లింజాతులకు విడిపోయే హక్కును యిచ్చి, చివరకు ఎన్నికల ప్రణాళికలో పాకిస్తాన్‌ను, దానితో పాటు అన్ని జాతులు తమ స్వంత సార్వభౌమాధికారంగల, రాజ్యాల యేర్పాటును ప్రకటించారు.

కమ్యూనిస్టుల జాతులవిధానానికి అధికారి ప్రధానంగా బాధ్యుడైనప్పటికి జోషి ఎన్నికల ప్రణాళికలో స్పష్టంగా వివరించారు. ప్రణాళిక ఆంగ్లప్రతికి జోషి, జాతుల విధానానికిగల వ్యతిరేకతను, సరళీకృతం చేయుటకు సుదీర్ఘ ఉపోద్ఘాతాన్ని వ్రాసారు. దానిలో యీ విషయాన్ని చర్చించునపుడు జోషి అనేకసారులు "సార్వభౌమాధికారం గల, స్వపరిపాలిత" అనే పదాలు వాటి అర్థం వొకటే అనే ధోరణిలో, ఉదాహరణకు, భవిష్యద్భారత దేశము "సార్వభౌమాధికార, స్వపరిపాలన రాజ్యాల (స్టేట్సు) స్వచ్ఛంద యూనియన్"గా వ్రాసారు. ముస్లింలీగు, ముస్లింప్రజలు విడిపోయే హక్కును నొక్కి చెప్పుటను ఖండించుతు, భారత ప్రజలు "జాతుల కుటుంబం" అనే పార్టీ వైఖరిని ప్రత్యామ్నాయంగా పేర్కొని, సోవియట్, యుగోస్లోవియా ఫెడరేషనులను, రాజ్యాంగ నిర్మాణ నమూనాలను, జాతులను సోదరులుగ ఐక్యపరచినవిగా ఉదహరించారు. చివరకు, 17 జాతుల మాతృభూమిగ, సుఖ, సంతోషాల నిలయంగా, అవి భాజ్యంగా ప్రతిపాదించారు.[1]

రాజ్యాంగ నిర్మాణ సమస్యలపై జోషి ప్రతిపాదనలు ఆ రోజులలో కొన్ని రాజకీయవర్గాలలోగల రాజీ ప్రతిపాదనలు, ప్రణాళికలను కోరివున్నవి. ముస్లిం సరళీకృతవాదులైన సర్ సికందర్ హయ్యత్‌ఖాన్, సర్ మహమ్మద్ జఫ్రుల్లాఖాన్‌లు, రాష్ట్రాలనుండి సంక్రమించిన అధికారాలను గలిగి అస్పష్టంగా నిర్వచించబడిన కేం

1. జోషి, పి. సి. (1945) ఫర్ ది ఫైనల్ బిడ్‌ఫర్ పవర్ ఫ్రీడం ప్రోగ్రాం ఆఫ్ ఇండియన్ కమ్యూనిస్టు. పి. పి. హెచ్. పే. 90. కమ్యూనిజం ఇన్ ఇండియా. పే. 232 లోని ఉదహరింపు.

ద్రాధికార వ్యవస్థను ప్రతిపాదించారు. తేజ్‌బహదూర్ సప్రూ కమీషన్, స్వతంత్ర ఆంగ్ల పండితుడు, సర్ రెజినాల్డ్ కౌప్‌లాండులు అదే విధమైన కేంద్ర ప్రభుత్వ అధ్వర్యంలో బలహీనమైన (లూజ్) ఫెడరేషన్, పరిమిత అధికారాలుగల దానిని సూచించారు.[1] విభజనకు ప్రత్యామ్నాయంగా యీ ప్రతిపాదన బ్రిటిషు, భారత వర్గాలను అనేకమందిని, ఆచరణయోగ్యమైనదిగా ఆకర్షించింది. కమ్యూనిస్టు పార్టీ తన ప్రతిపాదనలు కాంగ్రెసు ముస్లింలీగుల అవగాహనలకు మధ్యమార్గంగా నెంచి, వుధృత ప్రచారం గావించింది.

కమ్యూనిస్టేతరుల ప్రతిపాదనలు మరోమార్గం లేని ప్రత్యామ్నాయ ప్రతిపాదనలు వుండగా; ప్రాంతీయ భాషాజాతులు, సౌలభ్యం కొరకుగాక, సార్వభౌమాధికారం గల జాతుల హక్కుగా అనే ప్రాతిపదికగా, న్యాయబద్ధమైనది అనే ప్రాథమిక అవగాహన లేక సైద్ధాంతిక పునాదిగా కమ్యూనిస్టుల ప్రతిపాదనలు ప్రకటించబడినవి. రాజ్యాంగ నిర్మాణానికి "జాతుల మాతృభూమి" విధాన మొక్కటే సహజ ప్రాతిపదికగా కమ్యూనిస్టుల ప్రణాళిక తలచింది. ప్రాంతీయ ప్రత్యేకతలపై పార్టీ భారీయెత్తు ప్రచారాన్ని చేబట్టింది మద్రాసు రాష్ట్రంలోని తెలుగు ప్రజలకు కమ్యూనిస్టుపార్టీ" మూడోవంతు తెలుగు సోదరులను 40 శాతపు భూభాగాన్ని నిజాం బానిసత్వాన్నుండి రక్షించి, ఆంధ్ర ప్రజలందరి స్వతంత్ర విశాలాంధ్రను నిర్మించాలంటే, మా కమ్యునిస్టు పార్టీకే వోటు వెయ్యాలి, విశాలాంధ్ర పార్టీ ఏ జెండాలో వుంది, అందుకై పోరాడుతుంది.[2]" అని విజ్ఞప్తి చేసింది.

కమ్యునిస్ట్‌పార్టీ ప్రచారం, యుద్ధకాలంలో బ్రిటిషు యుద్ధ ప్రయోజనాలను బలపరచుట వలన పోగొట్టుకొన్న ప్రజాభిమానాన్ని తిరిగి పొందుటకు, సామ్రాజ్యవాద వ్యతిరేక తీవ్ర ధోరణిలోసాగించింది. రాష్ట్రాలలోని 1585 అసెంబ్లీస్థానాలలో కమ్యునిస్ట్‌పార్టీ 108 స్థానాలలో పోటీచేసిది. 8సీట్లను గెలుచుకొన్నది. 6,67 లక్షల వోట్లు సంపాదించింది. ఇవి ప్రధానంగా బెంగాల్, బొంబాయి, మద్రాసు, ఒరిస్సా రాష్ట్రాలలోనే పరిమితమైవుంది. 2 1/2శాతం వోట్లు పొందగలిగింది. కాంగ్రెసు లీగుల తరువాత మూడవ పార్టీగ ప్రజలలో బలాన్ని సంపాదించింది ఎన్నికలు వయోజన వోటింగ్‌పైగాక జనాభాలో 14శాతం మాత్రమే వోటుహక్కును కలిగియున్నారు, కాన ప్రజాభిప్రాయం పూర్తిగ ప్రతిబింబించుటకు అవకాశంలేదు.

## బ్రిటిష్ కాబినెట్ మంత్రివర్గ రాయబారం

బొంబాయిలో 19 ఫిబ్రవరి 1946న ప్రారంభమైన నావికా సైన్యపు తిరుగుబాటు 21వ తేదీకి కరాచి, కలకత్తా, థాణా యితర నావికాకేంద్రాలకు వ్యాపించింది.

---

1. మానల్‌దాన్, పి. యన్. (1953) ఎవల్యూషన్ ఆఫ్ ప్రోవిన్షియల్ అటానమీ ఇన్ ఇండియా బాంబె హింద్ కితాబ్స్. పే. 174-6, కమ్యూనిజం ఇన్ ఇండియాలో పే. 233 లోని ఉదహరింపు
2. పీపుల్స్‌ఏజ్, మార్చి 17, 1946 పే. 3 కమ్యూనిజం ఇన్‌ఇండియా- పే. 233లోని ఉదహరింపు.

అదేరోజున ఇంగ్లండులో బ్రిటిష్ ప్రభుత్వం కాబినెట్ మంత్రుల రాయబారపర్గాన్ని ప్రకటించింది. కాంగ్రెసు ప్రజాపోరాటాలను వ్యతిరేకించింది. అయితే అదేకాలంలో వాటిని బ్రిటిష్ వారిపై వొత్తిడి తెచ్చుటకు ఉపయోగించుకొంది' ముస్లింలీగు నాయకత్వం మతకలహాలను రెచ్చగొట్టింది. ముస్లింలీగు ఆగష్టు 16న "డైరెక్ట్‌యాక్షన్" దినోత్సవాన్ని జరుపపిలుపునిచ్చింది. బెంగాలులో సుహ్రావర్ది ప్రభుత్వం రక్తపాతాన్ని సృష్టించింది. అగస్టు 24న కేంద్రంలో నెహ్రూ నాయకత్వాన తాత్కాలిక ప్రభుత్వం ఏర్పడింది. ఫిబ్రవరి-ఆగష్టు మధ్యకాలంలోని రాజకీయ పరిణామాలను కొంత తెలుసుకొనాలి.

కాబినెట్ రాయబార మంత్రివర్గంతోపాటు మార్చిలో భారతదేశ కమ్యూనిస్టులకు సలహా, సంప్రదింపులలో భారత సమస్యలపై వెలుగుప్రసరించే రజనీ పామీదత్తు లండన్ డెయిలీ వర్కర్ పత్రికావిలేఖరిగా వచ్చారు. భారత రాజకీయాలు వేగంగా పరిణామాలను లోనగుతున్న కాలంలో దత్తు అందుబాటుతో వుండుట, కమ్యూనిస్టు పార్టీ అగ్రనాయకత్వం సంప్రదించుటకు సౌలభ్యత చేకూరింది. దత్తు భారత పర్యటనపై లేబర్‌మంత్లీలో వరుసగా ప్రకటించబడిన "యాత్రా కథనాలలో" భారత కమ్యూనిస్టుల రాజకీయ విధానాలను, వ్యూహాన్ని బలపరచారు. కమ్యూనిస్టులు సామ్రాజ్యవాద వ్యతిరేక, ప్యూడలు వ్యతిరేక అన్ని వర్గాలుకలసిన "ఐక్య జాతీయ సంఘటన"ను దత్తు సూత్రప్రాయంగా బలపరస్తూ, ప్రధాన ఎత్తుగడల మార్గాలు సూచించారు. కాంగ్రెసు లీగు కమ్యూనిస్టు ఐక్యసంఘటనను వివిధ రూపాలుగ వివరించింది. దత్తు "ఐక్యసంఘటనను" పైనుండి నిర్మించాలనే ఆచరణ సలహానిచ్చారు. ప్రధానంగా కాంగ్రెసు, కమ్యూనిస్టుల సహకారమైత్రి మౌలికమైనదిగా చెప్పారు. కాంగ్రెసు కమ్యూనిస్టుల మధ్య యేర్పడిన చీలికకు విచారిస్తూ "జాతీయ ఐక్యత వచ్చే రోజులలో అత్యవసరమైనందున యీ చీలిక సాధ్యమైనంత తొందరగా అధిగమించగలరని ఆశిద్దామని[1]" స్పష్టంచేశారు.

అంతేగాక 1930 దశకంలోవలె కాంగ్రెసు యెడల అత్యంత సానుభూతి, సహకార ధోరణిని అవలంబించారు. "భారత అభ్యుదయకర జాతీయవాదులందరిని ఐక్యపరచే సంస్థగా కాంగ్రెసుకు చాలాకాలంనుండి సాంప్రదాయం యేర్పడివుంది" దానికి భారత ప్రజానీకంలో "అత్యధిక మెజారిటీ బలాన్ని కలిగివుంది" అని దత్తు పేర్కొన్నారు భారత బడా బూర్జువావర్గం కాంగ్రెసుపై చాలాప్రభావం కలిగివుందని గుర్తించినా, దాని దేశభక్తిని ప్రశ్నించలేదు. పైగా బడాబూర్జువావర్గం భారతదేశంపై బ్రిటిషు గుత్త పెట్టుబడిదారి వర్గాలకుగల "కబంధ హస్తాల పట్టును" బ్రద్దలుచేసి జాతీయ ప్రభుత్వ ఆధ్వర్యంలో భారీ పారిశ్రామికాభివృద్ధిని కోరుతున్నదని[2]" వివరించారు.

---

1. రజనీపామీదత్తు, ఇండియా అండ్ పాకిస్తాన్" లేబర్‌మంత్లి, మార్చి 1946. పే. 92.

2. అదే. పే. 91-92

కాంగ్రెసు-కమ్యూనిస్టుల మధ్య సహకార సదభిప్రాయాలు అభివృద్ధి చేయుటకు వ్యక్తిగతంగా కూడ ప్రయత్నించారు. నేరుగా గాంధీజీ, నెహ్రూలతోనేగాక సర్దార్ పటేల్, పాటిల్‌లతో అంటే కమ్యునిస్టు వ్యతిరేకులతో కూడ యీ సమస్యపై చర్చలు జరిపారు. తన యాత్రా కథనాలలో ఈ సంభాషణలలో తిరిగి సన్నిహిత సంబంధాలు కాంగ్రెసు కమ్యునిస్టులమధ్య అభివృద్ధిచెందవలసిన అవసరాన్ని నొక్కి చెప్పుట జరిగిందని వ్రాశారు. కమ్యూనిస్టులు "రహస్యమైన బలంపై" ఆధారపడుతున్నారని అదే ప్రధాన "అధిగమించరాని అడ్డుగోడ" అని గాంధీజీ "గతాన్ని పాతిపెట్టి" "స్నేహ సహకారాలను పెంపొందించుట అవసరమని" ఉక్కుమనిషి[1] పటేలు అన్నారని వ్రాశారు.

భారత కమ్యునిస్టులు తమ ఎత్తుగడలను సవరించుకొని బహిరంగంగా పాకిస్తాన్‌ను బలపరచేస్థితినుండి బయట పడుటకు కాంగ్రెసును సంతృప్తిపరచే విధానాన్ని అవలంభించాలని సూచించినట్లు తెలుస్తుంది. "అభ్యుదయకరమైన దృష్టిలో భారతదేశ ఐక్యత అత్యంత వాంఛనీయము" అని దత్తు ప్రకటించుటయేగాక "విభజన అభ్యుదయ వ్యతిరేకం[2]" అని స్పష్టంచేశారు. ముస్లింలీగు పాకిస్తాన్ కోరిక "అభివృద్ధి విరోధమని", కమ్యూనిస్టుపార్టీ తగువిధానాన్ని, ముస్లింలీగు విధానాన్నుండి "స్పష్టీకరించాలని", కమ్యూనిస్టుపార్టీ చేబట్టిన "17 జాతుల" స్వయంనిర్ణయం, ముస్లింలీగు కోర్కెయైన ఒకే ఒక "ముస్లిం పాకిస్తాన్" ఒకటికాదని స్పష్టంచేయాలని నొక్కి చెప్పారు.

అంతేగాక. పామీదత్తు, రాజ్యాంగ నిర్మాణ ప్రతిపాదనల విషయమైగూడ, పార్టీ ఎన్నికల ప్రణాళికలో భాషా ప్రాతిపదికపై 17 సార్వభౌమాధికారాలుగల రాష్ట్రాల ప్రతిపాదనలకు పూర్తి వ్యతిరేకంగా ప్రతిపాదనలను చేసారు. కమ్యూనిస్ట్ పార్టీ ప్రతిపాదించిన 17 రాజ్యాంగ నిర్ణయ అసెంబ్లీలు తమ ప్రతినిధులను కేంద్రాన్ని పంపే విధానాన్ని త్రోసిబుచ్చి పామీదత్తు ఒకే ఒక కేంద్ర రాజ్యాంగ నిర్ణయ అసెంబ్లీకి, నేరుగా ఎన్నిక కాబడిన ప్రతినిధులను పంపాలి. వారే సార్వభౌమాధికారాలను, రాజ్యాంగచిత్రాన్ని నిర్ణయించగలరు. అటువంటి రాజ్యాంగ నిర్ణయ అసెంబ్లీ యేర్పాటుకు ముందే బ్రిటిషు ప్రభుత్వం, కాంగ్రెసు, ముస్లింలీగులకు సమాన ప్రాతినిధ్యంగల తాత్కాలిక కేంద్ర ప్రభుత్వాన్ని యేర్పరచాలి, లేదా యిది సాధ్యం కాకపోతే కాంగ్రెసుతోనే కేంద్ర ప్రభుత్వాన్ని యేర్పరచాలని దత్తు ప్రతిపాదించారు[3]. ఇది కాంగ్రెసు అభిప్రాయాలకు చేరువగా వున్నదనుట స్పష్టం.

భారత కమ్యునిస్టు పార్టీ ప్రస్తుతానికి, ఐక్యతను ప్రచారం చేయాలని పామీదత్తు అభిప్రాయం. ఐక్యత అప్పటి పరిస్థితులలో ఆచరణాంశం కాకపోయినా,

1. దత్తు ట్రావెల్‌నోట్సు. నవంబరు 2. లేబర్ మంత్లీ జూన్ 1946 పే. 185-188;
2. దత్తు, ఇండియా అండ్ పాకిస్తాన్. పే. 88-93.
3. మెమోరాండము. మిత్ర ఎడిటెడ్. ఇండియన్ యాన్యువల్ రిజిస్టరు. 1946. 1. పే. 220-222.

ఐక్యతా ప్రచారం కావించాలని దత్తు అభిప్రాయం, మరో సందర్భంలోని వ్యాఖ్యల బట్టి అది స్పష్టమైంది. "అఖిల భారత యూనియన్"కు, రాజ్యాంగ నిర్ణయ వొప్పందం జీవం పోస్తుంది అని, "విభజన సమస్యను ముందుగానే నిర్ణయించాం" అన్నారు. కాంగ్రెసు, ముస్లింలీగులు ఐక్యంగా, ఒకటి కంటె యెక్కువ రాజ్యాంగ నిర్ణయ అసెంబ్లీలను కోరితే, ఇండియా, పాకిస్తాన్‌లకు, అది యాంత్రికంగా ఆమోదించవలసి వుంటుంది. అనగా భారత కమ్యూనిస్టు పార్టీ ఐక్యతను కోరుతూ, తటస్థంగా ఉండాలి. కాంగ్రెసు-ముస్లింలీగుల మధ్యగల రాజకీయ పోటీ ఫలితాలకై వేచి వుండాలి

దత్తుసలహా, ఏప్రిల్ 15న భారత కమ్యూనిస్టు పార్టీ బ్రిటిషు కాబినెట్ రాయబార వర్గానికి యిచ్చిన మెమోరాండములో ప్రతిబింబించింది. రాజ్యాంగ సమస్యల పరిష్కారానికి, నేరుగా ఎన్నికైన ఒకే వొక రాజ్యాంగ నిర్ణయ అసెంబ్లీ యేర్పడాలని స్పష్టంగా ప్రతిపాదించుతు, జాతుల స్వయం నిర్ణయాన్ని, సార్వభౌమాధికారాన్ని సూత్రప్రాయంగా మాత్రం చెప్పింది మెమోరాండము. మెమోరాండములో పాకిస్తాన్ మాటనైనా చేర్చలేదు, పైగా ఐక్యతను నొక్కిచెప్పుతు, "భారత ప్రజల ప్రయోజనాలు ఒకే ఒక సమిష్టి యూనియన్‌లో వుండుట వలనే కాపాడబడగలవని విశ్వశించుతున్నామని" పార్టీ ప్రకటించింది. ఈ మధ్యకాలంలో సమాన ప్రాతిపదికపై కాంగ్రెసు-ముస్లింలీగులతో తాత్కాలిక ప్రభుత్వాన్ని యేర్పాటు చేయాలని కోరింది.[1]

ఈ విధంగా జాతుల సమస్య కమ్యూనిస్టు పార్టీ 1946 ఎన్నికల ప్రణాళిక అవగాహన నుండి అనగా కాన్‌ఫెడరేషన్ దృక్పధం నుండి వెనుదిరిగి, దత్తు వైఖరిని చేబట్టుట జరిగింది. అందుకే దత్తు "ఆచరణయోగ్యం, నిర్మాణాత్మకము, సంక్షిప్తము, స్పష్టమైన పత్రంగా" మెమోరాండంను గురించి వ్యాఖ్యానించారు అది "లీగు కోర్కె అయిన పాకిస్తాన్‌ను పార్టీ బలపరస్తున్నదనే ఊహాగానాన్ని యిది తుడిచివేస్తుందని" దత్తు అన్నారు. మెమొరాండం కేంద్ర లక్ష్యమే యిది.

### బ్రిటిషు కాబినెట్ ప్రతినిధుల రాయబారవర్గం ప్రతిపాదనలకు కమ్యూనిస్టుల స్పందన :

బ్రిటిషు కాబినెట్ రాయబారవర్గం, రెండు మాసముల తీవ్ర సంప్రదింపుల తరువాతకూడ, కాంగ్రెసు, ముస్లింలీగులతో ఒక వొప్పందానికి రాజాలకపోయింది. అంచేత రాయబారవర్గం తమ ప్రణాళికను 16 మే 1946న ప్రకటించింది. బలహీనమైన కేంద్రం కల, ఫెడరల్ విధానాన్ని ప్రణాళిక రూపొందించింది. కేంద్రం దేశరక్షణ, విదేశాంగ విధానం, రవాణా సమాచార శాఖలపై పూర్తి అధికారాలను కలిగి వుంటుంది. మిగతా అధికారాలన్నీ రాష్ట్ర ప్రభుత్వాలకు సంక్రమించుతవి. మధ్య స్థాయిలో ప్రాంతీయ రాష్ట్రాల కూటములను కలిగియుండుట అవకాశముంది.హిందూ మెజారిటీ, ముస్లిం మెజారిటీ రాష్ట్రాలు విడివిడిగా కూటమి ప్రభుత్వాలను విభజనకు ప్రత్యామ్నాయంగా రెండు ప్రభుత్వాలను యేర్పాటు చేసుకొనవచ్చు. వాస్తవానికి ప్రణాళిక విభజనను ఆమోదించింది, నిర్ణీతకాలము తరువాత విడిపోయే హక్కు నిచ్చింది.

రెండు పక్షాలు తమతమకు అనుకూలమైన అంశాల నుపయోగించు కొన సాగినా, తదుపరి వెంటనే కాంగ్రెసు, లీగులు రెండూ ప్రణాళికను వ్యతిరేకించాయి. వాతావరణం కలుషితమైంది. ఆగస్టులో లీగు "ప్రత్యక్ష చర్య" ప్రారంభించుటతో మతకల్లోలాలు, రక్తపాతాలు యెక్కువయ్యాయి.

ఈ చారిత్రిక కాలంలో సోవియట్ వ్యాఖ్యాతలు తాత్కాలిక సమస్యగా నెంచారు. ఒకటి రెండు వ్యాఖ్యలు చేసినా అవి, కాబినెట్ ప్రణాళికను బ్రిటిషు ప్రభుత్వ స్థానాలను బలపరచుకొనుట కుద్దేశించబడినవిగాను, అభ్యుదయకర కాంగ్రెసు వ్యతిరేకిస్తున్నదని గుర్తించి భారతదేశానికి స్వాతంత్ర్యాన్ని యిచ్చుట జరుగదని విశ్లేషించారు[1].

కమ్యూనిస్ట్ పార్టీకి ఉపయోగకరమైన సలహాలనిచ్చు బాధ్యత దత్తుపైనే పడింది. కాబినెట్ రాయబారవర్గం ఒప్పందాన్ని సాధించుటలో విఫలమగుటతో దత్తు పునర్విచారం కొనసాగించినట్లు అతని యాత్రాకథనాలు తెల్పుతున్నవి. దత్తు బ్రిటిష్ కాబినెట్ రాయబారవర్గ ప్రణాళికను విశ్లేషణచేసి, నూతనంగా భారతదేశంలో, ప్రపంచమంతటిలోవలెనె విప్లవ పోరాటాల వెల్లువను తప్పుడుమార్గం పట్టించుటకు ఎత్తుగడగా వ్యాఖ్యానించి దానికి ప్రతిగా ఎట్టి కార్యక్రమాన్ని సూచించలేదు. అయితే అతని అవగాహనలో నూతన విధానం రూపురేఖలు దిద్దుకొంటున్నదనుటకు షేక్ అబ్దుల్లా "క్విట్ కాశ్మీరు నినాదాన్ని" బలపరచుటతో స్పష్టం.

షేక్ అబ్దుల్లా కాశ్మీర్ నేషనల్ కాన్ఫరెన్సు నాయకుడు నేషనల్ కాన్ఫరెన్సు కాంగ్రెసుకుగాని, ముస్లింలీగుగాని దేనికి అనుబంధ రాజకీయ సంస్థగాదు. దాని సభ్యులలో మెజారిటి ముస్లింలు, నాయకత్వం కాంగ్రెసుకు అనుకూలము. కాబినెట్ రాయబారవర్గం కాంగ్రెసు నాయకులతో రాయబారం జరుపుతున్నప్పుడు అబ్దుల్లా "క్విట్ కాశ్మీర్" అనే నినాదంతో ప్రజోద్యమాన్ని ప్రారంభించాడు ఉద్యమం ప్రధానంగా సామ్రాజ్యవాద వ్యూడలు వ్యతిరేక వుద్యమము. భారతదేశానికి వచ్చిన వెంటనే దత్తుతో ఉత్తర ప్రత్యుత్తరాలు ప్రారంభించాడు. బహుశా దత్తు భారత కమ్యూనిస్ట్లు ఆ వుద్యమాన్ని ప్రారంభించుటకు కార్యక్రమాన్ని రూపొందించి వుండవచ్చు.

ఈ ఉద్యమము విప్లవోద్యమముగాదు. కాంగ్రెసు అనుసరించే సరళీకృత విధానమూకాదు. ఈ రెండింటికి మధ్యస్థంగా వుంది. బహుశా ఈ ఉద్యమంలో భారతదేశానికంతటికి ఒక వుద్యమ రూపపు నమూనాగా దత్తు తలచినట్లు కన్పించు చున్నది. భవిష్యత్తు కమ్యునిస్టు కార్యాచరణ యిదే రూపంలో వుండవచ్చని దత్తు తలచారు. ఉద్యమం ఉధృతమగుటతో అబ్దుల్లా అరెస్ట్చేయబడ్డాడు. పామీదత్తు లేబర్ మంత్రిలో అతని ధైర్యాన్ని కొనియాడాడు. జూన్లో షేక్ అబ్దుల్లాను కోర్టు విచారణ చేయునపుడు దత్తు అబ్దుల్లాను కలసి దీర్ఘంగా చర్చించారు, రహస్యంగావున్న

1. భారతదేశానికి బ్రిటిష్ నూతన ప్రణాళిక, న్యూటైమ్స్, జూన్ 1946 పే. 20.

నేషనల్ కాన్ఫరెన్సు నాయకులను కలసి చర్చించారు. తన రచనలో క్విట్ కాశ్మీర్ ఉద్యమం సంస్థాన ప్రజాపుద్యమాలన్నిటిలో బలమైన పోరాట వుద్యమం అని దానిని పూర్తిగ బలపరచాలన్నారు. సంక్షిప్తంగా భారత స్వాతంత్ర్య పోరాటంలో రాజకీయ తుపాన్ కేంద్రమని ప్రకటించారు.

ఇవి వూహాగానాలు కావని తదనంతర కాలంలోని ఘటనలే తెలిపాయి. కాశ్మీర్ నుండి ఇంగ్లండుకు వెళ్ళుతు జులై చివరలో భారత కమ్యూనిస్టు పార్టీ కేంద్ర సమితి సమావేశం జరుగుతున్నప్పుడు బొంబాయిలో ఆ సమావేశానికి హాజరయ్యారు. వెంటనే తదనంతర ఆగస్టులో నూతన రాజకీయ తీర్మానాన్ని ఆమోదించింది. ఆగస్టు తీర్మానపు అవగాహన అంతకుముందు అనుసరించుతున్న వైఖరికి పూర్తిగ భిన్నమైనది. కొన్ని అస్పష్టతలుకూడ చోటుచేసుకొన్నవి. అదే ప్రఖ్యాతి వహించుటయేగాక అనేక తర్జనభర్జనలకు లోనై 1946 ఆగష్టు రాజకీయ తీర్మానము పార్టీలోని అతివాద వర్గం అధికారి రణదివే, అజయ్ ఘోష్‌లు, దత్తు ఆలోచనా విధానంలో తమ తీవ్రవాదానికి పాక్షికంగా బలంచేకూరిందని తలచారు. అంచేత అంతకుముందుకంటె కేంద్రకమిటీలో తమ తీవ్రవాదాన్ని అధికం చేశారు వాస్తవానికి ఆగష్టు తీర్మానం పామీదత్తు అవగాహనలనుదాటి అతివాదంవైపు పయనించింది. వాస్తవానికి ఆగష్టు 1946 తీర్మానం జోషీ వర్గానికి, అతివాద వర్గానికి వారి అభిప్రాయాల మధ్య రాజీ ప్రాతిపదికగా రూపొందింది. అంచేత అది ఒక సంకలనరూపమనేది నగ్నసత్యం. మొత్తంమీద అతివాదవర్గం యెక్కువ ప్రాబల్యాన్ని సంపాదించింది. అయినా దానిలోని అనేక వైరుధ్యాంశాల కారణంగా బలహీనపడింది. తీర్మానంలో యిది స్పష్టంగా కన్పించుతుంది. అన్ని విధాల తీర్మానం దత్తు అభిప్రాయాలతో పరిష్కరించబడిన జోషీ పంథాగావుందని కొందరి అభిప్రాయంగా వుంది.

**కమ్యూనిస్టుపార్టీ ఆఖరి పోరాటపు 1946 ఆగస్టు తీర్మానం**

ఆగష్టు తీర్మానంలోని నూతన రాజకీయాంశాలకు మౌలిక పునాది పార్టీ ముందు "విప్లవ వెల్లువ" వుందనే ప్రాథమిక అవగాహన బలంగా వుంది. పామీదత్తు "ప్రజా వెల్లువ"ను ప్రస్తావించినా రెండిటి మధ్యగల భేదాన్ని అధ్యయనం చేయక యాంత్రికంగా అమలుకు దిగింది. అయితే పార్టీ నాయకత్వం ఐ ఎన్ ఎ సైనికులను విడుదలచేయాలనే ప్రజాప్రదర్శనలు, ప్రతిగా ప్రభుత్వ దమనకాండకు వ్యతిరేకంగా నవంబరు 1945, ఫిబ్రవరి 1946లలో ప్రాణాలకు తెగించి జరిపిన రాజకీయ ప్రదర్శనలు, ప్రజా ప్రతిఘటన, నావికాసైన్యపు తిరుగుబాటు బలపరస్తూ పదాతి వైమానిక దళాలు, సిగ్నల్స్ సైనికులు జరిపిన సమ్మెలు, వీరందరిని బలపరస్తూ కార్మికవర్గం నగరాలలో జరిపిన సార్వత్రిక సమ్మెలలో పార్టీ "విప్లవ వెల్లువ"ను దాని "పరిపక్వత" చూడగా, దత్తు "ప్రజా వెల్లువ" మాత్రమే చూశారు. శాస్త్రీయంగా రెండిటిని విశ్లేషణ గావించి అధ్యయనం చేయకుండా ఆఖరి పోరాటానికి పిలుపునిస్తూ పార్టీ తీర్మానించింది[1].

---

1. జె వి డి ఓవర్‌స్ట్రీట్, మార్షల్‌లిండ్‌మిల్లర్ (1960) కమ్యూనిజం ఇన్ ఇండియా. పెరినియల్ ప్రెస్. బాంబె. పే. 243.

ఒకవైపు తీర్మానం, దాని ప్రధానాంశమైన సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట నాయకత్వాన్ని చేబట్టి బూర్జువా జాతీయ వాదానికి వ్యతిరేకంగా అది సామ్రాజ్యవాదంతో రాజీ పడుటకు సిద్ధంగా వున్నందున, ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలను పూర్తిచేయాలంది. బూర్జువావర్గం అభివృద్ధి నిరోధకవర్గంమై రాజీపడిందని తీర్మానించింది. ఇది గతంలో 1928-34లలోని అతివాద పంథాని గుర్తుచేస్తుంది. పెట్టుబడిదారి వ్యతిరేక వ్యూహాన్ని సూచిస్తున్నది. అందుకు భారతదేశంలో నూతన విప్లవ దశకు పోరాటం చేరిందంటున్నది. గతంలోని తీర్మానాలలోని బూర్జువావర్గంపై సరళీకృత అవగాహనలను విడనాడింది.

తీర్మానం మరోవైపు యీ అవగాహనలకు పరిమితులను పేర్కొంటూ విపక్షం-విపర్యం చేస్తున్నది. మొట్టమొదట బూర్జువా జాతీయ నాయకత్వాన్ని ప్రభావితం చేయుటగాక త్రోసిపారవేయాలని తీర్మానంలో అనేకచోట్ల పేర్కొంది. అంటే నాయకత్వం అభివృద్ధి నిరోధకులుకాదని, వూగిసలాటే చూపుతున్నారని, సాధికార కారణాలను పెడచెవిని పెడుతున్నారని అర్థం. కొన్నిచోట్ల కాంగ్రెసు, ముస్లిం లీగుల నాయకత్వాలను బూర్జువావర్గ నాయకత్వాలుగకాక బడా బూర్జువా నాయకత్వాలుగ గుర్తించుచున్నది. అంటే బడా బూర్జువావర్గమే అభివృద్ధి నిరోధకమైనదని అర్థం ఈ రెండింటి పరంగాను సామ్రాజ్యవాద వ్యతిరేక వ్యూహాన్ననుసరించి, బూర్జువావర్గానికి తరచు విజ్ఞప్తులు చేయవలసివుంటుంది.

క్లుప్తంగా ఆగష్టు తీర్మానం అస్పష్టసిద్ధాంతీకరణ అటువంటి పునాదిపై స్థిరమైన కార్యాచరణ రూపొందించజాలరు. మౌలిక వ్యూహ సమస్యపై కమ్యూనిస్టు పార్టీ నిర్ణయం అనగా బూర్జువావర్గం యెడల తనవైఖరిని నిర్వచించనిచో సమగ్ర ఆచరణ కార్యక్రమాన్ని రూపొందించజాలదు.

ఈ ఆగస్టు తీర్మానం రూపొందించుటలో అనుభవజ్ఞుడు, సిద్ధాంతవేత్త అయిన పామీదత్తు పాత్రలేకపోయినా అనేక అంశాలలో అతని ప్రభావం కన్పించుతున్నది. విభజన అయిన భారతదేశంలో పాలనలో భాగస్వామ్యానికై సామ్రాజ్యవాదంతో రాజీపడుతున్న ముస్లిం బూర్జువా వ్యూహాలు స్వార్థపర వర్గాల ప్రయోజనాల వాంఛ అయిన పాకిస్తాన్‌ను ముస్లింలీగ్ కోర్కెనుండి కమ్యూనిస్టుపార్టీ దూరమై బయట పడాలనే పామీదత్తు సలహా ఫలితమూ తీర్మానంలో ప్రతిబింబించింది. తీర్మానం కాంగ్రెసును బలపరచే ప్రజాస్వామ్యం "మత ప్రాతిపదికపై భారతదేశాన్ని విభజించుటను న్యాయంగానే వ్యతిరేకించుచున్నది. విభజన ప్రజాస్వామ్య వ్యతిరేకం, సరీగానే ఒకే యూనియన్ కోరుతున్నది". అంటూ అస్పష్టంగా జాతుల స్వయంనిర్ణయ సూత్రాన్ని సాధారణంగా వర్ణించినా ముస్లిం ప్రజాసామాన్యం ముందుగానే పాకిస్తాన్ యేర్పాటుకు అంగీకరించాలనే ఎట్టి షరతులు లేకుండా కాంగ్రెసు ముస్లింలీగు ఐక్యతను అంగీకరించాలి" అది "స్వచ్ఛంద యూనియన్" గమ్యానికి మార్గమగుతుందని స్పష్టమగుతుంది.[1]

1. ఓవర్‌స్ట్రీట్, మిల్లర్ (1960) కమ్యూనిజం ఇన్ ఇండియా. పే. 244.

తీర్మానంలో కాశ్మీర్‌లోవలె అన్ని సంస్థానాలలో ప్రజావద్యమాలను నిర్మించాలనే ప్రతిపాదన, రాజకీయ కార్యాచరణకు "క్విట్ కాశ్మీర్" నమూనా ఉద్యమాలను చేబట్టాలనే పై మీదట్టు సలహా వ్యక్తమగుతున్నది. ఆగష్టు తీర్మానం ప్రకటించిన కొద్ది వారాలకే నేటి స్వాతంత్రపోరాట కేంద్రం కాశ్మీర్ అని పార్టీ రాజకీయ విధాన ప్రకటన చేసింది. "అక్కడ నూతన పోరాటరూపం ఉద్భవించిందని" స్పష్టం చేసింది. ప్రకటన నెహ్రూతోసహా కాంగ్రెసును, అబ్దుల్లాను ఆపుటకు నెహ్రూ జాగ్రత్తగా అబ్దుల్లాకు యిచ్చిన సలహా "భయంకర విషాదాంతం కాశ్మీర్ యుద్ధంలో మునిగివుంది" అని ప్రకటన విమర్శించింది.

రాజకీయ ప్రధానపాత్ర వహించుతున్న బూర్జువా రాజకీయ పార్టీలైన కాంగ్రెసు, ముస్లిం లీగుల, సామ్రాజ్యవాదపు రాజకీయ వ్యూహాలను పార్టీ అధ్యయనం చేసింది "క్విట్ ఇండియా" వుద్యమంతో పెరిగిన ప్రజాబలం యుద్ధానంతరం కార్మిక, కర్షక, విద్యార్థి, యువజన, సైనిక దళాలలో పెరిగిన స్వాతంత్ర్యోద్యమ ప్రజావాంఛల వెల్లువల బలంతో, సామ్రాజ్యవాద ప్రణాళికలలో తనకత్యంత సానుకూలమైన రాజకీయ ప్రయోజనాలకు "వొత్తిడి-రాజీవ్యూహం"తో ప్రయత్నాలు కొనసాగించుటద్వారా ప్రజా వుద్యమాలను నీరుకార్చిన బ్రిటిషు సామ్రాజ్యవాదులనుండి అత్యధిక ప్రయోజనాలనుపొందవచ్చని కాంగ్రెసు ఎత్తుగడ. సంస్థాన ప్రజోద్యమాలు కాంగ్రెసు అధ్వర్యంలో వున్న కారణంగా వాటి ద్వారా సంస్థానాధీశులతో రాజీ కుదుర్చుకొనుట వ్యూహంలోమరో అంశము. ముస్లింలీగు వ్యూహలు, బ్రిటిషు ఒత్తిడి ద్వారా తమకు అనుకూలంగా రాజీ కుదుర్చుకొనాలని, దాని ఎత్తుగడగా వున్నది. రెండు బూర్జువా రాజకీయ పార్టీలు జాతీయ కాంగ్రెసు. ముస్లింలీగులు రాజీ, సంప్రదింపులు మార్గాన్ని చేబట్టి తమ లక్ష్యాలను సాధించదలచినవి.

కాంగ్రెసు, హిందూ-ముస్లిం సమస్యను పరిష్కరించుటలో విఫలమైన కారణంగా ముస్లింలీగు ముస్లిం ప్రజానీకంలో అధికుల అభిమానాన్ని చూరగొంది. ముస్లింలలో పెరిగిన సామ్రాజ్యవాద వ్యతిరేకతను పెడదారులు పట్టించి, వేర్పాటు తత్వాన్ని పెంచింది. స్వాతంత్ర్యంతోపాటు ముస్లింలకు ప్రత్యేకరాజ్యం పాకిస్తాన్ వాయువ్య, ఈశాన్యప్రాంతాలలో యేర్పాటుగావించాలని ఆయాప్రాంతాలలో ప్రజాభిప్రాయసేకరణ జరుగరాదని ముస్లిం మెజారిటి ప్రాంతాలు కాన ఆ విధంగా చేయాలని కోరింది అంతేగాక కాంగ్రెసుతో కలసి సమిష్టిగా స్వాతంత్ర్యపోరాటానికి విముఖతను ప్రదర్శించుటద్వారా సామ్రాజ్యవాదం నుండి తమ కోర్కెలను పొందగలమని ముస్లింలీగు వ్యూహంగా వుంది.

ఈవిధంగా కాంగ్రెసు ముసింలీగులు, ఐక్యభారతం, పాకిస్తాన్ సమస్యలను ప్రజా నిర్ణయానికి వదలి సామ్రాజ్యవాద వ్యతిరేక సంయుక్త సంఘటనగా యేర్పడి స్వాతంత్ర్య పోరాటాన్ని యినుమడింపజేయక ఒకరికి వ్యతిరేకంగా మరొకరు ప్రత్యేక రాజీ బేరాలనుసాగించి, సామ్రాజ్యవాదపు ప్రణాళిక భారతదేశాన్ని మత ప్రాతిపదికపై హిందూ-ముస్లింల రెండు రాజ్యాలను యేర్పరచి, ఆ రెండు శాశ్వత

శత్రువులుగా చేయుట తమ ఆధిపత్యాన్ని పరోక్షంగా కొనసాగించుట బ్రిటన్ వ్యూహం విజయమగుటకు కాంగ్రెసు-లీగులు తోడ్పడినవి. రాజ్యాధికారాన్ని బదలీ చేయు యేర్పాటులలో సామ్రాజ్యవాదానికి కాంగ్రెసుకు మరోవైపు ముస్లింలీగుకు వచ్చిన భేదాభిప్రాయాలను కాంగ్రెసు - లీగుల మధ్యవచ్చిన భేదాభిప్రాయాలుగ చిత్రించి అడుగడుగునా ప్రతిష్టంబననుసృష్టించుచు 'కోతి తీర్పుల'నిస్తూ తమ అసలు ప్రణాళిక యిద్దరి నెత్తినరుద్దుట బ్రిటిషువారి ధ్యేయం. చివరకు అదే జరిగింది.

కమ్యూనిస్టుపార్టీ సామ్రాజ్యవాదుల తాత్కాలిక ప్రభుత్వ ప్లానును తీవ్రంగా విమర్శించి; ఆ ప్రభుత్వంలో కాంగ్రెసు-లీగు యే ఒక్కరూ లేక యిద్దరూ చేరినా ప్రత్యర్థి వైస్రాయిదే పైచేయి అవుతుందనిస్పష్టంచేసింది. ఆ ముసుగుతో వైస్రాయి మప్పెనగా వేస్తున్న ప్రజా విప్లవోద్యమాలను అణచేపని చేస్తాడు. అందుకు దేశీయ నాయకత్వాలు రెండూ పావులు అగుతాయని పేర్కొంది అట్టి తాత్కాలిక ప్రభుత్వంలో చేరవద్దని తీర్మానం హెచ్చరించింది. ప్రత్యామ్నాయంగా వయోజన ఓటింగుపై దామాషా పద్ధతిలో ఎన్నికకాబడిన రాజ్యాంగ నిర్మాణ సభకు ప్రజలకు అన్ని అధికారాలు సంక్రమించాలని, అన్ని జాతులకు స్వయం నిర్ణయహక్కు వుండాలని సూచించింది. అదే కాలంలో ప్రజాస్వామ్య విప్లవానికి కార్యక్రమాన్ని ప్రజల ముందుంచింది. దేశభక్త పార్టీలన్నీ అధికార చివర పోరాటానికై సంయుక్త సంఘటనగా యేర్పడి సంసిద్ధులుకండి అనే కేంద్ర రాజకీయ నినాదాన్ని యిచ్చింది.

## ప్రజాస్వామ్య విప్లవం సంయుక్త స్వాతంత్ర్య సంఘటన

అధికారానికై ఆఖరి పోరాటానికకై కాంగ్రెసు, లీగు, కమ్యూనిస్టుల ఐక్య సంఘటనవ్యూహాన్ని కమ్యూనిస్టుపార్టీ రూపొందించింది. అదే ప్రజాస్వామ్య విప్లవానికి సంయుక్త స్వాతంత్ర్య సంఘటనా వ్యూహం అని పేర్కొంది.

జాతుల స్వయం నిర్ణయ సూత్రముపై, వయోజన ఓటు, దామాషా ప్రాతినిధ్యంపైయేర్పడే రాజ్యాంగసభ అన్నిజాతుల ప్రతినిధులతో యేర్పడుతుంది. భారత ఐక్యత పాకిస్తాన్ సమస్యలను ప్రజాస్వామ్య పద్ధతులలో నిర్ణయించగలదు. అందువలన ఆఖరిపోరాటానికై యేర్పడవలసిన సంయుక్త సంఘటనకు మార్గం సుగమమౌతుంది.

ఈ సంయుక్త సంఘటన ఆఖరి పోరాటపు ఆయుధమగుతుంది. ఈ ప్రజాస్వామ్య విప్లవపోరాటం అన్నివర్గాల అత్యధిక ప్రజాసామాన్యం పాల్గొన్నపుడే జయం పొందుతుంది. జాతీయ కాంగ్రెసు స్వాతంత్ర్య పోరాటపు ప్రధాన స్రవంతి. ముస్లింలీగు వెనుక సామ్రాజ్యవాద వ్యతిరేక అత్యధిక ముస్లిం ప్రజానీకముంది. కమ్యూనిస్టు పార్టీలో, నిర్మాణాలలో అత్యధిక కార్మిక, కర్షక ప్రజానీకముంది. ఈ మూడు పార్టీల సంయుక్త సంఘటన ఆఖరిపోరాటపు విజయసాధనకు మౌలికమైనది. ఈ దశలో యిట్టి సంఘటనా నిర్మాణం ప్రధాన కర్తవ్యం. సంఘటనా నిర్మాణం సఫలంకానిచో విప్లవ పోరాటాలవెల్లువ సమసిపోతుంది. విచ్ఛిన్నత ఫలితంగా నీరు

త్సాహం మిగులుతుంది. పాక్షిక పోరాటాలలో సంఘటనల సత్ఫలితాలు కాంగ్రెసు, ముస్లింలీగుల ప్రజాసామాన్యం, వారి నాయకత్వపు రాజీబేరాలను తిరస్కరించి, సమిష్టి ధ్యేయానికై పోరాడునట్లు చేస్తారని విశ్వశించుచున్నది. ఆవిధంగా సంయుక్త సంఘటనా నిర్మాణం విజయవంతమగుతుంది పాక్షిక పోరాటాలలో వారి నాయకత్వాల రాజి బేరాలను తీవ్ర విమర్శనకు గురిచేస్తూ ప్రజల ధైర్యసాహసాలతో నడుపుతు, నాయకులకు విజ్ఞప్తులుచేస్తూ సంఘటనా నిర్మాణాన్ని చేయగలనని విశ్వసించుచున్నది.[1]

అంతేగాక, తీర్మానం "బూర్జువా నాయకత్వాలకు విజ్ఞప్తులతోనే సంయుక్త సంటునను నిర్మించగల భ్రమలు పార్టీకిలేవు. నాయకత్వాలకు అయిష్టంగానే ప్రజా సమూహాలను కదలించినపుడు సంయుక్త సంఘటన యేర్పాటు విజయమౌతుంది." అని స్పష్టంచేసింది, విస్తరించే ప్రజాపోరాటాల వెల్లువలో పార్టీ యెంతవరకు తన నాయకత్వాన్ని నిర్మించి, విస్తరించగలదో నాయకత్వపు రాజీ భ్రమలనుండి ప్రజలకు కనువిప్పు కలిగించగలచో జాతీయ ప్రజాస్వామ్య విప్లవ కార్యక్రమం విజయానికి ప్రజలను బ్రిటిషు సామ్రాజ్యవాద ప్రణాళికకు వ్యతిరేకంగా పోరాటానికి సమరోత్సాహాన్ని పెంపొందించగలదో ఆ మేరకు జాతీయ సంయుక్త సంఘటనను నిర్మించగలమని స్పష్టంచేసింది.

### వామపక్ష ఐక్యకార్యాచరణ :

కాంగ్రెసు రాజీ విధానంలో భ్రమలు తొలగిన అభ్యుదయకరశక్తులు, వామపక్ష బలాలు అభివృద్ధి చెంది మార్క్సిజంవైపు ఆకర్షితులగుతున్నారు, అతివాద శక్తులు రాజీ విధానానికి వ్యతిరేకంగా, కమ్యూనిస్టులతో కలసి వామపక్ష ఐక్యకార్యాచరణ చేబట్టాలనే నినాదం వినపడుతున్నది, కమ్యూనిస్టు పార్టీ దీనికి అంత్యంత ప్రాముఖ్యతనిస్తున్నది. కమ్యూనిస్టు వ్యతిరేకత తగ్గిపోతున్నది, సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తులన్నిటిని వొక వేదికపై సంఘటితపరచి, ప్రమాదాన్ని తెలియజేసి, ప్రతిఘటనను పెంపొందించాలి. ఐక్య కార్యాచరణకు పునాది అంశాలుగ తీర్మానం, క్రింది వాటిని పేర్కొంది. 1) కార్మిక, కర్షక, యువజన, విద్యార్థి, ఉద్యోగుల పాక్షిక పోరాటాలకు మద్దతు నిచ్చుట 2) సంస్థాన ప్రజాపోరాటాలకు మద్దతు 3) సామ్రాజ్యవాదుల ప్లానును త్రోసిబుచ్చుట 4) రాజ్యాధికారం కొరకు ప్రజల సంయుక్త ఆఖరి పోరాటాన్ని కొనసాగించుట.

వయోజన ఓటింగు, దామాషా ప్రాతినిధ్యంపై ఎన్నికైన రాజ్యాంగ నిర్మాణ సభ, జాతులన్నిటికి స్వయం నిర్ణయ సూత్రం అనే నినాదాలపై ప్రజా సమీకరణ కావించాలి. అందరూ యీ అన్ని అంశాలను అంగీకరించకపోయినా యే వొక్క అంగీకృత అంశం లేక అంశాలపైనా వామపక్ష ఐక్యకార్యాచరణకు కమ్యూనిస్ట్

---

1. ఆఖరిపోరాటం కొరకు (ఆంగ్లంలో) కమ్యూనిస్టుపార్టీ కేంద్రసమితి, రాజకీయ తీర్మానం ఆగస్టు 1946, పే. 11 పిపిహెచ్ ప్రచురణ. 1946.

పార్టీ తీర్మానంలో సంసిద్ధతను తెల్పింది. ఆఖరి పోరాటానికై హిందూ-ముస్లిం ఐక్యతను నిర్మించుటకు జాతుల స్వయం నిర్ణయ సూత్రమొక్కటే ప్రధాన భూమిక కాగలదని వివరించింది.

"కాంగ్రెసు సోషలిస్టు పార్టీ. ఫార్వర్డు బ్లాకులు అనుసరించే రాజకీయ విధానాలు నేడు సంయుక్త కార్యాచరణకు ప్రధాన అడ్డంకులుగ వున్నవి.[1]" ఈ అతివాద పార్టీలు మాటలలో సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకించుతున్నా, ఆచరణలో రాజీవాదులను అనుసరించుతున్నారు. "కమ్యూనిస్టు వ్యతిరేకతలో మితవాదులను మించిపోయి, ఆచరణలో రాజీ బూర్జువాశక్తులకు సహాయపడుతు, రాజీ వ్యతిరేకశక్తులను చీల్చుతున్నారు." కాంగ్రెసు నాయకత్వంతో కలసి పోటీ కార్మిక సంఘాలను యేర్పాటు చేస్తు, ఉధృత సమ్మె పోరాటాల వెల్లువను విచ్ఛిన్నం చేస్తున్నారు. రైతురంగంలోను యిదే పునరావృతమైంది. "ఈ విధానం వుధృతమౌతున్న ప్రజాపోరాటాలను విచ్ఛిన్నం చేయుటయేగాక, సామ్రాజ్యవాదపు నూతన ప్లానుకు, వ్యతిరేకంగా జరిగే పోరాటాలను నీరుగార్చుతుంది.[2]

జాతీయఐక్యతకు, సామ్రాజ్యవాదుల ప్లాన్‌కు వ్యతిరేకంగా సంఘటన ప్రాధాన్యత దృష్ట్యా, యేమైనప్పటికి, కమ్యూనిస్టు పార్టీ ఐక్యకార్యాచరణ ప్రతిపాదనలకు వామపక్ష పార్టీల ముందుంచుతున్నది, రాజీ విధానాలకు వ్యతిరేకంగా ప్రజలందరిని సమీకరించుటకు యిది వొక్కటే మార్గమని యెంచుతున్నది.

కాంగ్రెసు, లీగు నాయకత్వాలు రెండూ ద్రోహమైనా లేక విచ్ఛినమైనా చేస్తారు. ఏదైనా ఫలితం ప్రజలలో చీలిక. ప్రజాపోరాటాలకు కమ్యూనిస్టు పార్టీ ధైర్య, సాహస నాయకత్వాన్నిచ్చి, విచ్ఛిన్నత నెదుర్కొని ఐక్యతకై పోరాడాలని నిర్ణయించింది

## V

# అధికారమార్పిడి, ఆఖరి ఘటనలు

యుద్ధకాలంలో బ్రిటిష్ ప్రభుత్వ నాయకుడుగ సర్ క్రిప్స్, రాయబారాల వైఫల్యం అనంతరం, "యుద్ధానంతరం సంపూర్ణమైన అధినివేశ ప్రతిపత్తి గలిగిన నూతన ఇండియన్ యూనియన్" రూపొందించేందుకు, బ్రిటిషు ప్రభుత్వం అవసరమైన చర్యలు తీసుకొంటుందని ప్రకటించారు. ప్రధానంగా యుద్ధకాలంలో అధినివేశ ప్రతిపత్తితో కూడిన జాతీయ ప్రభుత్వాన్ని కేంద్రంలో యేర్పాటు చేయుటకు అంగీకరించని కారణంగా రాయభారం విఫలమైంది.

గాంధీ-జిన్నాలు రాజాజీ ప్రతిపాదనలు ప్రాతిపదికగా సెప్టెంబరు 1944 లో సంభాషణ జరిపారు. సూత్రప్రాయంగా లీగుకోర్కెను ఆమోదించినప్పటికి, ఆచర

1. ఆఖరి పోరాటం కొరకు (1946) కమ్యూనిస్టు పార్టీ, ఆగస్టు తీర్మానం (ఆంగ్లంలో) పే. 12.
2. అదే పే. 13.

ఐలో, ఇండియానుండి విడిపోవుటప్రజాభిప్రాయంద్వారా నిర్ణయించాలనుట, ముస్లిం మెజరిటి రాష్ట్రాలలో గూడ జిల్లాల ప్రాతిపదికగా యిది జరగాలనుట, సరిహద్దు జిల్లాలవారు తమకు యిష్టమైన యూనియన్‌లో చేరుటకు హక్కునిచ్చుట, లీగుకు ఆమోదయోగ్యం కాలేదు. దేశం రెండుగా చీలే పక్షంలో రక్షణ, వర్తక. వాణిజ్య, రవాణా, అత్యవసర అంశాలపై పరస్పర సహకారంతో రెండు దేశాలు ఒకటిగానే వ్యవహరించవలసి వుంటుందని, ఒప్పందంపై సంతకాలు చేయవలసి వుండుట లీగు అంగీకరించలేదు. ఈ పరిస్థితులలో గాంధీ-జిన్నాల మధ్య పరిష్కారం కుదురలేదు.

బ్రిటన్‌లో యుద్ధానంతర ఎన్నికలలో టోరీ ప్రభుత్వం పడిపోయి, లేబరు ప్రభుత్వం అట్లీ నాయకత్వంలో యేర్పడింది. యుద్ధకాలంలో టోరీ మంత్రివర్గంలోని లేబరు పార్టీ నాయకుడు, భారత పరిస్థితి పరిష్కారానికి రాయబారవర్గ నాయకుడుగా వచ్చిన క్రిప్స్ లేబరు మంత్రివర్గంలో సభ్యుడు. వైస్రాయి వేవెలు సంప్రదింపులకు లండను వెళ్ళి, జాతీయ కాంగ్రెసు, ముస్లింలీగులకు సమాన ప్రాతినిధ్యం, హరిజను లకు, శిక్కులకు, సర్వసైన్యాధిపతికి ప్రాతినిధ్యాన్ని యిచ్చే కేంద్ర తాత్కాలిక ప్రభు త్వం యేర్పాటు చేయు నూతన పథకానికి ఆమోదం పొంది వచ్చాడు.బ్రిటిషు ప్రభు త్వం కేంద్రంలో తాత్కాలిక ప్రభుత్వాన్ని యేర్పాటు చేయు ప్రయత్నాలను,సమస్య లను భారతదేశంలోని ప్రధాన రాజకీయ పార్టీలతో చర్చించేందుకు 1945 జూన్ 25న సిమ్లాలో సమావేశం యేర్పాటు చేయబడుతుందని ప్రకటించింది. కాంగ్రెసు నాయకులు విడుదల చేయబడ్డారు. కాంగ్రెసు తరఫున మంత్రులుగ వుండవలసిన వారి జాబితాలో కాంగ్రెసు అధ్యక్షుడు అబుల్‌కలాంఅజాద్, అసఫ్‌అలీ పేర్లు సూచించ బడ్డాయి. కాంగ్రెసు భారత ప్రజలందరికి ప్రాతినిధ్యం వహించదని, అది హిందువు లకు మాత్రమే అందులో సవర్ణులకు మాత్రమే ప్రాతినిధ్యం వహించుతున్నదని జిన్నావాదన. ముస్లింలీగు వాదనను ఆమోదించి, కాంగ్రెసు స్థానాన్ని బలహీనపరచా లని బ్రిటిషు ప్రభుత్వపు ఎత్తుగడగా వుంది. అధికార సమావేశంలో, మంత్రివర్గంలో అజాద్, అసఫ్‌అలీలు వుండరాదనుటతో సమావేశం నిర్ణయాలు చేయకుండా ముగి సింది.

బ్రిటిషు లేబరు మంత్రివర్గం వేవెల్‌ను సంప్రదింపులకు పిలిపించి, 18 సెప్టెం బరు 1945న, భారతదేశంలో కేంద్ర, రాష్ట్రీ శాసనసభలకు భారత సమస్య పరి ష్కార క్రమంలో భాగంగా ఎన్నికలు జరుగునని ప్రకటించింది. బ్రిటన్-ఇండియాల మధ్య ఒడంబడిక సమస్య పరిశీలనలో ఉందని గవర్నర్ జనరల్ వేవెల్ తెలిపారు.

జాతీయ కాంగ్రెసు, ముస్లింలీగులు ప్రజాబలప్రదర్శనకు ఎన్నికలలోనికి దిగారు. సిమ్లా సమావేశంలో లేవదీయబడిన సమస్యలు, కాంగ్రెసు లీగుల వైఖరులు, 17 శాతం వోటరుబుగల ఎన్నికలలో పరీక్షకు వచ్చాయి. ఎన్నికల అనంతరం తాత్కాలిక ప్రభుత్వపు యేర్పాటు, అధికారం బదలీ, అందులో వాటాలకు ఎన్నికలు బహిరంగ పోరాటమయ్యాయి.

కమ్యూనిస్ట్ పార్టీ యీ రెండు పార్టీలలో దేనిలోను చేరక స్వతంత్రంగా కార్మికవర్గ ప్రయోజనాలను, ప్రజాస్వామికాన్ని ప్రచారం చేసింది. తన స్వంత కార్యక్రమాన్ని, కోర్కెలతో విస్తృతంగా ప్రచారంచేసి పాల్గొన్నది. పార్టీ నినాదాలు, కార్యక్రమాలు దేశవ్యాప్తంగా గుర్తింపు పొందలేదు. రాజ్యాంగాన్ని నిర్ణయించే క్రమంలో ఒక శక్తిగా యెదగలేదు.

కాంగ్రెసు, లీగులు ఎన్నికల ఫలితాలను తమ, తమ వాదనలు రుజువైనట్లుగా చెప్పుకొన్నవి. కాంగ్రెసు మెజారిటి వచ్చుటతో సరిహద్దు, అస్సాం రాష్ట్రాలలో మంత్రివర్గాలను యేర్పరచింది. సింధూ, బెంగాలులో లీగు మెజారిటి లేకపోయి నప్పటికి, యూరోపియన్ సభ్యుల సహాయంతో మంత్రివర్గ మేర్పాటు చేసింది. మిగిలిన అన్ని రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రివర్గాలను యేర్పాటు చేసింది. కాంగ్రెసు-లీగుల మధ్య రాజకీయ పోటీ, బ్రిటిషువారు పోస్తున్న ఆజ్యంతో మతకలహాల జ్వాలలు మరింత ఉజ్వలంగా వ్యాపించాయి.

## తాత్కాలిక ప్రభుత్వము, రాజ్యాంగ నిర్మాణ సమస్యలు :

బ్రిటిషు మంత్రివర్గ రాయబారవర్గం లార్డ్ పెథిక్ లారెన్స్ నాయకత్వంలో 1946 మార్చిలో వచ్చి, కేంద్రంలో తాత్కాలిక ప్రభుత్వం యేర్పాటు, రాజ్యాంగ నిర్మాణం విషయాలు, కాంగ్రెసు, ముస్లింలీగు, యితర నాయకులతో సంప్రదింపులు, చర్చలు జరిపి, రాయబార నాయకుడు రెండు పార్టీల మధ్య అంగీకారానికి వచ్చుటకు మరోసారి ప్రయత్నించాలని కోరుతు, కొన్ని ప్రధాన సూత్రాలను సూచించుతు కాంగ్రెసు, ముస్లింలీగు నాయకులకు వుత్తరాలు ఏప్రిల్ 24న వ్రాసారు. అంగీకారానికి వచ్చే దృష్టితో చర్చలకు రావలసిందిగా ఆహ్వానించారు.

ఆ లేఖలలోని సూచనలు, "కేంద్ర ప్రభుత్వ ఆధీనంలో రక్షణ విదేశాంగ కమ్యూనికేషన్స్ శాఖలుంటాయి. రెండు గ్రూపులకు రాష్ట్రాలు చెందివుండాలి. ముస్లింలు అధికంగావున్న రాష్ట్రాలు, హిందువులు అధికంగా వున్న రాష్ట్రాలు ఈ రెండు గ్రూపులకు చెందిన రాష్ట్రాలు, వుమ్మడి అంశాలపై యాజమాన్యం కలిగి వుంటాయి. మిగిలిన అంశాలపై రాష్ట్ర ప్రభుత్వాలు పూర్తి అధికారాలను కలిగి వుంటాయి".

సంభాషణలు మూడు మాసాలు కొనసాగినా వైఫల్యం చెందాయి. రాయబార వర్గం వెంటనే తన స్వంత ప్రతిపాదనలను ప్రకటించింది. కాంగ్రెసు అంగీకారానికి షరతులు విధించింది. అది తనకనుకూలమైనందున కాంగ్రెసు ఆమోదించలేదని, ముస్లింలీగు తలచి తన అంగీకారాన్ని తెలిపింది. కాంగ్రెసు పునరాలోచించి తాత్కాలిక పథకాన్ని మాత్రం అంగీకరించింది వైస్రాయి కాంగ్రెసు లీగుల ఆమోదం లేకుండా మంత్రుల జాబితాను మార్చేదిలేదని జిన్నాకు హామీయిచ్చి, కాంగ్రెసు జాబితాలో జాతీయ ముస్లింవుండుటకు వీలులేదని కాంగ్రెసుకు తెలియపరచారు. కాంగ్రెసు తాత్కాలిక ప్రభుత్వంలో తాము చేరటంలేదని, రాజ్యాంగ నిర్మాణ పథకంలో,

తామిచ్చే నిర్వచనంతో ఆమోదించుకున్నట్లు ప్రకటించింది. రాయబార సంఘం రెండూ షరతులు లేకుండా తమ ప్రతిపాదనలను ఆమోదించలేవని తలచింది. కాంగ్రెసు తాత్కాలిక ప్రభుత్వం యేర్పాటు చేయుటకు రాయబార వర్గపు షరతులను తిరస్కరించుటతో తిరిగి వెళ్ళిపోవుటకు నిర్ణయించింది. అవసరమైన తాత్కాలిక ప్రభుత్వమేర్పాటు, రాజ్యాంగ నిర్మాణ సమస్యలపై సంప్రదింపులు కొనసాగించవలసినదిగా వైస్రాయిని కోరింది. ముస్లింలీగు తాత్కాలిక ప్రభుత్వమేర్పాటు రాజ్యాంగ నిర్మాణాలపై లోగడ తానిచ్చిన ఆమోదాన్ని వుపసంహరించుకొని పాకిస్తాన్‌ను సాధించేందుకు "ఆగష్టు 16"న ప్రత్యక్షపోరాట దినంగా ప్రకటించి పోరాటానికి దిగింది. ఇదే భారతదేశ రాజకీయ చరిత్రను మార్చిన హిందూ-ముస్లింల మత మారణహోమానికి నాంది అయింది.

రాయబారవర్గ ప్రతిపాదనల ప్రకారం తాత్కాలిక ప్రభుత్వం యేర్పాటుకు 14 మంది సభ్యులతో వైస్రాయి ప్రభుత్వ ప్రతిపాదనను కాంగ్రెసు-లీగు అధ్యక్షులు నెహ్రూ, జిన్నాలకు పంపించారు. లీగు తన ఆమోదాన్ని వుపసంహరించుకొని ప్రత్యక్ష కార్యాచరణకు దిగిన కారణంగా కాంగ్రెసును లీగులేకుండా ప్రభుత్వాన్ని యేర్పాటు చేయవలసిందిగా నెహ్రూను బ్రిటిషు ప్రభుత్వం కోరింది. ఆ విధంగా ప్రభుత్వంచేస్తే తాను యేర్పాటుచేయగలనని నెహ్రూ తెలియపరచారు. ఆగస్టు 22న వైస్రాయి అట్టి ప్రకటనచేశారు. సెప్టెంబరు 2 తేదీన నెహ్రూ నాయకత్వంలో నూతన మంత్రివర్గం అధికారాన్ని స్వీకరించింది. మధ్యంతర ప్రభుత్వంలో లీగు లేకుండిన దేశమంతా మత కలహాలు వ్యాపిస్తాయని నెహ్రూకు నచ్చజెప్పారు. వైస్రాయి చివరకు అక్టోబరు 15న నెహ్రూ మంత్రివర్గంలోనివారు రాజీనామాయిచ్చి లీగు ప్రతినిధులైన లియాఖత్ ఆలీఖాన్, జోగేంద్రమండల్ మరి ముగ్గురు ముస్లింలు మంత్రివర్గంలో చేరారు. కాంగ్రెసు, లీగు మధ్య సంఘర్షణలు తీవ్రమై పరిపాలనా స్థాయికి విస్తరించాయి.

రాజ్యాంగ నిర్మాణసభలో లీగు పాల్గొనదని స్పష్టంచేయుటతో రాజకీయ ప్రతిష్టంభన యేర్పడింది. బ్రిటిషు ప్రభుత్వం కలుగజేసుకొని, చర్చలకు లండన్ రావలసిందని కోరింది. లీగు, కాంగ్రెసు నాయకులను సిక్కుల ప్రతినిధిగా బలదేవ్‌సింగ్‌ను ఆహ్వానించారు. సంభాషణలు విఫలమైనాయి. బ్రిటిషు ప్రభుత్వం రాజ్యాంగ సభ సమావేశాలపై, లీగు వాదనను ఆమోదించుతు ప్రకటించింది. వివాదమేర్పడితే ఫెడరల్ కోర్టుకు తీర్పును వదలివేయవచ్చుని, కాంగ్రెసును సంతృప్తిపరచ సూచించింది.

జనవరి 1947లో కాంగ్రెసు కమిటి, యే సెక్షన్‌లో చేరాలన్న విషయంలో రాష్ట్రాలను వొత్తిడి చేయరాదని, శిక్కుల హక్కులకు యెలాంటి హాని జరుగరాదని తీర్మానించింది. తప్పనిసరియైనచో అక్కడి ప్రజల అభిమతానుసారం జరుగు హక్కు వుండాలని ఆ తీర్మానంతో స్పష్టం చేసారు. లీగు సమావేశమై రాయబారవర్గం పథకం, కాంగ్రెసు, శిక్కులు, హరిజనులుచే బహిరంగంగా తిరస్కరించబడినందున రాజ్యాంగసభను రద్దుచేయాలని తీర్మానించింది. ప్రతిగా మధ్యంతర మంత్రివర్గం

నుండి లీగు ప్రతినిధులను తొలగించాలని కాంగ్రెసు కోరింది. వైస్రాయి, బ్రిటిష్ ఆఫీసర్లు లీగుకు తోడ్పడుతున్నారని ఫిర్యాదు చేసింది. బ్రిటిషు ప్రభుత్వ వైఖరికి నిరసనగా తాత్కాలిక మంత్రివర్గాన్నుండి రాజీనామా చేస్తామని ప్రకటించారు. వేవెలును తొలగించాలని బ్రిటిషు ప్రభుత్వానికి తెలిపారు. పరిస్థితులు విషమించుతున్నందున, నూతన విధానాన్ని అవలంబించాలని, అందుకు నూతన వైస్రాయి అవసరమని బ్రిటిష్ ప్రభుత్వం 1947 ఫిబ్రవరి 20న ఒక ప్రకటన చేసింది. బ్రిటన్ ఇండియాను విడచివెళ్ళుటకు ఒక తేదీని నిర్ణయించింది. జూన్ 1948కి ముందు అన్ని పార్టీలు అంగీకరించిన రాజ్యాంగాన్నిబట్టి యేర్పడే ప్రభుత్వానికి అధికారాన్ని అప్పజెప్పి లేదా యేదో ఒక రకమైన కేంద్రప్రభుత్వం లేదా రాష్ట్ర ప్రభుత్వాలకు అధికారం అప్పజెప్పబడుతుందని స్పష్టం చేసింది. మరో ప్రకటనలో బ్రిటిషు ప్రధాని అట్లీ వైస్రాయిగా లార్డ్ మౌంటుబాటన్‌ను నియమించుటను పేర్కొన్నారు.

**మౌంట్ బాటన్ విభజన పథకము :**

కాంగ్రెసు, ముస్లింలీగుల మధ్య ఒప్పందం కుదిరిన, వారి ప్రతినిధులతో మిశ్రమ ప్రభుత్వాన్ని యేర్పరచి, తప్పని పరిస్థితులలో అధికారాన్ని అప్పగించాలని, అది సాధ్యం కానిచో ఇండియాను రెండుగా విభజించి, రెండు ప్రభుత్వాలకు అప్పగించాలనే విషయంలో బ్రిటిషు నాయకు లందరిలో యేకాభిప్రాయం కలదు. అదే కాలంలో ఇండియా-పాకిస్తాన్‌లు శాశ్వత శతృవులుగా చరిత్రలో నిలచిపోయేటట్లు చేయుట బ్రిటిషు అప్రకటిత ఆశయం. నిజానికి దీనిని అమలుచేయుటకే లార్డ్ మౌంటు బాటన్ వైస్రాయిగా 1947 మార్చి 24న ప్రమాణ స్వీకారం చేసారు.

మౌంట్‌బాటన్ వివిధ రాజకీయ పార్టీల, తదితర నాయకులతో సంభాషణలు జరిపి, తన నిర్ణయాలను మే నెలలో బ్రిటిషు ప్రభుత్వానికి తెలియజేసారు. బ్రిటిషు ప్రభుత్వం 1947 ఆగస్టు 15న రెండు సర్వస్వతంత్ర దేశాలుగ ఇండియా, పాకిస్తాన్‌లు యేర్పడగలవని ప్రకటించింది.

వివాదానికి ముఖ్యకారణం, ముస్లింలు అధికంగా వున్న తూర్పు, పశ్చిమ రాష్ట్రాలు గ్రూపులుగ యేర్పడేందుకు రాష్ట్రాలకు గల హక్కులు. ఈ సమస్యపై బ్రిటిషు ప్రభుత్వం యిచ్చిన తీర్పు లీగుకు అనుకూలంగావుంది. ఆ రాష్ట్రాలలో కొన్ని భిన్నంగా నిర్ణయించుకొన్నప్పటికీ, అవి పాకిస్తాన్‌లోనే చేరాలనేది బ్రిటిషు వారి కోరిక, తీర్పుగాను వుంది.

భారతదేశ విభజన తప్పదనే వాస్తవాన్ని కాంగ్రెసు నాయకులు గుర్తించారు. వివిధ గ్రూపులలోవున్న రాష్ట్రాలను ఇండియాలోగాని, పాకిస్తాన్‌లోగాని చేరాలనే బలవంతం చేయరాదని మాత్రమే కోరారు. ఇండియాను విభజించిన విధంగానే పంజాబ్, బెంగాల్, అస్సాంలను విభజించాలనే నిర్ణయానికి వారిప్పుడు వచ్చారు.

బ్రిటిషు ప్రభుత్వం, 1947 జూన్ 3న కాంగ్రెసు, ముస్లింలీగుల ఆమోదంతో ఒక ప్రకటన చేసింది. అందులోని ముఖ్యాంశాలు :

1) మద్రాసు, బొంబాయి, ఉత్తర సంయుక్తరాష్ట్రాలు, బీహార్, మధ్య రాష్ట్రాలు, బీరారు, అస్సాం, ఒరిస్సా, వాయువ్య సరిహద్దు రాష్ట్రం, ఢిల్లీ, అజ్మీర్, మేవార్, కూర్గులకు చెందిన ప్రతినిధులు రాజ్యాంగ నిర్ణయసభలో పాల్గొంటున్నప్ప టికి, పంజాబ్, సింధు, బెలూచిస్తాన్, బెంగాల్ ప్రతినిధులు, యితర రాష్ట్రాలలోని ముస్లింలీగు ప్రతినిధులు పాల్గొనుటలేదు. అందువలన ఈ సభలో పాల్గొనని వారితో మరొక రాజ్యాంగ నిర్మాణసభను యేర్పాటుచేయాలి.

2) మెజారిటి సభ్యులు పాల్గొంటున్న వాయువ్య సరిహద్దు రాష్ట్రంలోను, బెంగాల్‌కు ఆనుకొనివున్న సిల్హట్ జిల్లాలోను వారు ఇండియాలో చేరాలనుకొంటు న్నారో లేక పాకిస్తాన్‌లో చేరాలనుకొంటున్నారో తెల్పుటకు జనవాక్య సేకరణను తీసుకొనాలి.

3) బెంగాల్, పంజాబులలో ముస్లింలు మెజారిటిగా ఉన్న జిల్లాలలోని రాష్ట్ర శాసనసభ్యులను వేరుగ సమావేశపరచి వారు 'యే దేశంలో చేరదలుచుకొన్నారో నిర్ణయించుకోవాలి.

4) సింధు శాసనసభ్యులు సమావేశమై ఏ దేశంలో చేరదలచుకొన్నారో నిర్ణ యించుకోవాలి.

5) బెలూచిస్తాన్ వాంఛను తెలుసుకొనుటకు వైస్రాయి అవసరమైన చర్యలు తీసుకొంటారు.

6) పై నుదహరించిన అంశాలన్నీ బ్రిటిష్ ఇండియా ప్రాంతాలకు వర్తిస్తాయి గాని, స్వదేశీయ సంస్థానాలకు వర్తించవు. బ్రిటిష్‌వారు దేశాన్ని వదలివెళ్ళే పక్షంలో బ్రిటిష ప్రభుత్వంతో చేసుకొన్న ఒప్పందం ప్రకారం ఈ సంస్థానాలను పరిపాలించు తున్న రాజులు తమ భవితవ్యాన్ని నిర్ణయించుకొనేందుకు హక్కును కలిగివుంటారు. అంతకు ముందు చేయబడిన ప్రకటనలన్నీ అమలులో వుంటాయి.

"ఈ పథకాన్ని కాంగ్రెసు నాయకత్వం ఆమోదించింది. గాంధీజీ ఒక్కరే యీ పథకాన్ని ప్రతి ఒక్కదశలోనూ వ్యతిరేకించారు. బహిరంగంగా ఎన్నడూ వ్యతిరేకించలేదు. గాంధీజీ వాటికి వ్యతిరేకంగా ప్రజలను సమీకరించుటకు ముందుకు రాలేదు. ప్రజలకు వాటిని ప్రతిఘటించవలసినదిగా పిలుపునిచ్చి ఉంటే మౌంటుబాటెన్ ప్లాను అంత సులభంగా ఆచరణలోనికి వచ్చేదికాదు."[1] అని నంబూద్రిపాద్ అభి ప్రాయము.

ఫలితంగా చరిత్రలో యెక్కడా జరుగని రక్తపాతం, ప్రాణనష్టమూ ఆచర రణలో ప్రజాసామాన్య మార్పిడిజరిగింది. మైనారిటి ప్రజలు తమకు రక్షణవుండదని ఇళ్ళు, పొలాలు. ఆస్తులు అన్నీవదలి తండోపతండాలుగా ప్రవాహంగా తరలి వచ్చారు. ప్రపంచంలో యింత జన సమూహాల మార్పిడి చరిత్రలో ఎక్కడా జరుగ లేదు.

---

1. నంబూద్రిపాద్, ఇ. యం. యస్. (1988) భారత స్వాతంత్ర్య పోరాటచరిత్ర ద్వి. భా. 69, ప్రజాశక్తి ప్రచురణ. పే. 397.

## మౌంట్ బాటన్, అవార్డు కమ్యూనిస్టుపార్టీ పైఖరి

బ్రిటిషు ప్రభుత్వపు 1947 జూన్ 3 ప్రకటన మౌంటుబాటన్ అవార్డుగా ప్రసిద్ధికెక్కింది. కాంగ్రెసు ముస్లింలీగు ఆమోదంపొందిన తరువాత మౌంట్‌బాటన్ ప్రతిపాదనపై ఆ ప్రకటన గావించబడింది. ఇండియా, పాకిస్తాన్‌లు రెండు సర్వ స్వతంత్ర దేశాలుగ ఆగస్టు 1947లో యేర్పడగలవని ప్రకటన సారాంశము.

రెండవ ప్రపంచయుద్ధంలో బ్రిటిషు సామ్రాజ్యవాదం చాల బలహీనపడి తన వలసలను తిరిగి జయించాల్సిన పరిస్థితులలో ఇండియాకు అధికార మార్పిడి చేసేం దుకు సంభాషణలకు దిగి, ప్రత్యక్ష పాలనను పరోక్ష పాలనగా రూపొందించుట దాని లక్ష్యము. "బ్రిటిషు మంత్రివర్గరాయబార సంఘంచేసిన ప్రయత్నాల సారాంశం కేంద్ర లక్ష్యం యిదే. కొన్ని భేదాలున్నప్పటికి, మౌంటుబాటన్ పథకం వాటి తాజా ప్రతిమాత్రమే. ప్రధానలక్ష్యం ప్రజలను చీల్చటం, అభివృద్ధి నిరోధ శక్తులను బల పరచుట వారితో మిత్రత్వం ఆ విధంగా భారత స్వాతంత్ర్య పోరాటాన్ని నామ మాత్రం చేయుట[1]" భారత కమ్యూనిస్టుపార్టీ కేంద్రసమితి మౌంట్‌బాటన్ అవార్డు ప్రకటనను భారత రాజకీయ పరిస్థితిని జూన్ 1947లో సమీక్షించి తన రాజకీయ విధానాన్ని కార్యక్రమాన్ని నిర్ణయించింది. ముఖ్యాంశాలు యీ క్రిందివిధంగా వున్నవి[2].

ఎ) హిందూ, ముస్లిం భేదాలు అంతర్యుద్ధ పరిస్థితిని సృష్టించాయి. వీటి నుపయోగించుకొని భారత దేశాన్ని చీల్చి, రెడు శత్రుదేశాలను యేర్పాటుచేసి రెం డింటిలోని అభివృద్ధి నిరోధక శక్తులతో సహకారాన్ని నెరపుతూ చీల్చి పరోక్షంగా పాలించుట లేక అదుపులోవుంచుట బ్రిటిషువారి వ్యూహం.

అభివృద్ధి నిరోధక ముస్లింలీగు నాయకత్వాన్ని హొత్తిడిచేసి పాకిస్తాన్‌ను బ్రిటిషు అధినివేశ ప్రతిపత్తిగల దేశంగా బ్రిటిషు పెట్టుబడికి పోటీలేనిదానిగా చేసి, సరిహద్దు రాష్ట్రాలను వ్యూహకేంద్రంగాచేసి భారతదేశాన్ని మొత్తంగా తన ఆధి పత్యంలో వుంచుకొనుట బ్రిటిషు ఎత్తుగడ.

బి) ఇండియా నూతన ఆధిపత్యంలో వుంచుకొనుటకు సంస్థానాధీశుల "బుట్ట బొమ్మలను" ఉపయోగించుకొనుట, ఇండియన్ యూనియన్‌లో సంస్థానాధీశులు చేరు టకుగాని, లేక బయట వుండుటకుగాని అధికారాలను సంక్రమింపచేస్తూ భారత జాతీయ వాదులతో వారి బేరానికి బలాన్ని చేకూర్చి, ఫ్యూడలు హక్కులకు ప్రాణం పోయుట ప్రజల, ప్రజాస్వామ్య వుద్యమాలకు ఆనకట్టలు వేయుట బ్రిటిషు పథకపు ప్రధాన లక్ష్యం.

---

1. మౌంటుబాటన్ అవార్డు(1947) కమ్యూనిస్ట్‌పార్టీతీర్మానం జూన్ 1947. పే. 4.
2. అదే పే. 4-5.

సంస్థానాధీశులు నిరంకుశత్వానికి వ్యతిరేకంగా భారత స్వాతంత్ర్యానికి జరిగే పోరాడం, భారత స్వాతంత్ర్యానికి, ప్రజాస్వామ్యానికి పరిధిలు విధించే బ్రిటిషు కుహనా ఎత్తుగడలకు వ్యతిరేకంగా జరిగే పోరాటం కూడానని కమ్యూనిస్టు పార్టీ విశ్వశించుచున్నది. అదే స్వాతంత్ర్యాన్ని, ప్రజాస్వామ్యాన్ని పరిపుష్టం చేయ గలదు[1].

సి) రాజ్యాంగసభ యెత్తుగడలలో బ్రిటిషు సామ్రాజ్యవాదం వలస సామాజిక పెట్టుబడిదారి విధాన ప్రయోజనాలను, దేశీయ శక్తుల భాగస్వామ్య సహకారాలతో ఇండియా ఆర్థిక విధానాన్ని తద్వారా భారతదేశాన్ని తన ప్రాబల్యంలో వుంచుకొను టకై అదృశ్య పోరాటాన్ని జరుపుతున్నది.

భారత ప్రభుత్వ మంత్రిత్వశాఖలు, భారత పెట్టుబడిదారివర్గాల భాగస్వామ్యం అధికార నిరంకుశ వుక్కునిర్మాణంద్వారా కేంద్రరాష్ట్ర మంత్రివర్గాల ఆర్థిక, పాలనా విధానాలను తన ప్రభావానికి లోనుగావించి అభ్యుదయకర ఆర్థిక విధానాలను తన ప్రయోజనాలకై వినియోగించదలచింది.

ఈ లక్ష్యంతో నిరంకుశ అధికారవర్గం, జాతీయోద్యమ నాయకుల ప్రభుత్వా నికి, ఉధృతమౌతున్న కార్మిక, కర్షక ఉద్యమాలకు మధ్య "గండి" కొట్టుటకు తన శక్తికొలది ప్రయత్నిస్తున్నది.

ఇట్టి అవగాహనతో "భారత పురోభివృద్ధికి నూతన అవకాశాలను సాధించ గలిగామని కమ్యూనిస్టుపార్టీ విశ్వశిస్తున్నది. జాతీయనాయకత్వాల చేతులలో రెండు ప్రజా ప్రభుత్వాలు, రెండురాజ్యాంగ నిర్మాణసభలు, వ్యూహాత్మక ఆయుధాలు వాటిని సరిగా ఉపయోగించి, జాతీయ లక్ష్యాన్ని త్వరితం చేయుటకు పటుతరం చేయుటకు జాతీయోద్యమ కర్తవ్యం"[2] అనే నిర్ణయానికి పార్టీ వచ్చింది. అయితే కొన్ని హెచ్చ రికలను చేసింది.

సామ్రాజ్యవాదం, మన జాతీయోద్యమంలోని చీలికల నుపయోగించుకొని, భారత స్వాతంత్ర్యాన్ని నామమాత్రం చేయుట లేక జాతీయశక్తులు యేకమై దేశ స్వాతంత్ర్యపు ప్రాతిపధకంగా రాజ్యాంగాన్ని నిర్మాణంచేసి, ప్రజాప్రభుత్వం సామ్రాజ్యవాద, ఆర్థిక, సైనిక వత్తిడులను నిరోధించుట. రెండవది సంస్థానాధీశుల తృప్తిపరస్తూ, దేశంలో పంచమాంగ దళాన్నివుంచుటలేక దేశంలో మూఢపవంతులో వున్న సంస్థాన ప్రజావుద్యమాలకు, ప్రజలకు, ప్రజోద్యమాలకు మద్దతునిస్తూ స్వ తంత్ర భారతంలో భాగస్వాములుగ చేయుట. ఈ రెండే ప్రత్యామ్నాయాలు.

జాతీయ నాయకత్వంలోని స్వార్థపర, రాజీవాదుల ప్రయోజనాలకు వ్యతిరే కంగా ప్రజోద్యమాల తీవ్రతను ఎక్కుపెట్టి, మత దురహంకారులకు వ్యతిరేకంగా, జాతీయ చైతన్యాన్ని పెంపొందించి, ప్రజా ప్రభుత్వాలకు మద్దతుగా జాతీయ చైత

1. మౌంటుబాటన్ అవార్డు తరువాత(1947)సి.పి.ఐ. జూన్ 1947 తీర్మానం పే. 5
2. అదే పే. 6.

న్యాన్ని నిర్మించి, సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధించుటకై, ప్రజాజాగురూకత అవసరం. కమ్యూనిస్టుపార్టీ, సామ్రాజ్యవాదపు కుటిల ఎత్తుగడలను వమ్ముచేయబడగలవని పూర్తిగ విశ్వశించుచున్నదని తీర్మానం స్పష్టంచేసింది. వారు తీవ్రతరం గావించే ఆర్థిక సంక్షోభమే ప్రజాసామాన్యంవారికి వ్యతిరేక మగునట్లుచేస్తుంది. జాతీయోద్యమాన్ని సంఘటితపరచి, పూర్తిరాజకీయ పరిజ్ఞానాన్ని యిస్తే సంపూర్ణ స్వాతంత్ర్య విషయమై యెట్టి రాజీలను నహింపజాలమని తీర్మానం వివరించింది.

ఇండియన్ రిపబ్లిక్ ప్రజాస్వామ్య పునాదులపై నిర్మించేందుకు ఆ విధంగా భారత ఐక్యతామార్గాన్ని చేబట్టుటకు జాతీయనాయకత్వానికి కమ్యూనిస్టుపార్టీ పూర్తి మద్దతునిస్తుంది. జాతీయ నాయకత్వం ప్రకటించిన సామ్రాజ్యవాద వ్యతిరేక కార్యక్రమాన్ని త్వరితంగా మినహాయింపులు లేకుండా అచరణలో పెట్టమని కోరుతుంది.

**కమ్యూనిస్టు కార్యక్రమంలోని ప్రధానాంశాలు :**

ఎ) నిజమైన స్వాతంత్ర్యం అనగా బ్రిటిషుసైన్యం వుపసంహరణ, బ్రిటిష సామ్రాజ్యవాదంతో ఎట్టి సైనిక మిత్రత్వం వుండరాదు. స్వతంత్ర ప్రజాస్వామిక విదేశాంగ విధానం, భారత, బ్రిటిష్ భాగస్వామ్య భారీవ్యాపారంపై, విదేశవ్యాపారంపై ప్రభుత్వ అజమాయిషీ, త్వరితంగా పారిశ్రామికీకరణకై విదేశ మారక నిల్వల మొత్తాన్ని బ్రిటిష్ ప్రభుత్వం చెల్లించాలి. విదేశీయ పరిశ్రమల జాతీయకరణ సమానత్వ ప్రాతిపధిక, పరస్పర లాభంపై బ్రిటిష్ వారితో వ్యాపార సంబంధాలు.

సంపూర్ణ స్వాతంత్ర్యం అధినివేశ ప్రతిపత్తుల మధ్యస్థంగా వుండే రాజ్యాంగాన్ని రాజీబేరంగా అంగీకరించే జాతీయ నాయకత్వంలోని లిబరల్ మితవాదవర్గాలను వోడించాలి. భారతదేశాన్ని ఆర్థిక, సైనిక, ఆధిపత్యంలో వుంచుకొనదలచే బ్రిటిష్ ప్రయత్నాలను వమ్ముచేయాలి.

బి) సంస్థానాలలో బాధ్యతాయుత ప్రభుత్వానికి, రాజ్యాంగ నిర్మాణ సభలో పాత్ర, సంస్థానాలలో రాష్ట్ర అసెంబ్లీలలో ఎన్నికలకు వయోజనవోటింగు హక్కుకై సంస్థాన ప్రజోద్యమాలకు పూర్తి సహాయం, మద్దతులు లభించాలి.

సి) ప్రజాస్వామ్య రాజ్యాంగం; వయోజన వోటింగు హక్కులపై సంయుక్త అసెంబ్లీస్థానాలు, దామాషా ప్రాతినిధ్యం, భాషాప్రయుక్త రాష్ట్రాలకు భవిష్యత్ ఐక్యతకొరకై స్వయంనిర్ణయాధికారం, గిరిజన, అటవిక జాతులకు ప్రాంతీయ, స్థానిక స్వపరిపాలన వుండాలి.

డి) మత విభేదాల వ్యతిరేకత, మతవిద్వేషాలుపరిస్థితి మరింత క్షీణించకుండా సరియైన మార్గాలను రూపొందించి, సౌభాతృత్వాన్ని నెలకొల్పుటకు వెంటనే సరిహద్దుల కమీషన్ యెడల అన్యాయ, మితిమీరిన కోరికల యెడల న్యాయబద్ధ వైఖరి అవలంభించుట, పరస్పర ప్రయోజనాలపై బ్రిటిష ప్రమేయంలేకుండా అంగీకారాలపై సరిహద్దులు సరిచేసుకొనుట, మైనారిటీల-ముస్లింల మత సాంస్కృతి హక్కుల రక్షణ, ఉద్యోగాలలో యితర వ్యాపారాలలో ముస్లింల యెడల వివక్షత లేకుండుట, ఇండియాలో ముస్లింలు విదేశీయులనే ప్రచారాన్ని బహిరంగంగా ఖండించుట.

ఇ) పరస్పర సంబంధాలు ; సన్నిహిత ఆర్థిక సంబంధాలు, వస్తుమారకం, పారిశ్రామికీకరణ పూర్తి సహకారం. వెనుకబడిన పాకిస్తాన్ ప్రాంతాల ఆధునికీకరణ, రక్షణ విషయాలలో పరస్పర సహకారం.

బ్రిటిషు సామ్రాజ్యవాదం తమ కుటిల రాజనీతితో కాంగ్రెసు ముస్లింలీగు మధ్య భేదాభిప్రాయాలను వినియోగించుకొంటూ దేశాన్ని రెండుగా చీల్చి ఇండియా-పాకిస్తాన్‌లను శాశ్వత శత్రువులుగ చేసి, తమ ఆర్థిక. రాజకీయ ప్రాబల్యాన్ని కొన సాగించే ప్రయత్నాన్ని పార్టీ వివరించింది.

**విస్తృత సంయుక్త సంఘటన :**

సంపూర్ణ స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, ఐక్యతకొరకు నూతన పరిస్థితులలో పోరాటానికి కమ్యూనిస్ట్ పార్టీ తన పాత్ర నిర్వహించుటకై ప్రతిన చేసింది. పార్టీ ప్రజాందోళనను యీ క్రింది సమస్యలపై కేంద్రీకరించింది.

రాజ్యాంగ నిర్ణయసభ సంపూర్ణ స్వాతంత్ర్యం ప్రాతిపదికగా యేర్పాటు చేయుటకు పూర్తి సహకారాన్ని యిస్తుంది. ప్రజాస్వామ్య రాజ్యాంగ నిర్మాణ రచనకు, అభ్యుదయకర శక్తులకు పూర్తిమద్దతు, రాజీవాదులకు మితవాదులకు వ్యతిరేకంగా ప్రజా సమీకరణ చేస్తుంది,

ఇండియన్ యూనియన్ పాకిస్తాన్‌ల మధ్య వెంటనే స్నేహసంబంధాలను నెలకొల్పుటద్వారా భవిష్యత్తులో ఐక్యతకై పోరాడుట. అన్ని ప్రజాసంస్థల ఐక్యత ద్వారా మత సామరస్యాన్ని, శాంతిని నెలకొల్పుట, దౌర్జన్యాన్ని రెచ్చగొట్టు శక్తులపై పటిష్టమైన తీవ్రచర్యలు తీసుకొనుట, మైనారిటీల హక్కులకు పూర్తిరక్షణ కల్పించాలి. సంస్థాన ప్రజాపోరాటాలకు పూర్తిమద్దతు.

అసమర్థులు, లంచగొండులు నిరంకుశులైన అధికారులను తొలగించుట, త్వరితంగా సైన్యాన్ని జాతీయకరణ, ప్రజాస్వామ్యకీకరణ చేయుట, ఆర్డినెన్సుల పాలనను అంతంచేసి, పూర్తి పౌరహక్కులు పునరుద్ధరించుట, రాజకీయ, కార్మిక. కర్షక సంఘాల ఖైదీలనందరిని విడుదలచేయుట, మినహాయింపులులేకుండా అన్ని ప్రాంతాలలో పౌరహక్కులు, స్థానిక స్వపరిపాలన నెలకొల్పుట.

అస్పృశ్యతను అన్నిరూపాలలో అంతంచేయుట, అన్నిరకాల విచక్షణలను చట్టరీత్యా శిక్షార్హంచేయుట, వారి సామాజిక, సాంస్కృతిక అభివృద్ధికి ప్రభుత్వ సహాయంచేయుట.

జాతి పునర్నిర్మాణానికి తక్షణం భూస్వామ్యవిధానాన్ని రద్దుచేసి కీలక పరిశ్రమలను జాతీయంచేయుట, ప్రాతిపదికపై పంచవర్ష ప్రణాళికను రూపొందించుట, ప్రజలకు నూతన జీవితంద్వారా స్వాతంత్ర్యాన్ని సుస్థిరం చేయుట.

ఈ దీర్ఘకాలకార్యక్రమంతోపాటు ఈ క్రింది తక్షణ కార్యక్రమాలను వాటిపై ఐక్య కార్యాచరణ, ఐక్య పోరాటాలను, వుద్యమాలను నిర్మించు కార్యక్రమాన్ని చేబట్టింది.

కార్మికులకు కనీస జీవన వేతనాన్ని నిర్ణయించి, తక్షణం అమలుచేయుట, కార్మిక సంఘాలను గుర్తించుట, సమ్మె వ్యతిరేక చట్టాలనన్నిటిని వుపసంహరించుకొనుట, కార్మిక వివాదాల పరిష్కారానికి యంత్రాంగాన్ని అభివృద్ధి పరచాలి. కార్మికులకు మధ్యతరగతివారికి సరసమైన అద్దెకు గృహవసతి కల్పించుట, ఇండ్లస్థలాల ధరలను అదుపుచేసి గృహ నిర్మాణ పథకాలు చేబట్టుట. ప్రజాసహకారంతో బ్లాక్ మార్కెట్టు నరికట్టి, ధరల స్థిరీకరించి, ప్రజావసర వస్తువులనన్నిటిని సమానంగా పంపిణీచేయుట.

రైతులకు తక్షణ సహాయ చర్యలుగ అధికాహారోత్పత్తికి బంజరులను సాగుకిచ్చుట, కౌలుదారులకు పట్టాలనిచ్చుట, కౌలు తగ్గించుట, శిస్తు తగ్గించుట, అప్పులను రద్దుచేయుట అమలుచేయాలి. భూ స్వామ్య విధానాన్ని రద్దుచేస్తూ చట్టాన్ని త్వరితంగా తీసునికొనిరావాలి. ఆహారధాన్యాలధరలను స్థిరీకరించి, ప్రభుత్వ ధాన్యసేకరణ చేయాలి.

వ్యవసాయ కూలీలకు తగినవేతనం, గృహవసతి, విద్యాసౌకర్యాలు కల్పిస్తూ బంజరులను వ్యవసాయ కూలీలకు యివ్వాలి. ఆహార సంక్షోభాన్నుండి ప్రజలను రక్షించుటకు దొంగ నిల్వవ్యాపారులకు వ్యతిరేకంగా చర్యలు గైకొనాలి.

నిర్బంధ ప్రాథమికవిద్య, సెకండరీ, కాలేజి, సాంకేతిక విద్యావసతులను అధికంచేయాలి. స్కూలుఫీజు కనీసంచేసి, ఉపాధ్యాయులకు తగిన జీతమివ్వాలి. వైద్య సౌకర్యాలు ప్రజలందరికీ లభించాలి.

గిరిజనులకు, ఆటవికజాతులకు, వారి ఆర్థిక వనరుల అభివృద్ధికి ప్రత్యేక సదుపాయున్నివ్వాలి.

ఈ దీర్ఘకాల, తక్షణ కార్యక్రమాల ననుసరించి, జాతీయ పునర్నిర్మాణానికై జాతీయ నాయకులు పరస్పర సహాయానికై చేసిన విజ్ఞప్తి ననుసరించి కమ్యూనిస్టు పార్టీ హృదయపూర్వకముగ సహకారాన్ని అందిస్తుంది. నూతన పరిస్థితులలో ప్రజా ప్రభుత్వానికి. ప్రజా సంఘాలమధ్య పూర్తి సహకార ప్రాతిపదికపై విస్తృత సంయుక్త సంఘటన, జాతివిముక్తికి, పునర్నిర్మాణం, అంతర్యైక్యతవంటి మహత్తర కర్తవ్యాల నిర్వహణకై నిర్మాణావశ్యకతను కమ్యునిస్ట్‌పార్టీ గుర్తించుచున్నది. అదే ప్రజా ప్రభుత్వానికి, ప్రజలకు నూతన బలాన్ని యిస్తున్నది. అట్టి విస్తృత సంయుక్త సంఘటన సామాన్య ప్రజల అభిప్రాయాలను ప్రతిబింబిస్తుంది. అయిదా సంఘటన నిర్మాణం దాని అంతటఅదే జరుగదని కమ్యూనిస్టుపార్టీకి స్పష్టంగా తెలుసు.

"కమ్యునిస్టుల, కాంగ్రెసు, లీగులలోని వామపక్ష యితర అభ్యుదయకర శక్తులు చొరవ పట్టుదలతో మాత్రమే సంఘటన నిర్మాణాన్ని రూపొందించగలవు. కాంగ్రెసు, ముస్లింలీగులలోని మతదురంహంకార శక్తులను, అభ్యుదయ నిరోధక

శక్తులను, రాజీవాదులను వోడించుట రెండుసంస్థలను సన్నిహితులుగ చేయుట వారి కర్తవ్యం.[1]

అన్ని అతివాద పార్టీలకు, శక్తులకుగల భేదాలను విస్మరించి, పాక్షికతత్వ ప్రయోజనాలను మరచి ఐక్యతకండి. ఆపదల వ్యతిరేకంగా పోరాడండి. నేటి అవకాశాలను వినియోగించుకొని విజయాన్ని పొందండి" అని పార్టీ విజ్ఞప్తిచేసింది.

రానున్న సంక్లిష్ట సమయంలో భారత కార్మికవర్గం, రైతు వుద్యమము వాస్తవ స్వాతంత్ర్యానికి, పూర్తి ప్రజాస్వామ్యానికి, భారత ఐక్యతకై పోరాడుటకు అంత్య విజయానికై పురోగమించుటకై ఐక్య జాతీయ సంఘటనను అన్ని అభ్యుదయకర, అతివాద శక్తులతో యేర్పాటు చేయుట అందుకు పోరాడుటయే ప్రధమ కర్తవ్యం[2]గా చేబట్టింది.

---

1. మౌంటుబాటన్ అవార్డు తరువాత (1947) .సి.పి.ఐ. జూన్ 1947 తీర్మానం పే. 14.
2. అదే పే. 15



# 4

# పోరాట పర్వం

## జనతా ప్రజాస్వామ్య సంఘటన

అగస్టు 1947కు పూర్వము భారత బూర్జువావర్గ విశ్లేషణ, అధ్యయనం గావించి, చర్చించి, వారిపాత్రను నిర్దేశించుట, భారతదేశ ఆర్థిక, రాజకీయ, సామాజిక వాస్తవ పరిస్థితులను, వివిధ వర్గాల పోరాట పాత్రల పరిమితులు, వారి రాజకీయ విధానం, వ్యూహం, ఎత్తుగడలు, వారి పాత్రలను అధ్యయనం చేసినట్లయితే పార్టీలో సంఘర్షించిన రెండు దృక్పథాలలో స్పష్టత యేర్పడి సంస్కరణవాద, పిడివాద ప్రభావాలకు అంతగా లోనయ్యేవారుగాదు· స్వీయ మానసికధోరణులలో గాక వాస్తవ పరిస్థితుల ననుసరించి శాస్త్రీయ పద్ధతులలో వివేచనానంతరం నిర్ణయానికి వచ్చి వుండేవారము.

పూర్వ విగ్రహ పర్వంలో అగస్టు 1946 అంతిమ పోరాట తీర్మానం గానిపై కమ్యూనిస్టుపార్టీలో జరిగిన చర్చల వివేచనాతరంగాలు, తిరిగి కమ్యూనిస్ట్‌పార్టీ జూన్ 1947 మౌంటుబాటన్ అవార్డు తీర్మానం అధ్యయనం చేశాము. అదేకాలంలో జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులు అతివేగంగా మారుతుండుట పార్టీలోకూడ అధ్యయనం, వివేచనా అంతటి తీవ్రంగానే పార్టీలో అంతర్గత పోరాటం జరుగుట తెలుసుకొన్నాము.

## పోరాట పంథాకు పునాదులు

బ్రిటిష్ ప్రభుత్వం ఫిబ్రవరి 1947లో భారతదేశానికి స్వాతంత్ర్యాన్ని ఇచ్చుటకు నిర్ణయించింది. ఈ కర్తవ్య నిర్వహణకు మౌంటుబాటన్‌ను పంపించింది. దేశంలోని అన్ని రాజకీయ పక్షాల నాయకులతో తదితరులతో సంప్రదించి, కాంగ్రెసు ముస్లింలీగులు వొక అంగీకారానికి రానందున. మౌంటుబాటన్ అవార్డు ప్రకటించారు ప్రధాన రాజకీయ పక్షాలు అవార్డు అంగీకరించారు. కమ్యూనిసుపార్టీ తన వైఖరిని స్పష్టంచేసింది. అగస్టు 15, 1947న స్వాతంత్రం భారతదేశము, పాకిస్తాన్‌లు ఉదయించినవి. పరిస్థితుల అస్థిరతతో భవిష్యత్తు అంత ఆశాజనకంగా కనుపించుటలేదు.

**భారత పరిస్థితిపై అంతర్జాతీయ కమ్యూనిస్టువర్గాలలో అధ్యయనాలు.**

అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ రద్దుచేయబడక ముందు వలసదేశాల కమీషన్ శాఖలోని ముఖ్యులలో ఒకడుగావున్న యూజినెరార్గా, మే 1947లో వొక పుస్తకం ప్రచురించారు. అందులో వలసదేశాల ప్రకరణలో, వలసలలో కొన్ని గణ

నీయంగా పారిశ్రామిక అభివృద్ధిచెంది, సామ్రాజ్యవాద శక్తులపై ఆర్థికంగా ఆధార పడుట తగ్గిపోవుటయేగాక కొన్ని సామ్రాజ్యవాద పాలకులకు అప్పుపెట్టుటకూడ జరుగుతున్నదని ఉదహరించారు. ఈ వ్యాఖ్య భారతదేశపరంగా వాస్తవమైనది, పరోక్షంగా వలసదేశాలుపరిణామక్రమంలో స్వాతంత్ర్యాన్ని పొందగలవని సూచించు చున్నది. గత దశాబ్దాలలో యం.యన్.రాయ్ "వలసల నిష్క్రమణ సిద్ధాంతం" తీవ్ర విమర్శలకు, నిందలకు గురైవున్నందున సోవియట్‌కి ఆర్థికశాస్త్ర వేత్తల సమావేశం వెంటనే ఏర్పాటు చేయబడింది వలసలలో విప్లవ పోరాటాల ప్రాముఖ్యతను నొక్కి చెప్పకపోగా పరిణామక్రమంలో స్వాతంత్ర్య సంపాదన సూచించినందున తీవ్ర విమర్శలు గురయ్యాడు. అప్పుడు వాస్తవంగా బ్రిటన్ భారతదేశానికి స్వాతంత్ర్య ప్రకటనచేయుటకు ప్రయత్నాలుచేస్తున్నది. ఆ సందర్భంలో సోవియట్ యూనియన్ విప్లవాల గురించి నొక్కిచెప్పుట అవాస్తకతయేగాక దురదృష్టకరమైనది.

న్యూటైమ్సు 13 జూన్ 1947 సంచికలో డయకోవ్, మౌంట్‌బాటన్ ప్రణాళికపై "సామ్రాజ్యవాదం ఉపఖండంలో తన పెత్తనాన్ని సుస్థిరం చేసుకొనే ఎత్తుగడగా" వాఖ్యానించి, భారత జాతీయ నాయకులు "తమ పూర్వపు వైఖరిని విడనాడారని" కారణం "జాతీయ కాంగ్రెసుపై భారతధనికవర్గాల అగ్రనాయకులు సామ్రాజ్యవాదులతో రాజీపడమని వొత్తిడి చేశారని" ఆ విధంగా జాతీయ మార్కెట్టు విదేశీయులతో పంచుకొని విప్లవం రాకుండా చేయతలచారని రచయిత వివరించాడు. ఈ నూతన సోవియట్‌వైఖరిలో కాంగ్రెసు అభివృద్ధినిరోధకులకు పాతినిధ్యం వహించుచున్నదని సూచించుట జరిగింది. కాని స్పష్టంగా చెప్పలేదు. పైగా "రాజ్యాంగ నిర్ణాయకసభ, సార్వభౌమాధికారంగలదిగా పనిచేస్తుంది. కాని, బ్రిటీష్ ప్రతిపాదనలకే పరిమితమై వుండదని[1]" నెహ్రూ తన విశ్వాసాన్ని ప్రకటించుట కాంగ్రెసు నాయకత్వంలో అభ్యుదయ అభివృద్ధి నిరోధకశక్తులు రెండు వుండుటను పరిగణలోనికి తీసుకొనుటను సూచిస్తున్నది. ఇది సోవియట్ యూనియన్ యింకా వొక నిర్ణయానికి రాకుండుటను కూడ సూచిస్తున్నది. ఈ పరిస్థితిని ఇ. ఝకోవ్ జులైలో జాతీయ కాంగ్రెసు నాయకత్వం నేడు భారత బడా బూర్జువా వర్గానికి నాయకత్వం వహిస్తుందని, బ్రిటిషు షరతులను ఆమోదించి, రాజకీయ వొప్పందానికి వచ్చి సామ్రాజ్యవాదపు ఆర్థిక, సైనిక ప్రయోజనాలకు పరిమితమైన నామమాత్రపు స్వాతంత్ర్యాన్ని ఆమోదించిందని స్పష్టంచేశాడు నెహ్రూ గతంలో "అభ్యుదయకర ప్రజాస్వామ్యవాది" అని తరువాత "ధనవంతుడు, మితవాద అభివృద్ధి నిరోధక పటేల్‌వైపుకు వెళ్ళాడని" పేర్కొనుటలో సోవియట్ వైఖరిలో పూర్తిమార్పు వచ్చుట స్పష్టమౌతుంది. ఝకోవ్ క్లుప్తంగా, సామ్రాజ్యవాదం, దాని మిత్రులు ఫ్యూడలిజం గుత్తపెట్టుబడిదారులకు వ్యతిరేకంగా సామ్రాజ్యవాద వ్యతిరేక వ్యూహాన్ని ప్రతిపాదించాడు. ఈ వ్యూహంలో నెహ్రూ ప్రభుత్వ వ్యతిరేకదాడి ఇమిడి

1. ఎ. డయకోవ్ (1947) "ది న్యూబ్రిటిషప్లాను ఫర్ ఇండియా" న్యూటైమ్స్ (జూన్ 12, 1947) పే. 12-16.

వుంది. ప్రభుత్వం బడా బూర్జువాలదిగా నెంచబడి, క్రిందినుండి ఐక్యసంఘటనా ఎత్తుగడ[1]గా రూపొందించబడి పెటీబూర్జువా, మధ్య తరగతి బూర్జువాల యిద్దంకి పిజ్ఞప్తి చేసింది. పశ్చిమదేశాలతో కొనసాగించబోయే "శీతల యుద్ధ దృష్టితో" సోవియట్ యూనియన్ యీ పైఖరి అవలంభించుటయే జరిగివుంటే, యిది వొకవిధంగా భారత ప్రభుత్వంపైకూడ "శీతల యుద్ధం" అగుతుందికాన ఆచరణ, లక్ష్యానికి వైరుధ్యంగా వున్నందున ఫలితం ఆశించనిది అగుతుందని స్పష్టమగుతూనేవుంది. ఝుకోవ్ "కాంగ్రెసు నాయకత్వం సామ్రాజ్యవాదానికి లొంగిపోవుటకు కారణంబడా బూర్జువా వర్గం సామ్రాజ్యవాదానికంటె విప్లవం అంటే ఎక్కువ భయాన్ని కలిగివుండుట" అని వివరించాడు[2].

సోవియట్ అవలంభించిన వైఖరి ఏకగ్రీవామోదాన్ని పొందినట్లులేదు. అంచేత జూన్ 1947లో అకెడమీ, ఆఫ్ సైన్సెస్ "భారత సమస్యను చర్చించుటకు ప్రత్యేకంగా సమావేశమైంది. ప్రధాన నివేదికను ఝుకోవ్ సమర్పించాడు. జులైలో ఝుకోవ్ వెలిబుచ్చిన అభిప్రాయాలే ఈ నివేదిక సారాంశం. ఝుకోవ్, బలబుషేవిఖ్ యిద్దరు బడా బూర్జువాయేగాక, మధ్యతరగతి బూర్జువాకూడ అభివృద్ధి నిరోధకమైందని ప్రకటించారు. కాంగ్రెసు, ముస్లింలీగుల అభివృద్ధినిరోధకులు దేశాన్ని చీల్చుటకు ఆమోదించి, ఆంగ్ల సామ్రాజ్యవాదంతో వొప్పందం చేసుకొని 'విద్రోహం'చేసి దానిని బలపరచారని తాత్కాలిక 1946 ప్రభుత్వంలో బహిరంగంగా భారత బూర్జువా వర్గవివక్షణకు నడుంకట్టారన్నారు.

డయకోవ్, బలబుషేవిఖ్‌లు యిద్దరూ ఝుకోవ్ పంధాకు భిన్నంగా అనగా సామ్రాజ్యవాద వ్యతిరేక నాలుగు వర్గాల వ్యూహంగాక, పెట్టుబడిదారి వ్యతిరేక మూడు వర్గాల వ్యూహాన్ని ప్రతిపాదించారు. అంతర్జాతీయ పరిణామాలు వేగాన్ని పుంజుకొన్నవి.

భారత కమ్యూనిపార్టీ కేంద్రసమితి బొంబాయిలో జూన్ 1947లో సమావేశమగుతున్న కాలంలోనే మాస్కోలో "భారత సమస్య"ను చర్చించుటకు సోవియట్ ఇండోలజిస్టుల సమావేశం జరిగింది. విరుద్ధ నిర్ణయాలను చేసారు. ప్రధానంగా నెహ్రూ ఆధ్వర్యంలో యేర్పడబోవు ప్రభుత్వం యెడల తీసుకొనవలసిన రాజకీయ వైఖరి ప్రాముఖ్యత కలిగివుంది. సోవియట్‌కి భారత పరిస్థితి అధ్యయనవేత్తలు మౌంటుబాటన్ ప్రణాళిక జాతీయ ధ్యేయానికి "ద్రోహం" అని నెహ్రూ ప్రభుత్వాన్ని తీవ్రంగా ఖండించగా, కమ్యూనిస్టుపార్టీ జాతీయ సమితి "ఒప్పందం పురోగమనానికి ముందడుగని నెహ్రూ ప్రభుత్వానికి పూర్తి సహకారాన్ని వాగ్దానం" చేసింది.

---

1. ఓవర్‌స్ట్రీట్, విండ్‌మిల్లర్ (1960) కమ్యూనిజం ఇన్ ఇండియా. పే. 255.
2. ఓవర్‌స్ట్రీట్, విండ్‌మిల్లర్ (1960) కమ్యూనిజం ఇన్ ఇండియా. పే. 257.

కమ్యూనిస్టుపార్టీ తీర్మానం ఆనవాయితీగా మౌంటుబాటన్ ప్రణాళికను భారత దేశానికి సంపూర్ణ స్వాతంత్రాన్ని యిచ్చుటలేదని నూతన పరిస్థితులలో సామ్రాజ్య వాదుల పలుకుబడిని ఎంత ఎక్కువగాకొనసాగించ వీలుకలుగుతుందో అంతా వుంచు కొన్నదని విమర్శించింది. అయినా ప్రణాళికలో "ప్రధాన రాయితీలు వున్నవని" "జాతి పురోగమనానికి నూతనావకాశాలున్నవని" తీర్మానం వివరించింది. ఆ విధంగా భారత కమ్యూనిస్టుపార్టీ "పరిష్కార ఒప్పందాన్ని" జాతీయ వాంఛను పాక్షికంగా తృప్తిపరస్తున్నదని విశ్లేషించింది

బ్రిటిషు ప్రభుత్వం, ప్యూడలు రాజులు, భూస్వాములద్వారా, భారత బడా బూర్జువావర్గంతో మిత్రత్వంద్వారా తమ ప్రయోజనాలను కొనసాగించ ఆశించారు. కాంగ్రెసు మితవాద నాయకత్వంపై బడా బూర్జువా వర్గానికి మంచి పలుకుబడి గలిగి వున్నప్పటికి, కాంగ్రెసుపైగాని, ప్రభుత్వంపై నిర్ణయాత్మక ఆధికృతను కలిగిలేదని భారత కమ్యూనిస్టుపార్టీ గాఢ అవగాహనతో వున్నది. తీర్మానంలో "కాంగ్రెసు ప్రధాన జాతీయ ప్రజాస్వామ్య సంస్థగాన, కాంగ్రెసు ప్రకటించిన సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాస్వామ్య కార్యక్రమాన్ని త్వరితంగా నిరవధికంగా కాంగ్రెసు నాయ కత్వం అమలుచేయుటను కమ్యూనిస్టుపార్టీ ఆశిస్తున్నది. జాతీయ ఐక్యతా మార్గంలో ప్రజాస్వామ్య పునాదులపై భారత రిపబ్లిక్ నిర్మాణాన్ని జాతీయ నాయకత్వం గర్వో న్నతంగా నిర్వహించుటకు భారత కమ్యునిస్ట్‌పార్టీ సంపూర్ణ సహకార మిస్తుందని" స్పష్టం చేసింది.

కాంగ్రెసు నాయకత్వం ఎడతెగకుండా తమ ఒత్తిడిని కొనసాగించిన ఫలితం గానే, అధికార మార్పిడి, మౌంటుబాటన్ రాయితీలు" పొందగలిగామని దీనికి తోడు ప్రజాపోరాటాల ఒత్తిడి పనిచేసిందని తీర్మానం స్పష్టంచేసింది ఆ విధంగా జాతీయ నాయకత్వపు అగ్రనాయకులపై పూర్తి విశ్వాసం కలిగి కమ్యూనిస్టుపార్టీ వున్నట్లు కన్పించుచున్నది. ఆ విధంగానేతీర్మానం "జాతి విముక్తికీ, పునర్నిర్మాణానికి ఐక్యతా గమ్యానికి మహోన్నత కార్యానికి అన్ని ప్రజా సంఘాలు ప్రజా ప్రభుత్వాలమధ్య సంపూర్ణ సహకారం" కొరకు తీర్మానం విజ్ఞప్తి చేసింది. కమ్యూనిస్టులతోపాటు, కాంగ్రెసు, ముస్లింలీగులలోని అన్ని అభ్యుదయకర శక్తుల "సంయుక్త సంఘటన" యేర్పాటు ద్వారానే అట్టి సహకారం సాధ్యమని తీర్మానం తెలిపింది.

కమ్యూనిస్టుపార్టీ తీర్మానం, జాతులస్వయం నిర్ణయసూత్రం యెడల గతంలో వలెగాక యేదోఒక మాటమాత్రం వాడి ఉపఖండంలో ఐక్యత యెడల ప్రజా వుత్సు కత సామ్రాజ్యవాదుల కుట్రలను భగ్నం చేయగలదని వాస్తవ జాతీయ స్వాతం త్రంకై పురోగమించగలదన్న విశ్వాసాన్ని ప్రకటించింది. సత్వర స్వాతంత్ర్య ప్రకటనలో కమ్యూనిస్ట్‌ల స్పందన సోవియట్ అవగాహనకు భిన్నంగా వుంది గతంలోని సోవియట్ వైఖరినను సరించియే గాక, దేశంలోని వాతావరణంతో ప్రభా వితమైంది. అంచేతనే పార్టీలోని అతివాద వర్గాన్నికూడ తీర్మానం సమీకరించ గలి గిందని కేంద్ర సమితిలోని రాడికల్స్‌గూడ "మితవాద తీవ్ర ప్రమాదాన్ని గుర్తించ లేక నెహ్రూ ప్రభుత్వాన్ని బలపరచామని" రణదివె తదనంతర ఆత్మవిమర్శనలో ఆమోదించారు.

కమ్యూనిస్టుపార్టీ తన విధానం అంతర్జాతీయ అవగాహనకు అనుబంధంగానే వున్నదనే విశ్వాసంతోవుంది. అప్పటిపార్టీ అంతర్గత డాక్యుమెంట్సు దానినే సూచించుతున్నవి. నూతన సోవియట్ పంథా పార్టీకి సత్వరం అందచేయబడలేదు. అంతేగాక బ్రిటిషు కమ్యూనిస్టు వర్గాలు రజనీ పామీదత్తులనుండి జూన్‌లోనే పూర్తిసమ్మతి, ఆమోదముద్ర భారత కమ్యూనిస్టుల విధానానికి లభించింది. దత్తులేబర్‌మంత్లీ వ్యాసం మరింత బలాన్ని చేకూర్చింది. మౌంటుబాటన్ ప్రణాళిక కలుగజేసే అడ్డంకులను సోవియట్ వైఖరినుండె దత్తు ఉదహరించి అయినా "గణనీయమైన పురోగమనానికి మార్గమని" భవిష్యత్తు ప్రజాస్వామ్యాభివృద్ధియని ముగించారు. అంచేతనే జాతీయ నాయకత్వం మౌంటుబాటన్ ప్రణాళికను, కాంగ్రెసు, కమ్యూనిస్టులపొత్తును ఖండించలేదు, పైగా గతంలో యిద్దరిమధ్య యేర్పడినదూరాన్ని, పరిస్థితులు ఇద్దరు గుర్తించి కలసి ప్రజాస్వామ్య కార్యక్రమానికి పురోగమించాలని స్పష్టంచేశారు. దత్తు వ్యాసం నెహ్రూ ప్రభుత్వం అభ్యుదయకరమైనదని స్పష్టంచేసింది. ఐక్యరాజ్యసమితిలో భారత ప్రతినిధివైఖరిని ప్రస్తుతించింది. భారతకమ్యూనిస్టుపార్టీ దత్తు ఈ వ్యాసాన్ని పునర్నిర్మించి విశేషంగా పంపిణీచేసింది. అంతేగాక మరి కొంతకాలంవరకు సోవియట్ యూనియన్‌లోని చర్చలు బయటి ప్రపంచ వెలుగులోనికి రాలేదు. ప్రకటించబడిన ఝుకోవ్ ఒకేవొక వ్యాసం కాంగ్రెసు నాయకత్వాన్ని అభివృద్ధి నిరోధకులుగా పేర్కొనలేదు. భారతదేశంలో "నూతన సంక్లిష్ట పరిస్థితులు" యేర్పడవచ్చు అని మాత్రము హెచ్చరించింది. డయకోవ్ నవంబరువ్యాసంలో "కొన్ని సంస్థానాలు స్వతంత్రంగా వుండనెంచుటతో, భారతయూనియన్ అనైక్యతకుగురై, అనేక అధినివేశ ప్రతిపత్తిగల ఉపఖండంగా" అయ్యే ప్రమాదం వున్నదని హెచ్చరించుట మాత్రమే జరిగింది. సోవియట్ వైఖరేయింకా నిర్ణయింపబడలేదని స్పష్టం దేశంలో మతకల్లోలాల పరిస్థితి అత్యంతతీవ్రమగుట, పార్టీలోని రాడికల్‌వర్గాలుకూడ జోషీ మార్గాన్ని అనుసరించునట్లు చేశాయని రణదివె తదనంతరం వివరించారు. అదే జోషీ భారతదేశానికి పాకిస్తాన్‌కు పూర్తి సహాయాన్ని ప్రకటించునట్లు చేసింది.

ఈ రాజకీయ అవగాహనప్రజోద్యమాల పోరాటాలలో తాత్కాలిక ప్రభుత్వం ప్రజలను అణచివేసే నిర్బంధకాండ, హింసను వుపయోగిస్తున్నా, పార్టీ వాటి రాజకీయ ప్రాముఖ్యతను గుర్తించుటలో విఫలమైంది పార్టీ బెంగాలులో చేబట్టిన దెబాగా వుద్యమం అందుకు వుదాహరణ; రైతులు సంవత్సరం క్రిందే "పంటలోపాలు"కై పోరాడుతున్న రైతులకు భవానిసేన్ గత సంవత్సరములోవలె "నేరుగా పాలుపంచుకొనే" చర్యను చేబట్టవలదని విజ్ఞప్తి చేశారు. అంతేగాక నూతన ప్రభుత్వానికి తాను చేసిన వాగ్దానాలనునెరవేర్చుటకు తగిన కాలవ్యవధిని యివ్వవలసినదిగా వివరించారు.

అక్టోబరులో పార్టి నెహ్రూని "ప్రజావాణిగా" ప్రస్తుతించి, పండిట్‌నెహ్రూ. సోషలిస్టులు, కమ్యూనిస్టుల "సంయుక్త సంఘటన"కు పార్టీ నూయేజ్‌లో పిలుపునిచ్చింది. నవంబరులో ప్రధాని నెహ్రూను కాంగ్రెసు వాదులందరు బలపరచి "తాత్కాలిక ప్రభుత్వాన్ని అభ్యుదయకర మార్గంలో పునర్నిర్మించుటకు తోడ్పడవలసినదిగా పార్టీకోరింది. నెహ్రూ జన్మదిన శుభాకాంక్షలు పార్టీతెలియజేస్తూ "జాతీ

యోద్యమంలోని ప్రజాస్వామ్య సంప్రదాయాలను నెహ్రూ వొక్కడే" గత కొద్ది మాసాలుగ కాపాడుతున్నాడని నొక్కిచెప్పింది. జన్మదిన శుభాకాంక్షలు పరిమితులు లేకుండా అర్పిస్తూ, నెహ్రూ మొట్టమొదటి భారత ప్రధానమంత్రియై సోషలిస్టు మార్గంలో దేశాన్ని శుభిక్షం చేస్తాడని విశ్వాసాన్ని ప్రకటించింది.[1] ఈ విధంగా కమ్యూనిస్ట్ పార్టీ అభ్యుదయవాది నెహ్రూను, ప్రభుత్వంలోని తదితరులను వేరుగ చూస్తూ ప్రధానమంత్రికి బలాన్ని చేకూర్చ ప్రయత్నించింది. ఈ ఎత్తుగడను రజనీ పామీదత్తు సూచనగా మధుమిమాయిదత్తు తనకు ప్రత్యేకంగా నవంబరులో యిచ్చిన యింటర్వ్యూలో తెలియవచ్చిందని తన పుస్తకంలో పేర్కొన్నారు[2].

**కమ్యూనిస్టు పార్టీలో పోరాట పంథా రూపొందుట :**

పార్టీ లో తీవ్రవాద అభిప్రాయాల అభివృద్ధికి, సాంప్రదాయకంగా అనుసరించు తున్న ప్రభుత్వ వ్యతిరేక అవగాహనుల పోరాటమార్గంలోనే వున్న పార్టీ అగ్ర నాయకత్వంలో కొందరు స్వాతంత్ర్యానంతరం, చట్టబద్ధ ప్రతిపక్ష పాత్రను చేబట్ట లేకపోయారు. ప్రజాపోరాటాలు అభివృద్ధి చెందక వెనుకాడుటకు పార్టీ వర్గాలలో చాలమంది జోషీ పంథాను నిందించ ప్రారంభించారు. కార్మిక ట్రేడు యూనియనులు, కిసాన్‌సభల కార్యక్రమాలలో ప్రతిఘటనలను యెదుర్కొనవలసివచ్చుట, చేబట్టిన కార్యక్రమాలతో కమ్యూనిస్టులు పనిచేసే కార్మిక, కర్షక ప్రజాసంస్థలలో పార్టీకి ప్రతిఘటన ఎక్కువైంది కమ్యూనిస్టల అధ్వర్యంలో కార్మికవర్గంలో పనిచేస్తున్న ట్రేడు యూనియన్ కాంగ్రెసును వ్యతిరేకించుతు ప్రతిద్వందిగా, కాంగ్రెసు అగ్ర నాయకుల ప్రోద్భలంతో భారత జాతీయ ట్రేడు యూనియన్ కాంగ్రెసును ఏర్పాటు చేసారు. జాతీయ కార్మికసంస్థ కాంగ్రెసు ప్రభుత్వాలను బహిరంగంగా బలపరచే విధానాన్ని చేబట్టింది దీనికి సహజ ప్రతిస్పందనగా, పార్టీ కార్మిక అగ్రనాయకత్వం, అతివాద కార్యక్రమాన్ని చేబట్టాలనే ఒత్తిడిచేయ ప్రారంభించింది.

పార్టీలో అసంతృప్తితో అంతర్గత పోరాటం యెక్కువగుటకు ప్రధాన కారణం, తెలంగాణాలో జరుగుతున్న తీవ్ర రైతాంగ పోరాటాల పాక్షిక విజయంతో జోషి పంథాకు వ్యతిరేకంగా వెలుగులోకి వచ్చి పార్టీలోని అతివాదవర్గాలు ఆకర్షించుటగా చెప్పుకొనవచ్చును. హైదరాబాద్ నవాబు సంస్థానంలో తూర్పు ప్రాంతాన ఉన్న ఎనిమిది జిల్లాలను తెలంగాణాయని, వారు తెలుగు మాట్లాడుతారు కాన పిలువ బడుచున్నది నైజాం నవాబు నిరంకుశ ప్యూడలు దుర్భరబానిస జీవితంతో వేసారిన ప్రజ, రైతాంగ పోరాటం, భూమికై సాయుధ ప్రతిఘటనగా రూపొందుటకుగల అవకాశాలను స్థానిక పార్టీ నాయకత్వం చూడగలిగింది. ఇది ప్రధానంగా నల్లగొండ, వరంగల్ జిల్లాలలో దేశముఖులు, జాగీర్దారులు, భూస్వాములకు, నైజాం నిరంకుశ త్వానికి వ్యతిరేక పోరాటంగా ప్రారంభమై 1946 మధ్యకాలానికి అక్కడక్కడా

1. పీపిల్సుఏజ్, నవంబరు 9 1947 పే. 3.
2. మధురిమాయి (1951) కమ్యూనిస్టుపార్టీ వాస్తవాలు, ఊహాగానాలు, హైదరాబాద్ చేతన ప్రకాశన్, వి. 1951. పే. 57,

స్థానిక తిరుగుబాటుల రూపాన్ని సంతరించుకొంది, ప్రజలు ఉజ్వలంగా చేబట్టిన ప్రజా పోరాటమైంది. పార్టీ కేంద్ర కమిటి నాయకత్వంలో అప్పటివరకు స్థానిక పార్టీ నాయకత్వాలు ఎట్టి తీవ్రవాదాన్ని చేబట్టలేదు. వారి పోరాట నినాదం "వెట్టి చాకిరి" రద్దుగానే ఉంది, తిరుగుబాటు రాజకీయ విధానాన్ని అనుసరించలేదు. అంతేగాక, హైదరాబాద్ ఇండియన్ యూనియన్‌లో చేరాలనే జాతీయ నినాదాన్నే కొనసాగించు తున్నారు అంతే, సంస్థాన ప్రభుత్వానికి వ్యతిరేకంగా, కేంద్ర ప్రభుత్వ రాజకీయ విధానాన్ని పూర్తిగ బలపరచు దానిగవుంది దీనిలో ఆంధ్రుల భాషారాష్ట్ర ప్రబలమైన రాజకీయ కోరిక యిమిడివుండుట, దానికి కేంద్ర ప్రభుత్వం అనుకూలంగా లేకుండు టతో, కేంద్ర ప్రభుత్వంపై దాడి పై ఖరికి త్వరగా లోనయ్యారు.

కారణమేదైనా పార్టీలో అతివాదం తిరిగి తలెత్తసాగింది, జోషి విధానం తీవ్ర విమర్శనకు గురియగుట ప్రారంభమైంది "పెటీ బూర్జువా సంస్కరణవాదిగా" జోషి తీవ్ర విమర్శకు గురయ్యాడు, చాలామంది తన అనుయాయులను ముఖ్యంగా బ్రిటిషు యూనివర్శిటీలనుండి వచ్చినవారిని అగ్రనాయకత్వంలోనికి నేరుగా చేర్చాడు, అనే విమర్శగూడ కొనసాగింది. అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమం అతివాదం చేబట్టిన వార్తలు, వ్యాసాలు వచ్చుటతో భారత కమ్యూనిస్ట్ పార్టీలోవున్న అతివాద వర్గానికి బలంచేకూరి, జోషి వర్గాన్ని త్రోసిపుచ్చే, పార్టీ విధానాన్ని తిరుగతోడే ప్రయత్నాలు ప్రారంభించారు.

అంతర్జాతీయ అతివాద పంథా మొట్టమొదట సూచనలు, పోలెండ్‌లో సెప్టెంబరు 1947లో జరిగిన కొమిన్ ఫారం సమావేశంలోని నివేదికలు, చర్చలు ప్రధానంగా జదనోవ్ ప్రధానోపన్యాసంలో వచ్చాయి. జదనోవ్ "సామ్రాజ్యవాదం బలహీనపడుటతో, వలస విధానంలో సంక్షోభం యేర్పడిందని" నొక్కి చెప్పటంతో పార్టీలోని అతివాదులకు అదనపు బలం చేకూరింది జదనోవ్ అంతేగాక, సామ్రాజ్యవాదం తన పెత్తనాన్ని కొనసాగించుకొనుటకు "అనేక మార్గాలను చేబట్టిందని" పేర్కొనుట, సంశయాలను నివృత్తి చేసినట్లయింది. ఇండోనేషియా, వియత్నాములలో స్వాతంత్ర్యోద్యమాలను అణచివేయుటకు "వలస సైనిక యుద్ధాలను" కొనసాగిస్తున్నదని, "భారతదేశం, చైనాలలో ఆర్థిక, రాజకీయ పెత్తనాన్ని కొనసాగించే ప్రయత్నాలను సామ్రాజ్యవాదశక్తులు కొనసాగించుచున్నవని, జదనోవ్ వివరించారు. ప్రధాన ప్రమాదం, శత్రుబలాలను అధిగమించుటకు, తమ బలగాలను తక్కువగా అంచెనా వేయుటవలన వస్తుందన్నారు. సామ్రాజ్యవాదుల విస్తరణ, దురాక్రమణలకు వ్యతిరేకంగా జాతీయ ప్రతిఘటనకు నాయకత్వం వహించి కమ్యూనిస్టుపార్టీలు నడపాలని జదనోవ్ సూచించారు,భారతదేశాన్ని గురించి యింతకు మించి మరేమి వ్యాఖ్యానించలేదు. కాని పార్టీలోని అతివాదులు నెహ్రూ ప్రభుత్వం సామ్రాజ్యవాదంతో "స్నేహకూటమి"లో చేరిందనే వ్యాఖ్యానం చేసుకొని, నెహ్రూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాయుధ పోరాటపిలుపుగా జదనోవ్ ఉపన్యాసానికి అర్థం చెప్పుకొన్నారు.[1]

---

1. జదనోవ్,ఎ;(1947) అంతర్జాతీయ పరిస్థితి (ఆంగ్లంలో) మాస్కో
పే. 16: 46-47.

జడనోవ్, వాస్తవానికి వలసలలో సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలను తీవ్రతరం చేయుటకు ఆమోదాన్ని స్పష్టంచేసి, పరోక్షంగా నెహ్రూ ప్రభుత్వంపై దాడి సోవియట్ వైఖరి అయినా, విస్తృత పెట్టుబడిదారి వ్యతిరేక పోరాట వ్యూహానికి ఆమోదం యేమాత్రంలేదు. అంతేగాక "ప్రజాస్వామ్య" కమ్యూనిస్టు ధ్యేయాలను నొక్కిచెప్పి బూర్జువావర్గం అభివృద్ధి నిరోధకమైందని స్పష్టంచేయలేదు.

అదే సమావేశంలోని కార్డెల్జ్ ఉపన్యాసంలో భారత కమ్యూనిస్టు అతివాదులు పెట్టుబడిదారి వ్యతిరేక వ్యూహాన్ని స్పష్టంగా చూశారు. అందులోనే ప్రజాస్వామ్య సోషలిస్టు విప్లవాలురెండూ "పరస్పరం ముడిపేసుకొన్న" సిద్ధాంతాన్ని బలంగా చెప్పుటతో బూర్జువా వర్గాన్ని మొత్తంగా దాడికి గురిచెయ్యాలనే నిర్ణయానికి వచ్చారు. భారత కమ్యూనిస్టు సిద్ధాంత మాసపత్రిక "కమ్యూనిస్టు" జనవరి 1948 సంచికలో కార్డెల్జ్ వుపన్యాసం టిటోయుగోస్లోవియా పార్టీ కాంగ్రెసు నివేదికలలో భాగాలను ప్రకటించింది అజయ్‌ఘోష్ "కార్డెల్జ్ వ్యాసాలు నన్ను జోషి విధానాన్ని వ్యతిరేకించే యితర అతివాదులను యెంతో ప్రభావితం చేశాయని" రణదివె "మనకు సరియైన మార్క్సిస్టు పంథాను సూచించుతున్నవని" పొగిడారని తెలిపారు[1].

కార్మికవర్గ నాయకుడుగా డాంగే ప్రపంచ ట్రేడు యూనియన్ కాంగ్రెసు సమావేశం ప్రేగులో జరుగుచున్నప్పుడు హాజరై తదనంతరం రష్యా తూర్పు యూరపు దేశాలన్నీ సందర్శించాడు. ఆ పర్యటనలో డాంగే నిర్వహించిన యితర కర్తవ్యాల విషయమై యేమీ తెలియదు. కాని, భారతదేశానికి యుగోస్లోవియా పంథాని మోసుకొనివచ్చాడని "అదే భారత కమ్యూనిస్టుపార్టీలో టిటోయిస్టు రాజకీయ ప్రభావాలకు" కారణంగా రజనీపామీదత్తు పేర్కొనుటను దేవెన్, బాలకృష్ణలు "పామీదత్తుతో సంప్రదింపులు, విదేశాలలోని అనుభవాలు[2]"లలో తెలిపారు. అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంలోని యితర నాయకులను కలిసివుండవచ్చు. అంచేత వారిచే "టిటోయిస్టుపంథా" భారతదేశానికి అనుసరించతగినదని ఆమోదాన్ని పొంది వుండవచ్చులేదా ప్రయత్నించుటకు వ్యతిరేకత లేకుండా చూచుకొని వుండవచ్చని తలంచవచ్చును.

ఏమైనా భారత కమ్యూనిస్టుపార్టీ అంతర్జాతీయ నిర్ణయాత్మక ఆమోదం కల దానివెలెనె ఆచరణను కొనసాగించింది, డిశెంబరు 1947, రెండవవారంలో భారత కమ్యూనిస్టుపార్టీ కేంద్రసమితి సమావేశంలో అతివాదవర్గం జోషి విధానాలపై దాడి తీవ్రతరం చేసింది. అందుకు కొద్దిరోజులక్రితమే కమ్యూనిస్టు పత్రికలపై బొంబాయి ప్రభుత్వం పెట్టిన తీవ్ర ఆటంకాలు తోడ్పడినవి.[3] అప్పటికే రణదివె నాయకత్వంలో అతివాదులు ఆధిక్యతసంపాదించారు జోషీని నాయకత్వ స్థానాన్నుండి తొలగించారు.

---

1. ప్రభోద్‌చంద్ర (అజయ్‌ఘోష్) పార్టీలో నేటిపరిస్థితిపై నోటు ఓపెన్ ఫోరం నం. 12, అక్టోబరు, 1949. పే. 3-4.
2. దేవెన్, బాలకృష్ణ "టాక్స్‌విత్ కా॥ ఆర్.పి. దత్తు,తదితర విదేశాల అనుభవాలు" పి.పి. హెచ్. యూనిట్. జనవరి6, 1951, పే. 4. ఓవర్‌సీట్, మార్షల్ పే. 269లో ఉదహరింపు కమ్యూనిజం ఇన్ ఇండియా
3. పీపిల్స్‌యేజ్, 7 డిశెంబరు 1947. పే. 1.

డిశెంబరు, 1947 నూతన తీర్మానంలో కేంద్ర సమితి పూర్తి విరుద్ధ పార్టీ రాజకీయ విధానాన్ని ప్రకటించింది[1] ప్రజాస్వామ్యపు వొత్తిడితో నెహ్రూ ప్రభుత్వాన్ని పునర్నిర్మాణం, అతివాదులనుకూడ చేర్చుకొన్ననేమి చేయగలమనే జోషీ, దత్తుల నమ్మకాన్ని "అవకాశవాదంగా" తీర్మానం ఖండించింది. అంతేగాక ప్రభుత్వానికి వ్యతిరేకంగా రాజీలేని పోరాటానికి పిలుపునిచ్చింది. జడనోవ్ సిద్ధాంతాన్ని అనుసరించి ప్రపంచం రెండు పరస్పర విరుద్ధ పక్షాలుగ చీలిపోయిందని నెహ్రూ రాజకీయ విధానం ఆంగ్లో, అమెరికన్ కూటమికి సేవచేయుటకు దారితీస్తుందని తీర్మానం తెలియజేస్తున్నది. భారత బడా బూర్జువావర్గం సామ్రాజ్యవాదంతో వొప్పందానికి వచ్చిందని భారత ప్రభుత్వపు యీ అభివృద్ధి నిరోధక విధానాలను బలపరస్తున్నదని జాతీయ బూర్జువావర్గం పెరుగుతున్న వొత్తిడికిలోనై, సామ్రాజ్యవాద ఆధిక్యతకి లొంగివుండునట్లు ప్రజలు పై వర్గాల జాతీయ నాయకత్వాలను అంగీకరించునట్లు చేస్తున్నది.

కమ్యూనిస్టుపార్టీకి సంబంధించినంతవరకు 1946-47 సుదీర్ఘ చర్చావేదిక నెహ్రూ ప్రభుత్వానికి అనుకూలంగా, వ్యతిరేకంగా నడుపబడింది. దాని పూర్తి ఫలితాలను కమ్యూనిస్టుపార్టీ అన్ని కోణాలనుండి అంచెనా వేయజాలకపోయినా నెహ్రూ ప్రభుత్వాన్ని అన్నివైపులనుండి దాడిచేయుటకు ప్రధానంగా పెట్టుబడిదారి వ్యతిరేక పోరాటాన్ని నిర్ణయించింది. ప్రపంచ "శీతలయుద్ధం" భారత పొలిమేరలకు చేరింది. సోవియట్ శాస్త్ర పండితులు 1947 చివరకు నెహ్రూ భారత ప్రభుత్వ విశ్లేషణలపై కొన్ని నిర్ణయాలకు వచ్చినట్లు తెలుస్తున్నది. అయితే చర్చనీయాంశపు ఉత్తరభాగమైన భారత బూర్జువావర్గ విశ్లేషణలో ఎట్టి నిర్ణయానికి వచ్చినట్లు కన్పించుటలేదు. డిశెంబరు, జనవరి 1947-48లలో ఝకోవ్, డయకోవ్, బలబుషేవిఖ్‌లు చివరకు తమ అభిప్రాయాలను రష్యన్ పత్రికలో వెలిబుచ్చారు. కాని భారత కమ్యూనిస్టులకు సంబంధించినంతవరకు వ్యూహంపై ఆమోదయోగ్యమైన నిర్ణయానికి రాలేకపోయారు.

డిశెంబరు "బోల్షివిక్" సంచికలో ఝకోవ్, సామ్రాజ్యవాదంతో రాజీ వొప్పందాలకు వచ్చిన బడా బూర్జువావర్గం మొత్తంగా జాతీయ ప్రయోజనాలకు "విద్రోహం" చేసింది. ఇది మొత్తంగా వలసదేశాలలో జరిగిందని వ్రాసారు. అంతేగాక, ఆసియాలోని "అనేక దేశాలలో" మధ్యతరగతి బూర్జువావర్గం, కార్మికవర్గంతో సహకారం నెరపుతుంది అనే సిద్ధాంతాన్ని ఝకోవ్, వియత్నాం, ఇండోనేషియాలలో జరిగే "వలస యుద్ధాలకు" అనువర్తింపజేసె, ఇండియా విషయమై ఎట్టి ప్రస్తావనా చేయలేదు. భారత బూర్జువావర్గాన్ని గుర్తించి ప్రస్తావించునపుడు "బలమైన అస్పష్టత" చోటు చేసుకొన్నది. అంతర్జాతీయ రాజకీయాలలో భారత బూర్జువావర్గం "తటస్థ" విధానాన్ని అనుసరించుట విమర్శించి, వ్యాసంలోని వుత్తరభాగంలో "బూర్జువా జాతీయవాదులు" లేక "జాతీయ సంస్కరణవాదులు" బ్రిటిష ప్రభుత్వాలకి "ద్వితీయ

---

1. కమ్యూనిస్టు స్టేట్‌మెంట్ ఆఫ్ పోలసి (1947) పి.పి. హెచ్. 1947. పే. 14.

రక్షణశ్రేణి"గా ఝుకోవ్ పేర్కొనుట జరిగింది.కాని, భారత కమ్యూనిస్టుపార్టీ కర్తవ్యాలపై ప్రస్తావించుతు, పెట్టుబడిదారి వ్యతిరేక వ్యూహాన్ని సూచించలేదు, కాని పార్టీ బలహీనతలను పేర్కొంటూ, పరోక్షంగా "విప్లవ సాహసికవాదంలో" కొట్టుకొని పోకుండా హెచ్చరించుతున్నట్లు కన్పడుతున్నది.

డయకోవ్, బలబుషేవిఖ్‌లు యిద్దరూ, బూర్జువావర్గం అభివృద్ధి నిరోధక వైఖరి సంపూర్తిగా చేబట్టుటలో ఎట్టి సరళతను చూపలేదు. ఏమైనా బలబుషేవిఖ్ రాజకీయ పరిణామాలు, ఘటనల వెంబడి పరుగెత్తుట తప్ప, మౌంటుబాటన్ ప్రణాళికను "నిజమైన రాయితీగా" అంటేత "పురోగమనపు అడుగు"గా అంటే జోషి విధానంగా, తమ విశ్లేషణలో తెలియజేయలేదు. ఈ వాస్తవికాంశము, ఝుకోవ్ తానుగా ఆ విధమైన వైఖరిని చేబట్టుటకు బదులు, సోవియట్ యూనియన్‌కు "భారత పరిస్థితి"పై ఆమోదయోగ్యమైన విధానలేమిని తెలియజేస్తున్నట్లు కన్పడుతున్నది. ఫలితంగా, యిష్టంగానో, అయిష్టంగానో భారత కమ్యూనిస్టు పార్టీ, కొమిన్‌ఫారం పంధాను చేబట్టింది, ఆ విధంగా యుగోస్లావియా పంధాకు చేరువైంది.

II

## కమ్యూనిస్టుపార్టీ రెండవ కాంగ్రెసు

కమ్యూనిస్ట్ పార్టీలోని అతివాదవర్గం రణదివె నాయకత్వంలో కేంద్ర సమితిలో ఆధిక్యత సంపాదించింది. పార్టీలో ప్రాక్షనవిజం అన్న పేరుతో జోషిని బలపరస్తున్నవారిని కీలకస్థానాల నుండి తొలగించింది.పార్టీనంతటికి నూతన విధానానికి, ఆచరణకు సమీకరించుటకు, రెండవ పార్టీ కాంగ్రెసును సమావేశపరచుటకు నిర్ణయించింది. డిశెంబరు కేంద్రసమితి సమావేశంలో, సవిరణ రాజకీయ విధాన చిత్తు తీర్మానాన్ని రూపొందించుటకు ఒక సబ్‌కమిటీని నియమించింది నూతన కేంద్ర సమితికి నామినేషన్ చేయబడే సభ్యుల జాబితాను తయారుచేసింది. దానిని పార్టీ కాంగ్రెసులో ఆమోదానికి సమర్పించింది, చిత్తు తీర్మానాన్ని సర్క్యులేటుచేసి, సవరణలను సేకరించి, చిత్తులో మార్పులుచేసి నూతన నాయకత్వం పార్టీ కాంగ్రెసుకు సమర్పించింది. పైనుండి ధృడతర నాయకత్వం పార్టీ యంత్రాంగాన్ని నడుపుట ప్రారంభించి, అత్యంత వేగంగా రాష్ట్రీ పార్టి కాన్ఫరెన్సులను జరిపి, నూతన నాయకత్వాలను, పార్టీ కాంగ్రెసుకు ప్రతినిధుల ఎన్నికలను పూర్తిచేసింది. డిసెంబరు నిర్ణయాల తరువాత రెండున్నర మాసాలలోనె ఫిబ్రవరి 28న కలకత్తాలో పార్టీ కాంగ్రెసు సమావేశం ప్రారంభమైంది.

పార్టీ వివిధ స్థాయిలలోని నాయకత్వాలు పార్టీ కాంగ్రెసులో సమీకృతమయ్యాయి పార్టీ పత్రికలు 632 కాంగ్రెసు ప్రతినిధులలో 565మంది, పార్టీ హోల్ టైమరులు లేక రాష్ట్రాలలోని విప్లవకారులు, పార్టీ కార్యకర్తలు, ఆర్గనైజరులు. పిపిల్సుయేజ్ కధనం ప్రకారం 919 ప్రతినిధులు ఎన్నికకాబడ్డారు, కాని చాలా మందికి సమావేశానికి వచ్చుటకు పరిస్థితులు అనుకూలించలేదు. తెలంగాణానుండి

75 మంది ప్రతినిధులుకాగా, 4 - 5 మాత్రమే రాగలిగారు. ఆస్ట్రేలియా, బర్మా, సిలోను, యుగోస్లోవియాలనుండి సౌహార్ద ప్రతినిధులు హాజరయ్యారు. అధికార ప్రతినిధు లెవ్వరూ బ్రిటన్, సోవియట్ యూనియనులనుండి రాలేదు.

పార్టీ అంతర్గత కథనాల ప్రకారం వ్లాడిమెర్ డెడిజెర్, రడోవెన్ జొకొలిక్ మినహా యితర విదేశీ ప్రతినిధులు ప్రేక్షకులుగానే వున్నారు ఉదహరించిన యిద్దరు యుగోస్లోవియా ప్రతినిధులు చర్చలలో చురుకుగా పాల్గొన్నారు. అంతర్జాతీయ కమ్యూనిస్ట్ అధికార ప్రతినిధులుగ వ్యవహరించారు అజయ్‌ఘోష్ ప్రకారం "రెండు విప్లవాలు పరస్పరం ముడిపడుట"పై యుగోస్లోవియా ప్రతినిధులు వివరంగా సమాచారాన్నందించారు. శిలా సదృశపార్టీ సంఘటన భారతదేశంలో ఆవశ్యకతపై వివరించారు, యుగోస్లోవియా సంఘటనను నమూనాగా సూచించారు. మనదేశంలో పార్టీ బలహీనంగా వున్నందున అట్టి ఎత్తుగడల ఫలితం శూన్యమని, పార్టీ నాయకులు కొందరు గుర్తించారు. కాని అజయ్ చెప్పినట్లు యిష్టంలేకపోయినా "మ్రింగివేశాము"[1] అని తెలిపారు. రణదివె యుగోస్లోవియా ప్రతినిధుల అవగాహనలను ఆధారంగా జేసుకొని ప్రారంభంనుండి కాంగ్రెసుకు నాయకత్వంవహించారు.

కాంగ్రెసులో ప్రధానమైనది రాజకీయ తీర్మానపు ముసాయిదా, దానిపై నివేదిక యీ రెండు కాంగ్రెసు ధోరణిని, అవగాహనలను ఏకమార్గంలో పెట్టాయి. రణదివె భారత బూర్జువావర్గం, ఆంగ్లో అమెరికన్ పక్షంలో నిలబడుతున్నదని ప్రకటించారు. అది ఆవిధంగా "రాజీలేని పోరాటంలో" మునిగిపోయింది. సోవియట్ పక్షపు ప్రత్యర్థిగావుంది. అంచేతపార్టీ "జనతా ప్రజాస్వామ్యం" కొరకు పోరాడాలి. ఆ పోరాటంలోనే "ప్రజాస్వామ్య పోరాటం", "సోషలిస్టువిప్లవపోరాటం" పెనవేసుకొని వున్నవి. మరో మాటలలో పార్టీ పెట్టుబడిదారి వ్యతిరేక పోరాటంలో అత్యధిక ప్రజాసామాన్యాన్ని సమీకరించాలి, యీ ధ్యేయసాధన "జనతా ప్రజాస్వామ్య సంఘటన"ను నిర్మించాలి. అది క్రిందినుండి కార్మిక, కర్షక, పెటీబూర్జువావర్గం అభ్యుదయ మేధావివర్గాల మైత్రీ సంఘటనకు ప్రాతినిధ్యం వహించాలి.

కాంగ్రెసులో రెండవ ప్రధాన వుపన్యాసం రణదివె కుడిభుజమైన భవానీసేన్ నూతన ఎత్తుగడలపై యిచ్చిన వివరణలు, పార్టీజాతుల స్వయంనిర్ణయ సమస్యపై 1942నుండి వెలిబుచ్చిన అభిప్రాయాలకు విరుద్ధ అవగాహనలనిచ్చింది. కార్మికవర్గం దాని మిత్రులతో కలసి ప్రత్యేక జాతి ప్రజలుమొత్తం పోరాడిన ఫలితంగా స్వయం నిర్ణయ సూత్రాన్ని ఆచరణలో సాధించవలసి వుంటుంది. జాతుల స్వయం నిర్ణయ సూత్రాన్ని కాశ్మీర్‌లో ఆచరణలో షేక్ అబ్దుల్లాను పాకిస్తాన్‌తో చేరుటను గాక, మామూలుగానే ఇండియన్ యూనియన్‌లో చేరుటను బలపరచి రాజకీయ విధానాన్ని పూర్తిగ ఖండించారు. నూతన జాతుల విధానానికి తెలంగాణా ఒక నూతన నమూనా మార్గాన్ని సూచించిందని అన్నారు. ఇండియాలోగాని, పాకిస్తాన్‌లోగాని చేరని సంస్థానాలలో విప్లవం ముందుగారావాలి.తదుపరిమొత్తం ఉపఖండ లోరావాలి.

---

1. ప్రబోధ్‌చంద్ర (అజయ్‌ఘోష్) "ఆన్ ఏ నోట్" - పార్టీలో నాటి పరిస్థితిపై నోటు. ఓపెన్‌ఫోరం. నం. 12. అక్టోబరు, 1947. పే. 5.

ప్రధాన నివేదికల తదనంతరం పి.సి. జోషి తన ఆత్మవిమర్శనా నివేదిక సమర్పించారు. ఒక విధంగా యిది ఆత్మహననం అనుకోవాలి. జోషి తనకుతానుగా "గందరగోళపడ్డానని - "కన్ఫ్యూజుడు అండ్ కర్రప్టెడ్"; "పిరికిగా", "ద్రోహి"గా ప్రవర్తించానని, "పెటీబూర్జువా ఫ్యాగిసలాటదారునని", "కరడుగట్టిన నిరంకుశునిగా" ప్రవర్తించానని, "మితవాద సంస్కరణవాదం మూర్తీభవించినవాడినని" తన పూర్తి రాజకీయ జీవితాన్ని స్వయంగా ఖండించుకొన్నాడు. "విద్యార్థి మేధావిగా పార్టీనాయకత్వంలోనికి యాదృచ్ఛికంగా చరిత్రలో వచ్చినవాడినని" తన మొత్తం రాజకీయ జీవితాన్ని ఆత్మవిమర్శనా ఖండన చేసుకొన్నారు[1].

కాంగ్రెసులో పైదాలగే కేంద్రసమితి, నూతన కేంద్రసమితికి అధికార నామినేషనులను సూచించింది. మాజీ కేంద్రసమితి మెజారిటి సభ్యులతోపాటు జోషీపేరు కూడ అందులో చోటుచేసుకొన్నది జాబితాలోని జోషీ వొక్కరే కేంద్రసమితి సభ్యులుగ ఎన్నికకాలేదు. నూతన కేంద్రసమితి రణదివెను జనరల్ సెక్రటరీగా ఎన్నుకొంది. ఆవిధంగా డిశెంబరులో జనరల్ సెక్రటరీగా బాధ్యతలను స్వీకరించిన దానిని పార్టీ కాంగ్రెసు ఆమోదముద్ర వేసింది.

## పార్టీ 2వ కాంగ్రెసు రాజకీయ అవగాహన

పార్టీ రాజకీయ విధానాన్ని నిర్దేశించే "సిద్ధాంతపత్రం" 95 పేజీల సుదీర్ఘపత్రం పార్టీనూతన విధానాన్ని వివరించే ప్రకటనగావుంది. భారతదేశంలో "విప్లవ వెల్లువ" పురోగించుతున్నదని, విప్లవపోరాటాల అత్యున్నతదశ "సాయుధ సంఘర్షణల" దశ వచ్చిందని వివరంగా ప్రకటించింది. "ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలను పరిపూర్తిచేయుటకు జనతా ప్రజాస్వామ్య విప్లవం అవసరమని, అదేకాలంలో అది సోషలిజాన్ని నిర్మిస్తుందని" కార్మిక, కర్షక, పెటీబూర్జువావర్గాలను సామ్రాజ్యవాదులు పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా పార్టీ సంఘటిత పరచాలి. నెహ్రూ ప్రభుత్వం భారత జాతీయ బూర్జువాలకి ప్రాతినిధ్యం వహించుతుందని నూతన ప్రజాస్వామ్య సంఘటన ప్రజాకూటమి ప్రభుత్వానికి వ్యతిరేకంగా నిజమైనపోరాటాన్ని చేయవలసి వుంటుంది. అంతేగాక, కాంగ్రెసు చర్చలలో "జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వం" దగ్గరిదగ్గరిగా "కార్మికవర్గ నియంతృత్వమే"నని స్పష్టం చేయబడింది. మరికొంత వివరంగా తెలుసుకొందాము.

ఆగస్టు 15, 1947 వచ్చినది స్వాతంత్ర్యం అవునా? కాదా? అనే ప్రశ్న కమ్యూనిస్టు వుద్యమానికి 1954వరకు తదనంతరం కొన్ని వర్గాలకు తలనొప్పి కలిగించుట దురదృష్టకరము. ఈ కాలంలో భారత కమ్యూనిస్టులేగాక అంతర్జాతీయ కమ్యూనిస్టు నాయకత్వాలు పలురకాలుగ వ్యాఖ్యానించారు భారత కమ్యూనిస్టుపార్టీ కేంద్రసమితి జూన్ 1947లో "సంపూర్ణ స్వాతంత్ర్యంకాదు". ప్రజలచేతులలో

1. పి.సి జోషీ, పార్టీ బహిష్కరణపై చేసుకొన్న అప్పీలుపై భారత కమ్యూనిస్టు పార్టీ తీర్మానం, జూన్ 5, 1950. కమ్యూనిజం ఇన్ ఇండియా, పే 237 లోని ఉదహరింపు.

"ఆయుధం". "పురోగమనమార్గం" అని తీర్మానించింది. ఆగసు 1947లో తిరిగి పార్టీ "నూతనంగా సంపూర్ణ స్వాతంత్ర్యానికై పోరాడుటకు తననుతాను పునరంకితం చేసుకొంది. జడనోవ్, యురోపియన్ కమ్యూనిస్టుపార్టీల సమావేశంలో "ఇండియా, చైనాలను సామ్రాజ్యవాదం ఆర్థిక రాజకీయ బంధనాలతో తన ప్రభావం లోనే వుంచుకొంది" అని అన్నారు. పార్టీ 2వ కాంగ్రెసు చిత్తు సిద్ధాంతపత్రంలో "సామ్రాజ్యవాదంతో కుదిరినరాజీ"నే" స్వేచ్ఛా స్వాతంత్ర్యంగా ప్రకటించారు" అని చెప్పగా జనవరి 27, 1950 "ఫర్ ఎలాస్టింగ్‌పీస్...." సంపాదకీయం "బూటకపు స్వాతంత్ర్యం భారతదేశానికి యివ్వబడిందని[1]" పేర్కొంది. ఇదే విషయమై నాటి పార్టీ యేకగ్రీవాంగీకారానికి 1955 వరకు రాలేకపోవుట, పిడివాదం ఎంతలోతుగా ప్రేళ్ళూనివుందో తెలియజేస్తుంది. నేటికి కొన్నివర్గాలు అలాగే వుండుట తప్పనిసరిగా ఆశ్చర్యాన్ని గొల్పుతుంది.

యుద్ధ ఫలితంగా ఫాశిస్టుశక్తుల నాశనం, సోవియట్ యూనియన్ విజయం, యూరప్‌లో బలమైన శక్తిగా వుద్భవించుట, తూర్పు, మధ్యయూరప్‌లో జనతా ప్రజాస్వామ్య రాజ్యాల ప్రవర్ధనం, చైనాలో విముక్తిసైన్యాల అద్భుత విజయాలు, నైరృతి ఆసియాలో అనేక దేశాలు దాస్యశృంఖలాలను ఛేదించి సామ్రాజ్యవాదులను తరిమివేయుట పెట్టుబడిదారి విధానం చావుదెబ్బలుతినుటతో ప్రపంచ బలాబలాలలో తీవ్రమార్పులువచ్చి సోషలిస్టు శక్తుల బలాధిక్యత స్పష్టమైంది. అమెరికా యుద్ధంలో చెక్కుచెదరకుండా బయటపడి, సైనికంగా, ఆర్థికంగా, రాజకీయంగా అత్యంత బలీయమైన పెట్టుబడిదారి దేశంగా, ఆటంబాంబులు గుత్తగా కలిగిన దేశంగా, శక్తివంతమై వ్యాప్తిచెందే సోషలిస్టు వలస స్వాతంత్రోద్యమాలను నిరోధించి, అణచివేయు ప్రయత్నాలు ఆరంభించింది. సైనిక, ఆర్థిక చర్యలతోపాటు, రాజకీయ, సైద్ధాంతిక "శీతలయుద్ధాన్ని" ప్రారంభించింది.

ప్రపంచం సోషలిస్టు, సామ్రాజ్యవాదం, రెండు ప్రత్యర్థి శిబిరాలుగ రూపొందిందని, జడనోవ్, సెప్టెంబరు 1947లో జరిగిన యూరోపియన్ కమ్యూనిస్ట్ పార్టీల సమావేశంలో సిద్ధాంతీకరించారు. నూతన స్వాతంత్ర్యదేశాలు సోషలిస్టు శిబిరంలో వున్నవి. సామ్రాజ్యవాద శిబిరానికి అమెరికా, సోషలిస్టు, స్వాతంత్ర్యదేశాల శిబిరానికి సోవియట్ యూనియన్ నాయకత్వం వహించుతున్నవని తెలపాడు. మరో యుద్ధానికి తయారగుట, నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలపై దురాక్రమణ, ప్రజాస్వామ్య, సోషలిస్టు శక్తులను వేరుచేసి అణచివేయుటకు, సామ్రాజ్యవాదశక్తుల కూటమిని యేర్పరచుట, అమెరికా వ్యూహమని వివరించాడు. ప్రతిచర్యగా సోవియట్ యూనియన్, సోషలిస్టు దేశాలు సామ్రాజ్యవాద వ్యతిరేక, ప్రజాస్వామ్య, శాంతి విధానాలకు, యుద్ధానంతర శాంతి పరిష్కారాల అమలుకు పోరాడే విధానాన్ని చేబట్టి, సామ్రాజ్య వ్యతిరేక స్వాతంత్ర్య పోరాటాలు జరిపే అన్ని దేశాల స్వాతంత్ర్యాన్ని, సార్వభౌమాధికారాన్ని ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించుటకు సహకారాన్ని

1. అధికారి జి. (1977) భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర. అధికారపత్రాలు (ఆంగ్లంలో) వా. VII. పే. 8. ఉపోద్ఘాతము.

అవలంబించింది. పరస్పర అభిప్రాయాల మార్పిడి, ఆచరణ సమన్వయానికి కొమిన్ ఫారం రూపొందింది. కాని, ప్రపంచ కమ్యూనిస్ట్ వుద్యమం, ఒకే కేంద్రంనుండి నడుపబడజాలదని స్పష్టంచేసినా, తరువాత కాలంలో కొమినిఫారంనుండి యుగోస్లోవియా బహిష్కరింపబడుట, ఆచరణలో అధికారసంస్థగా కొమిన్‌ఫారం పని చేయుటను తెలియజేస్తుంది.

భారతదేశంలోని నూతన వర్గ సంబంధాలను 2వ, కాంగ్రెసు సిద్ధాంతం సంక్షిప్తంగా : 1) సామ్రాజ్యవాదం స్వయం ప్రయోజనాలకై ప్రభుత్వాధికారాలను బూర్జువావర్గాని కిచ్చింది 2) లభించిన రాజ్యాంగ ప్రభుత్వం, పరోక్షంగా సామ్రాజ్యవాదపు ప్రాబల్యంలో వుంటుంది, 3) గతంలోలాగ బూర్జువావర్గం, జాతీయ నాయకత్వం సామ్రాజ్యవాద వ్యతిరేక పాత్రను కలిగిలేదు; సామ్రాజ్యవాదానికి ప్రభుత్వ నాయకత్వానికి భిన్నాభిప్రాయాలను, యిచ్చి పుచ్చుకొనురీతిలో పరిష్కరించుకొంటుంది. 4) కాన, ప్రజాస్వామ్య విప్లవ పురోగమనం బూర్జువా ప్రభుత్వం, దాని విధానాలు, దాని నాయకత్వాలకు వ్యతిరేకంగా, పరోక్షంగా కాక నేరుగా వ్యతిరేకంగా వుంటుంది.

"సామ్రాజ్యవాద, ప్యూడలు, బూర్జువాల వర్గ కలయికను కార్మిక, కర్షక విప్లవ మేధావి వర్గాల కలయిక, కార్మికవర్గ నాయకత్వంలో సంఘటనను యేర్పరచి వోడించాలని" రాజకీయ సిద్ధాంత పత్రం వర్గకలయికను స్పష్టం చేసింది.

నేడు సంఘటనల క్రమం కార్మిక, కర్షక, అణచబడిన పెటీ బూర్జువాల ప్రజాస్వామ్య ప్రభుత్వం అనేది అందరిని సమీకరించగలిగిన నినాదం. అంటే, ప్రజాస్వామ్యం విప్లవ సోషలిజపు కర్తవ్యాలను ఒకేసారి, జనతా ప్రజాస్వామ్య విప్లవ విజయం పూర్తి చేయగలదని అర్ధం.[1]

రాజకీయ సిద్ధాంతపత్రం, తదితర పొలిట్ బ్యూరో పత్రాల ప్రధానాంశాలు[2] కొన్నింటిని చూద్దాము.

1) స్వాతంత్ర్యం బూటకపుది. మౌంటుబాటన్ పధకం, సామ్రాజ్యవాదపు తిరోగమనం కాదు. భారత ప్రజాశక్తికి వ్యతిరేకంగా "సామ్రాజ్యవాదపు మోసపు ఎదురుదాడి" బ్రిటిషు ఆధిపత్యరూపం మాత్రం మారింది బూర్జువాలకు రాజ్యాధికారం లభించుటతో భాగస్వాములైనందున జాతీయ ప్రజాస్వామ్య విప్లవాన్ని రక్తపు టేరులలో ముంచుటకు సంసిద్ధమే.

2) బూర్జువావర్గపు ద్వందవైఖరి గుర్తించ నిరాకరించబడింది. సిద్ధాంతపత్రం "భారత బూర్జువావర్గం అనగా కాంగ్రెసు నాయకత్వం తన సామ్రాజ్యవాద వ్యతిరేక పాత్రకు స్వస్తిచెప్పి భాగస్వామ్య సహకారులగుటతో అభివృద్ధి నిరోధకమైనది" అయినదని చెప్పగా పొలిట్‌బ్యూరో పత్రం "బూర్జువాలను విప్లవ వ్యతిరేక శక్తుల

1. రాజకీయ సిద్ధాంతం (ఆంగ్లంలో) పి. పి. హెచ్. 1949, పే. 74-6.
2. " " పే. 26-40, 60-64

అగ్రగాములగుటలో ప్రధాన శత్రువుగా" పేర్కొని సామ్రాజ్యవాద, ఫ్యూడలు శక్తు లను అప్రధానంగా యెంచింది. ఎత్తుగడలలో బూర్జువా, ఫ్యూడలు, సామ్రాజ్యవాద కూటమితో భారత బూర్జువా వర్గం అత్యంత బలమైనశక్తి విప్లవ పోరాటాలను ఎదు ర్కొనే నాయకత్వ శక్తి. అందుచే విప్లవం నేరుగా కాంగ్రెసు ప్రభుత్వానికి వ్యతిరే కంగా జరుగుతుంది. బూర్జువా కాంగ్రెసు తోలుబొమ్మ ప్రభుత్వానికి తొలగించుటతో విజయం సాధిస్తుంది.

3) ధ్యేయం, సామ్రాజ్యవాద, బూర్జువా, ఫ్యూడలు కూటమిలో బూర్జువా వర్గం నాయకత్వం వహించే ప్రభుత్వాన్ని పడగొట్టుట"గా పొలిట్‌బ్యూరో అధికార పత్రాలు వ్యూహరచనను వివరించాయి. ఇంకా "కార్మికవర్గం వ్యవసాయ కూలీలు, పేద రైతాంగంతో మిత్రకూటమిగ యేర్పడి, మధ్యతరగతి రైతును కలుపుకొని, బూర్జువావర్గాన్ని వేరుచేసి ఆ వర్గ ప్రతిఘటనాశక్తిని బలంతోఅణచివేసి జనతా ప్రజా స్వామ్య విప్లవాన్ని జయప్రదం చేయాలి" అని కర్తవ్యాన్ని వివరించింది.

దీని అర్థం యేమిటి? భారత బూర్జువావర్గం మొత్తంగా ప్రధాన శత్రువు. సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజంలను ఆచరణలో మరచిపోవుట వూగిసలాడే మిత్ర వర్గాన్ని ప్రధాన శత్రువగ నెంచుట, చిన్న పారిశ్రామికులను, ధనికరైతులను శత్రువు పక్షానికినెట్టుట, ఆచరణలో గ్రామీణ ప్రాంతాలలో భూస్వాములపై కాకుండా ధనిక రైతులపై దాడిని కేంద్రీకరించుట జరిగి విచ్ఛిన్నకర వ్యూహంగా పరిణ మించింది.

4) రాజకీయ విధానంలో బూర్జువా ప్రజాస్వామ్య విప్లవం, సోషలిస్టు విప్ల వాలు రెండూ "కలసిపోవుట", "ఒకదానికొకటి పెనవేసుకొనుట", "కలనేత"గ "కలసి అల్లబడుట" అనే నూతన సిద్ధాంతంగా, రష్యను ఫిబ్రవరి, అక్టోబరు విప్లవ దశలు రెండూ "కలసిన మిశ్రమ దశగా" జనతా ప్రజాస్వామ్య రూపంలో కార్మిక వర్గ నియంతృత్వపు ప్రభుత్వంగా చెప్పబడింది. అంతేగాక "ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలను పూర్తిచేసి అదేకాలంలో "సోషలిజం నిర్మాణాన్ని జనతా ప్రజాస్వామ్య విప్లవం చేబట్టుతుందని" పొలిట్‌బ్యూరో "జనతా ప్రజాస్వామ్యం" అను ప్రత్యేక వ్యాసంలో వివరించింది.

5) ముఖ్యమైన మూడు సిద్ధాంతపత్రాలు సామ్రాజ్యవాద, ఫ్యూడలు,బూర్జువా శక్తుల అధికారంలో ప్రభుత్వం వుందని అంగీకరించాయి. ఈ కూటమిలో యెవరు శక్తివంతమైనది అనే ప్రశ్నకు సమాధానమిచ్చుటలోనే భిన్న అభిప్రాయాలున్నవి. రాజకీయ విధాన సిద్ధాంతపత్రం ముఖావం వహించగా, వర్గశత్రువులలో అత్యంత బలమైనది బూర్జువావర్గంగా వ్యూహం, ఎత్తుగడల పత్రం," సామ్రాజ్యవాదం దాని ననుసరించే ఫ్యూడలు శక్తులు మిక్కిలి బలమైనవిగా "అతివాద వక్రీకరణ నివేదిక" పేర్కొంది.

ఈ అవగాహనలతో రూపొందించిన ఎత్తుగడ పత్రం, వ్యూహాన్ని యీ క్రింది విధంగా చిత్రించింది.

"లక్ష్యం : సామ్రాజ్యవాద, బూర్జువా, ఫ్యూడలు కూటమిలో నాయకత్వం వహించుతున్న బూర్జువా ప్రభుత్వాన్ని పడగొట్టుట, ఫ్యూడలు అవశేషాలను రూపు మాపి, జాతీయకరణ, తాత్కాలిక ఆర్థిక విధానాలను పరిణామమార్గంలో చేబట్టుట. విప్లవ ప్రధానశక్తి, కార్మికవర్గం వెంటగల రిజర్వుశక్తులు ; వ్యవసాయ కార్మికులు, పేద రైతులు, మధ్యతరగతి రైతులు-అణచి వేయబడుతున్న బస్తీలలోని పెటీ బూర్జువావర్గాలు; ప్రధానదాడి దిశ, పాలక బూర్జువాశక్తులు, బూర్జువా, పెటీ బూర్జువా పార్టీలను, సోషలిస్టు పార్టీలను వారి ననుసరించే ప్రజలనుండి దూరం జేయుట. పోరాటశక్తులు మొహరించు ప్రణాళిక, కష్టజీవులైన రైతులతో కార్మికవర్గ మిత్రత్వం, వ్యవసాయ కూలీలు పేద రైతులపై ప్రధానంగా ఆధారపడినది. కార్మికవర్గం, వ్యవసాయకూలీలు, పేద రైతులతో కలసి, మధ్యతరగతి రైతులు వెంటరాగా, బూర్జువాలను ప్రజలనుండి వేరుచేసి, వారి ప్రతిఘటనను రూపుమాపి, జనతా ప్రజాస్వామ్య విప్లవాన్ని తప్పనిసరిగా జయప్రదం చేయాలి.[1]

దీనర్థమేమిటి? సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజంలు ప్రధాన శత్రువులు కావు. భారత బూర్జువావర్గం ప్రధాన శత్రువు. ఆచరణలో పూగిసలాడే బూర్జువావర్గాన్ని, ధనికరైతులను శత్రుపక్షానికి నెట్టుట జరిగింది. గ్రామసీమలలో దాడిని భూస్వాములపై కేంద్రీకరించక, ధనిక రైతుపైగూడ సాగించుట జరిగింది.

ఈ అవగాహనలన్నిటి ఫలితంగా సమ్మెలు, వ్యవసాయ పోరాటాలు, సార్వజనీన సమ్మెలు, రాజకీయ సమ్మెలు, ఉన్నత పోరాటరూపాలు, సార్వజనీన తిరుగుబాటులు అనే తీవ్రపోరాట ఎత్తుగడలను అవలంబించుట పార్టీని చిన్నాభిన్నం చేసింది.

## ప్రజాస్వామ్య సంఘటన 2వ, పార్టీ కాంగ్రెసు అవగాహన

రాజకీయ విధాన సిద్ధాంతం యుద్ధానంతర విప్లవ వెల్లువ పోరాటాలు కొనసాగుతున్నవన్నది. కారణం ప్రజాదోపిడి యెక్కువై, ప్రభుత్వం, నాయకులు ప్రజలనుండి దూరమయ్యారు. ప్రజలు, భూస్వామ్య విదానపురద్దు, దున్నేవానికే భూమి, నిరంకుశ సంస్థానాల రద్దు, కీలక పరిశ్రమల జాతీయకరణ జీవనవేతనం ప్రధాన నినాదాలుగ చేబట్టి, ప్రజావుద్యమమే ప్రజా ప్రభుత్వాన్ని యేర్పాటు చేయుటవలననే నెరవేరగలదనే నిర్ణయానికి వచ్చారు. ప్రభుత్వం, కాంగ్రెసు నాయకత్వం తిండి, బట్ట, భూమి, నివాసం యివ్వదని, పార్టీ ఆధ్వర్యంలో పోరాటాలకు సిద్ధమగుతున్నారు. నాయకత్వాన్ని కోరుతున్నారు, యిదీ ప్రాథమిక అవగాహన.

నేటి పోరాటాలు సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలు మాత్రమే కాదు. అవి బూర్జువావర్గ వ్యతిరేక పోరాటాలుగ రూపొందాయి. ఇది బూర్జువా ప్రజాస్వామ్యంలో సామ్యవాదానికి వ్యతిరేకంగా బూర్జువావర్గం పోరాడే దశ అంతమైనదని తెలియజేస్తున్నది. ఈ పోరాటాలలో కార్మికులు, రైతులు, అణగదొక్కబడుతున్న మధ్యతరగతి

---

1. భారత కమ్యూనిస్ట్ పార్టీ చరిత్ర. అధికారపత్రాలు (ఆంగ్లంలో) పి. పి. హెచ్ (1977) పే, 243-9.

బూర్జువావర్గాలు ఐక్యసంఘటనగా కార్మికవర్గ నాయకత్వంలో అన్ని దోపిడి వర్గాలకు వ్యతిరేకంగా పోరాడుతారు. నేటి పోరాటాల క్రమం కార్మిక, కర్షక, మధ్యతరగతి వర్గాల ప్రజాస్వామ్య ప్రభుత్వదశగా పురోగమిస్తుంది. అనగా జనతా ప్రజాస్వామ్య విప్లవం, బూర్జువా ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలు పూర్తిచేస్తూ, అదే కాలంలో సోషలిజపు పునాదులను నిర్మాణం చేస్తుంది.

ఈ అవగాహన, నూతనవర్గ సంఘటన రూపచిత్రాన్ని యిస్తుంది ఈ సంఘటనలో పోరాడే ప్రజాసామాన్యమంతా, పోరాడే అన్ని సంస్థలూ జాతీయ బూర్జువా వర్గ ద్రోహానికి వ్యతిరేకంగా పోరాడే శక్తులన్నిటికి సహాయపడే వర్గాలన్నీ ఐక్యమవుతాయి ఈ సంఘటనలో కమ్యూనిస్ట్ పార్టీ, పార్టీ నాయకత్వ లోని కార్మిక, కర్షక, యితర ప్రజాసంస్థలు ప్రధానశక్తులు. అతివాద పార్టీలలోని పోరాట శక్తులు, యీ పార్టీలలోని నిజమైన అతివాదులు సంఘటనలో ముఖ్యపాత్రధారులు. కాంగ్రెసు,ముస్లింలీగులలోని సామ్రాజ్యవాదవ్యతిరేకశక్తులన్నిటిని తనలో యిముడ్చుకొంటూ, యీ సంఘటన పురోగమిస్తుంది. సంఘటనలో అనేక రాజకీయపార్టీలు, ట్రేడు యూనియనులు, కిసాన్ సభలు, యువజన విద్యార్థి తదితర సంఘాలు ఉంటాయి. అయినా సంఘటన పార్టీల; సంస్థల, సంకీర్ణ కూటమికాదు,అది వాస్తవమైన సామ్రాజ్యవాద, భూస్వాములు, బూర్జువావర్గాల వ్యతిరేకపోరాట ఐక్యసంఘటన, కార్మిక వర్గ నాయకత్వంలో పురోగమిస్తుంది.

అట్టి ఐక్య సంఘటనా నిర్మాణానికి అన్ని వామపక్షాల, శక్తుల సహకారానికి పార్టీ ప్రయత్నిస్తుంది వామపక్షాలతో పోరాట ఐక్యతకై కృషిచేస్తుంది కార్మికవర్గ కార్యక్రమానికై రైతులను, మధ్యతరగతి, బూర్జువావర్గాలను పోరాటాలలో సమీకరిస్తుంది కమ్యూనిస్టులు ఐక్యసంఘటనా పోరాటాలలో కార్మికవర్గ నాయకత్వాన్ని యేర్పరచు ప్రయత్నాన్ని మరువజాలము. ఐక్యసంఘటనా నిర్మాణ ప్రయత్నాలలో సర్వసామాన్య కార్యక్రమాన్ని రూపొందించు సిద్ధాంత పోరాటం యిమిడివుంది. క్రమేణా కార్మికవర్గ పార్టీ నాయకత్వ నిర్మాణం, నిర్మాణయుక్తమైన ఐక్యరాజకీయ ప్రజావుద్యమాన్ని ప్రజాస్వామ్య పద్ధతులలో ప్రజాఐక్యత పునాదిగా నిర్మించు క్రమములో రూపొందవలసి వుంది. ఈ కారణంగా పైనుండి యేర్పడే వామపక్షాల మిత్ర కూటమిగా నెంచరాదు. కార్మిక, కర్షక, మధ్యతరగతి మేధావిశక్తుల వర్గ ఐక్య సంఘటనగా నెంచాలి.[1]

## వామపక్షాల ఐక్యత

కాంగ్రెసు, ముస్లింలీగు విధానాలతో విసుగు, నిస్పృహ చెందిన ప్రజాసామాన్యాన్ని సంస్థానాల తదితర ప్రజాసామాన్యంలో జాగృతి కలిగించుటకు వామపక్ష ఐక్యత, నూతన జనతా ప్రజాస్వామ్య ఐక్యసంఘటనను యేర్పరచుటకు ఎగానో వుపయోగపడుతుంది. కమ్యూనిస్టుపార్టీ బలం, ప్రజాసామాన్యం వామప

1. రాజకీయ సిద్ధాంతపత్రం (ఆంగ్లంలో) పి. పి. హెచ్. 1947. పే. 59-61.

బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో ఎట్టి సంబంధంలేని నిజమైన సంపూర్ణ స్వాతంత్ర్యం, ఆంగ్లో అమెరికన్ సామ్రాజ్యవాదంతో రాజీని వ్యతిరేకించే కార్మిక, కర్షక అణచబడుతున్న పెటీ బూర్జువాల ప్రజాస్వామ్య ప్రభుత్వం, అన్ని దేశాల స్వాతంత్ర్యం, శాంతి, సహకారాన్ని కోరే ప్రభుత్వము ప్రజాస్వామ్యం, ప్రాథమిక ఆర్థిక, పౌరహక్కులు, వయోజనవోటింగు, దామాషా ప్రాతినిధ్యం గ్యారంటీచేయు రాజ్యాంగము రూపొందించాలి. జాతుల స్వయంనిర్ణయం విడిపోయే హక్కుతోసహా స్వపరిపాలిత భాషాప్రయుక్త రాష్ట్రాలు ఐచ్ఛికంగా కలసి యేర్పడిన ఇండియన్ యూనియన్, మైనారిటీలకు న్యాయమైన ప్రజాస్వామిక హక్కులు, భాష, సంస్కృతీ సమానతల రక్షణకై రాజ్యాంగం, కులం, జాతి, కమ్యూనిటి, మత విచక్షణరద్దు, వుల్లంఘన చట్టరీత్యా శిక్షార్హంచేయాలి సంస్థానాలలో రాచరికం, వ్యూడలు భూస్వామ్య విధానాలరద్దు, ప్రజాస్వామ్యం అమలు, ఐచ్ఛికంగా యే యూనియన్‌లో అయినాచేరవచ్చు ఆటవిక వెనుకబడిన జాతులకు ప్రాంతీయ స్వపరిపాలన, ఆర్థిక, రాజకీయ, సాంఘిక అణచివేతలనుండి స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యహక్కుల విస్తరణ నిర్దిష్టం చేయబడినవి.

భూస్వామ్య విధానాన్ని నష్టపరిహారంలేకుండా రద్దుచేసి దున్నేవానికే భూమినిచ్చి, గ్రామీణ అప్పులు రద్దు, కౌలుదారులకు పట్టాలు, వ్యవసాయ కూలీలకు కనీస జీవన వేతనం యివ్వాలి. నియంతృత్వం, లంచగొండితనం తొలగించి, ఎన్నికైన పాలనా యంత్రాంగం, ప్రజల సలహాలపైన ప్రజాస్వామిక పాలన నేర్పరచాలి. నిర్భంధ చట్టాలరద్దు, ప్రజలను సాయుధులచేసి, సైన్యాన్ని ప్రజాస్వామికీకరణ చేయాలి. నిర్భంధ వుచిత ప్రాధమిక విద్య, స్త్రీలకు ప్రాధమిక హక్కుల అమలు.

విదేశ పెట్టుబడులు, బ్యాంకులు, పరిశ్రమలు, రవాణా, తోటలు ప్రభుత్వం స్వాధీనం చేసుకొని జాతీయంచేయాలి. భారీపరిశ్రమలను, బ్యాంకులను, భీమా కంపెనీలను, గనులు జాతీయంచేసి, కార్మికుల పర్యవేక్షణ, కనీస వేతనం, 8 గంటల పనిని గ్యారంటీచేయాలి అభివృద్ధికి ఆర్థికప్రణాళిక, వ్యూహాత్మకస్థానాలనుండి గుత్త వ్యాపార సంస్థలను తొలగించుట, లాభాలపై నియంత్రణ, నిఘాయేర్పాటు చేయుట.

ఇండియా పాకిస్తానులు ప్రజాస్వామిక ఆర్థికాభివృద్ధికి సామ్రాజ్యవాద జోక్యాలకు వ్యతిరేకంగా సైనిక, రాజకీయ సహకారము.

ప్రాధమికంగా కార్యక్రమాన్ని పూర్తిగా ఆమోదించేవారితో సంయుక్త సంఘటనను యేర్పాటు చేస్తుంది. ప్రత్యేక సమస్యలపై వెంటనే ఐక్య కార్యాచరణ ప్రారంభమౌతుంది. సంయుక్త కార్యాచరణాభివృద్ధితో, వామపక్ష సహకారాభివృద్ధి అన్ని ప్రజాస్వామిక శక్తులకు స్పష్టమగుటతో, వామపక్షాల ప్రజలు అనుభవాలతో క్రమేణా సంఘటన రూపొందుతుంది. మతశక్తులతోను, యుద్ధోన్మాద శక్తులతోను పోరాడే శాంతిసేనల యేర్పాటుచేసి, మత సామరస్యవాదులందరితో సహకరిస్తుంది.[1]

1. రాజకీయ సిద్ధాంతపత్రం (ఆంగ్లంలో) పి.పి.హెచ్. 1949. పే. 68-70.

## జనతా ప్రజాస్వామ్య విప్లవానికి పార్టీ కర్తవ్యాలు

జనతా ప్రజాస్వామ్య విప్లవ లక్ష్యం యీ ప్రభుత్వస్థానంలో కార్మిక, కర్షక అణచబడిన మధ్యతరగతి వర్గాల, జనతా ప్రజాస్వామ్య రిపబ్లికన్ ప్రభుత్వాన్ని యేర్పరచుట. ఈ లక్ష్యసాధనకై కమ్యూనిస్టుపార్టీ కార్మిక, కర్షక, తదితర బడుగు వర్గాల ఐక్య సంఘటనపోరాటాలన్నిటి మహోద్యమంగా మలచి, ఆశయసాధనకు నడుపుట మార్గం నేటి పార్టీ కర్తవ్యం.

1) నేడు కార్మికవర్గం జాతీయ ట్రేడు యూనియన్ కాంగ్రెసు సోషలిస్టుల ఆధ్వర్యంలోని కార్మిక సంఘాలలో, అఖిలభారత ట్రేడు యూనియన్ కాంగ్రెసు అను 3 ప్రధాన కార్మిక సంస్థలతో చీలిపోయి, వర్గ ఐక్యతను కోల్పోయింది. కార్మికుల ప్రతి దైనందిన పోరాటంలో కార్మికవర్గ ఐక్యతనునిర్మించుట అత్యవసరము. ఈ ఐక్యత పోరాటానికి ముందుగా కాని, పోరాటక్రమంలో గాని యేర్పడాలి. సరియైన ట్రేడు యూనియన్ ఎత్తుగడలను అనుసరించిన కార్మికవర్గంలోని ప్రతివి భాగాన్ని సమిష్టి సంఘ ప్రతిఘటనలోనికి వచ్చునట్లు చేయుటనుసాధ్యం ప్రభుత్వపు ఆర్థిక సంక్షోబాల భారాన్ని, వేతనాల తగ్గింపు, రిట్రెంచుమెంటు, పనిగంటల హెచ్చుచేయుట, ఆ భారాన్ని కార్మికులపై మోపజూస్తున్నది. కాన ఐక్యత సుసాధ్యం.

కార్మికవర్గ ఐక్యత మత తత్వాలకువ్యతిరేకంగా మైనారిటీల రక్షణకు కార్మిక వర్గం చురుకైన పాత్ర వహించిన సుసాధ్యం. మతాల అడ్డుగోడలు దాటజాలక పోయినచో రాజకీయ, ఆర్థిక విముక్తికై కార్మికవర్గ పోరాటం విఫలంకాక తప్పదు. పెరిగే కార్మికవర్గ శక్తికి, సమ్మెలకు భయపడి కార్మికవర్గ ఐక్యతను చీల్చుటకు కాంగ్రెసు మితవాదనాయకత్వం, జాతీయ ట్రేడుయూనియన్ కాంగ్రెసును ఏర్పాటు చేసింది. అది ప్రభుత్వతోకగా సమ్మెలను విచ్ఛిన్నముచేయు ఏజంటుగా పనిచేయుటను బహిరంగ పరచి ఎండగట్టాలి. సోషలిస్టు నాయకత్వం, సోషలిస్టు పదజాలంతో పోటీ సంఘాలను పెట్టి కార్మికవర్గాన్ని చీల్చుతున్నది. ఈ చర్యలలో పారిశ్రామిక యాజమాన్యం, ప్రభుత్వం, జాతీయ ట్రేడుయూనియన్ కాంగ్రెసులతో సహకరించుతున్నది. సోషలిస్టు నాయకత్వపు యీ కార్మిక ఐక్యతా వ్యతిరేక చర్యలను తీవ్ర విమర్శలకు గురిచేసి వారిని కార్మికులనుండి వేరుచేయాలి.

సమ్మె పోరాటాలలో తక్షణ సమస్యలతోపాటు కీలక పరిశ్రమలను జాతీయం చేయాలని, లాభాలను నియంత్రణ చేయాలని, జీవనవేతనం, నిరుద్యోగ నిర్మూలన, వేతన కోతల రద్దుకు ఆందోళనోద్యమాలను చేబట్టి కార్మికవర్గ ఐక్యతను పెంపొందించాలి. ఈ క్రమంలో సంస్థాన ప్రజల, రైతు, విద్యార్థి పోరాటాల ఐక్యతను, ఐక్యసంఘటనా నిర్మాణాన్ని, పార్టీ నాయకత్వపాత్రను పటిష్టం చేయాలి.[1]

2) రైతులను దున్నేవానికే భూమి నినాదంతో ఉత్తేజపరచి, సమీకరించి, నష్ట పరిహారం లేకుండా అన్ని రకాల భూస్వామ్య విధానాన్ని రద్దుచేసి, పేదరైతు,

---

1. రాజకీయ తీర్మానం (ఆంగ్లంలో) కమ్యూనిస్టు పార్టీ 2వ కాంగ్రెసు సిద్ధాంత పత్రం. పి. హెచ్. హెచ్ (1949) పే. 71-8.

కూలీలకు పంచాలని, రైతుల అప్పులు రద్దుచేయాలని, బేదఖళ్ళకు వ్యతిరేకంగా, కౌళ్ళ తగ్గింపు పోరాటాలు సాగించాలి. ప్రభుత్వం రైతు పోరాటాల విస్తృతిని, తీవ్రతను ప్రక్కదారులు పట్టించుటకు విపరీతంగా నష్టపరిహారమిస్తూ జమీందారీ వ్యతిరేకచట్టాలు తీసుకొస్తున్నది. రైతులు భూములనుండి విపరీతంగా తొలగించబడు తున్నారు. ఈ చట్టాలు భూస్వామ్య విధానాన్ని రద్దు చేయకపోగా, మరో రూపంలో కొనసాగిస్తాయి. నష్ట పరిహారభారాన్ని రైతులపై మోపుతున్నారు. ఒక విధంగా భూస్వాములకు పునర్నివాసము కల్పించుచున్నారు. దున్నేవానికే భూమి లభించనిదే, ప్యూడలు భూస్వామ్యవ్యవస్థ రద్దుకాదు, రూపం మారుతుంది. అందుకే దున్నేవానికే భూమి కేంద్ర నినాదం కావాలి.[1]

3) సంస్థానాలు మధ్యయుగాల దోపిడి, దౌర్జన్యం, హింసలకు ప్రత్యక్ష సాక్ష్యాలు జాగృతి, చైతన్యాలతో ప్రజలు పోరాటాలు సాగించుటతో, కూలిపోయే స్ామ్రాజ్యవాద. ఫ్యూడలు సౌధంలో అత్యంత బలహీనమైన "కొలికిపూసగా"ఉంది. ప్రజోద్యమాలు ఉవ్వెత్తున లేచుటకు అనుకూల పరిస్థితులను కలిగివున్నవి.ఫ్యూడలు శక్తులకు యేవిధమైన గట్టి పునాదిలేదు. అందుకే మత, మితవాదశక్తులను రెచ్చ గొడుతు, తమ పునాదిని విస్తరించుకొన ప్రయత్నిస్తున్నారు. బూర్జువా నాయకత్వా లతో రాజీమార్గంలో తమ స్థానాలను ఆర్థిక పునాదులను బలపరచుకొంటున్నారు. కాన సంస్థాన ప్రజోద్యమాల గమ్యం, మధ్యంతత బాధ్యతాయుతపాలనకై సంస్థాన ప్రభువుల రాజీ పోరాటాన్ని నడుపుటకాదు. రాచరికపు వ్యవస్థ నిర్మూలనకు, ప్రజా స్వామ్య స్థాపనకై పోరాటాలు కొనసాగించాలని నిర్ణయం చేసింది. ఇదే 2వ పార్టీ కాంగ్రెసు నూతన పంథా, పార్టీ స్వతంత్ర్య కార్యాచరణ, ప్రజామండలాలులతో వుంటూనే కొనసాగించాలి. సంస్థాన ప్రజల విముక్తికి విస్తృత ప్రజాసంఘటనను నిర్మించి, పోరాటశక్తులన్నిటిని అందులో సమీకరించి, రాచరికపురద్దు, ప్రజాస్వామ్యం స్థాపన కేంద్ర నినాదంగా ఐక్యపోరాటాలు, ఉద్యమాలు కొనసాగించాలి అప్పుడే విజయం లభించగలదు.[2]

4) ఆరుకోట్లమంది, అంతరాయం కలిగించగల అంటరానివారు సమాజానికి వొకమచ్చ. ప్రజాస్వామ్య విప్లవానికి బలమైన శక్తి, బహుళ సంఖ్యాకులు. బూర్జువా కాంగ్రెసు అగ్రకులాల నాయకత్వం, వారి సామాజిక, ఆర్థిక సమానత పోరాటాన్ని, స్వాతంత్ర్య పోరాటం అనుసరించుటలో విఫలమైంది. ఆ కారణంగా విడిపోయే శక్తు లకు బలాన్ని చేకూర్చింది. వారి విముక్తి సామ్రాజ్యవాదంపై లేక బూర్జువావర్గంపై ఆధారపడుటతోగాక, దోపిడికి వ్యతిరేకంగా యితర కష్టజీవులందరూ జరిపే పోరా టంలో కలిసి సంయుక్తపోరాటం జరుపుటతోనే సాధ్యమౌతుంది. అగ్రవర్ణాల కుల విచక్షణను బద్దలుచేయుట ప్రజాస్వామ్య సంఘటనలోచేరి కార్మిక, కర్షకులతో

1. రాజకీయ తీర్మానం (ఆంగ్లంలో) కమ్యూనిస్టుపార్టీ 2వ కాంగ్రెసు సిద్ధాంత పత్రం. పి.పి.హెచ్. (1949) పే. 18-30.

2. అదే ఆమోదించినది.

కలసి పోరాడుటతో త్వరితం చేయబడుతుంది, పార్టీ అంటరాని వారిపై జరిపే అన్ని కుల వివక్షణ, దౌర్జన్యాలకు వ్యతిరేకంగా నిలబడి పోరాడాలి. ప్రజాస్వామ్య సంఘటనను స్థాపించాలి.

5) కార్మికవర్గం మైనారిటీల హక్కులరక్షణకై, హిందూవులలోని మతతత్వ వాదులుకు వ్యతిరేకంగా పోరాడాలి. కుల, మత వివక్షణ యే రూపంలోవున్నా ఎదిరించి పోరాడాలి. ఇది జరుగనిచో ప్రజాస్వామ్య సంఘటన తిరిగి తిరిగి విచ్ఛిన్నమౌతూ వుంటుంది. కాంగ్రెసు తన రాజీ విధానాలతో స్వయం నిర్ణయ సూత్రానికి వ్యతిరేకంగా ఇండియాను రెండుగా చీల్చిన విషయాన్ని గుర్తించుకొనాలి నేడు తిరిగి జాతుల స్వయం నిర్ణయసూత్రాన్ని నిరాకరించుతూ అటువంటి తప్పిదాన్నే, భాషా రాష్ట్రాల ప్రాతిపదికపై అంధ్రరాష్ట్రమును యేర్పాటు చేయుటకు కాంగ్రెసు అగ్ర నాయకత్వం అంత సుముఖంగా లేదు. ఇది వివిధ జాతులలో వుద్రేకాలకు, విచ్ఛిన్న పోకడలకు కారణభూత మగుచున్నది, జాతీయ పిడివాదులకు అవకాశమిచ్చినట్లు అగుతుంది అని సిద్ధాంతపత్రం వివరించింది.

పార్టీ 2వ, కాంగ్రెసులో రాజకీయ సిద్ధాంతం యేకగ్రీవంగా ఆమోదించబడింది. రాజకీయ విధానం ప్రధానంగా అగస్టు 1946 అవగాహనను, డిశెంబరు 1947 రాజకీయ అవగాహనలలో, ఆర్థికపునాదితో సమగ్రత చేకూర్చ ప్రయత్నించారు. జోషీ అగస్టు 1946 తీర్మానాన్ని సూత్రప్రాయంగా అంగీకరించి, ఆచరణలో వ్యతిరేకించిన విధానంగానే, డిశెంబరు 1947 రాజకీయ తీర్మానాన్ని ఆమోదించి, తత్సంబంధ నివేదిక పత్రాన్ని ఆమోదించలేదు.[1] అయితే రెండవ కాంగ్రెసు రాజకీయ విధానాన్ని ఎట్టి మినహాయింపులు లేకుండా అంగీకరించారు. తానవలంబించిన సంస్కరణవాదంపై సుదీర్ఘ ఆత్మవిమర్శనను చేసుకొన్నారు.[2] కాంగ్రెసులో రాజకీయ విధానాలపై సుదీర్ఘ చర్చలు జరిగినవనుటలో సందేహంలేదు. అప్పుడు జరిగిన చర్చలు ప్రకటిత సాహిత్యంలో, ప్రధాన రాజకీయవిధానంపై జరిగిన చర్చలు అంతగా కానరావు.

## III

## సాహసికవాదం, సంక్షోభం

పార్టీ కాంగ్రెసు ఆమోదంతో నూతన నాయకత్వం, సెక్రటరీ రణదివె అధ్యర్యంలో విప్లవ పోరాటాలకు సారధ్యం వహించింది. తెలంగాణా నమూనా వ్యవసాయ విప్లవ పోరాటాలను విస్తరింపజేయుటకు పార్టీ కాంగ్రెసు ఆమోదముద్ర వేసింది. పార్టీనూ, తన నాయకత్వాన్ని రూపొందించుట, ప్రజాశక్తుల సమీకరణ ప్రారంభించింది. అయితే విప్లవ కార్యాచరణకు వొక కార్యక్రమంగాని, నిర్మాణ

---

1. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర. అధికారపత్రాలు (ఆంగ్లంలో) 1977 పి. పి. హెచ్. పే. 164.

2, అదే పే. 211.

చర్యలు, యేర్పాటులు యేమీ జరుగలేదు. నూతన సెక్రటరీ, పార్టీ మితవాదశక్తుల శాసనమనే పేరుతో పార్టీ కేంద్రంలోని జోషి అనూయాయులు అని తలచిన వారి నందరిని, దూరంగా వుంచటం ప్రారంభించారు. నూతన విధాన ఆచరణకు విశ్వాస ప్రియులను సమీకరించుట, అధికారం వుపయోగించు మార్గంలో సాగుటతో, పొలిట్ బ్యూరోలోకూడ కొంత వ్యతిరేకత కన్పడజొచ్చింది.[1]

నూతన పార్టీ జనరల్ సెక్రటరీ పార్టీని విప్లవపార్టీగా చేయు ప్రయత్నం కొనసాగించుటలో మునిగివుండగా, ప్రభుత్వం, కమ్యూనిస్టుల "విప్లవ కార్యక్రమాలను" ఎదుర్కొనుటకు నెలరోజులలోనే సర్వసన్నద్ధమైనట్లు కన్పడుతున్నది. ప్రధాని నెహ్రూ, కమ్యూనిస్టులు దేశంలో అరాచకం సృష్టించుటకు ప్రయత్నించుచున్నారని ప్రకటించి, ప్రభుత్వం చేబట్టే నిర్బంధచర్యలకు తానే బాధ్యత స్వీకరించారు. కేంద్ర ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీని నిషేధించు చర్యను గైకొనకుండా, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రాంతీయ కమ్యూనిస్టు పార్టీలపై స్థానికచర్యలు ప్రారంభించాయి.

పశ్చిమ బెంగాల్ రాష్ట్ర ప్రభుత్వం, ప్రజారక్షణ చట్టంక్రింద మార్చి 26, **1948**న పార్టీని నిషేధించింది. రాష్ట్ర హోం మినిష్టరు, రహస్యపత్రాలు. ఆయుధాలు తన పోలీసులకు పట్టుబడినవని, హింసాయుత తిరుగుబాటులకు కమ్యూనిస్టులు ప్రయత్నాలు చేస్తున్నారని ప్రకటించారు. క్రమంగా వారంలో మైసూర్, ఇండోర్, భోపాల్, చంద్రనగర్‌లలో పార్టీ నిషేదించబడింది. పోలీసులు బొంబాయి, మద్రాసు, పాట్నా, అలహాబాద్, నాగపూర్ పార్టీ ప్రధాన కేంద్రాల ఆఫీసులపై దాడిచేసారు. పార్టీ పత్రికలు పశ్చిమబెంగాల్, కేరళ, ఆంధ్రప్రదేశ్‌లలో నిషేదించారు. దేశమంతటా కమ్యూనిస్టు నాయకులను అరెస్టు చేసారు. జ్యోతిబసు ముజఫర్ అహమ్మద్, డాంగే, మిరాజ్‌కర్, సోహన్‌సింగ్ జోష్, భరద్వాజ్, దినకర్ మెహతా, తదితర రాష్ట్రాలలోని నాయకులెందరో వొక్కుమ్మడి అరెస్టు చేయుటతో పార్టీ, స్థానిక శాఖలు, అట్టి పరిస్థితిని వూహించనందున ఆశ్చర్యంలో మునిగిపోయి పార్టీ నిర్వీర్యమైంది. కాని, పార్టీ కేంద్రంలోని రణదివె, అజయ్‌ఘోష్, అధికారులపై ప్రభుత్వ దాడి ప్రభావం పడలేదు, కేంద్రపార్టీ పత్రిక న్యూయేజ్ కొనసాగుతూనే వుంది. ప్రభుత్వ నిర్బంధ చర్యలకు పార్టీ స్పందన, క్రోధం, ఎదిరించే స్వభావాల మిశ్రంగా వుంది రణదివే ఏప్రియల్ ప్రారంభంలో చేసిన రెండు ప్రకటనలలో, పార్టీ హింసాయుత తిరుగుబాటుకు ఆయుధాలు సేకరించుచున్నదన్న ఆరోపణను ఖండించి, కాంగ్రెసు నాయకత్వం తమ విధానాలను పునర్విచారించుకోనాలని విజ్ఞప్తి చేసారు. నూతన దౌర్జన్య విప్లవ కమ్యూనిస్టు విధానాన సృష్టికర్తలైన అగ్ర కమ్యూనిస్టు నాయకత్వాన్ని వెంటనే అరెస్టు కావించక, రాష్ట్రాలలో అరెస్టులు, కేంద్రంలో కొందరిని అరెస్టులు కావించి, కోపోద్రిక్తులైన పార్టీ వర్గాలు తొందరపాటు చర్యలకు ఒడిగట్టుటకు ప్రభుత్వం పార్టీని రెచ్చగొట్టు చర్యలను చేబట్టింది. ఆ విధంగా పార్టీని

---

1. ప్రభోధ్‌చంద్ర (అజయ్‌ఘోష్) పార్టీలో నేటి పరిస్థితిపై నోటు....ఓపెన్ ఫోరం. నం. **12** అక్టోబరు **1950**. పే. **5**.

అపవాదులపాలు చేయనెంచింది. పార్టీ నాయకత్వం రహస్య జీవితంలోనికి వెళ్ళింది. అయినా కొద్ది మాసాలలోనే అజయ్‌ఘోష్, సర్దేశాయి, రమేశ్‌చంద్ర, ఘాటే, యూసఫ్ తదితర అనేకమంది అరెస్ట్ చేయబడ్డారు. రణదివె, నాయకులపై అరెస్ట్ వారంట్లు విడుదల చేసారు. బొంబాయి రాష్ట్ర ప్రభుత్వం పార్టీ కేంద్ర ప్రచురణాలయంపై అనేక నిబంధనలను విధించింది. యం. బి. రావ్, తదితర ప్రచురణలకు సంబంధితులు అరెస్ట్ చేయబడ్డారు. పార్టీ వారపత్రిక కొనసాగుతూనేవుంది. కాని కొన్ని రాష్ట్రాలలో నిషేదించబడింది తరువాత పార్టీ మద్రాసు, హైదరాబాద్, ట్రావెంకూర్ కొచ్చిన్‌లలో నిషేదించబడింది.

ఆరుమాసాలలో సార్వజనీన సమ్మె, దేశమంతటా రైతాంగ తిరుగుబాటులు, విప్లవ పోరాటాలు జరుగుతవని ఆగస్టులో పార్టీ జనరల్ సెక్రటరీ రహస్య సర్క్యులర్ విడుదల చేసారు.[1] కార్మికవర్గాలలోని అనుభవం, రష్యన్ విప్లవ తిరుగుబాటుల నమూనాల ఆసక్తి కారణంగా, గ్రామీణ ప్రాంతాలలో రైతాంగ తిరుగుబాటులకన్నా, నగరాలలో తిరుగుబాటులపై దృష్టి అంతా కేంద్రీకరింపబడి, కార్మికవర్గ సార్వజనీన సమ్మె పోరాటాలద్వారా అధికారాన్ని హస్తగతం చేసుకొనే వ్యూహాన్ని చేబట్టారు. అంచేతనే, సార్వజనీన సమ్మె పోరాటాల ఎత్తుగడలననుసరించే, అఖిల భారత రైల్వే మెన్స్ ఫెడరేషన్‌లో కార్మికవర్గాన్ని చురుకుగా సమీకరించ ప్రయత్నాలు ప్రారంభించారు ఫెడరేషన్‌లోని సోషలిస్టు నాయకులు జయప్రకాశ్ నారాయణ్ ప్రభుత్వముతో సంప్రదింపులు జరిపి, ప్రభుత్వంతో ఒక అవగాహనకు వచ్చి, ఫెడరేషన్ యిచ్చిన సమ్మె పిలుపును ఉపసంహరించుకొన్నారు. ఫెడరేషన్‌లోని కమ్యూనిస్టు వర్గాలు పై నిర్ణయాన్ని వ్యతిరేకించి, సమ్మెను కొనసాగించుటకే తీవ్రప్రయత్నాలు సాగించారు. ఆరు మాసాల తరువాత ఫెడరేషన్ నాయకత్వాన్ని త్రోసియిచ్చి, తమ నాయకత్వంలోని యూనియన్‌లలో సమ్మె ప్రయత్నాలు తీవ్రతరం చేసారు. అఖిల భారత ట్రేడు యూనియన్ కాంగ్రెసు అనుబంధసంస్థలతో తీవ్రవాద ఎత్తుగడలు అవలంబించినందున, కార్మిక నాయకత్వంలో చురుకైన చాలా భాగం అరెస్టు అయింది. ట్రేడు యూనియన్ కాంగ్రెసులోని కమ్యూనిస్టేతర అగ్రనాయకులు యన్. యం. జోషి, యం. కె. బోస్ తదితరులు 1948 చివరకు రాజీనామాలనిచ్చి వైదొలగారు.

ప్రభుత్వం సాగించిన ప్రచారం, ఫిబ్రవరి 1949న నెహ్రూ వుపన్యాసంలో "కమ్యూనిస్టుల కార్యక్రమంలో దోపిడీ, దౌర్జన్యం, హత్యలు, తదితర విద్రోహచర్యలకు ఉదాహరణగా, కలకత్తాలో బస్సులు, ట్రాంలపై బాంబులు విసిరారని, రైల్వేరవాణాలను భగ్నంచేసి, సంక్షోభాన్ని, అల్లరులను సృష్టించి, నేరుగా కరువు కాటకాల పరిస్థితులను తీసుకొస్తున్నారని" పేర్కొనుటలో అంతటి నిందా, ఆపవాద ప్రచారానికి ఒడిగట్టుతుందో తెలుస్తుంది[2] ఈ ప్రచారంతో ప్రభుత్వం విచక్షణారహి

1. ప్రబోద్‌చంద్ర (1950) నోటు. ఫోరం నం. 12. పే. 5.
2. కమ్యూనిస్టు వైలెన్స్ ఇన్ ఇండియా. హోంమినిస్ట్రీ 1949. పే. 3-7.
ఈ సమాచారం "కమ్యూనిజం ఇన్ ఇండియా. ఓవర్‌స్ట్రీట్, మార్షల్, పే. 278-9 నుండి తీసుకొనబడినది.

తంగా సాగించిన మూకొమ్మడి అరెస్టులు, తీవ్ర నిర్బంధకాండ, పోలీసు, సాయుధ పోలీసులు రైల్వే ఉద్యోగులపై వారి కాలనీలలో, బయట సాగించిన దౌర్జన్యకాండతో రైల్వేమెన్స్ సమ్మెను జరుగకుండానే అణచివేసారు. కార్మికవర్గం ఎట్టి ప్రతిఘటన చేసినా నామమాత్రమగుటతో సార్వజనీక సమ్మె పూర్తిగ విఫలమైంది. ఫలితంగా పార్టీ బలంగావున్న ట్రేడు యూనియనులు, యితర ప్రజాసంఘాలు అన్నీ నిర్వీర్యం చేయబడ్డాయి.

**పార్టీ నూతన విధానం, అంతర్జాతీయ కమ్యూనిస్టుల వైఖరులు :**

భారత కమ్యూనిస్టు పార్టీ 2వ, కాంగ్రెసు జరిగిన కొద్దివారాలకే యుగోస్లోవియా, సోవియట్ యూనియన్ కమ్యునిస్ట్ పార్టీల మధ్య ఉత్తరప్రత్యుత్తరాలు జరిగాయి. ఫలితంగా జూన్ 1948తో కొమిన్‌ఫారంనుండి యుగోస్లోవియా కమ్యూనిస్టు పార్టీని బహిష్కరించారు. దానితో యుగోస్లోవియా, భారత కమ్యూనిస్టు పార్టీల మధ్య సంబంధాలు సన్నగిల్లాయి.

భారత కమ్యూనిస్టు పార్టీ నూతన విధానాన్ని అనేక కమ్యూనిస్టు పార్టీలు తమ నివేదికలలో ఆమోదాన్ని తెలిపాయి. పామీదత్తు, భారత బూర్జువావర్గాన్ని ఖండించి, "పోరాట నాయకత్వాన్ని కార్మికవర్గం చేబట్టుటకు పురోగమిస్తుందని," "భారత స్వాతంత్ర్యపోరాటం ఒక నూతనదశకు చేరిందని" లేబరుమంత్లి, ఫర్ ఎలాస్టింగుపీసులలో పేర్కొన్నారు భారత కమ్యునిస్టు పార్టి నూతన విధానాన్ని బలపరస్తూ "భారత బూర్జువావర్గాన్ని" తీవ్రవిమర్శకు గురిచేస్తూ, కొమిన్‌ఫారం అధికారపత్రిక ఏప్రిల్ 1948లో వ్రాసింది. అంతేగాక, సి. పి. ఐ "హింసాయుత" ఎత్తుగడలను పరోక్షంగా ఖండించుతు, "ప్రజాస్వామ్య ఐక్య సంఘటన" ప్రాముఖ్యతను నొక్కిచెప్పింది.[1] అంటే అర్థం, విప్లవ పోరాటాలకు ముందు తగిన ప్రజా సంఘాల నిర్మాణం, వాటిని బలపరచుట, ప్రాథమిక నిర్మాణ, ఆచరణ కార్యక్రమాలను నిర్దేశించుటగా నెంచాలి.ఈ ఒక విధమైన హెచ్చరికల వైఖరి తదనంతర సోవియట్ రచనలలో మరింత స్పష్టమైంది. జూన్ వ్యాసంలో దయకోవ్, భారత పరిస్థితిని ప్రస్తావించుతు, రణదివెలాగ "విప్లవ వెల్లువ" పేర్కొనక "ప్రజలతీవ్ర అసంతృప్తి" ప్రభుత్వం యెడల పేర్కొన్నారు.[2] భారతదేశం, పాకిస్తాన్‌లు సామ్రాజ్యవాదపు సహకారులగుతున్నారని, ప్రజలకు దూరమగుతున్నారని మాత్రమే పేర్కొనుట గమనార్హము. అదే నెలలోనే యం. అలెగ్జీవ్ 'బోల్షివిక్' పత్రికలో సి. పి. ఐ., ప్రజాస్వామ్య సంఘటనను రూపొందించవలసిన ఆవశ్యకతను బలపరచారు."భారతదేశంలో వలసపాలనకు, శేషఫ్యూడలిజం, సంస్థానాల అంతానికి" సి పి ఐ వైఖరిని

1. పామీదత్తు, ఆర్. (1948) ఇండియా ఎక్కడ? లేబర్ మంత్లి జూన్, 1948. పే 161-70· కమ్యూనిజం ఇన్ ఇండియా ఓవర్‌స్ట్రీట్, మార్షల్‌లు పే 281లోని ఉదహరింపుల సమాచారము.
2. దయుకోవ్, ఎ(1948) భారతదేశస్థితి న్యూటైమ్స్ జూన్ 2, 1948 పే. 11-17; పై ఉదహరింపులోవలె 281 పే.

పునరుద్ఘాటించుతు, వ్యాసాన్ని ముగించారు.[1] ఇది భారత కమ్యూనిస్టు పార్టీలో పెట్టుబడిదారి విధాన వ్యతిరేక కార్యక్రమ ఆస్కారంలేదని స్పష్టం. రణదివె రాజకీయ సిద్ధాంతానికి సోవియట్ వ్యాసాలలో సమర్థనలేదు ప్రజాస్వామ్య, సోషలిస్టు విప్లవాలు రెండూ పరస్పరం పెనవేసుకొన్నవనే సిద్ధాంతం, యుగోస్లోవియానుండి దిగుమతి అయింది అలెగ్జీవ్ బడాబూర్జువా వర్గమే అభివృద్ధి నిరోధకమైనదని, అదే నెహ్రూ ప్రభుత్వంలో ఆధిక్యత వహించుచున్నదని, కార్మికులను, కర్షకులను, పెటీ బూర్జువా వర్గాన్ని ఐక్యపరచాలని సూచించారు. ఆసియా దేశాలలో అభ్యుదయకర వర్గాలలో మధ్యతరగతి బూర్జువావర్గాన్ని ఝకోవ్ యింతకుముందు పేర్కొన్నారు. అలెగ్జీవ్ తనను సమర్థించుకొనుటకు ఇండియాలో బూర్జువావర్గం "పెటీబూర్జువా విప్లవశాఖ, బడా బూర్జువా రాజీవాద శాఖలు"గ రెండుగా చీలిందనే స్టాలిన్ విశ్లేషణ వాఖ్యాలను ఉదహరించారు. అయితే స్టాలిన్ వ్యాఖ్యాలు 1925 లోనివి. అవి 1947లో వర్తించుటకు వుపయోగపడజాలవు. అంచేత అక్టోబరు 1948లో డయకోవ్ పుస్తకంలో "భారతదేశంలో జాతుల నిర్మాణ విశ్లేషణ్యవచ్చువరకు అందులో డయకోవ్ తన పూర్వ అభిప్రాయాలను మార్చుకొనుట అలెగ్జీవ్ అవగాహనలలోలేని అస్పష్టంగా వున్నవాటిని స్పష్టంచేయుటతో సోవియట్ వైఖరిలో స్పష్టత యేర్పడింది.

"డయకోవ్ పుస్తకం భారత దేశంలో "జాతుల సమస్యను" విశ్లేషణగావించి అధ్యయనం చేసింది. బ్రిటిషు ప్రభుత్వ విధానాలను, వివిధ పార్టీల రాజకీయ విధానాలను అధ్యయనంచేసి, భారత జాతీయోద్యమం బడా బూర్జువావర్గంచే నడుపబడుతున్నదని, అదే ఆధిక్యతను కలిగివున్నదని, వారు దేశమంతా వ్యాపించినవారు గాక పరిమిత ప్రాంతాలకు చెందిన "గుజరాతి, మార్వారీ" వ్యాపార వర్గాలను నిర్ధారణ చేసింది. అంతేగాక యీ వ్యాపారవర్గాలు భారత వ్యాపారం, మార్కెట్లుపై గుత్తాధికారాలను పొందుటకై బ్రిటిషు పెట్టుబడిదారివర్గాలతో రాజీపడి, కలసి యితరజాతుల అభివృద్ధిని నిరోధించుతు వ్యాపార ప్రత్యర్థివర్గాలు తలెత్తకుండా చేస్తున్నవని తెల్పుచున్నది. దీని అర్థం చివరి ప్రకరణంలో డయకోవ్ భారత ప్రభుత్వం గుజరాతి, మార్వారీ బడాబూర్జువావర్గం, ప్యూడలు రాజులు, భూస్వాములతో కలసి కూటమిగా "కార్మిక, కర్షక, పెటీబూర్జువాల విప్లవోద్యమాలను అణచివేయుటయేగాక, బలహీన మరాఠీ, బెంగాలీ, ఆంధ్రుల కేరళీయుల తదితర బూర్జువావర్గాలను వారి ప్రయోజనాలకు త్రోసిపుచ్చుట, అణచివేయుట చేస్తున్నదని వివరించింది. డయకోవ్ యీ సందర్భంలో ఈ సూత్రీకరణ వ్యూహాత్మక ప్రాముఖ్యతను వివరించకపోయినా ప్రభుత్వ వ్యతిరేక విప్లవ పోరాటాలలో భారత జాతీయ ప్రాంతాలలోని కొన్ని రాష్ట్రాలలోని ప్రాంతీయ బూర్జువా వర్గాలను సంఘటనల మిత్రులుగ నెంచవచ్చును. క్లుప్తంగా డయకోవ్, మరాఠీ, బెంగాలీ, తెలుగు, ప్రాంతీయ తదితర బూర్జువావర్గాలను భారత జాతీయ వ్యాపారంపై ఆధిక్యతను కొనసాగించే గుజరాతి మార్వారీ వ్యాపారవర్గాలపై పోరాడగలవని ప్రతిపాదించాడు.

---

1. అలెగ్జీవ్, యం (1949) విభజనానంతరం ఇండియన్ యూనియన్, పాకిస్తాన్, మాస్కో పే. 328.

"డయకోవ్ యీ విధమైన వ్యూహం, ఎత్తుగడలకు స్పష్టమైన కార్యక్రమాన్నికూడ యిచ్చాడు. మరాఠీ, బెంగాలీ "జాతీయోద్యమాలు" ఆయా బూర్జువా వర్గాలచే నాయకత్వంవహించబడుతున్నా అవి అభ్యుదయకరమైనవని భారత కమ్యూనిస్టులు ఆ మధ్య తరగతిభాషా వుద్యమాలతో యింతకుముందు కలసి పోరాడుతున్న విధంగానే పోరాడాలని విజ్ఞప్తిచేశారు[1] ఇది భారత కమ్యూనిస్టుపార్టీ పొలిట్ బ్యూరో మెంబరు అధికారి 1942 జాతుల స్వయనిర్ణయ సూత్రాన్ని భారత పరిస్థితులకు అన్వయించుతు చేసిన మౌలిక ప్రతిపాదనల కొన్నింటిని 1948లో సోవియట్ బలపరచుటగా నెంచవచ్చును. అయితే దేశ, విదేశ మార్క్సిస్టు అధ్యయన వాదులు పెక్కురు పాకిస్థాన్ విడిపోయే హక్కునుకూడ ఆమోదించుట పొరపాటు అని అందరు ఆమోదించుట గుర్తుంచుకొనాలి. ముఖ్యవిషయం గుజరాతి-మార్వారీ-బ్రిటిష్ గుత్త పెట్టుబడిదారి వర్గాలకు ప్రాంతీయ బలహీన బూర్జువావర్గాలకు మధ్యగల సహజ వైరుధ్యాన్ని, దానివ్యూహాత్మక ప్రాముఖ్యతను భారతకేంద్ర ప్రభుత్వంపై ప్రాంతీయ బూర్జువావర్గాలు జరిపే పోరాటాలలో ఆ వైరుధ్యాల అవగాహనలలోగల ఎత్తుగడల సౌలభ్యత, ప్రాముఖ్యతకు పార్టీ యివ్వవలసిన ప్రాముఖ్యత స్పష్టమగుతున్నది. డయకోవ్ విజ్ఞప్తిలోని ప్రాముఖ్యత యిది. దురదృష్టకరంగా 1942లోనే జాతుల సమస్యపై కొన్ని ప్రాధమిక అవగాహనలకు వచ్చిన పార్టీ దానిని వదలివేసి, అతివాద విప్లవ కార్యక్రమాన్ని చేబట్టింది.

ఝుకోవ్ 1949లో డయకోవ్ పుస్తకాన్ని బోల్షివిక్ పత్రికలో సమీక్షిస్తూ, సాధారణ ఆమోదాన్ని తెలిపాడు. గుజరాతీ మార్వారీ బడా బూర్జువావర్గం భారత ప్రభుత్వంలో, జాతీయ నాయకత్వంలో ఆధిక్యతవహిస్తున్నదని ప్రాంతీయ బలహీన బూర్జువావర్గం వ్యూహాత్మకంగా మిత్రులగుటకుగల అర్హతలను ఆమోదించి, పుస్తకం మెచ్చుకొనదగినదిగా ప్రశంసించారు. డయకోవ్ అధ్యయనంలోని ప్రధానమైన లోపం, భారత విప్లవంలో వ్యవసాయ పోరాటాల పాత్ర నిర్లక్ష్యం చేయుటను తీవ్రంగా విమర్శించాడు ఝుకోవ్. వర్గశత్రువులలో భూస్వాములను చేర్చనందుకు గర్హించి భారత రైతాంగం ఎంతో వెనుకబడివున్నా పోరాటాలవైపు వస్తున్నారన్నాడు. సోవియట్ పరిశీలకులు భారతదేశంలోని ప్రాంతీయ ప్రత్యేకతలు, వ్యవసాయ అసంతృప్తితో ప్రభావితులైనట్లు ఝుకోవ్ సమీక్షనుండి తెలుస్తున్నది.

సంగ్రహంగా సి.పి.ఐ. రెండవ కాంగ్రెసు తరువాత సోవియట్ వ్యాఖ్యలు పరస్పర విరుద్ధంగా వున్నవి. సంవత్సరం తరువాత భారత కమ్యూనిస్టు పంధాకు వ్యూహం, ఎత్తుగడలకు తమ వ్యతిరేకతను తెలియజేశారు అయితే రణదివె విధానాన్ని ఖండించి గర్హించలేరు. గతంలోనలె తప్పుడు పంధా అనుసరించిన వారిని ఇంటర్నేషనల్‌లో బహిష్కరించిన విధంగాచేయలేదు. సోవియట్ యూనియన్ రహస్యంగా తమ అభిప్రాయాలను తెలియజేసిన దాఖలా ప్రకటిత సాహిత్యంలో ఉన్నట్లు

1. ఓవర్‌స్ట్రీట్, మార్షల్ (1960) కమ్యూనిజం ఇన్ ఇండియా. పెరినియల్-ప్రెస్ బొంబాయి, పే. 282-3.

లేదు భారత కమ్యూనిస్టుపార్టీలో రణదివెకు వ్యతిరేకత అభివృద్ధి చెందినకొలది అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమము ఎట్టిచొరవ గైకొనలేదు సోవియట్ యూనియన్, భారత ప్రభుత్వం యెడల ఎట్టి అనుకూలతను కలిగియుండనందున రణదివె విప్లవ కార్యక్రమం యెంతవరకు పురోగమిస్తుందో వేచిచూస్తున్నట్లు కన్పడుతుంది.

## భారత కమ్యూనిస్టుపార్టీలో వ్యతిరేకత

కమ్యూనిస్టుపార్టీలో రణదివె విధానాలు నాయకత్వంపై వ్యతిరేకత పెరుగుతు వచ్చింది. ఈ వ్యతిరేకత ప్రథమంగా పార్టీ యంత్రాంగాన్ని నియంతృత్వ విధానాలు అనుసరించి మార్పులుచేయుట వలన కలిగింది. ప్రత్యేక పరిస్థితులవలన కేంద్ర కమిటీని, యితర కమిటీలను ప్రాతినిధులను యేర్పాటుచేయుట, అందుకు సూత్రాలను రూపొందించుటకు, పార్టీ నిర్మాణ సూత్రాలకు సవరణచేయుటకు, పార్టీ కాంగ్రెసులో అధికారాలను పొందుటజరిగింది నిర్మాణ సంబంధమైన యీ అధికారాలను క్రింది బెంగాల్ రాష్ట్రకమిటీని రద్దుచేయుటకు క్రమశిక్షణ పేరుతో పార్టీ నిబంధనలకు వ్యతిరేకంగా బహిష్కరించుట చేశారు. జోషీ యెడల అవలంభించిన విధానాలు, విధాన వ్యతిరేకులను "తొలగించివేయుట" సర్వసాధారణంగా అవలంభించుట జరిగింది. పార్టీనుండి సస్పెండు చేయుటయేగాక "కలకత్తానుండి బహిష్కరింపబడి, పార్టీతో సంబంధాలు త్రెంచివేయబడ్డాయి పార్టీ లైబ్రరీలోనికి అనుమతి నిరాకరించబడింది. పార్టీపనిని చేయనివ్వలేదు పార్టీసాహిత్యం సంప్రదించుటకు ద్వారాలు మూయబడినవి ఈ విధంగా వేరుచేయబడిన తరువాత పార్టీనుండి బహిష్కరించారు.

పార్టీ సెక్రటరీ అనుసరించిన నిర్మాణ విధానాల యెడల వ్యతిరేకతయేగాక, రాజకీయ విధాన వ్యతిరేకత ప్రత్యేకంగా రెండు రంగాలనుండి వచ్చింది బొంబాయి ట్రేడు యూనియన్ కాంగ్రెసు కార్మిక నాయకత్వం నుండి దక్షిణాది రైతాంగ పోరాట నాయకత్వాలనుండి వ్యతిరేకత నిర్దిష్టంగా వచ్చింది. అజయ్‌ఘోష్ అరెస్టు అనంతరం జైలునుండి అతని కథనం ప్రకారమే, ఆరుమాసాలలో విప్లవం అని వేసిన అంచెనా అత్యంత తీవ్ర అవాస్తవికతయని అనేక నిర్మాణ చర్యల అవసరం యెంతోవున్నదని, తాను 'ప్రోటెస్ట్'గా వ్రాశానని తన నోటులో తెలిపారు. దీనికి ప్రతిస్పందనగా రణదివె. అజయ్‌ఘోష్‌ను పార్టీ సంబంధాలనుండి వేరుచేసి, పార్టీ సభ్యులు అజయ్‌ని కలువరాదని నిషేదించారు. రైల్వే సమ్మె ఎత్తుగడలలో అతివాద పెడధోరణి స్పష్టమగుటతో 1949 ప్రారంభంలో అజయ్‌ఘోష్ జనరల్ సెక్రటరీని పెటీ బూర్జువా విప్లవ తత్వాన్ని అనుసరించుతున్నారని తీవ్రంగా విమర్శించుతు, ప్రొటెస్ట్ లేఖను వ్రాశారు. తన "విప్లవధోరణి"లోనే వున్నాడని రణదివెకు, అజయ్‌ఘోష్ మే 1949లో మరో లేఖలో పార్టీ ట్రేడుయూనియన్ రంగంలో ఎత్తుగడలు "మౌలికంగా తప్పు" అని వ్రాయగా రణదివె పార్టీ బహిష్కరణా ఆయుధాన్ని చూపి బెదిరించారు. కార్మికనాయకుడు డాంగే చివరకు రణదివె విధానాలను వ్యతిరేకించుటతో, సెక్రటరీ బహిష్కరణ ఆయుధాన్ని విసురుట డాంగే ప్రాశన్ వ్యతిరేకించి, బహిరంగంగా, పార్టీ సెక్రటరీ "ట్రాట్స్కీ విధానాలను" అనుసరించుతున్నా

డని కరపత్రాలు పంచుట జరిగింది. ట్రేడుయూనియన్ల సీనియర్ నాయకులు పరిస్థితుల పరిపక్వత చెందనపుడు దుడుకు ఎత్తుగడలు కార్మికోద్యమాన్ని నాశనంచేస్తాయని శెక్రటరీ విధానాలను వ్యతిరేకించారు.

ఆంధ్ర-తెలంగాణా పోరాట కమ్యూనిస్టు నాయకత్వం పార్టీ శెక్రటరీ రూపొందించిన వ్యూహాన్ని మౌలికంగా వ్యతిరేకించారు. పార్టీ 2వ కాంగ్రెసుకు ముందే హైదరాబాద్‌లోని తెలంగాణా రైతాంగ వుద్యమం, మామూలు పోరాట రూపాలను దాటి తీవ్ర ప్రతిఘటనా పోరాట రూపాలను చేబట్టింది గ్రామం తరువాత గ్రామంలో తిరుగుబాటులు జరుగుతున్నవి. వాటి రక్షణ సమస్య యెదురైంది. అందుకై ప్రజా రక్షణ దళాలు, వందలకొలది గ్రామ "సోవియట్లు" యేర్పడినవి. భూస్వాములను, జాగీర్దారులను, నిరంకుశ నిజాం ప్రభుత్వ ఉద్యోగులను గ్రామాలనుండి "వెలి"తో పారద్రోలి, వారిభూములను వాటి కౌలుదారులకు అన్యాయంగా గతంలో దౌర్జన్యంగా వెళ్ళగొట్టబడిన రైతులకు మిగులు భూములను బీదరైతులకు, వ్యవసాయ కూలీలకు పంచివేశారు. అత్యంత వేగంగా ప్రాంతీయ పూర్తిసైనిక గెరిల్లా దళాలను నిర్మించారు నల్లగొండ, వరంగల్ జిల్లాలలో ప్రజాజీవితం కమ్యూనిస్టుల ఆధ్వర్యంలోనికి వచ్చింది. మద్రాసురాష్ట్రంలోని ఆంధ్రప్రాంత కమ్యునిస్ట్ పార్టీ, హైదరాబాద్ సంస్థానంలోని తెలంగాణా కమ్యునిస్టుపార్టి రెండుగావున్నా ఆచరణలో ఒకటిగానే సమన్వయంతో పోరాటాన్ని సాగించాయి. ఆ విధమైన సహకార, సమన్వయం ఆంధ్ర, తెలంగాణా కమ్యూనిస్టుపార్టీల మధ్య 1948 ప్రారంభానికి ముందే యేర్పడి సంబంధాలు బలపడినవి. ఆంధ్ర. తెలంగాణా సంయుక్త గెరిల్లా దళాలు తెలంగాణా సరిహద్దు ఆంధ్రజిల్లాలో రైతాంగ వుద్యమాన్ని విస్తరించ ప్రయత్నించాయి. ఆర్థిక, రాజకీయ, సామాజిక పరిస్థితులు తెలంగాణా పరిస్థితులకు పూర్తి భిన్నంగా వుండుట వలన యాంత్రికంగా గెరిల్లాపోరాటాలను ఆంధ్రప్రాంతంలో విస్తరింపజేయు ప్రయత్నాలు పూర్తిగ విఫలత నెదుర్కొనక తప్పలేదు.

కమ్యునిస్టుపార్టీలో రణదివె పంధాని ప్రధానంగా వ్యతిరేకించింది. ఆంధ్ర ప్రాంత కమ్యూనిస్టు నాయకత్వమేకాని తెలంగాణా ప్రాంత కమ్యూనిస్టు నాయకత్వాలుకావు. ఈ వ్యతిరేకత వ్యవసాయ విప్లవ ప్రాతిపదికగా యేర్పడింది. వారి వాదనలలో చైనా అనుభవాలు సైద్ధాంతిక బలాన్ని చేకూర్చాయి. రణదివె తన సైద్ధాంతిక వాదనలకు బలాన్ని యుగో 'స్లోవియా', రష్యా గత అనుభవాలనుండి పొందుతుండగా ఆంధ్ర కమ్యూనిస్టు నాయకత్వం తన వాదనలకు బలాన్ని చైనా అనుభవాలు మావోరచనలనుండి సైద్ధాంతిక బలాన్ని చేకూర్చుకొంది. అంతేగాక ఆంధ్ర కమ్యూనిస్ట్ నాయకత్వపు స్వానుభవం ప్రధానంగా రైతాంగ వుద్యమ అనుభవ సంజాతమే. అదేవిధంగా రణదివే స్వానుభవం నగర కార్మిక వర్గసమ్మె పోరాటాల అనుభవ సంజాతమే. ఈ స్వానుభవాల వెలుపలనుండి పొందిన అనుభవం గ్రంథపఠనాలనుండి సంక్రమించిన అనుభవం. విశాల భారత పరిస్థితుల అధ్యయన సంజాత అనుభవం అత్యల్పము.

ప్రభుత్వ నిర్బంధ విధానంతో 1948 మధ్యకు ఆంధ్ర కమ్యూనిస్ట్ పార్టీ నిర్మాణం చాల దెబ్బతిన్నది. ఆంధ్రరాష్ట్ర కమ్యూనిస్టు కమిటి అరెస్టులతో చిన్నా భిన్నమైంది. సెక్రటేరియట్ మాత్రం సమర్థవంతంగా పనిచేస్తున్నది. అయినా 2వ పార్టీ కాంగ్రెసు జరిగిన కొద్ది మాసాలకే జూన్ 1948లో ఆంధ్రలేఖలో మావో "నూతన ప్రజాస్వామ్యం", "గెరిల్లా పోరాటాలు - భూసమస్యలపై సాయుధ రైతాంగ పోరాటాలు" యీ పోరాటాలలో మధ్య తరగతి రైతు గట్టి మిత్రుడని, ధనిక రైతు ముఖ్యంగా ఎట్టి భూస్వామ్యడలుతోకలువలేని రైతును తటస్థంగా చేయ వచ్చని భూస్వామ్యడలిజం బలంగా వున్న తెలంగాణా, రాయలసీమ ప్రాంతాలలోని ధనిక రైతులు వూగిసలాటలు వున్నా పోరాటంలో కలసివచ్చే అవకాశాలున్నవని లేఖలో సెక్రటేరియట్ స్పష్టంగా పేర్కొంది,

ఆంధ్రా సెక్రటేరియట్ తన లేఖలో చారిత్రక రష్యన్ విప్లవానికి మన విప్లవానికి అనేక అంశాలలో తేడా వుంది. చాలవరకు చైనా విప్లవాన్ని పోలివుంది. బహుశా మన పంథా, దృక్పథం సార్వజనీన సమ్మె, సాధారణ తిరుగుబాటు తద్వారా గ్రామసీమల విముక్తికాదు. జీవన్మరణ ప్రతిఘటన, దీర్ఘకాల అంతర్యుద్ధం ప్రధానంగా వ్యవసాయ విప్లవమార్గంలో చివరకు రాజ్యాధికారాన్ని ప్రజాస్వామ్య సంఘటన హస్తగతం చేసుకొనుటగా సంగ్రహంగా వివరించింది.

పి. సి. జోషి, రణదివె, ఆంధ్ర దృక్పథాలపై 1951లో వ్యాఖ్యానించుతూ, రష్యన్ నమూనాకు రణదివె తలయొగ్గి విశ్వాసముంచితె ఆంధ్రా కమ్యూనిస్టులు అదే విధంగా చైనానమూనాకు తలవంచి విశ్వాసం ప్రకటించారని వ్యాఖ్యానించారు. ఇంకా "మన సాంప్రదాయ మేధావి వర్గ"పు ఆలోచనా విధానంలో కుల, బ్రాహ్మణ ఆధిక్యత భూస్వామ్యడలు సమాజంలో దివాళాకోరు అననిందల తత్వాలనుండి గ్రుడ్డిగా వ్యక్తి ఆదర్శ పూజా తత్వంనైపు పయనించుట సమంజసమే" అని వాఖ్యానించారు

ఇంటిమూలో జాతుల స్వయం నిర్ణయ సూత్రాన్ని భారత కమ్యూనిస్ట్పార్టీ ప్రబోధించుటకు మరే భాషా ప్రాంతంలోకన్నా తెలుగు బాషా ప్రాంతాలతో అత్యధిక స్పందన లభించింది. ప్రధానంగా భాషాసమస్య, భూ సమస్య అనగా జాతీయ, ఆర్థిక జీవన సమస్యల ఎత్తుగడల ననుసరించి, వ్యూహం ఆచరణ కనుగుణంగా ఆంధ్ర బూర్జువావర్గానికి కమ్యూనిస్టు పార్టీ, నగర గ్రామీణ ప్రాంతాలలో విజ్ఞప్తి చేయగలిగింది. తగిన స్పందన లభించింది. అందుచేతనే ఆంధ్ర కమ్యూనిస్టులు తమ కార్యక్రమంలో జాతుల స్వయంనిర్ణయ సూత్రాన్ని ప్రధానాంశంగా చేబట్టారు. ఆంధ్ర కమ్యూనిస్టుల కార్యక్రమంలో భారత కమ్యూనిస్టుపార్టీ జాతుల స్వయం నిర్ణయ సూత్రాన్ని, విధానాన్ని మావోయిస్టు సామ్రాజ్యవాద వ్యతిరేక, భూస్వామ్యడలు వ్యతిరేక వ్యవసాయ విప్లవ పోరాటాల వ్యూహాన్ని ఎత్తుగడలను సంలీనం చేస్తుంది. ఇదే సారాంశము.

బెంగాల్ రాష్ట్ర పార్టీ కార్యవర్గం యుద్ధానంతర కార్మికవర్గ పోరాటాల వెల్లువ తగ్గుముఖం పట్టిందని, ట్రేడు యూనియన్ తీర్మానాన్ని పేర్కొంటూ లేవ

నెత్తిన ప్రశ్నను "ఆర్థిక విశ్లేషణ, సంక్షోభం" మరచిపోయారని త్రోసివేసింది. వీటిని విచారించవలసిన అంశాలుగ కూడ పరిగణించలేదు.

## ఆంధ్ర శెక్రటేరియట్ లేవనెత్తిన ప్రశ్నలకు రణదివె జవాబు

పార్టీలో ట్రేడుయూనియన్ వర్గాల నూతనపార్టీ విధానంపై వచ్చిన వ్యతిరేకతను పార్టీ నిర్మాణసూత్రాలను అతిక్రమించిన శెక్రటరి ఆంధ్ర శెక్రటేరియట్ లేవనెత్తిన మౌలికాంశాలను అంతతేలికగా తోసిబుచ్చ జాలకపోయారు. తప్పనిసరిగా వాటిని అధ్యయనం చేయవలసివచ్చింది. పార్టీ సిద్ధాంత పత్రిక "కమ్యూనిస్టులో నాలుగు వ్యాసాలు జనవరి, ఫిబ్రవరి, జూన్ జూలై 1940లో ప్రకటించారు.

మొదటి వ్యాసంలో "జనతా ప్రజాస్వామ్యం" తాను రూపొందించిన దానిని వ్యూహాన్ని పునరుద్ఘాటించారు. భారత ఆర్థిక పరిస్థితి పెట్టుబడిదారి విధానాభివృద్ధిలో ఉన్నత స్థానానికి చేరినందున సోషలిస్టు విప్లవదశకు పురోగమించవలసిన కాలం వచ్చిందనే అవగాహనతో నిండివుంది. దీనర్థం ప్రజాస్వామ్య విప్లవం పూర్తి అయినదని, సామ్రాజ్యవాదం దేశంలో అంతరించి పోయిందని, బూర్జువా వర్గం అధికారం స్వీకరించిందని చెప్పాలి. అంచేత పెట్టుబడిదారి బూర్జువావర్గం ప్రధాన శత్రువు, కావున అధికారం సోషలిస్టు శక్తులకు మార్పిడి జరిగినప్పుడు బూర్జువా వ్యతిరేక వ్యూహంలో వెన్వెంటనే సోషలిస్టు విప్లవపోరాటం ప్రారంభమగుతుందని రణదివె అవగాహనగా కన్పడుతున్నది. అంతేగాక "నిరవధిక విప్లవం" అనే సాంప్రదాయ విషయాన్నే తాను పునరుద్ఘాటించుచున్నానని చెపుతు లెనిన్, స్టాలిన్‌లనుండి వుదహరించుట చేశారు[1].

మరోపత్రంలో రణదివె గ్రామసీమలలో అనుసరించవలసిన వ్యూహాన్నీ, వివిధ సమస్యలలో చేపట్టుటవలనసి ఎత్తుగడలను, తన సిద్ధాంత స్ఫూర్తితో రూపొందించారు. గ్రామసీమలలో పెట్టుబడిదారి విధానాభివృద్ధి ఉన్నత దశల చేరిందనే మౌలిక అవగాహనతో గ్రామీణప్రాంతాలలో బూర్జువా వర్గంపై పోరాటాలకు దాడులకు పిలుపునిచ్చారు. గ్రామీణ ప్రాంతాలలో బూర్జువా అంటె ధనికరైతులు, మధ్యతరగతిరైతు అనగా పెటీబూర్జువావర్గాలు మాత్రమే సామాజిక విప్లవంలో మిత్రులు అని స్పష్టం చేశారు ఈ ప్రతిపాదనల నుంచి లభించే నిర్ధారణ సామ్రాజ్యవాదం, భూస్వామ్య శక్తులు భారతదేశంలో అదృశ్యమయ్యాయని, వారిపై పోరాటం అప్రస్తుతమగుతుంది.[2]

నూతన రాజకీయ విధానానికి యూరోపియన్ అనుభవాలతో బలాన్ని చేకూర్చుకొనుటకు, సనాతన కొమిటాంగు ప్రకటనను ఉదహరించాడు. "జనతా ప్రజా

1. రణదివె, బి. టి. (1949) ఆన్ పీపుల్సు డెమోక్రసీ, బొంబాయి, కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ ఇండియా. 1949. పే. 12.
2. భారతదేశంలో వ్యవసాయ సమస్య (ఆంగ్లంలో) కమ్యూనిస్టు, జనవరి, 1949 పే. 18-53.

స్వామ్యంపై" 1947 పూర్వంగల అభిప్రాయాలను, అవగాహనలను ప్రాతిపదికగా జేసుకొని అనేః యితర లోపాలను కలగాపులగంచేసి "సంస్కరణవాదం[1]" అనే చక్రాంకితాలు తగిలించి విమర్శించారు. ఈ అవకాశాన్ని తీసుకొని సోవియట్ నాయకులవలె యుగోస్లోవియా కమ్యూనిస్టు పార్టీకి సంస్కరణవాద అభిప్రాయాలను అంటగట్టి వాస్తవానికి 1947లో యుగోస్లోవియా అట్టి అభిప్రాయాలకు ప్రధాన వ్యతిరేకంగా వుంది అయినా విమర్శించారు.

"జనతా ప్రజాస్వామ్యం"కై పోరాటం అనే పత్రంలో రణదివె తన పంథాలోని అన్ని ప్రధానాంశాలపై తన తీవ్రవాద వైఖరిని స్పష్టంచేశారు.[2] "రష్యా విప్లవ అనుభవం పూర్తిగ భారతదేశానికి వర్తిస్తుందని, రష్యన్ చరిత్ర ఇండియాకు నమూనాను సూచిస్తున్నదని ప్రకటించారు. తన పంథాను' వ్యూహాన్నిసమీక్షిస్తూ "వ్యూడలు సామ్రాజ్యవాద-బూర్జువా కూటమిలో బూర్జువావర్గం ప్రధానపాత్ర వహించుచున్నందున ప్రధాన శత్రువని" పునరుద్ఘాటించారు. అదే వ్యాసంలో తిరోగమించి, భారత బూర్జువా ప్రభుత్వం "సామ్రాజ్యవాదంతో ముడివేసుకొని వుంచని" ఆధారిత సంబంధాలను కలిగివుందని, అంచేత సామ్రాజ్యవాదం ప్రధాన శత్రువని కూడ అన్నారు. అయినా వ్యాసమంతా "ఫాశిస్టు భయోత్పాధం" "విప్లవ వెల్లువ", "విస్తృత ప్రజా పోరాటాలు", "చిన్నసైజు అంతర్యుద్ధాలు"వంటి తీవ్ర పదజాలధోరణిలో నడచింది

ఈ వ్యాసంలో రణదివె ప్రధానంగా ఆంధ్ర శెక్రటేరియట్ దృక్పథాన్ని దానినుండి అనేక వాక్యాలను ఉదహరించుతు నాలుగు వర్గాల ఆంధ్ర వ్యూహాన్ని, గ్రామీణ బూర్జువావర్గాన్నికూడ నాలుగు పోరాట వర్గాలలో చేర్చి వ్యవసాయ విప్లవాన్ని కొనసాగించుట నిజమైన నగ్నసంస్కరణ వాదము, సిగ్గువిడిచిన వర్గసహకార విధాన"మని తీవ్రపదజాలంతో పోరాటాన్నిసాగిస్తున్న నాయకత్వాన్ని విమర్శించారు ధనికరైతు శత్రువని పునరుద్ఘాటించారు. ఆంధ్ర నాయకత్వం ప్రధానంగా "గ్రామీణ మేధావి ముతాలని, ధనిక, మధ్యతరగతి వర్గాల నుండి తాము వచ్చినందున శత్రువును గుర్తించుటలో విఫలులయ్యారని" వివరణకూడ యిచ్చారు. పాఠకులకు సందేహం రాకుండా రణదివె మాసియంగ్‌పై దాడిచేసి, తన వైఖరిని స్పష్టం చేశారు. అవి (మావో సూత్రీకరణలు) ప్రపంచ కమ్యూనిస్టుపార్టీల అవగాహనలకు విరుద్ధంగా వున్నందున యేకమ్యూనిస్టు పార్టీ అంగీకరించజాలదని రణదివె వ్యాఖ్యానించారు. అంతేగాక ఆంధ్ర శెక్రటేరియట్ మావో రచనల నుండి చేసిన ఉదహరింపులు "తప్పుడుగా", "అభివృద్ధి నిరోధకంగా", "విప్లవ ప్రతీఘాతకంగా", "భయోద్పాదంగా" వున్నవని వాఖ్యానించారు. రణదివె యీ వ్యాఖ్యలు చైనా మహత్తర విజయాలను సాధించుచున్నప్పుడు చేయుట ప్రత్యేకంగా పరిగణించవలసి వుంటుంది.

---

1. సంస్కరణవాదంపై నేటి పోరాటం (ఆంగ్లంలో) కమ్యూనిజం, ఫిబ్రవరి, 1949 పే. 53-60.

2. జనతా ప్రజాస్వామ్యంకై పోరాటం(ఆంగ్లంలో) కమ్యూనిజం, ఫిబ్రవరి 1949 పే. 24.

ఆంధ్ర కమ్యూనిస్ట్ సెక్రటేరియట్ లేఖపై అందులో ముఖ్యంగా కేంద్ర, రాష్ట్ర కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాలు రహస్యంగానో లేక జైలులోనో వున్నపుడు బహిరంగంగా ప్రచురించబడుతున్న కమ్యూనిస్టు పత్రికలో రణదివె దాడిచేయవలసిన అవసరం ఎందుకు వచ్చేందో తెలియకుంది. ఆంధ్ర కమ్యూనిస్ట్ లేఖ బహిరంగలేఖ కాదు. బహుశా పార్టీ నిర్మాణ యంత్రాంగమంతా ఎంతో ఘోరంగా చిన్నాభిన్నమై పార్టీ రహస్య సర్క్యులర్స్‌ను అచ్చువేసి, పంపిణీ చేయగల సామర్థ్యంలేదని చెప్పు కొనవలసివుంటుంది. లేదా ఆంధ్ర పార్టీ లేఖపై విమర్శన అనేపేరుతో వ్యూహాన్ని ఎత్తుగడలను దేశ విదేశ వర్గాలందరికి తెలియజేయ గలందులకైనా కావాలి, లేదా పార్టీశాఖలు అధికారవ్యూహం, ఎత్తుగడలుగాక, మార్పులు, చేర్పులు సెన్సారులుచేసి పంపిణీ చేయగల ప్రమాదం, పార్టీ, పార్టీయేతర, అధికార, అనధికార ప్రభుత్వ రహస్యశాఖ, కమ్యునిస్టు వ్యతిరేకులు చేయగల అవకాశం లేకుండా చేయగలందుల కని యెంచవలసివుంటుంది. అయితే ప్రభుత్వం "కమ్యునిస్టు" పత్రికలో "వ్యూహాన్ని ఎత్తుగడల"ను అచ్చువేసి పంపిణిచేయగల అవకాశాలను ఎందుకు సహించి వూరు కొన్నది? ప్రభుత్వం అవి ప్రకటించబడిచే అవి అందరకు తెలిస్తే ప్రజలలో కమ్యూనిస్టులకుగల సుహృద్భావం క్షీణించిపోతుందనే అంచెనా కావచ్చు. లేదా అవి సర్క్యులేటు బహుళంగా జరిగితే పార్టీలో అంతర్గతపోరాటం తీవ్రమై, నిర్వీర్యమై పోతుం దని ప్రభుత్వ రహస్య శాఖయిచ్చిన నివేదికవలనైనా కావచ్చు. పార్టీ క్రింది వర్గాలలో పెద్ద గందరగోళాన్నే కలుగుచేసిందనేందుకు ఎక్కువ అవకాశముంది.

రణదివె పార్టీ తిరుగుబాటు ఎత్తుగడలు విఫలమగుట స్పష్టమైన కొలది సాయుధ పోరాటాలకు పిలుపులనిచ్చుట మరింత యెక్కువైంది. రణదివె పరిస్థితుల అభివృద్ధికి సంతృప్తిచెందినట్లు కన్పించుతుంది. విప్లవ పోరాటాల వెల్లువను ప్రభుత్వము విప్లవ ప్రతీఘాతక చర్యలకు వొడిగట్టుట సూచించుచున్నదని అణచివేయుటకు ఫాశిస్టు పద్ధతులను అనుసరించుట ప్రభుత్వ బలహీనతను తెలియజేస్తున్నదనే మార్గంలో అనుసరించుతున్న విధానం సమర్ధించుకొనుట సాగింది. విప్లవ పోరాటాల వెల్లువకు తెలంగాణా వుద్యమంవైపు తన దృష్టిని సారించక తప్పలేదు. విప్లవ వెల్లువను చూపుటకు తెలంగాణాను ఉదహరించ తప్పలేదు. అయితే అదే కాలంలో బహిరంగ విమర్శకు పూనుకొనుట ద్వారా తెలంగాణా పోరాట నాయకత్వ వర్గాల అభిమానాన్ని పూర్తిగకోల్పోయాడు. కమ్యూనిస్టు పేపరులో "జనతా ప్రజాస్వామ్య విప్లవంలో తెలంగాణా పురోగమిస్తున్న విప్లవవెల్లువ ప్రవాహంగా ప్రకటించారు.

తెలంగాణా రైతాంగ వుద్యమం, నూతన రాజకీయ సైద్ధాంతిక అవగాహన లతో 1948 ప్రారంభంలో అనిశ్చిత పరిస్థితులలో పడింది. ఉద్యమం 1946, 47 లలో సాంప్రదాయ స్థానిక ప్రజాశత్రువులైన భూస్వామ్య నిరంకుశ శక్తులపై కేంద్రీకరించుటతో విస్తృత రైతాంగ, తదితర ప్రజలందరు పాల్గొనుటతో బలోపేతమైన వుద్యమంగా అభివృద్ధి చెంది,సంస్థాన భూస్వాములు సైన్యాలకు, పోలీసులకు, రజకార్లకు వ్యతిరేకంగా పోరాడి 2000 గ్రామాలను విముక్తిచేసి, 10 లక్షల యకరాల భూమిని రైతులకు, వ్యవసాయ కూలీలకు, యితర గ్రామీణ బడుగువర్గాలకు పంచగలిగిన

శక్తివంతమైంది. నూతన రాజకీయ విధానంతో కమ్యూనిస్టు పార్టీ, జాతీయ ప్రభుత్వ వ్యతిరేక పోరాటంపై కేంద్రీకరించుటతో నూతన వర్గ సంఘటనా అన్వేషణా ప్రయత్నం అవసరమైంది కమ్యూనిస్టుల నిజాం వ్యతిరేక పోరాటంలో కొంత సడలింపు, కేంద్ర ప్రభుత్వంతో పోరాడుట, నిజాంతో పోరాడుట, అంటే ఒకేసారి యిద్దరితో పోరాడుట వ్యూహం ఎత్తుగడలరీత్యా అపజయాన్ని వరించుటయే అగుతుంది. ఇంతే గాక, హైదరాబాద్ సంస్థానాధిపతి నిజాం స్వాతంత్ర్యాన్ని ప్రకటించి, తన అదృష్టాన్ని పరీక్షించదలచుకొన్నాడు. తెలంగాణా వుద్యమ నాయకత్వం, ఏ శత్రువును, యే యే వర్గాల సంఘటనలో పోరాడాలో ఎత్తుగడలను నిర్ణయించవలసిన పరిస్థితి, తక్షణ సమస్య అయింది. రెండవ కాంగ్రెసు, తదనంతర పత్రాలు యిచ్చిన అవగాహన, పెట్టుబడిదారి వ్యతిరేక పోరాటం, అందుకు కార్మిక కర్షక, పెటీ బూరువాల ఐక్యసంఘటన యేర్పరచుట. తాత్కాలిక ఎత్తుగడల సౌలభ్యంరీత్యా నైజాం నిరంకుశ ప్రభుత్వంపై పోరాటాన్ని సడలించుట. హైదరాబాద్ సంస్థానాన్ని ఇండియన్‌లో కలుపుటను వ్యతిరేకించుతు ప్రకటించారు. అదే కాలంలో కమ్యూనిస్టు పార్టీపై ఉన్న నిషేధాన్ని నిజాం ప్రభుత్వం తొలగించింది. ఇంతలో సెప్టెంబరు 1948, భారత సైన్యం హైదరాబాద్ సంస్థానంలో ప్రవేశించింది కమ్యూనిస్ట్ పార్టీ "స్వతంత్ర హైదరాబాద్" నినాదాన్ని యిచ్చింది. ఈ నినాదం గతంలో "నిజాం రజకార్ల నినాదమైనందున "భారత బూర్జువావర్గం కమ్యూనిస్టుపార్టీపై చేయుదాడికి బలం చేకూరింది. నైజాం సంస్థానం నాలుగు రోజులలో పాదాక్రాంతమైంది. కమ్యూనిస్టులు గెరిల్లా యెత్తుగడలతో సాయుధ ప్రతిఘటన సాగించారు భారత సైన్యాల దాడులకు కమ్యూనిస్టులు అనేకులు చనిపోయారు, మిగిలినవారు చిన్న చిన్న దళాలుగ చిక్కని అడవులలోనికి రక్షణకై నిష్క్రమించారు. ఇదీ 1949 ప్రారంభం నాటి పరిస్థితి.

నిజాంసంస్థాన సరిహద్దు ఆంధ్రప్రాంతంలోని బలమైన కమ్యూనిస్టు ఉద్యమం, తెలంగాణా సాయుధ పోరాటాన్ని తీరప్రాంతజిల్లాలకు విస్తరింపజేయు ప్రయత్నాల ఫలితంగా ఉద్యమాభివృద్ధి జరుగకపోగ తీవ్ర నిర్బంధ, హింసాకాండలకు, మలబార్ పోలీసుల పైశాచిక హింసలకుగురై వుద్యమం కకావికలైంది. "ప్రజలు మాతో కలసిరాలేదని" ఆంధ్ర కమ్యూనిస్టు నాయకులే తరువాత అంగీకరించారు. "గాలిలో పోరాటమైందని అన్నారు. ప్రజలను పోరాటాలలోనికి ఆకర్షించి సమీకరించాలనే చర్యలు వ్యక్తిగత హింసావాదంగా పరిణామమొందింది ప్రజలనుండి కమ్యూనిస్ట్‌లు మరింత దూరమయ్యారు. ప్రభుత్వ పోలీసు హింసాకాండ పెచ్చుపెరిగిపోయింది. "రాష్ట్రంలో ఒక్కపోరాటంగాని, సమ్మెగాని జరుగలేదు," అని నాయకత్వం ఆమోదించక తప్పలేదు ఆంధ్ర ప్రాంతంలో అనేక పార్టీ బలమైన కేంద్రాలలో గూడ చిన్నాభిన్నమై, నిస్సహాయ,నిర్వీర్యమై పోలీసు నిర్బంధకాండలకు ఎట్టి ప్రతిఘటనను సమీకరించజాలక పోయింది కాల్పులు, అరెస్టులు, హింసా దమన కాండలకు ఎట్టి ప్రాథమిక అసమ్మతినికూడ ప్రకటించలేని శక్తిహీనతతో నిర్వీర్యమైంది.

## చైనా సిద్ధాంతాలను సోవియట్ యూనియన్ గుర్తించుట :

మావో సిద్ధాంతాల యెడల సోవియట్ నాయకత్వానికిగల పరిమిత సంకోశాలు, రణదివె మావో అవగాహనలను, సిద్ధాంతాలను నేరుగా, బహిరంగంగా విమర్శించుట, అదే కాలంలో సోవియట్ అధికార నాయకత్వం, చైనా నమూనా విప్లవాలకు ఆమోదం తెల్పుట జరిగింది. జూన్ 1949లో జరిగిన సోవియట్ శాస్త్రవేత్తల సమావేశానికి అధ్యక్షత వహించిన ఇ ఝకోవ్ అధ్వర్యంలో, లెనిన్ రూపొందించిన సామ్రాజ్యవాద వ్యతిరేక వ్యూహంలో పేర్కొనిన "జనతా ప్రజాస్వామ్యం", నేడు ఆసియాలో మావో "నూతన ప్రజాస్వామ్యం" సిద్ధాంతాలకు పరస్పర వైరుధ్యం లేదని వివరించబడింది.

ప్రారంభోపన్యాసంలో ఝకోవ్ తూర్పు యూరోపియన్, చైనీస్ సిద్ధాంతాలకు గల సారూప్యతలను నొక్కిచెప్పాడు సాధారణ అభివృద్ధి సూత్రాలు ఒకే విధంగానే వున్నవని, అయితే వాటి స్థాయి. వేగోధృతిలో మాత్రమే భేదము కలిగి, తూర్పు యూరపులోని జనతా ప్రజాస్వామ్య లక్షణాలు, చైనా జనతా ప్రజాస్వామ్య లక్షణాల మధ్య మౌలికభేదాలు లేవన్నారు. చైనా ప్రభుత్వ కార్యక్రమం చైనా జాతీయ పరిస్థితిలో జనతా ప్రజాస్వామ్యం విజయానికి మార్గంగా వున్నదని వివరించారు. "వలస, అర్థవలసలలో జనతా ప్రజాస్వామ్యం కొరకై జరిపే పోరాటంలో కార్మిక, కర్షక, పెటీ బూర్జువాలు, మేధావివర్గాలు మాత్రమేగాక, పీకలుకోసే విదేశీ పోటీ, సామ్రాజ్యవాద పాదాలక్రింద అణగత్రొక్కబడుటనుండి తమ్ముతాము రక్షించుకొనగోరే మధ్యతరగతి బూర్జువాలలోని కొన్ని వర్గాలనుకూడ ఐక్యసంఘటనలో సమీకరించబడాలని" ఆసియాలో వ్యూహాన్ని ఝకోవ్ నిర్వచించారు.

ఆసియాలోని దేశాలు ఆర్థిక, సాంస్కృతిక, అభివృద్ధి స్థాయిలో తూర్పు యూరపు దేశాలకంటె తక్కువగా వున్నందున, ఆసియాలో విప్లవం ఆరంభంలో సామ్రాజ్యవాద వ్యతిరేకంగా కాని పెట్టుబడిదారి వ్యతిరేకంగా వుండదని ఝకోవ్ స్పష్టం చేసారు. ఈ సూత్రపరిధిలో ఇండియా ఉందనేది స్పష్టం; ఝకోవ్ "కొన్ని దేశాలలోనే వర్తించుతుందని స్పష్టం చేయకపోగా, ఆసియాలో యితర దేశాలలో వలెనె భారతదేశంలో బడా బూర్జువావర్గం శత్రువర్గంలో చేర్చబడింది. ఎత్తుగడలకు సంబంధించినంతవరకు, ఝకోవ్ అన్ని రకాల తీవ్రపోరాట రూపాలను ముఖ్యంగా అన్ని నైరృతి ఆసియా దేశాలలో ఆమోదించినట్లు కన్పడుతున్నది. "అనేక వలస, ఆధారిత దేశాలలోని సాయుధ విప్లవ పోరాటాలను" శ్లాఘించుతు, "భారతదేశంలోని రైతాంగ తిరుగుబాటులతో"పాటు ఇండోనేషియా, ఇండోచైనా, మలయా, బర్మా, చైనాలలోని తిరుగుబాటులను ప్రత్యేకంగా పేర్కొన్నారు. అంతేగాక, "ఈ పోరాటాలు, జాతీయవిముక్తి వుద్యమం "నూతన అత్యున్నదశ"లో ప్రవేశించుదనుటకు సాక్ష్యాలు" అన్నారు ఝకోవ్.[1]

---

1. ఝకోవ్, ఇ. (1949) ప్రోబ్లంమ్స్ ఆఫ్ నేషనల్ అండ్ కలోనియల్ స్ట్రగుల్ ఆఫ్టర్ సెకండు వరల్డ్ వార్. రిప్రింటెడ్ ఇన్ "కలొనియల్ పీపిల్సు స్ట్రగుల్ ఫర్ లిబరేషన్ పి. పి. హెచ్. (1950) పే. 1-11.

సమావేశంలో ప్రధానమైన నివేదికను సమర్పిస్తూ, బలబుషేలిన్, చైనా వ్యూహం, ఎత్తుగడలు, భారతదేశానికి ఎలా వర్తించునో వివరించారు.[1] విప్లవంలో మధ్యతరగతి బూర్జువాలలోని కొన్ని వర్గాలను తాత్కాలిక తోటి ప్రయాణీకులుగ యెంచాలని; విదేశీ పెట్టుబడిదారివర్గాలు యే దేశీయ పెట్టుబడిదారి వర్గాల ప్రయోజనాలను దెబ్బతీస్తున్నవో ఆ వర్గాలను, ఇండియాలో బాగా వెనుకబడిన జాతులలోని స్థానిక బూర్జువాలను గుర్తించాలన్నారు. అంతేగాక తెలంగాణాలో సాయుధ పోరాటాన్ని ఝుకోవ్‌లాగానే ప్రస్తుతించారు. తెలంగాణా ఉద్యమాన్ని "భారతదేశంలో జనతా ప్రజాస్వామ్యం రూపొందించే ప్రథమ ప్రయత్నంగా" పొగిడారు. అంతేగాక "విముక్తి ఉద్యమంలో ప్రధానాంశమైన వ్యవసాయ విప్లవానికి మైతాళికుడుగా" పేర్కొన్నారు భారత కమ్యూనిస్టులు యీ పంథానే అనుసరించవలసి ఉంటుందని స్పష్టం చేసారు ఆ విధంగా ఆంధ్ర కమ్యూనిస్టు కార్యవర్గం, మావో సిద్ధాంతాలను" ప్రాంతీయ తత్వాలకు ప్రత్యేక ప్రాధాన్యతనిచ్చుట దీనినే స్పష్టం చేస్తున్నది.

నూతన భారత సోవియట్ అవగాహన వెంటనే ప్రచురించబడింది, నవంబరులో ఆసియా ట్రేడు యూనియన్ కాన్ఫరెన్సు పెకింగులో జరిగినపుడు ప్రతినిధులందరికి అంద చేయబడింది ప్రారంభోపన్యాసంలో పీషాచీ, చైనా విప్లవ పంథాను ప్రవేశపెట్టి వలసలలో, సెమివలసలలో, జాతీయ విముక్తికి, జనతా ప్రజాస్వామ్యం కొరకు అనుసరించవలసి వుంటుందని నొక్కిచెప్పారు. పంథాను క్లుప్తంగా చెప్పుతూ, నాలుగువర్గాల వ్యూహంపై ఆధారపడి ఉందని, సాయుధపోరాటం అందులో భాగమని, ఎక్కడ, ఎప్పుడు అనుకూల పరిస్థితులలో జరుగుతుందని, అదే పోరాట ప్రధాన రూపంగా అనేక ఆసియాదేశాలలో ఉంటుందన్నారు. అంతేగాక, పీషాచీ వియత్నాం, బర్మా, ఇండోనేషియా, మలయా, ఫిలిఫ్ఫైన్సులలో అంతర్యుద్ధముగా కొనసాగుతుందని, పార్టీలు సరైన పంథా ననుసరించుతున్నవన్నారు. మరో చోట "ఇండియాలోకూడ విముక్తికొరకు సాయుధపోరాటం ప్రారంభమైందన్నారు. ఆమోదించబడిన మానిఫెస్టోలో సాయుదపోరాట ఆవశ్యకత నొక్కి చెప్పబడగా, ఇండియా పేర్కొనబడలేదు. అయితే అంతకుముందే దయకోవ్ బలబుషేవిఖ్‌లు, రైతాంగ సాయుధ తిరుగుబాటులు భారత విప్లవంలో అత్యంత ప్రముఖ అంశము లక్షణమని జెప్పారు. భారత కమ్యూనిస్టు పార్టీ పరిస్థితులు అనుకూలించినపుడు, సాయుధ వ్యవసాయ విప్లవాన్ని కొనసాగించుటను ఆమోదించుట స్పష్టం చేసి వున్నారు. పీషాచీ చట్టబద్ధ పోరాటాలను, విప్లవ పోరాటాల ఎత్తుగడలతో సంఘటిత పరచాలని ముగింపు వ్యాఖ్యలలో చెప్పాడు. ప్రతినిధివర్గాలు వివిధ దేశాల గ్రూపులుగ సమావేశమై తమ తమ ఎత్తుగడల పంథాలను రూపొందించుకొన్నారు. భారతదేశ ప్రతినిధివర్గం హాజరుకానందున, భారత కమ్యూనిస్ట్ పార్టీ ఎత్తుగడల పంథా వివరంగా రూపొందించబడలేదు

---

1. ఝుకోవ్, ఇ. (1949) ప్రోబ్లంమ్స్ ఆఫ్ నేషనల్ అండ్ కలోనియల్ స్ట్రగుల్ ఆఫ్టర్ సెకండు వరల్డ్ వార్, రిప్రింటెడ్ ఇన్ కలోనియల్ పీపిల్సు స్ట్రగుల్ ఫర్ లిబరేషన్ పి.పి.హెచ్ (1950) పే. 32-59.

కొమిన్‌ఫారం పత్రిక "ఫర్ ఎలాస్టింగ్‌పీస్...." జనవరి 1950లో వెనుక బడిన ఆసియా దేశాలలో చైనా వలస దేశాల పోరాట సిద్ధాంతాలను అన్వయించుటకు అధికార ముద్రవేసింది. ఇండియాకు సంబంధించినంతవరకు కొమిన్‌ఫారం పూర్తిగ చైనా నమూనాగాని రష్యన్ నమూనావిప్లవాలకు స్పష్టమైన ఆమోదాన్ని తెలుపలేదు. కొమిన్‌ఫారం వ్యాసం, చైనా విప్లవాన్ని శ్లాఘించి, వెనుకబడిన దేశాలలో అంత ప్రాముఖ్యత వహించుతుందని విముక్తి వుద్యమాలకు తోడ్పడుతుందని చెప్పివా విషౌచీ, చైనా పంథా సాధారణాంశాలు వలస, అర్థవలస దేశాలన్నీ అనుసరించతగిన వన్నదానిని వ్యాసం పెక్కు వలసలు, ఆధారిత దేశాలుగ మార్చివేసింది. చైనా నాయకుడు లీషౌచీ, చైనా సిద్ధాంతాలు వలసి, అర్థవలసలలో విశ్వవ్యాప్తంగా అనుస రించదగినవని సాయుధపోరాటం ప్రతిచోట సాధ్యంకాకపోవచ్చునని కొంత సరళీ కృత మొనర్చగా కొమిన్‌ఫారం పత్రిక "అన్ని" అన్నచోట "పెక్కు" చేర్చింది. పత్రిక ఇండియా విషయం ప్రస్తావించుతూ, చైనా తదితర జాతీయవిముక్తి వుద్య మాల అనుభవాలను భారత కమ్యూనిస్టుపార్టీ అధ్యయనం చేయాలని పేర్కొంది.

భారతదేశంలో విప్లవానికి చైనా నమూనా పోరాటవ్యూహం ఎత్తుగడలపై కొమిన్‌ఫారం అంత్యనిర్ణయాన్ని వాయిదా వేసింది. పరోక్షంగా వ్యతిరేకించింది. అట్టి నిర్ణయాన్ని నిరోధించుటకు బహుశా భారత కమ్యూనిస్టులకు ఎవరు మార్గదర్శ కత్వం వహించాలనే విషయంపై నిర్ణయం జరిగి వుండకపోవుట సాంప్రదాయకంగా సోవియట్ యూనియన్ వహించుచున్న యీ పాత్రను చైనా రిపబ్లిక్‌కు దత్తత చేయుటకు సోవియట్‌కు యిష్టంలేదని అర్థంచేసుకొనవలసివుంటుంది. అయినా మరో పేరాలో నాలుగు వర్గాల ఐక్య సంఘటనను పునరుద్ఘాటించుటతో వ్యూహానికి సంబం ధించినంతవరకు కొమిన్‌ఫారం, చైనా రిపబ్లిక్ అభిప్రాయాలలో కన్పించే భేదాభి ప్రాయాలు లేవు. అయితే యింతకు ముందువలె తీవ్ర పోరాట విధానముల ప్రస్తా వన లేకుండుట గమనార్హము. అంచేత ప్రధానమైన ఆచరణ కార్యక్రమం ఎత్తు గడల విషయమై అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమమునుండి వచ్చే సూచనలు, సలహాలలో అస్పష్టతనే యెదుర్కొనవలసి వచ్చింది అయితే వొకటిమాత్రం స్పష్ట మైంది రణదివె వ్యూహం, ఎత్తుగడలుమాత్రం పరిస్థితులకు అనుకూలంగాలేవు.

### భారతదేశంలో 'చైనాపంథా'లో విప్లవం

కొమిన్‌ఫారం వ్యాసంలో సోవియట్ నూతనవైఖరి స్పష్టమగుటతో కమ్యూ నిస్టు పార్టీ పూర్తిగా స్పందించి, పార్టీ పొలిట్‌బ్యూరో ఫిబ్రవరి 1950లో సమావేశ మైంది. ఈ సందర్భంలో భారత కమ్యూనిస్టుపార్టీ కేంద్రంలో ఆంధ్ర పార్టీ నాయ కత్వంలోని ఇద్దరు పొలిట్‌బ్యూరోసభ్యులు, ఐదుగురు కేంద్రసమితి సభ్యులు, కేంద్ర పార్టీ నాయకత్వంలో రాజకీయ అంతర్గతపోరాటం జరుపుతున్న తరుణంలో కొమిన్ ఫారం పత్రిక సంపాదకీయం, ట్రేడుయూనియన్ పెకింగ్ సమావేశపు మానిఫెస్టోలు చారిత్రాత్మక పాత్రను నిర్వహించాయి. ఇంతకుముందే వెలువడిన ఝుకోవ్, డయ కోవ్, బలబుషేవిచ్‌ల వ్యాసాలు నూతన ఆలోచనా విధానాలకు మౌలిక ప్రేరకాల

య్యాయి. చర్చల అనంతరం కొమిన్‌ఫారం సంపాదకీయంపై సుదీర్ఘ ప్రకటన చేసింది అంతేగాక గతంలో చేసిన, ప్రకటించిన అన్ని తీర్మానాలకు వ్యూహం, ఎత్తుగడలను పునర్విచారించి సమీక్షాపత్రాన్ని కేంద్రసమితికి సమర్పించాలని కోరింది.

ప్రకటన నామమాత్రపు స్వాతంత్ర్యమనే అధినివేశ ప్రతిపత్తిని అధికార మార్పిడిగా చేసినంతమాత్రాన, ప్రధాన ఆర్థికాంశాలు విదేశ సామ్రాజ్యవాదపు చేతులలో వుండుటవలనే వలస పరిస్థితి మారదనే సత్యాన్ని గమనించలేకపోయామని స్పష్టంచేసింది. ఈ తప్పుడు అవగాహన కారణంగా పోరాటం సామ్రాజ్యవాద, ప్యూడలు వ్యతిరేక జాతీయ విముక్తి పోరాట లక్షణాలను గుర్తించి, వాటికి ప్రాధాన్యతను యివ్వజాలక పోయాము. వలసలలో విముక్తి వుద్యమాలు బూర్జువాలను దూరంచేసి కార్మికవర్గ పాత్రను నెలకొల్పుట, బూర్జువాల సామ్రాజ్యవాద వ్యతిరేక పాత్ర ముగిసిందనే నిర్ణయం కారణంగా కర్తవ్య నిర్వహణలో విఫలులమయ్యాము. సంస్కరణవాదాన్ని ఎదుర్కొంటూ, "మౌంటుబాటన్‌లుపోయినా బ్రిటిష్ సామ్రాజ్యవాద కబంధహస్తాల పట్టుసడలలేదని గుర్తించుటలో విఫలమైన కారణంగా రెండు ఘోరతప్పులు జరిగాయని వొక విధంగా ఆత్మవిమర్శనా ప్రకటన తెలిపింది[1] అవి :

మొదటిది సామ్రాజ్యవాద, ప్యూడలు, బూర్జువాల కూటమిలో నాయకత్వ పాత్ర జాతీయ బూర్జువాలదిగా నెంచాము. వాస్తవానికి సామ్రాజ్యవాదం, దాని వుపగ్రహాలైన స్వరాజులు, ప్యూడలు శక్తులు నాయకత్వం వహించుచున్నవి. బూర్జువా ప్రభుత్వం వారి ఆజ్ఞాపాలన చేస్తున్నది.

రెండవది వ్యూహం ఎత్తుగడలకు సంబంధించి కార్యదర్శి నివేదిక భారత బడాబూర్జువా తదితర బూర్జువా వర్గాలను వేరుగ చూడజాలక అధికార స్థానంలో వున్నది బడా బూర్జువావర్గం, సామ్రాజ్యవాదంతో రాజీపడినదని గుర్తించుటలో పార్టీ నాయకత్వం విఫలమైంది.[2]

అంతేగాక పొలిట్‌బ్యూరో వ్యూహం ఎత్తుగడల పత్రం ప్యూడలు వ్యతిరేక కార్మిక కర్షక సంఘటనను నొక్కిచెప్పక గ్రామీణ ప్రాంతాలలో భూస్వాములతో ధనికరైతులను కలిపి విప్లవ వ్యతిరేక శక్తులని నాయకత్వం ధనికరైతు వహించుతున్నాడని వివరించింది. ఈ దశలో ప్రధాన నినాదమైన నష్టపరిహారం లేకుండా భూస్వామ్య విధానాన్ని రద్దుచేయుట, దున్నేవానికే భూమి అనే అన్నివర్గాల రైతుల ప్రయోజనాలను, కోర్కెలను వదలివేయుట జరిగింది.

వ్యవసాయ సమస్యలయెడల వొంటెత్తుపోకడల కారణంగా పెట్టుబడిదారి విధానం వ్యవసాయంలో పెరుగుతున్నప్పటికి ప్యూడలు-భూస్వామ్యవిధానం అత్యంత ప్రముఖంగా వున్నదని గుర్తించలేకపోవుట జరిగింది.

1. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర. అధికార పత్రాలు(ఆంగ్లంలో) వా VII పే. 518-9 కొమిన్‌ఫారం సంపాదకీయంపై పొలిట్‌బ్యూరో ప్రకటన పి.పి. హెచ్ పబ్లికేషన్.
2. అదే పే. 620.

ఆత్మ విమర్శనా పద్యశ్యమైన యీ ప్రకటనను బ్రిటిషు కమ్యూనిస్టుపార్టీ సిద్ధాంత పత్రిక "కమ్యునిస్టు"లో ప్రకటించి, బ్రిటిష్ అంతర్జాతీయ కమ్యునిస్ట్ పుద్యమం బలపడస్తుందని ఆశించారు: పామీదత్తు మౌనం వహించారు. సోవియట్ బలపరచుట జరుగలేదు: ఆంధ్ర సెక్రటేరియట్ నూతన అవగాహన కర్తలుగా, అంతర్జాతీయ ఆమోదం వుందని యీ ఫ్రాక్షన్ కేంద్ర నాయకత్వాన్ని చేబట్టింది. మే 1950లో జరిగిన కేంద్రకమిటి సమావేశంలో వాస్తవానికి రెండు సంవత్సరాలలో మొట్టమొదటి సమావేశంలో పార్టీ కాంగ్రెసు 1948లో పార్టీ నిర్మాణ నిబంధనలకు సవరణతో లభించిన అధికారాలతో కేంద్రకమిటి రణదివెని జనరల్ సెక్రటరీగా తొలగించి, తొమ్మిదిమందిగల కేంద్ర కమిటీని అందులో నలుగురు ఆంధ్రులుగల నూతన కేంద్రకమిటీని ఎన్నుకొన్నది. పాత కేంద్రకమిటి 31 మందిలో 19 మంది సభ్యులు మాత్రమే హాజరయ్యారు. జైళ్ళలో 6గురు వున్నారు. ఒకరు చనిపోయారు. 3గురు తొలగించబడుటయో, సస్పెండు చేయబడుటయో జరిగింది. అంటే 21 మందిలో 19 మంది సమావేశానికి నాడున్న రహస్య పరిస్థితులలో హాజరగుట, సమావేశం విజయవంతంగా జరుగుట ఆసక్తికరమైన విషయము. నూతన కేంద్ర కమిటి సి. రాజేశ్వరరావును జనరల్ సెక్రటరీగా ఎన్నుకొంది.[1]

'కమ్యూనిస్టు' పత్రిక ఎడిటోరియల్ బోర్డు పునర్నిర్మాణం జరిగింది. చైనా కమ్యూనిస్టుపార్టీ 29వ వర్ధంతికి శుభాకాంక్షలు పంపుతు "వలస ప్రపంచంలోని కమ్యూనిస్ట్‌పార్టీలు, చైనా కమ్యూనిస్టుపార్టీని తమ ఆదర్శంగా ఎంచుతున్నవి" అని ప్రశంచించారు. ఎడిటోరియల్ బోర్డు కొంత అస్పష్టంగా తమ అభిప్రాయాలను వెలిబుచ్చినా అన్ని పార్టీశాఖలకు వ్రాసిన లేఖలో నూతన విధానాన్ని స్పష్టంగా వివరించుట జరిగింది. అంతేగాక ఆలేఖ కామిన్‌ఫారం వ్యాసం, పెకింగ్ సమావేశపు "మానిఫెస్టో", ఝుకోవ్, డయకోవ్, బలబుషేవిఛ్, మాస్లెనికోవ్ రచనల ప్రాతిపదికగా తన విధానాలు రూపొందించబడినవని కేంద్ర కమిటిలేఖ పేర్కొంది. ఈ రచనలేవి సాయుధ పోరాటాన్ని బలపరచలేదు. లేఖ చైనా కార్యక్రమము. ప్రధానంగా "జాతీయ ఐక్య సంఘటనను" ధనికరైతుతోగూడ గల మధ్యతరగతి బూర్జువాలను అభ్యుదయ వర్గాలతోగల కూటమిని, ఐక్యసంఘటన వ్యూహాన్ని విజయసాధనకు సూచించుచున్నదని తెలిపింది చైనా కార్యక్రమంలోని మరో ప్రధానాంశము, జాతీయ విముక్తి పోరాటము గ్రామీణ ప్రాంతాలలో సాయుధ గెరిల్లా పోరాటాలు, విముక్తి స్థావరాలయేర్పాటు, విముక్తి సైన్యాలు గ్రామీణ ప్రాంతాల అధికారాన్ని హస్తగతం చేసుకొని చివరకు నగరాల విముక్తి అధికారాన్ని స్వాధీనం చేసుకొనుట, అందుకు మావోయిజం సాయుధపోరాట ఆవశ్యకతను తెలియజేస్తున్నదని లేఖ వివరించింది.

---

1. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర(1977) అధికారపత్రాలు (ఆంగ్లంలో) వా VII. కొత్త సి.పి. లేఖ పే. 635-50.

## నూతన జూన్ 1950 కేంద్రకమిటి అవగాహన

కమ్యూనిస్టు పార్టీ నూతన కేంద్రకమిటి మే-జూన్‌లో సమావేశమై పరిస్థితు లను సమీక్షించి ప్రధానంగా ఆంధ్ర కేంద్రకమిటి సభ్యులు సమర్పించిన రెండు పత్రాలకు 1) నిర్మాణచర్యలలో అతివాదవక్రీకరణ 2) అతివాద వక్రీకరణపై నివేది కలకు పరిశీలించి ఆమోదించింది. నూతన విధానాన్ని నూతన కేంద్రకమిటి పార్టీ సభ్యులకు, సానుభూతిపరులకు జూన్ 1 1950 లేఖలో వివరించింది. అదే భారత దేశానికి చైనా విప్లవ నమూనా మార్గం.

ఆంధ్ర పార్టీ కార్యవర్గ చిత్తునోటులో కొన్ని లోపాలున్నా విప్లవదశను, వ్యూహాన్ని సరిగా నిర్వచించింది. మన పోరాటపు అంతర్యుద్ధ స్వభావాన్ని సాయుధ ప్రతిఘటనా సమస్య ఎజెండాలోనికి వచ్చిందని తెలిపింది చైనా మార్గ దృక్పథాన్ని పార్టీ ముందుంచింది. గ్రామీణ ప్రాంతాలలో దౌర్జన్య, నిర్బంధ, హింసాకాండలకు వ్యతిరేకంగా కరకు, పదునైన దీర్ఘ కాల సాయుధ ప్రతిఘటనతోపాటు, బస్తీలలో కార్మికుల సమ్మెలు, ప్రతిఘటన, గ్రామీణ ప్రాంతాల విముక్తి, చివరకు అధికారాన్ని స్వాధీనం చేసుకొనుటగా వివరించింది. [1]

పొలిట్‌బ్యూరో రాజకీయ సిద్ధాంతాన్ని విదేశీయ అనుభవాల వ్యాసాలను ఆంధ్రానోటు వెలుగులో పరిశీలించక, "ఒకే దశ సిద్ధాంతాన్ని", "జనతా ప్రజా స్వామ్యం", "వ్యవసాయ సమస్య", "ఎత్తుగడల పంథా"లను డిశెంబరు 1948 చివ రకు రూపొందించి, అతివాద దుందుడుకు విధానాలకు సైద్ధాంతిక ప్రాతిపదికలను యేర్పరచి అమలును చేబట్టింది. విప్లవ పరిస్థితులు పరిపక్వమైనాయని, తిరుగుబాటు పరిస్థితులని అంచెనావేసి మార్చి 1949 రైల్వే కార్మికుల సమ్మెకు పిలుపునిచ్చింది. రైల్వే సమ్మె విఫలమగుటతో ధైర్యంగా ఆత్మవిమర్శనతోరాక, టిటోయిస్టు నిర్మాణ పద్ధతులతో విమర్శనను అణగద్రొక్కుతు, జిల్లా, రాష్ట్ర కమిటీలను రద్దుచేస్తూ, సభ్యులను బహిష్కరిస్తూ పార్టీనిర్మాణాన్ని చిన్నాభిన్నంచేయుట జరిగింది. పొలిట్ బ్యూరో, కేంద్ర సమితి అధికారాలను తానే చెలాయించుట, కేంద్ర సమితి సమావే శాలు జరపకుండుట, ముగ్గురుగల పొలిట్ బ్యూరో ఇద్దరై, ఆచరణలో శెక్రటరీ ఏ పొలిట్‌బ్యూరో కార్యవర్గం కేంద్రసమితిగానై, వాది ప్రతివాది జడ్జీగా అన్నీ తానేయై నియంతగా వ్యవహరించి, శెక్రటరీ ఆత్మవిమర్శనను నిరాకరించుట, క్రింది నాయ కత్వాలనుండి ఆత్మ విమర్శలపేరుతో వాఙ్మూలాలు తీసుకొని, చర్చలు ప్రజాస్వా మ్యాన్ని మంటగలిపి పొలిట్ బ్యూరో విధానాన్ని ప్రశ్నించిన రాష్ట్ర, జిల్లా కమిటీ లను రద్దుచేస్తూ, ప్రజాసంఘాల ఫ్రాక్షనులను ముఖ్యంగా విద్యార్థి ఫ్రాక్షనులను రాష్ట్ర కమిటీలకు పోటీగా పెట్టుట, విదేశ పార్టీలనుండి నేర్చుకొనుట నిరాకరించుట, వారి నాయకత్వాలపై నిందారోపణలు విచక్షణా రహితంగా పార్టీ క్రింది నాయక త్వాన్ని "పిరికిపందలు", "ద్రోహులు" అని నిందలువేయుటతో పార్టీని, పార్టీ

1. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర (1947) అధికార పత్రాలు (ఆంగ్లంలో) పి.పి. హెచ్. నూతన సి.పి. లేఖ పే 631.

నిర్మాణాన్ని "టిటోయిస్టు" "ట్రాట్స్కీయిస్టు" విధానాలతో పార్టీని చిన్నాభిన్నం చేయుట జరిగింది. అనుమానాలు గూడుపుఠానీలు తెగతెంపులతో, దుర్గంధంతో పార్టీ నిండిపోయింది[1].

నూతన కేంద్ర సమితి అంతర్జాతీయ పరిస్థితిని సమీక్షించి, యుద్ధంలో సామ్రాజ్యవాదం బాగా బలహీనపడిందని, ప్రపంచం అమెరికా నాయకత్వంలో ప్రజా స్వామ్య వ్యతిరేక, సామ్రాజ్యవాదపక్షం వొకటి, సోవియట్ నాయకత్వంలో సామ్రాజ్యవాద వ్యతిరేకపక్షం మరొకటిగా, రెండుగా చీలిపోయిందని, జధనోవ్ విశ్లే షణను పునరుద్ఘాటించింది. పెట్టుబడిదారి, సామ్రాజ్యవాదాల సంక్షోభంతో వలస, అస్వతంత్ర దేశాలలో స్వాతంత్ర్య పోరాటాల విజృంభణతో, వలస ప్రజల విముక్తి పోరాటాల విస్తృతి, విజృంభణలతో నూతన గుణాత్మకదశ వుత్పన్నమైంది. సామ్రాజ్య వాద వ్యతిరేక సాయుధ పోరాటాన్ని అధిక వలసదేశాల ప్రజాసామాన్యం చేబట్టు టయే అత్యంత ప్రాముఖ్య అంశం. ఈ జాతీయ పోరాటాలలో కార్మికవర్గ పార్టీ నాయకత్వం వహించుట మరో ముఖ్య అంశము.

భారతదేశంలో యుద్ధానంతర విప్లవ పోరాటాల వెల్లువ, అనేక రాజకీయ సార్వజనీన సమ్మెలు, నావికుల తిరుగుబాటు, రైతాంగ, సంస్థాన ప్రజల వుజ్వల పోరాటాలు, పోలీసుల, సైనికుల సమ్మెలు, సాయుధ తెలంగాణా రైతాంగ పోరా టాలు, మొత్తంగా దేశవిముక్తి పోరాటంలో గుణాత్మకమైన మార్పును స్పష్టం చేసాయి. ఈ పోరాటాలలో కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో కార్మికవర్గం నిర్ణ యాత్మక పాత్ర వహించుట, భారత బడా బూర్జువావర్గాలలో భయాన్ని కలుగజేయు టతో, అవి ద్రోహంచేసి సామ్రాజ్యవాదంతో రాజీపడి దాని పక్షాన చేరాయి. బ్రిటిష్ సామ్రాజ్యవాదం పాత పద్ధతులలో పరిపాలించజాలక, భారతదేశానికి బూటకపు స్వాతంత్ర్యాన్నిచ్చి, దేశాన్ని వలస ప్రధానంగానే వుంచనెంచింది. అమెరికా తన ప్రభావాన్ని విస్తరించుకొంటున్నది. మౌంటుబాటన్ విభజనతో ఇండియా, పాకి స్తాన్‌లు రెండూ ఆర్థిక, రాజకీయ, సైనికంగా సామ్రాజ్యవాదం పైనే ఆధారపడి వున్నవి. బ్రిటిషు పెట్టుబడే రెండు దేశాలలో నిర్ణయాత్మకపాత్ర వహించుచున్నది.

భారత బడా బూర్జువావర్గం ఫ్యూడలు శక్తులు, ద్రవ్యపెట్టుబడి వర్గాలతో దగ్గరి సంబంధాలనే కలిగివుంది. మొదటినుండి బ్రిటిషు సామ్రాజ్యవాదంతో బ్రహ్మముడి వేసుకొంది. మౌంటుబాటన్ అవార్డుతో పూర్తిగ సామ్రాజ్యవాద పక్షంలో చేరింది. సామ్రాజ్యవాదులతో రాజీపడి భాగస్వాములగుట, విజృంభిస్తున్న విప్లవ పోరాటాల యెడల భయమే ప్రధాన కారణము. అయితే దీనర్థం సామ్రాజ్యవాదానికి, బడా బూర్జువావర్గానికి మధ్య వైరుధ్యం లేదనికాదు, వున్నా వాటిని రాజీ సంప్రదింపుల ద్వారా పరిష్కరించుకొన నిర్ణయించింది. అధికారమార్పిడితో ప్రత్యక్షపాలన మరుగై, పరోక్షపాలన సాగుటతో సామ్రాజ్యవాదపు జూనియర్ భాగస్వామిగా, ఫ్యూడలు,

1. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర. (1947) అధికార పత్రాలు (ఆంగ్లంలో) పి.పి. హెచ్. నూతన సి.సి. లేఖ పే. 635-6.

రాచరికపు శక్తులతో కలసి ప్రజావెల్లువను, అధికారాన్ని వినియోగించి, నిర్బంధ చర్యలద్వారా ఆరికట్టనెంచింది. తద్వారా రాజీబేరాలలో తన స్థానాన్ని బలపరచు కొంటూ, ఆసియా, వ్యాపార, సైనిక విస్తరణ పథకాలను, సామ్రాజ్యవాదపు జూనియర్ భాగస్వామిగా కొనసాగించ నెంచింది.

నేటి పరిస్థితులలో విముక్తి వుద్యమ పురోగతికి, కొమిన్‌ఫారం సూచించిన విధంగా భారత కమ్యూనిస్ట్ పార్టీ చైనా, తదితర అనుభవాలను అధ్యయనంచేసి కార్మిక, కర్షక, బడుగువర్గాలన్నిటి బలమైన ఐక్యసంఘటనను నిర్మించిన, అదే సామాన్య స్వాతంత్ర్య పోరాట భూమిక అగుతుంది. అది సామ్రాజ్యవాద వ్యతిరేక విముక్తి, పోరాటమేగాక అభివృద్ధి నిరోధక రాజీ బూర్జువావర్గ, ఫ్యూడలు రాచరికపు భాగస్వాములకు వ్యతిరేకంగా అన్ని వర్గాల, పార్టీల, సంస్థల స్వేచ్ఛా, స్వాతంత్ర్యాల రక్షణకై జరిగే పోరాటమగుతుంది. కొమిన్‌ఫారం, ట్రేడు యూనియనుల మానిఫెస్టో, భారత విముక్తి పోరాట విజయానికి మార్గం చైనాపంధాయే యనుటను కేంద్రసమితి పునరుద్ఘాటించింది.

ఐక్యసంఘటనా నిర్మాణం, వర్గాల పొందిక కార్యక్రమాలను ముఖ్యంగా వ్యవసాయ విప్లవం, సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటాలను నూతన కేంద్రసమితి స్పష్టమైన అభిప్రాయాలు, అవగాహనలేగాక అన్ని వివరంగా తెలియజేసింది. భారత జాతీయ విముక్తి పోరాటం, చైనా మార్గంలో పురోగమించుటకు రెండు ప్రధానాంశాలను సమితి స్పష్టంగా పేర్కొంది. ఒకటి విస్తృత రైతాంగం, కార్మికవర్గం, మేధావి వర్గం, పట్టణ పెటీ బూర్జువావర్గాలు, సామ్రాజ్యవాదం. వారి తాబేదారుల వొత్తిడికి లోనయ్యే జాతీయ బూర్జువావర్గం కలయికతో శక్తివంతమైన జాతీయ ఐక్యసంఘటన నమీకరణతో, సామ్రాజ్యవాదం, వారి తాబేదారులైన ఫ్యూడలు, బడా బూర్జువా శక్తులకు వ్యతిరేకంగా, కార్మికవర్గ అగ్రగామిదళమైన కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో విముక్తి పోరాటం, రెండవది గ్రామీణ ప్రాంతాలలో భూమికై సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటం, విముక్త ప్రాంతాలలో విముక్త సైన్యాల నిర్మాణం, చివరకు రైతాంగ గెరిల్లా పోరాటాలతో నగర, కార్మికవర్గ తిరుగుబాటుల సమ్మేళనంచేసి, దేశమంతటా అధికారం హస్తగతం చేసుకొనుటకై జాతీయ విముక్తి పోరాటం, ఇదే పూర్తి వ్యూహం, ఎత్తుగడలుగా వివరించింది. భారత జాతీయవిముక్తి చైనా విప్లవ పోరాటాల మార్గంలో అంటే అర్థమిది.

జాతీయ ఐక్యసంఘటనా నిర్మాణంలో గుర్తుంచుకొనవలసిన కొన్ని ముఖ్యాంశాలనుగూడ జాతీయసమితి సూచించింది. కార్మిక, కర్షక బడుగువర్గాల కూటమి ఐక్యసంఘటనకు భూమిక అగుతుంది, కార్మికవర్గ అగ్రగామిదళం, పార్టీ నాయకత్వం వహించుతుంది. మధ్యతరగతి రైతు ప్రజాస్వామిక విప్లవంలో కార్మికవర్గానికి నిలకడైన మిత్రుడు. ఫ్యూడలు దోపిడిచేయని ధనికరైతుకూడ మిత్రుడే, అట్లుగాక ఫ్యూడలు దోపిడీని చేసే ధనికరైతు శతృవర్గంలోని వానిగ పరిగణించాలి అయితే వారి భూమిని స్వాధీనం చేసుకొనునపుడు, ధనికరైతు, భూస్వాములకు మధ్యగల

భేదాన్ని పరిగణించవలసి వుంటుంది ఇది విప్లవానంతర ప్రశ్నకాన అప్రస్తుతము. బడా బూర్జువావర్గం ప్రధానంగా గుత్త పెట్టుబడి, వ్యాపారవర్గాలు. సామ్రాజ్యవాద యేజంట్లు, వెనుకబడిన వ్యాపారవర్గాలు, సామ్రాజ్యవాద యేజంట్లు, వెనుకబడిన ప్రాంతాలలో సామ్రాజ్యవాదులతోకలసి దేశీయ మార్కెట్టుద్వారా దోపిడి చేస్తున్నారు. బడా బూర్జువావర్గం, ఐక్యసంఘటన దేశీయ ప్రధాన శతృవు. ఇతర బూర్జువావర్గాలు చిన్నవి అయినా ఫ్యూడలు లేక బడా బూర్జువావర్గంతో సన్నిహిత సంబంధాలు కలిగి వుండిన ప్రజాస్వామిక విప్లవానికి శతృవర్గంలో చేర్చవలసి వుంటుంది. గుత్తేతర మధ్యతరగతి బూర్జువావర్గం, ఫ్యూడలు సంబంధాలు లేనిది, లేకవున్నా నామమాత్రం కలది. సామ్రాజ్యవాదం, బడాబూర్జువావర్గాల మధ్య నలిగిపోతూ వుంటుంది. కాన కొంత అభ్యుదయకర పాత్రను కలిగివుంటుంది వివిధ జాతులలో తలెత్తుతున్న ఈ మధ్యతరగతి ప్రాంతీయ బూర్జువావర్గాలు గుత్త గుజరాతి, మార్వాడీ బడాబూర్జువా వర్గాలచే అణచివేయబడుతున్నది. కాన ఈ వర్గాలలో కొన్ని అభ్యుదయకర పాత్ర కొంతకాలం వరకు వహించే వర్గాలు వుండవచ్చు ఆర్థిక సక్షోభం తీవ్రమైనకొలది. ఏదోవొక దశలో పోరాట ఉధృతి, విజయావకాశాల కాలంలో సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనలో నమ్మకమైన, స్థిరమైన మిత్రవర్గంగా కాకపోయినా తోటి ప్రయాణికులలాగ కలసివచ్చే అవకాశముంది కాన వారికి తలుపులుమూయరాదు. ఐక్య సంఘటనా నిర్మాణం, అభివృద్ధి వొక ఐక్య పోరాటక్రమంలోనే సాధ్యమగుతుంది. ప్రజల కోర్కెలపై సమిష్టి ప్రదర్శనలతో ప్రారంభమయ్యే ఐక్య కార్యాచరణ క్రమంగా శాంతి, తిండి, భూమి, స్వాతంత్ర్యాలకై వున్నత పోరాట రూపాలను చేపట్టి తాత్కాలిక కూటముల దశను దాటి మరింత శాశ్వత ప్రాతికపై ఐక్య సంఘటనగా ఏర్పడుతుంది. క్రిందినుండి అట్టి సంఘటనను నిర్మించినప్పుడు శక్తివంతమూ, సమర్ధవంతమైనది అగుతుంది. పైనుండి వివిధ పార్టీల సంస్థల, వర్గాల, నాయకత్వాల, వ్యక్తుల మధ్య జరిగే వొప్పందంద్వారా యేర్పడే ఐక్యసంఘటనలను నిషేదించు ప్రశ్నలేదు, అయితే వాటి మౌలిక భేదాలను మరువరాదు. క్రిందిమండి ఐక్యతను పెంపొందించుటకు అట్టి వొప్పందాలు ఎంతో దోహదంచేస్తాయి. అయితే విచ్ఛిన్నకర శక్తులను సానుభూతితో ఎప్పటికప్పుడు దృఢచిత్తంతో ఎండగట్టుతు పోరాడి, బూర్జువాతత్వపు ప్రభావాన్ని, భ్రమలకు నాయకత్వం లోనుగాకుండునట్లు సంఘటనను కాపాడుకొనవలయును.[1]

నూతన సమితి భారత గ్రామీణ ప్రాంతాలలో ఫ్యూడలు, అర్థ ఫ్యూడలు సంబంధాలేయింకా బలంగా ఆధిక్యత వహించి వున్నవని సామ్రాజ్యవాదులు తమ దోపిడి సౌలభ్యానికి ఆ సంబంధాలనే కొనసాగించారు. ఈ వాస్తవాన్ని గుర్తించని కారణంగానే గతంలో నాయకత్వం అతివాద, వొంపెత్తువిధానాలకులోనైంది. ఫ్యూడలిజం వొడినుండే వ్యవసాయంలో పెట్టుబడిదారి విధానం గణనీయంగా పెరిగింది. వేతన, వలస బానిసత్వాల పీడనకు గురి అగుతున్న వ్యవసాయ కూలివర్గం, నిజానికి

1. కొత్త సి.సి. లేఖ. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర అధికారపత్రాలు (ఆంగ్లంలో) పి.పి.హెచ్. 1977 వా VII. పే. 645-50.

దారిద్రానికి గురైన రైతులే యీ వ్యవసాయ కూలీలు, వ్యవసాయ విప్లవంలో అగ్ర గామిదళం, జనతా ప్రజాస్వామ్య విప్లవంలో గ్రామసీమలలో చోదకశక్తి వీరే. జాతీయ విముక్తి వుద్యమానికి "ఇరుసు" వ్యవసాయ విప్లవం. "దున్నేవానికే భూమి" నినాదం. వ్యవసాయ సంస్కరణలకు, రైతాంగాన్ని విస్తృత పోరాటాలకు సమీకరించగలదు.

ప్రజలు యిప్పటికే వారివారి మార్గాలలో పోరాడుతునే వున్నారు. తెలంగాణా, ఆంధ్రా, సరిహద్దు కొండల జిల్లా మైమెన్‌సింగ్ జిల్లాలలో సాయుధ గెరిల్లా పోరాటాలు సాగించుచున్నారు. ఇవి భారత ప్రజాస్వామిక విప్లవ ప్రారంభ పోరాటాలు కొన్ని ప్రాంతాలు మినహా దేశమంతటా వాస్తవానికి ప్రతిఘటనా గెరిల్లా పోరాటాలు సాగించుటకు తగిన పరిస్థితులున్నవి. వాటిని వినియోగించే పార్టీ కావాలి. అత్యధిక ప్రజా సామాన్యం మెజారిటి పార్టీ కార్యక్రమాన్ని ఆమోదించి ప్రదర్శనలు జరుపుతున్నారా అనే పాత కొలమానాన్ని విడనాడాలి. ప్రభుత్వ ఫాశిస్టు హింసాచర్యలకు వ్యతిరేకంగా ప్రజాబలంతో గెరిల్లాప్రతిఘటనను కొనసాగించగలము. పార్టీ ధైర్యంగా చొరవతో ప్రజా చైతన్యాన్నిబట్టి వివిధ ప్రాంతాలలో ప్రజా పోరాటాలను ప్రారంభించాలి. సాయుధ గెరిల్లా ప్రతిఘటన దానికి అనుసంధించి త్వరితంగా భూకంపం ప్రజా పంచాయితీలదశకు అభివృద్ధిచేయాలి ఈ విధంగానే విప్లవోద్యమం తన్ను తాను రక్షించుకొనగలుగుతుంది. విస్తరించి దేశవ్యాప్తంగా అభివృద్ధి చెందుతుంది. శ్రామిక పార్టీ సాయుధ గెరిల్లా పోరాటంతో మాత్రమే బలపడుతుంది. విస్తరించి దేశవ్యాప్తమౌతుంది. శ్రామిక జనాన్ని, సామ్రాజ్యవాద వ్యతిరేక వర్గాలనందరిని ఐక్యపరచి సమీకరించగలుగుతుంది. రక్షణ స్థావరాలను, విముక్తి ప్రాంతాలను, సైన్యాలను తగిన నైసర్గిక ప్రాంతాలలో నిర్మించగలుగుతుంది. చివరకు అధికారాన్ని స్వాధీనం చేసుకొని దేశాన్ని విముక్తి చేయగలుతుంది. ఇదీ ముఖ్యాంశాలపై నూతన కేంద్ర సమితి అవగాహన, దృక్పధము. ఇది నూతనకేంద్రసమితి లేఖ సారాంశము.

## IV

## సంక్షోభంలో కమ్యూనిస్టుపార్టీ

ఈ నూతన "చైనా పంధా"లో దేశమంతటా కొన్ని ప్రాంతాలలో మినహా సాయుధ వ్యవసాయ విప్లవ విస్తరణ కార్యక్రమాన్ని చేబట్టిన నూతన నాయకత్వం తెలంగాణా అనుభవాల సమీక్ష రహస్య నివేదికను దేశమంతటా విప్లవ పోరాటాలకు మార్గదర్శకంగా పుండగలందులకు తయారుచేసింది. మొత్తం 3000ల గ్రామాలలో "సోవియట్లను యేర్పాటుచేసి, 10 లక్షల యకరాల వ్యవసాయ భూములను రైతులకు పంపకం చేశామని, గెరిల్లా దళాలలో 2000 మంది పోరాట యోధులు వున్నారని, మరో 10000 మంది గ్రామరక్షణ దళాలలో వున్నారని భారత ప్రభుత్వ సైన్యాలు సంస్థానంలో ప్రవేశించకముందు నిజాం పోలీసులు 2000 మంది ప్రజలను చంపివేశారని గెరిల్లాలు దగ్గరదగ్గరగా అంతమంది పోలీసులను, దేశముఖ్‌లు, భూస్వాములను హతమార్చారని అతిశయోక్తిగా నివేదిక ప్రచారం చేసింది. ముఖ్యంగా

పార్టీ వర్గాలలో కలిగిన గందరగోళాన్ని నివారించుటకు యితర పోరాటప్రాంతాలకు మార్గదర్శకంగా, ప్రోత్సాహకరంగా వుండగలందులకుగా కన్పడుతున్నది. అంతేగాక పోలీసుయాక్షన్ తరువాత ప్రతిఘటనలో 200 మంది భారత సైనికులు, 300 మంది గెరిల్లాలు మృతులైనట్లు నివేదిక తెలిపింది. నాయకత్వం యీ విధంగా భారత జనతా ప్రజాస్వామ్య విప్లవం పురోగమిస్తున్నదని ఈ నివేదికకు అనుబంధంగా సరిహద్దు మైమెన్‌సింగ్ ప్రాంతంలో త్రిపుర సంస్థానంలో సాయుధ రైతాంగ గెరిల్లా చర్యల నివేదికలు రూపొందించింది. పార్టీలోని వివిధ వర్గాలలో అనేక ప్రాంతాలలో ఈ నూతన విధానానికి వ్యతిరేకతకూడ నిర్దిష్టరూపంలో ప్రారంభమైంది.

పార్టీ జాతీయసమితి "పోరాట విధానానికి" అనగా చైనా నమూనా రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటాలకు పి,సి. జోషి. మాజీ సెక్రటరీ నుండి తీవ్రవ్యతిరేకత వచ్చింది. రణదివె కార్యక్రమాన్ని ఎదిరించనంత తీవ్రంగానే చైనా పంథాను వ్యతిరేకించ ప్రారంభించాడు. జోషి మూడు చిరుపుస్తకాలను పబ్లిష్‌చేసి దేశ. విదేశాలలోని మిత్రులకు పంపిణీ చేశారు. పార్టీకి విశ్వాసపాత్రుడనని కమ్యూనిస్టు చేయతగని పని తానేమీ చేయుటలేదని అన్నారు. రణదివె చేసిన పొరపాటులనే రాజేశ్వరరావు చేస్తున్నందుకు ముఖ్యంగా భారతదేశంలో విప్లవ పరిస్థితులున్నవనే అంచెనా వేయుటకు తీవ్రంగా విమర్శించి, యుద్ధానంతర కాలంలో చట్టబద్ధ ప్రతిపక్షంగా పని చేయవలయునని నాలుగు వర్గాల ఐక్య సంఘటనతో పార్లమెంటు ఎత్తుగడలను అవలంభించాలన్నాడు.

అత్యంత తీవ్రంగా, మౌలికమైన వ్యతిరేకత ముఖ్యంగా కార్యవర్గంనుండి, వారి సంఘాలనుండి ప్రధానంగా ఆంధ్రదేశంనుండివచ్చింది కార్మికవర్గంలో పనిచేసే కమ్యూనిస్టు నాయకత్వం, నూతన విధానం, సాహసికవాదమని అది పార్టీని దాని నిర్మాణానికి, ఆస్థిత్వానికి అత్యంత ప్రమాదకారియనే అవగాహనకు వచ్చింది. అయితే యీ కార్మికవర్గ నాయకత్వంనుండి వచ్చిన వ్యతిరేకత పార్టీ పరిమితులలో వుండుటవలన జోషి వ్యతిరేకత అంతగా వార్తలలోనికి ఎక్కలేదు.

జులై 1950లో కార్మికనాయకుడైన డాంగే, కమ్యూనిస్టు పార్టీ సాయుధ పోరాటానికి పథకాలు వేస్తున్నదనే ప్రచారాన్ని పత్రికా విలేఖరుల సమావేశంలో ఖండించి దురదృష్టకరంగా పార్టీ నాయకత్వం కొందరి ప్రవర్తనవలన అట్టి అభిప్రాయం యేర్పడిందన్నారు. తన అభిప్రాయాలు పార్టీ అభిప్రాయాలు కావని వివిధ వర్గాలు భిన్న అభిప్రాయాలను కలిగివుండుటతో యింకా చర్చలు జరుగుతున్నవని ప్రకటించారు. వారంరోజుల తరువాత డాంగే అభిప్రాయాలు, పార్టీ అభిప్రాయాలు కావనికమ్యూనిస్టుపార్టీ పొలిట్‌బ్యూరో అధికార ప్రకటన కావించింది. పరోక్షకంగా చర్చలు జరుగుటను బలపరచింది. వాస్తవానికి పార్టీలో ఎన్నడూ జరుగనంతటి తీవ్రంగా అంతర్గత పోరాటం జరుగుతున్నది. పార్టీలో క్రమశిక్షణ పూర్తిగ చిన్నాభిన్నమైంది.

## నూతన కేంద్ర కమిటి విధానంపై అజయ్, ఘూటే డాంగేల విమర్శన

సెప్టెంబరు 1950లో అజయ్‌ఘోష్, ఘూటే, డాంగేలు నూతన కేంద్రకమిటి దేశ రాజకీయ వాస్తవ పరిస్థితులను పరిగణించలేదని, ఆ కారణంగా ఆచరణ విధానంలో కలిగిన దుష్ఫలితాల విమర్శనా పత్రమే కాని సిద్ధాంతం కాదని తాము వ్రాస్తున్నది రాజకీయ, నూతన ఎత్తుగడల పంథాకూడ కాదని ముందుగా స్పష్టంచేశారు. ముఖ్యాంశాలు తెలుసుకొందాము.

1) నూతన కేంద్రసమితి ఏ రాజకీయ కార్యాచరణకైనా, వాస్తవ రాజకీయ పరిస్థితి, వర్గశక్తుల పరస్పర సంబంధాలు, వాటి ప్రభావాలు, పోరాటశక్తి, వివిధ రాజకీయ పక్షాల విశ్లేషణ, అధ్యయనం చేయకుండానే రాజకీయ వ్యూహాన్ని, ఎత్తుగడలను నిర్ణయించుట మార్క్సిస్టు, లెనినిస్టు విధానముకాదు. కొమిన్‌ఫారం పత్రిక ముందుంచిన ప్రత్యేక కర్తవ్యాలను నిర్లక్ష్యంచేయుట, పార్టీ అంతర్గత సంక్షోభాన్ని పరిష్కరించుటకు తోడ్పడదు.

మాజీ పార్టి నాయకత్వం "రష్యామార్గమని" నూతన నాయకత్వం "చైనా మార్గమని" వాటి కనుగుణ్యంగా "విప్లవ వెల్లువ" "అంతర్యుద్ధ పరిస్థితులని" చెప్పినవి. మన ప్రత్యేక పరిస్థితుల అధ్యయనంచేసి, అన్వయంచేయుటగాక యాంత్రికంగా ఆ నమూనాలను దిగుమతిచేశారు. దాని ఫలితమే సెక్టేరియనిజం గుడ్డి దుస్సాహసిక వాదంలో మునిగిపోవుటయని ముగ్గురు ముఖ్యులు తీవ్రంగా విమర్శించారు.

2) ప్రజా వుద్యమాల అసమానాభివృద్ధి, పోరాట పటిమ ప్రత్యేక లక్షణాలను పరిగణించలేదు. ప్రజా తంత్ర వుద్యమాల అనైక్యత బలహీనతలను గుర్తించి, ఐక్యతకుగల అవకాశాలను వినియోగించుటలో విఫలమయ్యారు. ఐక్య ప్రజోద్యమాన్ని నిర్మించుటలో ప్రధాన వైఫల్యముంది.

3) మాజీ పొలిట్‌బ్యూరో కొమిన్‌ఫారం సంపాదకీయంలో తన అతివాద సెక్టేరియనిజానికి; నూతన పొలిట్‌బ్యూరో 1948 ఆంధ్ర చైనా మార్గ సిద్ధాంతానికి పూర్తి మద్దతును చూచి వ్యవసాయ సంస్కరణలకై కార్మిక, కర్షక ఐక్యత ప్రాతిపధికగా, విస్తృత సామ్రాజ్యవాద వ్యతిరేకసంఘటన నిర్మించాలని పార్టీ ముందుంచిన కర్తవ్యాలను విస్మరించారు. గెరిల్లా వుద్యమమే కార్మిక, కర్షక ఐక్యతా నిర్మాణానికి పార్టీ ప్రజాపార్టీగా అగుటకు సాయుధ పోరాటంలో కార్మికవర్గ నాయకత్వానికి ప్రధాన ఆయుధమని వాదించింది. ముగ్గురు నాయకులు సి, సి. అంచెనాను, ఎత్తుగడలను కొమిన్‌ఫారం సంపాదకీయానికి యిచ్చిన వివరణను అంగీకరించజాలమన్నారు. ధనిక, మధ్యతరగతి రైతులలో కొందరు భూస్వాములు రూపంలో కౌలుకిస్తున్నారనే కారణంగా శత్రువర్గంలో జమవేయుటను అంగీకరించలేమన్నారు.

మనం విప్లవదశ నొక్కదానినే అవగాహన చేసుకొన్న చాలదు. ఉద్యమ స్థాయిని వాస్తవ పరిస్థితులను అవగాహన చేసుకొని కర్తవ్యాలను, ఎత్తుగడలను రూపొందించాలన్నారు. అట్లుగాక స్వీయ మానసిక, సెక్టేరియన్ దృక్పథంలో అచ

రణ ఫలితంగా మౌలిక తప్పిదాలు జరిగాయి. ప్రజలు కాంగ్రెసు నుండి పూర్తిగా దూరమయ్యారని ప్రజా వుద్యమాల విప్లవ ప్రవృత్తి, పరిపక్వతలను అతిగా అంచెనా వేసి, అగ్రగామి దళం నాయకత్వం వహించుటలో విప్లవ మహోద్యమం విజయవంతంగా కొనసాగుతుందనుట నూతన జాతీయ సమితి పొరపాటు అని విమర్శించారు. ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజల సమీకరించి వారిని మొహాకరించక అగ్రగామి దళాన్ని సాయుధ రైతాంగపోరాటంలోనికిదించి, ఎత్తుగడలలో అతివాద సెక్టేరియన్ దుస్సాహసిక విధానాలను చేబట్టుటతో పార్టీ ప్రజోద్యమాలు తీవ్ర నష్టాలకు గురయ్యాయి. తక్షణ సమస్యలపై ప్రజోద్యమాలను నడుపుతు ఐక్యతను పునరుద్ధరించి చీలికలను అధిగమించుటకు మారుగ, పిడివాద చర్యలతో పార్టీలో సంక్షోభాన్ని కలుగజేశారు.

ప్రజా వ్యతిరేక చర్యలకు నిర్బంధ విధానాలకు ప్రభుత్వమేగాక కాంగ్రెసు వాదులు పాత్రధారులని; కాంగ్రెసును-ప్రభుత్వాన్ని వేరుగ చూడజాలకపోయామని ముగ్గురు విమర్శించారు. అదే విధంగా కాంగ్రెసును, కాంగ్రెసును అనుసరించే ప్రజా సామాన్యాన్ని వేరువేరుగ చూడజాలకపోయాము. అభ్యుదయకరపార్టీయైన పీజెంట్సు అండ్ వర్కర్స్ పార్టీని బూర్జువా యేజంటుగా దూషించామని విమర్శించారు. అదే విధంగా యితర అతివాదశక్తులను విమర్శించాము. మనం సృష్టించుకొన్న "వేర్పాటు తత్వాన్ని ఆత్మ విమర్శనతో విడువజాలక వెనుతిరుగని, రాజీలేని విప్లవ పోరాటాలుగ" ప్రస్తుతించుకొన్నాము.

4) పాత పొలిట్ బ్యురో చేసినది "అతిశయోక్తి అంచెనా"గా "అత్యల్ప అంచెనా వేసిందని" నూతన సి. సి. లేఖ విమర్శించింది. పోరాట "వెల్లువ"ను మాత్రమే చూడగలిగింది కాని "పోరాట వెల్లువ" అప్పటికే "అంతర్యుద్ధ స్థాయికి బహిరంగ సాయుధ పోరాట" దశకు చేరిందని గుర్తించజాలకపోయిందని విమర్శించింది. పరిస్థితి "అఖిలభారత పోరాటస్థాయికి" చేరిందని మాత్రమే తలచింది గాని "సాయుధ చర్యతో పాలకవర్గాన్ని రూపుమాపే పరిపక్వతకు చేరలేదని" గుర్తించజాలకపోయిందని లేఖ తెలిపింది. అంతేగాక నూతన సి సి. "అంతర్యుద్ధం యిప్పటికే జరుగుచున్నదని "విప్లవం ప్రారంభమైందని" కాబట్టి "నేటిపరిస్థితులలో భారత విప్లవోద్యమ ప్రధాన పోరాట రూపం గెరిల్లా యుద్ధంగా అంతట జరుగుటయే"నని లేఖ పేర్కొంది. "కొన్ని ప్రాంతాలలో తప్ప దేశమంతటా పరిస్థితి పరిపక్వతకు చేరిందని" పాత పొలిట్ బ్యురో "గెరిల్లా పోరాటాన్ని మరచి సార్వజనీన సమ్మె శత్రువుతో నేరుగా తలపడుటలో మునిగి పోయిందని" విమర్శించారు ముగ్గురు ముఖ్యులు. అంతేగాక నూతన సి. సి. అంతర్యుద్ధం అనే పదానికి అర్థం మరచి పోయిందని తీవ్రంగా విమర్శించారు.

అతివాద వక్రీకరణ నివేదికలో "సాయుధ పోరాట" భాగంలో చేయబడిన వివరణ ఆశ్చర్యాన్ని గొల్పే పెటీ బూర్జువా విప్లవతత్వ ప్రదర్శనతప్ప మరేమికాదు. ఐక్య సంఘటనలో భాగస్వాములయ్యే అతివాదపార్టీ శక్తులతో "పోరాట దశ ప్రారంభంలో వున్నదని" అయినా పాలకవర్గాలను సాయుధ చర్యలలో రూపుమాపే పరి

పక్వదశకు పరిస్థితి వచ్చిందని పేర్కొంది పార్టీ చాలబలహీన పడిందని దేశంలో విశాలభాగంలో "కిసాన్ వుద్యమంలేదని" అంగీకరించింది. కాని "గెరిల్లా పోరాటా లను ఇండియా మొత్తంగా ప్రారంభించుటకు తగిన వాస్తవ పరిస్థితి వుందని సి.సి. పేర్కొంది, పార్టీ అనుభవం తెలంగాణా అనుభవం కమ్యూనిస్టుపార్టీ వొక్కటే వుండుట భౌతిక పరిస్థితులను కలిగియుండుటకాదని సి.సి.కి తెలుసు. ప్రజలలో పాతుకుపోయి, ప్రేమింపబడేది గౌరవింపబడేది రాజకీయ నిర్మాణ పరిష్టత గలిగిన పార్టీ నేడు లేదని అంగీకరించింది కానీ "సాయుధ గెరిల్లా పోరాటాల ద్వారానే అట్టి బలాన్ని, విస్తరణ పొందుతుందని వివరించింది. కార్మికులలో ప్రజలలో కనీస ఐక్యత లేదని సి.సి. అంగీకరించింది మరోవైపు "సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తు లను సమీకరించి, కష్టజీవులను గెరిల్లా పోరాటాలద్వారా ఐక్యపరచగల మంటుంది" అంతేగాక "ప్రజలలో రాజ్యాంగ చట్ట భ్రమలున్నాయని అంచేత పోరాటంలో పాల్గొ నుటలేదు" అని అంటూ లెలిన్, స్టాలిన్‌లు చెప్పిన విధంగా ప్రజలు తమ అనుభవా లతో సాయిధ పోరాట మార్గాన్ని చేబట్టుటయెంతోకాలం పట్టదని సాహసంతో నాయ కత్వం వహించుటయే తరువాయి" అని పేర్కొంది. అంటే పార్టీ విస్తరణకు, బల బడుటకు ప్రజల భ్రమలను తొలగించుటకు.సామ్రాజ్యవాద శక్తులన్నిటిని కమీకరించు టకు, వుద్యమం, పార్టీ ఎదుర్కొనే అన్ని సమస్యలకు పరిష్కరించుటకు "సాయుధ గెరిల్లా పోరాటం" మంత్రదండమని సి. సి. తెల్పుతున్నది. ఇదికూడ కాంగ్రెసు తదనంతర పత్రాలు, "ధైర్యంకల నాయకత్వం ఉద్వేగ ఆచరణ"లే సంస్కరణ వాదాలను ఎండగట్టి, కార్మికవర్గ ఐక్యత నిర్మించి సార్వజనీన సమ్మె తిరుగుబాటుకి, విజయానికి మార్గమని చెప్పిన మాటలను గుర్తుకు తెస్తున్నవి.

మన సి.సి.కి దేశవ్యాపిత సాయుధ పోరాట దృక్పధానికి, దేశవ్యాపిత సాయుధ పోరాట నినాదానికి భేదంలేదు. ఒకటి అవగాహన, రెండోది పరిస్థితుల ఒట్టి ఆచరణ మొదటిది. వొక దశకంతటి అవగాహన, రెండోది తక్షణ అచరణ కార్యక్రమం చేపట్టవలసినది. మాజీ నాయకత్వాన్ని నూతన సి.సి. సరిగానే విమ ర్శించినప్పటికి సరియైన నిర్ధారణలు చేయుటలో విఫలమై పాత పొరపాటులనే తిరిగి చేసింది. పరిస్థితి పరిపక్వమైందని మాజీ పొలిట్ బ్యురో రైల్వే సమ్మెకు పిలుపు యిచ్చుట తప్పని తీవ్రంగా విమర్శించి, నూతన సి.సి, "గెరిల్లా పోరాటాలకు వాస్తవ పరిస్థితులున్నవని అనేక ప్రాంతాలలో అంటూ స్పష్టంగా "ఇండియా మొత్తంగా కొన్ని ప్రాంతాలు మినహా" అని చెప్పింది. అసంతృప్తిని విప్లవ కోపాగ్నిగాను ప్రభుత్వం మారాలన్న కోరికను ప్రభుత్వంపై తిరుగుబాటు ఉద్వేగంగాను మాజీ పొలిట్ బ్యురో చూసింది అదే పనిని నూతన సి సి. చేసింది. అంతేగాని సి సి. అంచెనా విశ్లేషణ, ఆచరణ విధానాలకు మార్క్సిజం, లెనినిజాల సారాంశానికి యెట్టి సంబంధంలేదని లేఖ వివరించింది.

మాజీ పొలిట్ బ్యురో మార్చి జనరల్ రైల్వే సమ్మెకు పిలుపుయిచ్చినపుడు పరిస్థితులను, పార్టీ నిర్మాణ స్థితిని పరిగణలోనికి తీసుకొనలేదని నూతన సి సి. విమర్శించి, చిన్నాభిన్నమైన పార్టీ నిర్మాణాన్ని పార్టీలో, కార్మికవర్గంలో అనైక్య

తను పరిగణించక దేశమంతటా గెరిల్లా పోరాటాలకై విస్తృత ఎత్తుగడలను రూపొం దించింది. పైగా గెరిల్లా పోరాటాలవలనే పార్టీ బలపడి విస్తరించగలదని చెప్పింది. మన వుద్యమ అసమానాభివృద్ధిపై బలబుషేవిక్ చేసిన ప్రత్యేక హెచ్చరికను పెడ చెవిని పెట్టింది. ప్రజా సామాన్యంలో అధికభాగం పార్టీ కార్యక్రమాన్ని ఆమోదించి ప్రభుత్వ వ్యతిరేక ప్రదర్శనలు జరుపుట అనే కొలమానం నేడు సాయుధ పోరాటా లకు ప్రజల సంసిద్ధత తెలియజేయుట అవసరంలేదని, సామాన్య మద్దతు గెరిల్లా పోరాటాలకు సరిపోతుందనే నూతన సిద్ధాంతాన్ని నూతన సి. సి. ప్రతిపాదించుటను ముగ్గురు తీవ్రంగా విమర్శించారు. సాధారణ మద్దతు "ప్రభుత్వంపైద్వేషం" "నిర్మాణ ప్రయత్నాలతోనే అత్యున్నత పోరాట రూపమైన గెరిల్లా పోరాటం విజయం సాధిం చుట సాధ్యమా?" అని ప్రశ్నించారు, ఆంధ్రకమిటీ తయారుచేసి, సి.సి.చే సర్క్యు లేటు చేయబడిన పత్రమే యీ ప్రశ్నలకు సమాధానమంటూ నేటి సి. సి అవగాహ నలు వాస్తవానికి ఎంత దూరంగా వున్నవో తెలియజేస్తుంది. "మేము సూచించిన విధంగా సి.సి విప్లవానికి "దగ్గరిమార్గం వెతుకు ప్రయత్నఫలితమే" నూతన విధాన మని ముగ్గురిపత్రం తీవ్రంగా విమర్శించింది.

5) ఆంధ్ర అధికార పత్రంలో పెక్కు సరియైన అవగాహనలున్నా కొన్ని సూచనలు, నిర్ధారణలు, తీవ్ర దుస్సాహసిక, హింసా, దౌర్జన్య విధానంలో వున్నవి. దౌర్జన్యాలను రెచ్చగొట్టి అణచ ప్రయత్నించే యేజంట్లు, ప్రభుత్వాధికారులు, భూ స్వాముల చర్యలకు ప్రతిచర్యగా వారిని ఖతంచేసి, వారి ఆస్తులను ధ్వంసంచేసే కార్యక్రమంతో వారి వుచ్చులలోపడిపోవుట, ప్రజలనుండి వేరగుట, ప్రభుత్వానికే బలమైన ఆయుధాలగుట జరుగుతుంది. సి.పి. విప్లవానికి "దగ్గరిమార్గం" శోధించిన విఫల ప్రయత్న ఫలితము.

మరో ముఖ్యవిషయం బూర్జువా ప్రభుత్వవర్గాలు, హింసా, దౌర్జన్య ఆయుధా లనేగాక యితర ఆయుధాలనుపయోగించారు సామ్రాజ్యవాదం తమ వునికిని ఒక్క హింసాచర్యలతోనే కాపాడుకొనదలచక బూర్జువావర్గంతో రాజీమార్గాన్ని అవలంభిం చింది. ఇంతేగాక ప్రజోద్యమాలకు వ్యతిరేకంగా మరోమూడు ఆయుధాల నుపయో గించింది. హింసావిధానం, అరెస్టు, నిషేదాలు, కాల్పులు, గ్రామాలు ముట్టడి సామూ హిక దోపిడి, దౌర్జన్యం, అత్యాచారాలు, సమిష్టి పన్నులతోపాటు మరో ఆయుధంగా కార్మిక, కర్షక, విద్యార్థి ఉద్యమాలను చీల్చుట, విచ్ఛినం చేయుట, చివరి ఆయు ధంగా వయోజనవోటుహక్కుతో జనరలు ఎన్నికలు వాగ్దానంచేసి, ప్రజలలో భ్రమలు కలిగించింది. ప్రభుత్వ సంక్లిష్టమైన విధానాలను అర్థంచేసుకొనుటలో కేంద్రసమితి విఫలమైంది. ఫలితం తప్పుడు ఎత్తుగడలు రూపొందించుట, అతివాద వక్రీకరణ నివేదికలో ప్రభుత్వ రాజకీయ ఆయుధాలను పరిగణించుటలో విఫలమై రాజకీయ పోరాటాన్ని, మిలటరీ పోరాటాన్ని యాంత్రికంగా వొక్కటిగానే తలచి మాజీ నాయ కత్వపు పొరపాటునే కొనసాగించింది. గ్రామీణ ప్రాంతాలలో "కంటికి కన్ను. పంటికి పన్ను" అనే ప్రతిచర్య విధానాన్ని గ్రుడ్డిగా అనుసరించి అతివాద, సెక్టేరి

యన్, దుస్సాహసిక యాంత్రిక విధానాన్ని చేబట్టింది. వీటినే సామ్రాజ్యవాద, బూర్జువావర్గ, భూస్వాములు వర్గాల వ్యతిరేక పోరాటంగా చిత్రించింది.

6) తెలంగాణా పోరాటాన్ని నడపిన ఆంధ్ర కమ్యూనిస్ట్ నాయకులు 2వ, కాంగ్రెసు తదితర సిద్ధాంతాలపై ప్రప్రథమంగా విమర్శనాదాడిని చేసి తప్పులను సరిదిద్దినవారే అంతటి తప్పుడు విధానకర్తలెలా అయ్యారు?

ప్రథమంగా జూన్ 1948 ఆంధ్రపత్రం అనేక ప్రధాన విషయాలలో సరియైనదే అయినా అంతర్యుద్ధ విధాన రూపకల్పన తప్పు. ప్రభుత్వ సంక్లిష్ట వివిధ విధానాలను పాలకవర్గ వివిధ ఆయుధాలను పరిశీలించుటలో విఫలమైంది, ద్వితీయంగా కొన్ని ప్రాంతాలలో తప్పితే తెలంగాణా పోరాట లక్షణాలను చూడజాలము. తెలంగాణాలో రైతు పోరాటాల శిఖరాగ్రంగా గెరిల్లా పోరాటం అభివృద్ధి చెందింది. భూస్వాములు సామాజిక పీడన, దోపిడీ, దౌర్జన్య, దురాగతాలకు వ్యతిరేకంగా ప్రారంభమై, భూసమస్యపై పోలీసు, సైనిక అత్యాచారాలతో తిరుగుబాటుస్వభావం రూపొందింది. సాయుధ పోరాటానికి ముందే అన్ని పోరాట రూపాలలో ప్రజలను సమీకరించింది. సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటరూపం ఆ ప్రజలే సృష్టించుకొన్నారు. దానికి తదనంతర కాలంలో మెరుగులు దిద్దబడినవి. ఈ విధమైన సాయుధ పోరాటాన్ని సి.సి దేశమంతటా బలమైనపార్టీ పార్టీనిర్మాణం, బలమైన ప్రజాసంఘాలు కనీస పరిమితస్థాయి బడుగువర్గాల ఐక్యత లేకుండానే యాంత్రికంగా దేశమంతటా విస్తరింప తలపెట్టింది. "అతివాద వక్రీకరణ నివేదిక" మాజీ పొలిట్‌బ్యూరో పరిస్థితిని అతిగా అంచెనావేసి, ప్రజలకంటె ముందు పరిగెత్తిందని విమర్శించినా ఆ పని ఎందుకు చేయలేకపోయిందో వివరించలేకపోయింది. చివరి అంశంగా మాజీ పొలిట్‌బ్యూరో విధానాలను, ఎత్తుగడలను, హృదయపూర్వకంగా, మినహాయింపు లేకుండా కేంద్రసమితిలోని అత్యధికులు ఆమోదించుటయేగాక అయా రాష్ట్రాలలో పొలిట్‌బ్యూరో పంథాను రాజకీయ, నిర్మాణ, ఆచరణలలో అమలుపెట్టుటలో సెక్టేరియన్, దుస్సాహసిక విధానాలను అమలుచేయుటలో పొలిట్‌బ్యూరోను మించిపోయారు. అట్టి కేంద్రసమితి సభ్యులే నూతన విధానాన్ని ఆమోదించారు. కారణం పాత విధానానికి, కొత్త విధానానికి ప్రాథమికమైన భేదంలేక పోరాటం నగరాలనుండి గ్రామాలకు మార్పిడి చేయబడింది. "సాహసంతో నాయకత్వం", "ఉద్వేగ ఆచరణలలో" గుడ్డి నమ్మకం నూతన విధానంలో మరో రూపంలో వుంది. మాజీ సెక్టేరియనిజం, దుస్సాహసిక విధాన కర్తలు, నూతన విధానమునకు బలీయమైన మద్దతుదారులగుటతో ఆశ్చర్యం కలుగదు. అని ముగ్గురు విమర్శించారు.

### ఐక్య సంఘటన ముగ్గురు ముఖ్యుల అవగాహన

అజయ్, ఘాటే, డాంగేలు ఐక్యసంఘటన అవగాహనలు యీ క్రిందివిధంగా వున్నవి.

ప్రజాస్వామ్య ఐక్య సంఘటనను నిర్మించుటకు కార్మికవర్గ ఐక్యత వామపక్ష ఐక్యత రెండు ప్రధానాంశాలు. నవంబరు 1949లో కొమిన్‌ఫారం పత్రిక "కార్మిక

వర్గ ఐక్యత" ప్రతిదేశంలోను ప్రపంచంమొత్తంగాను నిర్ణయాత్మక పాత్ర వహించి తీరుతుందని స్పష్టం చేసింది. కార్మికోద్యమంలో యేర్పడిన చీలికను అధిగమించి ఐక్యతను పునరుద్ధరించుటకు యెట్టి ప్రయత్నం చేయలేదు. గత కొలది సంవత్సరాల నుండి కార్మికవర్గం ప్రభుత్వపు యాజమాన్యపు దాడులనువతిరేకించుతు తీవ్ర పోరాటాలు జరుపుట, వారి ఐక్యతా వాంఛ బలాన్ని తెల్పుతుంది. ఐక్యత సాధ్యమని, సాధించాలని తెలియచేస్తున్నది. వారి బలమైన ఈ కోర్కెను పార్టీ వాస్తవం చేయలేకపోయింది. ఎప్పటికప్పుడు ఐక్యతా విజ్ఞప్తులు చేస్తున్నా సెక్టేరియన్ అవగాహన పనివిధానాలు, ఎత్తుగడలు కారణంగా కార్మికవర్గ ఐక్యతను సాధించలేకపోయింది.

ఒక పరిశ్రమలో ఒకే పెద్ద కార్మిక ట్రేడు యూనియన్, ఫెడరేషన్ ఐక్య ట్రేడు యూనియన్ కాంగ్రెసు మన ప్రధాననినాదంగా వుండాలి. కనీసవేతనం, బోనస్, రిట్రెంచిమెంటు సమస్యలపై ఆచరణలో ఐక్యతను ఆ ప్రాతిపధికపై విస్తృత ఐకి కార్యాచరణోద్యమాన్ని నిర్మించాలి, ఎ ఐ టి యు సికి యుటియుసి ప్రతిపాదనలు భూమికగా ఐక్యతను నిర్మించుటకు చర్యలు తీసుకొనాలి సోషలిస్టు కార్యకర్తలలోని ఐక్యతా వాంఛను హైధరాబాద్ సమావేశంలోవెల్లడైంది. సోషలిస్టు నాయకత్వం అమెరికన్ ప్రభావాలకు లోనైవున్నా వారియూనియనులు, కార్యకర్తలు ఐ యన్ టి యు సి యూనియన్లవలె చూడరాదు. వాటికి కొన్నింటికి వాస్తవంగా ప్రజాసభ్యత్వముంది. నిజాయితీపరులైన కార్మిక కార్యకర్తలున్నారు. వీరిని కార్మిక వర్గ ఐక్యతకై సరియైన దృక్పధంలో ఆచరణ సహకారంతో ఐక్య కార్యాచరణ పెంపొందించాలి. క్రమేణా రెండు టియుసిల మధ్య ఐక్యత సాధించవలసివుంది. కార్మికవర్గ ఐక్యత జాతీయ ఐక్యసంఘటనకు పునాది. ఐక్యతతో రాజకీయచైతన్యం పెరిగి, రైతుల ప్రయోజనాలను, యితర వర్గాల కోర్కెలను చేబట్టుటతో ఐక్య జాతీయ సంఘటన రూపొందగలదు. ఈ విధమైన కార్మిక, కర్షక, బడుగువర్గాలను మధ్యతరగతి, విద్యార్థిల ఐక్యత జాగృతికలిగించి ఐక్య పోరాటాలలో కలసివచ్చే టట్లు చేసి సంఘటనను బలవత్తర మొనర్చగలదు .[1]

ఈ ఐక్యతపైనుండి నాయకత్వాల వొప్పందాల ఐక్యతగానేగాక ఐక్య కార్యాచరణ ఫలితంగా యేర్పటిన బలమైనదగుతుంది. వామపక్షాల ఐక్యత కార్మిక, కర్షక విద్యార్థి, మధ్యతరగతి వర్గాలలోని అనైక్యతా అఘాతాన్ని పూడ్చి కార్యాచరణోన్ముఖులను చేస్తుంది. కమ్యూనిస్టుపార్టీ సోషలిస్టు పార్టీని, పార్వర్డుబ్లాకును, వర్కర్స్ అండ్ పీజెంట్సు పార్టీని, యితర గ్రూపులను, ఐక్యతా సుముఖులైన కాంగ్రెసు సోషలిస్టులను, అతివాద కాంగ్రెసు వాదులను చొరవతో పిలుపునిచ్చి సమావేశపరచుటకు ప్రయత్నించాలి. నేరుగా సోషలిస్టు పార్టీకి అట్టి ఐక్యతా నిర్మాణానికి విజ్ఞప్తి చేయాలి. అట్టి ఐక్యతామార్గం, ఐక్య ట్రేడు యూనియన్ వుద్యమానికి, ఐక్య

1. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర అధికార పత్రాలు (ఆంగ్లంలో) వా VII పే. 1015-17. అజయ్, ఘాటే, డాంగేల "త్రీపీస్" పత్రము.

విద్యార్థి- కిసాన్ వుద్యమాలను, అన్నీ కలసిన ఐక్య మహోద్యమానికి తగిన వాతావరణాన్ని సృష్టించగలమని నొక్కి చెప్పదలచాము. [1]

ఐక్యతా అభివృద్ధికి, వుద్యమాభివృద్ధికి యే పక్ష చర్యలైనా వ్యతిరేకంగా వున్న విచ్ఛిన్న శక్తులను వేరుచేస్తూ నిజాయితీగల పోరాటశక్తులను ప్రోత్సాహమిచ్చే విధంగా ఐక్యతాభివృద్ధి ప్రధాన ధ్యేయంగా విమర్శన వుండవలసిందే. ఎట్టి పరిస్థితులలోనూ యే విమర్శనా నన్నంటరాదన్న నియమం వుద్యమాభివృద్ధికి తోడ్పడదు. వామపక్షాలలో నిజాయితీ శక్తులతోపాటు, తమ నాయకత్వాలను పెంపొందించుకొనగోరే వారున్నారని, వారివెనుక ప్రజాస్వామ్యముందని మనకుతెలుసు. ప్రజాసామాన్యంలో క్రమేణా జాగృతిని కలిగించి పోరాటోన్ముఖులను చేయాలి. వీరిలో బూర్జువా అతివాదులు గణనీయంగావున్నారు. వారిలో వూగిసలాట వుంటుంది. పోరాటాలు తీవ్రమైనచో కొంతమంది వ్యతిరేకులు అగుతారు. వారికంటె వారివెనుకనున్న వామపక్ష అభిప్రాయాలు గలవారు' వివిధ వర్గాలు, శక్తులు ముఖ్యం. వారు పోరాటాలలోనికివచ్చు విధానం నవలంభించాలి ఈ సందర్భంలో 1936-39లలో కమ్యూనిస్టులు అవకాశవాదాన్ని ఆశ్రయించి, ప్రాథమిక విషయాలలో సోషలిస్టు నాయకత్వానికి లొంగుబాటును ప్రదర్శించిన విషయాన్ని మరచిపోరాదు. దేశంలో ప్రజాస్వామ్య శక్తులు సోషలిస్టు, కమ్యూనిస్టు అభిప్రాయాలు గలవర్గాలు విస్తారంగా వున్నాయి. రోజురోజుకు అభివృద్ధి చెందుతున్నాయి. కార్మికవర్గ పార్టీయైన కమ్యూనిస్టు పార్టీ వాటిని సమీకరించి, సాధారణ ప్రజాస్వామ్య వుద్యమాన్ని అభివృద్ధి చేయవలసిన బాధ్యతవుంది.

రైతాంగ ప్రజాసామాన్యం విప్లవానికి ప్రధానశక్తి రైతాంగ పోరాటాలను అభివృద్ధి చేయుటలోనే విజయానికి నిర్ణయాత్మక పాత్రవుంది. మరే యితర వర్గాలకంటే రైతులలోనే కాంగ్రెసు భ్రమలు యెక్కువగా వున్నవి. కాంగ్రెసు రైతులకు చేసినంత ద్రోహం మరెవ్వరికీ చేయలేదు. భూ సంస్కరణ చట్టాలు అనేక సంవత్సరాలనుండి నత్తనడక నడుస్తున్నవి. బేదఖళ్ళు, జమీందారీలరద్దు పేరుతో అదనపు నష్టపరిహారభారం రైతులపై మోపబడింది. భారత పారిశ్రామికాభివృద్ధి ప్రణాళికల భారాన్నంతా పరోక్షంగా వ్యవసాయ పంటల పారిశ్రామిక వస్తువుల ధరలు వ్యత్యాసాల విధానాల ద్వారా ప్రభుత్వం రైతులపైనే మోపుతున్నవి. ప్రభుత్వ ధాన్యసేకరణ విధానం రైతులను నిర్దాక్షిణ్యంగా దోపిడీచేయు విధానం తప్ప మరొకటికాదు.

పాత పొలిట్ బ్యురో ధనికరైతులను ప్రధాన శత్రువులుగ, మధ్యతరగతి రైతులను వూగిసలాటదారులుగ పరిగణించి, రైతులందరిని పైనుదహరించిన అంశాలపై ఐక్యపరచుటకు సరియైన మార్గాన్ని రైతుసంఘాలకు యిచ్చుటలో విఫలమైంది. వాస్తవానికి దేశమంతటా రైతు సంఘాలు నామరూపాలు లేకుండా చేయబడ్డాయి. రాష్ట్రకిసాన్ సభలు పేపరు సంఘాలుగ వుండిపోయాయి.

---

1. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర అధికార పత్రాలు (ఆంగ్లంలో) వా VII పే. 1017-18. అజయ్, ఘూటే, డాంగేల "త్రీపీస్" పత్రము.

గ్రామీణ ప్రాంతాలలో ప్రభుత్వం అత్యంత బలహీనంగా వుంటుంది. గెరిల్లా ప్రాంతాలను, విముక్తి ప్రాంతాలను అభివృద్ధిచేసి, నిర్ణయాత్మక పోరాటాలు ఇక్కడే సాగించవలసివుంది. సామ్రాజ్యవాద శక్తిని చిన్న చిన్న ముక్కలుగచేసి యిక్కడే నాశనం చేయవలసివుంది సైన్యంలోని అత్యధికభాగం గ్రామీణులుగుటతో పూగిన లాట ప్రారంభమై పోరాటాలు తీవ్రమైన కొలది సైన్యంలోని క్రమశిక్షణ చిన్నా భిన్నమౌతుంది. అంచేత గ్రామసీమలలోని బలహీనత నధిగమించి, ప్రజారైతు వుద్యమాన్ని స్వచ్ఛంద దళాలను నిర్మించాలి. తెలంగాణాలాంటి సాయుధరైతాంగ పోరాటాలకు యిదే భూమికను తయారుచేయగలదు. రైతాంగ ఐక్యత బలమైన వుద్యమం, విస్తారప్రాంతాలలో గెరిల్లా పోరాటాలకు, అభివృద్ధికి యెంతో అవసరం. లేనిచో భూస్వాములు, వడ్డీవ్యాపారులుపై జరిపే సాయుధదాడులగానే వుంటుంది. పోరాటప్రాంతం విస్తరించి వుండనిచో గెరిల్లాలు పోలీసు సైనిక చర్యలప్పుడు తిరో గమనం కష్టమౌతుంది. తీవ్రనష్టాలు కలుగుతాయి. అన్ని తరగతుల రైతులలో ఐక్యతను నిర్మించి బలమైన రైతువుద్యమాన్ని నిర్మించాలి. వ్యవసాయకూలీ పేద రైతులయెడల ప్రత్యేకశ్రద్ధ వహించాలి.

"దున్నేవానికే భూమి" అనే కేంద్ర నినాదంతో వందల వేలమంది కాంగ్రెసు అభిమానులను గతంలో రైతుసంఘాలలో సమీకరించి వారి సహకారాన్ని వర్కర్స్ అండ్ పీజెంట్సు పార్టీ సోషలిస్ట్‌పార్టీలలో కార్యకర్తల సహకారాన్ని పొంది బల మైన వుద్యమాన్ని నిర్మించాము· భూమిశిస్తు, కౌలు 50శాతం తగ్గించాలని బేదఖళ్ళు రద్దుచేయాలని చట్టవిరుధమైన అన్ని వ్యూడలు వసూళ్ళు రద్దుచేయాలని, వ్యసాయ కూలీలకు కనీస వేతనమివ్వాలనే కోర్కెలతో వుద్యమాన్ని విస్తరింపజేయాలి. వ్యవ సాయ కార్యక్రమాన్ని రూపొందించి రైతు, కూలి, ప్రజా ఐక్యతను రూపొందిం చాలి ఈ కార్యక్రమం ప్రచార ఆందోళనలతోనే సాధించలేమని; కౌలు, లెవీల నిరా కరణ, బేదఖళ్ళ భూముల ఆక్రమణ, సాయుధ రైతాంగ దళాలతో వాటి రక్షణ, వ్యవసాయ వుద్యమ పంథాకావాలి. ఉద్యమానికి ప్రతిదశలో దృఢనాయకత్వంతో పరిస్థితులు పరిపక్వతతో సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటాల పథంలో నడపాలి.

ప్రభుత్వాన్ని పడగొట్టుటకై యీ రైతాంగ గెరిల్లా పోరాటాలు ఉద్దేశించబడ లేదు. భూస్వాముల, గుండాల, పోలీసుల హింసా, దౌర్జన్య, అత్యాచారాలనుండి తమ మాన, ప్రాణ, ఆస్తుల రక్షణకై రైతాంగ ప్రజలు సాయుధులై ప్రతిఘటించుతారు. కోర్కెల న్యాయబద్ధత, వుద్యమ రక్షణచర్యల అవగాహన దృక్పధాన్ని బహుళ ప్రచారంగావించి, ప్రభుత్వ, భూస్వామ్యవర్గాల దుష్ప్రచారాన్ని వమ్ముచేయాలి. వాస్తవాన్ని ప్రజల ముందుంచి, దీనిని సంస్కరణవాదంగా త్రోసివేసి తెలంగాణా పోరాటం ప్రజలకు దూరమగునట్లు చేయరాదు.

నూతన కేంద్రసమితి విధానంపై ముగ్గురు ముఖ్యుల విమర్శన క్లుప్తంగా; 1) పాత పొలిట్‌బ్యూరో సెక్టేరియన్ వ్యూహపు కొనసాగింపే నూతన పంథా, ధనిక మధ్య తరగతి రైతులపై వైఖరిలో యిదిస్పష్టం. 2) దేశ నిర్దిష్ట వాస్తవ పరి

స్థితుల భూమికపై రూపొందించక యాంత్రికంగా చైనాసారూప్యతను కొనివచ్చింది. 3) ఉద్యమదశ పరిపక్వత చెందిన అంతర్యుద్ధ దశగా, ప్రజా చైతన్యస్థాయి మన బల ప్రభావం, సమీకరణ శక్తులను అతిగా అంచెనావేసిన పంథా, 4) కార్మికవర్గ పాత్రను, మన కార్మికవర్గ పోరాటాలు నేర్పిన పాఠాలను తృణీకరించు పంథా, ఆచరణలో కార్మికవర్గ నాయకత్వ పాత్రను నిరాకరించు పంథా, 5) ప్రభుత్వ రాక్షస హింసాకాండ పేరుతో నిర్దిష్ట ప్రజాపంథాను రూపొందించు కర్తవ్యాన్ని విడనాడుట. ప్రజా సమస్యలపై ఐక్య కార్యాచరణను విడనాడుట, ప్రభుత్వ బలాన్ని అతిగాను, ప్రజా శక్తులబలాన్ని అల్పంగాను అంచెనావేయుట, 6) "నూతన కొలమాన"మన్న పేరుతో ప్రజలకు సానుభూతిపరుల స్తబ్దత పాత్రను యిచ్చి తెలంగాణా పాఠాలను నిర్లక్ష్యంచేయు పంథా 7) ఉద్యమ అసమానాభివృద్ధిని పరిగణించక ఒకే సారూప్య నినాదాలను, ఎత్తుగడలను రూపొందించి, వుద్యమస్థాయి నుండి పోరాట రూపాలను వేరుచేయు పంథా 8) "వాస్తవ పరిస్థితులు" అనేపేరుతో నిర్మాణ, చైతన్యాల ప్రాముఖ్యతను తృణప్రాయం చేసి, పార్టీని, పార్టీ పునర్నిర్మాణాన్ని ప్రజలతో సంబంధాలను తృణప్రాయం చేయుపంథా 9) కామిన్‌ఫారం సంపాదకీయం రూపొందించిన ప్రత్యేక మన కర్తవ్యాలను నిర్లక్ష్యంచేస్తూ, సాయుధపోరాటంతో అన్ని కర్తవ్యాలు నెరవేరుననే పంథా 10) గత సంఘటనలన్నీ ఒకే దృక్పథంతో అవగాహన చేసుకొనుట అపభ్రంశపు పంథా. ప్రజాశక్తుల అనైక్యతపై ప్రభుత్వబలం ఆధారపడివుందని చూడజాలక, ఐక్యతా నిర్మాణానికి ఎట్టి ప్రయత్నంచేయని పంథా. 11) గెరిల్లా పోరాటమనే పేరుతో అతినికృష్ట దుస్సాహసిక విధానాన్ని చేబట్టి, పార్టీని మరింత నిర్వీర్యం చేసి, శత్రుబలాన్ని పెంచే పంథా 12) పార్టీని రద్దు చేయు పంథాయని నిశితంగా విమర్శించారు.

ఈ కారణాలవలన మన కొత్త కేంద్రసమితి విధానాన్ని అంగీకరించజాలమని స్పష్టంచేశారు. రాజకీయ పరిస్థితిని, ఎత్తుగడలను పరిశీలించుటకు, పార్టీ విచ్ఛిన్నత నుండి కాపాడుటకు, పార్టీ కాంగ్రెసును పిలవాలని, ఉద్యమ పరిస్థితిని అంతర్జాతీయ కమ్యూనిస్టు నాయకత్వానికి వివరించి, వారి సహాయాన్ని, కొమిన్‌ఫారం పత్రిక సంపాదకీయపు అధికార వివరణను పొందాలని అజయ్, ఘాటే, డాంగేలు కోరారు.

## విదేశ నూతన సలహాలు

బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం మూడు సంవత్సరాల మౌనాన్నివిడిచి, అజయ్‌ఘోష్ పార్టీలో "పరిష్కరింపబడని సంక్షోభం" యేర్పడిందని ప్రకటించిన సెప్టెంబరు 1950 చివరలోనే మార్గదర్శక పాత్రను చేబట్టి బ్రిటిష్‌పార్టీ రాజకీయ కమిటీ, భారత కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీకి వొక రహస్య రాజకీయ లేఖను పంపింది.

బ్రిటిషు కమ్యూనిస్టు పార్టీ సలహాపై తగిన చర్యలు చేబట్టుటకు నిరాకరించుటయేగాక పార్టీలో బ్రిటిషు కమ్యూనిస్టుపార్టీ లేఖను సాధారణంగా అధికారపూర్వకమైనదిగా పరిగణించే దానిని బ్రిటిషు సలహాను తొక్కిపెట్టింది. మూడుమాసముల

తరువాత డిశెంబరులో కేంద్ర పార్టీ ఆఫీసు చేతులలోనికిరాగా, అది స్వంత బాధ్యతగా చేబట్టి పార్టీలో సర్క్యులేటు చేయుటతో అందరి దృష్టిలోకి వచ్చింది.

భారతదేశ పరిస్థితిపై యెట్టి విశ్లేషణ చేయనందుకు పార్టీ పునర్నిర్మాణానికి యెట్టి ప్రతిపాదనలు చేయనందుకు భారత కమ్యూనిస్టు పార్టీని గర్హించింది. పార్టీలోని సంక్షోభాన్ని పరిష్కరించమని కోరింది. అందుకు విస్తృత చర్చల అవసరమని సూచించింది. పార్టీ కార్యకర్తలందరికి విస్తరించిన చర్చలు జరపాలని కోరింది. పార్టీ సభ్యులందరి విశ్వాసాన్ని చూరగొన్న నూతన నాయకత్వాన్ని ఎన్నుకొనాలంది. నాడున్న కేంద్రకమిటీనుండి నాయకత్వాన్ని ఎన్నుకొనుట "ప్రజాసామ్యాన్ని నిరాకరించుటగా" పేర్కొంది. పార్టీలోని "ట్రాట్స్కైట్, టిటోయిస్టు" కొన్సరును తొలగించి వేయాలని, పార్టీ కాన్ఫరెన్సు ద్వారా ఈ కర్తవ్యాన్ని నిర్వహించాలన్నది అత్యంత ప్రాముఖ్యతగల శాంతి, కొరియా అంతర్జాతీయ సమస్యలపై పెరిగిన జీవన ప్రమాణాలపై, బీహారు కరువుకాటకం, ఇతర తక్షణ రాజకీయ ఆచరణ కార్యక్రమాలపై యెట్టి విధానాన్ని చేబట్టకుండుట తీవ్రవిమర్శకుగురైంది. మౌలిక ప్రధాన సమస్య, కొమిన్‌ఫారం జనవరి వ్యాసంలోని విషయాలను వక్రీకరించి, పార్టీ తక్షణ సమస్య సాయుధపోరాటంగా రావు నాయకత్వం పరిగణించుట. సాయుధ పోరాట ఎత్తుగడనుండి భారతదేశాన్ని మినహాయించలేదు. లేఖ ఆ పంథాని విజయం లక్ష్యంగా చేబట్టాలి. భారతదేశంలో కమ్యూనిస్ట్ పార్టీలోని పరిస్థితులలో అది తక్షణ సమస్య గాదు. చట్టబద్ధ కార్యక్రమాలకు గల అవకాశాలన్నిటిని ఐక్యంగా రాబోయే ఎన్నికలలో తన పాత్రను పార్టీ నిర్వహించాలని ముగించింది. [1]

ఈ లేఖ పంపిణీ చేయబడిన మూడు వారాలలో పార్టీ కేంద్రకమిటి సమావేశమై పరిస్థితిని సమీక్షించి, శాంతియుత పార్టీకి ప్రధానంగా రాజకీయ కార్యక్రమాన్ని, పాఠ్యపుస్తకాలలోని విప్లవ కార్యక్రమంగాక, తక్షణ వాస్తవిక, ఆచరణ యోగ్యమైన కార్యక్రమాన్ని రూపొందించే పనిని చేబట్టింది. కాని, సమావేశానంతర ప్రకటనలో "ఈ సమావేశంలో ప్రధాన రాజకీయ అభిప్రాయభేదాలను కూలంకషంగా చర్చించి, ఆమోదం పొందిన రాజకీయ విధానాన్ని రూపొందించుట సాధ్యం కాలేదని" ఆమోదించింది. అంచేత కేంద్రకమిటీని విస్తరించి, నూతన పొలిట్ బ్యురోని ఎన్నుకొంది. ఈ నాయకత్వ సంస్థలలో పార్టీలోని అన్ని రాజకీయ వైఖరులు, దృక్పధాలకు ప్రాతినిధ్యం యివ్వబడింది. రాజేశ్వరరావు తాత్కాలికంగా జనరల్ సెక్రటరీగా కొనసాగాడు. కేంద్రకమిటి సాధ్యమైనంత తొందరగా పార్టీ కాంగ్రెసును జరుపుటకు నిర్ణయించింది. పి సి జోషిని తిరిగి పార్టీలో చేర్చుకొనే ప్రతిపాదన ఆలోచనలో వున్నదని ప్రకటించింది. వచ్చే ఎన్నికలకు అతివాదపార్టీలతో, అభ్యు

1. సి.పి.జి.బి. రాజకీయ కమిటి, సి.పి ఐ. కేంద్ర కమిటీకి వ్రాసిన లేఖ. కేంద్ర ఆఫీసు, పార్టీ యూనిట్ ఉపోద్ఘాతంతో డిశంబరు 6, 1950 సర్క్యులేటు చేయబడింది. కమ్యూనిజం ఇన్ ఇండియా. పే. 303 లోని ఉదహరింపు.

దయ కాముకులతో కలసి "ఐక్యసంఘటన" యేర్పాటు చేయుటకు, తక్షణ రాజకీయ సమస్యలపై కొన్ని తాత్కాలిక తీర్మానాలను చేసింది.[1]

ఇదే సమయంలో భారత కమ్యూనిస్టు పార్టీ లేవనెత్తిన ఐదు ప్రశ్నలకు రజనీ పామీదత్తు పంపిన సమాధానాలు చేరినవి. పామీదత్తు ప్రశ్నలకు సమాధానాలుగ, నూతనదశకు సంక్షిప్త సూచనలతో రాజకీయ విధానాన్నే సూచించాడు ప్రథమప్రశ్న శాంతి ఉద్యమానికి సంబంధించింది. ఆంగ్లో, అమెరికన్ సామ్రాజ్యవాదుల కూటమికి వ్యతిరేకంగా శాంతి ఉద్యమాభివృద్ధికి, ఆసియా విముక్తికి ప్రజాసమీకరణ కావించా లన్నాడు. రెండవ ప్రశ్నకు సమాధానంగానే, నూతన రాజకీయ విధానానికి కేంద్ర కీలకాంశాన్ని సూచించారు. కొరియా సమస్య, చైనాను ఐక్యరాజ్య సమితిలో సభ్యు రాలిగా చేయు సమస్యల యెడల నెహ్రూ వైఖరి విషయమై సమాధానమిస్తూ, భారత దేశ విదేశాంగ విధానంలో మార్పులకు సూచనలు యిప్పుడు కన్పడుతున్నవి, యిది ప్రారంభము. అంతర్జాతీయ రాజకీయాలలో యిది ముఖ్య పరిణామము. నెహ్రూ విధానంలో యిది "ప్రారంభం, వూగిసలాటతో," యింకా స్థిరమైన శాంతి విధానం కాకపోయినప్పటికి "వెనుకడుగులతో పరిమిత"మైనప్పటికి సామ్రాజ్యవాద యుద్ధ విధానానికి వ్యతిరేకమైనది. "యుద్ధకూటమిలోనుండి ఇండియాని బయటకి తీసుకొని వచ్చే ప్రతి అడుగు ఆహ్వానింప తగినది,ఆక్రమాన్ని వేగవంతం చేయుటకు మహో ద్యమాన్ని చేబట్టాలి. ఈ వైఖరి గత మూడు సంవత్సరాలుగ అంతర్జాతీయ కమ్యూ నిజం నెహ్రూ వ్యతిరేక విధానాన్ని అనుసరించు వైఖరికి స్వస్తిచెప్పుట అగుతుంది. విదేశాంగ విధానంలో సఖ్యతకు మార్గ మేర్పడుతుంది. శాంతి విధానంలో నెహ్రూ స్నేహపాత్ర గుర్తించబడింది. దత్తు మరో ముఖ్యవిషయమై ప్రస్తావించాడు శాంతి వుద్యమపాత్ర, శాంతి స్వాతంత్ర్యోద్యమాల మధ్యగల సంబంధము వివరించాడు. యుద్ధాలన్నీ సామ్రాజ్యవాద యుద్ధాలు కావున, శాంతిని కోరే యే వ్యక్తియైనా సామ్రాజ్యవాదం నుండి స్వాతంత్ర్యాన్ని, స్వేచ్ఛను కోరుతాడు అని తెలిపాడు.అంతే గాక భారతదేశానికి నూతన ఎత్తుగడల పంథాను, సాధారణ ప్రజాస్వామ్య కార్య క్రమం ఆధారంగా, అతివాద పార్టీల, తదితర సంస్థల ఐక్యసంఘటనను సూచిం చాడు. ఈ విస్తృత ఐక్యసంఘటనపై నుండి అభ్యుదయకర యితర పార్టీల ప్రతి నిధుల, నాయకుల మధ్య వొప్పందాలతో యేర్పడాలి. అది సమిష్టి అచరణ కార్య క్రమాన్ని శాంతి, స్వాతంత్ర్యం పునాదిగా అత్యధిక మెజారిటి ద్దతును, తనంతట తాను ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని యేర్పాటు చేయగలందులకు రూపొందించాలి. అంతేగాక దత్తు నేటి భారతదేశ పరిస్థితులలో హింసాబల ప్రయోగ ఎత్తుగడలు అసం గతాలని దత్తు స్పష్టం చేసాడు సాయుధ పోరాటం అవసరం పరిస్థితులు పరిపక్వమై నపుడు వుంటుంది, కాని నేటి పరిస్థితులలో దానికి స్థానంలేదని దత్తు స్పష్టంచేసాడు చేవెన్, బాలకృష్ణలకు లండన్‌లో యిచ్చిన ఇంటర్వ్యూలో దత్తు, నెహ్రూ ప్రభుత్వా నికి నూతన నిర్వచనాన్ని, బడా బూర్జువావర్గ ప్రభుత్వమైనా, ఆ వర్గంతోని ఒక

1. క్రాస్‌రోడ్స్, 28, డిశెంబరు, 1950, పే 5-6.

భాగం పటేల్ నాయకత్వంలోనిది. సామ్రాజ్యవాదులవైపు మొగ్గుతుందని, మరో భాగం నెహ్రూ నాయకత్వంలో సామ్రాజ్యవాదులకు దూరంగా వుండదలచిందని పూర్వ అవగాహనను బలపరచారు. బడా బూర్జువా వర్గంలోని కొందరు భారతదేశము చైనాకు పరిహద్దులను కలిగివున్నందున, చైనాతో యుద్ధం వినాశకరమని, అంచేత సామ్రాజ్యవాదులకు అన్ని విషయాలలో అనుకూలమైన వైఖరిని విదేశాంగ విధానంలో అనుసరించుటకు వ్యతిరేకంగా ఉన్నారు. అంచేత భారత ప్రభుత్వం వూగిసలాడుతుంటుందని, సామ్రాజ్యవాద వ్యతిరేక వైఖరిని పెంపొందించుటకు ప్రజోద్యమ వొత్తిడి సాగించాలని దత్తు వివరించారు.

సంక్షిప్తంగా, యీ లేఖలద్వారా 1950 చివరలో దత్తు, "జనతా ప్రజాస్వామ్యం, నూతన ప్రజాస్వామ్యం" ప్రతిపాదించినా, సాయుధ విప్లవాన్ని తత్కాలానికి వ్యతిరేకించాడు. నాలుగువర్గాలు ఐక్యసంఘటనలో, అభ్యుదయ పార్టీలను పైనుండి ఐక్యంచేయుట ద్వారాగాని, క్రిందినుండి కాంగ్రెసుకు వ్యతిరేకంగా ఐక్య సంఘటనను యేర్పరచుట ద్వారాకాని ఆచరణలో పెట్టాలన్నాడు.

## నవంబరు 1950 పొలిట్‌బ్యూరో చిత్తు రాజకీయ తీర్మానం :

నూతన పొలిట్ బ్యురో నవంబరు 1950లో చిత్తు రాజకీయ విధానపు తీర్మానాన్ని పార్టీ కాంగ్రెసు పూర్వచర్చల నిమిత్తం విడుదల చేసింది. అందులోని ప్రధానాంశాలు ముఖ్యంగా వ్యూహం, ఎత్తుగడలకు సంబంధించిన అంశాలు చూద్దాము. పార్టీలో యేర్పడిన సంక్షోభం, పార్టీ విధానాలపై దేశ, విదేశీయ కమ్యూనిస్టు వర్గాల విమర్శనాంశాలను పరిగణలోనికి తీసుకొన్నట్లు కన్పించదు.

నేటి ఉత్పత్తి, సామాజిక సంబంధాలులోని వివిధవర్గాల ప్రయోజనాలు వారు జనతా ప్రజాస్వామ్య విప్లవంలో వహించుపాత్రను నిర్దేశించుతాయి.[1]

1) కార్మికవర్గం సమాజ వుత్పత్తిగల స్థానాన్నిబట్టి అత్యంత విప్లవకరశక్తి, సోషలిస్టు విప్లవంలో నిలకడ, నిర్మాణంగల శక్తివంతమైన పోరాటశక్తి వలన, అర్ధ వలస ప్రపంచంలో భారత కార్మికవర్గం సంఖ్యాబలం కలది. రాజకీయరంగంలో అనేక దశాబ్దాల క్రితమే ప్రవేశించి, స్వాతంత్ర్య పోరాటంలో ముఖ్యపాత్ర వహించింది. రాజకీయ చైతన్యం కలది. గ్రామీణ సంబంధాలను యింకా బలంగా కలిగి వున్నందున, సహజంగా రైతాంగమిత్రుడగుటచే వ్యవసాయ విప్లవంలో నాయకత్వం వహిస్తుంది. వలస స్వాతంత్ర్య పోరాటాలలో వ్యవసాయ విప్లవం ఇరుసులాంటిది. భారత కార్మికవర్గానికి ప్రజావిముక్తిలోనే తన విముక్తివుందని తెలుసు. ఆ కారణముగా, అగ్రగామిదళమైన కమ్యూనిస్ట్ పార్టీ నాయకత్వంలో కార్మికవర్గం జాతి విముక్తి పోరాటంలో నాయకత్వ పాత్రకు తగిన సామర్థ్యం కలది.

---

1. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర. అధికారపత్రాలు (ఆంగ్లంలో) వా VII పే 1040-41. భారత జనతా ప్రజాస్వామ్య విప్లవం అనే చిత్తు తీర్మానంలో 5, 6, 7, 8 ప్రకరణములు మాత్రమే ప్రకటించబడినవి. పే 1040-87.

2) రైతాంగం పోరాట శక్తులలో అత్యధిక సంఖ్యాబలం కలది. గ్రామసీమలలో ఫ్యూడలు, అర్థఫ్యూడలు, సామ్రాజ్యవాద, గుత్తపెట్టుబడి వర్గాల, వ్యవసాయ ఆర్థిక సంబంధాల అత్యధిక దోపిడికి గురి అగుటచే వలసల వ్యవసాయ విప్లవంలో ఇరుసు లాంటివి, జనతా ప్రజాస్వామ్య విప్లవ నేటిదశయైన వ్యవసాయ విప్లవంలో రైతాంగం ప్రధానశక్తి.[1]

వ్యవసాయంలో ఫ్యూడలు, అర్థ ఫ్యూడలు ఆర్థిక సంబంధాలు పెట్టుబడిదారి విధానాభివృద్ధికి ఆటంకం. సామ్రాజ్యవాద పరిధిలో వ్యవసాయంలో పెట్టుబడిదారి సంబంధాలు యేర్పడి అభివృద్ధిచెందుతున్నవి. పెట్టుబడిదారి దోపిడితోపాటు, ఫ్యూడలు దోపిడి, రూప భేదాలతో కొనసాగుటవలన రైతాంగంపై మోయలేని బరువుపడింది. ఈ అవగాహనలేనందున "మితవాద అవకాశవాదం", "అతివాద, వొంటెత్తువాదాలు వేరువేరు కాలాలలో చోటుచేసుకొన్నవి. ఈ రెండు ధోరణులు పోటీ పడినాయి, గ్రామీణ ప్రాంతాలలో పెట్టుబడిదారి విధానం పెరుగుతున్నది. దున్నేవానికే భూమి అనే నినాదముతో ఫ్యూడలు వ్యతిరేక వ్యవసాయ విప్లవం తక్షణ కార్యక్రమముగా భారత ప్రజాస్వామ్య విప్లవ పోరాటము చేబట్టవలసి యున్నది.

రైతాంగం వొకే వర్గంగాలేదు. అభివృద్ధిక్రమంలో అంతరాలు పెరిగిన వర్గ విభజన జరుగుచున్నది. పేదరైతులు వ్యవసాయ కూలీలుగ మారుతున్నారు. ధనిక రైతులు మరింత ధనిక రైతులగుతున్నారు. రైతులలో వర్గ విభజన నిరంతరం జరిగేక్రమం, బీదరికం పెరిగే విధానము. వ్యవసాయ కూలీలగా ఉత్పత్తి పరికరాలు లేవు కూలిచేసుకొని జీవించాలి గ్రామసీమలలో సంవత్సరంలో 100-150 రోజులకుమించి పనిలేదు. నగరాలలో జరిగే పారిశ్రామికీకరణ, గ్రామాలలోని అదనపు శ్రామికశక్తిని పూర్తిగ వినియోగించుకొనలేక పోతున్నది. అంచేతనే నగరాలలో పనిలేని బడుగు వర్గాలు పెరిగిపోవుట సామాజిక జీవితంలో అనిశ్చిత పరిస్థితిని కలుగజేస్తున్నది. గ్రామాలలో వ్యవసాయ కూలీలు, కౌలుదారులు, పేదరైతులు, రైతాంగంలో వీరే అధిక సంఖ్యాకులు. ఫ్యూడలు, పెట్టుబడిదారి విధానాల పీడనలకు గురి అగుతున్నారు. వీరే జనతాప్రజాస్వామ్య విప్లవంలో కార్మికవర్గానికి, దృఢమైన మిత్రులు, వ్యవసాయ విప్లవానికి రథసారధులు, అగ్రగాములు.

మధ్యతరగతి రైతులు మరో విప్లవవర్గం, కౌలుదారులుగ, రైతులుగ వడ్డీ వ్యాపారుల, ఫ్యూడలు దోపిడీలకు గురియగుచున్నారు. వీరు పైనవర్గానికి ఎగబ్రాకే అవకాశాలు తక్కువ. జీవితం నానాటికి దుర్భరమై క్రమేణా పేదరైతులుగ వ్యవసాయ కూలీలుగ మారుతున్నారు. ఈ వర్గం యితరులను దోపిడి చేయదు, చేయలేదు. సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజం, దేశీయ బడా బూర్జువా వర్గాలచే దోపిడి చేయబడుతున్నది. అందుచే సామ్రాజ్యవాద. ఫ్యూడలు వ్యతిరేక వ్యవసాయ విప్లవంలో దృఢమైన పాత్ర వహించగలదు. కార్మికవర్గానికి మిత్రులు, సోషలిస్ట్ విప్లవదశలో కూడ మిత్రులుగ వుంటారు

---

1. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర. అధికార పత్రాలు సి.పి.హెచ్. వా VII పే. 1041-45.

ధనిక రైతులుకూడ "భూస్వామ్య విధానరద్దు, దున్నేవానికే భూమి" అను నినాదంలో వారి కోర్కెలు యిమిడి వున్నందున, ఫ్యూడలు వ్యతిరేక వ్యవసాయ విప్లవ దశలో కలిసివచ్చే అవకాశాలున్నవి. ప్రజాస్వామ్య విప్లవంలో వీరితో కార్మికవర్గం ఐక్య సంఘటన యేర్పాటు చేయునపుడు పరిగణించవలసిన అంశాలు: 1) ఈ వర్గం సహజంగానే పెట్టుబడిదారి వర్గంవైపు వుంటుంది. 2) ధనిక రైతు తాను వుత్పత్తిలో పాల్గొంటున్నా వేతన కూలీలను దోపిడి చేస్తూ వుంటాడు. 3) ధనిక రైతువర్గంలో కొందరు వడ్డీవ్యాపారం, కౌలుకిచ్చుట తదితర ఫ్యూడలు దోపిడిని కొనసాగిస్తూ వుంటారు. ఈ లక్షణాలు వారు పోరాటంలో పాల్గొనుటను లేక పాలకవర్గ విప్లవ ప్రతిఘాతక శక్తులతో బహిరంగంగా కలియుటనో లేక ఊగిసలాటనో, పోరాటంలోని ఆటుపోటులకు లోనగుతూ వుంటుంది. దున్నేవానికి భూమి పోరాటంలో ధనికరైతు కలసివచ్చుట వాస్తవమైనా, వేతన కూలీలను వినియోగించుటవలన కూలీల వేతనాల పోరాటాలలో వ్యతిరేకవర్గంలో వుండుటను మరువరాదు. ఈ లక్షణాలతోపాటు, అతని ఫ్యూడలు దోపిడికి ప్రాధాన్యత విప్లవ పోరాటాల యెడల అతనివైఖరిని నిర్ణయిస్తుంది. విప్లవ రైతు వుద్యమంలో రైతుల కమిటీలు, భూముల కమిటీలు, గ్రామ కమిటీలలో యీ వర్గానికి నాయకత్వ అవకాశాన్నిచ్చుట ప్రమాదకరం. అట్టి కమిటీలలో కార్మిక, కర్షక వర్గాల ఆధిక్యత ప్రధానమైనది. కార్మికవర్గం, కమ్యూనిస్టుపార్టీ, ధనిక రైతువర్గంతో సహకారాన్ని నెరపుతు, వారి వూగిసలాటను విమర్శిస్తూ, బూర్జువా ప్రభావాన్నుండి దూరం చేయాలి.

మరో ముఖ్యవిషయం ఎంత చిన్నదైనా ఫ్యూడలు వర్గాలనుండివచ్చిన ధనిక రైతువర్గం కొంతవుంది. వారి ప్రధాన ఆదాయం కౌళ్ళనుండి, వడ్డీవ్యాపారం, ఇతర వ్యాపారాలనుండి వస్తుంది ఫ్యూడలు వర్గాలతో దగ్గరిసంబంధం కలిగివుంటుంది. వీరు మిత్ర వర్గంలోని వారుకారు. అయితే ప్రతి ధనికరైతు ఎంతో కొంత ఫ్యూడలు విధాన దోపిడి కొనసాగిస్తుంటాడనే విషయాన్ని మరువరాదు. ఏ రకపు దోపిడి ఆధిక్యతను కలిగివున్నదానిని బట్టి వర్గీకరణచేసి విప్లవ వ్యతిరేకూడా, అనుకులుడా అని నిర్ణయించవలసి వుంటుంది. ప్రజాస్వామ్య విప్లవంలో ప్రభుత్వ ఫ్యూడలు హింసాకాండ, దౌర్జన్యాలకు నాయకత్వం వహిస్తున్నాడా, లేదా అనేది భూములను స్వాధీనం చేసుకొని పంచుటలో గమనించి, పరిగణలోనికి తీసుకొనవలసి వుంటుంది.

3) పెటీబూర్జువాల పాత్ర ప్రజాస్వామ్య విప్లవంలో అత్యంత ప్రాధాన్యత వహించుతుంది. చేతివృత్తులవారు, చిన్న ఉత్పత్తిదారులు, విద్యార్థులు, ఉపాధ్యాయులు తక్కువ జీతపు ఉద్యోగులు, మేధావులు, స్వేచ్ఛావృత్తులవారు, నగర పేద, బడుగు వర్గాలవారు వీరిలో వున్నారు. ధరలు, అద్దెల పెరుగుదల, నిరుద్యోగము, తక్కువ జీతాలు, విద్యాసౌకర్యాలు లేకపోవుట ఈ వర్గాలలో ప్రభుత్వం యెడల తీవ్ర అసంతృప్తికి కారణములగుతున్నవి. అందువలన కార్మికవర్గానికి, పెటీ బూర్జువావర్గం నమ్మకమైన మిత్రవర్గం. గతంలో సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలలో ఈ వర్గం అత్యంత సాహసంతో పాల్గొనుట చూచాము. కార్మికవర్గ నాయకత్వంలోని పోరాటాలలోనే యీ వర్గం తమ విముక్తిని పొందకలుగుతుంది.

4) మధ్యతరగతి బూర్జువావర్గం యెడల అవలంబించవలసిన వైఖరి అతి ముఖ్యమైనది, సామ్రాజ్యవాదంతో, బడా బూర్జువా వర్గంతో ఎట్టి సంబంధాలులేనిది, వున్నా నామమాత్రం కలది ఆర్థికంగా, రాజకీయంగా వారితో ముడిపడనిది. ప్రధానంగా చిన్న, మధ్యతరగతి పరిశ్రమలు, వ్యాపారాలు కలిగి తన ప్రధాన రాబడి ఈ పరిశ్రమలనుండేగాని, భూస్వామ్యం భూములనుండిగాని, సామ్రాజ్యవాదుల కంపెనీల నుండి లాభాలుగా కాని పొందనట్టిదే మధ్య తరగతి బూర్జువావర్గం. సామ్రాజ్యవాద వర్గాల, గుత్త పెట్టుబడిదారి వర్గాల మధ్య నలుగుతు వుంటుంది. వలన ఆర్థిక విధానంలో మధ్యతరగతి బూర్జువా వర్గం కార్మికవర్గ మిత్రులై విప్లవకరపాత్ర వహించుతుంది. తీవ్రతరమయ్యే ఆర్థిక సంక్షోభంలో ప్రభుత్వంపై బూర్జువావర్గపు ఆశలు అడియాసలై, అసంతృప్తితో గుత్తపెట్టుబడిదారి వర్గాల దాడికి తట్టుకోజాలక ప్రజాస్వామ్య విప్లవ వర్గాల మిత్రవర్గమయ్యే అవకాశంవుంది కాన కార్మికవర్గం, కమ్యూనిస్టుపార్టీ సామ్రాజ్యవాద, గుత్తపెట్టుబడిదారి వర్గాల వ్యతిరేక పోరాటంలో యీ వర్గపు ప్రయోజనాలను కాపాడుటకై పోరాడుతు, తద్వారా వారిని తమ మిత్రవర్గంగా రూపొందించుకొను అవకాశముంది. కాన అట్టి అవకాశాన్ని జారవిడువరాదు [1]. వ్యవసాయ విప్లవ విజయంతో ముడిసరుకులు మరింత స్వేచ్ఛగా లభించి ఈ వర్గ పరిశ్రమలు అభివృద్ధికి అవకాశాలు పెరుగును కాన మధ్య తరగతి బూర్జువావర్గం తన సహకారాన్ని అందించుతుంది. దేశీయ పరిశ్రమలకు మార్కెట్టుగూడ అభివృద్ధి చెందుతుంది. అంచేతనే యీ వర్గం భాషాప్రయుక్త రాష్ట్రోద్యమాన్ని చిరుజాతులకు స్వయం నిర్ణయ సూత్రాన్ని బలపరస్తూ, విదేశీ సామ్రాజ్యవాద, దేశీయ గుత్త పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా ప్రజాస్వామ్య విప్లవాలను బలపరచే అవకాశముంది.

గుత్తేతర బూర్జువావర్గమంతటిని మధ్యతరగతి బూర్జువావర్గంగా నిర్వచించే తప్పిదము చేస్తున్నాము. మనదేశంలో భూస్వాములు, భూస్వామ్యవర్గాలు పారిశ్రామిక, వాణిజ్య రంగాలలోచేరి మధ్యరకపు, చిన్న తరహా పరిశ్రమలను, ధాన్యపుమిల్లులను, నూనె మిల్లులను; పౌండ్రీలు, వర్క్‌షాపులు నడుపు ప్రత్యేక పరిస్థితిని పరిగణించాలి. వారి భూస్వామ్య దోపిడికి సహాయకారిగా నిర్మించిన పరిశ్రమలు వారి ఆదాయము ప్రధానంగా భూములనుండి వస్తుంది చిన్న పరిశ్రమలనుండి వచ్చే ఆదాయం స్వల్పమైనపుడు ప్రధానంగా భూస్వామ్య బూర్జువావర్గంగానే వర్గీకరించాలి. ఆర్థిక సంక్షోభం కారణంగా వీరూ అసంతృప్తిని వెల్లడించినా. వీరిని వ్యవసాయ విప్లవ వ్యతిరేకులుగానే పరిగణించాలి. ఆ కారణంగా వారెట్టి విప్లవ పాత్రను వహించజాలరు, ప్రజాస్వామ్య విప్లవంలో మిత్రులు కాజాలరు.

అదేవిధంగా వివిధ రాష్ట్రాలలో గుత్తపెట్టుబడిదారివర్గం నిర్వచనంలోనికిరాని పెట్టుబడిదారి వర్గాలు కొన్ని ప్రధానంగా పరిశ్రమలనుండే వారి ఆదాయాన్ని పొందే వర్గాలు కొన్ని రాష్ట్రాలలో పాలక వర్గాలుగ వున్నవి. కొన్ని భూస్వామ్య బూర్జువా

---

1. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర అధికార పత్రాలు (ఆంగ్లంలో) వా VII పే. 1046-8.

వర్గాలతో కలసి పాలకవర్గాల ముఠాలుగ వున్నవి. ఈ రెండూ విప్లవ వ్యతిరేక వర్గాలుగ వుంటవి,

వ్యవసాయ విప్లవం వుదృతమై వారి అధికారాలను ప్రశ్నించే స్థితికి రాని ప్రాంతాలలో, జాతుల స్వయం నిర్ణయ సూత్ర ఉద్యమాలపై వారి నాయకత్వం ప్రశ్నించేస్థితికి కార్మికవర్గం రానపుడు, వారు నేటి పాలకవర్గ ముఠాలకు కొంత అసంతృప్తిని, వ్యతిరేకతను ప్రదర్శించవచ్చు. ఈ గుత్తేతర బూర్జువావర్గాల వ్యతిరేకత విప్లవ వ్యతిరేకతకాదు. సంస్కరణవాద రాజీవాద, వూగిసలాడు, భాషా రాష్ట్రాల కోర్కెగాని, స్వయం నిర్ణయ సూత్రాన్ని కోరేది, పోరాటోద్యమ వ్యతిరేకతకాదు. సంస్థానాలను భారత యూనియన్‌లో చేర్చే ప్రయత్నమేగాని, సంస్థానాలను విచ్ఛినంచేసి, భాషా ప్రయుక్త రాష్ట్రాలను ఏర్పాటు చేయుటను వ్యతిరేకించే పటేల్ వైఖరి యిందుకు తార్కాణము. జాతుల స్వయంనిర్ణయాధికారానికై కార్మికవర్గం కమ్యూనిస్టు పార్టీయే, అట్టిపోరాటానికై నాయకత్వం వహించవలసి వుంటుంది.[1]

## జనతా ప్రజాస్వామ్య సంఘటన

కమ్యూనిస్టుపార్టీ పొలిట్ బ్యూరో నవంబరు 1950లో, పార్టీ కాంగ్రెసులో చర్చల నిమిత్తం విడుదలచేసిన చిత్తు తీర్మానంతో జనతా ప్రజాస్వామ్య సంఘటన సమస్యలను విశ్లేషణగావించి, సమగ్రదృక్పదాన్ని వివరించింది. వ్యూహ ప్రాముఖ్యత రీత్యా వివరంగా తెలుసుకొందాము,

1. జనతా ప్రజాస్వామ్య సంఘటన సామ్రాజ్యవాద, భూస్వామ్య వ్యతిరేక అన్ని శక్తుల ఐక్యపోరాటసంఘటన, అంటే కార్మిక, కర్షక పెటీ బూర్జువాల మధ్య తరగతి బూర్జువాలకు ప్రాతినిధ్యం వహించే పార్టీల పక్షాల, ముఠాల, గ్రూపుల వ్యక్తుల కనీస కార్యక్రమ ప్రాతిపదికపై ఏర్పడిన సంఘటన కార్మిక, కర్షక కూటమిపై ఆధారపడిన కార్మికవర్గం, దాని పార్టీయైన కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంలోనిది. సంఘటన స్వభావాన్ని, పరిమితిని, దాని చారిత్రకపాత్రను పార్టీ అర్థంచేసుకొని మార్గదర్శకత్వం వహించాలి. అంతర్జాతీయ అనుభవాలను అధ్యయనంచేసి, గుణపాఠాలు నేర్చుకొనాలి దశకు వర్తించే వ్యూహం, ఎత్తుగడలు ఆచరణలో పరిణితి పొందిన జనతా ప్రజాస్వామ్య సంఘటనను యేర్పరచాలి.

పార్టీ శైశవదశలో పొంతెత్తు, సెక్టేరియనిజంతో సంస్కరణవాద నాయకత్వంలో వున్న ట్రేడు యూనియనులలో పనిచేయ నిరాకరించి, ప్రత్యేకంగా స్వతంత్ర "రెడ్‌ట్రేడ్ యూనియన్" యేర్పరచింది. విస్తృత కార్మికవర్గ ఐక్యతను ఐక్య ట్రేడు యూనియన్ ఉద్యమాన్ని నిర్మించుటలో విఫలమైంది. జాతీయ ఐక్య సంఘటనా నిర్మాణ వైఫల్యం సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని బలహీన పరచింది. భారత బడా బూర్జువా వర్గానికి ప్రాతినిధ్యం వహించే కాంగ్రెసు నాయ

1 భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర (ఆంగ్లంలో) అధికారపత్రాలు వా VII పే 1046-49

కత్వపు సామ్రాజ్యవ్యతిరేక ప్రభావ సంస్కరణవాదాన్ని గుర్తించ నిరాకరించింది. అందువేత సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తులన్నిటితో కలసి ఆసంఘటలో చేరి సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రదర్శనలు, ఆందోళనలు, పోరాటాలలో పాల్గొనుటలో విఫలమైంది.

అవి బూర్జువా నాయకత్వంలో సంస్కరణవాద నమూనా పోరాటాలైనా పాల్గొని, ప్రజాబలాన్ని పెంపొందించుకొనజాలకపోయింది. పార్టీలో నాటి సైద్ధాంతిక, రాజకీయ నిర్మాణ భేదాభిప్రాయాలు, కార్మికవర్గంలో, పార్టీలో ఐక్యతను పోగొట్టాయి ఈ అనైక్యత ఆనాటి పోరాటాలలో ప్రతిబింబించింది. విప్లవ అనైక్యత సంఘటన నిర్మాణాన్ని దెబ్బతీసి, పోరాటాన్ని తీవ్రంగా బలహీనపరచింది. శైశవదశ అనుభవాలనుండి నేర్చుకొనవలసిన గుణపాఠమిది.

ముఖ్యంగా 1935-48 కాలంలో సెక్టేరియనిజం మితవాదాలనుండి బయట పడ్డామని తలచే దినాలలో క్రమేణా సంస్కరణవాద పొరపాట్లలోనికి జారిపోయినాము ఐక్య సంఘటనా దృక్పథం పూర్తిగ తీవ్రవాద వక్రీకరణకు గురియైంది. జాతీయ బడాబూర్జువా శక్తులకు సామ్రాజ్యవాద వ్యతిరేకిపాత్రను ఆపాదించి, పోరాటంలో సహచరులు లేక మిత్రులుగ నెంచుట ఆకాలంలో ప్రధానమైన పొరపాటు. మౌలికమైన యీ తప్పిదము అనేక యితర తప్పులకు దారితీసి, ఐక్య సంఘటనా నిర్మాణంలో కార్మికోద్యమ నిర్మాణంలో, జాతీయ విముక్తి వుద్యమంలో కార్మిక వర్గ నాయకత్వాన్ని నిర్మించుటలో వైఫల్యానికి కారణమైంది. బలమైన పార్టీని నిర్మించుటలో అపజయం కలిగింది.

పార్టీనాయకత్వం కాంగ్రెసు నాయకత్వంలోని సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాసంస్థలలో పనిచేయవలసిన అవసరాన్ని సరిగానే గుర్తించి, నొక్కి చెప్తూ స్వతంత్రవర్గ ప్రజా సంఘాల నిర్మాణావసరాన్ని తక్కువగా అంచెనావేసి అనేక ప్రాంతాలలో వాస్తవంగా కాంగ్రెసు సంస్థానిర్మాణం ప్రధాన కార్యక్రమంగాచేబట్టింది.

రెండవ అంశం, పార్టి గత సెక్టేరియన్ కాలంలో విదేశీయ పాలనకు బడా బూర్జువావర్గపు జాతీయ సంస్కరణవాద వ్యతిరేకతను వుపయోగించుకొనుటను నిరాకరించింది. తదనంతరం బడాబూర్జువా వర్గపు వ్యతిరేకతను వుపయోగించుట అనే పేరుతో మితవాద సంస్కరణ వాదంలో మునిగిపోవుట ప్రపంచపెట్టుబడి దారి వర్గ సంక్షోభ ఫలితంగా పాశిజపు పురోగమనం, కార్మికవర్గపు విప్లవ పోరాటాలకు అత్యధిక అవకాశాలు కలిగినపుడు సంస్కరణవాద గాంధీ సిద్ధాంతాలను వాటి ప్రవక్తలను విమర్శించి బహిరంగపరుచుటలో విఫలమయ్యాము. ప్రజలనుండి వారి విధానాలను వేరుపరచకపోగా, గాంధీ నెహూ్రి నాయకత్వాన్ని ఆకాశానికెత్తి పొగడ్తలతో భ్రమలు కల్పించాము,

మూడవ అంశం, కాంగ్రెసు నాయకత్వంలో పెరుగుతున్న సామ్రాజ్యవాదానికి లొంగుబాటుతనాన్ని పార్టీనాయకత్వం గమనించలేకపోయింది, ముఖ్యంగా యుద్ధకాలంలో మరింత ప్రస్ఫుటమైనదానిని యుద్ధానంతరకాలంలో స్పష్టమైనదానిని

గుర్తించక, జాతి విద్రోహ సహకార రాజీ ప్రభుత్వాన్ని "నెహూ్రు ప్రభుత్వాన్ని బలపరచండి" అనే నినాదానికి వెళ్ళాం. ఆవిధంగా జాతీయ బడా బూర్జువా వర్గం నుండి పూర్తిగా విడిపోయి, రాజీలేని వ్యతిరేక పోరాట పాత్రను చేపట్టవలసిన చారిత్రక సమయాన కార్మిక వర్గం దానితో ఐక్య సంఘటనా విధానాన్ని చేబట్టింది, ఫలితంగా సామ్రాజ్యవాదానికి జాతీయ అభ్యుదయ నిరోధక శక్తులకు వ్యతిరేకంగా ప్రజాస్వామ్య ఐక్య పోరాట సంఘటనను నిర్మించే ప్రాథమిక కర్తవ్యాన్ని నిర్వహించుటలో పూర్తిగ పార్టీ విఫలమైంది. దేశీయ బడా బూర్జువా వర్గపు తోకగా పార్టీ రూపొందింది.

"జాతీయైక్యత" అనే పేరుతో సాగిన మితవాద సంస్కరణవాదం కార్మిక, కర్షక ప్రజావుద్యమాల స్వతంత్ర నిర్మాణాన్ని అడ్డుకొనుటయేగాక, కార్మిక కర్షక పోరాటాలకు పోరాట రూపాల పరిమితిని కుదించింది "నిర్బంధకాండను హింసను ఆహ్వానించుట" "విచ్ఛిన్నతా ప్రమాదం" "ఐక్య సంఘటనా నిర్మాణం" అనే పేరుతో మిలిటెంటు ఉన్నత పోరాట రూపాలను నిరుత్సాహపరుచుట జరిగింది. ఇట్టి సంఘటనలు అనేకం ఆకాలపు చివరిదినాలలో జరిగాయి, దేశీయ బడా బూర్జువా వర్గ చిత్త, ప్రవృత్తులకు, ఎత్తుగడలకు అనుకూలంగా కార్మికవర్గపు తెరచాపనెత్తుట, పోరాట రూపాలకు కచ్చితమైన "శాంతి-సాధారణ" మార్గాలలో కొనసాగుట, ఐక్య సంఘటనా నిర్మాణాన్ని యేవిధంగానూ ముందుకు తీసుకొని పోక, బూర్జువా పోరాట రూపాల భ్రమలనుండి విముక్తులగుటకు సహాయపడి వున్నత విప్లవ పోరాట రూపాలను చేబట్టినట్లు చేయజాలక పోయింది.

పార్టీ 2 వ కాంగ్రెసుతో ప్రారంభమైన సంవత్సరాలలో శిలా సదృశ్య ఐక్య సంఘటనా దృక్పథం చూచాము. మితవాద అవకాశావాద పోరాటంతో ప్రారంభమైన ఐక్య సంఘటనా దృక్పథం మరోసారి యీ సమస్యపై నగ్న సెక్టేరియనిజంగా పరిణామమొందింది. రాజీ బూర్జువాలతో సడలని పోరాటాన్ని సరిగానే కొనసాగించినా, ప్రజలలోని ప్రజాస్వామ్యవాదులను మిత్రులైన మధ్యతరగతి బూర్జువా వర్గాలను, ధనిక రైతులను శత్రువర్గంలోనికి నెట్టివేసి, అత్యవసరము సుసాధ్యము అయిన సామ్రాజ్యవాద బూర్జువా, భూస్వామ్య వ్యతిరేక విస్తృత ఐక్య సంఘటన నిర్మాణ అవసరాలను అవకాశాలను విచ్ఛిన్నం చేశాము.

పార్టీనాయకత్వం, బడా బూర్జువా నాయకత్వం, సోషలిస్టులు, తదితరులు కార్మికవర్గ ఐక్యతను, నిర్మాణాయుతమైన కార్మికోద్యమ విప్లవపోరాటాలను విచ్ఛిన్నం చేయు ప్రయత్నాలను ఎదురించి, వారి కుతంత్రాలను వమ్ముచేయుటలో విఫలమైంది. అభివృద్ధి నిరోధకుల యీ విచ్ఛిన్నతను పోరాడుటలోనేగాక, ప్రజా సంఘాల కోర్కెలను రూపొందించుట, నిర్మాణాలలో పొంచెత్తు పోకడలను తప్పని సరియైనవిగాజేసి, ఉగ్రగామిదళాలను పోరాటాలలోనికి పంపి, కార్మికవర్గ ఐకత్యను సాధించుటలో విఫలతచెంది శత్రువర్గాలకు బలాన్ని చేకూర్చింది.

ప్రభుత్వ హింసా దమన కాండలను పరిగణించక నగరాలలో తిరుగుబాటు స్వభావాన్ని కలిగిన పోరాట రూపాల ఫలితంగా దైనందిన కోర్కెల పోరాటాలలో కార్మిక వర్గ ఐక్యతను నిర్మించుటలో పార్టీ విఫలమైంది. ప్రజాస్వామ్య ప్రజల, బడుగువర్గాల విస్తృత ఐక్యపోరాటా నిర్మాణం చెప్పనక్కరలేదు. గ్రామీణ ప్రాంతాలలో పొంతెత్తు సెక్టేరియన్ ఎత్తుగడల నవలంభించి రైతు వుద్యమాన్ని విచ్ఛిన్నము చేయుటయేగాక పోలీసు సైన్యంపై పోరాటాలలో నేరుగా ఎదుర్కొను పోరాట రూపాలను పార్టీనాయకత్వం చేబట్టింది, ఫలితం సత్రు వర్గాలది పైచేయియై విపరీత నష్టాలకు గురైంది గెరిల్లా పద్ధతులను ప్రధానంగా చేబట్టుటపోయి నేరుగా ఎదుర్కొనే దుస్సాహసిక పోరాట రూపాలను చేబట్టి నష్టపోవుటయేగాక, గ్రామీణ ప్రాంతాలలో బడుగువర్గాల ఐక్యపరుచుటలో విఫలమై పోరాట ప్రజల అగ్రగామి దళాలను మొహరించి నష్టపోవుటయేగాక ప్రజల పోరాట ఐక్యత కోల్పోవుట జరిగింది

2) నవంబరు 1950 పొలిట్ బ్యూరో శాస్త్రీయ జనతా ప్రజాస్వామ్య సంఘటన, అనుభవాలు, గుణపాఠాలనుండి యేర్పడిన అవగాహనను తెలుసుకొందాము. జనతా ప్రజాస్వామ్య సంఘటన పార్టీ దృక్పథంలో కార్మిక, కర్షక, పెటీబూర్జువా, మధ్యతరగతి బూర్జువాలకు ప్రాతినిధ్యం వహించే పార్టీలు, గ్రూపులు, కమ్యూనిస్టు పార్టీ కనీస కార్యక్రమంపై ఆధారపడి పోరాడ సిద్ధమయ్యే అన్ని వర్గాల ఐక్యసంఘటన: కనీస కార్యక్రమము జనతా ప్రజాస్వామ్య విప్లవ తక్షణ కార్యక్రమముగా వుంటుంది. ఈ కనీస కార్యక్రమము సంఘటనలోని అన్ని పార్టీలు, గ్రూపులు ఆమోదించుటకై పోరాటాన్ని సాగించుతుంది. కమ్యూనిస్టుపార్టీ గరిష్ట కార్యక్రమమైన సోషలిజాన్ని ఆమోదించాలని వొత్తిడిచేయరాదు. మార్క్సిజం, లెనినిజం సిద్ధాంతపునాదిపై, కేంద్రీకృత ప్రజాస్వామ్య క్రమశిక్షణ గలది. కనిష్ట గరిష్ట కార్యక్రమాలను ఆమోదించి, ఆచరణ ప్రాధాన్యంగల పార్టీ మాత్రమే వాస్తవానికి శిలాసదృశ్య, గుత్తాధిపత్యం గల పార్టీగ నెంచవచ్చును. సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక అనేక వర్గాల, పార్టీల ఐక్య సంఘటనను శిలాసదృశ్యమైనదిగా చెప్పుట అసంగతము. ఐక్య సంఘటనకు అట్టి లక్షణాలను ఆపాదించుట పార్టిని క్రమేణా రద్దు చేయుట, సంఘటనలో సంలీనం చేయుట అగుతుంది. అట్టి ఆచరణ పార్టి స్వతంత్ర పాత్రను యుగోస్లోవిలోవలె త్యాగంచేయుట లేక సంఘటనను శిలాసదృశ్యంచేయుట దానిని విచ్ఛిన్నము చేయుటకు దారితీస్తుంది.

జనతా ప్రజాస్వామ్య సంఘటన అంటే పార్టీ దృక్పదంలో సాయుధపోరాట ఐక్యసంఘటన, పాలకపక్షాలైన సామ్రాజ్యవాదం, దాని ఉపగ్రహ శక్తులను ఓడించి అధికారాన్ని హస్తగతం చేసుకొని జనతా ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పుట, అది సాయుధపోరాట ఐక్య సంఘటన ద్వారానే సాధ్యమగుతుంది.

అట్టి సాయుధపోరాట ఐక్య సంఘటన వొకేసారి రూపొంది, విస్తరించదు. ఆచరణలో ఐక్యతకై జరిపే పోరాటాలక్రమంలో వివిధ వర్గాల ఆమోదంపొందిన కోర్కెలతో సంయుక్త ప్రదర్శనలు, పోరాటాలతో ప్రారంభించి, శాంతి, భూమి,

రొట్టె స్వాతంత్ర్యంలకై అత్యున్నత పోరాట రూపాలను దీర్ఘకాల పోరాట ప్రాతిపధికపై చేబట్టుటద్వారా అట్టి ఐక్య సంఘటన అభివృద్ధి చెందుతుంది.

ఐక్య సంఘటనను నిర్మించుటకు అత్యంత ఫలప్రదమైనమార్గం క్రిందినుండి నిర్మించుట. వివిధ పార్టీల, సంస్థల. నాయకులు, వ్యక్తులు వొడంబడికలు చేసుకొనుట నిషిద్ధముకాదు. క్రిందినుండి యేర్పడే ఐక్యతను, అట్టి వొడంబడికలు సుగమం చేస్తాయి. దీనిని సాధించుటకు పార్టీ క్రమబద్దంగా, నిరవధికంగా వివిధ పార్టీలను, గ్రూపులను, వ్యక్తులను కలుసుకొని వోపిక. వోర్పుతో వివిధ దృక్పథాలవారితో చర్చించుతు, ఆచరణ వొప్పందాన్ని అందరి ఆమోదంతో రూపొందించవలసి వుంటుంది. ఈ ప్రయత్నాల కాలంలోనే విచ్ఛిన్న శక్తులను బహిరంగ విమర్శన చేస్తూ, బూర్జువా జాతీయ భావ ప్రభావాన్ని తొలగించుటకు ఎడతెగని పోరాటం సాగించాలి.

కార్మికవర్గం, కమ్యూనిస్టుపార్టీ సంఘటనలోని అన్నివర్గాల, గ్రూపులన్యాయబద్దమూ, ప్రజాస్వామ్యమూ అయిన కోర్కెలకై వొకవైపు పోరాడుతు, సంఘటనలోని యేవొక్కరుగాని, పార్టీగాని, పెక్కురు, పెక్కుపార్టీలుగాని, ప్రతినిధులుగాని సంకుచిత, పాక్షిక, అప్రజాస్వామ్య కోర్కెలు, ప్రజలకు, కార్మికులకు వ్యతిరేకంగా వెలిబుచ్చిన సంకోచించక నిర్భయంగా, వూగిసలాట భ్రమలను విడనాడి, సహృదయంతో వివరణాత్మకంగా వొప్పించని విధంగా, గట్టిగా విమర్శించి ప్రతిఘటనా పోరాటాన్ని సిద్ధాంతరంగంలో సాగించినపుడే జనతా ప్రజాస్వామ్య సంఘటన రూపొందగలదు. "ఐక్యత-పోరాటం" రెండూ లోపల, బయట కొనసాగించుతూ సంక్లిష్ట, కఠినమార్గంలో పయనించవలసి వుంటుంది. ఎట్టి పోరాటంలేకుండా ఐక్యత దృఢతరంకాదు.

జనతా ప్రజాస్వామ్య సంఘటన విజయవంతంగా నిర్మించబడుటకు ప్రజా సమీకరణకు, కార్యాచరణకు కార్మికవర్గ పార్టీ యొక్క స్వతంత్రపాత్ర తప్పనిసరి. పార్టీ కార్మికవర్గ స్వతంత్ర సమీకరణశక్తిపై ఆధారపడి అన్నివర్గాల ప్రజాస్వామ్య శక్తుల పోరాట ఐక్యత నిర్మించబడుతుంది. ఈ వాస్తవాన్ని దృష్టిలో వుంచుకొని, ఎటువైపు దొలగకుండా అచరణ వుండాలి. దీనికి అనుగుణంగానే ఐక్య సంఘటనలో చేరుటకు తమ పార్టీలను రద్దుచేసుకొనాలనే షరతునువిధించదు. పైగా యే వర్గమైనా పార్టీయైనా అట్టి షరతులను విధించ ప్రయత్నించితే, ఆ విచ్ఛిన్నకర చర్యను ఎదుర్కొని పోరాడుట సంఘటన కర్తవ్యం.

పార్టీ అన్ని ప్రజాస్వామ్య వామపక్షాల, గ్రూపుల వారి ప్రజాసంఘాలతో ఐక్య కార్యాచరణకు సిద్ధంగావుంది. జనతా ప్రజాస్వామ్య సంఘటనలో చేరమని ఆహ్వానించుచున్నది. ఏపార్టీ, గ్రూపు లేక వ్యక్తియైనా ఐక్య కార్యాచరణను, ఐక్య సంఘటనా నిర్మాణాన్ని విచ్ఛినం లేక విద్రోహం చేయప్రయత్నించినా, విమర్శించే హక్కును విడనాడజాలదు. ఇతరుల అట్టి హక్కును గుర్తిస్తుంది. వాస్తవతను గుర్తిస్తూ అన్ని వామపక్ష పార్టీలతో సహకార, ఐక్యతలనునెలకొల్పుతూ, ఆ పార్టీ

లను ప్రోత్సహిస్తుంది కాని ఆ పార్టీలను నిర్మించదు. అదేకాలంలో పార్టీ స్వతంత్ర్యంగా ప్రజాస్వామ్య మార్గాలలో నేరుగా కార్మికవర్గ నాయకత్వంలో ఐక్యతా నిర్మాణానికై పోరాడుతుంది.

జనతా ప్రజాస్వామ్య సంఘటనా యేర్పాటు, సాయుధ పోరాటంలో తన ప్రచార, సాయుధగెరిల్లా పోరాటం, ప్రస్తుత జాతీయ విముక్తి వుద్యమంలో ప్రధాన పోరాట రూపంగా అచరించే హక్కును వుంచుకొంటుంది, ఈ పోరాట రూపాన్ని ఆమోదించిన వర్గాలు, పార్టీలపై తాను చేబట్టిన పోరాటరూపాన్ని రుద్దేప్రయత్నం చేయదు. అదే విధంగా సంస్కరణవాద పార్టీలు, వాటి పోరాట రూపాలను అవి ఎంత సమర్థవంతమైనా తనపైరుద్దే ప్రయత్నాన్ని తిరస్కరిస్తుంది.

సాయుధ పోరాట సమర్థతను ప్రదర్శించి పార్టీ జనతా ప్రజాస్వామ్య సంఘటనలోని పార్టీలు, వర్గాలు, గ్రూపులు తమంతటతామే అంగీకరించునటుల, తమ స్వతంత్ర కార్యాచరణద్వారా సాధ్యమైన ప్రాంతాలలో సాధ్యమైనపుడు ప్రజాసమీకరణ గావించి, వారి విశ్వాసాన్ని పొందుతుంది సాయుధ ప్రతిఘటన స్థానికంగా, ప్రాంతీయంగా అభివృద్ధి చెందునపుడు, సామ్రాజ్యవాద వ్యతిరేక పార్టీల గ్రూపుల సహకారమైత్రి, జనతా ప్రజాస్వామ్య సంఘటనగా, స్థానికంగా, ప్రాంతీయంగా క్రమేణా రూపొందగలదనే అవగాహన పార్టీకివుంది. అదే క్రమాభివృద్ధిలో విస్తరించి, విస్తృత లక్షణాలను సంతరించుకొంటుంది.

పార్టీ, ఐక్య కార్యాచరణకుగాని, ఐక్య సంఘటనకుగాని ఒక ప్రత్యేక పోరాట రూపాన్ని ఆమోదించాలనే షరతు విధించదు, యితర పార్టీలు ఐక్య సంఘటనలో సాయుధపోరాటాన్ని నిషేందించాలనే షరతును ఆమోదించదు. ముందే వివరించిన విధంగాయే యే పోరాటరూపాలు, ఎక్కడెక్కడ చేబట్టవలసి వుంటుందో అట్టి పోరాట రూపాలను, ప్రధాన పోరాటరూపానికి, వుప పోరాట రూపాలుగ స్వీకరిస్తుంది. ఆ విధంగా పార్టీ అన్ని చట్టబద్ధ, అర్థ చట్టబద్ధ పోరాట రూపాలను చేబట్టుటయేగాక, యితర పార్టీలు చేబట్టిన పోరాట రూపాలు సమర్థవంతమైనవి కావని నమ్మినా, వారికి పూర్తి సహకారాన్ని యిస్తుంది. ఆ పోరాటంలో పాల్గొంటూ ఆ పోరాటంలోని ప్రజలకు ఆ పోరాటంపై పార్టీ తన విమర్శనను ఓర్పుతో వివరిస్తుంది. ఆ విధంగా వివిధ సమస్యలపై పార్టీ చేబట్టే పోరాటరూపాలు పట్టువిడుపులతో వాస్తవంగా నిజమైన విప్లవ సాయుధపోరాట ఐక్య సంఘటనఏర్పడి విస్తరించే విధంగా, ఆచరణ సాగిస్తుంది.[1]

3) ఐక్య సంఘటనా కార్యక్రమం, దాని నిర్మాణం, ఐక్య కార్యాచరణలో ప్రధానపాత్ర వహించుతుంది. సంఘటనలోవుండే, పోరాడే వర్గాలను మిత్రులను ఆ ప్రాతిపదికలతోనే నిర్ణయించబడతారు. ప్రజాస్వామ్య పార్టీల, వర్గాల, గ్రూపుల వర్గ సంఘటన, సామ్రాజ్యవాద, దేశీయగుత్తపెట్టుబడిదారి, భూస్వామ్య వర్గాల

1. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర. (1977)అధికార పత్రాలు (ఆంగ్లంలో) పి. పి. హెచ్. వాVII పే. 1081-85.

కూటమికి వ్యతిరేకంగా సమాయత్తమై, అభివృద్ధి నిరోధక పాలకవర్గాలను త్రోసి బుచ్చి, జనతా ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పుతుంది. అట్టి సమీకరణ, సంఘటనలకై ఆచరణ ప్రాథమిక కార్యక్రమము పొలిట్ బ్యురో యిచ్చింది

సంపూర్ణ స్వాతంత్ర్యమనగా, బ్రిటిష్ కామన్‌వెల్తునుండి, ఆంగ్లో-అమెరికన్ యుద్ధకూటమినుండి విడిపోయి, నిజమైన ప్రజాస్వామ్య దేశాలతో ముఖ్యంగా సోవియట్ యూనియన్, చైనా ప్రజా రిపబ్లిక్‌లతో ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక సంబంధాలను కలిగియుండుట. అభివృద్ధి నిరోధక పాలక ముఠాచేసిన చట్టాలను, బానిస రాజ్యాంగాన్ని రద్దుచేసి, వయోజనవోటు హక్కుతో ఎన్నికైన రాజ్యాంగ పరిషత్తుచే రచింపబడిన జనతా ప్రజాస్వామ్య రాజ్యాంగం, పూర్తి స్వాతంత్ర్యాన్ని, ప్రజాస్వామ్యాన్ని, పౌరహక్కులను, జాతి, కుల'మత, లింగ భేదంలేకుండా హామి యిస్తుంది. సామ్రాజ్యవ్యతిరేక అన్ని కార్మిక, కర్షక, పెటీబూర్జువా మధ్యతరగతి వర్గాల ప్రతినిధులతో జనతా ప్రజాస్వామ్య రిపబ్లిక్‌ల యూనియన్ యేర్పరచుట అనగా సంస్థానాలను రద్దుచేసి, భారత ఉపఖండంలోని వివిధజాతుల, వుపజాతుల నివాసప్రాంతాలకు స్వయంనిర్ణయ హక్కు ప్రాతిపదికగా, ఐక్య భారతాన్ని ఏర్పాటు చేయుట. భూస్వామ్య విధానాన్ని నష్టపరిహారంలేకుండారద్దుచేసి, దున్నేవానికే భూమిని పంచుట. విదేశీ పెట్టుబడిని స్వాధీనం చేసుకొని, అన్ని కీలకపరిశ్రమలను జాతీయం చేయుట. కార్మికులకు జీవనవేతనం, వుద్యోగహామి, వృద్ధాప్య పెన్షన్ కార్మికులకు యేర్పరచుట. రోజుకు 7 గంటలపని నిర్ణయించాలి. మైనారిటి జాతుల, మతస్తుల ఆటవిక జాతుల, యితర మైనారిటీల హక్కుల రక్షణ, ప్రజల ప్రజాస్వామ్య రక్షణకు, విప్లవ విజయానికై ప్రజావిముక్తి సైన్యాన్ని నిర్మించుట, ప్రజలు ఆయుధాలు ధరించే హక్కునిచ్చుట ఆదర్శం, ఆచరణకావాలి. నేటి పాలకవర్గకూటమి పరిపాలన సాగింపుచున్నంతవరకు పై కార్యక్రమాన్ని అమలుపరచుట అసాధ్యం. ఆ కూటమిని వోడించుటకై సామ్రాజ్యవాద శక్తులన్నిటి పోరాట ఐక్య సంఘటనను యేర్పరచి, కార్మికవర్గ నాయకత్వంలో సాయుధపోరాటాన్ని సాగించవలసివుంటుంది, ఈ ప్రాథమిక సత్యాన్ని అవగాహన చేసుకోనిచో తక్షణ ప్రజా సమస్యలను, సంయుక్త సంఘటన కార్యక్రమాన్ని సాధించజాలము.

4) ఐక్య సంఘటన, పార్టీ, సాయుధపోరాటం పరస్పర సంబంధాలపై పొలిట్‌బ్యురో దృక్పథం తెలుసుకొందాము.

జనతా ప్రజాస్వామ్య విప్లవంలో ఐక్యసంఘటన (వ్యూహం) సాయుధ పోరాటం (ప్రధాన ఎత్తుగడ), కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం (కార్మికవర్గ నాయకత్వం) వాటి పరస్పర సంబంధాలు మూడు ప్రధాన మౌలికసమస్యలు వాటి శాస్త్రీయ విశ్లేషణ, అవగాహన విప్లవ విజయాన్నో, అపజయాన్నో నిర్ణయిస్తుంది. వీటిని విడి విడిగా కాక సమిష్టిగా పరిశీలించవలసి వుంటుంది.[1]

1. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర(1977) అధికారపత్రాలు (ఆంగ్లంలో) వా VII పే. 1051-2.

పార్టీ బలమైనదైన సాయుధ పోరాటం సమర్థవంతమౌతుంది. ఐక్య సంఘటనా నిర్మాణం వేగంగా జరుగుతుంది. సాయుధపోరాటపు లోతు, విస్తృతి అభివృద్ధి చెందుతుంది, ఐక్య సంఘటన బలపడుతుంది పార్టీని ప్రజల పార్టీగ చేయుటకు పరిస్థితులు పక్వానికొస్తాయి, ఐక్య సంఘటన మహోన్నతంగా, స్థిరంగా రూపొందుటతో కమ్యూనిస్ట్ పార్టీ ప్రజలపార్టీ అగుటకు మరింత గొప్ప అవకాశం లభిస్తుంది. సాయుధపోరాటం మరింత లోతు, విస్తృతిచెంది విముక్తి యుద్ధపు చివరిదశగా రూపొందుతుంది.

ప్రపంచ విప్లవ కార్మికోద్యమ చరిత్ర, మన పార్టీ గత చరిత్ర యీ వాస్తవికతనే ధ్రువపరుస్తున్నాయి. యుద్ధానంతర జాతీయ విముక్తి విప్లవ వుద్యమాల వెల్లువను, ప్రధాన పోరాట రూపాలను మరచి వర్గవ్యూహాన్ని గందరగోళ పరచుటతో పాటు మితవాద అవకాశవాదం, అతివాద సెక్టేరియనిజం మన వైఫల్యాలకు కారణాలయ్యాయి. ఆర్థిక, రాజకీయ ప్రదర్శనలు, సమ్మెల పోరాటాలు, రైతుల పోరాటాలు నడుపుటలోని వైఫల్యాలు కారణంగాదు. విప్లవ పురోగమన దశను గుర్తించక పోవుటతోపాటు, విజయవంతంగా విప్లవోద్యమాలను విప్లవ ప్రతిఘాతక శక్తుల నుండి పరిరక్షించుటకై వున్నత పోరాటరూపాలను చేబట్టాలని గుర్తించకపోవుటయే అసలుకారణం. పోరాట రూపాలను ఎన్నుకొనుటలోనే ప్రధాన వైఫల్యముంది

సాయుధ గెరిల్లా పోరాటాలు ప్రారంభించుటకు దేశమంతటా వ్యాపించిన ఐక్య సంఘటనా నిర్మాణం తప్పనిసరి ప్రాథమికాంశమని, దేశవ్యాపిత బలమైన కమ్యూనిస్టుపార్టీకి ప్రజలలో బలమైన పునాదులు కలిగివుండుట సాయుధ పోరాటానికి అత్యవసరమని తలంచుట వూహాజనితమగుతుంది కార్మికవర్గపార్టీ వున్న బలంతో రాజకీయ విధానంలోని మూడు అంశాలను సంలీనంచేసి, తగురీతిలో వాస్తవ పరిస్థితులకు అన్వయించి, పురోగమించుటయో, లేక మూడు అంశాలను యాంత్రికంగా విడివిడిగా పరిగణించి యే వొక్కదానినో ముందుకు తీసుకొని పోవప్రయత్నించిన విప్లవాన్ని నీరుగార్చే ప్రమాదముంది.

పోరాట ప్రధాన రూపం సాయుధ పోరాటం జాతీయవిముక్తి సాయుధవిప్లవ పోరాటాలు సాంప్రదాయ రాజకీయ సార్వజనీన సమ్మెతోపాటు దేశమంతటా జరిగే సాయుధ తిరుగుబాటులకు భిన్నమైనది. సాయుధ పోరాటంకూడ సాయుధ తిరుగుబాటు విస్తృతార్థంలోనికి వచ్చినా, దాని ప్రత్యేక సూత్రాలు, దేశమంతటా తిరుగుబాటు సూత్రాలకు భిన్నమైనవి. ఈ రెండు పోరాటాలను గందరగోళ పరచరాదు. ఈ పోరాటం, కార్మికవర్గ నాయకత్వంలోని రైతాంగ సాయుధగెరిల్లా పోరాటం. ఈ విధమైన పోరాటపు మొత్తం దృక్పథం, మావో చెప్పినట్లు "గెరిల్లాయుద్ధం" వలస, అర్ధవలస వెనుకబడిన విశాల దేశాలప్రాంతాలలో, దీర్ఘకాలం జరిగే సాయుధ ప్రజా ప్రతిఘటన, సాయుధ శత్రువును పారద్రోలి తమ స్థావరాలను యేర్పాటు చేసుకొనుట గెరిల్లా వ్యూహం ఎత్తుగడలు సాంప్రదాయ వ్యూహం, ఎత్తుగడలకు భిన్నమైనవి. రెండూ శత్రువును వోడించి విప్లవ విజయానికి వుద్దేశించబడినవే.

రెండవది గెరిల్లా పోరాట పంథా, మన దేశ పరిస్థితుల దృష్ట్యా అన్వయించుటకై పరిశీలించవలసివుంది. వ్యూహాలు, అర్ధ వ్యూహాలు, ఆర్థిక విధాన ఆధిక్యత, వాస్తవానికి స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం కొరవడుట, కార్మికవర్గం నగర బడుగు వర్గాల సంఖ్య తక్కువగా, 83 శాతము ప్రజాస్వామ్యం గ్రామీణ ప్రాంతాలలో వుండుట, వ్యవసాయ విప్లవం తక్షణ కార్యక్రమమగుట, సామ్రాజ్యవాదులు వారి తొత్తులు ప్రజలపై సాయుధ హింసాకాండ జరుపుట, విప్లవ శక్తుల అభివృద్ధే కాక వాటి అస్తిత్వాన్నే సహించలేకపోవుట మనదేశ ప్రత్యేక లక్షణాలు. సామాన్య శాంతియుత పోరాట రూపాలు మనజాలక పోవుట, ప్రధానంగా హింసాకాండ ద్వారా అణచివేయుట జరుగుచున్నది. మొదట గ్రామీణ ప్రాంతాలను వశపరచుకొని, తరువాత నగరాలను విముక్తిచేయుట పార్టీ పంథా. ఈ ప్రత్యేక లక్షణాలను పరిగణలోనికి తీసుకొనుటలోని వైఫల్యం కారణంగా విప్లవాభివృద్ధి నీరసించి, సామ్రాజ్యవాదం తన ఆయుధాలతో పురోగమించే అవకాశముంది. ఈ వైఫల్యంతోపాటు వ్యూహరీత్యా మితవాద, అతివాద తప్పిదాల కారణంగా యుద్ధానంతర విప్లవ పోరాటాల చొరవ శత్రువుల హస్తగతమైంది.

మూడో ముఖ్య విషయం. మన పరిస్థితులలో సాయుధ పోరాటం, దొరికిన ఆయుధాలతో గెరిల్లా ప్రతిఘటన పోరాటం, విస్తార గెరిల్లా పోరాటాల ప్రాంతాల యేర్పాటు, విముక్తి స్థావరాల స్థాపన, విముక్తి సైన్యాలనిర్మాణం, పరిస్థితులు అనుకూలించిన ఆఖరి విజయానికై సాయుధ సైనిక పోరాట మార్గదర్శక పంథా. సాయుధ పోరాటంలో వివిధ రూపాలు పరిణామక్రమం స్పష్టం. ప్రతిఘటన ప్రాంతాలనుండి విముక్తి ప్రాంతాలు లేక గెరిల్లా దళాల ప్రాంతాలను రెగ్యులరు సైన్యాల దండయాత్ర దశకు పురోగమనం, సరళరేఖగా తలంచుట పొరపాటు. సైనిక విధానాన్ని అధ్యయనంతో నైపుణ్యాన్ని పొందవలసి వుంది. విముక్తిపోరాట విజయానికిది అవసరము.

నాలుగవ సమస్య విముక్తి స్థావరాల నిర్మాణాన్ని యెప్పుడూ దృష్టిలో ఉంచుకొని దృఢతర పోరాటాలు నిరవధికంగా సాగించాలి. విముక్తి ప్రాంతాలు యేర్పాటు చేయకుండా దీర్ఘకాలం ప్రభుత్వ హింసాచర్యలకు తట్టుకొని గెరిల్లా పోరాటము మనజాలదు. అడవులు, కొండలు, నదులు, వాగులు వ్యాపించిన ప్రాంతాలు గెరిల్లా చర్యలకు అనువైనప్పటికీ, మైదాన ప్రాంతాలలో తగు పరిస్థితులభివృద్ధి చెందిన, తగిన పోరాట రూపాలను చేపట్టు గెరిల్లా పోరాటాలు అసాధ్యమనియెంచుట అశాస్త్రీయం. తగిన ప్రజా కార్యాచరణ, నిర్మాణ పద్ధతులను రూపొందించవలసి వుంటుంది.

చివరి విషయం. నేటి వ్యవసాయ విప్లవదశలో ప్రధాన పోరాట రూపము, సాయుధ గెరిల్లా విప్లవపోరాటమని, ప్రధానంగా రైతాంగ సాయుధ పోరాటం, అదే విముక్తి పోరాట మార్గమనే స్థిరమైన అవగాహన వుండాలి. ఈ ప్రధాన పోరాట రూపమొక్కటే మార్గమని తలచుట పొరపాటు. అన్ని పోరాట రూపాలను ఆయా ప్రాంత పరిస్థితులబట్టి ఆర్థిక, రాజకీయ సమ్మెలు, ప్రదర్శనలు, వ్యవసాయ కూలి,

కౌలుదారుల పోరాటాలు, శాంతి ప్రజాశికకు సంతకాల వుద్యమమూ, ఎలక్షను పోరా టాల కొనసాగించుతు, ప్రధాన పోరాట రూపమైన సాయుధ పోరాటంతో సమ న్వయం చేసుకొనాలి. ఒక్క సాయుధపోరాటమే విజయాన్ని చేకూర్చదు. [1]

5. జాతీయ విముక్తి వుద్యమంలో, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలలో కార్మికవర్గం వహించే నిర్మాణాత్మకమైన, చురుకైన పాత్ర ఎంతవరకు నిర్వహించ గలుగుతుందో ఆ మేరకు జాతీయోద్యమ విముక్తి వుద్యమంలో కార్మికవర్గ నాయ కత్వం యేర్పడుతుంది.

జాతీయోధ్యమంలో బూర్జువా కాంగ్రెసు నాయకత్వం దశాబ్దం పూర్వమే యేర్పడి గాంధియన్ సంస్కరణ పొరాటాలను నడుపుటతోబలపడింది. కార్మికవర్గం దశాబ్దాల తరువాత రాజకీయరంగ ప్రవేశంచేయుట, జాతీయోద్యమంలో పాల్గొనక పోవుట బ్రిటిష్ సామ్రాజ్యవాదపు అమానుష నిర్బంధకాండతోపాటు, కుటిలనీతి, కమ్యునిస్ట్ పార్టీ అపరిపక్వత, బాల్యారిష్టాలు, సంస్కరణవాదం అన్నీ కలసి జాతీయోద్యమంలో కార్మికవర్గ నాయకత్వం ఏర్పడుటలోని వైఫల్యానికి దారితీసింది.

పార్టీ 2వ కాంగ్రెసు నాటికి మితవాదం క్రమేణా అనేక బూర్జువా విధానాలను పార్టీలో ప్రవేశపెట్టి, పోరాటపటిమను, సిద్ధాంతాభివృద్ధిని నీరుగార్చివేసింది. పార్టీలో అత్యధికభాగంలో "సెల్ పనితీరు" రద్దుచేయబడి, సభ్యులు, సానుభూతి పరులతో కూడిన సర్వసభ్య సమావేశాలు మొదలయ్యాయి. పార్టీ అగ్రనాయకులు, అర్ధనైజర్లు విసుగుపుట్టించే సుదీర్ఘ వుపన్యాసాలతో పార్టీ జాతీయ, విదేశీయ రాజకీయ విధానా లను వుపన్యాసాలలో గుప్పించుట తప్ప, పనిపై నివేదికలు. చర్చలు, పనివిభజన, పర్యవేక్షణకు యెట్టి అవకాశంలేకుండా పోయింది. అదేవిధంగా ప్రజాసంఘాలలో. పార్టీ ఫ్రాక్షన్ విధానం, పని రద్దుచేయబడింది. ప్రతి సభ్యుడు కనీసం కొంత పని చేయాలనే నియమం సడలించబడుటతో వివిధ వృత్తులలోనివారు "పార్టుటైము" పని చేసే కార్యకర్తలు కరువై పార్టీ భృతితో పనిచేయు "హోల్‌టైమర్సు" అనే పూర్తి కాలం పనిచేయువారు కొన్ని జిల్లాలలో 100-150కి పెరిగి, నిర్మాణం తల బరు వైంది.పార్టీ పనిలో పార్టీ సభ్యత్వమంతా పాల్గొన్ని బలాన్ని చేకూర్చే పద్ధతిపోయి, పార్టీ అలవెన్సులతో పనిచేసే వారిపై ఆధారపడే పద్ధతితోపాటు, పార్టీ సాధారణ సభ్యులు, హోల్‌టైమర్స్ అనే ఉన్నత పార్టీ సభ్యులవర్గం, రెండు అంతరాల నిర్మా ణం ఆచరణలో యేర్పడింది తాలూకా, జిల్లా, పార్టీల కమిటీలలోకూడ యీ అంత రాల భేదం క్రమేణా యేర్పడి, క్రమేణా అట్టి కమిటీలలో హోల్‌టైమరులు అత్యధి కులుగా వుండుట జరిగింది. సామాన్య సభ్యుల అభిప్రాయాలు పరిగణతూకంలో అంతరం యేర్పడింది. అంతేగాక, పార్టీ సభ్యత్వం రుసుం లెవీలనుకూడ రెగ్యు లర్‌గా యివ్వని, వసూలుకాని పరిస్థితి యేర్పడింది. సానుభూతిపరులు, భూస్వా

1. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర (1977) అధికార పత్రాలు(ఆంగ్లంలో) పి.పి.హెచ్. వాVII పే. 1067-81.

ములు, బూర్జువాలనుండి లభించిన చందాలతో, పెద్ద మొత్తాలపై ఆధారపడే పరిస్థితి యేర్పడింది.

సిద్ధాంత పరిజ్ఞానాభివృద్ధి నిరుత్సాహపరచబడింది. పార్టీ పాఠశాలలో కొద్ది వందలమందికి మాత్రమే కొద్దిపాటి రాజకీయ పరిజ్ఞానాన్ని యిచ్చి, రాజకీయ నిర్మాణ సమస్యలపై, ప్రజాస్వామ్యభావాలను,సోషలిస్టు భావాలతోపాటు బోధించె పాఠశాలలు అయ్యాయి. ప్రామాణిక గ్రంథాలను చదువుటను "పుస్తకాల పురుగులని, ఆచరణ శూన్య సిద్ధాంతకారులని" యీసడించుట జరిగింది.

పార్టీలో క్రిందినుండివచ్చే చొరవ గొంతు నులిమి వేయబడింది. పార్టీ పాఠ శాలలో "పెరుగు ముద్దలు"గా తినిపించే బోధనా పద్ధతులు పేరూని "రాజకీయ నాయ కత్వం, ఆచరణ నాయకత్వం" అనే రెండు వర్గాల నాయకత్వ సిద్ధాంతం ఆచరణలో బయలుదేరింది, విష ఫలితాల నిచ్చింది. కేంద్రసమితి వొక్కటే రాజకీయ నాయ కత్వం వహించగలిగినది,దాని ననుసరించి అందరూ కర్తవ్యాలను ఆచరణలో పెట్టా లనే, బూర్జువా పద్ధతులలో "నాయకులు-అనుచరులు" అనే సిద్ధాంతం పని విధానం, రచనలు కొనసాగాయి. కమ్యూనిస్టు పార్టీలో విమర్శన, ఆత్మ విమర్శన లేకపోతే తుప్పుపట్టి బద్దలైపోతుంది. అట్టి దానిని పూర్తిగ వదలివేయుటయో లేక మొక్కు బడిగా అనుసరించుట జరిగింది. కేంద్రసమితి 1940 - 48లలో ఆత్మవిమర్శనా నివేదికను వొక్కసారైె ప్రవేశపెట్టలేదు. అదే కాలంలో కేంద్రసమితి తీవ్రమైన పొరపాట్లను చేసింది. సోవియట్ యూనియన్‌పై ఫాశిస్టు దండయాత్రతో యుద్ధంలో వచ్చిన ప్రధాన మార్పును గమనించుటకు ఆరుమాసాలు పట్టినా, ఎట్టి ఆత్మ విమ ర్శనా నివేదిక అందించలేదు. ఫాశిస్టు వ్యతిరేక యుద్ధకాలంలో ఎప్పుడూ రాజకీయ విధానాలను, ఆచరణను ఆత్మ విమర్శనా పద్ధతులలో వివరించలేదు. యుద్ధానంతర మైనా యుద్ధకాలంలోని పూర్తి పనిని విశ్లేషణచేసి పరిశీలించలేదు.

యుద్ధానంతర కాలంలో అరడజను రాజకీయ విధాన తీర్మానాలను సెప్టెంబరు 1945 చిత్తు తీర్మానంలో శాంతియుతంగా స్వాతంత్ర్యానికి పరివర్తన అవగాహనతో ప్రారంభించి, జూన్ 1947 మౌంటుబాటన్ అవార్డు తీర్మానాలను చేసినా, కేంద్ర సమితి తీర్మానాలలోని తీవ్రమైన మార్పులను వివరించే ఆత్మవిమర్శనా నివేదికలను పార్టీ సభ్యులకుగాని, రాష్ట్ర, జిల్లా కమిటీలకుగాని ఎప్పుడూ పంపలేదు పార్టీ వర్గా లను విశ్వాసంలోనికి తీసుకొనక, సరియైన రాజకీయపంథాకై పార్టీలో అంతర్గత రాజకీయ సిద్ధాంత పోరాటాన్ని చర్యలను ప్రోత్సహించుటకు కేంద్రసమితి భయపడి పోయింది. కేంద్రసమితి సభ్యులు ఎప్పటికప్పుడు రాజకీయ విధానాలపై తమ అభి ప్రాయ బేధాలను తీవ్రంగా వెలిబుచ్చుతున్నా పార్టీ ఐక్యత పేరుతో అవకాశవాద రాజకీయ విధానాన్ని అనుసరించారు. ఆ విధంగా వొక కృత్రిమ రాజకీయ ఐక్యతను కేంద్రసమితి ప్రదర్శించింది. పార్టీ వర్గాలనుమోసబుచ్చి నోరు మెదపకుండా చేసింది. సిద్ధాంత, రాజకీయ, నిర్మాణసూత్రాలపై పార్టీలో అంతర్గత పోరాటం అనేది కేంద్ర పరిభాషలో లేకుండాపోయింది.

కమ్యూనిస్టు పార్టీని ప్రజాపార్టీగా చేయాలనే నినాదంతో పార్టీ సభ్యుల స్థాయిని దిగజార్చి, చురుకైనవారిని, సానుభూతిపరులను నగుజాటు రీతిని పార్టీలోచేర్చి, జీర్ణించుకొనలేనంతగా విస్తరణ గావించింది. ప్రజాయుద్ధ కాలంలో పెరిగిన పార్టీ సభ్యులను వర్గపోరాటాలలో రాటుదేలించుటపోయి, పార్టీ సభ్యత్వ అర్హతలను పూర్తిగ దిగజార్చి పార్టీ నిర్మాణంలో సామాన్య ప్రజలను అదే విధంగాచేర్చి, దగ్గర దగ్గరగా పార్టీని ప్రజాసంస్థగా కమ్యూనిస్టు పార్టీ నిర్మాణసూత్రాలను గాలికి వదలి వేసింది. కార్మికవర్గం యితర శ్రామికులనుండి వచ్చేవారిని అభివృద్ధిపరచి యే స్థాయి నాయకత్వంలోనికి ప్రోమోటు చేయకపోగా కాలేజీలు, యూనివర్శిటీలనుండి వచ్చే వారిని, నేరుగా నాయకత్వంలోనికి పార్టీ నిర్మాణ బాధ్యత స్థానాలలోనికి తీసుకొనుట జరిగింది

ఫాసిస్టు వ్యతిరేక యుద్ధకాలంలో వలస పరిస్థితులను నిర్లక్ష్యంచేసి, శాంతి మార్గాన స్వాతంత్ర్య పరివర్తన భ్రమలకులోనై, దారుణ హింసాపూరిత సామ్రాజ్య వాద పరిపాలనా దౌష్ట్యాన్నిమరచి, పూర్తి బహిరంగ కార్యాచరణ పని పద్ధతులను, బూర్జువా ప్రజాస్వామ్య దేశాలలోని కమ్యూనిస్టుపార్టీ పని పద్ధతులను, దిగుమతి చేసుకొని యధాతధంగా అమలుచేయుట జరిగింది. పార్టీ నాయకత్వం తిరిగి రహస్యంగా పనిచేయవలసి వస్తుందనే కనీస ఆలోచన లేక వైమానిక, నావిక, మిలిటరీ, ప్రభుత్వ వివిధ శాఖలలోని పార్టీ సానుభూతిపరులను, పరిచయస్థులను అందరిని రోజువారి కార్యక్రమాలలో బహిరంగపరచింది. ఒక సానుభూతిపరుడు గాని, ఒక చందాదారుడుగాని సామ్రాజ్యవాదపు దృష్టిలోనికి రాకుండా కాపాడుకొన జాలకపోయింది.ఈ దూరదృష్టి లేనితనము పార్టీ అన్ని పార్శ్వాలకు శతృవు దృష్టికి తీసుకొని వచ్చింది.పార్టీ రహస్యంగా పనిచేయవలసిన పరిస్థితి వచ్చునప్పటికిశతృవు అన్ని నాటి కేంద్రాలపై దాడిచేసి, రహస్యపార్టీ పనిని అసాధ్యం చేయుట జరిగింది

ఈ విధంగా సైద్ధాంతిక, రాజకీయ, నిర్మాణరంగంలో ప్రజాసోషలిస్టు పద్ధతులను అవలంభించి తీవ్ర తప్పులను చేసినందుకు క్లిష్ట రహస్య పరిస్థితులలో శత్రువు పార్టీపై దాడిచేయుట అతి సులభమైంది. పార్టీ శక్తిహీనమై, కృంగి, కృశించి, సంస్కరణవాద, శాంతి పంథాన బహిరంగ చట్టబద్ద పోరాటాన్ని మాత్రమే సాగించ గల పరిస్థితికి చేరింది. రహస్య పద్ధతులలో ఎట్టి తీవ్రకర్తవ్యాలను నిర్వహించ జాలని స్థితికి చేరింది. ఈ పరిస్థితులలో పార్టీ, వ్యవసాయ విప్లవాన్ని సాయుధ రైతాంగ పోరాటాలద్వారా ఆవిష్కరింపజేయుటకు పిలుపునిచ్చుట, వాస్తవ పరిస్థితులను గుర్తించని గ్రుడ్డిపిడివాదమే అగుతుంది. మాజీ నాయకత్వపు "రష్యానమూనా విప్లవం" ఎంతటి "ఊహాజనితమో, చైనా నమూనా" సవరించబడిన వ్యవసాయ విప్లవపంథా కూడా అంతటి "ఊహాజనితమే" అగుట స్పష్టము.

6. సంగ్రహంగా, పార్టీ 2వ కాంగ్రెసు నాటికే దక్షిణాది రాష్ట్రాల 50 వేల సభ్యత్వ ప్రతినిధులు, అరెస్టు వారంట్లువున్న కారణంగా రహస్యంగానే కాంగ్రెసులో పాల్గొనుట జరిగింది. పార్టీని కాంగ్రెసు అయిన వెంటనే బెంగాల్‌లో నిషేధించారు. ప్రభుత్వం, పార్టీ డిశెంబరు 1947 కేంద్రసమితి తీర్మానం ఆమోదించబడి, క్రింది కార్యకర్తలకు చేరకముందే నిర్బంధచర్యలు ప్రారంభించి, కాంగ్రెసులో ఆమోదించ

బడుటతో, తీవ్రతరం చేసింది. పొలిట్ బ్యూరో రహస్య పార్టీ నిర్మాణం, రహస్య పార్టీ కార్యక్రమ ఆచరణలపై సూచనలు, పార్టీ లేఖలు రూపొందకముందే అరెస్టులు జరిగాయి సంస్కరణవాద భ్రమలలో పార్టీ బహిరంగ కార్యాచరణ సాధ్యమని తల చినట్లు కన్పడుతున్నది. జోషిని తొలగించుటతోనే సంస్కరణవాదంపై పోరాటం ముగిసినటు తలచింది. ఆర్థిక పాక్షిక పోరాటాలు తీవ్రమగుటతోనే పార్టీపై ప్రభుత్వ నిర్బంధకాండ తీవ్రమైంది ఫలితంగా కాంగ్రెసు నాటి సభ్యత్వంలో సగం పార్టీని వదలిపోయారు. పొలిట్ బ్యూరో దీనినుండి ఎటువంటి పాఠాన్ని తీసుకొనలేదు. పైగా బహిరంగ విప్లవ పోరాట నినాదాన్నియిచ్చింది. అప్పటికి 75 శాతం పార్టీ సభ్యత్వమున్న ప్రాంతాలలో పార్టీ ఆచరణలో నిషేధపు పరిస్థితులలో వుంది. పార్టీ కేంద్ర నాయకత్వం పెరుగుతున్న ప్రభుత్వ హింసాకాండను పరిగణించి, పార్టీ నిర్మాణ రక్షణకు ఎట్టి చర్యలు తీసుకొనక, పాలకవర్గపు పాశవిక దాడులకు, పార్టీ నాశనానికి కారణమైంది. నాయకత్వం క్రమశిక్షణా చర్యలు అనే పేరుతో రాష్ట్ర, జిల్లా కమిటీలను రద్దుచేసి, ఆత్మవిమర్శనపేరుతో "స్వయంకృతాపరాధ" వాగ్మూలాలను తీసుకొని, పార్టీనుండి సస్పెండు, బహిష్కరణ చేయుట జరిగింది. "ఆజ్ఞాబద్ధ" అధికారం అమలు జరిగింది. పార్టీలో పాత తలబరువు ఆర్థికవిధానం హోల్ టైమర్స్‌తో పని కొనసాగింది. వీటన్నిటి కారణంగా ప్రభుత్వ రాక్షస నిర్బంధ కాండకు నిలబడలేక కృశించి, తీవ్రనష్టాలతో పార్టీ సంక్షోభంలోపడింది.

పార్టీలో అంగీకృత రాజకీయ విధానం, వ్యూహం, ఎత్తుగడలులేవు. చిత్తు రాజకీయ విధానంపై కూడ అదే పరిస్థితివుంది. ఈ పరిస్థితిలో చర్చల నిమిత్తం బ్రిటిష్ కమ్యూనిస్ట్ పార్టీ రాజకీయకమిటి పామీదత్తు నాయకత్వం, అక్టోబరు 1950లో పంపినలేఖ భారత కమ్యూనిస్టుపార్టీ పొలిట్ బ్యూరోకు చేరింది. దీనికితోడు కామిన్ ఫారం పత్రికలో సంపాదకీయంతో పార్టీలో అంతర్గత పోరాటం తీవ్రతరమైంది. ఫలితంగా డిశెంబరు 1950లో సి.సి. సమావేశం, వివరణలకొరకు దత్తును, యితర సోదరపార్టీల సహకారాన్ని తీసుకొనాలని నిర్ణయించింది, ఎన్ని అభిప్రాయభేదాలున్నా పార్టీ అంతర్గత పోరాటం, పార్టీ ఐక్యతను విచ్ఛిన్నం చేసేదిగాకాకుండా పార్టీ ఐక్యతను పెంపొందించే విధంగా సాగుతుందని హామీనిచ్చింది. చర్చల అనంతరం పార్టీ కాంగ్రెసులో రాజకీయవిధానం నిర్ణయింపబడుతుందని, పార్టీ సభ్యులందరి సోదర పార్టీల సలహా సహకారాలతో ప్రస్తుత సంక్షోభస్థితినుండి బయటపడి, స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, శాంతికై వర్గ, ప్రజాపోరాటాలతో పురోగమించగలమని తెలిపింది.[1]

1. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర (1977) అధికార పత్రాలు వా VII పే. 1053-61.

# V

## అదుపులో అతివాదం

భారత కమ్యూనిస్టుపార్టీలో వివాదాస్పదంగావున్న సమస్యలపై సోవియట్ పార్టీ నాయకులతోను, స్టాలిన్‌తోను చర్చించి వివరణలను కోరుటకు కా॥ రాజేశ్వర రావు, బసవపున్నయ్య, అజయ్‌ఘోష్ డాంగేలతో వొక పార్టీ ప్రతినిధివర్గం మాస్కోకు పంపబడింది. మన పార్టీ ప్రతినిధివర్గంతో చర్చించి, సహాయపడేందుకు స్టాలిన్ నాయకత్వాన మాలటోవ్, మాలెంకోవ్, సుశ్లోవ్‌లతోకూడిన ఒక కమీషన్‌ను సోవియట్ పార్టీ కేంద్రకమిటి నియమించింది. [1]

భారత కమ్యూనిస్టు పార్టీ ప్రతినిధివర్గం మాస్కో చర్చల తదనంతరం తిరిగివచ్చి చిత్తు పార్టీ కార్యక్రమాన్ని ఏప్రిల్ 1951లోను, రాజకీయ విధానమును మే 1951లోను పార్టీలో అంతర్గత చర్చల నిమిత్తం పార్టీ వర్గాలకు అందజేసింది. అక్టోబరు 1951లో కలకత్తాలో జరిగిన రహస్యపార్టీ కాంగ్రెసుచే చర్చించబడి, సమగ్రరూపాన్ని సంతరించుకొంది. నూతన రాజకీయ పరిస్థితులలో పార్టీ పంథా, వ్యూహం, ఎత్తుగడలు, తక్షణ కార్యక్రమంపై పార్టీలో ఐక్యత యేర్పడుటకు తోడ్పడి, ఎన్నికల పోరాటంలో నిమగ్నులగునట్లు చేసింది. కార్యక్రమ ముఖ్యాంశాలు క్లుప్తంగా యిలావున్నవి. [2]

1. బ్రిటిషు సామ్రాజ్యవాదపు సమ్మతిపైనే కాంగ్రెసు ప్రభుత్వం అధికారం లోనికివచ్చింది. ఇండియాలో విదేశ బ్రిటిషు పెట్టుబడులను సంరక్షించుటకు మాట యిచ్చింది. సంస్థానాధీశులను, భూస్వాములను, వారి ధనాగారాలను, విధానాలను రాజ్యాంగంకాపాడుతోంది. ఈ ప్రభుత్వం భూస్వాముల, సంస్థానాధీశుల, బ్యాంకర్సు, అభివృద్ధి నిరోధక బడా బూర్జువా వర్గాలు బ్రిటిషు సామ్రాజ్యవాదం కామన్‌వెల్తులతో సహకారాన్ని నెరపుతుంది. విదేశాంగ విధానంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదం, అమెరికాల భేదాభిప్రాయాలమధ్య దోబూచులాడినా ప్రధానంగా బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని అనుసరించుతుంది రాజ్యాంగం భూస్వామ్య, పెట్టుబడిదారి విదేశ సామ్రాజ్యవాద ముఖ్యంగా బ్రిటిష్ ప్రయోజనాలను కాపాడుతున్నది. నిజమైన ప్రజాస్వామ్య రాజ్యాంగం అనలేము. భారత నావికాదళము బ్రిటిషు నావికాదళములో భాగంగానే. బ్రిటిషు నౌకాదళాధిపతి క్రిందవుంది. బ్రిటిషు సైనిక సలహాదారుల చేతులలోనే తాళాలున్నాయి. స్వాతంత్ర్యానికి. సార్వభౌమత్వానికి, స్వతంత్ర సైన్యం సూచికయైనచో యింకా స్వాతంత్ర్యం ముఖ్యాంగం బ్రిటిషు సామ్రాజ్యవాదం చేతులలోనేవుంది. అమెరికన్ పెట్టుబడులు ఎక్కువగుటతో అమెరికనులకు అదనపు బానిసత్వం చేయవలసి వస్తుంది.

---

1. సుందరయ్య (1983) వీరతెలంగాణా విప్లవపోరాటం, గుణపాఠాలు పే. 490.

2 భారత కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమము (1954) ఆంగ్లంలో రెండవ ముద్రణ పే. 1-19.

కమ్యూనిస్టు పార్టీ ధ్యేయం సోషలిజమే అయినా నేటి దేశాభివృద్ధి దశలో ఆర్ధికాభివృద్ధిలో భారతదేశం వెనుకబడివున్న కారణంగా కార్మిక, కర్షక, యితర బడుగువర్గాల ఉద్యమాలు బలహీనంగా వున్నందున సోషలిస్టు పరివర్తన అసాధ్య మని తలంచుతుంది. అయితే యీ ప్రభుత్వాన్ని తొలగించి, అన్ని ప్రజాస్వామ్య పక్షాల, భూస్వామ్య వ్యతిరేక సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తుల ప్రభుత్వస్థాపనతో పరి స్థితులు పరిపక్వమౌతాయని తలంచుతుంది. అట్టి ప్రభుత్వం రైతులకు ఉచితంగా భూములను, మన పరిశ్రమలకు రక్షణను, పారిశ్రామికీకరణను, ప్రజలకు పౌర హక్కుల గ్యారంటీని, కార్మికులకు అనుచిత జీవిత ప్రమాణాలను, నిరుద్యోగ నిర్మూ లనను గావించి, స్వాతంత్ర్యాన్ని అభివృద్ధి పథకంలో నడుపగలదు.

2) మనదేశ జీవనం వ్యవసాయంపై ప్రధానంగా ఆధారపడివుంది. వ్యవ సాయాభివృద్ధి అందరికి తిండి, బట్ట, పరిశ్రమలకు ముడిసరుకులు అందాలంటే భూములు కోల్పోయిన రైతులకు భూములనిచ్చి వ్యవసాయ అప్పులు యివ్వవలసి వుంటుంది. అందుకు భూస్వాముల భూములను దున్నేవానికే నష్టపరిహారం లేకుండా యిచ్చి, చట్టబద్ధం చేయాలి. అన్ని వ్యవసాయ అప్పులను రద్దుచేయాలి.

రైతుల కొనుగోలుశక్తి చాల తక్కువగావుంది, దేశంలో విదేశీయ వస్తువుల పోటీ అధికమైనందున, దేశీయ వస్తువుల క్రయం పడిపోయి, పరిశ్రమలు దెబ్బతిం టున్నాయి. జాతీయ పరిశ్రమలకు రక్షణ కల్పించే, విస్తృత పారిశ్రామికీకరణ కార్య క్రమాన్ని చేబట్టునటుల ప్రోత్సాహాన్నిస్తుంది. నిజమైన స్వాతంత్ర్యానికై దేశంలోని బ్రిటిష్ పెట్టుబడులకు స్వస్తిచెప్పాలి, బ్రిటిష్ కామన్‌వెల్తు నుండి ఉపసంహరించు కొని, బ్రిటిషు అధ్వర్యంలోని అన్ని పరిశ్రమలను, బ్యాంకులను, తోటలను, గను లను వారి పేరునవున్నా లేక ఇండియనుల కంపెనీలుగవున్నా స్వాధీనం చేసుకొని జాతీయం చేయాలి.

3) గుత్తపెట్టుబడిదారుల, భూస్వాముల, సంస్థానాధీశుల, వారి విదేశ సలహా దారుల ప్రభావంలో ప్రభుత్వ విధానాలుండుటతో పారిశ్రామికవేత్తలు, వుత్పత్తి దారులు, వ్యాపారులు నష్టపోతున్నారు. పెట్టుబడులనుండి సరుకుల వసరుల, రవాణా ఎగుమతి, దిగుమతి లైసెన్సులు, చిన్న పరిశ్రమలకు, వ్యాపారులకు అందుబాటులో లేకుండా ప్రభుత్వ యంత్రాంగం లాలూచీతో గుత్త పెట్టుబడిదారులు, విదేశీ కంపె నీలు ప్రయోజనం పొందుతున్నాయి.

4) ప్రపంచం-యుద్ధం-శాంతి-అను రెండు పక్షాలుగవుంది. యుద్ధకాములకు అమెరికా నాయకత్వం వహించి, అభివృద్ధి నిరోధక శక్తులన్నిటిని కూటమిగ యేర్ప రచుతుంది. శాంతిపక్షం-చైనా, తూర్పు యూరపుజనతా ప్రజాస్వామ్య దేశాలు, సోవి యట్ నాయకత్వంలో శాంతి పోరాటం జరుపుతున్నాయి. భారతదేశం రెండుపక్షాల మధ్యదోబూచులాడుతున్నది.

శాంతినికోరే అన్ని రాజ్యాల దురాక్రమణ వ్యతిరేక శాంతిసంఘటనలో భారతదేశం, నిరంతరం శాంతి విధానాన్ని అచరించే, సహకారాన్ని నెరపే, సంపూర్ణ

స్వాతంత్ర్యం ప్రాతిపదికపై, ఎట్టి విచక్షణ లేకుండా, ఆర్థిక సహకార విధానాన్ని అవలంభించే దేశాలతో ఆర్థిక సహకారాన్ని నెరపాలి. మైత్రిని పెంపొందించాలి. పాకిస్తాన్, లంక, నేపాల్‌లతో శాంతి, స్నేహం, సహకార విధానాలు అవలంభించాలి.

5) జాతుల స్వయం నిర్ణయసూత్రాన్ని ఆమోదించి, భారతదేశంలోని వివిధ ప్రాంతాలలోని వివిధ జాతులు ఐచ్ఛికంగా భారత రిపబ్లిక్‌లో చేరు విధానాన్ని అవలంభించి, భారత ఐక్యతను కాపాడాలి భాషా ప్రాతిపదిక సూత్రాలపై రాష్ట్రాలను పునర్నిర్మించాలి.

మాతృభాషలో అన్ని విద్యాలయాలలో బోధన జరగాలి. అన్ని ప్రభుత్వ కార్యాలయాలలో ఆయా ప్రాంతీయ భాషలలో పరిపాలన జరగాలి. కేంద్ర, రాష్ట్రాల సంధానభాషగా హిందీని ఐచ్ఛికంగా ఆమోదించునట్లు చేయాలి. బలవంతాన రుద్దరాదు బాల, బాలకలకు 14 సంవత్సరముల వరకు నిర్బంధ ఉచిత విద్య గరపాలి.

ప్రభుత్వాన్ని అన్ని మత సంస్థలనుండి వేరుచేయాలి. రాజ్యాంగం మత ప్రమేయం లేని లౌకిక రాజ్యాంగమై వుండాలి.

6) కార్మికుల జీవన ప్రమాణాన్ని మెరుగుపరచుటకై, జీవనవేతన నిర్ణయం. 8 గంటల పని, వారంలో 44 గంటల పని, అన్ని పరిశ్రమలలోను, వ్యాపారం లోను అమలుచేయాలి. భూగర్భ గనులలో, యితర అనారోగ్య పనులలో 6 గంటల పనినే నిర్ణయించాలి సాంఘిక ఆరోగ్యభీమాని పెట్టుబడిదారుల ప్రభుత్వం భరించాలి, అంగవైకల్య, నిరుద్యోగభృతులను యివ్వాలి. కార్మికులకు సంఘ నిర్మాణ, సమిష్టి కోర్కెలబేరం, సమ్మెహక్కు గుర్తించాలి

ద్వితీయంగా ఆమోదించిన రాజకీయ విధాన అంశాలు యిలా ఉన్నవి.[1]

ప్రజలకు గత నాలుగు సంవత్సరాల అనుభవం, భూమి ఆహార, నిరుద్యోగము, వేతనాలు, శాంతి, స్వాతంత్ర్యం సమస్యలను ప్యూడలు భూస్వాముల, గుత్తపెట్టుబడిదారుల, పరోక్షంగా బ్రిటిషు సామ్రాజ్యవాదుల ప్రభుత్వం పరిష్కరించజాలదని స్పష్టమైంది. ప్రజల ప్రజాస్వామ్య వ్యతిరేక యీ ప్రభుత్వస్థానంలో అన్ని ప్రజాస్వామ్యపక్షాల, ప్యూడలు, సామ్రాజ్యవాద వ్యతిరేక జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వం యేర్పడుతుందని ఆశించుతున్నారు. వలస, అర్ధవలస, అస్వతంత్ర దశలలో జనతా ప్రజాస్వామ్య విప్లవం వలనే అది సాధ్యమని, ముఖ్యంగా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం వహించినపుడేనని మార్క్సిజం తెలుపుతుంది.

కమ్యూనిస్ట్ పార్టీ మాసాల చర్చల తరువాత, జనతా ప్రజాస్వామ్య విప్లవం రష్యా మార్గంలో, చైనా మార్గంలోగాక భారతీయ పంథాలోనే జరుగుతుందనే అవగాహన యిచ్చింది. మన దేశపు ప్రత్యేక పరిస్థితుల ననుసరించి, మార్క్సిజం, లెనినిజంల అనుభవాల పాఠాల ననుసరించి వుంటుంది.

---

1. భారత కమ్యునిస్ట్ పార్టీ. రాజకీయవిధాన ప్రకటన (1951) ఆంగ్లంలో. పే 1-11

మనదేశం వ్యవసాయంపై ఆధారపడి, కార్మికులుకూడ వ్యవసాయ సంబంధాలను విడువజాలని, ప్రధానంగా వలసదేశం ఈ రోజున వాస్తవ స్వాతంత్ర్యం అంటే ప్యూడలు భూస్వాముల భూములను స్వాధీనం చేసుకొని రైతులకు వుచితంగా పంచుట. అప్పుడే ప్యూడలు వ్యతిరేక కార్యక్రమము పూర్తియై సంపూర్ణ వాస్తవ స్వాతంత్ర్యమగుతుంది చైనాలో వలె సామ్రాజ్యవాదశక్తులే ప్యూడలు శక్తులకు ఆధార భూమికలు. ఈ కారణంగా రైతాంగ పోరాటాలు అత్యంత ప్రాముఖ్యత కలవి చైనాలోవలె మనం ప్యూడలు, సామ్రాజ్యశక్తులపై పోరాడవలసివుంది. కాన మన విప్లవం ప్యూడలు, సామ్రాజ్యవాద వ్యతిరేక స్వభావం కలది అంతమాత్రాన చైనాలోవలె సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటాలు, భూమి పంపకం, విముక్తి సైన్యనిర్మాణం అనే వొకే వొక మార్గంలోనే భారత విప్లవం పయనిస్తుందని తలంచుట, చైనా విప్లవంలోని యితర ముఖ్యాంశాలను, మన ప్రత్యేక పరిస్థితులను గమనించుటలో అశ్రద్ధ వహించుటయేనని కేంద్రసమితి తలంచుతున్నది

చైనా కమ్యూనిస్టు పార్టీ రైతాంగాన్ని విముక్తి పోరాటంలో సమీకరించునప్పటి 1925-27 విప్లవంలోని చీలికనుండి నలభై వేల సైన్యాన్ని వారసత్వంగా కలిగివుందని మరువరాదు. శత్రుసైన్యాల సమీకరణకు, త్వరితంగా బలమైన కేంద్రీకృతదాడుల కనువైన సమాచార, రవాణా, సౌకర్యాలు చైనాలోలేవు అనే విషయాన్ని మరువరాదు. భారతదేశంలో అందుకు భిన్నంగా, సమర్థవంతమైన, విస్తార, సమాచార, రవాణా సౌకర్యాలు వాస్తవంగా ఉన్నవనుట స్పష్టం. అనేక పర్యాయములు చైనా రెడ్ ఆర్మీ చుట్టుముట్టబడి నాశనమయ్యే పరిస్థితులలో మంచూరియా చేరి, పారిశ్రామిక కార్మికవర్గం, వెనుకతట్టున సోవియట్ మిత్రదేశం అండతో సైన్యాన్ని పునఃనిర్మించుకొని, దైత్రయాత్రలు చివరకు సాగించిందనే విషయం అందరకు తెలిసినదే. దీనర్థం, విప్లవ స్వభావం తప్ప సారూప్యతలు లేవనికాదు. భారతదేశం చైనావలె విస్తారమైనది, అత్యధిక రైతాంగం గ్రామీణ ప్రాంతాలలో కలది, కాన మన విప్లవం చైనా విప్లవంతో అనేక సారూప్యతలను కలిగివుంటుంది అయితే చైనామార్గంలోవలె సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటాలు మాత్రమే భారతదేశంలో విజయాన్ని సాధించజాలవు.

"మరో ముఖ్య విషయం, చైనాలో సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటాలకు మాత్రమే అంటిపెట్టుకొనుట. తప్పనిసరి ప్రత్యేక పరిస్థితులలో జరిగింది. కాని సిద్ధాంత సూత్రబద్ధంగా కాదు." అంటే ప్రత్యేక పరిస్థితులలో జరిగినదానిని సాధారణ సూత్రంగా చేయరాదని, చేసినచో గ్రుడ్డిపిడివాద మగుతుందని మనం వివరించుకొనవలసి వుంటుంది "దీర్ఘకాల పోరాటాలలో పార్టీ, రైతుపోరాట స్థావరాలు, నగరాలకు కార్మికవర్గానికి దూరమై వేరయ్యాయి. ఆ కారణంగా శత్రుసైన్యాలను చేరవేసే నావికా కార్మికులనుగాని, పారిశ్రామిక కార్మికులకుగాని పిలుపునిచ్చి, పోరాటరంగంలో సమీకరించజాలకపోయింది. వారి తప్పనిసరి అవసరాన్ని మనం పిడిసూత్రంగాచేసి విముక్తి పోరాటానికి అచరణలో కార్మికవర్గ పోరాట నాయకత్వం లేకుండా ఎందుకు చేయాలి?

మనకు ఎన్నోరెట్లు బలమైన కార్మికవర్గ నిర్మాణం ఉంది. మన స్వాతంత్ర్య పోరాటంలో నిర్ణయాత్మక పాత్ర వహించగలదు. కార్మిక, కర్షకవర్గాల బ్రహ్మాండమైన ఆచరణ ఐక్యత, కార్మికపోరాటాల, రైతాంగ పోరాటాల కలయిక, సమన్వయం, ప్రధానంగా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో పురోగమన విప్లవపంథా, మన విప్లవ పంథా అన్ని చారిత్రిక అనుభవాల సారాంశము.

గతంలో ఒక పంథా "నగరాలలో సార్వజనీన సమ్మె పోరాటాలని" రైతాంగ సాయుధగెరిల్లా పోరాటాలను నిర్లక్ష్యం చేసింది, మరో పంథా "రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటాలే ప్రధానమని," కార్మికవర్గ పాత్రను, పోరాటాలను అత్యల్పం చేసింది. అంటే, కార్మికవర్గ నాయకత్వాన్ని, మిత్రత్వాన్ని లేకుండా చేసింది. పార్టీ అంటే కార్మికవర్గ పార్టీయని నిర్వచించి, పార్టీద్వారా, కార్మికవర్గ నాయకత్వం అనే సిద్ధాంతాన్ని, ఆచరణలో నాయకత్వం అనే మౌలికాంశాన్నివదలి, పిడి సిద్ధాంతంగా మాత్రమే మిగిల్చింది.

ఈ సందర్భంలో భారత కమ్యూనిస్టు ప్రతినిధివర్గం, చర్చలలో లేవనెత్తిని ప్రశ్నల కొన్నింటికి స్టాలిన్ యిచ్చిన వివరణలు[1] మన అవగాహన పరిధిని విస్తృతం చేస్తాయి

1) రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటాలు ప్రజల బలమైన కోరిక, నిర్మాణ స్థాయిపై ఆధారపడి మాత్రమే ప్రారంభమగుతవి. ఏ ఒకరి ఇష్టా, అయిష్టాలపై కాదు. పరిస్థితులు పరిపక్వతకు వచ్చినపుడు యే వొక్క ప్రాంతంలోనైనా, పరిసర ప్రాంతాలలో అట్టి పరిస్థితి లేకపోయినా, కార్మికవర్గ సహకారం లేకపోయినా రైతాంగ గెరిల్లా పోరాటాలు ప్రారంభం కావచ్చు. పోరాటంలో దశలున్నవి. చిన్న కోర్కెలు-కౌలు తగ్గింపు సమస్యతో మొదలుకావచ్చు. పాక్షిక సమస్యలపై పోరాటం ప్రారంభమై, భూమి పంపకం, గ్రామ కమిటీల నిర్మాణదశకు చేరినపుడే రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటం చేబట్టాలనే నియమంలేదు. ప్రజల సంసిద్ధతయే ప్రధానం. కౌలు తగ్గింపుకై ప్రారంభించబడిన పోరాటం, భూస్వాముల వ్యతిరేకతను, దౌర్జన్యాన్ని ఎదుర్కొనవలసి వచ్చినప్పుడు పోరాటం బలప్రయోగంతో తమ కోర్కెలను సాధించ సిద్ధపడినపుడు రైతాంగ సాయుధగెరిల్లా పోరాటం ప్రారంభమగుతుంది. భూమిని స్వాధీనం చేసుకొని పంచే పోరాటం కాదు. కౌలు తగ్గింపుకై పోరాటం మాత్రమే. అయినా అది రైతాంగ సాయుధ పోరాటం. కారణం బలప్రయోగం ఉపయోగించబడింది.

రైతాంగపు కోర్కెలను బలప్రయోగంతో అమలుచేయుటయే రైతాంగ సాయుధ పోరాటం. రైతాంగం వారి కోర్కెలకై బహిరంగ పోరాటం సాగించుటతో ప్రారంభమగుతుంది. ఇది పోరాట మొదటి దశ. వారి వుద్యమ ప్రధానకోర్కెకై

---

1. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర (1977) అధికారపత్రాలు (ఆంగ్లంలో) పి. పి. హెచ్. వా. VII పే. 35-41.

జరిగిన పోరాటం వున్నదశకు చేరుతుంది. శత్రువు సాయుధ ప్రతిఘటనను అణచుటకై రైతాంగం జరిపే సాయుధ పోరాటం, కార్మికవర్గ పోరాటం వలెనే ఉన్నత పోరాట రూపమగుతుంది కాన పోరాటం ఎవరి చేతులలోను లేదు. ప్రజలు సంసిద్ధులై తమకోర్కెలను అమలుపరచ దృఢసంకల్పంతోవుంటే వారికి సహాయాన్నిచ్చుటయే కర్తవ్యం.

2) గెరిల్లా పోరాటాల ప్రారంభదశలో, రైతాంగదళ రక్షణదృష్ట్యా, మిగతా వారిని భయభ్రాంతులను చేయుటకు కాకపోయినా, ప్రజా కంటకులైన వారిపై జరిపిన వ్యక్తిగత చర్యలు ప్రజాపోరాటాన్ని నీరుగార్చునో తెలియదంటున్నారు కొందరు అని స్టాలిన్ యిలా వివరించారు. ప్రజా పీడకులపైన వ్యక్తులచే జరుపబడుతున్న కారణంగా మాత్రమే "వ్యక్తిగత హింసావాద"మన బడుటలేదు. వ్యక్తి లేక దళంచే ప్రజలకు సంబంధంలేకుండా జరుగుట వలన "వ్యక్తిగత హింసావాద" మనబడుచున్నది. వ్యక్తిగత హింసావాదం మనకు ప్రధాన అపకారి. శత్రువు పాలకవ్యవస్థకాక వ్యక్తి అని, అట్టి శక్తులను కొందరిని నాశనంచేస్తే, పాలనా వ్యవస్థ నాశనమగుతుందనే భ్రమలను ప్రజలలో కలుగజేస్తుంది. అట్టి నిర్ణయానికి వచ్చిన రైతాంగం, ప్రజావుద్యమం అవసరంలేదని, మన వీరులు ఆపని చేస్తారని అంటుంది. ప్రజలు దుష్టపాలనపై దాడిచేసే వుద్యమాలను అట్టి అభిప్రాయాలు బలహీనపరచుటయేగాక ప్రమాదకరమైనవి. ప్రజలపాత్ర ప్రేక్షకులపై చప్పట్లుకొట్టుట అగుతుంది. ప్రజలలోని స్తబ్ధత కలుగుతుంది. ప్రజలే తమ విముక్తిని సాధించుకొనాలని మార్క్స్, ఎంజెల్సులు చెప్పారు. ప్రజలకు మనం యిదేచెప్పాలి. వ్యక్తిగత హింసావాదం వలన ప్రజలు వారిని వీరులు, విముక్తి ప్రదాతలుగా నెంచుతారు. వ్యక్తిగత హింసావాదం ఉద్యమం వెనుకాడిన దశలో సిద్ధాంత రూపంలోవస్తుంది. అది వుద్యమ బలహీనతా దర్పణం విప్లవోద్యమం వుచ్చదశలో ప్రజలు పెనుతుఫాన్‌లా లేచినపుడు, వ్యక్తిగత హింసావాద సిద్ధాంతం అదృశ్యమౌతుంది.

## ఐక్య జాతీయ సంఘటన

ఆచరణలో "రష్యామార్గం", "చైనామార్గం" నమూనాలు రెండూ, ఐక్య జాతీయ సంఘటనకు భూమికయైన కార్మిక, కర్షక మైత్రిని, సహకారాన్ని నిర్మించే కార్యక్రమాన్ని విముక్తిపోరాటంలో కార్మికవర్గ నాయకత్వంలో నిర్మించే కార్యక్రమాన్ని నిర్లక్ష్యం చేశారు.

రైతు పోరాటాలలోపార్టీ నాయకత్వంద్వారా కార్మికవర్గ నాయకత్వం నిర్మించబడాలనే దృక్పథం తప్పు. ఆచరణలో రైతుల కోర్కెలను ధైర్యంగా కార్మికవర్గం పోరాటాలతో బలపరుచుట మాత్రమే ఆచరణలో నాయకత్వం వహించుటకు తోడ్పడుతుంది. వాస్తవంగా ఆచరణలో సంఘటనరూపొందాలి, సిద్ధాంతంగాకాదు. పోరాడే కార్మికవర్గం పోరాడే రైతులకు ఆచరణలో సహాయపడి వుమ్మడి శత్రువుపై విజయాన్ని స్థిరపరచాలి.

వ్యవసాయ కూలీలు, పేద రైతులపై ఆధారపడి కార్మికవర్గం రైతులతో సంఘటనగా మేర్పడి, ప్రజలందరితో కలసి నగరాలలో, గ్రామసీమలలో విముక్తికి, భూమికి, తిండికి, పనికి, శాంతికై పోరాటాలకు నాయకత్వంవహించాలి. ఇదే చరిత్ర నేర్పిన పాఠము. రష్యామార్గమూకాదు, చైనా మార్గమూకాదు, భారత పరిస్థితులకు అన్వయించిన లెనినిజపు మార్గం, భారత పంథా.

ప్రధాన సమస్య సాయుధ పోరాటమా, కాదా? అనేదికాదు. ఆ సమస్యను మార్క్సిజం చరిత్ర ప్రజలను, పార్టీకి యెప్పుడో నిర్ణయించింది ప్రజలు తమ ప్రయోజనాలకై, విముక్తికై, ఆత్మరక్షణకై జరిపే అన్ని చర్యలు సమర్థనీయం, పవిత్రమూ అయినవే స్వాతంత్రానికి, అభ్యుదయానికి తాము మోయలేని అభివృద్ధి నిరోధక, కృశించే బరువును మార్గంలోనుండి తొలగించే చర్యలన్నిటిని చరిత్ర ఆమోదిస్తుంది.

చరిత్ర ఆమోదించనిది వొకేవొకటి వుంది. అదే వ్యక్తిగత హింసావాదం. ప్రజల ఆచరణకాదు గాన మార్క్సిజం ఆమోదించదు. వర్గంపైగాక వ్యక్తులపై వ్యక్తులు, దళాలు, గ్రూపులు జరిపే చర్య నిస్వార్థమైనవి, ప్రజలు ఆహ్వానించేది, ప్రజలు ద్వేషించేవారిపై జరిగినా లెనినిజం ఆమోదించజాలదు. ప్రజలలో చలన రాహిత్యాన్ని, వారి పాత్రలేమిని పెంపొందించుచుతుంది కాన వ్యక్తిగత హింసా వాదాన్ని మార్క్సిజం నిషేధిస్తుంది. [1]

## వ్యూహం. ఎత్తుగడలు

కమ్యూనిస్టుపార్టీ వ్యూహం, ఎత్తుగడల పంథా. సోవియట్ నాయకత్వంతో సంభాషణల అనంతరం చిత్తుప్రతి తయారుచేయబడి, కేంద్రసమితిచే ఏప్రిల్ 1951లో ఆమోదించబడి. పార్టీ వర్గాలలో చర్చించబడి, కలకత్తా అఖిలభారత కమ్యూనిస్టుపార్టీ రహస్య సమావేశంలో అక్టోబరు 1951 సవరణలతో ఆమోదించబడింది. వ్యూహం, ఎత్తుగడల చిత్తును తయారుచేయునపుడు వుద్భవించిన ప్రశ్నలకు కొన్ని సందేహాలకు అంతర్జాతీయ కమ్యునిస్ట్ నాయకత్వం యిచ్చిన వివరణలు సంగ్రహంగా తెలుసు కొందాము. [2]

1) కమ్యూనిస్టుపార్టీ చిత్తు కార్యక్రమంలోని తక్షణ ప్రధాన ధ్యేయమైన ఫ్యూడలిజం నిర్మూలన, ఆ భూములను రైతులకు, వ్యవసాయ కూలీలకు పంచుట, సంపూర్ణ స్వాతంత్ర్య సంపాదన, శాంతి పార్లమెంటరీ విధానాలలో సాధ్యంకాదు. జనతా ప్రజాస్వామ్యాన్ని విప్లవం ప్రభుత్వంవలనే సాధ్యమౌతుంది. ఇది విస్తృత

---

1. భారత కమ్యూనిస్టుపార్టీ రాజకీయ విధానప్రకటన (ఆంగ్లంలో) 1951 పి.పి.హెచ్. పే. 6-7.

1. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర (1977) అధికార పత్రాలు పి.పి.హెచ్. (ఆంగ్లంలో) VII వాl పే. 35.

జాతీయ సంఘటనతోనే విజయం పొందుతుంది, అన్ని పోరాట రూపాలను, ప్రాథమిక, చట్టసమ్మత పోరాట రూపాలను ప్రజా సమీకరణను వినియోగించుతుంది. ఈ పోరాట రూపాలను ప్రభుత్వం అనేక నిర్బంధాలకు గురిచేయుటతో ఈ ప్రభుత్వాన్ని మార్చజాలమని తెలుసు. అది ప్రజల సాయుధ పోరాటం విజయం పొందుటవలనే సాధ్యమని గత మూడు సంవత్సరాల అనుభవం తెలియజేస్తుది.

భారతదేశ వలస ఆర్థిక విధాన ఆధిక్యతను మరచి, చైనా విప్లవానుభవాలు మన ప్రత్యేక పరిస్థితులు గుర్తించకపోవుట, ప్రథమంలో రైతు పోరాటాల ప్రాధాన్యతను తదుపరి కార్మికవర్గ పోరాటాల ప్రాముఖ్యతను గుర్తించని అవగాహనలతో, వ్యూహరచన, కార్మిక కర్షక ఐక్యతా నిర్మాణ కర్తవ్యాన్ని దానిననుసరించి ఐక్య జాతీయ సంఘటనా నిర్మాణాన్ని, కార్మికవర్గ నాయకత్వాన్ని, భూస్వాములు వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవంలో త్రోసి రాజనుట జరిగింది. శాస్త్రీయ వ్యూహరచన యీ రెండు సిద్ధాంతాలను త్రోసిపేయవలసివుంది.

భారతదేశం విశాలమైంది. వెనుకబడినది మౌలికంగా వలస ఆర్థికవిధానం, 80 శాతం వ్యవసాయంపై ఆధారపడినవారు ఇట్టి దేశాలలో చైనా అనుభవంతో విప్లవోద్యమాల ఆయుధాగారంలో రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటరూపం ముఖ్యమైనవాటిలో వొకటి. జాతీయ విముక్తిపోరాటంలో కమ్యూనిస్టుపార్టీ ఈ ఆయుధాన్ని చేబట్టవలసివుంది. అదే కాలంలో భారత ప్రత్యేక పరిస్థితులను, లక్షణాలను పరిగణించనిచో యీ వొక్క ఆయుధంతో విజయం అసాధ్యం. చైనాలో 1927లో 30 వేల సైన్యం చీలి, కమ్యూనిస్టు పార్టీ వైపుకు ప్రారంభంలోనే వచ్చింది. కమ్యూనిస్టుల ప్రాంతాలకు రవాణా సౌకర్యాలులేవు. ప్రభుత్వ సైనికులు వేగంగా చుట్టిముట్టి దండయాత్రలు చేయలేకపోయారు. విప్లవ సైన్యాలకు అంతటి అనుకూల పరిస్థితులున్నా, జంగైషేక్ సైన్యాలచే చుట్టముట్టబడి అనేకసార్లు విపరీత నష్టాలకు గురై, చేదించుకొని పోవలసి వచ్చింది. మంచూరియాకు చేరిన తరువాత వెనుకతట్టున బలమైన సోవియట్ ప్రాంతం వుండుటతో చుట్టముట్టడుట" జరుగలేదు. తదనంతరం సోవియట్ భారీ ఆయుధాల సహాయంతో ఎదురు దండయాత్రగావించి, చైనా విప్లవం విజయం పొందింది. వెనుక సోవియట్ సరిహద్దు, సోవియట్ మిలటరీ భారీ ఆయుధ సహాయం ప్రధానపాత్ర వహించుటతో విజయంలభించింది రైతాంగ సాయుధగెరిల్లా పోరాటం విజయం పొందుటకు, సోవియట్ ఆయుధ సహాయం ముఖ్యపాత్ర వహించిందనుట చారిత్రక సత్యం.

2) భారతదేశ పరిస్థితి పూర్తిగ భిన్నమైనది. అన్ని విధానాలైన రవాణా, సమాచార సౌకర్యాలు బాగా అభివృద్ధి చెందివున్నవి. రైతాంగ సాయుధ గెరిల్లా దళాలు, నవీన ఆయుధసైన్యాలను ఎదిరించుట అనే ప్రశ్న వుదయించదు. పైగా ప్రభుత్వ సైనిక, పోలీసుదళాలు గెరిల్లాదళాలపై దెబ్బతీయగలవు. మిత్ర సరిహద్దు దేశాలు వెనుకతట్టున లేవు. అంతమాత్రాన భారతదేశంలో రైతాంగ సాయుధగెరిల్లా టాలకు ఎట్టి అవకాశము లేదనుకొనరాదు. అందుకు భిన్నంగా, రైతాంగ

గెరిల్లా సాయుధపోరాటం ఒక్కటే విజయాన్ని చేకూర్చదు. నగరాలలో సార్వజనీన సమ్మెలు, కార్మికవర్గ సాయుధదళాల తిరుగుబాటులు, సమ్మెలతో, గ్రామీణ ప్రాంతాల రైతాంగ గెరిల్లా పోరాటాలతో మేళవించవలసి వుంటుంది.

సంక్షోభం తీవ్రమగుటతో రైతాంగ ప్రజావుద్యమము ఆహారం, భూమిని విప్లవ పోరాటాలలో స్వాధీనం చేసుకొను దశకు విజృంభించినపుడు స్థానిక శత్రు బలగాలను నిర్వీర్యం చేయుటకు, నాశనం చేయుటకు వివిధ ప్రాంతాలలో సాయుధ రైతాంగ గెరిల్లాదళాల ప్రాంతాలు యేర్పడుతవి. ఈ ప్రాంతాలు, విప్లవశక్తులు శత్రు సైన్యాలతో చుట్టుముట్టబడి నాశనం చేయబడే పరిస్థితి యేర్పడుతుంది. దేశంలోని అనేక ప్రాంతాలలో విముక్తి ప్రాంతాలు వాటి స్వంత సాయుధదళాలతో యేర్పడినా, అవి వ్యతిరేక శత్రుశక్తులచే చుట్టుముట్టబడి వుండుటచే, ప్రమాదాన్నుండి కాపాడబడ జాలవు భారత వాస్తవ పరిస్థితులలో విముక్త ప్రాంతం ఎంత విస్తరించినా, ఎన్ని ప్రాంతాలలో యేర్పడినా, రైతాంగ సాయుధ గెరిల్లాపోరాటం స్థిరమైన విజయాన్ని పొందజాలదు వందల, వేల రైతాంగ సాయుధ గెరిల్లా ప్రాంతాల ప్రవాహాలు, నగరాలలో కార్మిక సార్వజనీన సమ్మెలు, తిరుగుబాటులు మిళితమైనపుడు శత్రువు తన శక్తులను ఎక్కడా కేంద్రీకరించలేక, విప్లవ పోరాటశక్తులను వోడించుట అసాధ్యమై తానే వోటమి పొందుట జరుగుతుంది. ప్రభుత్వ సైన్యంలో సంక్షోభం యేర్పడి పెద్ద భాగం విప్లవశక్తులతో కలుస్తుంది.

3) పార్టీ దృక్పథంలో కార్మిక, రైతాంగవర్గాల ఐక్యత, ఆ సమ్మేళనంలో కార్మికవర్గ నాయకత్వం అత్యంత ఆవశ్యకం. రైతాంగపు కోర్కెలను, పోరాటాలను కార్మికవర్గం ధైర్యంగా ప్రదర్శనలు, సానుభూతి సమ్మెలతోపాటు, కార్మిక వర్గాలు గ్రామీణ పోరాటాలలో పాల్గొన్నపుడు, ఆచరణలో కార్మికవర్గపు నాయకత్వం శాస్త్రీయంగాను, కార్మికవర్గ అగ్రగామిదళ కమ్యూనిస్ట్ పార్టీ నాయకత్వం యేర్పడుతుంది. అప్పుడే రైతాంగం కార్మికవర్గాన్ని తమ మిత్రవర్గంగా, పోరాట నాయకత్వవర్గంగా గుర్తింపుతారు. కార్మికులలో యెక్కువ భాగం గ్రామసీమలనుండి వచ్చినందున గ్రామసీమలతో సంబంధాలను కలిగివున్నందున యీ విధంగా కార్మిక, కర్షక ఐక్యత బలోపేతమగుటకు అవకాశాలు యెక్కువగా ఉన్నవి.జాతీయోద్యమ చరిత్ర, గ్రామసీమలలో జాతీయోద్యమవ్యాప్తికి కార్మికులు యెంతగా తోడ్పడింది దీనినే స్పష్టం చేస్తుంది.

కార్మికులలో దైనందిన పోరాటాలద్వారా రాజకీయ చైతన్యాన్ని పెంపొందించి, కార్మికవర్గంలో నేటి అనైక్యతను అధిగమించి, కీలక పరిశ్రమలలోని కార్మికులలో అత్యధికులను సమీకరించి, బలమైన కార్మికోద్యమాన్ని నిర్మించి, ఫ్యాక్టరీ, వర్కుషాపులలో రహస్యకమిటీలను పోరాట కేంద్రాలుగ యేర్పరచి, చురుకైన వారిని పార్టీలో చేర్చాలి. కార్మికుల కోర్కెలపై రోజువారి పోరాటాలు జరుపుతు బలమైన ట్రేడు యూనియన్ వుద్యమాన్ని నిర్మించాలి. ఐక్యతను, తనవర్గపాత్రను నెరిగిన కార్మికవర్గం జాతీయ ఐక్యతను నిర్మించగలుగుతుంది, విప్లవ పోరాటాలకు నాయకత్వం వహించగలుగుతుంది

4) గ్రామీణులలో వ్యవసాయ కూలీలు, పేద రైతులు అత్యధికులు, వీరితో పాటు మధ్యతరగతి, ధనిక రైతులందరూ ఫ్యూడలు భూస్వామ్యవర్గంచే అనేక విధాల పీడింపబడుతున్నవారే. పార్టీ వీరిని సమీకరించి ఫ్యూడలు భూస్వామ్య వ్యతిరేక పోరాటాన్ని సాగించాలి. ఫ్యూడలు భూస్వామ్య విధానరద్దు, వ్యవసాయభూముల పంపక నినాదం వ్యవసాయ విప్లవ కాలమంతటి నినాదంగా వుండాలి రైతాంగపు తక్షణ కోర్కెలైన కౌలు తగ్గింపు, వెట్టిచాకిరి రద్దు, ఫ్యూడలు నజరానాలా వసూళ్ళ రద్దు, పంటలకు తగిన ధరలు, వ్యవసాయ కార్మికులకు జీవనవేతనం, తదితర సామాజికపీడనలపై పోరాటాలు సాగించాలి. అసంతృప్తి వ్యాపిస్తున్నా, చాల బలహీనంగా రైతు సంఘాల నిర్మాణం ఉన్నది. దేశంలో విస్తార ప్రాంతంలో రైతు సంఘాలు లేవు. మన వ్యవసాయ కార్యక్రమాన్ని ప్రచారంచేస్తూ, స్థానిక కోర్కెలపై విస్తృత రైతాంగాన్ని సమీకరించి పోరాటాలు సాగిస్తూ, సంఘ నిర్మాణం గ్రామాలలో రహస్యంగా కమిటీల నేర్పాటు చేయాలి. శత్రువులనుండి వుద్యమ రక్షణకు వలంటీరు దళాలు నిర్మించాలి. అవే వుద్యమాభివృద్ధిలో, భూముల స్వాధీనదశలో రైతాంగపు సాయుధ గెరిల్లా దళాలకు బీజాలగుతాయి.

సంక్షోభం పరిపక్వమైన కొలది ఐక్యత, జాగృతి, నిర్మాణం, బలం, ప్రభావం పెరిగిన కొలది శత్రువు వ్యవసాయ వుద్యమాన్ని అణచుటకై క్రూరదమనకాండ సాగించుట, ఎప్పుడు, ఎక్కడ సాయుధ ప్రతిఘటన అనేది ఎజెండాలో ప్రత్యక్షమౌతుంది పార్టీ అప్పుడు ఆచరణ ప్రాముఖ్యత కారణంగా స్పష్టమైన సమాధానమివ్వవలసి వుంటుంది.

భారతదేశం విశాలమైనది, అసమాన ప్రజాచైతన్యం, ప్రజా వుద్యమ అసమానతలవలన వ్యవసాయ వుద్యమ తీవ్రత, పార్టీ బలం, ప్రభావం అసమానంగా వుండుటవలన, అన్ని ప్రాంతాలలో రైతాంగ వుద్యమం వొకే విధంగా అభివృద్ధి చెందదు. పరిస్థితి పరిపక్వత చెందని తిరుగుబాటులు, దుందుడుకు చర్యలు చేబట్టరాదు అదేకాలంలో దేశంలోని అన్ని ప్రాంతాలలో తిరుగుబాటుదశ పోరాటం అభివృద్ధి చెందిన తరువాతే రైతాంగ సాయుధ గెరిల్లా చర్యలనే నిర్ణయం తప్పుడు విధానమగుతుంది.

రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటాలు ప్రారంభమైనపుడు అవి తప్పనిసరిగా కార్మికవర్గపు ప్రజాపోరాటాలలో, ముఖ్యంగా పరిసర ప్రాంతాలలో సమ్మెలు, ప్రజా ప్రదర్శనలు, తదితర పోరాటాలను మేళవించవలసి వుంటుంది. శత్రువర్గాల బలమెక్కువై, రైతాంగ సాయుధ గెరిల్లాల నాశనమయ్యేపరిస్థితి యేర్పడినపుడు, పార్టీ పట్టువిడుపులతో పోరాట శక్తులను కాపాడుకొనవలసి వుంటుంది.

5) రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటం ముఖ్యంగా రైతులను భూస్వాముల సాయుధ రౌడీమూకలనుండి, ప్రభుత్వ పోలీసు దౌర్జన్యాలనుండి కాపాడుటకై జరుగుతుంది, ఈ పోరాటంలో రైతుల కోర్కెలను సాధించుటకై ప్రాధాన్యత యివ్వబడుతుంది.

రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటాలను, వ్యక్తిగత హింసావాదంతో గందరగోళ పరచుటయేగాక, అది రైతాంగ పోరాటంలో భాగమని, ఆ పోరాటానికి ముఖ్యమైదననే దురభిప్రాయంవుంది. ఇది నిస్సందేహంగా పొరపాటు. వ్యక్తిగత హింసావాదం, రైతాంగ సాయుధ గెరిల్లా పోరాట ధ్యేయాన్ని, దాని సారాన్ని వ్యతిరేకిస్తుంది. వ్యక్తిగత హింసావాదం వ్యవస్థపై పోరాటంగాక, వ్యక్తులపై కేంద్రీకరించబడుతుంది. వ్యవస్థ ప్రతినిధులను నాశనం చేసినందున వ్యవస్థ నాశనమౌతుందనేది, ప్రమాదకర భ్రమలను కలుగజేస్తుంది వ్యవస్థగాక, వ్యవస్థ సృష్టించిన వ్యక్తుల వినాశంతో దోపిడి నిర్మూలించబడుతుందనే అభిప్రాయాన్ని పెంపొందించి ప్రజా పోరాటాలను బలహీనపరుస్తున్నది ప్రభుత్వం ప్రజాపోరాటాలను అణచివేసే అవకాశాన్ని కలుగజేస్తుంది. ప్రజలపాత్ర లేకుండా చేస్తుంది. ఇదే వ్యక్తిగత హింసావాదం కలిగించే ప్రధాన ప్రమాదం కాన నిరాకరించాలి

6) గత మూడు సంవత్సరాలలో ప్రజలలో యెంతో జాగృతి కలిగింది. అనేక ప్రజాపోరాటాలు జరిగినా, జరుగుతున్నా సాయుధ తిరుగుబాటు అంతర్యుద్ధంలో యిప్పటికే వున్నామని చెప్పుట యెంతో అతిశయోక్తి అనుటలో సందేహం లేదు ప్రభుత్వ ప్రజా వ్యతిరేక శక్తులు ప్రజలనుండి దూరమై, యేకాకులయ్యారని చెప్పుట అతిశయోక్తి అగుతుంది. అతిశయోక్తులు, నేటి రాజకీయ ఉద్యమ వాస్తవ పరిస్థితులను పరిగణించక, వాగాడంబర నినాదాలు, పోరాట పిలుపులు యివ్వటమే కాగలదు. ఆచరణలో పార్టీ స్వయంగావొంటరదై శత్రువు దెబ్బతీసే అవకాశమిచ్చుటయే అగుతుంది సోషలిస్టులకు, విద్రోహులకు ప్రజలను అప్పజెప్పుటయే కాగలదు

ప్రజా వుద్యమాల బలహీనతను అనైక్యతను చూసి "అణగిమణిగి వుండి" ప్రజా సమీకరణలు చేయాలనుట తిరోగమనము మితవాద సంస్కరణవాద తప్పిదము. నగరాలలో, గ్రామీణ ప్రాంతాలలో పోరాటాలు విరమించుట, ప్రజల తోకను పట్టుకొని పోవుట అగుతుంది. కాని, ప్రజలకు నాయకత్వం వహించి నడుపుట కాజాలదు. అది అతిహీనమైన సంస్కరణవాద మగుతుంది.

పొలిట్‌బ్యూరో ప్రకారం వాస్తవ పరిస్థితి ఏమిటనగా సంక్షోభంలో పరిస్థితి పరిపక్వతవైపు పయనిస్తున్నది. ప్రభుత్వం ఆహారభూమి సమస్యలను పరిష్కరించలేని కారణంగా ప్రజల భ్రమలు తొలగిపోతున్నాయని, యీ ప్రభుత్వాన్ని దోపిడి వర్గాలను ఎన్నికల ద్వారా తొలగించగలమనే నూతన భ్రమలతో వున్నారు అయినా దైనందిన కోర్కెలపై ప్రజలు పోరాటాలలోనికి వస్తున్నారు ప్రజావుద్యమ పెరుగుదల అంతగా లేదు. కారణం ప్రభుత్వం అమలుపరచు దమనకాండతోపాటు, పార్టీలోని అనైక్యత, బలహీనత, అభ్యుదయ శక్తులలో గందరగోళం ప్రధానంగా కన్పించుచున్నది.

ఈ ప్రయత్నాన్ని వోడించాలని ప్రజా ప్రభుత్వాన్ని ఏర్పరచాలని బ్రిటిష్ కామన్‌వెల్తుతో ఎట్టి సంబంధం వుండరాదనే నినాదంతో ఎన్నికలలోపాల్గొని ప్రజలకుగల భ్రమలను తొలగించాలి. రాబోవు అవకాశాన్ని ఎన్నికలను అందుకుపయోగించు

కొనాలి. ప్రజలను వారి రోజువారి పోరాటాలలో మెట్టుమెట్టుగా వున్నత పోరాట రూపాలలోనికి తీసుకొనిపోతూ రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటాల ఆవశ్యకతను గుర్తించునట్లు చేయాలి. ఇది నేటి తక్షణ కర్తవ్యమని పొలిట్ బ్యూరో స్పష్టంచేసింది.

7) పార్టీ చేబట్టవలసిన అత్యంత ముఖ్యమైన శాంతి పోరాటానికి ప్రజా సమీకరణ చేయాలి. నైరృతి ఆసియాలో అధిక జనాభా కలిగి కీలకస్థానాన్ని ఆక్రమించిన భారతదేశం, అమెరికా, బ్రిటిష్, ఫ్రెంచి యుద్ధపిపాసులకు వ్యతిరేకంగా శాంతి పోరాటంలో ముఖ్యపాత్ర వహించాలి. అందుకు కమ్యూనిస్టు పార్టీ తన పాత్ర నిర్వహించి, శాంతి వుద్యమాన్ని నడపాలి

ఇండియాలో పాకిస్థాన్‌పై యుద్ధం అనే బూర్జువా ప్రచారాన్ని వ్యతిరేకిస్తూ, దానిని తమ కుటిలయత్నాలకు వినియోగించుకొనాలనుకొనే సామ్రాజ్యవాదుల ప్రణాళికలను భగ్నంచేస్తూ, శాంతి పోరాటాన్ని తీవ్రతరం చేయాలి. ప్రవదా విలేఖరికి స్టాలిన్ చెప్పిన విధంగా యుద్ధ వ్యతిరేక ప్రచారాన్ని వుధృతంచేసి, అమెరికా, బ్రిటన్ సామ్రాజ్యవాదులను బట్టబయలు చేస్తూ, శాంతి పరిరక్షణ కృషి వుధృతం చేయాలి.

భారత కమ్యూనిస్టు ప్రతినిధివర్గం అడిగిన ప్రశ్నలు కొన్నింటికి స్టాలిన్ సమాధానమిస్తూ, భారత బూర్జువావర్గ విశ్లేషణపై యిలా పేర్కొన్నారు.

భారత బడా బూర్జువావర్గంలో కొంతభాగం చివరకు సామ్రాజ్యవాదంతో చేతులు కలిపింది. బూర్జువావర్గమంతా కాదు. బూర్జువావర్గంలో యెక్కువభాగం పారిశ్రామికీకరణకు అనుకూలురు, విదేశీ పెట్టుబడులకు వ్యతిరేకులు. భారత బడా బూర్జువావర్గంలో కొన్ని సెక్షనులు యింకా సామ్రాజ్యవాద వ్యతిరేకపాత్రను కలిగి వున్నవి. దేశీయ మార్కెట్టును అదుపు చేస్తుందని, రైతాంగాన్ని దోచివేస్తుందని, సామ్రాజ్యవాద వ్యతిరేక పాత్రను కలిగివున్నారు. చేతులు కలిపిన బడా బూర్జువా వర్గశాఖలను తూకము వేయుట సరికాదు జాతీయ బూర్జువావర్గంలోని అత్యధిక భాగం సామ్రాజ్యవాద వ్యతిరేకపాత్ర కలిగివుంది. కొంతభాగం మాత్రమే నిస్సందేహంగా అభివృద్ధి నిరోధకమైనది. అన్ని వర్గాల, జాతీయ బూర్జువావర్గంతోసహా ఐక్యసంఘటనను నిర్మించుట సరియైనది.

బడా బూర్జువా భూస్వామ్య ప్రభుత్వం సామ్రాజ్యవాదంతో చేతులు కలుపుట పూర్తి సత్యంకాదు. ధనిక రైతు అందులో భాగస్వామి, కాన ప్రభుత్వ పునాది అంత చిన్నదికాదు, విస్తృతమైనది. తేలికగా పడిపోవుటకు తోలుబొమ్మ ప్రభుత్వం కాదు. అత్యధిక రైతాంగం, కార్మిక, మేధావులపై ప్రభుత్వం ఆధారపడిలేదు. అదే దాని బలహీనత. ఫ్యూడలు వ్యతిరేక పోరాటంలో ధనికరైతు ప్రయోజనం కొంత వున్నందున దానిని బలపరచుటో లేక తటస్థుడుగానో వుంటాడు, కాన పోరాటంలో కలుపుకొననలసి వుంది.

విదేశాంగ విధానం, బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదుల మధ్యనేకాకుండా యుద్ధోన్మాద దేశాలు, శాంతి కాముక దేశాలమధ్యకూడా భారత ప్రభుత్వం ద్వంద

విధానాన్ని అనుసరిస్తున్నది. అభ్యుదయకర విధానాలను బలపరస్తూ అభివృద్ధినిరోధక విధానాలను విమర్శించి బహిరంగపరచు విధానం సరియైనది. కొన్ని ప్రత్యేక సమస్యలపై ప్రభుత్వాన్నిసమర్థిస్తూ, సాధారణ వ్యతిరేక విధానాన్ని అనుసరించుటలో పరస్పర వైరుధ్యంలేదు"[1] అని స్టాలిన్ వివరించారు.

## VI

## అతివాదంలో అంతర్ధానమైన ఐక్యసంఘటన

భారతదేశ నవీనచరిత్రలో 1947-1951, రాజకీయ పరిణామాలు అత్యంత వేగంగా మార్పుచెందుతు, చరిత్రగతిని మార్చిన చారిత్రకకాలం. కమ్యూనిస్ట్ పార్టీ మితవాదంనుండి బయటపడ్డామని చెప్పుకొంటూ, తీవ్ర అతివాదం, సెక్టేరియనిజం, పిడివాదం సాహసిక వాదాలలో మునిగిపోయింది పార్టీ "సంయుక్త సంఘటన", "జాతీయ సంఘటన", "విస్తృత ఐక్య సంఘటన", "జనతా ప్రజాస్వామ్య సంఘటన"లను, "వామపక్ష ఐక్యత", "కార్మిక, కర్షక, ఐక్యత"లను అనేకసారులు అధికారికంగా ప్రస్తావించుతున్నా ఆచరణలో పూర్తిగ వదిలివేసి, ప్రజలనుండి, ప్రజాస్వామ్య అన్నివర్గాలనుండి దూరమైంది. ఐక్య సంఘటనా సమస్యలను అధ్యయనం చేయునపుడు వ్యూహం, ఎత్తుగడలను రెండింటిని ఏకంగా పరిశీలించనిచో నేలను విడిచి సాముచేయుటయే అగుతుంది.

### పోరాట వ్యూహం, ఐక్యసంఘటన

సామ్రాజ్యవాదం, ప్యూడలిజం, భారత బడాబూర్జువావర్గాల కూటమిని వోడించుటకై ప్రజా విప్లవ పోరాటశక్తులు నూతన ఐక్య సంఘటనకు కమ్యూనిస్టుపార్టీ కార్మికవర్గం, పార్టీననుసరించే ప్రజాసంఘాలు ప్రధానపునాది. వామపక్ష పార్టీలను అనుసరించే పోరాటశక్తులు, ఆ పార్టీలలోని నిజమైన వామపక్షవాదులు ఐక్యసంఘటనలో భాగస్వాములగుతారు ఈ ఐక్య సంఘటన కాంగ్రెసు లీగులలోని సామ్రాజ్యవాద వ్యతిరేక వర్గాలుతోనహా, అన్ని సామ్రాజ్యవాద, ప్యూడలు వ్యతిరేక శక్తులందరితో కలసి యేర్పడుతుంది. ఇది 2వ, పార్టీ కాంగ్రెసు సిద్ధాంతపత్రపు అవగాహన. ఈ సంఘటనలో జాతీయ "జాతీయ బూర్జువా వర్గానికి స్థానంలేకుండుట, పైనుండి ఐక్య సంఘటన నిర్మాణంకాక, క్రిందినుండి యేర్పడుట ఏ వామపక్ష పార్టీలతోకలసి గాక ఆ పార్టీలలోని అభ్యుదయశక్తులతో క్రిందినుండి అనేదికూడస్పష్టము. పైనుండి ఐక్యసంఘటనా నిర్మాణప్రయత్నం పూర్తిగ వదలివేయబడింది.

ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ కార్యవర్గం డిశెంబరు, 1948కే రాజకీయవిధానం ఎత్తుగడలపై కొన్ని ప్రశ్నలు లేవనెత్తింది. కాంగ్రెసు సిద్ధాంతపత్రానికి భిన్నంగా బడాబూర్జువావర్గం మాత్రమే సామ్రాజ్యవాదంతో రాజీవిధానాన్ని అవలంభించిందని,

---

1. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర (1977) అధికార పత్రాలు పి.పి. హెచ్. వా VIII పే 35-40.

గ్రామీణ ప్రాంతాలలో పోరాటాలు, వ్యూహాలు, భూస్వామ్యవ్యతిరేకమైనవి మాత్రమే అయిన కారణంగా మధ్యతరగతి రైతును పోరాటంలో సమీకరించాలని, ధనికరైతు పై పోరాటంగాక తటస్థతపరచే ఎత్తుగడల నవలంభించాలని సూచించింది దీనిని కేంద్ర నాయకత్వం "ప్రజాస్వామ్య విప్లవానికి వ్యూహం, ఎత్తుగడలు" అనే సుదీర్ఘ పత్రంలో "అవకాశవాద సహకార సిద్ధాంతంగా" తీవ్ర విమర్శకు గురిచేసింది అది రూపొందించిన సంక్షిప్త ఎత్తుగడల పత్రం ఈ క్రిందివిధంగా పేర్కొంది.

"లక్ష్యం : సామ్రాజ్యవాద, భూస్వామ్య, బూర్జువావర్గ కూటమికి నాయకత్వం వహించుతున్న బూర్జువా ప్రభుత్వాన్ని పడగొట్టి, భూస్వామ్య అవశేషాలను రూపు మాపి, జాతీయకరణ, పరిణామమార్గంలో తాత్కాలిక ఆర్థిక విధానాన్ని చేబట్టుట, విప్లవ ప్రధానశక్తి : కార్మికవర్గం, రిజర్వు శక్తులు, వ్యవసాయ కార్మికులు, పేద రైతులు, మధ్య తరగతి రైతులు, బస్తీలలో అణగారుతున్న మధ్యతరగతి పెటీ బూర్జువాలు. ప్రధానదాడి దిశ : పాలక బూర్జువా శక్తులను, బూర్జువా, పెటీబూర్జువా సోషలిస్టు పార్టీలను వారిననుసరించే ప్రజలనుండి వేరుచేయుట, పోరాట శక్తులను మోహరించు ప్రణాళిక : వ్యవసాయ కూలీలు, పేదరైతులపై ప్రధానంగా ఆధారపడి కార్మికవర్గ మిత్రత్వంతో మధ్యతరగతి రైతాంగం వెంటరాగా, బూర్జువాలను ప్రజల నుండి వేరుచేసి, వారి ప్రతిఘటనను రూపుమాపి, జనతా ప్రజాస్వామ్య విప్లవాన్ని జయప్రదం చేయాలి.

ఐక్య సంఘటనా నిర్మాణాన్ని వామపక్షశక్తుల, పక్షాల సహకారంతో ప్రయత్నిస్తుంది. కార్మికవర్గ కార్యక్రమానికి రైతులను మధ్యతరగతి బూర్జువాలను సమీకరిస్తుంది. కమ్యూనిస్టులు ఐక్య సంఘటనా నిర్మాణంలో కార్మికవర్గ నాయకత్వాన్ని మరువజాలరు. ఐక్య సంఘటనా నిర్మాణ పోరాటంలో సామాన్య కార్యక్రమాన్ని రూపొందించు సిద్ధాంతపోరాటం యిమిడివుంది ఐక్య ప్రజాపుద్యమాన్ని, ప్రజాస్వామ్య పద్ధతులలో ప్రజా ఐక్యత పునాదిగా నిర్మించుక్రమంలో క్రమేణా కార్మికవర్గ నాయకత్వాన్ని రూపొందించవలసివుంది అంచేతనే పైనుండి యేర్పడే వామపక్షాల మిత్రకూటమి మాత్రంగాకాక కార్మిక, కర్షక మేధావివర్గాల క్రిందనుండి కూడా యేర్పడే ఐక్య సంఘటనగా సరియైన అవగాహన వుండాలి.

జూన్ 1950లో ఏర్పడిన నూతన కేంద్రకమిటి మాజీనాయకత్వపు అతివాద వక్రీకరణపై నివేదికను నిర్మాణక్రమంలో చర్చించి ఆమోదించింది గత నాయకత్వం ప్రకటించిన "జనతా ప్రజాస్వామ్యం" "వ్యవసాయ సమస్య", "వ్యూహం ఎత్తుగడలు"ను వుపసంహరించింది తాత్కాలికంగా వ్యవసాయ రంగంలో కర్తవ్యాలు, ఎత్తుగడలపై ఆంధ్రా డాక్యుమెంట్సును అనుసరించవలసినదిగా కోరింది. నూతన విధానాన్ని జూన్ 1950 లేఖలోవివరించింది. అదే భారతదేశంలో విప్లవానికి "చైనా మార్గంగా" ప్రచారం పొందింది.

భారత విముక్తి పోరాటం చైనామార్గంలో పురోగమించుటకు రెండు ప్రధాన అంశాలును వివరించింది. ఒకటి : విస్తృత రైతాంగం మేధావివర్గం, పట్టణ పెటీ

బూర్జువా వర్గం, సామ్రాజ్యవాదం గుత్త పెట్టుబడిదారి వర్గంచే అణచివేయబడుతున్న జాతీయ బూర్జువావర్గం, కమ్యూనిస్టు పార్టీ కలసి యేర్పడే జనతా ప్రజాస్వామ్య ఐక్య సంఘటన, సామ్రాజ్యవాదం, వారి తాబేదారులకు వ్యతిరేకంగా కార్మికవర్గ అగ్రదళమైన కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంలో జరిగే పోరాటం. రెండు : గ్రామీణ ప్రాంతాలలో ఫ్యూడలు భూస్వాములకు వ్యతిరేకంగా జరిగే సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటం, ఈ ద్విముఖ పోరాటాల సమన్వయంతో, సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటాల భూమికతో అధికారం కొరకై ఆఖరి పోరాటం "చైనామార్గంగా" వివరించబడింది.

ఫ్యూడలు సంబంధాల ఆధిక్యత కారణంగా వ్యవసాయ విప్లవం భారత జాతీయ విముక్తి వుద్యమానికి "ఇరుసు", "దున్నేవానికే భూమి" నినాదం విస్తృత రైతాంగవర్గాలను పోరాటానికి సమీకరించే నినాదం కాగలదు. పోరాటరూపం సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటాల భూమికతో అధికారంకొరకై ఆఖరిపోరాటం, విప్లవ స్థావరాలు, విముక్తి ప్రాంతాలు, ఆఖరికి అధికార స్వాధీన పోరాటంమార్గంగా వ్యూహరచన వివరించబడింది.

నూతన కేంద్ర కమిటి తమ పత్రం నూతన రాజకీయ సిద్ధాంతంకాదని, గత రెండున్నర సంవత్సరాలుగ ప్రబలిన అతివాద పెంపెత్తుపోకడల దుస్సాహసిక విధానాల ఫలితంగా కమ్యూనిస్టుపార్టీ సంక్షోభంలో పడిపోయిందని, దేశంలో వాస్తవ రాజకీయ పరిస్థితులకు దూరమై రూపొందించిన రాజకీయ అవగాహన, వ్యూహం, ఎత్తుగడల ఫలితంగా యేర్పడిన దుష్ఫలితాల విమర్శనా పత్రమే తమ లేఖయని స్పష్టంచేసింది. వ్యవసాయ విప్లవ ప్రాతిపధికగా సాయుధరైతాంగ గెరిల్లా పోరాటాలుగ ప్రారంభమై, చివరకు నగరాల ఆక్రమణ, అధికారానికై ఆఖరి పోరాటంగా వివరించింది. పార్టీ 2వ కాంగ్రెసు రాజకీయ సిద్ధాంత అవగాహనతో భేదించకపోగా ప్రధాన విషయాలన్నిటితో యేకీభవించింది. ఎత్తుగడలలో మాత్రమే చైనామార్గం, వ్యవసాయ విప్లవమార్గాన అనుసరించింది.

అజయ్‌ఘోష్, డాంగే, ఘాటేలు నూతన కమిటీ రాజకీయ అవగాహనను, వ్యూహం, ఎత్తుగడలను విమర్శించి వ్యతిరేకించారు. మాజీ నాయకత్వం "రష్యా మార్గమని" వాటికనుగుణంగా "విప్లవ వెల్లువ"ను నూతన నాయకత్వం "చైనా మార్గమని దానికనుగుణంగా "అంతర్యుద్ధ పరిస్థితిని, రష్యావిప్లవ పోలికలు, చైనా 1927 విప్లవ సారూప్యతలను. వాస్తవదేశ పరిస్థితులను, ప్రత్యేకాంశాలను అధ్యయనంచేయక, యాంత్రికంగా ఆ నమూనాలను దిగుమతి చేయుటవలనే స్వయం సంతృప్తి, సెక్టేరియనిజం, దుస్సాహసిక వాదంలో పార్టీ మునిగి సంక్షోభంలో పడిపోయిందని వారి ప్రధాన విమర్శ. కొమిన్‌ఫారం పత్రిక సంపాదకీయంలో మాజీ పొలిట్‌బ్యూరో తన అతివాద రాజకీయ విధానానికి పూర్తిమద్దతును, నూతన పొలిట్ బ్యూరో 1948 ఆంధ్రపత్రానికి అంతర్యుద్ధ భావనకు పూర్తిమద్ధతును, స్వీయ మానక దృక్పథంతోచూచి, వ్యవసాయ సంస్కరణలకై కార్మిక, కర్షక పోరాట ఐక్యత ర్మించాలని, సామ్రాజ్యవాద వ్యతిరేక విస్తృత ఐక్య సంఘటనను అన్నివర్గాలతో

కలసి నిర్మించాలని సూచించిన ప్రధాన వ్యూహ కర్తవ్యాన్ని విస్మరించారు. కార్మిక, కర్షక, ప్రజాసామాన్య ఐక్యతా నిర్మాణానికి, ప్రజా కమ్యూనిస్టుపార్టీ నిర్మాణానికి, సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటమే ప్రధాన ఆయుధం, మార్గం అని నూతన నాయకత్వం వాదించింది.

ముగ్గురు పార్టీ నాయకులు, నూతన కేంద్రసమితి నేటి రాజకీయ పరిస్థితుల అంచెనాను, ఎత్తుగడలను, రాజకీయ విధానాన్ని కొమిన్‌ఫారం పత్రిక సంపాదకీయానికి వారిచ్చిన వివరణను అంగీకరించజాలకున్నారు. ధనిక రైతులను, భూస్వాములు రూపంలో కౌలుకిస్తున్నారని కొందరు మధ్యతరగతి రైతులను శతృవర్గంలో జమ వేయుటను అంగీకరించజాలవన్నారు. బడా బూర్జువాలతో సంబంధాలున్న వూగిసలాడే జాతీయ బూర్జువా వర్గాలను శతృవులుగ తలచలేమన్నారు. ఎత్తుగడలలో సెక్టేరియనిజం దుస్సాహసిక విధానాలు కొనసాగుతున్నాయన్నారు.

నవంబరు 1950లో పార్టీ నూతన పొలిట్‌బ్యూరో చిత్తు రాజకీయతీర్మానాన్ని విడుదలచేసింది. ఆర్థిక, రాజకీయ పరిస్థితుల విశ్లేషణతోపాటు జనతా ప్రజాస్వామిక విప్లవంలో వివిధవర్గాల పాత్ర. వ్యూహం, ఎత్తుగడలు వివరించింది.

వలస వ్యవసాయ విప్లవంలో కార్మికవర్గం, కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంలో జాతుల విముక్తి పోరాటాలలో నాయకత్వ పాత్రకు తగినది. రైతాంగం పోరాట శక్తులలో అత్యంత సంఖ్యాబలం కలది. భూస్వాములు, అర్ధభూస్వాములు, సామ్రాజ్యవాద దోపిడీలకు గురి అగుతున్నందున వ్యవసాయ విప్లవంలో ముఖ్యపాత్ర వహించగలదు. గ్రామసీమలలో రైతులలో వర్గవిభజన కొనసాగుతునేవుంది. పేదరైతులు, వ్యవసాయ కూలీలుగ మారుతున్నారు. భూమి కేంద్రీకరణ నిరవధికంగా జరుగుతున్నది.

జనతా ప్రజాస్వామ్య విప్లవనినాదాలైన "భూస్వామ్య విధానపురద్దు" "దున్నేవానికే భూమి" అనే నినాదాలు గ్రామసీమలలో వ్యవసాయ కూలీలు, కౌలుదారులు, పేదరైతులు, మధ్యతరగతి రైతులు, ధనిక రైతులు అందరినీ ఐక్య కార్యాచరణలో. ఐక్య పోరాటాలలో సమీకరించగలుగుతాయి. నినాదాలలో ధనిక రైతు కోరికలు యిమిడివున్నందున సామ్రాజ్యవాద, గుత్త పెట్టుబడిదారి, భూస్వామ్య భూస్వాములు వ్యతిరేక పోరాటాలలో పాల్గొనుట, వూగిసలాడుట లేక తటస్థత వహించే అవకాశాలున్నవి. కాన శతృవర్గంలోనికి త్రోసివేయరాదు.

పెటీ బూర్జువాలపాత్ర జనతా ప్రజాస్వామ్య విప్లవంలో అత్యంత ప్రాముఖ్యత వహించుతుంది. చేతివృత్తులవారు, చిన్నఉద్యోగులు, మధ్యరకపు పారిశ్రామిక ఉత్పత్తిదారులు, విద్యార్థులు, ఉపాధ్యాయులు, మేధావివర్గాలు, స్వేచ్ఛావృత్తులవారు, నగర బడుగువర్గాలు, కార్మిక వర్గానికి ప్రజాస్వామ్య విప్లవంలో మిత్రులు, వీరు పాల్గొనుటపైనే విప్లవ విజయం ఆధారపడివుంది.

మధ్యతరగతి బూర్జువావర్గం సామ్రాజ్యవాదంతోగాని, ఫ్యూడలు వర్గాలతో గాని సంబంధంలేనిది, వారితో కూటమి కట్టనిది. చిన్న మధ్యతరగతి పరిశ్రమలను కలిగిన గుత్తేతర బూర్జువావర్గం, సామ్రాజ్యవాదం, గుత్తపెట్టుబడి వర్గాలచే పరోక్షంగా దోపిడికి గురౌతుంది. వ్యవసాయవిప్లవంతో ముడిసరుకులు మరింత స్వేచ్ఛగా లభించుటతో తన పారిశ్రామికాభివృద్ధికి అవకాశాలు పెరుగును. కాన ఈ వర్గం విప్లవపోరాటాలకు ప్రత్యక్షంగా కాని పరోక్షంగాకాని తోడ్పడుతుంది. పార్టీ కార్మిక వర్గంతో తగురీతి వ్యవహరించిన విప్లవ మిత్రులగుదురు.

కార్మికవర్గ పార్టీ నాయకత్వంలో కార్మికులు, వ్యవసాయ కూలీలు, కౌలుదారులు, పేదరైతులు, మధ్యతరగతి రైతులు, పెటీబూర్జువావర్గాలు, మేధావివర్గాలు, మధ్యతరగతి బూర్జువావర్గం, జనతాప్రజాస్వామ్య విప్లవంలో, సామ్రాజవాద, గుత్తపెట్టుబడిదారి, ఫ్యూడలు వ్యతిరేక జనతా ప్రజాస్వామ్య ఐక్య సంఘటనను ఏర్పాటు చేసుకొని విప్లవ పోరాటాలు సాగించిన విజయాన్ని పొందగలరు

ఇది సంక్షిప్తంగా నవంబరు 1950 నూతన పార్టీ నాయకత్వం చిత్తు రాజకీయ విధానంలో ప్రతిపాదించిన వ్యూహం, ఎత్తుగడల అవగాహన దీనిపై పార్టీ వొక అంగీకృత అవగాహనకు రాకపోగా తీవ్ర భేదాభిప్రాయాలతో సంక్షోభంలో పడింది. పార్టీ అంతర్జాతీయనాయకత్వంతో చర్చల అనంతరం చిత్తు కార్యక్రమాన్ని రాజకీయ విధానాన్ని, ఎత్తుగడలను రూపొందించగా అక్టోబరు 1951 కలకత్తా అఖిల భారత సమావేశంలో పార్టి ఆమోదించింది.

భారత బూర్జువావర్గ అవగాహనపై మరికొంత స్పష్టత చేకూరింది. భారత దేశం, వలస, ఫ్యూడలు, అర్థఫ్యూడలు ఆర్థికవిధానంలోవుంది. సామ్రాజ్యవాదంతో బడాబూర్జువా వర్గంలో కొందరు చేతులుకలిపారు. బూర్జువావర్గంలో అత్యధికులు పారిశ్రామికీ కరణకు అనుకూలురు. మన మార్కెట్టులో విదేశ పెట్టుబడులకు వ్యతిరేకులు. బడా బూర్జువావర్గంలోని కొన్ని శాఖలు సామ్రాజ్యవాద వ్యతిరేకపాత్రను యింకాకలిగివున్నవి జాతీయ బూర్జువా వర్గంలోని అత్యధికభాగం బూర్జువా వ్యతిరేక పాత్రను కలిగివుంది. అందువలన మొత్తంకాక, కొంతభాగమే అభివృద్ధినిరోధకమైనది. అదేవిధంగా భూస్వామ్యవర్గమంతా సామ్రాజ్యవాదంతో చేతులు కలుపుట పూర్తి సత్యంకాదు. మనది సామ్రాజ్యవాద, బడాబూర్జువా, ఫ్యూడలు వ్యతిరేక పోరాటమైనందున జాతీయ బూర్జువావర్గంతోసహా అన్ని వర్గాలు జరిపే ఐక్యసంఘటనా పోరాటమగుతుంది పూర్తిగయిది ప్రశ్నలకు స్టాలిన్ యిచ్చిన వివరణనను ప్రతిబింబించుతున్నది.

గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయ కూలీలు, పేద రైతులుపై ఆధారపడి, మధ్యతరగతి రైతు, ధనిక రైతుతోసహా అందరినీ ఫ్యూడలు భూస్వాములకు వ్యతిరేకంగా ఐక్యపరచి, ఫ్యూడలు భూస్వామ్య విధానాన్ని దద్దుచేసి, భూమిని పంచాలనే నినాదాలతో వ్యవసాయ విప్లవం కొనసాగించాలి రైతాంగ కోర్కెలపై పోరాటం భూస్వాముల ప్రతిఘటనను, ప్రజల సంసిద్ధతను బట్టి పోరాటం బలప్రయో

గంతో తమ కోర్కెలను సాధించబూనినపుడు సాయుధ రైతాంగ పోరాటంగా రూపొందుతుంది వీటిని కార్మికవర్గపు ప్రజా పోరాటాలతో ముఖ్యంగా సమ్మెలు, ప్రజాప్రదర్శనలతో సమ్మేళనం చేయవలసి వుంటుంది. ఇందుకు కార్మికులలో రాజకీయ చైతన్యం పెంపొందించి నేటి అనైక్యతను అధిగమించి, అత్యధికులను సమ్మె పోరాటాలలో సమీకరించి. ఫ్యాక్టరీ పోరాట కమిటీలను యేర్పాటు చేయాలి, అప్పుడే కార్మికవర్గ నాయకత్వానికి సరైన అర్థం ఆచరణలో వుంటుంది.

అయితే యీ 1947-51 నాటి వ్యూహం, ఎత్తుగడల సమస్యలపై 1960-70-80లలో వివిధ కమ్యూనిస్ట్ వర్గాలు భిన్నాభిప్రాయాలను వెలిబుచ్చుతునేవున్నవి.

నూతన 1951 కార్యక్రమమునకుచేసిన అవగాహనలసవరణలను పేర్కొంటూ నంబూద్రిపాద్ "చాలవరకు 1947-51 గందరగోళాన్ని సరిచేయప్రయత్నించింది". మొట్టమొదటగా సంస్కరణవాదం, మితవాద అవకాశ వాదాన్ని వొకవైపున, పిడివాదం, అతివాద సెక్టేరియనిజం మరోవైపున ప్రబలంగా వున్నప్పుడు వాటినుండి బయటపడి తత్కాలానికి తగిన కార్యక్రమాన్ని "యిచ్చింది". వేగంగా మారుతున్న దేశ, విదేశ పరిణామాలకు వెనుకబడిపోయింది". అని వాఖ్యానించారు అంతేగాక 1947 తీర్మానంలోని సంస్కరణవాద, వర్గ దృక్పధలేమిని సరిదిద్దుట వొకవైపు సిద్ధాంతపత్రాలలోని పిడివాదాన్ని సెక్టేరియనిజాన్ని మరోవైపు సరిజేసింది. అదే తరుణంలో కార్యక్రమం ప్రధానంగా పిడివాద దృక్పధాన్నుండి బయట పడజాలక పోయింది." అంతేగాక "సిద్ధాంతపత్రాలు, ఎత్తుగడలపంధా, అతివాద సెక్టేరియన్ వక్రీకరణ, సామ్రాజ్యవాద అనుకూల నైజాన్ని చూడగలిగి, ప్రభుత్వాన్ని పడగొట్టుటకు పిలుపుయిచ్చినా, యాంత్రికంగా రష్యా, చైనా విప్లవపాఠాలను వర్తింపజేశారు. దీనిని సరిజేయుట జరిగింది" అని అంటూ "కార్యక్రమం పెట్టుబడిదారివిధానంలోని సామాన్య సంక్షోభంలోని నూతనదశను, నూతనావకాశాలను చూడజాలకపోయిందని" వ్యాఖ్యానించారు.[1] నూతన కార్యక్రమము, రాజకీయ విధానం ప్రధానంగా 1947-51లలో అనుసరించిన పిడివాద, సెక్టేరియనిజాల వక్రీకరణ వ్యక్తిగత హింసావాద దుందుడుకు చర్యల విమర్శనను నంబూద్రిపాద్ అంగీకరించారని కార్యక్రమం పెట్టుబడిదారి విధాన సామాన్య సంక్షోభంలోని నూతనదశను, నూతనావకాశాలను గుర్తించలేకపోవుట మాత్రం తనకామోదయోగ్యంకాదని పరోక్షంగా మనం క్రోడీకరించుకొనవచ్చును.[2]

ఏప్రిల్ 1951 ముసాయిదా కార్యక్రమంపై వ్యాఖ్యానించుతూ సుందరయ్య "నూతనంగా అవతరించిన రాజ్యాం ప్రధానంగా పాత సామ్రాజ్యవాద రాజ్యమే. బ్రిటిష్ సామ్రాజ్యవాదుల సమ్మతిమీదనే కాంగ్రెసు ప్రభుత్వం" బ్రిటిషు పెట్టుబడుల సంరక్షణకు యేర్పరచబడింది". జనతా ప్రజాతంత్ర సంఘటనలో ధనిక రైతుతో

1. నంబూద్రిపాద్, ఇ.యం.యస్ (1963) రివిజనిజం అండ్ డాగ్మాటిజం ఇన్ ది కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ ఇండియా పే. 25-29.

2. అదే అదే పే. 25-29.

మొత్తం బూర్జువావర్గం వుండదని పార్టీ ద్వితీయ మహాసభయిచ్చిన అవగాహనను ఈ కార్యక్రమము తిరస్కరించింది జాతీయ బూర్జువావర్గమంతటినీ. వ్యక్తులు. కొన్ని గ్రూపులు మినహాయించి, జనతా ప్రజాస్వామ్య సంఘటనలోనికి తీసుకొని రాగలిగే అవకాశముందనే అవగాహన యిచ్చింది. రెండుదశలూ మిశితమైపోతా యన్న పొరపాటు సిద్ధాంతాన్ని యీ కార్యక్రమము సరిదిద్దింది. అది చెప్పిన వర్గాల కలయిక సామ్రాజ్యవాదానికి, దాని ఫ్యూడలు మిత్రులకు వ్యతిరేకంగా మొత్తం ఐక్య సంఘటనదశకుసరిపోతుంది"[1]. అని సుందరయ్య తన అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

ఆంధ్ర సిద్ధాంతాన్ని గురించి ప్రస్తావించుతూ "మొదటి (మెజారిటి) అభి ప్రాయం కలవారు, అప్పటి వర్గ స్వభావాన్ని గురించి ఒక స్పష్టమైన అభిప్రాయం చెప్పారు. కేంద్రంలోని కాంగ్రెసు ప్రభుత్వం దళారీ బూర్జువా వర్గానికి భూస్వామ్య వర్గానికి ప్రాతినిధ్యం వహిస్తుందని, దీనిని కార్మికవర్గం కూలద్రోయవలసి వుంటుం దని, అందుకు ఐక్యసంఘటనను యేర్పరచాలని వారు చెప్పారు. ఈ సంఘటనలో కార్మికులు కర్షకులు, జాతీయ బూర్జువావర్గం వుంటాయని, కార్మికవర్గ నాయకత్వం వుంటుందని చెప్పారు. గ్రామస్థాయికివెళ్ళినపుడు, ఫ్యూడలిజానికి వ్యతిరేకంగా జరిగే పోరాటంలో వ్యవసాయకూలీలు, పేదరైతులు మధ్యతరగతి రైతులు, ధనికరైతులు కూడ వుంటారు. ఈ ధనిక రైతులు రెండు భాగాలుగవుంటారు. ఫ్యూడలు లక్షణాలు లేక ఫ్యూడలుతో కలుపగలవారు ఒక భాగం. వీరు వడ్డీవ్యాపారంచేసి పెద్దయెత్తున భూములు కలిగివుండి, ఫ్యూడలు భూస్వాములలో కలసిపోతారు. తక్కినవారు ధనిక రైతులుగ యీ ఐక్య సంఘటనలో కలసివస్తారు.

"ఈ పోరాటం రష్యామార్గాన కాకుండా చైనామార్గంలో నడుస్తుందని చెప్పారు. "చైనామార్గంలో" గ్రామసీమలలో విముక్తి స్థావరాలను యేర్పాటుచేసి గ్రామాలను విముక్తిచేసి, తరువాత నగరాలను, తరువాత కేంద్రప్రభుత్వాన్ని సుదీర్ఘ కాల సాయుధ పోరాటాలలో, అంతర్యుద్ధం, జాతీయ విముక్తి పోరాటాలలో అధి కారం హస్తగతం చేసుకొనుట ఇక్కడ అర్థవలస పరిస్థితులుండుటవలన చైనాలో లాగానే గెరిల్లా పోరాటాన్ని నిర్మాణంచేసి విముక్తిసైన్యాన్ని ఏర్పాటుచేసి, గ్రామా లను విముక్తిచేసి, అధికారాన్ని హస్తగతం చేసుకొనవలసివుంటుంది. ఇది చైనా మార్గం. ఇది భారతదేశానికి గూడ వర్తిస్తుంది"[2] అని వెంకటేశ్వరరావు వివరిం చారు.

ఆంధ్ర మైనారిటి సభ్యుని రాజకీయ అవగాహన మెజారిటి సభ్యుల అవగాహ నకు పూర్తి భిన్నంగా వుంది. "ఇది బూర్జువా భూస్వాముల ప్రభుత్వం కూలద్రోయ వలసిన అవసరముంది. విప్లవదశ ప్రధానంగా రెండు విప్లవాలు అంటే, ప్రజాతంత్ర

1. సుందరయ్య, పుచ్చలపల్లి (1973) వీరతెలంగాణా విప్లవపోరాటం, గుణపాఠాలు పే. 482.
2. వెంకటేశ్వరరావు, దేవులపల్లి ( 988) తెలంగాణా ప్రజాసాయుధ పోరాట చరిత్ర 1946-51. మొ. భా. పే. 526-7.

విప్లవం, సోషలిస్టు విప్లవం, రెండూ కలగా పులగంగా వచ్చిన దశ, రష్యాలో ఆనాటి పరిస్థితిలాగానే వుంది. భారతదేశంలో చైనా మార్గంలోనే, వ్యవసాయ విప్లవ మార్గంలో పయనిస్తుందని అంగీకరించింది. అంతేగాక, మెజారిటి అవగాహనను సంస్కరణవాదమని, దాదాపు జోషిపంథాకు పోతుందని, మితవాదమని నిర్ధారణచేసి, దానిని ఖండించాలని చెప్పింది[1]" దీనిని గ్రామసీమలలో వ్యవసాయ విప్లవం, చైనా మార్గసవరణతో 1948 రణదివె మార్గమనుట సత్యదూరం కాదేమో.

చిత్తు కార్యక్రమం, రాజకీయ విధానం, 1950లో పేర్కొన్న విధంగా చైనా రైతాంగ గెరిల్లా పోరాటాల నాటికి 30 వేల రెగ్యులర్ సైన్యం వుంది. సామ్రాజ్య వాదం రాజకీయాధికారంలో పాత్ర వహించిందనుట, దీనికై రైతు విప్లవ పోరాటాలకు మిత్రుడు కాదనుట పొరపాటు అని వెంకటేశ్వరరావు తన అభిప్రాయాన్ని స్పష్టంచేస్తూ, ధనికరైతును ప్యూడలు తోకలు కలవారుగ, తోకలు లేనివారుగ విభజించుట, పొరపాటని వివరించారు [2] అంతేగాక అఖిల భారత కమ్యూనిస్ట్ పార్టీ కేంద్రం, క్రింది శాఖలు లేవనెత్తిన ప్రధాన సిద్ధాంత సమస్యలను పరిశీలన, అధ్యయనం చేసి. మార్గదర్శికమగుటకు మాటిగ కాలాన్ని వృధా చేసిందని, కేంద్ర వారపత్రికకు ప్రత్యేకంగా తెలంగాణా పోరాట సమాచారాన్ని అందించుటకై వొకరిని పంపుట మినహా, సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటాన్ని నడుపుటకు యెట్టి సహకారాన్ని అందించలేదని తీవ్రవిమర్శనా నేరారోపణ, సోదాహరణంగా పేర్కొనుట జరిగింది[3], ఆశ్చర్యాన్ని గొల్పే కేంద్ర నాయకత్వచర్య బాధ్యతా రాహిత్యాన్ని, పార్టీ కాంగ్రెసు నిర్ణయాలను అమలుచేయ నిరాకరించుట, కర్తవ్యాన్ని, విధి నిర్వహణను త్రోసిబుచ్చుట, అంచేతనే కేంద్రపు ప్రవర్తన క్షమార్హం కాదు

అధికారి 1964లో "తదనంతర పరిణామాల అవగాహనలవలన మన కేర్పడిన దృక్పథం, జూన్ 1947 తీర్మానపు విశ్లేషణకు దగ్గరగావుంది. సామ్రాజ్యవాదానికి సంబంధించినంతవరకు రెండూ అంటే, తిరోగమనం, నూతనమార్గంలో తన పరిపాలనను పునఃప్రతిష్ఠించుటకై మోసపూరిత యెదురుదాడి అగుతుంది. రెండవ కాంగ్రెసు రాజకీయ విధానం చెప్పినట్లు ఒక్క మోసపు ఎదురుదాడి (తిరోగమనం) మాత్రమేగాదు, జాతీయ బూర్జువా వర్గానికి రాజీ విధానం, పురోగమనం రెండూ అయింది సామ్రాజ్యవాద రాజ్యానికి బదులు ప్రజానాయకుల ఆధ్వర్యంలోని రాజ్యం కాన, పురోగమనం. సామ్రాజ్యవాదుల యిష్టాఅయిష్టాలపై యేర్పడిన తోలుబొమ్మ ప్రభుత్వంకాదు. యుద్ధానంతర ప్రపంచ, దేశపరిస్థితుల వొత్తిడి వారా విధంగాచేయునట్లు చేసిందని" అధికారి పేర్కొన్నారు.

---

1. వెంకటేశ్వరరావు, దేవులపల్లి (1988) తెలంగాణా ప్రజల సాయుధపోరాట చరిత్ర 1946-57. మొ. భా. పే. 528,
2. అదే పే. 536-7.
3. అదే పే. 537.

ఇంకా, "మనం ఐక్యత-పోరాటం" ఎత్తుగడలు అవలంభించవలసి వచ్చింది. సంస్థానాధీశులకు, సామ్రాజ్యవాదుల కుట్రలకు వ్యతిరేకంగా పోరాడినపుడు మద్దతు నిస్తూ, ఐక్యమవ్వాలి. ప్రజాపోరాటాలను అణచునపుడు ప్రజలను బాధలకు గురి చేయునపుడు ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడాలి. జాతీయ నాయకత్వం గురించి యేమీ చెప్పకుండా, బడా బూర్జువావర్గం రాజీపడిందని తీర్మానం పేర్కొనుట పొరపాటు. వాస్తవానికి జాతీయ బూర్జువావర్గానికి మొత్తంగా ప్రాతినిధ్యం వహించే జాతీయ నాయకత్వం మొత్తం రాజీపడింది. అదేకాలంలో జాతీయ బూర్జువావర్గము మొత్తం, రాజ్యాధికారాన్ని, స్వాతంత్ర్యాన్ని సుస్థిరం చేయుటకు ప్రయత్నిస్తుంది.

"ఈ విధంగా జాతీయ బూర్జువావర్గం, జాతీయ నాయకత్వం నూతన పరిస్థితులలో నూతన ద్వంద్వవైఖరి చేబట్టింది. కార్మికవర్గం, పార్టీ నూతన రాజకీయ విధానాన్ని, "ఐక్యతా పోరాటం పంథాని"కై, జాతీయ బూర్జువావర్గం యెడల, రాజకీయ స్వాతంత్ర్యాన్ని సుస్థిరం చేయుటకు ఆర్థిక స్వాతంత్ర్యానికై సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడలు వ్యతిరేక పోరాట సంపూర్ణ విజయానికై సాగించవలసిందని[1]" అధికారి వివరించారు.

## ఐక్య సంఘటన, సమగ్ర అవగాహన :

రెండవ పార్టీ కాంగ్రెసు, సామ్రాజ్యవాద, ఫ్యూడలు, బూర్జువా వ్యతిరేక ప్రజాస్వామ్య, సోషలిస్టు విప్లవాలు రెండు కలకలుపుగా సంలీనమైన విప్లవ పోరాటముగా నిర్వచించి, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో బూర్జువావర్గం పోరాదేదశ అంతమైందని, జనతా ప్రజాస్వామ్య విప్లవం, ప్రజాస్వామ్య కర్తవ్యాలను పూర్తి చేసి, అదే కాలంలో సోషలిస్టు విప్లవ కర్తవ్యాలను చేబట్టుతుందని వివరించింది.

కాంగ్రెసు-ముస్లిం లీగుల విధానాలతో నిరాశ, నిస్పృహ, అసంతృప్తిలోనైన ప్రజాసామాన్యం, సంస్థానాలలో పోరాటాలలో జాగృతి చెందిన ప్రజలు, వామపక్ష ఐక్యత భూమికగా, జనతా ప్రజాస్వామ్య సంఘటనను యేర్పరచాలని మౌలిక వ్యూహకార్యక్రమాన్ని యిచ్చింది కమ్యూనిస్టు పార్టీ వామపక్షాలతో పోరాట ఐక్యతకై సంప్రదింపులకు, ఒప్పందాలకు తన సంసిద్ధతను తెలియజేస్తూ బహిరంగంగా వామపక్ష పార్టీలకు ఐక్యతా విజ్ఞప్తి చేసింది ఆ విధంగా, పార్టీ, దాని నాయకత్వం లోని కార్మిక, కర్షక, విద్యార్థి యువజనోద్యమాలు, వామపక్ష పార్టీలు, వారి నాయకత్వంలోని ప్రజాసంఘాలతో కలిసి జనతా ప్రజాస్వామ్య సంఘటనను యేర్పరుచుటకై, చొరవతో ముందుకొచ్చినవి.

అతివాదులలో అనేకులు కాంగ్రెసు విధానాలతో అసంతృప్తి చెంది, సోషలిస్టు పార్టీవైపు ఆకర్షితులయ్యారు. కార్మిక, కర్షక, విద్యార్థి, యువజన సంఘంలో పని జేసే నిజాయితీపరులైన అనేకమంది కార్యకర్తలున్నారు. అత్యధికులు మధ్యతరగతి

1. అధికారి, జి. (1964) భారత పునర్జీవనానికి, సోషలిజానికి భారత కమ్యూనిస్ట్ పార్టీ పంథా. (ఆంగ్లంలో) సి పి ఐ పే. 92-94.

బూర్జువావర్గంనుండి వచ్చినవారు. సామాన్య సోషలిస్టులు పెట్టుబడిదారి వర్గం, వారి నాయకత్వంపై అసంతృప్తి, విద్వేషంతో వున్నారు. వామపక్ష జాతీయవాదులను, సోషలిస్టు అభిమానులను ప్రజాస్వామ్య విప్లవం, ప్రజాస్వామ్య ప్రభుత్వ నినాదాలపై ఆకర్షితులైన వారిని సమీకరించి పురోగమించుటలోనే వామపక్ష సంఘటనా విజయం యిమిడివుంది. నాయకత్వంపై సిద్ధాంత పోరాటాన్ని నిర్దాక్షిణ్యంగా కొనసాగించి, మార్క్సిజం ప్రాతిపదికపై సోషలిస్టు వర్గాలను సమీకరించాలి.

జనతా ప్రజాస్వామ్య సంఘటన రూపొందు క్రమంలో కార్మికవర్గ ఐక్యత అత్యంత ప్రాముఖ్యత వహించుతుంది. నేడు కార్మికవర్గం ట్రేడు యూనియన్ కాంగ్రెసు, జాతీయ ట్రేడు యూనియన్ కాంగ్రెసు, హిందూస్తాన్ మజ్దూర్ సభలుగా చీలిపోయి కమ్యూనిస్టులు, కాంగ్రెసు, సోషలిస్టు నాయకత్వాల క్రిందవున్నవి. ఈ మూడు ట్రేడు యూనియనుల ఐక్య కార్యాచరణలేనిచో ఐక్యసంఘటన వూహించ జాలము. బూర్జువావర్గం ఆర్థిక సంక్షోభాన్ని పనిగంటలు పెంచి, వేతనాల కోతలు, పని వుధృతిని పెంచి, రిట్రెంచిమెంటులతో నిరుద్యోగాన్ని పెంచి, ఆ భారాన్ని కార్మికవర్గంపై మోపజూస్తున్నది ఈ సమస్యలతోపాటు, తక్షణ సమస్యలపై ఐక్య పోరాట కమిటీలను యేర్పాటుచేసి, పోరాటాలకు సంసిద్ధులు కావలసివుంది. వాస్తవ పరిస్థితులు అట్టి ఐక్య కార్యాచరణకు అనుకూలంగానేవున్నా, బూర్జువావర్గం కార్మికులలోని అనైక్యతను, వివిధ సంఘాలలో సమీకరించబడి ఉండుటను అవకాశంగా తీసుకొని సమ్మె పోరాటాలను తేలికగా విచ్ఛిన్నం చేయగలుగుతున్నది. దీనిని అధిగమించి కార్మికవర్గం పురోగమించాలంటే. తక్షణ సమస్యలపై పోరాట కమిటీలను యేర్పాటు చేసుకొని ఐక్యపోరాటం జరుపవలసివుంది.అదే ఐక్య సంఘటనా మార్గం.

ఈ సంఘటన కార్మికవర్గం, వ్యవసాయకూలీలు, కౌలుదారులు, పేద రైతులు, నగరాలలో నలిగిపోయే మధ్యతరగతి మేధావివర్గాలు, తదితర బడుగువర్గాలతో యేర్పడి, మధ్యతరగతి రైతును కలుపుకొని, ధనికరైతును వేరుచేస్తూ, బూర్జువా వర్గాన్ని వేరుచేసి దాని ప్రతి ఘటనాశక్తిని వమ్ముచేసి, అది నాయకత్వం వహించే ప్రభుత్వాన్ని కూలద్రోసి, జనతా ప్రజాస్వామ్య విప్లవాన్ని జయప్రద మొనర్చుట తన ధ్యేయంగా యెంచుతున్నది.

ఐక్య సంఘటనా నిర్మాణ కార్యక్రమ పోరాటాలలో, సిద్ధాంత పోరాటం, కార్మికవర్గ అగ్రగామిదళ, కమ్యూనిస్టు పార్టీ నాయకత్వ నిర్మాణ పోరాటం యిమిడి వుండుటను మరువజాలము. ఈ సంఘటనను వామపక్ష పార్టీల, ప్రజాసంస్థల, సంఘాల నాయకత్వాలు పైనుండి వొప్పందాల ద్వారా యేర్పాటుచేసే సంఘటనగానే నెంచరాదు. వివిధ వర్గాల ప్రజలు తమతమ వర్గ సంఘాలలో ఐక్యకార్యాచరణ, పోరాటాలు, సామాన్య ప్రజానీకపు ఆర్థిక, రాజకీయ తక్షణనినాదాలపై ఐక్య పోరాటాల సంఘటనగా రూపొందాలి.

సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక ప్రజాసామాన్యం లక్షోపలక్షలు కాంగ్రెసు, ముస్లింలీగుల ప్రభావంలో ఉన్నారు. ప్రజాస్వామ్య విప్లవం, జనతా ప్రజా

స్వామ్య విప్లవం, జనతా ప్రజాస్వామ్య సంఘటనా పోరాటాలలో అశేష ప్రజా సామాన్యం పాల్గొన్ననాడే విజయం పొందుతుంది ప్రచారం, సంయుక్త ఉద్యమాలు, పోరాటాలద్వారా కమ్యూనిస్టు పార్టీ తన శ్రద్ధాశక్తులన్నిటిని వినియోగించి వారిని సమీకరించగలగాలి.

రెండవ పార్టీ కాంగ్రెసు తాను చిత్రించిన జనతా ప్రజాస్వామ్య సంఘటన ప్రధానాంశాలను యిలా పేర్కొంది. బ్రిటిషు కామన్‌వెల్తుతో ఎట్టి సంబంధంలేని రాజ్యాంగం, జాతీయ ప్రభుత్వం, వాస్తవ సంపూర్ణ స్వాతంత్య్రం, సామ్రాజ్యవాద వ్యతిరేకత, అన్ని దేశాల శాంతి, స్వాతంత్ర్యం కాంక్షించే ప్రజాస్వామ్య ప్రభుత్వం, ప్రజాస్వామ్య ప్రాథమిక పౌరహక్కులు, ఆర్థిక, సామాజిక హక్కులు, వయోజన వోటింగు దామాషా ప్రాతినిధ్యం గ్యారంటీచేయు రాజ్యాంగం, జాతులకు విడిపోయే హక్కుతోసహా స్వయం నిర్ణయాధికారం, స్వపరిపాలిత భాషా ప్రయుక్త రాష్ట్రాలు, ఐచ్ఛికంగా కలసిన ఇండియన్ యూనియన్, మైనారిటీలకు భాషా, సంస్కృతి సమానతల రక్షణ, కుల, జాతి వివక్షణ, అసమానతలు చట్టరీత్యా రద్దుచేసి, ఉల్లంఘన చట్టరీత్యా నేరం చేయాలి.

ఇండియా, పాకిస్తాన్‌లు ప్రజా సామాన్యాభివృద్ధికి, సామ్రాజ్యవాద జోక్యాలకు వ్యతిరేకంగా సైనిక, రాజకీయ సహకారం సంస్థానాలలో రాచరికము, భూస్వామ్య విధానాల రద్దు, ప్రజాస్వామ్య పరిపాలనా సంస్కరణలు, తరువాత స్వేచ్ఛగా వాను ఎటు చేరదలచుకొనేది నిర్ణయించుకొనగలరు.

పరిశ్రమలు, బ్యాంకులు, రవాణా, తోటలు, గనులలోని విదేశీ పెట్టుబడులను స్వాధీనం చేసుకొని, జాతీయం చేయుట భారీ పరిశ్రమలు, బీమా కంపెనీలు, బ్యాంకులను జాతీయంచేసి కార్మికుల పర్యవేక్షణను, కనీస వేతనాన్ని, 8 గంటల పనిని గ్యారంటీ జేయుట, దేశసరుకుల అభివృద్ధికి ప్రణాళిక, ఆర్థిక, వ్యూహాత్మక స్థానాల నుండి గుత్త వ్యాపారసంస్థలను తొలగించుట వ్యక్తుల యాజమాన్యపు పరిశ్రమలలో లాభాల నియంత్రణ, నిఘా, సమర్థ పర్యవేక్షణ యేర్పాటు చేయాలి. భూస్వామ్య విధానాన్ని నష్టపరిహారం లేకుండా రద్దుచేసి, దున్నేరైతుకే భూమిని పంచుట, జమీందారీ, జాగిర్దారీ విధానాన్ని రద్దుచేయుట కౌలుదారులకే స్వాధీనపు భూమి పట్టాలు నిచ్చుట, గ్రామీణ అప్పులు రద్దు, వ్యవసాయకూలీలకు కనీసవేతన నిర్ణయం చేయాలి.

పరిపాలనా శాఖలలో నియంతృత్వ వుద్యోగులను తొలగించి ఎన్నుకొనబడిన పరిపాలనా యంత్రాంగం, ప్రజాకమిటీల సలహాలపై ప్రజాస్వామికపాలన అమలు చేయాలి. నిర్బంధ వుచితవిద్య, స్త్రీలకు సమాన హక్కులు, నిర్బంధ చట్టాలరద్దు, ప్రజలను సాయుధులను చేసి. ప్రజాసైన్య నిర్మాణం చేయాలి.

ప్రాథమిక చర్యగా జనతా ప్రజాస్వామ్య ఐక్యసంఘటనా కార్యక్రమాన్ని పూర్తిగ అంగీకరించేవారితో సంయుక్త సంఘటనను యేర్పరస్తుంది. వెంటనే వివిధ వర్గాల ప్రత్యేక సమస్యలపై ఐక్యకార్యాచరణ ప్రారంభమగుతుంది. సంయుక్త

కార్యాచరణాభివృద్ధితో, వామపక్ష సహకారాభివృద్ధి, అన్ని ప్రజావుద్యమాలు వామ పక్షాల అనుభవాలతో జనతా ప్రజాస్వామ్య ఐక్యసంఘటన పోరాట క్రమంలో రూపొందుతుంది.

రెండవ పార్టీ కాంగ్రెసు సిద్ధాంతం తదనంతర పొలిట్‌బ్యూరో పత్రాలు, జనతా ప్రజాస్వామ్య ఐక్యసంఘటన నిర్మాణం, కార్యక్రమాలపై యిచ్చిన అవగాహనా సంగ్రహమిది. రెండు ప్రధాన విషయాలను ఒకటి: సామ్రాజ్యవాద, ఫ్యూడలు బూర్జువా కూటమిలో నాయకత్వపాత్ర, బూర్జువాలదిగా తలచింది. వాస్తవంలో సామ్రాజ్యవాదం, దాని వుపగ్రహాలైన, ఫ్యూడలు శక్తులు నాయకత్వం వహించగా బూర్జువా ప్రభుత్వం వారి ఆజ్ఞాపాలన చేస్తుంది. రెండు : భారత బూర్జువావర్గాన్ని గుత్త, గుత్తేతర బూర్జువా వర్గాలుగ విడి, విడిగా చూడలేక అధికారంలో వున్నది, బడా బూర్జువావర్గమని, అది సామ్రాజ్యవాదంతో రాజీపడిందని గుర్తించుటలో విఫలమైంది. ఫలితంగా జనతా ప్రజాస్వామ్య ఐక్య సంఘటనలో గుత్తేతర జాతీయ బూర్జువావర్గం కలసివచ్చే అవకాశాన్ని గుర్తించలేకపోయింది.

జూన్ 1950లో యేర్పడిన నూతన కేంద్రసమితి, ఆంధ్ర కమ్యూనిస్ట్ నాయకత్వం ప్రతిపాదించిన "చైనామార్గ" అవగాహనను ఆమోదించి జూన్ 1950 పార్టీ లేఖతో నూతన విధానాన్ని వివరించింది.

జాతీయ విముక్తి పోరాటం చైనామార్గంలో పురోగమించుటకు జనతా ప్రజాస్వామ్య ఐక్యసంఘటన ప్రధానపాత్ర వహించుతుంది. ఈ ఐక్య సంఘటన ద్విముఖమైనదిగా వివరించబడింది. ఒక వైపు జాతీయ బూర్జువావర్గం, పట్టణ పెటీబూర్జువా వర్గాలు, మేధావివర్గాలు, కార్మికులు, పట్టణ బడుగువర్గాల కలయికతో నగరాలలో ఐక్య సంఘటన, మరోవైపు గ్రామసీమలలో వ్యవసాయ కార్మికులు, కౌలుదారులు, పేదరైతులు, మధ్యతరగతి రైతులు, ఫ్యూడలు తోకలులేని ధనికరైతులు, చేతి వృత్తులవారితో కలసి ఏర్పడి, కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో వ్యవసాయ విప్లవం ప్రధాననినాదంగా, రైతాంగ సాయుధగెరిల్లా పోరాట రూపంలో కొనసాగుతుంది ఇది ప్రధానంగా అన్నివర్గాల ఐక్యసంఘటన. ప్రధానంగా సామ్రాజ్యవాద, ఫ్యూడలు బడాబూర్జువా వ్యతిరేక పోరాటం. కార్మికవర్గ నాయకత్వంలో కార్మిక, శ్రామిక రైతుల కూటమి ఐక్యసంఘటనకు భూమిక అగుతుంది. మధ్యతరగతి రైతు నిలకడైన మిత్రుడు ఫ్యూడలు తోకలులేని ధనికరైతు ఐక్యసంఘటనలో చేరుటకు లేక తటస్థంగా వుండుటకు అవకాశాలున్నవి.

గుత్తేతర, మధ్యతరగతి బూర్జువావర్గాలు, ఫ్యూడలు వర్గాలతో సంబంధం లేనివి. లేక నామమాత్ర సంబంధం కలవి, పరస్పరం గొంతులు నులిమివేసుకొనే సామ్రాజ్యవాద-బడా బూర్జువావర్గాల పోటీలోనలిగిపోతువుంటుంది. కాన, సామ్రాజ్యవాద వ్యతిరేకపాత్రను కొంత కలిగివుంటుంది అంతేగాక వివిధ జాతులలో వారి అభివృద్ధితోపాటు తలెత్తుతున్న మధ్యతరగతి బూర్జువావర్గంతోపాటు. తలెత్తుతున్న మధ్యతరగతి బూర్జువావర్గం, గుత్త గుజరాతీ మార్వాడీ ప్రధాన బడా బూర్జువావర్గా

లచే అణచివేయబడుతున్న కారణంగా సామ్రాజ్యవాద గుత్తబడాబూర్జువా, భూస్వాములు వ్యతిరేక ఐక్య సంఘటనలో ఆర్థిక సంక్షోభం తీవ్రమైనకొలది చేరి పోరాడే అవకాశముంది కాన వారికి ఐక్యసంఘటన ద్వారాలు మూసివేయరాదు.

జాతీయ విముక్తి వుద్యమానికి, వ్యవసాయ విప్లవం ఇరుసులాంటిది. దున్నే వానికే భూమి నినాదం విస్తృత రైతాంగాన్ని పోరాటానికి సమీకరించే నినాదం. పైనుండి వివిధపార్టీల సంస్థల, వర్గాల నాయకత్వాలమధ్య జరిగే వొప్పందాలతో పాటు, క్రిందినుండి సమిష్టి వూరేగింపులు, ప్రదర్శనలు, స్థానిక సమస్యలపై పోరాటాలు, ఐక్యకార్యాచరణ, క్రమంగా శాంతి, స్వాతంత్ర్యం, తిండి, భూమికై ఉన్నత పోరాట రూపాలను చేబట్టి, తాత్కాలిక, కూటమి దశలను దాటి మరింత శాశ్వత ప్రాతిపధికపై ఐక్య సంఘటన రూపొందుతుంది.

గ్రామీణ ప్రాంతాలలో భూస్వాములు, అర్ధ భూస్వాములు సంబంధాలే ఆధిక్యత వహించుచున్నవి. సామ్రాజ్యవాదులు తమ దోపిడిని కొనసాగించుటకు ఆ సంబంధాలను కొనసాగించారు. భూస్వామ్యలిజం వొడినుండే వ్యవసాయంలో పెట్టుబటిదారివిధానం పుట్టి గణనీయంగా పెరిగిందనే విషయం మరువరాదు. గతంలో ఈ విషయం పరిగణలోనికి తీసుకొననందున వ్యవసాయ కూలి వుద్యమం అంతగా పురోగమించలేదు. వేతన బానిసత్వం, భూస్వాములు బానిసత్వాలచే కూలివర్గం అధికంగా పీడింపబడుతున్నది నిజానికి దారిద్ర్యానికి గురైన పేద రైతులే రేపటి వ్యవసాయ కూలీలు. గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయకూలీలు, పేదరైతులు ఐక్యసంఘటనలో ప్రధాన పునాది వర్గాలు. వ్యవసాయ విప్లవంలో ఐక్యసంఘటన సాగించే పోరాటంలో మధ్య తరగతి పూర్తి సహకారాన్నిస్తూ పాల్గొంటుంది భూస్వాములు సంబంధాలులేని ధనిక రైతు సహకారాన్ని ఐక్య సంఘటన పొందగల అవకాశాలున్నవి. వీరితోపాటు గ్రామీణ ప్రాంతాల చేతివృత్తులవారు, బడుగువర్గాలవారు ఐక్య కార్యాచరణ పోరాటాలలో పాల్గొంటారు.

సెప్టెంబరు 1950లో అజయ్‌ఘోష్, ఘాటే, డాంగేలు, మాజీ నాయకత్వాన్ని సరిగానే నూతన కేంద్రసమితి విమర్శించినా, సరియైన నిర్ధారణలు విఫలమై పాత పొరపాటులనే తిరిగి చేసిందని విమర్శించారు ప్రధానాంశాలపై వివరమైన విమర్శనతోపాటు, మాజీనాయకత్వపు ఐక్యసంఘటనా అవగాహనలపై నిర్దిష్ట అభిప్రాయాలను వెలిబుచ్చారు.

ఐక్య సంఘటనా నిర్మాణానికి కార్మికవర్గ ఐక్యత, వామపక్ష ఐక్యత రెండు ప్రధానపార్శ్వాలు. నవంబరు 1949లో కామిన్‌ఫారం తీర్మానం "కార్మికవర్గ ఐక్యత ప్రతిదేశంలోను, ప్రపంచ మొత్తంగాను నిర్ణయాత్మకపాత్ర వహించుతుందని స్పష్టం చేసింది. కార్మికోద్యమంలో యేర్పడిన చీలికను అధిగమించుటకు ఐక్యతను పునరుద్ధరించుటకు పార్టీ ఎట్టి ప్రయత్నంచేయలేదు "ఎఐటియుసి"కి "యుటియుసి" చేసిన ప్రతిపాదనల భూమికగా ఐక్యతను నిర్మించాలి. హైదరాబాద్ సమావేశంలో సోషలిస్టు కార్యకర్తలు వెలిబుచ్చిన బలమైన ఐక్యతా కోర్కె, కార్మికవర్గ ఐక్యతను

పార్టీ నిర్మించుప్రయత్నాలను ప్రోత్సాహకరమవ్వాలి. సోషలిస్టు నాయకత్వం అమెరి
కన్ యుద్ధోన్మాదవాదులుతో చేతులు కలుపుతున్నా, వారి యూనియనులను "ఐయన్
టియుసి" యూనియనులవలె చూడరాదు. కొన్ని సోషలిస్ట్ యూనియనులకు వాస్త
వంగా ప్రజాసభ్యత్వముంది. నిజాయితీగల కార్యవర్గ కార్యకర్తలున్నారు. దీనిని
కార్మికవర్గ ఐక్యతకై సరియైన దృక్పథం, ఆచరణలతో ఐక్య కార్యాచరణ సహ
కారాన్ని పెంపొందించాలి. క్రమేణా రెండు జాతీయ కార్మికోద్యమాలమధ్య ఐక్య
తను సాధించవలసివుంది. కార్మికవర్గ ఐక్యతకు, సంఘటనకు పునాది కాగలదు.
ఎంత త్వరగా యీ ఐక్యతను నిర్మించగలిగితే అంతత్వరగా కార్మికవర్గ చైతన్యం
పెరిగి, రైతుల యితరవర్గాల కోర్కెలను బలపరచితే జాతీయ ఐక్య సంఘటన
బలవత్తరమైనదగుతుంది. ఈ విధమైన కార్మిక. కర్షక ఐక్యత విద్యార్థి,వుపాధ్యాయ
మధ్యతరగతి వుద్యమాలలో జాగృతిని కలిగించి ఐక్య పోరాటాలలో కలసివచ్చు
నట్లుచేసి, ఐక్య సంఘటనను బలవత్తర మొనర్చగలదు.

వామపక్షాలైన కమ్యూనిస్టు పార్టీ, సంయుక్త సోషలిస్టు పార్టీ, ఫార్వర్డ్
బ్లాక్, వర్కర్స్ అండ్ పీజంట్సు పార్టీల ఐక్యత, కార్మికవర్గ విద్యార్థి, యువజన,
మధ్యతరగతి, రైతాంగ అనైక్యతా అఘాతాన్ని పూడ్చి, ఐక్య కార్యాచరణ కార్యో
న్ముఖులను చేయగలదు. ఐక్యతా సుముఖులైన సోషలిస్టులను, కాంగ్రెసులోని అతి
వాద వర్గాలను చొరవతో పిలుపునిచ్చి సమావేశపరచుటకు ప్రయత్నించాలి సోష
లిస్టు పార్టీకి నేరుగా ఐక్యతా నిర్మాణానికి పిలుపునివ్వాలి. అట్టి ఐక్యతామార్గం ఐక్య
ట్రేడు యూనియన్, కిసాన్‌సభ, విద్యార్థి వుద్యమాలకు దారితీసి, ఐక్య మహోద్య
మానికి దారితీయగలదు ఈ ఐక్యత పైనుండి నాయకత్వాల వొప్పందాల ఐక్యత
గానేకాక ఐక్య కార్యాచరణాలద్వారా క్రిందినుండి యేర్పడాలి. అప్పుడప్పుడే తలెత్తే
ఐక్యంగా విచ్ఛిన్నకరశక్తులను వోర్పుతో నిర్దాక్షిణ్యంగా, ఐక్యతాభివృద్ధి ప్రధాన
ధ్యేయంగా, సౌభాతృత్వ విమర్శన చేయుటవలన వుద్యమం బలపడుతుందేగాని బల
హీనపడదు. విమర్శ ఐక్యతను పెంపొందించిందేకాని, ఐక్యతా విచ్ఛిన్నానికి దారి
తీసేదిగా యేమాత్రం వుండరాదు.

రైతాంగం వ్యవసాయ విప్లవంలో ప్రధానశక్తి. అన్నివర్గాలకంటే, రైతాం
గానికే కాంగ్రెసుపై బ్రమలెక్కువగా వున్నాయి. వాస్తవానికి కాంగ్రెసు రైతులకు
చేసినంత ద్రోహం మరెవ్వరికీ చేయలేదు. భూములపై హక్కులులేని జమీందారీ,
జాగీర్దారులకు భూములపై హక్కులనిచ్చి, వారికి నష్టపరిహారాన్నిచ్చి, ఆ బరువు
భారాన్ని రైతులపై మోపింది. భూసంస్కరణల నత్తనడక, పంటల, పారిశ్రామిక
వస్తువుల ధరల నిర్ణయంద్వారా రైతాంగపు దోపిడి నిరవధికంగా సాగుతునేవుంది.
పారిశ్రామికాభివృద్ధి భారాన్ని పరోక్షంగా రైతులపైనే అధికంగా మోపింది. గత
పొలిట్‌బ్యూరో ధనికరైతును శత్రువుగ, మధ్యతరగతి రైతును వూగిసలాడే మిత్రు
డుగానెంచి, రైతాంగాన్ని ఐక్యపరచుటలో విఫలమైంది.

ముగ్గురు ముఖ్యులు అజయ్, ఘాటే, డాంగేలు అందరూ ఆమోదించిన మూడు ముఖ్యాంశాలు: 1) మనవిప్లవం ఒనత ప్రజాస్వామ్య విప్లవమని, వ్యవసాయవిప్లవం దాని ఇరుసని, ప్రధానంగా జాతివిముక్తి పోరాటస్వభావాన్ని కలిగివుందని, సామ్రాజ్య వాదం దానితో సహకరించే భూస్వామ్య, బడా బూర్జువావర్గాలు శత్రువులని 2) సామ్రాజ్యవాద, భూస్వాములు, బడా బూర్జువా వ్యతిరేక, జాతీయ బూర్జువావర్గంతోసహా అన్ని వర్గాల, కార్మిక, కర్షక ఐక్యత పునాదిగా, కార్మికవర్గ పార్టీ నాయకత్వంలో యేర్పడే విస్తృత ఐక్య సంఘటన విప్లవ నాయకత్వం వహించాలని 3) విప్లవం చైనామార్గంలో అభివృద్ధిచెంది సుదీర్ఘ సాయుధ రైతాంగ పోరాటమై, విముక్తి ప్రాంతాలను, ప్రజావిముక్తి సైన్యాలను నిర్మాణంచేసి, సామ్రాజ్యవాద పాలనను అంతంచేసి, దేశాన్ని విముక్తిచేస్తుందని స్పష్టమైందని పేర్కొన్నారు.

అజయ్, ఘాటే, డాంగేలు, వ్యవసాయ విప్లవ ప్రాధాన్యతను గుర్తిస్తూనే ప్రజోద్యమాలను పెంపొందించాలని నొక్కిచెప్పి, విముక్తి వుద్యమ కర్తవ్యాలను నిర్వచించారు అవి 1) కార్మిక, కర్షక ఐక్యత పునాదిగా అన్ని వర్గాల సామ్రాజ్య వాద, దాని సహచరులకు వ్యతిరేకంగా పోరాడే విస్తృత ఐక్య సంఘటన నిర్మాణం 2) కార్మికవర్గ ఐక్యతతో ఐక్య సంఘటనకు నాయకత్వం వహించి, రైతాంగ, యితర వర్గాల, ప్రజోద్యమాల పోరాటాలతోనే యిది సాధ్యము. 3) విస్తృతరైతు వుద్యమాన్ని దేశమంతటా వ్యాప్తిచేసి, క్రమేణా సాయుధ రైతాంగ గెరిల్లా పోరా టాలను తెలంగాణా మార్గంలో సాయుధదళాలనిర్మాణం, గ్రామీణ స్థావరాల ఏర్పాటు చేయుటగ స్పష్టంచేశారు.

ఇంకా ప్రధాన విషయాలలో నూతన కేంద్రసమితితో భేదించుతున్నామని, అతిముఖ్యమైన ఈ విషయంలో పార్టీ సంక్షోభంలోపడిన ఈ దశలో అంతర్జాతీయ మిత్రులతో సంప్రదింపుల అనంతరం, నివేదికలను తయారుచేసి, పార్టీలో చర్చలకు పంపిణీచేసి, పార్టీ కాంగ్రెసు జరిపి రాజకీయ విధానాన్ని ఆచరణ కార్యక్రమాన్ని రూపొందించాలన్నారు.

నూతన కేంద్రసమితి పార్టీ ముగ్గురు ముఖ్యులు. వివిధ ప్రాంతాలలోని పార్టీ వర్గాలు లేవనెత్తిన ప్రశ్నలకు కొంతవరకు స్పందించినా, తమ పూర్వ దృక్పధం లోనే చిత్తు రాజకీయ విధానాన్ని ప్రణాళికను తయారుచేసి, నవంబరు 1950 లో విడుదల చేసింది. చిత్తు తీర్మానంలోని పాలకవర్గాల, ప్రభుత్వ విధానం, విశ్లేషణలను యింతకుముందే వివిధ శీర్షికలలో అధ్యయనంచేశాము. జనతా ప్రజాస్వామ్య సంఘ టన నిర్మాణ కార్యక్రమం ఆచరణలో ఎలాంటి రూపాంతరాలు పొందింది తెలుసు కొందాము.

జనతా ప్రజాస్వామ్య సంఘటన, సామ్రాజ్యవాద, భూస్వాములు వ్యతిరేక అన్ని వర్గాల శక్తుల ఐక్యపోరాట సంఘటనయని, కార్మిక, కర్షక, పెటీబూర్జువా, మధ్య తరగతులకు ప్రాతినిధ్యం వహించే పార్టీల, పక్షాల, ముఠాల, గ్రూపుల వ్యక్తులు, కనీస కార్యక్రమ ప్రాతిపదికపై యేర్పడు సంఘటనయని వివరించింది. కార్మిక,

కర్షక, ఐక్యతపై ఆధారపడి, కార్మికవర్గ అగ్రగామియైన కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంలో నిర్మించబడుతుందని స్పష్టంచేసింది. అంతేగాక అంతర్జాతీయ అనుభవాలను అధ్యయనంచేసి, గుణపాఠాలు నేర్చుకోనాలని చిత్తు తీర్మానం స్పష్టంచేసింది. ఇంకా 1930 దశకంలో సెక్టేరియనిజంతో, సంస్కరణవాద నాయకత్వంలో వున్న ట్రేడు యూనియనులలో పనిచేయ నిరాకరించి, "రెడ్ ట్రేడు యూనియన్‌ను" యేర్పాటు చేయుటను మాటలలో విమర్శించి గుణపాఠాలంటూనే అత్యంత తీవ్రవాద, సెక్టేరియ నిజంలో పడిపోయింది.

జనతా ప్రజాస్వామ్య సంఘటన కార్మిక, కర్షక, పెటీబూర్జువా, మధ్యతరగతి బూర్జువాలకు ప్రాతినిధ్యం వహించే పార్టీలు, గ్రూపులు, కమ్యూనిస్టుపార్టీ కనీస కార్యక్రమాన్ని అనగా జనతా ప్రజాస్వామ్య విప్లవ తక్షణ కార్యక్రమం దీనిని ఆమోదించి పోరాడసిద్ధపడే అన్నివర్గాల ఐక్యసంఘటన. పార్టీ గరిష్టకార్యక్రమమైన సోషలిజాన్ని ఆమోదించాలని వొత్తిడి చేయదని అంటూనే, ఐక్యసంఘటనను శిలా సదృశ్యంగా చెప్పుట అతివాద ప్రభావమే. మార్క్సిజం, లెనినిజం సిద్ధాంత పునాదిపై, కేంద్రీకృత ప్రజాస్వామ్య క్రమశిక్షణ గలిగి, కనిష్ట, గరిష్ట కార్యక్రమాలను ఆమోదించి, ఆచరణ ప్రాధాన్యతగల పార్టీ మాత్రమే వాస్తవానికి శిలాసదృశ్యం, గుత్తాధిపత్యంకల పార్టీగ చెప్పబడుతుంది అనేక వర్గాల పార్టీల ఐక్యసంఘటనను శిలాసదృశ్యంగా పేర్కొనుట, అతివాద సెక్టేరియ నిజంవైపు పార్టీ ఎంత దూరం పయనించిందో తెలియజేస్తుంది. రూపొందని ఐక్యసంఘటనను పురిటిలోనే "సంధి" గొట్టించుట అగుతుంది.

అంతేగాక, జనతా ప్రజాస్వామ్య సంఘటన అంటే పార్టీ దృక్పథంలో, సాయుధపోరాట ఐక్యసంఘటన, పాలకపక్షాలైన సామ్రాజ్యవాదం, దాని ఉపగ్రహ శక్తులను వోడించి, అధికారాన్ని హస్తగతం చేసుకొని జనతా ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పుట, అది సాయుధపోరాట ఐక్యసంఘటన ద్వారానే సాధ్యమగుతుంది, అయితే సాయుధపోరాట ఐక్యసంఘటన వొకేసారి రూపొంది, విస్తరించదని, ఆచరణలో ఐక్యతకై జరిగే పోరాటాల క్రమంలో, వివిధ వర్గాల ఆమోదం పొందిన కోర్కెలతో సంయుక్త ప్రదర్శనలు, పోరాటాలతో ప్రారంభించి, శాంతి, రొట్టె, భూమి, స్వాతంత్ర్యాలకై అత్యున్నత పోరాట రూపాలను, దీర్ఘకాల పోరాట ప్రాతిపదికపై, చేబట్టుటద్వారా అట్టి ఐక్యసంఘటన రూపొంది అభివృద్ధి చెందుతుంది.

ఐక్యసంఘటనను నిర్మించుటకు అత్యంత ఫలప్రదమైన మార్గం, క్రిందినుండి నిర్మించుట. వివిధ పార్టీల, సంస్థల, నాయకుల, వ్యక్తుల మధ్య వొడంబడికలు నిషేధం కాదు. క్రిందినుండి యేర్పడే ఐక్యతను, అట్టి వొడంబడికలు సుగమం చేస్తాయి. దీనిని సాధించుటకు పార్టీ క్రమబద్ధంగా, నిరవధికంగా వివిధ పార్టీలతోను, గ్రూపులు వ్యక్తులతో సంప్రదింపులు, ఓపిక, నేర్పుతో వివిధ దృక్పధాల వారితో చర్చించి, ఆమోదం పొందిన అంశాల ఆచరణ వొప్పందాలను రూపొందించవలసి ఉంటుంది. ఈ ప్రయత్నాల కాలంలోనే విచ్ఛిన్నశక్తులను బహిరంగ విమర్శచేస్తూ, బూర్జువా

జాతీయ భావప్రభావాన్ని తొలగించుటకు ఎడతెగని పోరాటం సాగించాలి. ఈ విధంగా "ఐక్యతా-పోరాటం" రెండూ లోపల, బయట కొనసాగించుతు, సంక్లిష్ట, కఠిన మార్గంలో పయనించవలసి ఉంటుంది. ఎట్టి పోరాటం లేకుండా ఐక్యత దృఢతరం కాదు.

జనతా ప్రజాస్వామ్య సంఘటనా యేర్పాటులో, సాయుధపోరాటంలో తన ప్రచారం, గెరిల్లా పోరాటం, ప్రస్తుత జాతీయ విముక్తి వుద్యమంలో సాయుధ పోరాటం ప్రధాన పోరాటంగా, ఆచరించే హక్కును వుంచుకొంటుంది. ఈ పోరాట రూపాన్ని ఆమోదించని పార్టీలు, వర్గాలపై తాను చేబట్టిన పోరాటరూపాన్ని రుద్దే ప్రయత్నం చేయదు. అదే విధంగా సంస్కరణవాద పార్టీలు, వాటి పోరాట రూపాలను అవి ఎంతసమర్ధవంతమైనా ఇతరులపై రుద్దే ప్రయత్నంచేయదు. అదే విధంగా యితర పార్టీలు వాటి పోరాటరూపాలు ఎంతటి సమర్ధవంతమైనవి అయినా తమపై రుద్దే ప్రయత్నాన్ని తిరస్కరిస్తుంది. అంటే ఐక్యకార్యాచరణకుగాని, ఐక్య సంఘటనకుగాని ఒక ప్రత్యేకపోరాటరూపాన్ని ఆమోదించాలనేషరతును విధించదు. ఇతర పార్టీలు ఐక్య సంఘటనలో సాయుధ పోరాటాన్ని నిషేధించాలనే షరతును ఆమోదించదు. సాయుధ పోరాట సమర్ధతను ప్రదర్శించి, కమ్యూనిస్టుపార్టీ జనతా ప్రజాస్వామ్య సంఘటనలోని పార్టీలు, గ్రూపులు, వర్గాలు తమంతతామే అంగీకరించువట్లు తమ స్వంత కార్యాచరణ ద్వారా సాధ్యమైన ప్రాంతాలలో, సాధ్యమైనపుడు ప్రజా సమీకరణగావించి, సాయుధ రైతాంగపోరాటాన్ని సాగించుతుంది. సామ్రాజ్యవాద వ్యతిరేక సాయుధ ప్రతిఘటన, సహకార మైత్రి జనతా ప్రజాస్వామ్య సంఘటనగా క్రమేణా రూపొందగలదనే అవగాహనున్న పొలిట్‌బ్యురో చిత్తు తీర్మానాన్ని ఆమోదించింది. పార్టీ వివిధ సమస్యలపై చేబట్టే పోరాట రూపాలను పట్టువిడుపులతో, వాస్తవంగా నిజమైన విప్లవసాయుధ పోరాట సంఘటన యేర్పడి విస్తరించేవిధంగా, ఆచరణ సాగిస్తుందని అంటున్నది.

ఈ విధమైన అవగాహనలను నూతన పొలిట్‌బ్యురో నవంబరు 1950 చిత్తు రాజకీయ విధానంలో సుస్పష్టంచేయుట. "కొన్ని ప్రాంతాలలో మినహా దేశమంతటా సాయుధరైతాంగ గెరిల్లా పోరాటాలు ప్రారంభించుటకు తగిన పరిస్థితులున్నవనుటలో" అతివాద, వక్రీకరణలనుండి వెనుదిరిగిన సూచనలు యేమాత్రం కనుపించక పోగా "జనతా ఐక్య సంఘటనా" అవగాహనలలోకూడ, సెక్టేరియన్. వొంటెత్తు, తీవ్రసాయుధ పోరాట అవగాహన సుస్పష్టం.

ఈనాలుగు సంవత్సరాలలో కమ్యూనిస్టు పార్టీలోని వివిధ వర్గాలు ఐక్య సంఘటన, కార్యక్రమం, వర్గాల పొందికలపై స్పందించిన తీరులను సంగ్రహంగా చెప్పుకొందాము.

1) పార్టీ 2వ కాంగ్రెసు సామ్రాజ్యవాద, ఫ్యూడలు, బూర్జువా వ్యతిరేక ప్రజాస్వామ్య, సోషలిస్టు విప్లవాలు రెండు సంలీనమైన వొకే విప్లవంగా, కార్మిక, కర్షక, వ్యవసాయ కూలీ, పేదరైతాంగం. పట్టణ మధ్యతరగతి మేధావివర్గాల ఐక్య

సంఘటన, జనతా ప్రజాస్వామిక విప్లవాన్ని ఆవిష్కరించే క్రమంలో మధ్యతరగతి రైతును కలుపుకొని, ధనికరైతును వేరుచేసి, కార్మికవర్గం కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంలో జనతా ప్రజాస్వామ్య విప్లవాన్ని జయప్రదం చేయుటకు తగిన విప్లవ పరిస్థితులున్నవని సిద్ధాంతీకరించింది ప్రజాస్వామ్య కర్తవ్యాలతోపాటు, అన్ని విదేశ పెట్టుబడులు, భారీపరిశ్రమలు బ్యాంకులు, రవాణా, భీమాకంపెనీలు ఐక్యసంఘటనా ప్రభుత్వం జాతీయం చేస్తుందని, భూస్వామ్య విధానాన్ని నష్టపరిహారంలేకుండా రద్దు చేసి, దున్నేవానికే భూమినిస్తుందని జమీందారి, జాగిర్దారీ విధానాలను రద్దుచేస్తుందని తెలిపింది

2) జూన్ 1950లో నూతన కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం, భారతజాతీయ విముక్తిపోరాటం "చైనా మార్గంలో" పయనిస్తుందని జనతా ప్రజాస్వామ్య సంఘటన ప్రధానపాత్ర వహించుతుందని ద్విముఖమైనదని, ఒకవైపు జాతీయ బూర్జువా వర్గం, పట్టణ పెటీ బూర్జువావర్గం, మేధావివర్గాలు, నగర బడుగువర్గాలు, కార్మికవర్గ ఐక్యసంఘటన; మరోవైపు గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయ కార్మికులు, కౌలుదారులు, పేద-మధ్యతరగతి రైతులు, ఫ్యూడలు, దోపిడిచేయని ధనికరైతులు, చేతివృత్తులవారు కలసి యేర్పడే జనతాప్రజాస్వామ్య సంఘటన, కార్మికవర్గ కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో వ్యవసాయ విప్లవ ప్రాతిపదికగా అధికారంకై పోరాటం జరుపుతుంది. పోరాటం ప్రధానంగా ఫ్యూడలు, సామ్రాజ్యవాద, బడాబూర్జువా వ్యతిరేక అన్ని వర్గాల ఐక్య సంఘటనా పోరాటంగా వివరించింది. గుత్తేతర బూర్జువావర్గానికి, సామ్రాజ్యవాద ఫ్యూడలు వ్యతిరేక పాత్రను గుర్తించి ఐక్య సంఘటనా ద్వారాలు తెరిచివుంచింది

3) ముగ్గురు ముఖ్యులు ఐక్యసంఘటనకు కార్మికవర్గ ఐక్యత, వామపక్ష ఐక్యత రెండు ప్రధాన పార్శ్వాలన్నారు గత మూడు సంవత్సరాల కార్మికవర్గ పోరాటాలు వారి ఐక్యతా వాంఛ యెంత బలమైనదో తెలియజేస్తున్నాయి. హైదరాబాద్‌లో సోషలిస్టులు వెలిబుచ్చిన ఐక్యతావాంఛ, మన ఐక్యతా పోరాటానికి ప్రోత్సాహమివ్వాలి.కార్మిక, కర్షక ఐక్యతకై సరియైన దృక్పధం, ఆచరణ, ఐక్యకార్యాచరణ, సహకారాన్ని పెంపొందిస్తూ,క్రమేణా రెండు ట్రేడుయూనియన్‌ల ఐక్యత సాధించి, కార్మికవర్గ ఐక్యతద్వారా జాతీయ ఐక్యసంఘటనకు దృఢమైన పునాదిని యేర్పరచాలనే వైఖరిని చేబట్టాలని ముగ్గురు ముఖ్యుల అవగాహనగా ఉంచి.

ఐక్యతా సుముఖులైన సోషలిస్టులకు, కాంగ్రెసులోని అతివాదులకు చొరవతో పిలుపునిచ్చి, సమావేశపరచి, సోషలిస్టు పార్టీకి ఐక్య కార్యాచరణను నేరుగా పిలుపు నివ్వాలి. ఈ విధంగా కమ్యునిస్టు, సోషలిస్టు ఫార్వర్డుబ్లాకు, వర్కర్స్ అండ్ పీజంట్సు పార్టీల ఐక్యకార్యాచరణ, ఐక్యతా నిర్మాణం, ఐక్య ట్రేడు యూనియన్, కిసాన్‌సభ, విద్యార్థి, యువజన వుద్యమాలను నిర్మించి, మహత్తర ప్రజోద్యమాలను నిర్మించాలి. ఈ ఐక్యతపైనుండి నాయకత్వాల, పార్టీల వొప్పందాల ద్వారానేగాక, క్రిందినుండి ఐక్యకార్యాచరణ ద్వారా యేర్పడిన ఐక్యసంఘటన మహోద్యమంగా అభివృద్ధి చెంది నిర్ణయాత్మక పాత్ర వహించగలదని కూడ వివరించారు.

ఈ విధంగా సామ్రాజ్యవాద పూ్యడలు, బూర్జువా వ్యతిరేక అన్నివర్గాల, జాతీయ బూర్జువావర్గంతోసహా యేర్పడిన, కార్మిక, కర్షక ఐక్యత, వామపక్షాల ఐక్యతా పునాదులుగ, కార్మికవర్గం కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో యేర్పడిన, విస్తృత జనతా ప్రజాస్వామ్య ఐక్యసంఘటన, వ్యవసాయ విప్లవమార్గంలో జనతా ప్రజా స్వామిక విప్లవ విజయానికి ఆయుధంగా తోడ్పడుతుందని వారి విశ్వాసంగా వుంది.

4) నూతన పొలిట్‌బ్యురో నవంబరు 1950లో ప్రభుత్వాధికారం బడా బూర్జువావర్గం, గుత్త పెట్టుబడిదారులు, పూ్యడలు సంస్థానాధిపతులు, జమీందారులు, జాగీర్దారులు, భూస్వాములది. సామ్రాజ్యవాదపు చెప్పుచేతలలో ఉంది. జాతీయ బూర్జువావర్గంలోని అత్యధికులు సామ్రాజ్యవాద వ్యతిరేక పాత్రను కలిగివున్నారు. చిన్న, మధ్యతరగతి పారిశ్రామికులు సామ్రాజ్యవాద వ్యతిరేకులని స్పష్టం.

జనతా ప్రజాస్వామ్య సంఘటన కార్మికులు, వ్యవసాయకూలీలు, కౌలుదారులు, పేద, మధ్యతరగతి రైతులు, పెటీ బూర్జువా మధ్యతరగతి వర్గాలు, చిన్న పాటి శ్రామికులు, చేతివృత్తులవారు, విద్యార్థి, యువజన, వుపాధ్యాయ, మేధావి వర్గాలు, నగర బడుగువర్గాలతో వారి పార్టీల, సంస్థలు, జాతీయ బూర్జువావర్గంతోసహా అన్ని వర్గాల ఐక్యకార్యాచరణలో పాల్గొని, పోరాటాలు జరుపుటద్వారా ఐక్యసంఘటన యేర్పడుతుంది. జాతీయ బూర్జువావర్గంతోపాటు ధనికరైతు ఐక్యసంఘటనలో భాగ స్వామి అగుతాడు. కార్మికవర్గ ఐక్యత, వామపక్ష ఐక్యత ఐక్యసంఘటనా నిర్మాణా నికి ప్రధానభూమిక అగుతుంది

మితవాద సంస్కరణవాదం, ఐక్యసంఘటనలో కార్మికవర్గ స్వతంత్రపాత్రను, ప్రజాసమీకరణను తక్కువగా అంచెనావేసి, బూర్జువావర్గపు లోకంగా మారిస్తే, అతి వాద దుందుడుకు, సెక్టేరియనిజం స్వతంత్ర సమీకరణశక్తి, కార్మికవర్గ పార్టీ నాయ కత్వాల పేరుతో టిటోయిస్టు శిలాసదృశ్య సంఘటన అవగాహనలో అన్ని ప్రజా స్వామ్యపక్షాల, వర్గాల, ప్రజలనుండి దూరమైందని గత అనుభవం స్పష్టం చేసింది, శాస్త్రీయ ఐక్యసంఘటనా నిర్మాణక్రమాన్ని వివరించింది.

అధికారాన్ని హస్తగతం చేసుకొనే పోరాటంలో జనతా ప్రజాస్వామ్య విప్లవ అత్యున్నతదశలో సంఘటన, సాయుధ పోరాట ఐక్యసంఘటన, దాని ప్రాతిపదిక యైన ప్రజా వ్యవసాయ విప్లవం, గ్రామీణ ప్రాంతాలలో సాయుధ రైతాంగ ఐక్య సంఘటనగా, భూసమస్యను విప్లవమార్గంలో పరిష్కరిస్తూ విజయం పొందుతుంది. సంఘటన ఒక ప్రత్యేక పోరాటరూపాన్ని ఆమోదించాలనే షరతును పెట్టదు, యిత రులు అట్టి షరతును పెట్టుటకు ఆమోదించదు. ఉద్యమ అసమానాభివృద్ధి ఫలితంగా, వివిధ ప్రాంతాలలో వివిధ పోరాట రూపాలకు చేబట్టవలసి ఉంటుందనే అవగాహన పార్టీ కి వుంది.

5) కమ్యునిస్ట్‌పార్టీ అక్టోబరు 1951 అఖిలభారత సమావేశానంతరం రాజ కీయ విధానము, కార్యక్రమం, ఎత్తుగడలు, పత్రాలను విడుదలచేసింది. భారత విప్ల వము పూ్యడలు, సామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవం గతంలో "రష్యా", "చైనా"

పంథాలు వ్యూహం. ఎత్తుగడలు, ఆచరణ, సిద్ధాంతం ఐక్య జాతీయ సంఘటనకు మూలాధారమైన కార్మిక, కర్షక ఐక్యత, వామపక్ష ఐక్యత, నిర్మాణకేంద్ర కర్తవ్యాలను త్రోసి రాజనుట, భూస్వాములు, సామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవంలో కార్మికవర్గ నాయకత్వ పాత్రను నిరాకరించుటతప్ప మరొకటిగాదు. భారత విప్లవపంథా గ్రామీణ ప్రాంతాలలోని సాయుధ రైతాంగ వ్యవసాయ విప్లవ గెరిల్లా పోరాటాలను నగరాలలోని సార్వజనీన సమ్మె తిరుగుబాటులను సమ్మేళనంలో కార్మికవర్గ నాయకత్వాన జనతా ప్రజాస్వామ్య విప్లవ పంథా అని తెలిపింది.

ప్రభుత్వాన్ని తొలగించి, అన్ని ప్రజాస్వామ్యపక్షాల భూస్వామ్య, సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తుల ప్రభుత్వాన్ని స్థాపించుటకు పరిస్థితులు పక్వమైనాయని పార్టీ తలచింది. వ్యవసాయ విప్లవ పోరాటాలను, నగరాలలోని విప్లవ కార్మికుల పోరాటాలను సమన్వయం, సంలీనం చేయుటను నొక్కిచెప్పింది. కాని యేలనో ఐక్య సంఘటన వివరాలను వదలివేసింది.

ఐక్య సంఘటనా అవగాహనలో గత నాలుగు సంవత్సరాలలో బూర్జువావర్గం ధనిక రైతువర్గాల పాత్రలపై రెండు దృక్పథాలు సంఘర్షించాయి. బూర్జువావర్గం మొత్తంగా బ్రిటిష్ వారితో రాజీపడిందని, తత్కారణంగా విప్లవం సామ్రాజ్యవాద బూర్జువా వ్యతిరేకమని వొక దృక్పథం, బడా బూర్జువా లేక గుత్త బూర్జువావర్గం మాత్రమే రాజీపడినందున, గుత్తేతర జాతీయ బూర్జువావర్గం సామ్రాజ్యవాద వ్యతిరేక పాత్ర కలిగివుందని, తత్కారణంగా ఐక్యసంఘటన ద్వారాలు దానికి తెరచివుంచాలనే మరో దృక్పథం ప్రధానంగా పార్టీలో అంతర్గతంగా సంఘర్షించాయి. బడా బూర్జువావర్గం మొత్తంగా సామ్రాజ్యవాదంతో చేతులు కలుపలేదని, కొన్ని వర్గాలు మాత్రమే అయినందున మినహాయింపులను సామాన్యీయాకరణచేయుట అశాస్త్రీయం కాన బడాబూర్జువావర్గానికి సామ్రాజ్యవాద వ్యతిరేక పాత్ర వున్న కారణంగా విప్లవం ప్రధానంగా భూస్వాములు, సామ్రాజ్యవాద వ్యతిరేకమనే అంతర్జాతీయ కమ్యూనిస్టు అవగాహనా పరిధిలో మూడో దృక్పథం సిద్ధాంతచర్చలలో ప్రతిబింబించింది. ఈ మూడో దృక్పథం అంతగా కనపడకపోయినా వున్నది. ధనిక రైతుల యెడల భిన్నాభిప్రాయాలు వివిధ దృక్పథవాదులలో వెల్లడయ్యాయి. ఈ వివిధ ఐక్య సంఘటనా దృక్పదాలు, వ్యవసాయ విప్లవం, రైతాంగ సాయుధగెరిల్లా పోరాటాలే యేకైక పోరాటం అనే దృక్పదం, అవగాహనలో, ఐక్యపోరాటం, ఐక్య సంఘటనా అవగాహన కానరాకుండాపోయింది.

# 5

# సభాపర్వం

## I

## ప్రథమ ఎన్నికలు, ఐక్యసంఘటన పోరాటాలు

భారత రాజ్యాంగ నిర్మాణసభ 26 నవంబరు 1949న రాజ్యాంగచట్టాన్ని ఆమోదించింది. నూతన భారత రిపబ్లిక్ 26 జనవరి 1950న అవతరించింది. సర్దార్ పటేలు బలంతో కాంగ్రెసు అధ్యక్షుడుగా 1950 నాశిక్ కాంగ్రెసు మహాసభలో పురుషోత్తమదాస్‌టాండన్ ఎన్నిక కాబడినా, ప్రథమ జనరలు ఎన్నికలు దృష్టిలో పెట్టుకొని, నెహ్రూని సెప్టెంబరు 1951లో అధ్యక్షునిగా ఎన్నుకొంది. నెహ్రూ మొట్టమొదటగా ప్రధానమంత్రి, కాంగ్రెసు అధ్యక్ష పదవి రెంటిని చేబట్టారు. కాంగ్రెసు సోషలిస్టు పార్టీలోని వామపక్ష సోషలిస్టు వర్గాలు అరుణా అసఫాలీ నాయకత్వంలో కమ్యూనిస్టులతో సహకరించే విషయంలో విభేదించి, విడిపోయాయి.

దేశం సంక్షోభంవైపు పయనిస్తున్నది. ప్రభుత్వం ఆహార, భూ సమస్యలను పరిష్కరించకపోవుటతో ప్రజల భ్రమలు తొలగిపోవుచున్నవి. ఈ ప్రభుత్వాన్ని, దోపిడి వర్గాలను ఎన్నికలద్వారా తొలగించగలమనే నూతన భ్రమలు యేర్పడుచున్నవి. ప్రజలు దైనందిన కోర్కెలతో పోరాటాలలోనికి వస్తున్నారు. అయినా ప్రజాఉద్యమ వుధృతి అంతగా పెరుగలేదు. ప్రభుత్వం అవలంభించు మన విధానాలతోపాటు పార్టీలోని అనైక్యత, బలహీనత, అభ్యుదయశక్తులలో గందరగోళం ప్రధానంగా కన్పడుతున్నది. ఈ ప్రభుత్వాన్ని వోడించాలని ప్రజా ప్రభుత్వాన్ని యేర్పరచాలని,కామన్ వెల్తునుండి విడిపోవాలనే నినాదాలతో కమ్యూనిస్టు పార్టీ ఎన్నికలలో పాల్గొని, ప్రజలకుగల భ్రమలను తొలగించాలి. ప్రజలను దైనందిన పోరాటాలలో మెట్లుమెట్లుగ ఉన్నత పోరాటరూపాలను, రైతాంగ సాయుధ పోరాటాన్ని చేబట్టు అవసరాన్ని గుర్తించునట్లు చేయాలి. ఇది యిప్పటి తక్షణ కర్తవ్యమని అంతర్జాతీయ సలహా లభించింది.

### కమ్యూనిస్టు పార్టీ ప్రథమ ఎన్నికల ప్రణాళిక :

కమ్యూనిస్టు పార్టీ నిషేధంలోనే ఆగస్టు 1951లో ఎన్నికల ప్రణాళికను ప్రకటించింది. పార్టీ కేంద్రసమితి, వామపక్ష పార్టీలతో ఎన్నికల సమస్యలు, ప్రణాళిక, ఐక్యసంఘటనా కార్యక్రమాలను రూపొందించుటకు, ఏడుగురు సభ్యులుగల వొక కమిటీని యేర్పరచింది

పాలకపార్టీ కాంగ్రెసు నాయకత్వం స్వాతంత్ర్యం సంపాదించామని, సంస్థానాలు విలీనీకరణం, దేశఐక్యత సాధించామని, భూసంస్కరణలు చేపట్టామని అధి

కారోత్పత్తి, జల విద్యుఛ్ఛక్తి పెంపొందించామని చాటుకొంటున్నారు. తమశక్తి కొలది మంచి చేసామని, ఇంకా మంచి చేయుటకు తమపై విశ్వాసముంచి తమ నెన్ను కొనాలని కోరారు.

కాంగ్రెసు విజయాలు వారిచ్చిన అంకెలు, నాటిన చెట్లు త్రవ్విన బావులలోనే గాక, లోతుకుపోయిన ప్రజల కళ్ళలలో, చిక్కి-శల్యావశిష్ఠమై నడస్తున్న అస్థి పంజ రాలలో వాస్తవ సమాధానాలు లభిస్తాయి. దేశంలో జరిగిన లాఠీ చార్జీలు, బాష్ప వాయువులు, కాల్పులు, మూకుమ్మడి అరెస్టులు, నిషేదాలు, నిర్బంధాలు తెలియ జేస్తాయి. తిండి, గుడ్డ, మానవుని అన్ని అవసరాలు మార్కెట్టులో అంతర్ధానమై బ్లాక్ మార్కెట్టుకు చేరాయి బీహార్‌లో కరువు పరిస్థితి వుంది అప్పులు, కౌలు, పన్నుల భారాలతో క్రుంగిపోవుచున్నారు. వ్యవసాయ కూలీల జీవితం దుర్భరమై, వారి సంఖ్య, నిరుద్యోగం పెరిగిపోయింది. పెరిగే ధరలతో, తరిగే వేతనాలతో ఆకలి తీర్చుకొనలేకపోతున్నారు. మధ్యతరగతి వుద్యోగుల పరిస్థితి దినదినానికి దిగ జారిపోతున్నది. ఇది నేటి ప్రజా జీవిత చిత్రం.

సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సంపాదించకపోగా రాజీపడి, విదేశీయుల దోపిడిలో భాగస్వాములై, బ్రిటిషు చక్రవర్తి ఆధ్వర్యంలోని కామన్‌వెల్తులో మనలను భాగ స్వాములుగ జేసారు. మన సైన్యం, నావికాదళం, విమానదళం బ్రిటిషు ఆఫీసర్ల ఆధ్వర్యంలో వున్నాయి. సంస్థానాధీశులకు, రాజులకు ప్రాణంపోసి రాజప్రముఖులు, గవర్నరులుగజేసి, రాజభరణాలను యేర్పాటుచేసి, ఆ భారాన్ని శాశ్వతంగా ప్రజలపై మోపింది. ఈ ప్రభుత్వం గుత్త పెట్టుబడిదారులది, భూస్వాములది, రాజులది.... సామ్రాజ్యవాదంతో బ్రహ్మముడి వేసుకొన్నది. అభివృద్ధి నిరోధక ప్రభుత్వం, స్వతంత్ర, అభ్యుదయకర శాంతి విదేశాంగ విధానాన్ని వాస్తవంగా అవలంభించ జాలదు.

కాన యీ ప్రభుత్వాన్ని వోడించి, జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని యేర్ప రచాలి. అన్ని ప్రజాస్వామ్య పార్టీలు, గ్రూపులు, వ్యక్తులు, కార్మికులు, కర్షకులు, మధ్యతరగతి వర్గాలు, జాతీయ బూర్జువా వర్గాలు, భారత పారిశ్రామికీకరణకు పోరాడే తదితర బూర్జువావర్గాల కలయికతో అట్టి ప్రభుత్వ మేర్పడుతుంది. కామన్ వెల్తునుండి బయటకు వస్తుంది, సైన్యంలోని విదేశీయ అధికారులందరిని, ప్రభుత్వ ములో విదేశీయ అధికారులందరిని తొలగించి బ్రిటిషు పెట్టుబడిలోపాటు జాతీయం చేస్తుంది.

రైతుల అప్పులను రద్దుచేసి, భూస్వాముల, జమీందారుల భూములను నష్ట పరిహారం లేకుండా స్వాధీనం చేసుకొని, దున్నేవారికే భూమి నిస్తుంది. ధనికరైతుల, పారిశ్రామికవేత్తలకు న్యాయబద్ధ లాభాలకు హామీ యిస్తుంది. పారిశ్రామికీకరణను గావించుతుంది. పోలీసు, సైన్య తదితర మితిమీరిన అనవసర ప్రభుత్వ ఖర్చును తగ్గిస్తుంది. చిన్న పరిశ్రమలను, చేతివృత్తులను ప్రోత్సహిస్తుంది.

కార్మికుల జీవనవేతనం, వారి హక్కులను గుర్తిస్తుంది. జాతీయ సైన్యాన్ని యేర్పాటుచేస్తుంది. ప్రభుత్వాన్ని ప్రజా ప్రభుత్వంగా సంస్కరించి, ఎన్నికైన ఉద్యోగులను నియమించి, అన్ని అధికారాలను వారికిస్తుంది. ప్రజల విశ్వాసాన్ని కోల్పోయిన వారిని తొలగిస్తుంది స్థానిక స్వపరిపాలనతో ప్రజాపాలన కొనసాగుతుంది.

ఈ లక్ష్యాన్నిచేరుటకు, ఈ ప్రభుత్వాన్ని తొలగించుటకు ప్రజల ఐక్య పోరాటాలే మార్గం. మనదేశంపై సామ్రాజ్యవాదుల పిడికిలి పట్టును బద్దలు చేయగల ఐక్యత, రైతులకు భూములివ్వగల ఐక్యత, అందరికి పని, తిండి, బట్టలు యివ్వగలిగిన ఐక్యత, బలమైన శాంతి ఉద్యమాన్ని నిర్మించగల ఐక్యత ప్రజా ప్రభుత్వాన్ని యేర్పాటు చేయగల ఐక్యతా నిర్మాణం చేయగలగాలి ప్రజలు ఈ ఆకాంక్షలపై సమీకృతులై ఎన్నికలలో అట్టి పరిస్థితులకు కర్తలగుతారు. బొంబాయి గుడ్డలమిల్లుల కార్మికులు ఒకే ఒక యూనియన్‌గా యేర్పడుటకు చారిత్రాత్మక నిర్ణయం గావించి, భారత కార్మికవర్గానికి మార్గదర్శకులయ్యారు హవురా, బర్ద్వాన్, చంద్రనగర్, రాజనందగావ్‌లలో ఐక్య ఎన్నికల పోరాట విజయాలు దీనినే సూచిస్తున్నాయి[1].

## ఎన్నికల ఐక్యసంఘటనలు

అనేక రాష్ట్ర కమ్యూనిస్టు నాయకత్వాలు, కేంద్రం ఎట్టి సూచనలు యివ్వనప్పటికి, ఎన్నికలు చదరంగంలో "మిత్రకూటముల" నేర్పరచుటలో పట్టువిడుపులతో సంక్లిష్టమైన వివిధ రాష్ట్ర స్థానిక పరిస్థితులలో సమర్థవంతంగానే నిర్వహించారని చెప్పవలసివుంటుంది.

భారత సోషలిస్టుపార్టీ కమ్యూనిస్టు వ్యతిరేకత ఎన్నికల ఐక్య సంఘటనల నేర్పరచుటలో మరింత క్లిష్టతను, సాధారణ వైఫల్యాన్ని కలుగజేసిందని స్పష్టం చేయవలసివుంది ఈ పార్టీ 1786 అసెంబ్లీ స్థానాలకు పోటీచేస్తూ కమ్యూనిస్టు పార్టీతోనేగాక మరే యితర పార్టీతో కలువక వొక్క అంబేత్కర్‌తో పొత్తుపెట్టుకొని అనేక మంచి అవకాశవాదులకు, అధికారవేటగాళ్ళకుసీట్లునిచ్చింది. ఏ స్థానంలోనైనా కమ్యూనిస్టుల గెలుపుకంటె కాంగ్రెసు గెలుపునే తాము వాంచించుతామని స్పష్టం చేసింది. అనేక స్థానాలలో అభ్యర్థులను నిలబెట్టి ఓట్లను చీల్చి, కాంగ్రెసు గెలుపును నిశ్చరంచేసింది అయినా కమ్యూనిస్టులు, ఐక్యసంఘటన అభ్యర్థులులేనిచోట, పోరాట అనుకూలురు, సోవియట్ వ్యతిరేకులు కాని సోషలిస్టులకు మద్దతునిచ్చుట జరిగింది. ప్రజలచే ద్వేషింపబడే కాంగ్రెసు నాయకుడుగాని, మంత్రిగాని అభ్యర్థి అయినపుడు సోషలిస్టు అభ్యర్థి సోవియట్. కమ్యూనిస్టు వ్యతిరేకి అయినా మద్దతునిచ్చుటకూడ జరిగింది. కార్మికవర్గ ప్రాంతాలలో నిలబడిన సోషలిస్టు అభ్యర్థి కొంతవరకు కార్మికవర్గ అనుకూలుడైన కార్మికవర్గ ఐక్యత విచ్ఛిన్నం కాకుండుటకై సోషలిస్టును బలపరచుట జరిగింది. వామపక్ష సోషలిస్టులతో అత్యంత సన్నిహిత, సహకారాలతో వారు నిలబడిన అన్ని నియోజకవర్గాలలో కమ్యూనిస్టులు కలసి పనిచేయుట జరి

1. భారత కమ్యూనిస్టు పార్టీ ఎన్నికల ప్రణాళిక (1951), భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర (1977) అధికారపత్రాలు (అంగ్లంలో) వా VII. పే. 61-84.

గింది స్థానిక వామపక్ష సోషలిస్టులు కమ్యూనిస్టులకు పూర్తి సహకారాన్నందించుట జరిగింది.

బెంగాల్, బీహార్, ఒరిస్సాలలో ఫార్వర్డుబ్లాక్ (మార్క్సిస్టు)తో పూర్తి ఎన్నికల అవగాహన, వొప్పందం కుదిరింది. మహారాష్ట్రలోని పెక్కు ప్రాంతాలలో హైదరాబాద్‌లోని మరాట్వాడాలో కాంగార్, కిసాన్ పార్టీతో కమ్యూనిస్టు పార్టీ ఎన్నికల వొప్పందం కుదుర్చుకొంది. మహారాష్ట్రలో కమ్యూనిస్టు, పీజంట్సు అండ్ వర్కర్సు పార్టీ ఒకరి కొకరు పోటీచేసినా, షోలాపూర్‌లో కలిపి పనిచేశారు. ఉత్తర ప్రదేశ్‌లో పార్టీ, రివల్యూషనరీ పార్టీ సోషలిస్ట్ పార్టీ కలసి ఎన్నికలలో పాల్గొన్నారు. పంజాబులో లాల్‌జెండా కమ్యూనిస్టు పార్టీతో, కమ్యూనిస్టుపార్టీ ఎన్నికల వొప్పందంచేసుకొంది.

కేరళలో కమ్యూనిస్ట్ పార్టీ రివల్యూషనరీ సోషలిస్ట్ పార్టీ కేరళ సోషలిస్ట్ పార్టీలతో యేర్పడిన ఐక్యవామపక్ష సంఘటన కొచ్చిన్, తిరువన్కూర్, మలబార్ ప్రజలలో నూతనోత్సాహాన్నిచ్చి, విస్తృత ఐక్య సంఘటనా కమిటీలు స్థానికంగా ప్రజాస్వామ్య వాదులందరితోకలిపి యేర్పాటు గావించుటకు తగిన వాతావరణాన్ని సృష్టించింది.

హైదరాబాద్‌లో వామపక్షాలు, ఆంధ్రమహాసభ పునాదిగా, గ్రూపులు, వ్యక్తులు కలసి జనతా ప్రజాతంత్ర సంఘటనను నిషేదంలో వున్న కమ్యూనిస్టుల నాయకత్వంలోని రైతాంగంతో యేర్పడి అత్యద్భుత విజయాలను సాధించి అందరిని ఆశ్చర్యచకితులను చేసింది.

ఈ ఐక్య సంఘటనల ప్రత్యేక లక్షణం సోషలిజం ధ్యేయంగా నెంచిన వామపక్షాలు, మార్క్సిజం మార్గదర్శికం అనుకొనేవారు వొప్పందాలకు వచ్చుటతో యేర్పడినవి. అట్టి ఐక్య సంఘటనలు అవసరమైనవి, ఆశించతగినవి. అత్యధిక ప్రజాసామాన్యాన్ని ఆకర్షించునంత విస్తృతి కలిగినవికావు. కాంగ్రెసును మొత్తంగా వోడించగలిగినంతటి శక్తివంతమైనవి కావు. దేశవ్యాప్తంగా అవి యేర్పడలేదు. ప్రధానంగా స్థానికమైనవి ఫ్యూడలు, మతతత్వ పార్టీలను, శక్తులను మినహాయించి అన్ని ప్రజాస్వామ్య పార్టీల, వామపక్షాల, అభ్యుదయ గ్రూపుల, పార్టీల, వ్యక్తుల ముఖ్యంగా కాంగ్రెసు వ్యతిరేక శక్తులన్నిటిని విస్తృత ఐక్యసంఘటనలో సమీకరించే ప్రయత్నం పాక్షిక విజయమే లభించింది.

తమిళనాడులో కమ్యూనిస్టు పార్టీ కార్మికవర్గంలోను, తంజవూరు జిల్లా రైతాంగంలోను ప్రధానంగా కొంతబలం కలిగివుంది. ద్రవిడ కజగం రాష్ట్రమంతటా ఐక్య సంఘటన యేర్పాటుకు ప్రయత్నించింది. కజగం రాజకీయ సంస్థగా ఐక్యసంఘటనలో చేరకపోయినా అత్యధిక ద్రవిడ కజగం నాయకులు కార్యకర్తలు కమ్యూనిస్టు అభ్యర్థులను బలపరచి కాంగ్రెసు అభ్యర్థులను వోడించుటలో ప్రధాన పాత్ర వహించారు.

ఆంధ్రలో కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ, క్రిషికార్‌లోక్ పార్టీలతో ఎన్నికల వొప్పంద ప్రయత్నాలు విఫలమైనా, కాంగ్రెసును వోడించుటకై కమ్యూనిస్టుపార్టీ కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీకి, ఏకపక్షంగా పూర్తిమద్దతు నిచ్చింది. స్థానికంగా ఐక్య సంఘటనల అవగాహన యేర్పడింది. కమ్యూనిస్టు పార్టీ మద్దతుతో 11 మంది కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టి అభ్యర్థులు గెలుపొందారు. ఇద్దరు కాంగ్రెసు మంత్రులు తమ వోటమికి, తమ ప్రత్యర్థులను కమ్యూనిస్టులు బలపరచుటయే కారణమని ప్రకటించారు.

మలబార్‌లో కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీతో కమ్యూనిస్టు పార్టీ కలసి ఐక్య సంఘటన యేర్పరచుట, కాంగ్రెసును వోడించుటలో ముఖ్యపాత్ర వహించింది.

బెంగాల్‌లో కమ్యూనిస్టు, ఫార్వర్డుబ్లాక్, కిసాన్‌మజ్దూర్ ప్రజాపార్టీలు కలసి ఐక్యసంఘటనగా యేర్పడినవి. కిసాన్‌మజ్దూర్ ప్రజాపార్టీ పెక్కుస్థానాలలో పోటీ చేసి, ప్రత్యామ్నాయ ప్రభుత్వ నినాదాన్నిచ్చింది,కాని ఆ పార్టీ అంత బలంగా లేదు.

ఐక్యసంఘటనా నిర్మాణంలో కమ్యూనిస్టు పార్టీ కొంత పురోగమనాన్ని సాధించినా, అన్ని కాంగ్రెసు వ్యతిరేక అభ్యుదయశక్తులు పాలకపార్టీని వోడించుటకై ఐక్యమవ్వాలనే నినాదం పాక్షిక విజయాన్నే సాధించింది. వామపక్షాల ఐక్యత పూర్తిగ సాధించబడలేదు. ఐక్యసంఘటన శాస్త్రీయ దృక్పధం కొరవగుట, వొంటెత్తు పోకడలు ప్రతిబంధకాలై సంఘటనాభివృద్ధిని అరికట్టాయి.[1]

ఐక్యసంఘటనా నిర్మాత, చోదకశక్తి కమ్యూనిస్టు పార్టీయే కాన దానిబలం, సమన్వయశక్తి ప్రాధాన్యత వహిస్తాయి. విస్తృత ప్రజోద్యమ నిర్మాణం సెక్టేరియ నిజాన్ని అంటిపెట్టుకొని చేయజాలం. ప్రజోద్యమ పోరాటాలలోనే దానిని వదిలించు కొనగలము, బలాన్ని పొందగలము.

ప్రప్రధమంగా పార్టీ బలమైన ప్రజాశక్తియైన, ఐక్యతానినాదంతో తన వర్గ సమీకరణ కానించేది ఆ బల ప్రదర్శనోద్యమాలతో ప్రజలలో శక్తివంతమైన ఐక్య ప్రజోద్యమాన్ని నిర్మించగలిగేది. పార్టీ స్వతంత్ర సమీకరణశక్తితోపాటు సరియైన ఐక్యసంఘటనా దృక్పధం కేరళలో పార్టీ, కిసాన్‌మజ్దూర్ ప్రజాపార్టీల మధ్య విజయ వంతమైన సంఘటనాభివృద్ధిని సాధ్యం చేసింది.

ద్వితీయంగా ఎలక్షనులకు ముందు అన్ని పార్టీలు తమ బలాలను అతిగా అంచెనా వేయుట, కమ్యూనిస్టుపార్టీ బలాన్ని గుర్తించ నిరాకరించాయి. బూర్జువాపార్టీలు సహజంగానే, సంఘటన బలాన్ని పెంచుట ప్రధాన ధ్యేయంగాకాక తమ పార్టీల అసెంబ్లీల బలాన్ని పెంచుకొనుటకు ప్రాధాన్యత నిచ్చాయి.కమ్యూనిస్టుపార్టీ ఐక్యతా పిలుపును పార్టీ బలహీనతగా నెంచాయి. పార్టీ బలమైన కేంద్రాలులోకూడ వారు పార్టీని బలహీనపరచుటకై షరతులు పెట్టు విధాన్ని అవలంభించారు.

---

1. భారత కమ్యూనిస్టు పార్టి చరిత్ర (1977) అధికారపత్రాలు. (ఆంగ్లంలో).
ఎన్నికల ఫలితాలు కర్తవ్యాలు పార్టీ లెటర్ నం. 9. ఏప్రిల్ 1952. వా.VIII, పే. 10.

తృతీయంగా, ఐక్యసంఘటన ఎన్నికలలోనే ముందుకువచ్చింది. తక్షణకోర్కెలపై పోరాటానికై యేర్పడినదికాదు. ఐక్య ప్రజాసంఘాల, ప్రజోద్యమాల సంఘటనగాదు. కనీస కార్యక్రమంపై ఎన్నికలకై, ప్రభుత్వ నిర్మాణంలో పాలు పంచుకొనుట కేర్పడినవిగా యెంచారు. అందువలనే భేదాభిప్రాయాలు మౌలికాంశాలపైగాక, యెవరు గెలవగలరనే ప్రశ్నపైగాక సీటు యే పార్టీ అభ్యర్థి కివ్వాలనే విషయంపై ఉద్భవించాయి.[1].

ఈ కారణంగానే ఎన్నికల ఐక్యసంఘటనలు విస్తృత, శక్తివంత ఉద్యమాలు కాజాలకపోయాయి అయినా ఎన్నికల అనంతరం ఐక్యతాభివృద్ధికి, అవకాశాల అభివృద్ధికి తోడ్పడినవి. కాంగ్రెసును యే వొక్కపార్టీ వోడించజాలదని కమ్యూనిస్టులు బలమైన శక్తియని, కాంగ్రెసు కమ్యూనిస్టులు బలంగావున్న ప్రాంతాలలోనే ప్రధానంగా వోడిపోయిందని, ఒక్క కమ్యూనిస్టులుగల ఐక్యసంఘటనయే కాంగ్రెసును వోడించే ప్రత్యామ్నాయమని అందరికి స్పష్టమైంది. ప్రజల అసంతృప్తి వొక్కటే చాలదని; ప్రజాపోరాటాలద్వారా దానికి నిర్మాణ స్వరూపమివ్వాలని అందరు గమనించారు.

ఎన్నికలు, ఐక్యసంఘటన నిర్మాణాలు ప్రధానంగా రాజకీయ పోరాటాలు అని మరువరాదు. అన్ని పక్షాలు ఆమోదించే శాంతి, యుద్ధ వ్యతిరేకత, ఆసియా విముక్తి వుద్యమాల యెడల సుహృద్భావం ఐక్యసంఘటనల ప్రచారాలలో తగిన ప్రాచుర్యం పొందలేదు. సహజంగానే, తప్పనిసరిగా తిండి, బట్ట, పని, వేతనం పోలీసు దౌర్జన్యాలు, పౌరహక్కులు ఎన్నికల ప్రచారంలో ప్రధానాంశాలు అయినప్పటికి, వలస దేశాలలో సామ్రాజ్యవాదం జరిపే హింసా, దౌర్జన్యాలను ఖండించే ప్రచారం చేబట్టుటలోను, శాంతి, యుద్ధ వ్యతిరేకతల యెడల అశ్రద్ధ వహించుట ప్రధాన లోపంగా నెంచవచ్చు

ఎన్నికలు మరో ప్రధాన బలహీనతను వెలుగులోనికి తెచ్చాయి. కార్మికవర్గ పోరాట కేంద్రాలుగ ప్రసిద్ధికెక్కిన బొంబాయి, కాన్పూరు, అహమ్మదాబాద్, నాగపూర్, ఢిల్లీ, తాతానగర్, కలకత్తా, కోలార్ గోల్డ్‌ఫీల్డ్సు, షోలాపూర్‌లలో ఒక్క సీటునైనా వామపక్ష సంఘటన సంపాదించలేకపోయింది. కార్మికవర్గ అనైక్యత, బలహీనతలకు మచ్చుతునక, కార్మిక, కర్షక పోరాటాలలో రాజకీయ చైతన్యాన్ని కలుగజేయుటలోని విఫలత, అనేక రాష్ట్రాలలో రైతు వుద్యమ బలహీనతను తెలియజేస్తుంది.[2]

---

1. భారత కమ్యూనిస్టు పార్టి చరిత్ర (1977) అధికారపత్రాలు. (ఆంగ్లంలో) ఎన్నికల ఫలితాలు కర్తవ్యాలు, పార్టి లెటర్ నం. 9. ఏప్రిల్ 1952. వా. VII. పే. 10-23.

2. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర (1977) అధికారపత్రాలు (ఆంగ్లంలో) ఎన్నికల ఫలితాలు కర్తవ్యాలు, వా. VIII. పే. 104-5.

కమ్యూనిస్టు పార్టీ, వామపక్షశక్తులు చాల బలహీనంగానేగాక అసమానవ్యాప్తి, తీరతమ భేదం విస్తారంగావుంది. దేశంలో విస్తారమైన అత్యధికభాగంలోని కార్మిక వర్గంలో కమ్యూనిస్టు పార్టీకి నిలకడగల స్థానంలేదు. అత్యధికంగా అణచివేయబడు తున్న రైతాంగంలో, పునాదివర్గమైన వ్యవసాయ కార్మికవర్గంలో చాల బలహీనంగా వుంది. కమ్యూనిస్ట్ పార్టీ విజయాలకు గర్వపడినా, యీ బలహీనతలను మరువ జాలము.

## ఎన్నికల ఫలితాలు ప్రత్యర్థుల స్థితి :

కమ్యూనిస్ట్ పార్టీ, ప్రజాస్వామ్యశక్తుల విజయాలతో ముఖ్యంగా మద్రాసు, ట్రావెంకూరు-కొచ్చిన్, హైదరాబాద్‌లలో కాంగ్రెసు తీవ్ర అపజయాలను పొందు టతో నూతన పరిస్థితు లేర్పడి, నూతన అవకాశాలు కలిగాయి. అత్యధిక మెజారిటి ప్రజాసామాన్యంలో కాంగ్రెసుకు ప్రతిపక్షంగా నిలచింది. మద్రాసు అసెంబ్లీలో 375 స్థానాలలో 152 స్థానాలు, కొచ్చిన్‌లో 108 స్థానాలలో 44 స్థానాలు ప్రతిపక్షాలకు లభించాయి. మొత్తంమీద ప్రజాస్వామ్యపక్షం కాంగ్రెసుకు ప్రతిపక్షంగా ఉంది. ప్రతి పక్షంలో కమ్యూనిస్టు పార్టీ అత్యధికబలం కలిగిన యేకైక పార్టీగవుంది పెప్సూలో గూడ కాంగ్రెసు మైనారిటీ పక్షంగావుంది. ప్రధానశక్తి పెప్సూలో భూస్వాములు, మత అభ్యుదయ నిరోధక అకాలీ పార్టీ కమ్యూనిస్ట్ పార్టి ప్రధానశక్తిగాలేదు ఒరిస్సాలో ప్రధాన ప్రతిపక్షం, మాజీరాజులు, జమీందారులు నాయకత్వం వహించే గణతంత్ర పరిషత్తు ఉంది. ఈ ఐక్య ప్రజాస్వామ్య సంఘటన అధికారం వహించే ప్రశ్న నేడు లేదు.

మద్రాసు రాష్ట్రంలో ఐక్యప్రజాస్వామ్య సంఘటన ప్రభుత్వం యేర్పడుట, ట్రావెంకూర్-కొచ్చిన్‌లలో ఐక్యసంఘటనా యేర్పాటు, దక్షిణాదిలో భాషాప్రయుక్త రాష్ట్రాల యేర్పాటుకు, కార్మికుల, కర్షకుల, వ్యవసాయకూలీల, మధ్యతరగతి ప్రజల సమస్యల పరిష్కారాన్ని చేబట్టి, సహాయ కార్యక్రమాలను, లంచగొండితనాన్ని నల్లబజారు వ్యాపారాన్ని అరికట్టి. పౌరహక్కులు పునరుద్ధరించుటకు పూర్తి అవ కాశాలు కలిగాయి ప్రజలు తమ జీవన విధానాన్ని మెరుగుపరచుకొను పోరాటంలో, వారికి సహాయపడే అవకాశం లభించింది. భూస్వాములు గుత్త పెట్టుబడివర్గాల దోపిడిని, ఈ ప్రభుత్వాలు కొంతవరకు అరికట్టగల అవకాశాలున్నా వాటికిగల పరిమితులను గమనించాలి. కాంగ్రెసు ఎన్నికల ఓటమి ఫలితంగా యేర్పడిన సంకీర్ణ ప్రభుత్వాలు కాంగ్రేసేతర ప్రభుత్వాలు ప్రజాపోరాటాల విజయాల ఫలితంగా యేర్పడినవి కావు. అవి సమిష్టిగా ఎట్టి ప్రజాపోరాటాంలో పాల్గొని వుండలేదు. ఎన్నికల ఐక్యసంఘ టనా ప్రభుత్వాలు తగినంత ఐక్యత, స్థిరత్వం కలిగినవి కావు. ప్రజావుద్యమాలు వేగంగా అభివృద్ధి, ప్రజావొత్తిడి, ఐక్యప్రజావుద్యమం మాత్రమే వాటికి ఐక్యతను, స్థిరత్వాన్ని చేకూర్చగలవు.

ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని యేర్పాటుచేయు అవకాశమున్నపుడు వాటిని యేర్పాటుచేయుట పార్టీ కర్తవ్యం తప్పనిసరియైనది. అవకాశాలను వాస్తవాలు చేయు

టకు అన్ని ప్రయత్నాలు చేయాలి. ప్రజలు ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని వాంచిం చారు. అట్టి ప్రభుత్వ మేర్పాటు పెద్ద ముందడుగు అవుతుంది. ప్రయత్నం విఫల మైనా ప్రజలు ఎవరిపై విశ్వాసముంచవలసింది స్పష్టమౌతుంది తిరిగి కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పడుటకు బాధ్యులెవ్వరో ప్రజలకు తెలుస్తుంది.

పెటీ బూర్జువా "అతివాదులు" దీనిని "అవకాశవాదం, విప్లవ విద్రోహం" అని కేకలు వేయవచ్చు. పాలకవర్గాలు అందుకే కమ్యూనిస్ట్ వ్యతిరేకతను రెచ్చ గొట్టి, స్వతంత్ర అభ్యర్థులను కొంటూ "ఐక్య ప్రజాస్వామ్య సంఘటనా ప్రభుత్వాలు ఏర్పడకుండా, బరితెగించి అన్ని ప్రయత్నాలు చేస్తూ ప్రజలను మభ్యపెట్టుతు వుంటారు [1]

## హైదరాబాద్‌లో జనతా ప్రజాస్వామ్య సంఘటన (పి.డి.యఫ్) సమస్యలు

హైదరాబాద్‌లో ప్రథమ సార్వజనిక ఎన్నికల ముందు, ప్రజాస్వామ్య పార్టీలు, గ్రూపులు, వ్యక్తులు కనీసకార్యక్రమంపై ప్రజలను సమీకరించి కాంగ్రెసును వోడించుటకై జనతా ప్రజాస్వామ్యసంఘటన (పి.డి.యఫ్.)ను యేర్పరచారు. ప్రధా నంగా తెలంగాణాలో నిజాంకు వారితొత్తులైన దేశముఖ్‌లకు, వాళ్ళ సాయుధ దండు లకు వ్యతిరేకంగా భూమి, భుక్తి, స్వాతంత్ర్యంకొరకు రాజీలేని పోరాటం సాగించిన రైతాంగంపై మారణయుద్ధ హింసాకాండ సాగింది. ప్రతిగా సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటాల ప్రతిఘటన జరిగింది. దేశ్‌ముఖ్‌ల జాగిర్దారుల, ప్యూడలు, భూ స్వాముల భూములను స్వాధీనం చేసుకొని రైతులు పంచుకొన్నారు. నైజాం నవాబు సైన్యాలు రైతాంగ గెరిల్లా పోరాటాలను అణచజాలని స్థితిలో కేంద్ర ప్రభుత్వ సైన్యాలు పోలీసు చర్యపేరుతో రైతుపోరాటాలను అణచసాగారు. ఒక్క సైనిక చర్యవలనే రైతుల భూసమస్య పరిష్కరించబడజాలదని కేంద్రప్రభుత్వం భూసం స్కరణలు, ఎన్నికలు ప్రకటించింది. సాయుధరైతాంగ పోరాటాన్ని నడుపుతున్న కమ్యూనిస్టుపార్టీ, దాని ప్రధానాంగమైన ఆంధ్రమహాసభ నిషేధంలో వున్న కారణంగా ఎన్నికల వేదికగా పి.డి యఫ్. యేర్పడింది ప్రజలలో కాంగ్రెసు పాలన యెడల అసహ్యత దానితో పోరాడి పాలనను మార్చాలనే విశాల ఆకాంక్ష వుంది.

అట్టివారికి స్పష్టమైన కార్యక్రమం, దృక్పధం లేనందున అది వొక స్వరూ పాన్ని పొందలేదు కాంగ్రెసు నుండి బయటపడ్డవారు లీగ్ ఆఫ్ సోషలిస్టు వర్క ర్సును స్థాపించి, మరట్వాడాలో తమ కార్యక్రమాలను కొనసాగించారు. నగరానికి పరిమితమై పీపిల్సు డెమోక్రటిక్ పార్టీ నూతనంగా యేర్పడింది. మరాట్వాడాలోని

1. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర (1977) అధికారపత్రాలు (ఆంగ్లంలో) ఎన్ని కల ఫలితాలు, పార్టీ కర్తవ్యాలు. పార్టీ లెటర్ నం. 9. ఏప్రియల్ 1952 ఎన్నికల సమీక్షలోని భాగాలు. వా VIII. పే 113.

పీజెంట్సు అండ్ వర్కర్సు పార్టీ నుండి విడిపోయిన కొందరు "కిసాన్-కాంగార్" పక్షాన్ని స్థాపించారు. ఈ పక్షం సంస్థానంలో బీడ్ జిల్లా బలంగావుంది. ప్రముఖులనేకులు కాంగ్రెసుకు వ్యతిరేకంగా ముందుకొచ్చారు. కాని కాంగ్రెసుకు వ్యతిరేకంగా ఐక్య జనతా ప్రజాస్వామ్య ప్రతిఘటన యెలా రూపొందించాలో సరియైన దృక్పథం కలే ప్రతిష్టంబనకు గురయ్యారు[1].

ఈ పరిస్థితులలో పార్టీ నూతన కార్యక్రమం, ప్రధాన శత్రువులైన ఫ్యూడలిజం, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రజాస్వామ్య శక్తులను సమీకరిస్తూ ప్రధాన పోరాటదిశ నిర్ణయిస్తూ, సమిష్టికార్యాచరణ, ఐక్యసంఘటనకై పిలుపునిచ్చింది. కాంగ్రెసుకు వ్యతిరేకంగా జరిగే ఎన్నికల పోరాటంలో ప్రజాస్వామ్య శక్తులన్నీ కలసి పోరాడవలసిందిగా కమ్యూనిస్ట్‌పార్టీ ఎన్నికలప్రణాళిక పిలుపునిచ్చింది. సంస్థానంలో ప్రతిష్టంభనలోవున్న రాజకీయ శక్తులకు ఈపిలుపు వుత్తేజాన్నిచ్చి, మార్గాన్ని చూపింది.

"ఫలితంగా కమ్యూనిస్టులు, పీపిల్సు డెమోక్రటిక్ పార్టీ కిసాన్ కాంగార్ పక్షం, వీక్ అఫ్ సోషలిస్టు వర్కర్సు, కొంతమంది ప్రముఖవ్యక్తులు కలసి పీపుల్సు డెమోక్రటిక్ ఫ్రంటు (పి డి యఫ్.) కౌనిల్సును యేర్పరచారు. ఇది ఆయావ్యక్తుల, పార్టీల కేంద్రనాయకుల ఐక్య సంఘటన కమిటీగ యేర్పడింది. సోవియట్, చైనాలు గల ప్రపంచ శాంతి శిబిరంతో మిత్రత్వం, ఐక్య ప్రజాసంఘాలనుబలపరస్తూ ప్రజాసేన, కమ్యునిస్టు పార్టీతో ఐక్యత అనే మూడు సూత్రాలు, ఐక్యసంఘటనకు, దాని కార్యక్రమానికి పునాదిరాళ్ళు"[2]

సుప్రసిద్ధ తెలంగాణా పోరాటాన్ని నడపిన కమ్యూనిస్ట్ పార్టి పి. డి. యఫ్.లో వుండుట ప్రజలు గమనించారు. అదే ప్రజల్లో పి డి. యఫ్. పై విశ్వాసాన్ని పెంపొందించింది. ఐక్యసంఘటన వెనుక ప్రజాసమీకరణ కావించబడి, ప్రభుత్వ పైశాచిక నిర్బంధ విధానాన్ని బ్రద్ధలుచేసి, తెలంగాణాలో కాంగ్రెసును చిత్తుగా ఓడించింది.

తెలంగాణా కమ్యూనిస్ట్ పార్టి ముఖ్యులలో అజయ్‌ఘోష్ వుపన్యసించుతు "మనం ఈరోజు కొన్ని రాష్ట్రాలలో ఐక్యసంఘటనా ప్రభుత్వాలను యేర్పరచేందుకు ప్రయత్నిస్తున్నాము....అవి యే రాష్ట్రాలలోనైనా యేర్పడితే దీర్ఘకాలం వాటిని పనిచేయనిస్తారనుకోవటం భ్రమే అవుతుంది. అవి అనేక సమస్యలపై కేంద్ర ప్రభుత్వంతో ఘర్షణపడవలసి వస్తుంది. ఈ విషయాన్ని గుర్తించికూడ మనం ఐక్య సంఘటనా ప్రభుత్వ నిర్మాణాన్ని కోరుతున్నాం కారణం, ఐక్యసంఘటనా నినాదం శత్రువు క్యాంపును గందరగోళపరచేదానికి, ప్రభుత్వ యంత్రాంగపు బిగువు సడలించే దానికి, ప్రజాపోరాటాన్ని మరో అడుగు ముందుకు తీసుకువెళ్ళడానికి ఉపయోగపడుతుంది. కొన్ని సందర్భాల్లో ప్రజలకు కొన్ని హక్కులు సాధించగలుగు

---

1. ప్రధమ తెలంగాణా కమ్యూనిస్టు మహాసభ (1954) తీర్మానాలు పే. 89-90.
2 ప్రధమ తెలంగాణా కమ్యునిస్టు మహాసభ (1954) తీర్మానాలు. కమ్యునిసుపార్టీ హైదరాబాద్ ప్రచురణ పే. 91.

తుంది. మన పార్టీ కార్యక్రమం కంటె, తక్కువైన కనీస కార్యక్రమంతో ఐక్య సంఘటనా ప్రభుత్వ నిర్మాణానికి పూనుకొనుట గమనిస్తే మనం పిడివాదంతో ఏవో కొన్ని పోరాటాలకు మాత్రమే కట్టుబడివుండకుండా, వాస్తవ పరిస్థితుల కనుగుణంగా పోరాట రూపాలను, ఎత్తుగడలను నిర్ణయించుకొంటున్నామనుట స్పష్టం.

"అయితే ఐక్యసంఘటనా ప్రభుత్వం ఏర్పరచుటకు మన పార్టీ ఆదర్శాలను, సిద్ధాంతాలను వదులుకొని అవకాశవాద ధోరణిలో ఎవరితోబడితే వారితో చేతులు కలుపరాదు. అట్లే మన సిద్ధాంతాల పేరిట, ఆశయాల పేరిట ఉన్న అనుకూల పరిస్థితులను, అవకాశాలను వదలుకొనరాదు. మనం ముఖ్యంగా గుర్తుంచుకొనవలసింది రెండు విషయాలు. ఒకటి, పిడివాద పంథాలో మన నినాదాలు, పోరాటరూపాలు, ఎత్తుగడలు వుండరాదు రెండు, భవిష్యత్తులో మనం ఏమి చేయబోతున్నామో, ఆ యెత్తుగడల వివరాలన్నీ ముందుగానే యిల్లెక్కి కేకలువేయుట పనికిరాదు.[1]"

## హైదరాబాద్ పి. డి. యఫ్. లో రెండు దృక్పథాలు :

"కాంగ్రెసు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ముందుకు వస్తున్న ప్రజాస్వామిక శక్తులను యే రకంగా ఐక్యపరచాలి అనే అంశంపై ప్రధానంగా పి.డి యఫ్. నిర్మాణం, అది యెలా పని చేయాలనే సమస్యమీద (కమ్యూనిస్టు పార్టీకి) మనకు పి డి. యఫ్. లోని యితర మిత్రులకు ఎన్నికల అనంతరం తీవ్ర అభిప్రాయ భేదాలు వచ్చినాయి.[2]"

గోవింద్‌లాల్‌ష్రాఫ్, డా. యం. యన్. జయసూర్య, సోషలిస్టు వర్కర్స్ లీగ్, ప్రజాస్వామ్య ప్రజాపార్టీల నాయకులు భారత కమ్యూనిస్టు పార్టీ పొలిట్ బ్యూరోకు 2 సెప్టెంబరు 1953న లేఖలో హైదరాబాద్ జనతా ప్రజాస్వామ్య సంఘటన పనితీరుపై తమ అసంతృప్తిని వెల్లడించారు. సంఘటన స్వరూపం, నడవడి, పాత్రలపై తమ అభిప్రాయాలను స్పష్టం చేయుటయేగాక, కమ్యునిస్ట్‌పార్టీ వ్యూహం ఎత్తుగడలపై సంఘటనకు సంబంధించినంతవరకు కొన్ని సిద్ధాంతప్రశ్నలు లేవనెత్తారు. వాటిని సంక్షిప్తంగా చెప్పవలసిన అవసరముంది.

1) ఐక్య ప్రజాస్వామ్య సంఘటన వివిధ ప్రజాసంఘాల పునాదిని, ప్రత్యేక నిర్మాణాన్ని, ప్రజాస్వామ్య విధానాన్ని, కార్యక్రమాన్ని తానే రూపొందించుకొని అమలుచేయాలి. అందుకు దానికి ప్రత్యేక క్రమశిక్షణ కలిగివుండాలి. వివిధ పార్టీల ఐక్యసంఘటన నేడు దేశమంతా సమర్థవంతమైన యేర్పాటు కాజాలదు. ప్రజా సంఘాలు సంఘటనకు భూమికయైనచో దేశవ్యాప్తం, వొకే విధమైన లక్షణాలను కలిగి వుంటుంది.

---

1. ప్రథమ తెలంగాణా కమ్యూనిస్టు మహాసభ (1954) తీర్మానాలు. కమ్యూనిస్టు పార్టీ హైదరాబాద్ ప్రచురణ పే. 31-32.
2. ప్రథమ తెలంగాణా కమ్యూనిస్టుపార్టీ మహాసభ(1954) తీర్మానాలు పే. 91-2.

2) రాజకీయ పార్టీలు తాలూకా, జిల్లా, రాష్ట్ర, అఖిల భారత ఐక్యసంఘటన లలో వివిధ స్థాయిలలో ప్రాతినిధ్యం కలిగివుండాలి. ప్రజాసంఘాల ప్రాతినిధ్యం, రాజకీయపార్టీల ప్రాతినిధ్య ప్రాముఖ్యతకు మించివుండరాదు.

3) ప్రజాసంఘాలు ఆర్థిక సమస్యలకు సంబంధించినంతవరకు పూర్తి స్వాతంత్ర్యం కలిగివుండాలి. వాటి రాజకీయాభిప్రాయాలు ఐక్యసంఘటనా అభిప్రాయాలతో పూర్తి యేకీకరణ వుండాలి. ఐక్యసంఘటనే రాజకీయాభిప్రాయ వేదిక కావాలి. ఐక్య సంఘటన అన్ని స్థాయిలలో వారికి ప్రాతినిధ్యముండాలి, తప్పనిసరిగా అనుబంధ సంస్థలుగా పనిచేయాలి.

4) ఐక్యసంఘటనలోని పార్టీలన్ని వుమ్మడి కార్యక్రమాన్ని సంఘటన వేదికపైనే ప్రచారం చేయాలి. విభేదాలను వారి పార్టీ వేదికలపై ప్రచారం చేసుకో వాలి. ప్రజోద్యమాలకు సంబంధించి అన్ని ఆచరణ కార్యక్రమాలు ఐక్యసంఘటన ఆధ్వర్యంలో జరగాలి.

5) ఐక్యసంఘటన వేదికపైన ఎన్నికైన కమ్యూనిస్టు పార్లమెంటు సభ్యులు పార్లమెంటులోని కమ్యూనిస్ట్ ప్రతిపక్షంగాకాక, ఐక్యసంఘటనా సభ్యులుగ వ్యవ హరించాలి.

6) హైదరాబాద్ సంస్థాన ప్రజలు ఐక్యసంఘటనగా ఆలోచించారేకాని, రాజ కీయ పార్టీల సభ్యులుగా ఆలోచించలేదనుటకు స్థానిక అనుభవాలు చాలు:

7) ఐక్య సంఘటనలో ఏకగ్రీవ నిర్ణయాలు సాధ్యం కానప్పుడు మూడింట రెండు వంతుల మెజారిటీతో నిర్ణయాలుచేయగలిగిన కార్యక్రమాల ఆచరణ వేగంగా జరుగుటతో ప్రజలు పోరాట సుముఖులగుదురు. ప్రజోద్యమాలు చొరవతో పురోగ మిస్తాయి.

8) భారత కార్మికవర్గం రైతుల పోరాటాలకుగాని, యితర శ్రామిక పోరాటా లకుగాని నాయకత్వం వహించి నడుపలేదు. రష్యన్ కార్మికవర్గం 1918లో సామా జిక విప్లవ చైతన్యాన్ని అభివృద్ధిచేసినట్లు చేయలేదు. ఆచరణలో కార్మికవర్గ నాయ కత్వం అంటే కమ్యూనిస్టుపార్టీ నాయకత్వమైంది. మా అనుభవంలో కార్మికవర్గ నాయకత్వాన్ని కమ్యునిస్టు నాయకత్వంతో సమానంచేసింది. కారణం కమ్యూనిస్టు పార్టీ తనను తప్ప మరే యితర పార్టీని కార్మికవర్గ పార్టీగ గుర్తించదు. మా అభి ప్రాయం పొరపాటుగావచ్చు, కాని కమ్యూనిస్టుపార్టీ క్రిందినాయకత్వం వారి కార్యా చరణ ద్వారా మాకు కలుగజేసిన అభిప్రాయమిది. ఈ నేపథ్యంలో కార్మికవర్గ నాయ కత్వం అనే నినాదం యేవిధంగా ప్రతి ఐక్య సంఘటనపై పార్టీ నాయకత్వాన్ని అన్ని వ్యూహాత్మక స్థానాలలో నెలకొల్పుట తప్ప మరొకటిగాదు.

9) చైనాలో వివిధ వర్గాలు తమ అభిప్రాయాలను వెలిబుచ్చుటకేగాక, ఆచర ణలో కమ్యూనిస్టుల పరిపాలిత ప్రాంతాలలో 3-3-3 సూత్రాన్ని అమలుచేశారు, పరిపాలనా యంత్రాంగలో, ఐక్య సంఘటనా నిర్మాణంలో, ప్రజా రాజకీయ సలహా

సంఘాలలో ఒక వంతు కమ్యూనిస్టులు, ఒకవంతు కొమింగుటాంగు, మూడోవంతు ప్రజాస్వామ్య పక్షాల తదితర ప్రతినిధులు వుండే ప్రాతినిధ్యాన్ని అనుసరించారు. ఈ విధంగా సన్‌యత్ సెన్ మూడు సూత్రాలను అమలుచేశారు.

10) కమ్యూనిస్టుపార్టీ విధానాలు 'మాస్కోలో కొమింటర్న్ లేక కొమిన్ ఫారం'చే నిర్ణయింపబడుతున్నవి. 'హింసావాదాన్ని' లేక 'సాయుధ పోరాటాన్ని' విశ్వసించుతున్నారు వీటిని విడనాడాలి.

జనతా ప్రజాస్వామ్య సంఘటన సమస్యలపై హైదరాబాద్ ఫ్రంట్ నాయకులు లేవనెత్తినపై ప్రశ్నలకు, కేంద్రసమితి చర్చించిన మీదట నవంబరు 1953లో సమాధానాలు వివరంగా యిచ్చారు. ఈ సుదీర్ఘ సమాధానలేఖను సంక్షిప్తంగా తెలుసుకొన్న ఐక్య సంఘటన నిర్మాణం, పని విధానాలపై కమ్యునిస్టు పార్టీ పూర్తి అవగాహన తెల్లియగలదు.

ప్రజాస్వామ్య పార్టీలు ఐక్య సంఘటనపై కమ్యునిస్టుపార్టీ అవగాహనను తెలుసుకొన ప్రయత్నించుట సహజం, సరియైనది. ఐక్య సంఘటనా సమస్యలపై ప్రశ్నలు లేవనెత్తుటతోపాటు లేఖలో నిరాధార ఆరోపణలు, అపవాదులు సాధారణ కమ్యూనిస్టు వ్యతిరేకులవలెనే చేయుట పార్టీకి విచారాన్ని కలుగజేసిందని తెలిపింది. భారతదేశంలో అన్ని ప్రజాస్వామ్య పక్షాల ఐక్యసంఘటనా అభిప్రాయాన్ని ప్రవేశ పెట్టింది భారత కమ్యునిస్టుపార్టీ, గతంలో అట్టి సంఘటనకు ప్రయత్నించాం యిక ముందు ప్రయత్నిస్తామన్నారు. అభివృద్ధి నిరోధక కాంగ్రెసు పాలనను తుద ముట్టించుటకు అన్ని ప్రజాస్వామ్య పార్టీల, గ్రూపుల, వ్యక్తుల సంఘటన అవసర మని కమ్యూనిస్టుల అవగాహన, విశ్వాసం. భారతదేశానికి ఏకపార్టీ పాలన సరియైనది కాదని, అన్ని ప్రజాస్వామ్య పార్టీల సంయుక్త-కొయలిషన్ పాలన తగినదని కమ్యునిస్టుల నమ్మకం, ఆ విశ్వాసంతోనే ట్రావెంకూర్-కొచ్చిన్, హైదరాబాద్, మద్రాసు, బెంగాల్, యు. పి.లలో, ఒక్కమాటలో వీలైన అన్ని రాష్ట్రాలలో అట్టి ప్రయత్నాలు చేసింది.

ఐక్యసంఘటనకు "ప్రత్యేక పునాది, నిర్మాణం, క్రమశిక్షణను, ప్రజాసంఘాలు పునాదిగా" దేశవ్యాప్తంగా వొకే విధమైన లక్షణాలను కలిగి వుండాలనుట, సంఘటనను ఒక రాజకీయ పార్టీగా నిర్మాణం చేయుటతప్ప మరొకటిగాదు. ప్రజాసంఘాలు ఆర్థిక సమస్యలలో స్వాతంత్ర్యం కలిగివుండి, రాజకీయ విషయాలలో ఐక్యసంఘటనాభిప్రాయంతో పూర్తి ఏకీభావం వుండాలనుటకూడ, దానిని రాజకీయపార్టీగ చేయాలనే అభిప్రాయాన్నే బలపరస్తుంది. సంఘటన తానే కార్యక్రమాన్ని, రాజకీయ విధానాన్ని రూపొందించుకొని, స్వయం క్రమశిక్షణ విధానంతో వొక "సూపరు పార్టీని" నిర్మించే ప్రయత్నంగా జయసూర్య, గోవింద్‌లాల్‌శ్రాఫ్‌ల అవగాహనగ కన్పడుతున్నది. ఇది ఐక్యసంఘటనా అవగాహన మాత్రం కాజాలదు. వివిధ పార్టీల, గ్రూపుల, వ్యక్తుల స్వాతంత్ర్యం ఐక్యసంఘటన భూమిక, అవి వొప్పందాల ప్రాతిపదికగా ఐక్యకార్యాచరణకు పూనుకొంటాయి, కొన్ని ప్రత్యేక సమస్యలపైగావచ్చు లేక అంగీకృత సామాన్య కార్యక్రమమూ కావచ్చు.

కమ్యూనిస్టు పార్టీ ఐక్యసంఘటనా అవగాహన, సామ్రాజ్యవాద, భూస్వామ్య వ్యతిరేక సంఘటన, అట్టి కార్యక్రమాన్నే ప్రజల ముందుంచింది. ఆ కార్యక్రమం ఒక్క భూస్వాములు భూస్వాములకు తప్ప అందరికీ, అన్ని వర్గాలకు ఆమోదయోగ్య మైనదని పార్టీ నమ్మకం. ఈ వర్గాలకు పరస్పర వైరుధ్యాలు ప్రయోజనాలు ఉన్న ప్పటికి సామ్రాజ్యవాదం, భూస్వామ్యవిధానం అందరి సామాన్య శత్రువులు, దేశాభివృద్ధికి ఆటంకమైన కారణంగా, అన్ని వర్గాల ప్రయోజనాల అవగాహననుండి ఐక్యసంఘ టన రూపొందుతుంది. ఇది కమ్యూనిస్టుల అవగాహన.

దేశంలో వివిధ ప్రజాస్వామ్య రాజకీయ పార్టీలు, గ్రూపులు, కొన్ని దేశ వ్యాప్తంగా, కొన్ని రాష్ట్రాలకే పరిమితమైనవి, వివిధ వర్గాలకు చెందినవి కొన్ని, మరికొన్ని కొన్ని వర్గాలకే చెందినవి ఉన్నవి. ఈ పార్టీలకు వాటి ఆశయాలు, రాజ కీయ, నిర్మాణ, అవగాహనలున్నవి. ఏ పార్టీ, ఏ వర్గానికి ఎంతవరకు ప్రాతినిధ్యం వహిస్తుంది, ఏ పార్టీ సిద్ధాంతం, ఆచరణ యెంతవరకు సరియైనదనే చర్చ అప్ర స్తుతం. ఈ వాస్తవాన్ని పరిగణించుట ముఖ్యం.

రాజకీయ పార్టీల, గ్రూపుల స్వతంత్ర ఆచరణ, ప్రశ్నించిన వారి అభి ప్రాయం ప్రకారం, ప్రచారపార్టీల, గ్రూపులకు కుదించబడి, ప్రజావుద్యమాల కార్యా చరణ ఐక్యసంఘటనద్వారా మాత్రమే కొనసాగుటతో పార్టీల స్వతంత్ర రాజకీయ కార్యాచరణ సూన్యమగుతుంది. దాని అర్థం వివిధ రాజకీయ పార్టీల దైనందిన సమస్యలపై ప్రజోద్యమాల స్వతంత్ర కార్యాచరణకు యేమాత్రం అవకాశముండదు.

అటి ఐక్య సంఘటన అవగాహన నేడున్న వివిధ పార్టీలను ఒక్కచోటికి తీసుకొని వచ్చుటకుపయోగపడదు. నేటి పోరాటదశలో ఈ పరిస్థితులలో నేటి ప్రజా స్వామ్య రాజకీయపార్టీలను వొక అంగీకృత సామాన్య కార్యక్రమం రూపొందుటకై కూడ గట్టుట కష్టమౌతుంది. ఉదాహరణకు సూత్రప్రాయంగా మార్క్సిజాన్ని అంగీ కరించే రివల్యూషనరి సోషలిస్టు పార్టి, పార్వర్డుబ్లాకు, పేజంట్సు అండ్ వర్కర్సు పార్టీలు అనేక ముఖ్య జాతీయ, అంతర్జాతీయ మౌలిక సమస్యలపై ప్రధాన భేదాలు న్నపుడు సహజంగానే ఆచరణలో దైనందిన సమస్యలపై అనేక భేదాభిప్రాయాలు వస్తవి.

ప్రజా సోషలిస్టుపార్టీని, అనేక యితర గ్రూపులను, కాంగ్రెసు నాయకత్వం పై అసంతృప్తి చెందిన అనేకమంది కాంగ్రెసు వారిని ఒక మిత్రకూటమిగ చేయవల సిన అవసరమెంతోవుంది. ఇది గుర్తించనందున హైదరాబాద్ ప్రజాస్వామ్య సంఘ టన పేజంట్సు అండ్ వర్కర్సు పార్టీతో కలసి కనీసం సీట్లలో త్రికోణపు పోటీలను నివారించుటకై వొప్పందానికి వచ్చుటను నిరాకరించింది. ఫలితాలు తెలిసినవే, అప జయం అంతటా కలిగింది.

పార్టీ కనీస కార్యక్రమాన్ని లేక మరో పార్టీ లేక గ్రూపు కార్యక్రమాన్ని తప్పనిసరిగా అంగీకరించాలనే షరతు ప్రజాస్వామ్య పార్టీల, గ్రూపుల, వ్యక్తులంద రిని వొక కూటమిగ యేర్పరచుటకు తోడ్పడదనుట స్పష్టం.

నేటి వాస్తవ పరిస్థితులలో వివిధ పార్టీలు, గ్రూపులు సమీకరించబడుటకు, ఎక్కడ యే దైనందిన సమస్యలపై ప్రజోద్యమాలను నడుపగలిగితే ఆ విధాన క్రమంలో ఐక్యసంఘటనాభివృద్ధియిమిడివుంది. ప్రజాపోరాటాలను నడిపిన ఫలితంగా పార్టీల మధ్య సమిష్టి అవగాహన అభివృద్ధిచెందే క్రమంలో సమిష్టి కార్యాచరణ స్పష్టమైన రూపాన్ని సంతరించుకొంటుంది. అటువంటి కార్యక్రమంపై ఒప్పందా లతో సమిష్టి పోరాటాలు విస్తృతి చెందుతవి. ప్రజల సమిష్టి పోరాటాల అభివృద్ధికి తోడ్పడేదంతా, ఐక్య సంఘటనాభివృద్ధికి తోడ్పడుతుంది. ఇదే గీటురాయి.

అఖిలభారత వ్యాప్తిగల పార్టీలు, గ్రూపులు లేవని మీనమేషాలు లెక్కపెట్టు టతో అర్థంలేదు. వామపక్ష ఐక్యత నిర్మించే ప్రయత్నమొక్కటే చాలదు. ప్రజా స్వామ్య పార్టీల,గ్రూపుల, వ్యక్తుల విస్తృత ఐక్యసంఘటన నిర్మించుటయే కర్తవ్యం.

స్థానిక సమస్యల, కోర్కెలపై కలసి ఐక్యకార్యాచరణ ఒప్పందానికి సిద్ధ పడిన యే రాజకీయ పార్టీ, గ్రూపు, వ్యక్తులైనా వారితో సఖ్యతకు సిద్ధపడాలి. ఒప్పందం యే వొక్క సమస్యపైనైనా కావచ్చు, లేదా పెక్కు సమస్యలపైనైనా కావచ్చు. ఈ విధమైన ఐక్య కార్యాచరణ ప్రత్యేక సమస్యపై ఐక్య ప్రజాస్వామ్య సమితులను నిర్మించుట, క్రమేణా వివిధ వర్గాలమధ్య విస్తృత అవగాహనకు దారి తీసి, దగ్గరకు చేర్చి, చివరకు బలీయ సమిష్టి బంధనాల ఐక్యప్రజాస్వామ్య సంఘ టన నిర్మాణానికి దారితీస్తుంది.[1]

"పి. డి. యఫ్"ను దాదాపు ఒక ఏకీకృత రాజకీయ సంస్థగా తయారుచేసే యీ దృక్పథంతో కమ్యూనిస్టు పార్టీ సూత్రప్రాయంగా అంగీకరించజాలదు. వివిధ పార్టీల, గ్రూపుల, వ్యక్తుల కలయికయే పి. డి. యఫ్ అన్న భావనకే యిది విరుద్ధం అనుబంధసంస్థల వ్యక్తిత్వాన్ని అణచే ప్రయత్నం చేస్తే, యితరులు తమ వ్యక్తి త్వాన్ని కోల్పోతామనే భయంతో పి. డి. యఫ్.లో చేరుటకు జంకుతారు. ఇది పి.డి, యఫ్ అభివృద్ధికే ఆటంకము.[2]"

ఈ భేదాభిప్రాయాలు ఐక్య ప్రజాస్వామ్య సంఘటన, ప్రజాసంఘాల మధ్య సంబంధాలకు విస్తరించాయి.

ప్రజాసంఘాలు ఐక్యవర్గ సంఘాలు. అవి వాటి హక్కులను యే వొక్క రాజకీయ పార్టీకి సమర్పించుకొనజాలవు.అట్టి వాటిని ఆర్థికసమస్యలలో స్వతంత్రత, రాజకీయ విధానాలలో ఐక్యసంఘటనతో పూర్తిగ అనుసరించాలనుట ఆమోదయోగ్యం కాదు. అట్టి ప్రయత్నం ప్రజాసంఘాల విచ్ఛిన్నానికి దారితీస్తుంది.జాతీయ కాంగ్రెసు, సోషలిస్టులు వారి ట్రేడు యూనియనులు, ప్రజాసంఘాలు స్థాపించారు. ఈ విధానం ప్రజాసంఘాల విచ్ఛిన్నానికి దారితీసింది. గత కొన్ని సంవత్సరాలనుండి కార్మిక

---

1. భారత కమ్యూనిస్టు పార్టి చరిత్ర (1977) అధికారపత్రాలు. వా. VII. పే. 269-71.

2. ప్రథమ తెలంగాణా కమ్యూనిస్టుపార్టీ మహాసభ(1954) తీర్మానాలు పే. 92-3.

వర్గం, తదితరులు యీ అనైక్యత తమ పోరాటాన్ని బలహీనపరుస్తుందని గుర్తించారు. ఫలితంగా ఐక్యతావాంఛ త్వరితంగా పెరుగుతున్నది. ప్రజాసంఘాలు ఐక్య సంఘటనా విధానాలను అనుసరించాలనుట ప్రజాసంఘాలను విచ్ఛిన్నం చేయాలను వారికి ప్రోద్బలం యిచ్చినట్లగుతుంది. ట్రేడు యూనియన్‌ల, కిసాన్‌సభల ఐక్యత కై పోరాటం సాగించవలసిన నేటి పరిస్థితులలో ఐక్యసంఘటనలకు ప్రజాసంఘాలు అనుబంధ సంస్థలు కావాలనుటను తీవ్రంగా ఎదుర్కొని పోరాడవలసివుంది. అదే విధంగా యే రాజకీయ పార్టీయైనా, యే సంస్థయైనా కార్మిక సంఘాలను అనుబంధ సంస్థలుగ చేయు ప్రయత్నాన్ని యెదిరించాలి. అది ఐక్యసంఘటనగా వచ్చు, కాంగ్రెసు లేక కాంగ్రెసు సోషలిస్ట్ పార్టీగా వచ్చు, మరే పార్టీయైనా గావచ్చు. సూత్రబద్ధంగా వ్యతిరేకించవలసివుంది. రాజకీయ పార్టీలకు ప్రజాసంఘాలు అనుబంధ సంస్థలుగా ఉండాలనే సిద్ధాంతాన్ని కమ్యూనిస్ట్ పార్టీ తీవ్రంగా వ్యతిరేకిస్తుంది.[1]

"ప్రజాసంఘాలు చీలికలై వివిధ రాజకీయ పార్టీల మధ్య చీల్చబడి ఉంటున్న యీ దశలో, నేడు వాటిని సమిష్టిగా అనుబంధించడం, వారి జీవన ప్రమాణం పెంపుదలకు, రోజువారి కోర్కెలకై సాగించే పోరాటంలో నిర్మించాల్సిన ఐక్యతకు హాని కలిగిస్తుంది....ప్రజా సంఘాలను రాజకీయం పంథాల మీద విడదీసే ప్రయత్నం, ఉమ్మడి శత్రువుమీద రోజువారి కోర్కెలకోసం, హక్కుల కోసం అవి సాగించే పోరాటంలో వాటిని నిరాయుధం చేస్తుంది[2].

పార్లమెంటు, అసెంబ్లీలలో ఐక్యసంఘటన పార్టీ సంబంధాలలోకూడ కొన్ని భిన్నాభిప్రాయాలు తలెత్తాయి

కమ్యూనిస్టుపార్టీ కేంద్రసమితి మార్చి, 1952 తీర్మానం పార్లమెంటులో పార్టీ అనుసరించవలసిన విధానాన్ని వివరించింది. అది ప్రకటించబడింది. కమ్యూనిస్ట్ పార్లమెంటు సభ్యుల సమావేశంలో, డాంగే తీర్మానాన్ని వివరించారు. డా॥ జయసూర్య ఆ సమావేశంలో పాల్గొన్నారు. ఎట్టి వ్యతిరేకతను తెలుపలేదు. దాని ననుసరించి సమన్వయ కమిటీని, వివిధ రాజకీయ పార్టీల, గ్రూపుల, వ్యక్తులమధ్య అవగాహనలను పెంపొందించుటకు యేర్పరచుట జరిగింది. ప్రతి పార్టీ తన పేరుమీదగాని, ఐక్యసంఘటన పేరుమీదగాని ఐక్యప్రతిపక్షంగా పనిచేయవచ్చు. ఈ కారణం చేతనే చాలవరకు ఐక్యతను, ఒప్పందాన్ని కొనసాగించగలిగారు. యునైటెడ్ సోషలిస్టు ఆర్గనైజేషన్, పి.డి.యఫ్ కేరళ సోషలిస్టుపార్టీలు నిరాధారనిందలువేసినా ఐక్య ప్రజాస్వామ్య సంఘటన కారణంగా వదలివేయుట అనేకసారులు జరిగింది.

వీటినిబట్టి ఐక్య సంఘటనను నిర్మించుట, బలపరచుట కమ్యూనిస్టుపార్టీ అభిప్రాయాలను యితర పార్టీలపై రుద్దుటకు కాదు అనేది స్పష్టంకాగలదు. ఇతరులు పార్టీ కార్యక్రమాన్ని ఆమోదించాలని, ఐక్య సంఘటనలో కలసిపోవాలని వొత్తిడి

---

1. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర (1977) అధికారపత్రాలు. వా. VIII. పే. 272-73.
2. ప్రథమ తెలంగాణా కమ్యూనిస్టు మహాసభ (1954) తీర్మానాలు పే. 93.

చేయదు. ప్రతిపార్టి, గ్రూపు, వ్యక్తులు ఆమోదించిన అంశాలపైనే సహకారానికి ప్రయత్నిస్తుంది. ఆ విధంగానే అంగీకృత అంశాలపైనే దేశవ్యాపిత ఐక్య సంఘటనను, వివిధ పార్టీల, గ్రూపుల, వ్యక్తుల స్వాతంత్ర్యానికి దెబ్బతగలకుండా నిర్మించే అవకాశాలను పెంపొందించగలమని లేఖ తెల్పింది.

సంస్థాన ప్రజలు ఐక్య సంఘటనగా ఆలోచించారేగాని, కమ్యూనిస్ట్ పార్టీ విషయం ఆలోచించలేదనుట అసంగతం, నిషేధంలోవున్న కమ్యూనిస్టుపార్టీ, వారి నాయకుల పాత్ర ఐక్య సంఘటనలో వుండుటనే ప్రజలు ప్రధానంగా చూసారు. అదే వారిని వుత్సాహ పరచింది. తెలంగాణాలో జరిగినదిదే.

సంఘటనలో మూడింట రెండువంతుల మెజారిటీతో నిర్ణయాలు తీసుకొనవచ్చు అనే అభిప్రాయంపై కమ్యూనిస్టుపార్టి యిలా వివరించింది. కలకత్తా, హైదరాబాద్, మద్రాసు అనుభవాలు ఆ విధంగా యేర్పడిన ఐక్య సంఘటనలు యేర్పడి బల పడుటకు బదులు విచ్ఛిన్నమగుటో లేక సంఘటన ఆశయాలకు భిన్నంగా జరుగుటో జరిగే అవకాశముందని తెలిపాయి. ఐక్య సంఘటనా కమిటీలు ఎంత చిన్న గ్రూపుకైనా వ్యక్తులకైనా సమాన ప్రాతినిధ్యంతో యేర్పాటు అయ్యాయి. ప్రజా బలం ప్రాతిపదిక తీసుకొనబడలేదు ప్రజాబలంగల యే పార్టీయైనా వొక సమస్యపై తన అభిప్రాయాన్ని విడజాలనపుడు, మెజారిటి సభ్యులు ప్రజాస్వామిక పద్ధతిలో తీసుకొన్న నిర్ణయాలను ఒక పార్టీ ఆమోదించుటలేదనే నిందా ప్రచారం మొదలిడుతారు. ఈ ప్రజాస్వామ్య మెజారిటీ నిర్ణయానికి వెనుక మెజారిటి ప్రజాసామాన్యపు బలం లేదనేదికూడ స్పష్టమే. అందువలన ఆ ప్రజాబలం గల పార్టీ, పార్టీ బలాలపై సంఘటనల కమిటీలు యేర్పడాలని కోరితే, అది చిన్నపార్టీలకు. గ్రూపులకు కష్టతరమైన పరిస్థితిని కలుగజేస్తుంది. ప్రజాబలంగల పార్టీ యితరులను మ్రింగివేయుటకు ప్రయత్నిస్తుందనే నిందా ప్రచారానికి అవకాశముంది. ఆ విధంగా అయితే సంఘటనా కమిటీలే యేర్పడే అవకాశముండదు. అందువలనే ఐక్యసంఘటన కమిటీలు యేకగ్రీవపు నిర్ణయాలనే తీసుకొంటున్నాయి.

హైదరాబాద్‌లో జనతా ప్రజాస్వామ్య సంఘటన అసెంబ్లీ గ్రూపుకు సంబంధించినంతవరకు వచ్చే సమస్యలపై వొప్పందం ప్రాతిపదికగా పనిచేయవలసి ఉంది. వొప్పందం కుదరని సమస్యలపై ప్రతి పార్టి తమ తమ నిర్ణయాలను చేసుకొనే స్వాతంత్రం వుంది. అసెంబ్లీలోని సంఘటన కమిటి అసెంబ్లీ కార్యక్రమాలను కొనసాగించుటకు, అసెంబ్లీలో సమస్యలపై పోరాటాలకు, దానికి మద్దతుగా బయట, ఐక్యసంఘటనా ఆందోళనోద్యమాలను పోరాటాలను కొనసాగించవలసి ఉంటుంది. ఈ లక్ష్యాలకు మెజారిటి నిర్ణయ సిద్ధాంతం తోడ్పడదు, అందుకే ఏకగ్రీవ నిర్ణయాల అవసరము.

కార్మికవర్గ నాయకత్వ విషయమై కొందరు చేసిన వ్యాఖ్య కమ్యూనిస్ట్ పార్టీని ఆశ్చర్యంలో ముంచింది. "కమ్యూనిస్టులు ఎప్పుడూ కార్మికవర్గ నాయకత్వం నిర్మించబడుతుందని గొంతు చించుకొని చెప్పలేదు. వివిధ వర్గాలు వారి కోరికలకై జరిగే

పోరాటంలో, వాటికి మద్దతుగా కార్మికవర్గం పోరాటాలలో పాల్గొని వహించే పాత్ర, నాయకత్వాన్ని పోరాట ప్రజలు ఆమోదించుతారు."

"కార్మికవర్గం, రైతువర్గపు సహకార మైత్రితో ఎంతవరకు విప్లవోద్యమాన్ని నిర్మించగలుగుతారో ఆ మేరకు మధ్యతరగతిలోని కొన్నిభాగాలు, మేధావివర్గాలు, తదుపరి జాతీయ బూర్జువావర్గం, ఐక్య ప్రజాస్వామ్య సంఘటనలో సమీకరించబడు తుంది.[1]"

చైనీస్ కమ్యూనిస్ట్‌లు అనుసరించిన "మూడు-మూడు-మూడు" విధానం ఐక్యప్రజాస్వామ్య వుద్యమాన్ని నిర్మించ ప్రారంభించినపుడు అనుసరించ లేదు, విప్లవం బాగా పురోగమించినపుడు, పోరాటాలలో ఐక్యసంఘటన అభివృద్ధి చెంది, ప్రజాప్రభుత్వ సలహా సంఘాల ఎన్నికలు విముక్తి ప్రాంతాలలో జరిగినపుడు అనుస రించారు. ఈ సలహా సంఘాలలోవారు యీ 3-3-3 ప్రాతినిధ్య విధానాన్ని అనుసరిం చారు.

"ఇక్కడ ఐక్యసంఘటన వుద్యమం ప్రాధమిక దశలో వున్నపుడు, ఆ ఉదా హరణలను పేర్కొనుటలో ఉపయోగం లేదు.[2]"

"కార్మికవర్గ నాయకత్వం అంటే ఆచరణలో కమ్యూనిస్టుపార్టీ నాయకత్వ మైంది" అని లేవనెత్తిన సమస్య ఐక్య సంఘటనా సమస్యకాదనేమొ సమాధానం యివ్వలేదు. అదేవిధంగా కమ్యూనిస్ట్‌పార్టీ తనను తప్ప మరేయితర పార్టీని, కార్మిక వర్గ పార్టీగ గుర్తించదు" అనే విషయాన్ని వదలివేయుట జరిగింది.

కమ్యూనిస్టుల దేశభక్తి అంటే దేశప్రజలపై విశ్వాసం ఆశయం, స్వాతం త్ర్యం. ఆ స్వాతంత్ర్యంకోసం పోరాడారు. ప్యూడలు ప్రభువుల గుత్త పెట్టుబడు దారుల, వారి పార్టీలు దేశప్రయోజనాలకు, స్వాతంత్ర్యధ్యేయానికి, భారత ఐక్యతకు చేసిన ద్రోహం ఎప్పుడూ బట్టబయలు చేస్తారు.... వారి కార్యక్రమం మనదేశ స్వాతంత్ర్యం, సర్వాసత్తాకతను కాపాడితే. దానికై నిరంతరంపోరాడుతారు. కమ్యూ నిస్టుల విధానాలు మాస్కోలో నిర్ణయింపబడతాయనే నింద ప్యూడలు గుత్తపెట్టుబడి దారులు, సామ్రాజ్యవాదులు చేయునిందను పునశ్చరణచేయుట తప్ప మరొకటి గాదు[3].

"ఈనాడు యీ ప్రశ్నను ఎందుకు లేవనెత్తుతున్నారని తప్పనిసరిగా అడగ వలసివుంది. ఎవరైనా మీరు యీ ప్రశ్నను హైదరాబాద్ ప్రభుత్వాన్ని, భూస్వాము లను, రైతులను దోపిడి, హత్యలు విచ్చలవిడిగా చేసిన వారి గూండాలను అడిగి వుండవలసింది. తెలంగాణా గ్రామాలలో యీ సాయుధ గూండాలు చేసిన మారణ హోమం జగద్విదితమూ, మరువరానిది[4]"

---

1. భారత కమ్యూనిస్ట్ పార్టీ చరిత్ర (1977) అధికారపత్రాలు వా VIII పే.279.
2. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర (1977) అధికారపత్రాలు. వా VIII. పే. 279-80.
3. అదే పే. 281-2
4. అదే పే. 283.

అంతర్జాతీయ అనుభవాలను గ్రహించుట, అంతర్జాతీయ పరిస్థితి, కార్యక్రమాలకు భారతదేశ కార్యక్రమాలను సమన్వయం చేసుకొనుటనే "మాస్కోలో విధానం నిర్ణయం" అనుట నిందతప్ప మరొకటిగాదు. అయితే అంతర్జాతీయ రాజకీయాలకే అధిక ప్రాధాన్యతనిచ్చుట, యిట్టి నిందా ప్రచారానికి అవకాశం ఇచ్చింది.

ప్రథమ తెలంగాణా కమ్యూనిస్టు మహాసభ 1954 పి డి యఫ్.లోని సంబంధితులందరూ కూర్చొని విశాల ఐక్యత, ఐక్యకార్యాచరణ ప్రాతిపదికగా తక్షణ కార్యక్రమాన్ని రూపొందించాలని, కమ్యూనిస్ట్ పార్టీ ఆ కార్యక్రమానికి ఈ క్రింది సూచనలు యిచ్చింది[1]

విదేశాలకు లాభాల ఎగుమతి నిషేధం, గుత్త వ్యాపారుల లాభాలకు గరిష్ట పరిమితి నిర్ణయం, కార్మికుల జీవన ప్రమాణాన్ని పెంచుట, నూతన పరిశ్రమలను తెరచుట, చిన్న పరిశ్రమలకు సహాయం చేయాలి. లాకౌటులను, రిట్రెంచిమెంటు నిషేధించి, నిరుద్యోగులకు జీవన బృతి, ప్రజాస్వామిక పన్నుల విధానం చేబట్టాలి. పరిశ్రమలకు సహాయం చేయాలి".

హైదరాబాద్‌ను విభజించి భాషా ప్రయుక్త రాష్ట్రాలు యేర్పాటుచేయుట, రాజప్రముఖ్ పదవిని, భరణాన్ని, జాగీర్దారులకు, పెద్దభూస్వాములకు నష్టపరిహారాన్ని రద్దుచేయాలి.

భేదఖళ్ళను అరికట్టి దీర్ఘకాలపు ఋణాలను రద్దుచేసి, ప్రభుత్వ, గరిష్ట పరిమితికి మించిన భూ కమతాల భూములను వుచితంగా వ్యవసాయ కూలి, పేద రైతులకు పంచాలి. నందికొండ, పూర్ణాప్రాజెక్టులను త్వరితం చేయాలి. చిన్న ప్రాజెక్టులను ప్రారంభించటం, రైతుల పంటలను, ధరలను స్థిరీకరించాలి.

విద్య, వైద్య సౌకర్యాలను విస్తృతపరచుట, పూర్తి పౌరహక్కుల పునరుద్ధరణ, గృహపరిశ్రమలను, సహకార సంఘాలను ప్రోత్సహించాలి.

ఆటవిక తెగల, వెనుకబడిన జాతుల ఆర్థిక, సాంస్కృతాభివృద్ధికి ప్రత్యేక సదుపాయాలు, న్యాయమైన హక్కులరక్షణ, మైనారిటీల హక్కులను బలపరచి, ప్రజాస్వామికోద్యమంలో సమీకరించాలి.

కార్యక్రమాన్ని రూపొందించుటకు, పై సూచనలను చర్చించుటకు ఒక సదస్సును పిలవాలని కమ్యూనిస్టుపార్టీ భావిస్తున్నది. ఈ కార్యక్రమానికి అనుగుణమైన జనతా ప్రజాస్వామ్య సంఘటన స్వరూపం, పార్టీల, గ్రూపుల, వ్యక్తులయొక్క ఐక్య సంఘటనగానే వుండగలుగుతుంది.

అందుచేత పి.డి.యఫ్.ను నిలబెట్టుటకు, నిర్దిష్టమైన సమస్యలపై విశాల ప్రజానీకాన్ని సమీకరించుటకు, ప్రత్యేక ఐక్య సంఘటన కమిటీలను నిర్మించుటకు అత్యధిక ప్రాముఖ్యతనివ్వాలి. ఈ మూడు కర్తవ్యాలను వొకేసారి నిర్వహించగలిగితేనే మన గమ్యానికి దగ్గరగా చేరగలము.

---

1. ప్రథమ తెలంగాణా కమ్యూనిస్టు మహాసభ (1954) తీర్మానాలు. పే. 97-99.

రాజకీయ పరిణామాలు, ఐక్యసంఘటనా దృక్పథం :

అమెరికా, బ్రిటన్‌లలో వస్తూత్పత్తిపడిపోయి, అంతర్జాతీయ వాణిజ్యం క్షీణించుట పెట్టుబడిదారి సంక్షోభ తీవ్రతను తెల్పుతుంది. సామ్రాజ్యవాద శిబిరంలో వైరుధ్యాలు, సంఘర్షణలు తీవ్రమయ్యాయి. "యూరోపియన్ సైన్య నిర్మాణానికి అమెరికా వొత్తిడి యూరోపియన్ దేశాలపై యెక్కువైంది. వలస, అర్ధవలస దేశాలలో ఆర్థిక, రాజకీయ పరిస్థితులు క్షీణించుటతో ఎదురుతిరిగే సూచనలు కన్పిస్తున్నాయి. చైనా-సిలోన్‌లమధ్య, ఈజిప్టు-సోషలిస్టు దేశాలమధ్య వర్తకపు వొడంబడికలు, బొలివియా, ఇరాన్‌లలో సామ్రాజ్యవాద వ్యతిరేకత పెరిగింది. వియత్నాం, అల్జీరియా, ట్యునిసియా, మొరాకోలలో సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలు విజృంభించాయి మలయా, బర్మాలలో ప్రజల స్వాతంత్ర్య పోరాటాలు కొనసాగుతున్నాయి. ఈ పోరాటాలన్నిటిలో కమ్యూనిస్టులు ప్రధానపాత్ర వహించుతున్నారు. ప్రపంచ శాంతి వుద్యమం విస్తృత స్వభావాన్ని పొందింది.

భారతదేశం శాంతికోసం జరిపే పోరాటానికి, సంపూర్ణ స్వాతంత్ర్య పోరాటానికి అవినాభావ సంబంధముంది సంపూర్ణ స్వాతంత్ర్యం అంటే బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పెత్తనాన్ని సైన్యంలో, ప్రభుత్వంలోని అన్ని కీలకస్థానాలనుండి తొలగించి, కామన్‌వెల్తునుండి విడిపోవుట. "భారతదేశం బ్రిటిష్ సామ్రాజ్యవాదంపై యీ పోరాటాన్ని సాగిస్తూనే, వివిధ రంగాలలో అతివేగంగా చొచ్చుకువస్తున్న అమెరికన్ సామ్రాజ్యవాదాన్నికూడ ప్రతిఘటించవలసి వుంటుంది. శాంతికోసం, స్వాతంత్ర్యం కోసం జరిగే పోరాటంలో ఇదొక విడదీయరాని భాగం,[1]"

"పెట్టుబడిదారి ప్రపంచ సంక్షోభం తీవ్రమౌతున్న కొలది, ఆ దేశాల మార్కెట్టు సంకుచితమై సామ్రాజ్యవాదులు వలస, పరాధీనదేశాలను మరింతగా దోచుకొంటున్నారు. వలసలు, సామ్రాజ్యవాద దేశాల మధ్య యుద్ధ పరిస్థితులు యేర్పడుచున్నవి. బ్రిటన్-అమెరికాల పోటీ యీ దేశాలలో తీవ్రమై మనదేశం యీ సంఘర్షణకు ఒక ప్రధాన రంగస్థలంగా తయారైంది.[2]"

ఆర్థిక సంక్షోభం తీవ్రమగుటతో ప్రజల పరిస్థితి అధ్వాన్నమైనందున ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా ప్రజావుద్యమాలు బలపడుట, పాలకవర్గాలలోను, కాంగ్రెసులోను చీలికలు ఎక్కువయ్యాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య ఆదాయాల పంపకంపై సంఘర్షణ పెరుగుతున్నది. భాషాప్రయుక్త రాష్ట్రాల నిర్మాణంలో ప్రభుత్వ విధానాన్ని, కాంగ్రెసు అగ్రనాయకత్వ వైఖరిని అనేకమంది కాంగ్రెసువాదులు బహిరంగంగా ఖండించుట, ఆంధ్ర ప్రజల బ్రహ్మాండమైన విజయంతో, భాషాప్రయుక్త రాష్ట్రోద్యమాలకు బలం చేకూరింది. అయితే కాంగ్రెసు బలహీనమైనంతగా, ప్రజాస్వామ్యశక్తులు బలపడలేదు.

---

1. కమ్యూనిస్టు పార్టీ కేంద్ర సమితి, రాజకీయ తీర్మానం (తెలుగు) మార్చి 1953. పే. 36.

2. అదే పే. 39-40.

"ప్రజా సోషలిస్టు పార్టీతో కలసి సంయుక్త మంత్రివర్గాన్ని నెలకొల్పే వుద్దేశ్యంతో నెహ్రూ, జయప్రకాశ్‌నారాయణతో సంప్రదింపులు జరుపుట గమనించవలసినది. సంవత్సరం క్రితం సంయుక్త మంత్రివర్గాన్ని గురించి ఆలోచించుటకు విముఖత చూపిన నెహ్రూ స్వయంగా తానే చొరవ తీసుకొని సంయుక్త మంత్రివర్గ ప్రయత్నాలకు, ప్రజలలో కాంగ్రెసు పలుకుబడి క్రమేణా క్షీణించుటను, నెహ్రూ గుర్తించుట వలన జరిగింది.

"ప్రజా సోషలిస్ట్ పార్టీ నాయకత్వం. యిట్టి అభివృద్ధి నిరోధకమైన సంయుక్త మంత్రివర్గ నిర్మాణంపట్ల ఆదుర్దాగా వుండుటకు కారణం, అదికూడ సంక్షోభంలో పడిపోయింది. అది అవలంభించిన ఎత్తుగడలు, ప్రజాపార్టీ, సోషలిస్ట్ పార్టీ విలీనకరణ, సంక్షోభాన్ని తొలగించకపోగా తీవ్రతరం చేసింది ప్రజా సోషలిస్ట్ పార్టీ నాయకులు, వొక కార్యక్రమాన్ని ప్రకటించి, అభివృద్ధి నిరోధక లక్ష్యాలను కప్పిపెట్టుకొనజూస్తున్నారు." ఈ కార్యక్రమంలో "జమీందారీ విధానాన్ని నష్ట పరిహారం లేకుండా రద్దుచేసి వ్యవసాయ కూలీలకు' పేదరైతులకు భూమిని పంచాలని, రైతుల శిస్తుభారాన్ని తగ్గించాలని, కౌలుదారుల రక్షణ" వారు కోరలేదు. పైగా "భూములన్నిటిని నిర్బంధంగా సమైక్యం చేయాలని కోరి," కౌలుదారులను, చిన్న రైతులను భూములనుండి తొలగించే ప్రయత్నాలకు ప్రోత్సాహమిచ్చారు. అంతేగాక "ప్రభుత్వ ఆధ్వర్యంలో వివిధ ట్రేడు యూనియన్లను నిర్బంధంగా ఒకే సంస్థలో కలిపి వేయాలని, కనీస వేతనం, నిరుద్యోగంల గురించి" చెప్పకుండా, కార్మిక సంఘాల సామాజిక బాధ్యతల గురించి ప్రత్యేకంగా వాదించుచున్నారు.

"భాషాప్రయుక్తరాష్ట్రాలు, రాష్ట్రాలకు అధిక స్వపరిపాలనాధికారాలు వుండాలని కాక, కొన్ని భాషా ప్రయుక్త రాష్ట్రాలను కలిపి, పరిపాలన, ఆర్థిక సౌలభ్యం కొరకు రాష్ట్రాలను పునర్విభజించి రీజినల్ గవర్నర్లను నియమించాలని, హైకోర్టులను యేర్పాటు చేయాలంటూ, భాషాప్రయుక్త రాష్ట్రాల సిద్ధాంతానికి ఎసరుపెడుతున్నారు. నిరంకుశ చట్టాల రద్దుపై మౌనంవహించారు"[1].

కమ్యూనిస్టుపార్టీ కేంద్రసమితి మార్చి 1953 సమావేశం మూడు కర్తవ్యాలను నిర్ణయించింది. ఒకటి, జనత ప్రజాతంత్ర సంఘటనను నిర్మించుట; రెండు, ప్రజాసంస్థలను నిర్మించుట; మూడు, కమ్యూనిస్టుపార్టీని నిర్మించుట.

దేశంలోని ప్రజాస్వామిక పక్షాలు, గ్రూపులు, వ్యక్తులు కలసి పనిచేయవలసిన అవసరముంది. ఇట్టి ఐక్యతకు అవకాశాలీరోజున చాలవున్నవి. కమ్యూనిస్టు పార్టీ కర్తవ్యం, ఈ అవకాశాలను కార్యరూపం ధరించేటట్లు చేయుట ఈ కర్తవ్యాన్ని నెరవేర్చాలంటే నినాదాల విషయంలో కమ్యూనిస్టేతరుల విషయంలో, ప్రజాసంస్థలను ప్రజాస్వామ్యవాదులను నడిపే పద్ధతులలో సెక్టేరియన్ వైఖరిని, విధానాలను విడ

---

1 కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ రాజకీయ తీర్మానం, మార్చి 1953 (తెలుగు) పే. 54-5.

నొడవలసి వుంటుంది. పార్టీ ప్రజలందరిని ఐక్యపరచవలసిన అవసరముంది. ప్రజా తంత్ర శక్తులన్నీ ఐక్యతతో ప్రజల హక్కులను రక్షించుటకు పోరాడాలనే ప్రజా వాంఛ కార్యరూపం ధరించేటటు పార్టీ చూడాలి. పరిమిత ఐక్య సంఘటనయైనా ఏర్పడి పనిచేసిన దాని ప్రభావం ఎంతగా వుంటుందో గత ఎన్నికలలో స్పష్టమైంది. అందు చేత వివిధ ప్రతిపక్షాలమధ్య ఐక్య సంఘటనను నిర్మించుటకు పార్టీ కాయశక్తులా పనిచేయాలి. ఎన్నికల అనంతరం కొన్ని ప్రాంతాలలో ఈ ఐక్యసంఘటన బలహీన పడినప్పటికి, తిరిగి దాన్ని బలీయమొనర్చుటకు కృషి చేయవలల వుంది.

ఐక్య సంఘటనోద్యమాన్ని అభివృద్ధి పరచుటకు కాంగ్రెసు, సోషలిస్టుపార్టీల ప్రజాసామాన్యం, అభ్యుదయ శక్తులు పోరాటాల్లోను, సమిష్టి కార్యక్రమాల్లోను పాల్గొనునట్లుచూడాలి. ఈ విషయంలో పార్టీ చేసిన కృషి చాలస్వల్పం. మన నినాదా లను బలపరచనివారు లేదా మన పోరాటాలలో పాల్గొననివారిని అభివృద్ధి నిరోధకు లుగా జమకట్టే ధోరణి ప్రజల సేవచేయదలచినవారినందరిని సమీకరించగల పోరాట పద్ధతులను ప్రవేశపెట్టలేకపోవుట, వివిధ రాజకీయ దృక్పధాలు కలవారి మధ్య ఏ సమస్యలపై వెంటనే ఐక్యతసాధ్యమో, అట్టి నిర్దిష్ట సమస్యలను విస్మరించటంలాంటి ధోరణులు పార్టీలో వున్నాయి. ఈ కారణంగా ప్రతిరాష్ట్రంలో ప్రతి ప్రాంతంలో విస్తృత ఐక్య సంఘటన యేర్పడుటకు అంతరాయము కలుగుతున్నది

పార్టీ ఆందోళన నిర్దిష్ట స్వభావాన్ని కలిగిలేదు. ప్రభుత్వ విధానాలలోని ఒక్కొక్క సమస్యను తీసుకొని బట్టబయలుచేయుటగాక జనరలు విమర్శనలు చేయ బడుచున్నవి. అసెంబ్లీలలోను, పార్లమెంటులోను, బహిరంగ సభల్లోను ఊకదం పుడు వుపన్యాసాలు జరుగుతున్నవి. పత్రిక రచనలలో కొట్టినపిండి కన్పడుతున్నది. ఇట్టి ఆందోళనా పద్ధతులువలన ప్రజావుద్యమం విస్తృతం కావటంలేదు. ఫలితంగా ఐక్య సంఘటన అభివృద్ధికావడంలేదు. పార్టి విధానాన్ని అంగీకరించినవారిని ఒప్పిం చటంకోసం వుపన్యాసాలిస్తున్నారు. ప్రజల పరిస్థితిని బాగుచేయుటకు, సౌకర్యాల కొరకు కౌలుదారుల చట్టం, సాంఘిక భీమాచట్టం, వేతనాల చట్టాలు వుపయోగించు కొనుటలో అశ్రద్ధ కన్పడుతున్నది. ఈ చట్టాలు ప్రజాపోరాటాల ఫలితంగా లభిం చినవని, అవి వొక ఆయుధమని మరచారు. ప్రజలలో ఆత్మవిశ్వాసాన్ని కలిగించు టకు, ఐక్యత, పోరాటం వలన వారికోర్కెలు నెరవేరగలవనే నమ్మకం కలుగుటకు, ప్రజలు సాధించిన ఎంతటి చిన్న విజయాన్నియైనా విరివిగా ప్రచారంచేయాలి. దాని నాధారంచేసుకొని ముందుకుపోవాలని స్పష్టంచేయాలి. ఇది సంస్కరణవాదమనే భ్రమ తప్పు. వయోజన విద్యాప్రచారం వల్లనే బెంగాల్, త్రిపుర, మలబార్‌లలో ఒక ప్పుడు పార్టీ, రైతు వుద్యమాలు బలపడినవని మరువరాదు.

కార్మికవర్గంలో ఐక్యత కొరకు "ఒకే పరిశ్రమలో ఒకే యూనియన్, దేశాని కంతటికి ఒకే ట్రేడు యూనియన్ సంస్థ" అనేనినాదం కార్యరూపం ధరించేందుకు తీవ్రంగా కృషి చేయవలసివుంది. ఉన్న ఐక్య ఫ్యాక్టరీ కమిటీలను బలీయమొనర్చాలి. అట్టి కమిటీలను అన్ని పరిశ్రమలలోను నిర్మించాలి. ప్రభుత్వం, యజమానులు చేసే దాడిని, ఐక్య ప్రతిఘటనద్వారా ఎదుర్కొనాలి. ఐక్య కమిటీలే పోరాటాలకు, సంప్ర

దింపులకు సాధనాలు. ప్రతి పోరాటం, ప్రతి వుద్యమం ప్రచారం కొరకుకాక వివిధ సంఘాల నిర్మాణానికి, బలపరచుకొనుటకు వుపయోగించుకోనాలి. ప్రజల అసంతృప్తి కంటె ప్రజా వుద్యమాలు వెనుకబడుటకు, ప్రజాసంఘాలు బలహీనంగా వుండుటయే కారణం. ప్రజాతంత్ర సంఘటనకు పునాది, ఐక్య ప్రజాసంఘాలు, దేశవ్యాప్తంగా అట్టిసంఘాలు నిర్మించకపోతే దేశవ్యాపిత ప్రజావుద్యమాన్ని అభివృద్ధి పరచుట అసంభవం.

అన్ని రాష్ట్రాలలోను ప్రజాస్వామ్య పక్షాలను, గ్రూపులను, పార్టీలను వ్యక్తులను సమీకరించగల తక్షణ నినాదాలను పార్టీ ముందుకు తీసుకొనిరావాలి. వాటిని ఒకదానితో సమన్వయపరచి, ఆ నినాదాలే ఐక్య సంఘటన యొక్క తక్షణ కార్యక్రమంగా రూపొందునట్లు చూడాలి.

కార్యక్రమంలో నిర్బంధ చట్టాలరద్దు, రాజకీయ ఖైదీల విడుదల భాషా ప్రయుక్త రాష్ట్రాల నిర్మాణం, రాజ్ ప్రముఖులరద్దు, స్వదేశీ సంస్థానాల రద్దుచేసి, ఆయా భాషా ప్రాంతాలలో కలిపివేయుట, 'బి', 'సి' రాష్ట్రాలలో ఎన్నికైల ప్రతినిధులకు పూర్తి శాసనాధికారాలను, రాష్ట్రపరిపాలనాధికారాలను యిచ్చి, ఎ. బి. సి. రాష్ట్రాల విభేదాలను రద్దుచేయుట, కేంద్రం రాష్ట్రాలలో ఎగువసభలను రద్దుచేయుట ప్రధాన అంశాలుగ వుండాలి.

విదేశీయ వస్తువుల దిగుమతినిషేదం, విదేశీయ కంపెనీల లాభాల తరలింపుపై నిషేదం, పరిశ్రమల లాభాలను తిరిగి పరిశ్రమలోనే పెట్టుబడిగా పెట్టాలని, కనీస వేతనాన్ని చట్టబద్ధం చేయుట, నిరుద్యోగ భృతి కోర్కెలుగా వుండాలి.

జమీందార్ల, జాగీర్దార్ల నష్టపరిహార చెల్లింపులను ఆపుచేయుట, భూమిశిస్తు తగ్గించుట, భేదఖళ్ళను ఆపుచేయుట, తొలగింపబడిన భూములను తిరిగి వారికిచ్చుట, అట్టి భూములలో సాగుహక్కు భూస్వాముల కుండరాదని, వ్యవసాయరంగంలోని కోర్కెలను కార్యక్రమం ప్రతిబింబించాలి.

సైన్యపు, పరిపాలనా ఖర్చులు సగానికి తగ్గించి, ఆదాయాన్ని ప్రజాశ్రేయస్సుకు వినియోగించాలి.

భారత ప్రజలను శాంతికోసం, కార్యరంగంలోనికి తీసుకొని రావలసిన అవసరముంది. ఇది అంతర్జాతీయ ప్రధాన కర్తవ్యంగా నెంచాలి.

**ఐక్యసంఘటన భూమిక కార్మికవర్గ ఐక్యత :**

కార్మికవర్గం నిరుద్యోగానికి, రేషనైలైజేషన్ పేరుతో నూతన యాంత్రీకరణ చేసి పనిభారాన్ని పెంచుటకు వ్యతిరేకంగా, ఐక్యకార్యాచరణలో పెద్దయెత్తున కదలుతున్నది. అనేక రాష్ట్రాలలో మే 1953 వుత్సవాలలో, 2000 మంది కేంద్ర ప్రభుత్వోద్యోగులను రిట్రెంచిమెంటు చేసినపుడు, గుడ్డల మిల్లుల, బ్యాంకు కార్మికుల వివాదాలపై అవార్డులపై, తదితర కార్మిక సమస్యలపై జరిగిన సమ్మెలలో యిది ప్రస్ఫుటమైంది. ఈ పోరాటాలు ఎ ఐ టి యు సి, హెచ్ యం యస్. ఐ యన్ టి యు

సి యు టి యు సి ల ఐక్యతావేదికలపై జరిగినపుడు ప్రజాసామాన్యం విస్తృతంగా పాల్గొంది గతంలో కంటె 1953 లో కార్మికవర్గ ఐక్యపోరాటాలలో విస్తృత ప్రజా సామాన్య సమీకరణ జరిగింది.

ఈ విధంగా కార్మికవర్గం క్రిందినుండి ఆచరణలో ఐక్యతవైపు పయనించుట, జాతీయ కేంద్ర కార్మిక సంఘాల ఐక్య నిర్మాణ సమస్యను ముందుకు తెచ్చింది. ఐ యన్ టి యు సి సమస్య, దాని నాయకులు, ఆ యూనియన్‌లతో వుండవలసిన సంబంధాల సమస్య ముఖ్యమైనది ఈ విషయంలో గత రెండు సంవత్సరాలలో చెప్పుకొన తగిన మార్పులు వచ్చాయి. కార్మిక సంఘాల ఐక్యతా మార్గంలో యీ వచ్చిన మార్పులను సమగ్రంగా పరిశీలించవలసివుంది.[1]

అఖిలభారత ట్రేడు యూనియన్ కాంగ్రెసు సిద్ధాంతరీత్యా, నిర్మాణరీత్యా కార్మికవర్గ ప్రజాసామాన్యంలో అత్యధిక భాగాన్ని ఆకర్షించి, సమీకరించజాలక పోయిందనుట స్పష్టం. ఐ యన్ టి యు సి-యాజమాన్యపు, వారి తొత్తుల రౌడీలనే అభిప్రాయం కలిగి యుండుటతోపాటు, వాటికి వాస్తవంగా, హేతుబద్ధంగా కార్మిక వర్గ ప్రజాపునాది లేదనే బలమైన అభిప్రాయాన్ని కలిగియుండుట, యీ కర్తవ్యాన్ని నిర్వహించుటకేమాత్రం తోడ్పడదు అవును తేయాకుతోటల యజమానులు వారి క్షేత్రాలగేటులను తెరచి, ఐయన్‌టియుసి ఆర్గనైజర్లకు అన్ని సౌకర్యాలను యిచ్చి వుండకపోయినచో, ప్రభుత్వం వెంట వెంటనే ఐయన్‌టియుసి యూనియనులను గుర్తించుటతో, బొంబాయి గుడ్డలమిల్లుల యజమానులు వారికి అన్ని వసతులు కలిగించి వుండనిచో ఐయన్‌టియుసి యీ బలాన్ని పొందగలిగేదికాదు. వారి బలాన్ని గుర్తించకపోవుట కార్మికవర్గంలో పార్టీ కర్తవ్యనిర్వహణలో ఐక్యతా నిర్మాణంలో వైఫల్యాలకు కారణం అనుట స్పష్టం

నిషేదం, నిర్బంధం, స్వయంకృతాపరాధం వలన 1951 వరకు ఎఐటియుసి యూనియనులన్నీ చిన్నాభిన్నమై అనేక పరిశ్రమలలో కార్మికవర్గాన్నుండి వేరుపడి పోవుట జరిగింది. ఆ కాలంలో హెచ్‌యంయస్ బలపడినా క్రమేణా 1953కు తన కార్యకర్తలను "ఐయన్‌టియుసి"కిగాని "ఎఐటియుసి"కిగాని కోల్పోయి బలహీన పడింది కార్మిక సంఘాలలో, బలాబలాలలో వచ్చిన మార్పుల, ఆలిండియా రైల్వే మెన్స్ ఫెడరేషను. ఇండియన్‌నేషనల్ రైల్వేవర్కర్సు ఫెడరేషన్‌లో కలసిపోయి "ఐయన్‌టియుసి"కి "హెచ్‌యంయస్" లొంగిపోయింది గుడ్డలమిల్లుల "హెచ్ ఎం ఎస్" యూనియన్ గిర్నికాంగార్ యూనియన్‌తో కలియుటతో "ఎఐటియుసి" బల పడి పురోగమించింది.

భారత బూర్జువావర్గం 1946-47లలో కార్మికులలో తన స్థానాన్ని బలపరచు కొనుటకు కార్మికోద్యమాన్ని చీల్చి "ఐయన్‌టియుసి"ని నెలకొల్పింది. ఆగస్టు 1947 అధికార మార్పిడితో కాంగ్రెసు మంత్రిపదవులు చేబట్టుటతో కార్మికవర్గంలో భ్రమ లను పెంపొందించి మరికొంత బలపడింది, ఆర్థిక సంక్షోభం కార్మికవర్గపు కనీస

---

1. భారత కమ్యూనిస్టు పార్టి చరిత్ర (1977) అధికారపత్రాలు వా. VII. పే. 239-40.

కోర్కెలను తీర్చజాలకపోవుటతో భ్రమలు తొలగిపోనారంభించాయి. బూర్జువావర్గపు దాడి, సంక్షోభం పెరిగినకొలది, అదేమేరకు భ్రమలుపోయాయి. కాంగ్రెసు, "ఐ ఎన్ టియుసి"లోని కొన్ని గ్రూపులనుండి దూరమగుట మొదలైంది.

ప్రణాళికలకు, పునర్నిర్మాణానికి "ఐయన్‌టియుసి"వలెనె "హెచ్‌యంయస్" ప్రభుత్వంతో సహకారాన్ని నెరపుటకు అంగీకరించింది. అయితే సామ్రాజ్యవాద వ్యతిరేకపోరాటం ముగిసిందని, పెట్టుబడిదారి వ్యతిరేక పోరాటం ప్రారంభమైందనే నినాదాన్ని యిచ్చింది. బూర్జువాలపై భ్రమలులేని, వున్నా లొంగిపోయిన "ఐయన్‌టి యుసి" వర్గాలు "హెచ్‌యంయస్"వైపు మొగ్గుచూపాయి. ఆ మార్గాలలో అంతర్జా తీయ సౌభాతృత్వంపై అభిమానం కలవారు "ఎఐటియుసి"వైపు మొగ్గుచూపారు. సహజంగానే కాంగ్రెసు ప్రభుత్వ కార్మిక విధానాలతో అసంతృప్తి చెందిన వర్గాలు "ఎఐటియుసి"లో చేరి బలపరచాయి. ఈ విధంగా ఎఐటియుసి తిరిగి బలాన్ని పుంజు కొనుట ప్రారంభమైంది. కార్మికవర్గంలో ఐయన్‌టియుసి - ఎఐటియుసి లు రెండు బలమైన ప్రత్యర్థి కార్మికోద్యమాలుగ తలెత్తాయి. కార్మికవర్గంలో ఐయన్‌టియుసి బలపడినా కాంగ్రెసు సాధారణంగా బలాన్ని కోల్పోవుటతో బలహీనపడింది. అదే విధంగా హెచ్‌యంయస్ బలహీన పడినంతమాత్రాన సోషలిస్టు సిద్ధాంతం బలహీన పడినట్లు తలచరాదు. కాంగ్రెసు మితవాద సోషలిస్టువర్గాలకు ఐయన్‌టియుసి, హెచ్ యంయస్‌లలో తమ బలాలను కాపాడుకొనుట కష్టంగాపరిగమించిందనుటకు బెంగా ళులో ఐయన్‌టియుసి చీలిపోవుటే స్పష్టంచేస్తుంది సోషలిస్ట్‌పార్టీ, ప్రజా సోషలిస్టు పార్టీలో కలసిపోవుట హెచ్‌యంయస్ వర్గాలు బూర్జువా ప్రజా సోషలిస్టు వర్గాలతో పూర్తిగ చేతులు కలిపినట్లు తలచరాదు. ఐయన్‌టియుసి కార్మికవర్గంలో కొంత పురోగమించినా, మొత్తంమీద పరిస్థితి కార్మికవర్గానికి అనుకూలంగానే మారిందను టలో సందేహంలేదు. కార్మికవర్గంలో వచ్చిన బలాబలాలోని మార్పులు కార్మిక సంఘాల వుద్యమాల ఐక్యతా సమస్యలో నూతన ప్రశ్నలు వుదయించుటకు కారణ భూతమైనాయి.

కమ్యూనిస్టు పార్టీ యుద్ధానంతరకాలంలో ప్రధానంగా హెచ్ యం యస్. నాయకత్వాన్ని, కార్యకర్తలను పోరాటంపైపు ఆకర్షించి ఐక్యతను నెలకొల్పే మార్గాన్ని అనుసరించింది. మారిన నేటి పరిస్థితులలో హెచ్ యం యస్ వర్గాలలో ఐక్యతామార్గాన్ని కొనసాగించుతు, పార్టీ ఐ యన్ టి యుసి విషయమై గట్టి ప్రయ త్నం చేయతలచింది. కాన ఐ యన్ టి యు సి యెడల పార్టీ దృక్పథంలో మార్పు వస్తే, కార్మికోద్యమ ఐక్యత సాధ్యమౌతుంది.

అఖిల భారత ట్రేడు యూనియన్ కాంగ్రెసు, కమ్యూనిస్టు పార్టీ ఫ్రాక్షన్ కమిటి మే 1953లో పూనాలో సమావేశమై, కార్మికోద్యమ ఐక్యత, ముఖ్యంగా భారత జాతీయ ట్రేడు యూనియన్ కాంగ్రెసు గురించి చర్చించింది. పార్టీ కేంద్ర కమిటి సబ్‌కమిటి ఆ చర్చలను సమీక్షించి యేకగ్రీవాంశాలను పార్టీ వర్గాలకు ప్రక టించింది అందులో కమ్యూనిస్ట్ దృక్పథానికి సంబంధించి కొన్ని ప్రశ్నలకు వివరణ యివ్వబడినవి.[1]

---

1. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర(1977)అధికారపత్రాలు.వా VIII. పే.246-249.

మొదటి ప్రశ్న : జాతీయ ట్రేడు యూనియన్ కాంగ్రెసు కార్మిక సంఘం కాదా? దానినే విధంగా చూడాలి? యాజమాన్యపు తొత్తులు, రౌడీలు, సమ్మె విచ్ఛిన్న కారులుగల బూర్జువా సంస్థా? దీనికి సూటియైన, స్పష్టమైన జవాబు వుండాలి.

రెండవ అభిప్రాయాన్ని కలిగిన వొక వర్గం, వారి చర్యల ననుసరించి మన యెత్తుగడలుండాలనే వారుగూడ, ఐ యన్ టి యు సి లో ఐక్యతా నినాదాన్ని ఇవ్వటం సబ్ కమిటికి ఆశ్చర్యాన్నిచ్చిందన్నది వారు ఐక్యతా నినాదాన్ని వొక ఎత్తుగడగా నెంచుతున్నారు.ఇది ఐక్యతా సమస్యను తప్పుగా అర్థం చేసుకొనుట తప్ప మరొకటి గాదు. ప్రపంచట్రేడు యూనియన్ ఫెడరేషన్ ఐక్యతా సమస్యను ప్రధాన సూత్రముగా నెంచుతున్నది. ఐక్యతానినాదాన్ని అది ఎత్తుగడగాకాక కార్మికోద్యమ ప్రధాన సూత్రంగా నెంచుతున్నది.జాతీయ ట్రేడు యూనియన్ కాంగ్రెసు, కాంగ్రెసు గుత్త పెట్టుబడిదారి విధానాలను అనుసరించుతున్నా వాటివెనుక కొంత కార్మికపునాది ఉన్నదని, అన్ని యూనియన్‌లలో కాకపోయినా పెక్కింటిలో కార్మికవర్గ విశ్వాసం గల కార్యకర్తలు వాస్తవంగా కార్మికశ్రేయస్సుకు పనిచేసే వారున్నారని మరచిపోరాదు.

ఈ కార్మికవర్గ పునాది ఐ యన్ టి యు సి కి యెలా లభించింది అనేది ఆలోచించవలసివుంది వర్గసౌభ్రాతృత్వం బలమైన ట్రేడుయూనియన్ వారసత్వంలో నుండి వచ్చిన కార్యకర్తలు కారు. భారత కార్మికోద్యమ ముఖ్య బలహీనతే యిది. వారికి జాతీయ బూర్జువాభ్రమలు, ప్రభుత్వ ఆదరణతో తమ కోర్కెలు నెరవేర్చుకొనాలనే అభిప్రాయాలున్నాయి జాతీయ ట్రేడు యూనియన్ కాంగ్రెసు పోరాటాల నుండి పుట్టిందనేది అందరికి తెలిసినదే. ఇది వాస్తవికత ఎవ్వరూ కాదనలేరు

రెండవ ప్రశ్న : జాతీయ ట్రేడు యూనియన్ కాంగ్రెసును ఇంటర్నేషనల్ కాన్ఫెడరేషన్ ఆఫ్ ట్రేడు యూనియనుకు అనుబంధించినంత మాత్రాన వారి నాయకత్వమంతా బూర్జువావర్గపు యేజంట్లా? లేక కరుడుగట్టిన ప్రధాన నాయకత్వ భాగాన్ని మాత్రమే ఆ విధంగా నెంచాలా? వాస్తవానికి ఐ యన్ టి యు సి లోని కరుడుగట్టిన చిన్న నాయకత్వభాగం మాత్రమే నేరుగా బూర్జువావర్గపు యేజంట్సుగా నెంచవచ్చు మరో చిన్నవర్గం ఐ సి యఫ్ టి యు తో నేరుగా సంబంధం కలిగి సామ్రాజ్యవాదంతో సహకరించుతున్నారని అనుకొనవచ్చు. వాస్తవం ఐ యన్ టి యు సి నాయకత్వంలోని కొన్నివర్గాలు తప్పుడుదారిలో వున్నారు. వారి ననుసరించే కార్మిక ప్రజాసామాన్యంలో చైతన్యాన్ని కలిగించి, కార్మిక పోరాటాల మార్గానికి కొనిరావచ్చు అంటే ఐ యన్ టి యు సి నాయకత్వంలోని కొన్నివర్గాలు మాత్రమే, బూర్జువా యేజంట్లు అత్యధికభాగం ముఖ్యంగా స్థానిక నాయకత్వాలు కార్మికపోరాటాలకు అనుకూలురుగానే యెంచాలి. ఇదే ఐక్యతాపథం, దృక్పథం.

మూడవప్రశ్న : జాతీయ ట్రేడు యూనియన్ కాంగ్రెసులోని అన్ని యూనియనులను నిజమైన కార్మిక సంఘాలుగ నెంచాలా? లేక కొన్నిటిని ప్రభుత్వ, బూర్జువా, యాజమాన్యపు రౌడిమూకలుగ నెంచాలా? ఐ యన్ టి యు సి మొత్తంగా కార్మికవర్గ సంస్థ, అందులో కొన్ని యాజమాన్యపు ఏజన్సీ, రౌడీమూకలు వుండ

వచ్చు. ఎక్కడ అట్టి రౌడీమూకలు వుంటే వారి నా విధంగానే చూడవచ్చు. కాని 'ఐ యన్ టి యు సి' ని కార్మికవర్గ సంస్థగానే చూడవలసివుంది. కొన్ని నిజానికి రౌటీమూకల యూనియన్‌లై వుండవచ్చు అలాగే నాయకత్వంలో కొంతమంది వ్యక్తిగతంగా రౌడీలు, ఏజంట్లు అయివుండవచ్చు. అంత మాత్రాన నాయకత్వమంతా అభివృద్ధి నిరోధకులు, బూర్జువా యేజంట్లుగా నెంచుట పొరపాటు ఈ విధమైన అవగాహన ఐ యన్ టి యు సి, దాని నాయకత్వం యెడల అనుసరించవలసిన విధానాన్ని, ఎత్తుగడలను, నినాదాలను స్పష్టం చేస్తుంది. జనరలు విధానాన్ని, కొన్ని ప్రత్యేక యూనియన్‌ల యెడల, నాయకత్వం యెడల చేబట్టవలసిన విధానాన్ని స్పష్టంచేస్తుంది. ఐ యన్ టి యు సి తో సామాన్య ఐక్య కార్యాచరణ, వాస్తవంగా కొన్ని ప్రత్యేక యూనియన్‌లు కార్మిక సంఘాలుగ లేక రింగ్‌లీడర్సుగా ఉండి, కార్మికవర్గంలో వారి దుశ్చర్యల ఫలితంగా వేరుపడి ఉండిన చోట్ల వారితో సహకారం, ఐక్యకార్యాచరణ ప్రయత్నం కార్మికవర్గంలో సద్భావాన్ని పెంపొందించదు మిగతా అన్నిచోట్ల ఐక్యతా మార్గం కొనసాగించాలి.

## ఆచరణలో కార్మికవర్గ ఐక్యతా సమస్య:

ఐక్యతా సమస్యపై అవగాహన యూనియన్‌కు యూనియన్‌కు మధ్య సంబంధాల సమస్యను, యూనియన్సు కలియుట లేక సంలీనం, రద్దుచేయు ప్రశ్నల లేవనెత్తుతుంది. ఏ పరిస్థితులలో కమ్యూనిస్టు పార్టీ యూనియన్‌లను రద్దుచేసి, సభ్యత్వాన్ని ఐ యన్ టి యు సి లో చేరమంటుందో, ఏ పరిస్థితులలో ఐ యన్ టి యు సి యూనియన్ నుండి విడిపోయి మరో యూనియన్‌ను స్థాపించుట జరుగుతుందో, ఎ పరిస్థితులలో క్రిందినుండి ఐక్యత కోరుతూ, పార్టీ యూనియన్ బలపడునట్లు చేస్తూ, పోటీ యూనియన్‌ను విచ్ఛిన్నం చేయుటలేక పార్టీ యూనియన్‌కు బలం చేకూర్చుతూ, పోటీ యూనియన్‌లో పనిచేయాలి? ఇట్టి ప్రశ్నలెన్నో వివిధ ప్రాంతాలలో పార్టీకి యెదురౌతున్నాయి.[1].

కార్మిక సంఘాల ఐక్యత అంటే యేకపక్షంగా యీ యూనియన్ నో, ఆ యూనియన్ నో రద్దు చేయుటగాదు, పోరాటంలో సంలీనమై కార్యక్రమ ప్రాతిపదికపై ఐక్యత సాధించుట. అంతేగాని పార్టీ వ్యతిరేకులు కోరే విధంగా ఎ ఐ టి యు సి ని స్వతంత్రసంస్థగా రద్దు చేసినంత మాత్రాన కార్మికవర్గ ఐక్యత యేర్పడదని స్పష్టంగా తెలుసుకొనుట అవసరం. అందువలన ఎ ఐ టి యు సి ని, జాతీయ కార్మికసంస్థ కేంద్రాన్ని రద్దుచేయుట అనే ప్రశ్న ఉదయించదు. అలా రద్దుచేయుట కార్మికవర్గానికి ఒక ఆయుధాన్ని లేకుండాచేసి, వారిని బూర్జువావర్గ నాయకత్వానికి అప్పజెప్పుటయే అగుతుంది.

---

1. భారత కమ్యూనిస్టు పార్టి చరిత్ర (1977) అధికారపత్రాలు. వా. VIII. పే. 249-54.

కార్మికవర్గ అత్యధిక సంఘటితశక్తి, ఐక్యతకు యూనియన్‌ను రద్దుచేయవలసిన పరిస్థితి రైల్వేలలో వుంది. గతంలో కొన్ని సంఘటనలు యాజమాన్యం, కార్మికుల స్వభావం, ఈ రంగంలో యూనియన్‌లు యేర్పడిన తీరు, వారసత్వపు కారణంగా బే షరతుగా కమ్యూనిస్టు యూనియన్‌లను రద్దుచేసి సభ్యులను ఆలిండియా రైల్వేమెన్స్ ఫెడరేషనులో లేక నూతనంగా సంలీనమైన ఫెడరేషన్‌లో చేరమని కోరవలసిన అవసరముంది. ఈ అవగాహనను సదరన్ రైల్వేలో అనుసరించక పార్టీ, సదరన్ రైల్వే యూనియన్‌ను కొనసాగించాలని బలవత్తరమైనదిగా చేయాలని నిర్ణయించింది ఇదే దృక్పధం పశ్చిమ రైల్వేయూనియన్ యెడల కొనసాగింది. సాధారణ అవగాహనకు ప్రత్యేక పరిస్థితుల కారణంగా మినహాయింపుగా నెంచాలి.

నేటి పరిస్థితులు కొందరు ప్రతిపాదించిన విధంగా సదరన్, తదితర రైల్వే యూనియన్‌లతో కొత్తస్వతంత్ర రైల్వేసంఘాల ఫెడరేషన్ యేర్పాటును సమర్ధించజాలవు.

బొంబాయి గుడ్డలమిల్లుల కార్మికవర్గ పరిస్థితి యిందుకు భిన్నంగావుంది పారిశ్రామిక సంబంధాల చట్టాలననుసరించి, పోలీసు, యాజమాన్యం, ప్రభుత్వ మద్దతుతో ఐయన్‌టియుసిలో సభ్యులు ఎక్కువగా వున్నారు. కాని పరపతిలేదు. ఎఐటియుసికి పరపతి వుందిగాని సభ్యుల సంఖ్యాబలంలేదు. పార్టీ సంఘం పిలుపునిస్తే ఐయన్‌టియుసి ఆవలేదు. కానీ ఎఐటియుసి అత్యధికులను సభ్యులుగ చేర్పించలేదు. ఇది వాస్తవ పరిస్థితి.

కానీ ఏఐటియుసి ప్రజాసామాన్యానికి ఎట్టిపిలుపునివ్వలేదు. యాంత్రికంగా దాని నాయకత్వాన్ని విమర్శించుటతో దాని కార్యకర్తల్లో యెట్టి ప్రభావాన్ని కలుగజేయలేదు. యూనియన్‌లలో పనిచేయుటలో కమ్యూనిస్టు పార్టీ అశ్రద్ధచేసింది అనేక పోరాటాల చరిత్ర కలిగిన బొంబాయి గుడ్డలమిల్లుల కార్మికులలో సరియైన దృక్పథంతో పనిచేయాలి. 'ఐయన్‌టియుసి' గుణపాఠాలు నేర్చుకొంది. అహమ్మదాబాద్‌లో వలె బొంబాయిలో పనిచేయుటలేదు. బొంబాయి కార్మికులలో వారికి అంత బలంలేదు. అందుకే కార్మికపోరాటాల గురించి మాట్లాడుతున్నారు. ఒక విధంగా యిది పార్టీ విజయమే.

కార్మికోద్యమంలో ఐక్యతా వాంఛ మరో విధంగాకూడ ప్రతిబింబించుచున్నది. కొన్ని సంఘాలు, యూనియన్ యే కేంద్ర ట్రేడుయూనియన్‌లోను చేరకుండా కార్మికపోరాటాలలో పాల్గొంటూ వున్నవి. ప్రభుత్వోద్యోగుల సంఘాలు, బ్యాంకింగ్ ఇన్సూరెన్సు కంపెనీల వుద్యోగుల సంఘాలు యే కేంద్రట్రేడు యూనియన్‌లో చేరినా సంఘం విచ్ఛిన్నమౌతుందనే అభిప్రాయంతో అనుబంధ సమస్యపై తటస్థంగావుంటూ, పోరాటాలలో పాల్గొంటూ కార్మికవర్గ ఐక్యతను కాపాడుతున్నవి. యుద్ధానంతరం 1946లో సమ్మె సమావేశాలలో కాంగ్రెసు కమ్యూనిస్టు కార్యకర్తలు సంయుక్త పోరాటాలలో బొంబాయిలో ఐక్యమైన అనుభవాలున్నవి. ఈ సంయుక్త పోరాటాలలో ఎర్రజండాకాని, కాంగ్రెసు జండాగాని, వారి ఐక్యతను కొనసాగించు

టకై వుపయోగించని సందర్భాలున్నవి. అన్నివర్గాల కార్మికవర్గ ఐక్యతను బలమైన దిగా చేయుటకు ఈ విధానాన్ని అనుసరించిన అనుభవాలున్నవి. ఐక్యత, ఐక్య పోరాటం ముఖ్యం. జండాకాదు. అందువ తాత్కాలికమే అయినా ప్రజాసామా న్యంలో ఆ అభిప్రాయం ఐక్యతా భావానికి ప్రతిబింబం. అది ఆనాటి వాస్తవం

కేంద్ర ట్రేడు యూనియనుల నాల్గింటిలో దేనిలోనూ చేరక తటస్థంగావున్నా ఆ నాలుగు కేంద్రసంస్థలకు చెందిన నాయకత్వాలు కలసి స్వతంత్ర ఫెడరేషన్‌గా యేర్పడిన ప్రత్యేకతలోని ఐక్యతావాంఛయే నిర్ణయాత్మకమైనది. ఈ విధంగా అఖిల భారత సిమెంటు వర్కర్స్ ఫెడరేషన్, పీర్‌లేస్ వర్కర్స్ ఫెడరేషను, ఆయిల్ అండ్ పెట్రోలియంవర్కర్సు ఫెడరేషన్ అతిపెద్దదైన డిఫెన్సు ఎంప్లాయీస్ ఫెడ రేషన్‌లు యీవిధంగా యేర్పడినవే. ఇవేగాక అతిపెద్దదైన బ్యాంక్ ఎంప్లాయీస్ ఫెడరేషన్, యూనియన్ ఆఫ్ పోస్ట్ అండ్ టెలిగ్రాఫ్ వర్కర్సు చెప్పుకొనతగి నవి. కార్యకర్తలు, యూనియన్‌లు, 'ఐయన్‌టియుసి', 'ఏఐటియుసి', 'హెచ్‌యం యస్', 'యుటియుసి'లు అన్ని కేంద్ర సంఘాలకు చెందిన సంఘాలన్నీ కలసి సంయుక్తంగా ఈ ఫెడరేషన్‌లుగా యేర్పడినవి. ఈ సంఘాలు యూనియన్‌లలోని ప్రజలు, కార్యకర్తలు, నాయకత్వాలు, వారి ఐక్యపోరాటాల అనుభవాలు పర్యవ సానంగా ఆయా కార్మిక సంఘాల ఎంప్లాయీస్ వర్గాలలో ఐక్యతను ముఖ్యంగా పోరాట ఐక్యతను నిర్మించుకొనగలిగారు. ఇందులో వివిధ రాజకీయ, సిద్ధాంత అవ గాహనలు గలవారున్నారనే విషయం మరువరాదు.

ఈ అనుభవం కార్మికవర్గంలో వున్నది. అనైక్యత ఒక్కటేగాదని రాజ కీయ, సిద్ధాంత, అభిప్రాయ భేదాలను అధిగమించి కార్మికవర్గం ఐక్యతామార్గాన్ని అన్వేషించి, నిర్మించుకొంటున్నదని తెలుపుతుంది. ఈ ఫెడరేషన్‌లలోని పార్టీ తది తరవర్గ నాయకత్వాలు ఈ దృక్పథాన్ని అభివృద్ధిచేస్తూ ఏదోవొక కేంద్ర సంఘానికి అనుబంధసంస్థగా చేయప్రయత్నించక ఈ ఫెడరేషన్‌లలో పదవులను ఏదోవొక విధంగా ఆక్రమించే ప్రయత్నంచేయక వారి కోర్కెలు, వాటి పోరాటాలపై కేంద్రీక రించుటయే సరియైన కార్మికవర్గ సిద్ధాంతంగా, మార్గంగా నెంచాలి. ఈ ఐక్య పోరా టాభివృద్ధికి ప్రత్యక్ష, పరోక్ష అడ్డంకులన్నిటిని అధిగమించి వర్గఐక్యతను, పోరాట ఐక్యతను నిర్మించాలి.

మరో ముఖ్య ఐక్యతాభివృద్ధి అంశాన్ని గుర్తించుకొనాలి. ఇండియాలో పార్టీతో, పార్టీ సంస్థలతో అంగీకరించజాలని "హెచ్‌యంయస్", "యుటియుసి" ప్రతినిధులు పెకింగ్ వరల్డు ఫెడరేషన్ ఆఫ్ ట్రేడు యూనియన్సు సమావేశము నకు ఆహ్వానించబడినపుడు అనేక అంతర్జాతీయ సమస్యలపై "ఏఐటియుసి" ప్రతి నిధులతో కలసి యేకాభిప్రాయాన్ని, తమ సానుభూతిని, తమ ఆమోదాన్ని అంతర్జా తీయ కార్మికసంస్థ ఆశయాల యెడల వ్యక్తం చేశారు. ఈ అనుభవాలతో వారిలోని కొన్ని దురభిప్రాయాలుపోయి ఐక్యతామార్గం సుగమమైంది.

## ప్రపంచట్రేడు యూనియనులపై ఫెడరేషన్, ఐక్య కార్యాచరణ అవగాహన

మూడవ ప్రపంచట్రేడు యూనియన్ కాంగ్రెసులో కార్యదర్శి బ్రదర్ లూయిస్ శాలియంట్ అక్టోబరు 1953లో ప్రవేశపెట్టిన నివేదికలో భారత కార్మికోద్యమముపై వ్యాఖ్యలు, సూచనలు, ఐక్యకార్యాచరణ కార్మికవర్గ ఐక్యతలపై ప్రధానాంశాలను మననంచేసుకొనుట అవసరము.

"ప్రపంచ కార్మికసంస్థ అనుబంధసంస్థ 'ఎఐటియుసి' 1947 వరకు సంఘటిత కార్మికవర్గంలో అత్యంత మెజారిటీని కలిగివుంది.

"తదుపరి కాలంలో మార్పులు సంభవించాయి. సంఘటిత మెజారిటి కార్మిక వర్గం ప్రపంచ కార్మిక సంస్థకు అనుబంధ సంస్థగాలేదు మెజారిటి నేతలు ప్రపంచ సంస్థకు అనుబంధ సంస్థకాని ట్రేడుయూనియన్‌లో వున్నారు.

"ఇప్పుడు ఐక్యకార్యాచరణ, కార్మికసంస్థల ఐక్యతాసమస్య ప్రపంచసంస్థకు అనుబంధ సంస్థలుగాని కార్మికవర్గ సంస్థలలో మెజారిటి సంఘటిత కార్మికవర్గం వున్నపుడు అనుబంధ సంస్థలకు పరపతి మాత్రమేవుండి సభ్యత్వం తక్కువగానున్న పరిస్థితి సంబంధించినది "

"పెట్టుబడిదారి, వలస దేశాలలో తక్షణ సమస్యలపై పోరాటాలలో ఐక్య కార్యాచరణను ఐక్యతా విధానాన్ని సాధ్యం, విజయవంతం చేయుటకు అనుసరించే ఎత్తుగడలు, సూత్రాలను పరిగణించవలసి వుంటుందని నొక్కిచెప్పదలచామని" నివేదిక స్పష్టంచేసింది[1].

ఎ) "చొరవ చైతన్యాన్ని ప్రదర్శించి, దానిని ప్రజాచైతన్యంగా అభివృద్ధి చేసి, కార్యాచరణ వాస్తవ సాధ్యా సాధ్యాలను ప్రజలనుండి నేర్చుకొనుట మైనారిటి కార్యాచరణగాక ప్రజాసామాన్యపు మొత్తపు కార్యాచరణలో కార్మికసంఘాల కార్యాచరణ భాగం అయ్యేటట్టు చూడగలందుకు. వారితో ఎడతెగని శాశ్వత సంబంధం కలిగివుండాలి.

"బి) వాస్తవాలు నిర్మాణం బలహీనతలను పరిగణించునపుడు డాంబిక అధికృతా భావాలను విడనాడి, వాస్తవ, ప్రత్యేకతలను గుర్తుంచుకొనాలి.

"సి) సైద్ధాంతిక వుపన్యాసాలలో, రచనలలోగాని, దైనిక కార్యాచరణలో స్పష్టమైన విషయాలలో ఒంటెత్తు పోకడ, అవకాశవాదాన్ని తొలగించేకోరిక, ప్రయత్నం రుజువుకావాలి.

---

1. ఐక్యకార్యాచరణ బలపరచండి. (1953) (ఆంగ్లలో) ట్రేడు యూనియన్ కాంగ్రెసుచే ప్రకటితం. బ్రదర్ లూయిస్ శాలియంట్ నివేదిక. ప్రపంచ ట్రేడు యూనియన్ కాంగ్రెసు అక్టోబరు, 1953. పే. 48.

"డి) కార్మిక సంఘాలలో ఫలప్రదమైన ప్రజాస్వామ్య పని విధానాన్ని నెల కొల్పి, ఆ మార్గాన్నుండి వైదొలగినపుడు, కార్మికసంఘ నాయకత్వంలో సమిష్టిపని విధానాన్ని ఆచరించి ప్రజాస్వామ్య పద్ధతులకై పోరాడాలి.

"ఇ) కార్మికసంఘ అధికారతత్వం బలిసిపెల్లడైనపుడు దానిని తొలగించుటకు ప్రజా కార్యక్రమాన్ని అనుసరించాలి.

ఎఫ్) కార్మికసంఘ నిర్మాణాన్ని-సంస్థను-పార్టీ యేతరఅందరి ప్రజాసంఘంగా నెంచి, దాని నిర్మాణ రూపాలను వదలి కార్మికవర్గ రాజకీయ అగ్రగామిదళ పాత్ర నిచ్చి, నిర్మాణాన్ని తప్పుదారి పట్టించరాదు.

"జీ) సరియైన నిర్మాణరూపాలను చేబట్టి, కార్యక్రమము కార్మిక కోర్కెలు ఐక్య కార్యాచరణ రూపొందించాలి. కార్మికవర్గం రాజకీయంగాచీలి, వివిధ రాజకీయ పార్టీల ప్రభావంలో వున్నపుడు ట్రేడు యూనియన్ సంస్థ తన కార్యాచరణ అంత ర్గత పనివిధానం యేవొక గ్రూపు కార్యకర్తలు తమ రాజకీయ దృక్పధం అనుస రించరాదు.

"ట్రేడు యూనియన్ సంస్థలో, దాని నిర్మాణంలో నాయకత్వంలో సంస్థలోని వివిధ రాజకీయ దృక్పధాలు ప్రతిబింబించేవిధంగా నిర్మాణ పద్దతులు అవలంభించాలి.

"అసంఘటిత కార్మికవర్గాన్ని పోరాటంలో పాల్గొనుటకు పిలుపునిచ్చి, సభ్య త్వానికి వారిని తయారుచేసి, సభ్యత్వాన్నిచేర్పించునపుడు వారికి ప్రాధాన్యతనివ్వాలి.

హెచ్) కార్మికులకు వారి ఐక్యతకైవచ్చే అన్ని అడ్డంకులను వెల్లడించి, వివాలతో ముఖ్యంగా విచ్ఛిన్నకుల ప్రభావంలో వున్నవారిలో వోర్పుతో వివరణ కార్యక్రమము జరగాలి.

ఈ సూచనలు రోజువారి కార్యక్రమ ఆచరణలో తమ కర్తవ్య నిర్వహణకు దోహదకారి కాగలవని, వారు తమ పాత్రను నిర్వహించగలరని, కార్మికవర్గాన్ని పోరాటమార్గంలో సమీకరించగలరని ప్రపంచ కార్మిక సంస్థ విశ్వసిస్తున్నది.

కార్మికవర్గ పోరాటాల విజయానికి వారి ఐక్యతే ప్రధానమని గత నాలుగు సంవత్సరాల అనుభవం స్పష్టం చేసింది. ఉద్దేశ్యం ఐక్యతకై పోరాటం, ధ్యేయం ఐక్యత. ప్రతి పరిశ్రమలో వొకే వొక యూనియన్, ప్రతి పరిశ్రమలో వొకే వొక జాతీయ ట్రేడు యూనియన్ ఫెడరేషన్, అన్ని ట్రేడు యూనియనులకు ఒకేవొక జాతీయకేంద్రం, ఒకేవొక ప్రపంచట్రేడు యూనియన్ నిర్మాణానికి దారితీయాలి.

## ఐక్య కార్యాచరణ

ఇంటర్నేషనల్ కాన్ఫెడరేషన్‌కు ప్రపంచ ట్రేడు యూనియన్ కాంగ్రెసు ఐక్య కార్యాచరణను ప్రతిపాదించింది. కార్మికసంఘాల కార్మికుల అభిప్రాయాలకు ప్రాముఖ్యతనిస్తుంది. ప్రతిదేశంలో సమస్యలు వుద్భవించిన క్రమంలోనే అధ్యయనం చేసి ఐక్యకార్యాచరణ పరిశీలన, ఆచరణ చేపట్టబడుతుంది. కాని సాధారణ ఐక్య కార్యాచరణ, ఐక్యసంఘటన మార్గాలలోకాదు:

పరిశ్రమలోనే ఐక్య కార్యాచరణ పునాదిని, నిర్మాణ ఐక్యతకు తగిన శక్తులను చూడగలము. అదే క్రిందినుండి పైవరకు దృఢనిర్మాణానికి శక్తులు. ఐక్యతా సమస్య యొక్క రాజకీయవిధాన సమస్యమాత్రమేకాదు, సంఘ సమస్య, రోజువారి ఆచరణ సమస్య.

స్పష్టమైన లక్ష్యాల నాధారంగా కార్మిక ఐక్యకార్యాచరణ, కార్మిక సంఘాల మధ్య క్రిందినుండి పైవరకువుండాలి సాధించగలిగిన స్పష్టమైన లక్ష్యాలు ధ్యేయంగా కాలపరిమితితో, ఐక్య సంఘటన నిర్మించి, వివిధ సంఘాలు, సంస్థలు సాధారణ సమిష్టి కార్యక్రమం రూపొందించి, ఐక్య కార్యాచరణకు పూనుకొనాలి ఐక్యకార్యాచరణకు అంగీకృత పూర్తి కార్యక్రమం వుండాలనే నియమంలేదు. వివిధ ట్రేడు యూనియన్లమధ్య ఆమోదంపొందిన యే వొక్కకోర్కె లేక వివాదంపైనైనా ఐక్య కార్యాచారణ ఐక్యపోరాటం రూపొందించవచ్చు. ఈ క్రమంలోవిస్తృత ఐక్య సంఘటన కనీస తక్షణ కార్యక్రమంపై యేర్పడి, శాశ్వత లేక దీర్ఘకాల ప్రాతిపధికను సంతరించుకొంటుంది. అట్టిది రాజకీయ పరిణామాలకు ఆటు పోటులకు తట్టుకొనగలిగిన విప్లవ దశకంతటికి మనగలిగిన ఐక్య సంఘటనగా పరిణామమొందుతుంది. అయితే ఆ దశలో పార్టీ రాజకీయ, నిర్మాణ, ఆచరణ యేమాత్రం ఒంటెత్తు ధోరణులకు, వక్రీకరణలకు గురైనా సంఘటన విచ్ఛిన్నమగు పరిస్థితులు యేర్పడుట జరుగవచ్చు.

ఫ్రాన్సు, ఇటలీలలోని అనుభవాలు, వివిధట్రేడు యూనియనుల మధ్య జాతీయస్థాయిలో ఐక్య కార్యాచరణ, ఐక్య పోరాటాలు, ఐక్య సంఘటనల నిర్మాణాలకు అవకాశాలున్నవని, సాధ్యమని రుజువు చేస్తున్నని మధ్యస్థాయీలలో అట్టి యేర్పాటులు కష్టతరంగాదు. క్రిందిస్థాయిలో పరిశ్రమ, ఫ్యాక్టరీస్థాయిలో మరికొంత తేలికగాను కన్పడుతున్నది. క్రిందిస్థాయిలో స్థానిక పరిస్థితుల పాత్ర ప్రాధాన్యత వహించుతుంది.

"భారతదేశంలో జాతీయ కార్మిక సంఘాల మధ్య ఐక్య కార్యాచరణ సాధించుటకు విస్తృత బృహత్తర ప్రయత్నం చేయవలసి వుంటుంది. ఈ దేశంలోని రాష్ట్రాలలో ఐక్యకార్యాచరణ, రైల్వే, బ్యాకింగ్, ఇన్సూరెన్సు ట్రేడు యూనియను వర్గాలలో ట్రేడు యూనియనుల ఐక్యత జాతీయస్థాయిలో ఒకేవొక ఫెడరేషనుల ఏర్పాటుకు దారితీసింది."

**సారాంశము**

సామ్రాజ్యవాద వ్యతిరేక స్వాతంత్ర్య పోరాటంలో 1940 దశకంలో ఐక్య సంఘటనా నిర్మాణ ప్రయత్నాలు ఎట్టి సత్ఫలితాలను యివ్వజాలకపోయాయి. ప్రధాన స్రవంతినుండి వేరుపడిన కారణంగా పాకిస్తాన్ యెడల అవలంభించనవైఖరితో రాజకీయ జాగృతిగల ప్రజాసామాన్యం నుండి కమ్యూనిస్టుపార్టీ దూరమగుట చారిత్రకసత్యం. ఆ కారణంగా ఐక్యసంఘటనా నిర్మాణంలో పురోగమించజాలక పోయింది.

భారత రిపబ్లిక్ అవతరణ అనంతరం 1952 ఎన్నికలలో అత్యంత బలీయమైన కాంగ్రెసును ఎదుర్కొనుటకు వివిధ పార్టీలు, గ్రూపులు, వ్యక్తులు కలసి ఒకే వేదికపై పోరాడవలసిన వాస్తవ పరిస్థితి, ఐక్య సంఘటనా నిర్మాణ సమస్యను ముందుకు తెచ్చింది. పోరాటాల ఫలితంగా ముందుకొచ్చిన సమస్యగాదు. పార్లమెంటరీ పోరాటాల సమస్యగా ముందుకొచ్చింది.

కాంగ్రెసు, కమ్యూనిస్టులు, సోషలిస్టులు, జన సంఘాలుమాత్రమే దేశవ్యాప్తి గలిగిన పార్టీలుగ వున్నవి. కాంగ్రెసు మినహా మిగతా పార్టీలు అసమాన వ్యాప్తిని కలిగివున్నవి. ఎన్నికలలో యివి ప్రధానంగా రాజకీయ, ఆర్థిక సమస్యలపైగాక స్థానిక సమస్యలపైనే కేంద్రీకరించాయి. ప్రాంతీయ సమస్యలనుట మరింత సరియైనది.

ప్రపంచయుద్ధకాలంలో కమ్యునిస్టులు, సోషలిస్టులు తదితరులు కలసి రూపొందించిన ఫాసిస్టు వ్యతిరేక ఐక్య సంఘటన, యుద్ధానంతర కాలంలో ఫ్రాన్సు, ఇటలీలలో యేర్పడిన ప్రభుత్వాలనుండి కమ్యూనిస్టులను తొలగించి కమ్యునిస్టుల వ్యాప్తికి అమెరికన్ మార్షల్ప్లానుతో చెలియలకట్ట నిర్మించ తలపెట్టుట జడనోవ్ 'రెండు శిబిరాల సిద్ధాంతం', 'సోషల్ డెమోక్రట్లను గుత్తపెట్టుబడిదారుల "ద్వితీయ రక్షణ శ్రేణిగా" నిర్వచించుటతో వామపక్షాల మధ్య అఘాతమేర్పడింది. ఈ ప్రభావం భారతదేశంపై పడినందున, దీనితోపాటు కమ్యునిస్టులుప్రధానస్రవంతినుండి 1942లో వేరుపడిపోయిన కారణంగా, ఎన్నికలలో తాత్కాలికంగానైనా సోషలిస్టులతో కలసి సంఘటనగా యేర్పడి పోరాడేస్థితి లేకుండాపోయింది. కమ్యూనిస్టులు పోటీచేయని స్థానాలలో సోషలిస్టులను బలపరచుట హర్షనీయం. అదేపనిని సోషలిస్టులు చేయజాలకపోవుట గర్హనీయమనుటలో సందేహంలేదు. ఫలితంగా అఖిలభారత స్థాయిలో సంఘటనకు ప్రాతిపదిక లోపించినా, రాష్ట్రాలలో స్థానిక సోషలిస్టులు, యితర వామపక్షాలతో కొన్ని రాష్ట్రాలలో పరిమితిగానైనా ఐక్య సంఘటనలను యేర్పరచి కమ్యూనిస్టు పార్టీ గణనీయ విజయాన్ని సాధించింది.

హైదరాబాద్ సంస్థానంలో కమ్యూనిస్టుపార్టీ పీపుల్సు డెమోక్రటిక్ ఫ్రంట్, కిసాన్ కాంగార్ పక్షం, సోషలిస్టు వర్కర్సులీగ్, కొంతమంది ప్రముఖ వ్యక్తులు, కేరళలో రివల్యూషనరి సోషలిస్టు పార్టీ, కేరళ సోషలిస్టుపార్టీలు కలసి కనీస కార్యక్రమం ప్రాతిపదికగా, ఐక్య సంఘటనగా ఎన్నికల పోరాటం జరిపాయి. బెంగాల్, బీహార్, ఒరిస్సాలలో ఫార్వర్డుబ్లాక్ (మార్కిస్టు)తో పూర్తి ఎన్నికల అవగాహన వొప్పందం కుదిరింది. మహారాష్ట్ర, హైదరాబాద్లలోని మరాట్వాడాలలో పెక్కుచోట్ల కిసాన్ కాంగార్పార్టీ, పీజంట్సు అండ్ వర్కర్సు పార్టీలతో సీట్ల సర్దుబాటు ఎన్నికల వొప్పందాలు కుదిరాయి.

ఉత్తరప్రదేశ్లో రివల్యూషనరీ సోషలిస్టు పార్టీతోను, పంజాబ్లో లాల్ కమ్యూనిస్టుపార్టీతోను ఎన్నికల వొప్పందం కుదిరింది. తమిళనాడులో టాయిలర్స్ పార్టీ, ద్రవిడ కజగంలతో ఎన్నికల ఒప్పందం కుదిరి వారిని బలపరచుట జరి

గింది. ఆంధ్రలో కిసాన్ మజ్దూరుపార్టీ, కృషక్‌లోక్ పార్టీలతోవొప్పందం కుదరక పోయినా వారి 11 మంది అభ్యర్థులను బలపరచి గెలుపుకు కారణమైంది.

ఐక్య సంఘటనా నిర్మాణంలో కొన్ని ప్రాథమిక విజయాలు సాధించుటతో, అన్ని అభ్యుదయశక్తులు కాంగ్రెసును వోడించుటకై ఐక్యమవ్వాలనే జాగృతిని కలిగించుట జరిగింది వామపక్షాల ఐక్యత సాధించబడలేదు పార్టీ గతంలోని వొంటెత్తు పోకడలు, సరియైన ఐక్యసంఘటనా దృక్పథం లేకపోవుట స్పష్టంగా కన్పడుతున్నది.

కమ్యూనిస్ట్ పార్టీ బలమైన శక్తియై కార్మికవర్గాన్ని సమీకరించగలిగినప్పుడు, వామపక్ష సంఘటన ప్రాతిపదికగా వివిధ రాజకీయపార్టీల, గ్రూపుల, వ్యక్తులతో కనీస కార్యక్రమ పునాదిగా ప్రజా ఐక్య సంఘటనను నిర్మించగలుగుతుంది. అప్పుడే బలమైన సంఘటన ప్రధానంగా పోరాటాలనుండి వుద్భవించిన సంఘటనయై రాజకీయ గతిని మార్చగలిగినంతటి శక్తిని ప్రభావాన్ని గలిగించగలుగుతుంది.

## II

## రెండు దృక్పథాలు రూపొందుట

(జాతీయ ప్రజాస్వామ్య సంఘటన : జనతా ప్రజాస్వామ్య సంఘటన)

పాలకవర్గాల పార్టీయైన కాంగ్రెసు, కాంగ్రెసు ప్రభుత్వ విధానాలు 1946లోనే తాత్కాలిక ప్రభుత్వం యే కూటమిలో చేరని "తటస్థత సిద్ధాంత" ప్రకటన చేసింది. స్వాతంత్ర్యానంతరం "శాంతి సుముఖ తటస్థత సిద్ధాంతం"గా రూపొందించ నారంభించింది. భారతదేశం 1950కి 39 దేశాలతో విదేశ సంబంధాలను యేర్పరచుకొంది. జయపూర్‌లో 1948లో జరిగిన జాతీయ కాంగ్రెసు మహాసభ భారతదేశ విదేశాంగ విధానాన్ని "సామ్రాజ్యవాద వ్యతిరేక, శాంతి తటస్థత, అలీన విధానంగా" నిర్వచించింది. దక్షిణాఫ్రికాలో జాతి వివక్షణ విధానాలపై 'ఐక్యరాజ్య సమితి'లో భారత ప్రతినిధి జరిపిన పోరాటాలు సామ్రాజ్యవాద వ్యతిరేక విధానం స్పష్టంగా నిర్ధారణ చేయబడింది. ఢిల్లీలో 1947 చివరలో ఆసియా దేశాల సంబంధాల సమావేశము, కాంగ్రెసు జాతీయ ప్రభుత్వం సోవియట్ రష్యా, ప్రజాచైనాలతో మిత్ర సంబంధాలను నెలకొల్పింది. ఆర్థిక, రాజకీయ బ్రిటిష్ బంధనాలు బలీయంగా వుండుటతో సామ్రాజ్యవాద వ్యతిరేక విధానాలలో 'వూగిసలాట' లేకపోలేదు. ఒకవైపు హోచిమిన్ ప్రభుత్వాన్ని బలపరస్తు, మరోవైపు మలయంలో బ్రిటిషు విధానాన్ని బలపరచింది. ఇండోనేషియా సమస్యపై అక్కడి జాతీయశక్తులకు ఎట్టి మద్దతు నివ్వాలని మిత్రరాజ్యసమితి తీర్మానాన్ని ఢిల్లీ అంతర్జాతీయ సమావేశంలో బలపరచింది.

భారతదేశ ఆర్థికాభివృద్ధి ప్రణాళికలపు అమెరికా సహాయపు ఆశలే అందుకు కారణం. అదే 1949 నవంబరులో నెహ్రూ అమెరికా పర్యటన అంతరార్థం సత్వర ఫలితాలు లేకపోయినా 1950 దశకంలో అమెరికా పెట్టుబడులు ప్రవహించుటకు దోహదకారి అయిందనుటలో సందేహం లేదు. కాశ్మీర్ సమస్యను మిత్రరాజ్య

సమితికి నివేదించి ఇండియా, పాకిస్తాన్ రెండు దేశాలు ఆంగ్లో అమెరికనులు దేశ అంతర్గత విషయాలలో కలుగజేసుకొనుటకు అవకాశమిచ్చినా, మిత్రరాజ్య సమితి ప్లెబిసైటును అంగీకరించక, రష్యా, చైనా, ఇండియా పాకిస్తాన్. అఫ్ఘనిస్తాన్ దేశాల కేంద్ర సైనిక వ్యూహప్రాంతాన్ని నాటో రాజ్యాల సైనిక కేంద్రం కాకుండా నివారించింది.

జయపూర్ జాతీయ కాంగ్రెసు మహాసభలో బలమైన ప్రతినిధివర్గం బ్రిటన్‌తో రాజకీయంగా పూర్తిగా తెగతెంపులు చేసుకొనాలని కోరినా, 1943 లండన్ కాన్ఫరెన్సు నిర్ణయాల ననుసరించి, 1949లో లండన్‌లో జరిగిన కామన్‌వెల్తు సభలో రాయబారం నెరపాలనే నిర్ణయం చేయబడింది లండన్‌లో ఇండియా సర్వ స్వతంత్ర రిపబ్లిక్‌గానే, బ్రిటిష్ కామన్‌వెల్తు రాజ్యాల భాగస్వామిగా, బ్రిటిషు సింహాసనాన్ని నామమాత్రంగా గుర్తించి పాల్గొనుట ఆమోదించబడింది. అఖిలభారత కాంగ్రెసు రాజ్యాంగ నిర్ణయసభ యీ మేర్పాటును అంగీకరించింది· అదేమి విచిత్రబంధమో రాజ్యాంగచట్టంలో యిదెక్కడా పేర్కొనబడలేదు

కాంగ్రెసు 1928లోనే అమోదించిన భాషాప్రయుక్త రాష్ట్రాల యేర్పాటుపై జయపూర్ కాంగ్రెసులో తీవ్ర వాగ్వివాదాలు చెలరేగాయి. ఆంధ్ర, కర్నాటక, కేరళ మహారాష్ట్ర ప్రతినిధుల వొత్తిడి కారణంగా, రాజ్యాంగ, నిర్మాణసభ భాషాప్రయుక్త రాష్ట్రాల ప్రాతిపదికపై రాష్ట్రాల పునర్విభజనసమస్యను పరిశీలించిన ధర్ కమీషన్ 1948లో వ్యతిరేకంగా నివేదిక సమర్పించింది. ఈ సమస్య పునఃపరిశీలనకై జయపూర్ కాంగ్రెసు జవహరలాల్ నెహ్రూ వల్లభాయ్‌పటేల్ పట్టాభిసీతారామయ్యలతో జె వి పి కమిటీని యేర్పాటుచేసి భాషాప్రయుక్త రాష్ట్రాల యేర్పాటును పరిశీలించవలసిందిగా కోరింది. ఆ కమిటి కూడ ధర్ కమిటి నిర్ణయాన్ని పునరుద్ఘాటించింది ఈ నేపథ్యంలో నవంబరు 1949లో భారతదేశం సర్వసత్తాక స్వతంత్ర రిపబ్లిక్‌గా రాజ్యాంగ నిర్మాణసభ ప్రకటించింది రాజ్యాంగ చట్టం 26 జనవరి 1950న అమలులోనికి వచ్చింది. అప్పటినుండి స్వతంత్రదినోత్సవంగా జరుపుకొంటున్న జనవరి 26 రిపబ్లిక్ దినోత్సవంగా అవతరించింది. ఆంధ్రులలో అసంతృప్తి జ్వాలలు అలముకొంటున్నాయి.

స్వాతంత్ర్యానంతరం 1952లో జరిగిన ప్రథమ ఎన్నికలలోనే మద్రాసు రాష్ట్రంలోని ఆంధ్రప్రాంతంలో, హైదరాబాద్ సంస్థానంలోని ఆంధ్ర తెలంగాణా ప్రాంతంలోను, ఆంధ్రరాష్ట్రోద్యమం విశాలాంధ్రోద్యమంగా విస్తరించిన కారణంగా ఎన్నికలలో ముఖ్య సమస్య అయింది కాంగ్రెసు రెండు ప్రాంతాలలో తీవ్ర పరాజయంపొందింది. ఈ పరిస్థితులలో సెప్టెంబరు 1952లో మద్రాసు రాజధాని తెలుగు కాంగ్రెసు నాయకుడు గాంధేయవాదియైన పొట్టి శ్రీరాములు భారత కాంగ్రెసు నాయకులకు మద్రాసు ప్రభుత్వ నాయకులకు ఆంధ్రరాష్ట్రం యేర్పాటు విషయమై విజ్ఞప్తి చేశారు. అక్టోబరు చివరకు కేంద్ర రాష్ట్రప్రభుత్వాలలో ఎట్టి స్పందన లేనందున 15 డిశెంబరున, 58 దినములు నిరాహారదీక్ష వహించి ఆత్మార్పణచేశారు. కేంద్ర, రాష్ట్ర

ప్రభుత్వాలకు వ్యతిరేకంగా ప్రజోద్యమం విజృంభించి, అన్ని రకాల రవాణాలను స్తంభింపచేసింది. అన్ని ఫ్యాక్టరీలలో, విద్యాలయాలలో, కోర్టులలో సమ్మెలు కొన సాగాయి. కేంద్ర ప్రభుత్వం డిశెంబరు 19న ఆంధ్రరాష్ట్రమేర్పాటుకు తీర్మానించింది. నవంబరు 1953లో వాస్తవరూపం దాల్చింది.

వివిధ సంస్థానాలలో,రాష్ట్రాలలో వివిధజాతుల ప్రజలు ముఖ్యంగా ఆంధ్రులు మలయాళీలు, కన్నడులు, మహారాష్ట్రులు, గుజరాయితీలు, ఒరియాప్రజలు సామ్రాజ్య వాదంచే చీల్చబడి తమ భాష సంస్కృతులు కోల్పోయారు. ఆయా ప్రజలు తమ భాషా, సంస్కృతుల పునర్జీవనానికి ఒకే ప్రాంతంలో కలిసి జీవించాలనే నూతన జాగృతి వెల్లివిరిసింది. దాని ప్రతిబింబంగానే విశాలాంధ్ర, ఐక్య కేరళ, విశాల కర్ణాటక, సంయుక్త మహారాష్ట్ర, మహాగుజరాత్ వుద్యమాలు, ఆంధ్రరాష్ట్రోద్య మాన్ని ఫ్యూడలు సంస్థానాల వ్యతిరేకోద్యమంగా దేశాన్ని భాషాప్రాతిపదికపై రాష్ట్రాల పునర్నిర్మాణోద్యమంగా రూపొందించాయి. వివిధ భాషా ప్రాంతాలలో యేర్పడి బలపడుతున్న స్థానిక వివిధ జాతుల మధ్యతరగతి బూర్జువావర్గాలు, మరో వైపు దేశవ్యాపితంగా బలపడుతున్న గుత్తపెట్టుదారులకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో పరోక్షంగాను, ప్రత్యక్షంగాను ముఖ్యపాత్ర వహించారు. ఫలితంగానే రాష్ట్రాల పునర్నిర్మాణం, సంస్థానాల రద్దు జరిగింది. అయితే యీ సంస్థానాల రద్దు, వివిధ భాషా ప్రాంతాలలో కలిపివేయుటలో గుత్తపెట్టుబడి వర్గాల వారికి ప్రాతి నిధ్యం వహించే ప్రభుత్వ ప్రయోజనాలు యిమిడివున్నవనుట నిస్సందేహం.

కాంగ్రెసు నుండి సోషలిస్టు వర్గాల నిష్క్రమణ, డిశెంబరు 1959లో సర్దార్ పటేల్ మరణంతో కాంగ్రెసులో అటు మితవాద వర్గాలు, ఇటు వామపక్షవర్గాలు రెండూ బలహీనపడ్డాయి. ఫలితంగా మధ్యేమార్గాన్ని అనుసరించే నెహ్రూవర్గం బల పడింది. కాని టాండన్ నాయకత్వంలో మితవాద వర్గాల సమీకరణ కొనసాగుతూనే ఉంది.

వలస ఆర్థిక సంబంధాలను పెట్టుబడిదారీ పంథాన రూపొందించుటకు ప్రాథ మిక చర్యలు ఆర్థిక విధానంలో, ప్రథమంగా వ్యవసాయ సంస్కరణల రూపంలో 1940 దశకం చివరలో ప్రారంభించబడి 1954కు ఒక నిర్దిష్టరూపాన్ని సంతరించు కొన్నాయి. భూమికై తెలంగాణా రైతాంగపు సాయుధ గెరిల్లా పోరాటాలు, బెంగాల్ తెభాగా రైతుల పోరాటాల పాత్ర ప్రాముఖ్యత నేటి ప్రభుత్వ ప్రాపకపు చరిత్ర కారులు చెప్పకపోయినా భవిష్యత్ చరిత్రకారులు స్వర్ణాక్షరాలతో లిఖించగలరు.

గ్రామీణ ప్రాంతాలలో తమ పునాదులు కదలిపోవుటను,ఫ్యూడలు భూస్వామ్య వర్గాలు పాలకవర్గాలను మరెంతో కాలం రక్షించజాలవని గమనించి, నూతనవర్గ ప్రాతిపదికపై తమ బలాన్ని పెంపొందించుకొనాలని మేధావివర్గాలు యిచ్చిన సల హాపై, నూతన ధనికరైతు వర్గాన్ని సృష్టించి, బలపరచుకొను ప్రధానలక్ష్యంతో వివిధ రాష్ట్రాలలో 1949-54 మధ్యకాలంలో అనేక భూసంస్కరణ చట్టాలను చేయునట్లు రాష్ట్ర ప్రభుత్వాలను కేంద్ర ప్రభుత్వం ప్రోత్సహించింది. కాంగ్రెసు

ఎన్నికల ప్రణాళికలో వాగ్దానం చేసిన విధంగా జమీందారి విధానాన్ని రద్దుచేయుటగా కాంగ్రెసు విస్తృత ప్రచారాన్ని కావించుకొంది. వాస్తవానికి ఫ్యూడలు భూస్వాముల ప్రత్యక్ష దోపిడిపోయి, పరోక్షపు దోపిడి యినుమడించింది. ఫ్యూడలు భూస్వాములు 7000 మిలియనుల రూపాయలు నష్టపరిహారం పొంది పారిశ్రామికవేత్తలుగా, పెట్టుబడిదారి ధనిక భూస్వాములుగ రూపొందారు. దోపిడిరూపం మాత్రమే మారింది. నష్టపరిహార భారం రైతాంగంపైనే పడింది.

దేశంలో 57 శాతం వ్యవసాయ భూముల విస్తీర్ణంలో వ్యాపించివున్న రైత్వారీ ప్రాంతాలలో ఎట్టి వ్యవసాయ సంస్కరణల మాట తలపెట్టలేదు. వ్యవసాయ సంస్కరణలలో భూగరిష్ఠ పరిమితి నిర్ణయించవలసివుంది. ఈ సమస్య జాతీయ బూర్జువావర్గంలో తీవ్రవిభేదాలకు ప్రధాన కారణమైంది. పరిమితి నిర్ణయం ఒక్క ఫ్యూడలు భూస్వాములకేగాక పెట్టుబడిదారి పద్ధతులలో తోటలు వ్యాపార పంటలు పండించే భూస్వాములకుకూడ వర్తించాలి. గ్రామాలలో ఉండే అభివృద్ధి చెందుతున్న ధనిక రైతులు భయానికి లోనగుటతో బూర్జువావర్గంలో చీలికలకు అవకాశ మేర్పడింది.

ఈ పరిస్థితులలో రైతులలో క్షీణించే కాంగ్రెసు బలాన్ని నిలబెట్టుకొనుటకు, "భూదాన, గ్రామదాన" వుద్యమాన్ని ఆచార్య వినోభాభావే ప్రారంభించుట, కర్మ సిద్ధాంత నిలయమైన భారతదేశంలో "యీ మానవతా సిద్ధాంతం" బూర్జువావర్గం ప్రచారంతో నూతన భ్రమలను కలుగజేయుటకు తోడ్పడింది. మరో ముఖ్య విషయం భూమి కొరకై రైతాంగం సాయుధగెరిల్లా పోరాటాలు జరిగిన తెలంగాణా ప్రాంతంలోనే యీ వుద్యమం వుద్భవించుట గమనార్హం. రైతులు పంచుకొన్న భూస్వాముల భూములు "గాలికిపోవు పేలపుపిండి కృష్ణార్పణం"గా ప్రజలెంచుటలో వింతలేదు. ఈ ఉద్యమం రైతులలో కలిగించిన భ్రమలు అచిరకాలంలోనే తొలగిపోయాయనుట సత్యదూరంకాదు.

పాలకవర్గాల ప్రతినిధియైన కాంగ్రెసు ప్రభుత్వం, కాపిటలు కంట్రోలు 1947 చట్టం, విదేశీ మారకపు ద్రవ్యక్రమ బద్ధీకరణ 1947 చట్టం, ఎగుమతి దిగుమతుల కంట్రోలు 1947 చట్టం, బ్యాంకింగ్ 1949చట్టం, పారిశ్రామిక అభివృద్ధి, పనివిధాన 1951 చట్టం, ఈ చట్టాలు ప్రధానంగా లైసెన్సు సూత్రాలు, పనిచేయు విధానం, అభివృద్ధి, విస్తరణలపై ప్రభుత్వం స్పష్టమైన సూత్రాలను సూచించింది. ఇవన్నీ పొకే విషయాన్ని, ఆర్థిక, పారిశ్రామిక విధానంలో ప్రభుత్వపాత్రవిస్తరణను ప్రాతిపదికను సూచిస్తుంది. ప్రభుత్వపు యాజమాన్యంలో ప్రభుత్వ పరిశ్రమలనేగాక జాతి పారిశ్రామికోత్పత్తిని, వ్యక్తి యాజమాన్యంలోని పరిశ్రమల ప్రాధాన్యత, యేయే శాఖల అభివృద్ధి పరచాలో క్రమాన్ని నిర్దేశించుతూ, ఆర్థిక విధానంతోపాటు, పారిశ్రామిక విధానాన్ని నిర్దేశించేపాత్రను ప్రభుత్వం చేబట్టి, ప్రభుత్వ పెట్టుబడిదారి విధానాభివృద్ధికి బీజాలను నాటమొదలెట్టింది. నాడు యిది అంత స్పష్టంగా అందరికి విశిదం కాకపోయినా, నేడు అందరకు స్పష్టమైన కారణంగా అన్నివర్గాలు యీ విశ్లేషణను అమోదించాయి.

విదేశాంగ విధానంలో రెండు కూటముల యెడల "అలీన తటస్థ విధానాలు" అవలంభించుటతో ప్రారంభించి, ప్రపంచశాంతి "సుముఖ తటస్థవిధాన" సిద్ధాంతాన్ని రూపొందించుకొంటూ, సామ్రాజ్యవాద వ్యతిరేక విధానం బ్రిటన్, అమెరికాలు తీవ్రంగా వ్యతిరేకించిన వూగిసలాటకు లోనగుతూ దేశీయ విధానాలలో "వూగిసలాట మధ్యేమార్గాన్ని" అవలంభించుతూ, ప్యూడలు, జమీందారి విధానాన్ని రద్దు చేస్తూ వారినే మరో రూపంలో పెట్టుబడిదారి భూస్వాములుగ, పారిశ్రామిక వేత్తలుగ రూపొందుటకు తోడ్పడుతూ, వ్యవసాయ సంస్కరణల పేరుతో పాలక బూర్జువా వర్గానికి, పెట్టుబడిదారి ధనికరైతు వర్గాన్ని రూపొందించి బలాన్ని చేకూర్చుతూ, ఆర్థిక, పారిశ్రామిక విధానాలలో "మిశ్రమ ఆర్థిక విధానాన్ని సిద్ధాంతంగా" ప్రవచించుతూ, వొకవైపు వ్యక్తి యాజమాన్యంలోని పారిశ్రామికాభివృద్ధికి, మరోవైపు ప్రభుత్వ యాజమాన్యంలో భారీపారిశ్రామికాభివృద్ధికి ప్రథమ తాంబూలమంటూ కొనసాగించేదేశీయ, విదేశీయ రాజకీయ విధానాలు ఆర్థిక, పారిశ్రామిక, వ్యవసాయ సంస్కరణ విధానాలు అన్ని ప్రభుత్వ పెట్టుబడిదారి విధానాన్ని పెంపొందించే మార్గాలే అని ఆనాడు అంత స్పష్టంగా విశదం కాకపోయినా నేడు అందరికీ స్పష్టమైంది.

## పార్టీ కాంగ్రెసు మార్గంలో :

ఎన్నికలు పార్టీలో రాజకీయ విధానంపై జరుగుతున్న అంతర్గత సిద్ధాంత పోరాటాన్ని తాత్కాలికంగా వాయిదా వేసాయి. ఎన్నికల అనంతరం రాజకీయ విధాన ఐక్యతను సాధించుటకై తెలంగాణా పార్టీ ఐక్యతను సాధించటమే ప్రధాన కర్తవ్యంగా అఖిల భారత పార్టీ కేంద్రం తలచింది. అందుకు తెలంగాణా పోరాట ముఖ్యులందరి సమావేశం యేర్పాటు గావించి, అజయ్‌ఘోష్ ప్రధాన కార్యదర్శి సుదీర్ఘ వుపన్యాసం చేసారు. నాటి పార్టీ పరిస్థితి, ఎదుర్కొంటున్న సమస్యలు,పరిష్కారానికి సూచనలు, వివిధ రాజకీయ పరిణామాలపై పార్టీ రాజకీయ విధాన అవగాహనకు వుపన్యాసం అద్దం పట్టుతుంది. ముఖ్యాంశాలను తెలుసుకొందాం.

"ఎన్నికల ఫలితాలు భారతదేశంలోనేగాక ప్రపంచమంతటిలో సంచలనాన్ని కలుగజేసాయి. భారతదేశంలో కాంగ్రెసును వోడించగల ఒక పార్టీ ఉందని.నూతన ప్రజాతంత్ర ప్రభుత్వాన్ని స్థాపించగలదని అశేష ప్రజానీకం ఎదురుచూస్తున్నారు. పార్టీ తప్పులేగాక మంచి పనులు చేసిందని స్పష్టమైంది. మిత్రులు లేవనెత్తుతున్న అనేక ప్రశ్నలకు ఎన్నికల ఫలితాలలో సమాధానాలుకూడ లభించాయి.

"మనలో యే వొక్కరం ప్రధాన చర్చనీయాంశాలపైన రాజకీయంగా కరెక్టుగా ఉన్నామనుట సరియైనది కాదు. ఆ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని చర్చలు సాగించితే ఐక్యతను సులభంగా సాధించగలం. ప్రతి వొక్కరం పాక్షిక సత్యాన్ని మాత్రం చూస్తువచ్చాం. "నేను ముందుగానే యిదే దృక్పథంలో ఉన్నాననిగాని" సరిగా చెప్పాననిగాని అనుకోవడం ఆత్మ, పరవంచన అవుతుంది.[1]"

1. అజయ్‌ఘోష్ (1952) తెలంగాణా పార్టీ ముఖ్యుల సమావేశంలో ఉపన్యాసం. (తెలుగులో) పే 3-4.

"ఆది నుండి కరెక్టు రాజకీయ పంథాకోసరం పోరాడిన వారు పార్టీ కమిటీ లలో మెజారిటీగా వుండాలని, వారి పంథాయే సరియైనదని రుజువైందనే" వాక ధోరణి, "జూన్ సి. సి. లైన్‌కు వ్యతిరేకంగా పోరాడిన వారే మెజారిటీగా వుండా లనే" మరో ధోరణి వున్నాయి. ఈ ధోరణులు తాము తమ ప్రత్యర్థులకంటె ఎక్కువ సరిగా ఉన్నామని అవగాహన నుండి జనించినవి. ఈ ధోరణులతో ఆలోచించితే రాజకీయ నిర్మాణం దుష్ఫలితాలకు దారితీస్తుంది" సంస్కరణవాదులకు వ్యతిరేకంగా పోరాటం సాగించాము కనుకనే యీ విజయాలు సాధ్యమైనవని కొందరు, "సెక్టే రియనిజంకు వ్యతిరేకంగా పోరాడి ఎన్నికలలో పాల్గొనినందునే యీ విజయాలు" అని, మరి కొందరు చేయువాదనలు పొరపాటు. "మన ముందు ఒక రాజకీయపంథా వుంది. రెండు ధోరణులు అనే వాదానికి స్వస్తి చెప్పబడింది. పాత అవగాహన దృష్టితో కొత్త పంథాను చూడరాదు."

"మనం రైతుల భూమి పోరాటాలు సాగించటం, సాధించిన విజయాలను రక్షించుకొనటం, శత్రువాకికి నిలబడి ప్రతి ఘటించాలంటే, పార్టీ ఐక్యతను సాధిం చటం అవసరం. ఎన్నికలే సర్వస్వం కాదు. దున్నేవానికే భూమి సాధించగల విప్ల వోద్యమాన్ని నిర్మించుకొనాలి.

"గతాన్ని గురించి, ఆత్మవిమర్శన అప్పుడే తయారు చేయలేమనే అభిప్రా యానికి వచ్చాం. భవిష్యత్తులో కార్యక్రమం ఆచరించే కొలది, ప్రజలతో సన్నిహిత సంబంధం దృఢతరమయ్యే కొలది, అట్టి ఆత్మవిమర్శన సులభ సాధ్యమగుతుంది. తొందరపడి ఆత్మవిమర్శనకు పూనుకొంటే లాభం కంటె నష్టం హెచ్చు. రెండవ కాంగ్రెసులో గతమంతా తప్పని ఆత్మవిమర్శ చేసుకొన్నాం. అది నేడు తప్పని చరిత్ర రుజువు చేసింది."

"మన విప్లవదశలో నేడు వుత్పత్తికి, అభివృద్ధికి ఆటంకమైన భూస్వామ్య, సామ్రాజ్యవాద శక్తులను నాశనం చేయుట మన కర్తవ్యం. అంటే మన విప్లవం నూతన ప్రజాతంత్ర విప్లవ మొదటిదశ. ఈ దశలో ధనిక రైతువర్గానికి పరిమితుల విధించుట, పరిశ్రమలు జాతీయం చేయాలనే నినాదం వినరాదు. కార్మికుల న్యాయ మైన కూలి, హక్కుల కొరకు పోరాటం సాగిస్తాం. ఉత్పత్తిశక్తుల అభివృద్ధిని నిరో ధించే ఉత్పత్తి సంబంధాలను నాశనం చేయటంవిప్లవంయొక్క కర్తవ్యం. దోపిడి వర్గాలనన్నిటిని తుడిచిపెట్టుట కర్తవ్యంగా నెంచుట గతంలో మనం చేసిన పొరపాటు. చైనాలోవలె మొదటి దశలో ఉన్నాం. ఈ దశలో అన్నివర్గాల ప్రజాప్రభుత్వాన్ని యేర్పాటుచేయుట నేటి కర్తవ్యం.

"జాతీయ బూర్జువావర్గం అంటే మన దేశానికి చెందిన బూర్జువా వర్గమని నేరుగా, స్పష్టంగా చెప్పలేకపోయాం. జాతీయ బూర్జువావర్గ అభివృద్ధికి భూస్వామ్య, సామ్రాజ్యవాద దోపిడి పెద్ద ఆటంకం. కాన జాతీయ బూర్జువావర్గాన్ని విప్లవపోరా టాలలో కలుపుకొని వచ్చుటో లేక తటస్థం చేయుటకో పరిస్థితులు అనుకూలంగా వున్నాయి." అని అజయ్ వివరించారు. ఇంకా "జాతీయ బూర్జువావర్గానికి చెందిన

పరిశ్రమలను జాతీయం చేస్తామని నినాదమీయరాదు. దున్నేరైతుకే భూమినిస్తామని, సామ్రాజ్యవాదుల పెట్టుబడి, పరిశ్రమలు జాతీయం చేస్తామని నినాదమిస్తాం, అమలు పరుస్తాం.[1]"

సంపూర్ణ స్వాతంత్ర్యం అంటే, సామ్రాజ్యవాదాన్ని తుడిచిపెట్టడం, భూస్వామ్య విధానాన్ని రద్దుచేసి రైతులకు భూమి లివ్వటంగా అజయ్ నిర్వచించారు. మౌంటుబాటన్ అవార్డుతో వచ్చిన స్వాతంత్ర్య స్వభావాన్ని అర్థం చేసుకొనక, నిజమైన స్వాతంత్ర్యంగా అంగీకరించాం. రెండవ కాంగ్రెసులో సరిచేసుకొన ప్రయత్నించి "స్వాతంత్ర్యం మోసపూరితమైనదని, నిజమైన స్వాతంత్ర్యం కాదని నిర్వచించామని, స్పష్టత, సూటి పదమనూలేవు" అని అజయ్ అన్నారు. నూతన కార్యక్రమంలో సామ్రాజ్యవాదుల అంటే బ్రిటిషు ఆస్తులను మాత్రమే జాతీయం చేయుట అని స్పష్టం చేసారు. అమెరికన్ సామ్రాజ్యవాదం మన విముక్తి పోరాటానికి ప్రత్యక్షంగా ఎదురువస్తే అప్పుడు మన వైఖరి నిర్ణయించుకొంటామన్నారు.

కార్యక్రమం (1951)లోని కర్తవ్యాలను ముఖ్యంగా వ్యవసాయ విప్లవంపై అజయ్ పేర్కొన్న ముఖ్యాంశాలు యిలావున్నాయి.

"శాంతియుత పార్లమెంటరీ పద్ధతుల ద్వారానే వ్యవసాయ విప్లవం సాధ్యమని పార్టీ చాలించదు. రైతులు చొరవతో పంచుకొనుట ద్వారానే సాధ్యమౌతుంది. అట్టి పంపకాన్ని చట్టబద్ధం చేయాలని కార్యక్రమం స్పష్టంచేస్తున్నది. రాష్ట్ర శాసన సభల్లో మనం పూర్తి మెజారిటీ వచ్చినప్పటికీ దున్నేరైతుకు భూమిరాదు. కేంద్ర ప్రభుత్వంతో సంఘర్షణతప్పదు.

"నేడు తెలంగాణాలోనేగాక అనేక యితరరాష్ట్రాలలోనూ కాంగ్రెసు ప్రజల నుండి వేరైందని ఎన్నికలు రుజువుచేసాయి. అట్టివారికి భూమి పంపక విప్లవోద్యమానికి, తెలంగాణా రైతాంగం మార్గం చూపించింది. అంటే అర్థం ఆ భూముల రక్షణకు రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటాలు విధిగా వుత్పన్నమౌతాయన్నమాట. మన ప్రత్యేక పరిస్థితులలో ఒక్క రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటంద్వారానే సంపూర్ణ విజయం సాధ్యంకాదు. కార్మికవర్గం యొక్క ప్రత్యేక ప్రత్యక్షపాత్ర అనివార్యమౌతుంది. రవాణా, కీలక పరిశ్రమల కార్మికుల పాత్రకు ప్రత్యేక ప్రాముఖ్యత వుంది. కార్మికవర్గం సమ్మెలు, తిరుగుబాటులతో రైతాంగానికి తోడురావలసి వుంది. అంటే భారత విప్లవం రైతుగెరిల్లా పోరాటాల, కార్మికవర్గ తిరుగుబాటుల సమ్మేళనంగా వుంటుంది. అది భారతదేశ విప్లవపంథాగానే వుంటుంది. దీనిని పిడివాదం చేయరాదు. మారే పరిస్థితుల కనుగుణంగా ఎత్తుగడలతో వున్న లీగలు అవకాశాలను వినియోగించుకొని పురోగమించాలి. లీగలు అవకాశాలు అలాగే కొనసాగునునే భ్రమలకులోను కారాదు. భవిష్యత్తు కాలానికంతా వ్యూహాన్ని ఎత్తుగడల

1. అజయ్‌ఘోష్ (1952) తెలంగాణా పార్టీ ముఖ్యుల సమావేశంలో వుపన్యాసం (తెలుగు) పే. 182.

పంథాని నిర్ణయించి వుద్భవించే సమస్యలకు అందులోనే సమాధానాలు వెతుకుట పొరపాటు. వ్యూహం ఎత్తుగడల పత్రంలో కొన్ని విశాల సూత్రాలు చేయబడ్డాయి. వాటిపై ఆధారపడి, ఎదుర్కొనవలసిన పరిస్థితులకు అనువగు ఎత్తుగడలను రూపొందించుకొనాలి"[1]. అజయ్ తదుపరి రైతుగెరిల్లా పోరాటాలంటే యేమిటో కొంత వివరించారు.

"ఎత్తుగడల పత్రం రూపొందించి సంవత్సరంపైగా అయింది. ప్రజలలో అత్యధికులు కాంగ్రెసు ప్రభుత్వానికి వ్యతిరేకులని, ప్రజా ప్రభుత్వాన్ని స్థాపించాలని కోరుతున్నారన్నాం. కాని కాంగ్రెసు ప్రభుత్వాన్ని కూలద్రోయాలనే విప్లవ చైతన్యానికి రాలేదు. ఎత్తుగడలు నిర్ణయించునపుడు అత్యధిక ప్రజల మనస్తత్వాన్ని, చైతన్యాన్ని గమనంలోనికి తీసుకొనాలి. ఒక కార్యక్రమముండాలి. దానిపై ఐక్య సంఘటన నిర్మించాలి. ఈ దశలో పరిస్థితులనుబట్టి రైతాంగ గెరిల్లా పోరాటాలు తక్షణ హక్కులకై పాక్షిక పోరాట పరిమితులలోనే సాగించాలి. అవి నేటి ప్రభుత్వాన్ని కూలద్రోసే లక్ష్యాన్ని పెట్టుకొనలేవు. ఇలాంటి అనేక గెరిల్లా పోరాటాలు సాగించుటద్వారా అత్యధిక ప్రజానీకాన్ని కాంగ్రెసు ప్రభుత్వాన్ని కూలద్రోసే ఆఖరి పోరాటానికి సమీకరించగలుగుతాము. దేశంలో అంతిమ పోరాట పరిస్థితులులేవు. అంటే రైతాంగ గెరిల్లా పోరాటాలు సాగించరాదని కాదు, అవి రైతుల పాక్షిక హక్కుల రక్షణకై జరుగుతున్నవని గుర్తించుకొనాలి. తదుపరి అజయ్ రైతాంగ సాయుధగెరిల్లా పోరాటాలు ఏ పరిస్థితులలో, ఏక్రమంలో అంతర్యుద్ధ పోరాటాలుగ మారునో వివరించారు.

ఐక్య సంఘటనలు, సంఘటనా ప్రభుత్వాలు, వాటి విధానాల అవగాహనలపై అజయ్‌ఘోష్ కొన్ని నిశ్చితాభిప్రాయాలను వెల్లడించారు. "ఈ ప్రభుత్వాలకు కనీస కార్యక్రమం యిస్తున్నాం. దశకంతకు యిచ్చిన కార్యక్రమంలో కొంత తగ్గించిన కొత్తకార్యక్రమము. ఐక్య సంఘటనా ప్రభుత్వాలు ప్రజా వ్యతిరేక శక్తులతో పోరాడుటకు ఒక పోరాట సాధనంగా వుంటాయి. దీర్ఘ కాలం వీటిని పనిచేయనిస్తారనుకోవటం భ్రమ అవుతుంది. కేంద్రప్రభుత్వంతో సంఘర్షణలు వస్తాయి. అయినా వాటిని కోరుతున్నాం. ఐక్యసంఘటనా నినాదం శత్రువర్గాలను గందరగోళ పర్చేందుకు, ప్రభుత్వ యంత్రాంగపు బిగువును సడలించేందుకు, ప్రజాపోరాటాలు పురోగమించేందుకు వుపయోగపడుతుంది. ప్రజలకు కొన్ని రాయితీలను చేకూర్చేందుకు తోడ్పడుతుంది. పిడివాదంతో కొన్ని పోరాట రూపాలకే పరిమితంకాకుండా, వాస్తవ పరిస్థితుల కనుగుణంగా పోరాట రూపాలను, ఎత్తుగడలను నిర్ణయించుకొనుట స్పష్టం.

పార్టీ ఆదర్శాలు, సిద్ధాంతాలు, విడనాడి అవకాశవాదంతో చేతులు కలుపరాదు. సిద్ధాంతాల పేరిట అనుకూల పరిస్థితులను, అవకాశాలను వదులుకొనరాదు;

---

1. అజయ్‌ఘోష్ (1952) తెలంగాణాపార్టీ ముఖ్యుల సమావేశంలో వుపన్యాసం (తెలుగు) పే. 182.

పిడివాద పంథాలో నినాదాలు, పోరాట రూపాలు, ఎత్తుగడలు వుండరాదు. అట్లే భవి ష్యత్తులో ఎత్తుగడల వివరాలను ప్రకటించరాదు. అన్ని అభివృద్ధికర ప్రజాశక్తులను విస్తృత ప్రజా సంఘటనలో సమీకరించేందుకు అలా చేయవలసి వుంటుంది. నినా దాలు, పోరాట రూపాలు, చెప్పేజోస్యాలు కాంగ్రెసు వ్యతిరేక బహుసంఖ్యాక ప్రజానీక చైతన్యానికి అందుబాటులో వుండాలి.

పార్టీ నిర్మాణం ఛిన్నాభిన్నమైపోయింది. రాజకీయ విధానం, వ్యూహం, ఎత్తు గడలపై భేదాభిప్రాయాలు ఎక్కువై పార్టీలో అంతర్గత పోరాటం తీవ్రరూపం దాల్చింది. ఎన్నికల పోరాటంలో తాత్కాలికంగా కలసిపనిచేసినా, ఎన్నికల ఫలితా లను వివిధ దృక్పథవాదులు తమతమ రాజకీయ ధోరణులకు అనుకూలంగా వ్యాఖ్యా నించుకొంటూ అభిప్రాయభేదాలు యినుమడింప చేసుకొంటున్నారు. నిర్మాణరంగం లోనూ యిదే జరుగుతున్నది ఈ నేపథ్యంలో అజయ్ వెలిబుచ్చిన అభిప్రాయాలు గమనార్హము.

"విశాలమైన పార్టీలో భేదాభిప్రాయాలు, భిన్నదృక్పథాలు, వైఖరులు సహజం. చర్చించి, పరస్పరం వొప్పించుకొనే విధానమే పరిష్కారమార్గం. నిర్ణ యించిన తరువాత మెజారిటీ అభిప్రాయాలకు మైనారిటి కట్టుబడివుండాలి. మెజారిటీ మైనారిటి అభిప్రాయాలను గౌరవించాలి. ఒకరినొకరు అనుమానించుకొనుటగాని, అతివాదులని, మితవాదులని పేర్కొనుట తగనిది. ఈవిధాన క్రమంలో చర్చలు, నిర్ణయాలు, వాటిని అమలుపర్చే శిక్షణ పార్టీకి ప్రాణం. ఇదిలేకుంటే పార్టీయేలేదు:

"ఇటీవల మన పార్టీలో జరిగిన చర్చల పద్ధతి ఒక గాడితప్పిన పద్ధతి. అలాంటి చర్చలు ప్రపంచంలో యే పార్టీలో జరుగలేదు. మన అంతరంగిక చర్చలు, పార్టీ నిర్మాణసూత్రాలను దాటిపోయాయి. ఆ చర్చల్లో పార్టీ గతాన్నంతా నిరశించే పంథాలో కొన్ని వున్నాయి ప్రజాస్వామ్యం పేరిట శిక్షణ శూన్యమైన అరాజకము, కేంద్రీకృత నాయకత్వం పేరిట నిరంకుశ పెత్తందారీతనం తలెత్తాయి. కేంద్రీకృత ప్రజాస్వామ్యం దెబ్బతినిపోయింది. అంటే, ప్రజాస్వామ్య చర్చలు, కేంద్రీకృత ఆచ రణ రెండూ క్షీణించిపోయాయి. చర్చల్లో వుపయోగించిన భాష, శత్రువును దుయ్య బట్టే పదజాలంతో నడచింది. లెనిన్ కాట్స్కీని యే శైలిలో దుయ్యబట్టాడో ఆ పద జాలం ఆంతరంగిక చర్చల్లో ఒకరిపై మరొకరు వుపయోగించారు. టిటోయిస్టులని, ట్రాట్స్కీయిస్టులని, సామ్రాజ్యవాద యేజంట్లని విరివిగా ఉపయోగించబడ్డాయి. చర్చలు యిద్దరు పార్టీ బాధ్యుల మధ్య అనే దృష్టి మృగ్యమైంది. ఒకరినొకరు వొప్పించు కొనాలనే పంథాలు చర్చలు కొనసాగాలి. అభిప్రాయ భేదాలు రావటం సహజం. కేంద్రకమిటి సభ్యులలోగాని, పై కమిటీలలోగాని భేదాభిప్రాయాలు వచ్చినప్పుడు, అవి ఆ కమిటిలలోనే చర్చించుకోవాలి. ఆ కమిటీలలో తేలకపోతే విస్తృత కమిటీ సమావేశాలలో చర్చించి, తేల్చుకోవాలి. అక్కడా తేలకపోతే, నియమావళి ననుస రించి పార్టీ కాన్ఫరెన్సులలోనో, కాంగ్రెసులోనో తేల్చుకోవాలి. అంతేగాని చర్చ లను, భేదాభిప్రాయాలను ఎప్పటికప్పుడు క్రిందివరకు తీసుకొని పోవడం సరికాదు.

ముఖ్యంగా సాయుధ పోరాటం సాగించాలా? విరమించాలా? అనేటువంటి సమస్య లను ఎన్నడూ బాహాటమైన చర్చలకు పెట్టరాదు అలాంటి చర్చలు శతృవు కుప యోగపడతాయి, విప్లవానికి నష్టం చేస్తాయి. నేడు మన పార్టీలో మార్క్సిజానికి వ్యతిరేకంగా కరుడుగట్టిన ముఠాలంటూ లేవు కాన బహిరంగపర్చే చర్చలు మన కవసరం లేదు, పైగా హానికరము.[1]"

అజయ్ తెలంగాణా పోరాటాన్ని ఎప్పుడు ఉపసంహరించి వుండాలిసిందనే ప్రశ్నకు "తెలంగాణా పోరాటం, ఉధృత,శతృసైన్యాల కేంద్రీకరణ ప్రజలను మెసల కుండా, నిర్బంధ విధానంలో వుంచగలిగినపుడు పోరాటరూపాన్ని, నినాదాలను మార్చుకొనవలసింది కారణం, ప్రజలు పోరాటంలో పాల్గొనే అవకాశం సన్నగిల్లి, ప్రజల పాత్ర లేకుండా పోయినపుడు, గెరిల్లా పోరాటం సాధ్యంకాదు.తగదుకూడాను అట్టి స్థితిలో ఒక్కొక్కసారి గెరిల్లా పోరాటం, రెండవ దశనుండి మొదటి దశకు లేక మూడవదశ నుండి మొదటి దశకు వెనుకకు పోవలసిరావచ్చు. నాయకత్వం చాకచక్యంతో తిరోగమనం, పురోగమనం చేయుటకు సిద్ధంగా వుండాలి.[2]"

**విస్తృత 30 డిశెంబరు, 1952 కేంద్రసమితి సమావేశం :**

అక్టోబరు 1951, అఖిల భారత కమ్యూనిస్టు కాన్ఫరెన్సు తరువాత కేంద్ర సమితి, రాష్ట్రాల కమిటీల సభ్యుల విస్తృత ప్లీనరీ సమావేశం 30 డిశెంబరు 1952 నుండి 10 జనవరి 1953 వరకు జరిగింది సమావేశం ముఖ్య రాజకీయ పరిణామా లను సమీక్షించింది.[3] సారాంశం యిలా వుంది.

1) ఎన్నికల పోరాటంలో పార్టీ సభ్యులందరూ, సానుభూతిపరులు, బలపరచే వారు అసంఖ్యాకంగా పాల్గొని పార్టీ విజయాలను, నినాదాలను విస్తృత ప్రచారం గావించి లక్షల మందిని సమీకరించారు. ఎన్నికలలో పార్టీ విజయాలు పార్టీలో నిరాశ, నిస్పృహ, నిరుత్సాహంతో పార్టీ ప్రజలనుండి వేరుపడుటనే చూచి నీరుగారి పోయిన వారికి కనువిప్పు కలిగించింది.

2) కాంగ్రెసు ఎత్తుగడలలో నైపుణ్యాన్ని ప్రదర్శించి, ప్రజలను గందరగోళ పరచి, కార్యకర్తలలో చీలికలు కలుగజేసి తిరువాన్కూర్ - కొచ్చిన్, మద్రాసు రాష్ట్రాలలో అధికారాన్ని చేబట్టి. ఎన్నికలలో చావుదెబ్బతిన్న కాంగ్రెసుకు ప్రాణం పోసింది.ఆచరణలో ప్రజాఐక్యతను నిర్మించి పోరాడుట కాంగ్రెసును తీవ్రవిమర్శకు గురిచేయుట ద్వారా ప్రజా ఉద్యమాలు పురోగమించగలవు.

---

1. అజయ్‌ఘోష్ (1952) తెలంగాణా పార్టీ ముఖ్యుల సమావేశంలో ఉపన్యాసం. (తెలుగులో) పే 35-38.

2. అదే పే. 43-44.

3. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర (1977) అధికారపత్రాలు. వా. VIII. పే. 199-202.

3) కాంగ్రెసు అధికారంలో స్వశక్తిపైనేగాక, ప్రజా సోషలిస్టుపార్టీ విచ్ఛిన్నకర శక్తులపై, తదితర కమ్యూనిస్ట్ వ్యతిరేకశక్తులపై ఆధారపడివుంది. ఆ విధంగా ప్రజాస్వామ్య ఉద్యమానికి హాని చేసింది. ఈ శక్తులలో కొన్ని మతతత్వ శక్తులతో చేతులు కలిపి పాకిస్తాన్‌పై ఆంక్షలు విధించాలనే ఆందోళన కొనసాగించాయి.

4) ఆగస్టు 1947 తరువాత, యింతటి ఐక్యతావాంఛ, యిన్ని ప్రజా పోరాటాలు, శక్తివంతమైన నాయకత్వం లభించనపుడు యాదృచ్ఛికంగా యింతటి బలమైన ప్రజా ఐక్యతావాంఛ కానరాలేదు. అయినా ఆర్థిక సంక్షోభం తీవ్రమగుటతో ప్రభుత్వం ప్రజలపై భారాన్ని అధికం చేయుట, గుత్త పెట్టుబడిదారులకు, భూస్వాములకు రాయితీల నిచ్చింది.

5) ఈ పోరాటాల ప్రత్యేక లక్షణంగా నూతన ప్రాంతాలనుండి, నూతన ప్రజా వర్గాలు పాల్గొనుట.ఈ సమావేశకాలంలో అమ్మకపు పన్నుకు వ్యతిరేకంగానే రాష్ట్రములో అన్ని వర్గాల ఐక్యపోరాటం, పంజాబులో వుపాధ్యాయుల సమ్మె,మద్రాసులో పోలీసుల సమ్మె జరుగుతున్నది. ఎన్నికల అనంతరం ప్రజా పోరాటాలు వెనుకాడినవని, చొరవ అభివృద్ధి నిరోధకుల చేతులలోనికి పోయిందని కొందరనుట వాస్తవం కాదు.

6) వ్యవసాయ సంక్షోభం గతంలో కంటె తీవ్రమైంది. రైతుల కొనుగోలు శక్తి పూర్తిగ పడిపోయింది రాష్ట్రం నుండి రాష్ట్రానికి కరువు పరిస్థితులు వ్యాపించుచున్నవి. పారిశ్రామికరంగంలో చిన్న, భారీ పరిశ్రమలలో సంక్షోభం యిప్పుడు వ్యాపించింది. నిరుద్యోగం పెరిగిపోయి సర్వసాధారణమైంది. వ్యాపార సంబంధాలలో ఆంగ్లో-అమెరికన్‌లపై ఆధారపడినందున ద్రవ్యోల్బణం పెరిగిపోయి, ధనికులను మరింత ధనికులుగా, బీదలను మరింత బీదలుగా చేసింది. రైతులపై భారాన్ని ప్రభుత్వం తగ్గించనందున మరింత బీదలయ్యారు.

7) సంక్షోభానికి కారణమైన విధానాలను మార్చక ప్రభుత్వం, సామ్రాజ్యవాదులకు మరింత చేరువగుచున్నది. భారత అర్థవలస-ఆర్థిక విధానాన్ని కొనసాగించే పంచవర్ష ప్రణాళికల భారాన్ని ప్రజలపై ప్రభుత్వం మోపుతున్నది. గుత్త పెట్టుబడిదారులు సంక్షోభంనుండి బయటపడుటకు అవలంభించు మార్గమిది.

8) అల్పసంఖ్యాకులైన భూస్వాములు, గుత్తపెట్టుబడిదారులను, బహుళసంఖ్యాకులైన అన్నివర్గాల ప్రజానీకం సంఘర్షించే పరిస్థితి తీవ్రమగుచున్నది. ప్రభుత్వ వర్గాలలో గూడ సంఘర్షణలు తీవ్రమగుచున్నవి. ఫలితంగా ఐక్యసంఘటన యేర్పాటు పరిస్థితులు రూపొందుతున్నవి.

9) ప్రభుత్వపు అభివృద్ధి నిరోధకశక్తుల దాడితో భారత స్వావలంభనకే ప్రమాదమగుటతో ప్రజలు ఆచరణలో ఐక్యతకు, ప్రభుత్వ ఆహార విధానాలకు నిరుద్యోగానికి, కాలేజీల, పాఠశాలల జీతాల పెరుగుదలకు, బేదఖళ్ళకు వ్యతిరేకంగా, భాషాప్రయుక్తరాష్ట్రాలకై రైతులు పోరాటాలు జరుపుతారు.

10) విస్తృత ప్రజాపోరాటాలను యెదుర్కొనవలసినపుడు ప్రభుత్వం వెను తిరిగి ప్రజలకు రాయితీల నిచ్చింది. ఆంధ్ర రాష్ట్రమేర్పాటు ప్రకటన నిదర్శనం. ప్రజా ఐక్యత, ప్రజాపోరాటాలు ప్రభుత్వదాడిని త్రిప్పికొట్టగలవు.

11) ఎలక్షనుల తరువాత ప్రజోద్యమాలు ఎంతో అభివృద్ధిచెందినా, అసమాన వ్యాప్తివలన బలహీనంగా వున్నవి. సంపూర్ణస్వాతంత్ర్యం,ప్రజాస్వామ్యానికై నిజమైన జాతీయ పోరాట వెల్లువ అభివృద్ధిచెందవలసివుంది పార్టీ యింకా బలహీనంగానే వుంది. అది ప్రధాన బలమైన శక్తియైన రాష్ట్రాలలోగూడ చిన్నప్రాంతాలలోనే బలంగా వుంది.

12) స్టాలిన్ తాజాగ్రంథంలో సూచించిన విధంగానే భారత అభివృద్ధి, అంతర్జాతీయ పరిణామాల అభివృద్ధిలో భాగంగానే జరుగుతుంది. అదే సి పి యస్ యు కాంగ్రెసులో స్పష్టంచేయబడింది. మెలంకోవ్ చెప్పిన విధంగా శాంతి పరిరక్షణ, యుద్ధోన్మాదులకు వ్యతిరేకంగా పోరాటం నేటిమౌలిక కర్తవ్యం, జాతి రక్షణ స్వాతంత్ర్యం, విస్తరణ పోరాటాలతో ముడివేయబడివుంది. మానవాళి కర్తవ్యమిది.

విస్తృత ప్లీనరీ సమావేశంపై రాజకీయ అవగాహనతోపాటు, ప్రపంచశాంతి పరిరక్షణ, ఇండో-సోవియట్, ఇండో-చైనా మిత్ర సంఘాలను బలపరచుట, ఫ్యాక్టరీ, గ్రామాలలో వాటిని యేర్పాటు చేయాలని ఆహారవుత్పత్తి, పంపకం సంక్షోభంలో పడుటతో లభించే కొద్దిపాటి ఆహార పదార్థాలను కొనుగోలు చేయలేకపోతున్నారని, ధరలు తగ్గించాలని, కరువు బాధితులకు సేవా కేంద్రాలను ప్రభుత్వం యేర్పాటు చేయాలని ఆందోళనగావించాలని; రైతులు ఋణభారం, వడ్డీలు, పన్నుల భారాన్ని మోయలేకుండా వున్నారని కౌలు తగ్గింపుకు, వడ్డీరేటులతగ్గింపుకు, పన్నుల తగ్గింపుకు, బేదఖళ్ళకు వ్యతిరేకంగా రైతుల సమీకరించి, పోరాటాలు కొనసాగించాలని, నిరుద్యోగానికి, వేతనాల తగ్గింపుకు వ్యతిరేకంగా కార్మికుల సమీకరించాలని, పంచవర్ష ప్రణాళికల భండారాన్ని ప్రచారంలోవెల్లడించాలని, ఇండియా పాకిస్తాన్‌లు పరస్పర ఆర్థిక సహకారాన్ని పెంపొందించుకొనాలని, భాషాప్రయుక్త రాష్ట్రాలను యేర్పాటుగావించాలని, పౌరహక్కులకై పోరాడాలని తీర్మానించింది.

## పార్టీ పునర్నిర్మాణం :

విస్తృత ప్లీనరి సమావేశం, పార్టీ పునర్నిర్మాణం, పటిష్టంచేయు ప్రయత్నంగా కొన్ని ముఖ్యసూచనలు చేసింది. క్లుప్తంగా అవి యివి.

పార్టీ నిర్మాణ ఐక్యతను. సిద్ధాంత ఐక్యతను కలిగియుండిన పై కర్తవ్యాన్ని నిర్వహించుట సుసాధ్యం. సైద్ధాంతికంగా పరిపూర్ణునిగా నిర్మాణంలో వుక్కు క్రమ శిక్షణ కలవానిగా ప్రతి సభ్యుని సానుభూతిపరుని చేయుట ప్రథమ కర్తవ్యం. నిర్మాణ ఐక్యతను పునరుద్ధరించుట, బలపరచుట వుక్కు, శిక్షణ గరపుట మౌలిక కర్తవ్యం. ఇదొక ప్రత్యేక కర్తవ్యంగా నెంచినపుడే యిది సాధ్యం. ఈ కర్తవ్యం మొదల అశ్రద్ధవహించుట పార్టీకి, ప్రజాస్వామ్య వుద్యమాలకు అత్యంత నష్ట

దాయకం. ఈ సందర్భంగా "కొన్ని మన ముఖ్య బలహీనతలు" అన్న వ్యాసాన్ని కాంగ్రెస్‌కు గుర్తుచేయవలసివుంది.

ఈ కర్తవ్యాన్ని వెంటనే చేబట్టుటకు కొన్ని వర్గాలలో నేటి పరిస్థితులలో ఈ కర్తవ్యాన్ని చేబట్టరాదని గల వ్యతిరేక వాదాన్ని పరిశీలించవలసివుంది. పార్టీ రాజకీయ ఐక్యతను పూర్తిగా సాధించలేదు. వాస్తవమేమంటే పార్టీ రాజకీయ ఐక్యతకు తగిన భూమిక కేంద్రసమితి అధికారపత్రాలలో, యల్ పి సి డీ న్యూస్లెటర్స్ క్రాస్‌రోడ్సు న్యూయేజ్‌లలో వచ్చిన వ్యాసాలలో యేర్పడివుంది. ఆ ఐక్యతను ముందుకు కొనిపోవుటయే కర్తవ్యం. ఈ కర్తవ్యాన్ని చూడజాలకపోవుట అంటే, రోజువారి ఎత్తుగడలలో ప్రతి చిన్నవిషయాన్ని వివరాలతో ప్రతివొక్కరు సంతృప్తికరంగా పరిశీలింపకపోవుట కారణంగా వ్యక్తిగతంగా ప్రతి పార్టీసభ్యుడు యిష్టానుసారం మాట్లాడుటకు, ఆచరించుటకు పూర్తి స్వాతంత్రుడు అనే దాని అర్థం. లెని నిజానికి సంబంధంలేనిది ఈ నిర్మాణ సూత్రం లెనిన్, స్టాలిన్‌లు అనేక పర్యాయములు చెప్పినట్లు సరియైన రాజకీయ ఎత్తుగడల విధానపు ఆచరణ బాగా నిర్మించబడిన రాజకీయ విధాన మార్గాన పార్టీ పద్ధతులలో, నిర్మాణక్రమ పద్ధతిలో పార్టీలో అంతర్గత పోరాటం కొనసాగించవలసి వుంటుంది.

పార్టీని, ఐక్యతను, క్రమశిక్షణను పునరుద్ధరించుట, తప్పుడు విధానాలకు, సిద్ధాంతాలకు, ఎత్తుగడలకు వ్యతిరేకంగా పార్టీలో అంతర్గత పోరాటానికి ముడిపడి వుంది. వాస్తవం, స్థిరమైన పార్టీ ఐక్యత, నిజమైన కార్మికవర్గ క్రమశిక్షణ, సూత్రబద్ధం, క్రమబద్ధమైన పార్టీ అంతర్గత పోరాటంవలననే ఏర్పడి ఆచరించుట జరుగుతుంది. కమ్యూనిస్టుపార్టీ అభివృద్ధికి యిదే మూల సిద్ధాంత సూత్రమని స్టాలిన్ పదే పదే నొక్కి చెప్పాడు[1].

అంతేగాక "పార్టీ అన్ని స్థాయిల నాయకత్వం, ముఖ్యంగా కేంద్రసమితి నాయకత్వం, కేంద్ర నాయకత్వంపై, క్రమబద్ధంగా, విమర్శ, ఆత్మవిమర్శనను ప్రయత్నాపూర్వకంగా, నిర్మాణయుతంగా కొనసాగించే గురుతర బాధ్యత, వారి భుజస్కందాలపైవుంది. నామమాత్రంగా పార్టీ వర్గాలు వారి అభిప్రాయాలను వెలిబుచ్చుటను ఆమోదించుట మాత్రమేగాక, వారి అభిప్రాయాలను స్వేచ్ఛగా, నిర్భయంగా వెలిబుచ్చునట్లు ప్రోత్సహించుటయేగాక, వారి సూచనలు, ఫిర్యాదులను, విమర్శనలను నాయకత్వం పార్టీ రాజకీయ విధానం, ఎత్తుగడలు, పని విధానాన్ని మెరుగుపరచుటకై ప్రత్యేకించి పరిగణలోనికి తీసుకొనవలసిన అవసరమందని[2]" చివరి పేరాలో వివరించింది.

---

1. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర (1977) అధికారపత్రాలు (ఆంగ్లంలో) వా. VIII పే. 210.
2. భారత కమ్యూనిస్ పార్టి చరిత్ర (1977) అధికారపత్రాలు (ఆంగ్లంలో) వా. VIII. పే. 210.

## మధురై పార్టీ కాంగ్రెసు రాజకీయ విధానం :

మధురై కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసు ముందున్న పరిస్థితిని, ముఖ్యంగా 1951 కార్యక్రమంపై పార్టీ అంతర్గత చర్చల తీవ్రస్థాయిని "కార్యక్రమం యేమైనా, మౌలికంగా పిడివాద దృక్పథంతో నిండివుందని[1]" నంబూద్రిపాద్, "పిడివాదం, సంస్కరణ వాదం అని వాద ప్రతివాదనలు జరిగాయి[2]" అని అధికారి 1960 దశకంలో వ్యాఖ్యానించారు. పార్టీ కాంగ్రెసు చిత్తు తీర్మానాన్ని, డిశెంబరు 1952 విస్తృత ప్లీనరీ సమావేశంలో చర్చించి, వివిధ స్థాయి పార్టీ కాన్ఫరెన్సులలో చర్చల నిమిత్తం జనవరి 1953లో విడుదల చేసింది మధురై పార్టీ కాంగ్రెసు డిశెంబరు 1953 నుండి జనవరి 4, 1954 వరకు జరిగింది, ఆమోదించిన ప్రధాన రాజకీయ విధాన తీర్మానంలోని ముఖ్యాంశాలు యీ క్రింది విధంగా ఉన్నాయి.

1. కొరియా యుద్ధంలో వీరకొరియా సైనికులు, చైనీస్ వలంటీర్లు అమెరికా ఆశలను అడియాశలు చేయుటతో, సామ్రాజ్యవాదుల పక్షంలో ఆర్థిక, రాజకీయ సంక్షోభం తీవ్రతరం కాజొచ్చింది, ముఖ్యంగా ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదాల మధ్య వైరుధ్యాలు తీవ్రమైనాయి. అటం, హైడ్రోజన్ బాంబుల అమెరికా గుత్తాధిపత్యాన్ని రష్యా బ్రద్దలు చేసింది వలన, అర్థవలస దేశాలలో ప్రజాపోరాటాలు వెల్లువగా విజృంభించాయి. ప్రపంచశాంతి, యుద్ధ వ్యతిరేకోద్యమం ప్రపంచ ప్రజలను ఆకర్షించి బలీయమైనదైంది.

భారతదేశపు శాంతి విదేశాంగ విధానము, కొరియాలో శాంతిస్థాపన ప్రయత్నాలు, రష్యాతో కలిసి ఐక్యరాజ్య సమితిలో చైనా సభ్యత్వాన్ని పునరుద్ధరణ చేసిన ప్రయత్నాలు ప్రపంచ ప్రజల మన్ననలను పొందాయి. బ్రిటన్, ఫ్రాన్స్ సామ్రాజ్యవాదాలు ఆసియానుండి యుద్ధానంతరం నిష్క్రమించుటతో అమెరికా ఆ శూన్యాన్ని ఆక్రమించే ప్రయత్నాలలో భాగంగా వియత్నాం, ఇండోనేషియా, ఇండోచైనా, మలయా, బర్మాలలో శేష సామ్రాజ్యవాద శక్తులు కాలూని బలపడుటకు ఆర్థిక, సైనిక సహాయాన్నందిస్తూ సైనిక కూటములు యేర్పరచుటకు ప్రయత్నిస్తున్నది అమెరికా, పాకిస్తాన్‌తో సైనికకూటమికి ప్రయత్నిస్తూ, కాశ్మీర్‌లో జోక్యానికై వేసే ఎత్తుగడలు భారతదేశాన్ని ప్రమాదంలోకి తోస్తున్నాయి. దీనితోపాటు ఆర్థిక, పారిశ్రామిక రంగాలలో అమెరికా ప్రవేశం యీ ప్రమాదాన్ని చేరువ చేస్తున్నాయి.

కాన, కమ్యూనిస్టు పార్టీ అమెరికా యీ దుష్టపన్నాగాలను దేశభక్తులైన ప్రజలలో బట్టబయలుచేసి, విస్తృత ఐక్యతను నిర్మించి, శాంతి, స్వాతంత్ర్యం,

---

1. నంబూద్రిపాద్, E M S (1964) రివిజనిజం అండ్ డాగ్మాటిజం ఇన్ ఇండియన్ కమ్యూనిస్టు పార్టీ. పే. 2.

2 అధికారి, జి. (1964) కమ్యూనిస్టు పార్టీ అండ్ ఇండియన్ పాత్ టు నేషనల్ రీజనరేషన్ అండ్ సోషలిజం.... .... .... పే. 12.

ప్రజాస్వామ్యాలను ప్రమాదాన్నుండి దేశాన్ని కాపాడాలి. సామ్రాజ్యవాదాల క్రింద అణగారిపోతున్న గోవా, పుదుచ్చేరి, యానాం, చంద్రనగర్ ప్రజల విముక్తికై ప్రజాపోరాటాలు కొనసాగించాలి.

2) భారత ఆర్థిక, వ్యాపార సంబంధాలు బ్రిటన్‌తో బ్రహ్మముడి వేసుకొన్నందున వివిధ రూపాలలో ఇండియా దోపిడి కొనసాగుతూనే వుంది. అసమాన వ్యాపార సంబంధాలు, మన ఎగుమతులు, దిగుమతులన్నీ బ్రిటన్-అమెరికాల దయా దాక్షిణ్యాలపైన ఆధారపడినందున ధరల కుంభకోణాలు, వ్యాపారలోటుల మన స్టెర్లింగు నిల్వలను కరిమ్రింగిన వెలగపండు చందం చేస్తున్నాయి.ఎంతో అవసరమైన యంత్రాల దిగుమతి నిరాకరణ, విదేశీయ పోటీతో దేశీయ పరిశ్రమ క్షీణత, దేశీయ పరిశ్రమలలో విదేశీ పెట్టుబడి వొత్తిడి ఫలితంగా సామ్రాజ్యవాదులకు భారత జాతీయ బూర్జువావర్గానికిగల వైరుధ్యం తీవ్రతరమై బడా బూర్జువావర్గంలోని కొన్ని వర్గాలు సైతం తమ వ్యతిరేకతకు రూపాన్నిస్తున్నారు. జాతీయ పరిశ్రమలలో ముఖ్యంగా వినిమయ వస్తు పరిశ్రమలలో యీ సంక్షోభం తీవ్రమైంది. ఇప్పటివరకు ప్రభుత్వం, గుత్త పెట్టుబడిదారి మిలాఖత్ వర్గాలు వుత్పత్తి తగ్గినందునే మార్కెట్టులో వస్తువుల కొరతంటూ వచ్చి, యిప్పుడు 'అధికోత్పత్తి సంక్షోభం' ముఖ్యంగా పంచదార,గుడ్డల మిల్లులలో వచ్చిందంటున్నారు. వాస్తవానికి సంక్షోభం వచ్చింది అధికోత్పత్తుల వలన కాదు, ప్రజల కొనుగోలుశక్తి పూర్తిగా పడిపోవుటవలన వచ్చింది. దీనితోపాటు వ్యవసాయ, పారిశ్రామిక వస్తువుల ధరల మధ్యగల అంతరం యీ సంక్షోభ తీవ్రతను యినుమడింప జేసింది.

3) "అధిక పారిశ్రామికోత్పత్తి సంక్షోభానికీ" మూలకారణం "ఆహారోత్పత్తి పడిపోయిన కారణంగా యేర్పడిన వ్యవసాయార్థిక సంక్షోభం" అని ప్రణాళికా సంఘం పేర్కొంది వ్యాపార పంటల ధరలు పడిపోయాయి. గ్రామీణ పరిశ్రమలు క్షీణించుటతో కరువు పరిస్థితులు యేర్పడినవి. వ్యవసాయ సంక్షోభం జాతి సంక్షోభమైంది. అంటే జాతి ఆహారకొరత, పరిశ్రమలకు ముడి పదార్థాల కొరత యేర్పడింది. ఎగుమతి దిగుమతుల అంతరం పెరిగింది. విదేశాలపై ఆధారపడుటతో జాతి స్వాతంత్ర్యం, సార్వభౌమాధికారులకు ప్రమాదం యేర్పడింది.

భూస్వామ్య విధానాన్ని రద్దుచేసి, రైతులకు అధికోత్పత్తి ప్రోత్సాహమిచ్చి, పరిశ్రమలకు ముడిసరుకులు,పంటల ధరలు పెంచి ప్రజల కొనుగోలుశక్తిని పెంచుట మినహా ప్రభుత్వానికి మరో మార్గంలేదు. బ్రిటిషు పరిశ్రమలను జాతీయంచేసి, ప్రభుత్వరంగాన్ని విస్తరించి, సామ్రాజ్యవాదుల చెప్పుచేతలనుండి పార్ధీ శ్రామిక విధానాన్ని రక్షించాలి.

4) ప్రభుత్వం భాషాప్రయుక్తరాష్ట్రాల ప్రాతిపదికపై సంస్థానాలను విచ్ఛిన్నం చేసి రాష్ట్రాలను పునర్నిర్మాణంచేయుట, రాజప్రముఖులనుతొలగించుట, 'సి' రాష్ట్రాలలో ప్రజల స్వపరిపాలన నెలకొల్పుటకు విముఖంగా వుంది. త్రిపుర, మణిపూర్, కచ్ రాష్ట్రాలలో శాసనసభల యేర్పాటును నిరాకరించుతున్నది. సైనిక, పోలీసు

పద్దులక్రింద బడ్జెటుల్లో పెద్దమొత్తాలను చేర్చుతూ, ప్రజా సర్వీసు శాఖలను, విద్య, ఆరోగ్య, పబ్లిక్‌వర్క్సు శాఖలకు తగిన మొత్తాలను కేటాయించక ఎండగట్టు చున్నది.

5) ప్రభుత్వ గుత్త పెట్టుబడిదారి, భూస్వామ్యవర్గాల విధానాలకు వ్యతిరేకంగా గత రెండు సంవత్సరాలనుండి ప్రతిఘటన వేగంగా పెరుగుచున్నది. ఆర్థిక సంక్షోభంతో ధరలు పెరుగుట ప్రజల జీవితం దుర్భరమైంది. ప్రభుత్వ విధానాలకు ప్రతిఘటన వివిధ రూపాలలో వెల్లడి అగుట గమనించాలి.[1]

1) దైనిక జీవిత దుర్భర సమస్యలు : అధికపన్నులు, ఆహార సబ్సిడీలు, వేతనాలు, బోనసు, రిట్రెంచిమెంటు, బేదఖళ్ళు, అద్దె, కరువుపనుల సమస్యపై పోరాటాలు తీవ్రతరమగుతున్నవి.

2) ఈ పోరాటాలు కాంగ్రెసు బలంగావున్న రాష్ట్రాలలో గూడ అన్నిచోట్ల జరుగుచున్నవి. సేల్సుటాక్సుకు వ్యతిరేకంగా సౌరాష్ట్రంలో, అక్ట్రాయే పన్నుకు వ్యతిరేకంగా రాజస్థాన్‌లో, యు. పి.లో విద్యార్థుల పోరాటాలు పేర్కొనదగినవి.

3) ఈ నూతన పోరాటాలు వెల్లువగా నూతన ప్రాంతాలలో, చిన్న వ్యాపారులు, వుపాధ్యాయులు, గవర్నమెంటు వుద్యోగులు, తదితర నూతన వర్గాలు పాల్గొంటున్నారు.

4) ఈ పోరాటాలలో ముఖ్యంగా రాజకీయ పోరాటాలలో స్త్రీల చురుకైన పాత్ర నూతనంగా పేర్కొనతగినది.

5) ఒక వర్గంలో ప్రారంభమైన పోరాటం, నిర్బంధాన్ని ప్రతిఘటించవలసి వచ్చేటప్పటికి అన్నివర్గాల ప్రజాసామాన్య పోరాటంగా రూపొందుట, యు. పి. విశ్వవిద్యాలయ విద్యార్థుల పోరాటాలలో చూడగలము.

6) ఈ ప్రజా పోరాటాలలో కాంగ్రెసును అనుసరించే ప్రజలు పాల్గొనుట ప్రత్యేకంగా గమనించాం, నిరుద్యోగం, నిర్బంధ విధానం, కార్మిక కర్షకులపై పోలీసుల దాడులు, భూసంస్కరణ వైఫల్యం కాంగ్రెసు కార్యకర్తలు కాంగ్రెసు విధానాలను విమర్శనాత్మకంగా పరిశీలించునట్లు చేయుటతో విస్తృత ప్రజాసమీకరణ అవకాశాలు పెరుగుతున్నవి.

7) నూతన పోరాటవెల్లువ అన్ని వర్గాలలో బలమైన ఐక్యతా వాంఛను పెంపొందించుతూ, కమ్యూనిస్టు వ్యతిరేకతను, ప్రజలలో చీలికను అధిగమించు తున్నది. పార్టీ ప్రజాఐక్యతా మార్గాన్ని అనుసరించిన ప్రజా సమీకరణ అవకాశాలు పెరిగి పోరాటాలు జయప్రదమగుతున్నవి.

---

3. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర (1977) అధికారపత్రాలు. (ఆంగ్లంలో) వా. VIII. పే. 298-300.

8) నూతన పోరాట వెల్లువలో కార్మికవర్గం ప్రధానపాత్ర వహించుచున్నది. వివిధ కార్మిక వర్గాల రాష్ట్ర దేశవ్యాపిత పోరాటాలు ప్రారంభమయ్యాయి. బెంగాలులో పూజ బోనసుకొరకు, రక్షణశాఖ, బ్యాంకింగు వుద్యోగులు, వుపాధ్యాయులు పోరాడారు ప్రజల సామాన్య సమస్యలపై కార్మికవర్గం యిప్పుడిప్పుడే పోరాటాల లోనికి దిగింది.

9) తక్షణ సమస్యలపై పోరాటాలు జరుగుచున్నవి. రాజకీయ సమస్యలపై కూడ పోరాటాలు వృద్ధిచెందుతున్నవి. పౌరహక్కులకై అనేక పెద్దపోరాటాలు జరిగాయి. త్రిపురలో ప్రజాస్వామ్య ప్రభుత్వానికై బలమైన వుద్యమం ప్రారంభమైంది. ఆంధ్రప్రజల విజయం అనేక భాషారాష్ట్రోద్యమాలకు బలాన్నిచ్చింది కాంగ్రెసుకు, ప్రభుత్వానికి వ్యతిరేకంగా అనేకమంది కాంగ్రెసు వాదులు బహిరంగంగా వచ్చుట జరిగింది.

10) ఈ పోరాటాలు అసెంబ్లీలలో ప్రతిబింబించాయి. అసెంబ్లీలలోకూడ కొనసాగాయి. బయటి పోరాటాలు, అసెంబ్లీ పోరాటాలు సంలీనమై మంత్రివర్గాలను సంక్షోభంలో పడవేశాయి. రాజాజీ ప్రభుత్వం 1952లో పన్నుల ప్రతిపాదనలను వుపసంహరించుకొనవలసి వచ్చింది. భూమి శిస్తుపై సర్‌చార్జి సమస్య 1952లో బొంబాయి కాంగ్రెసు లెజిస్లేషరు పార్టీలో చీలికవచ్చినంత పని జరిగింది. ట్రాంవే చార్జీల పెరుగుదల సమస్యపై బెంగాల్‌లో పోరాటంతో మంత్రివర్గంలో చీలిక వచ్చినంతపని జరిగింది.

11) ప్రజా చైతన్యం, ఐక్యతల కారణంగా అనేక పోరాటాలలో ప్రజలకు రాయితీలు లభించాయి. అవి ప్రజలలో తమ పోరాటశక్తిపై ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించాయి. అంతేగాక గుత్తపెట్టుబడిదారుల భూస్వాముల ప్రభుత్వపు బలహీనతలను వెల్లడించాయి.

12) కమ్యూనిస్టుపార్టీ యీ పోరాటాలలో నాయకత్వం వహించి ప్రధానపాత్ర వహించింది. పార్టీ బలం, పరపతి, ప్రజల మన్నన పెరిగింది.

ఈ పోరాటాలన్నిటిలో ప్రత్యేకంగా గమనించవలసినది ఐక్య కార్యాచరణ, ఐక్య పోరాట సమితులు నిర్మాణాలకై పెరుగుతున్న ఉద్వేగం, ఐక్యతా వాంఛ, విచ్ఛిన్న గ్రూపుల, నాయకత్వాల వ్యతిరేకంగా ట్రేడు యూనియనులు, కిసాన్ సభలలో ప్రత్యేక సమస్యలపై ఐక్యతా మార్గాన ఐక్య పోరాట సమితులద్వారా పోరాడే జాగృతిని పెంపొందించుతున్నది. బరన్‌పూర్ రక్షణ కార్మికులు, అస్సాం తేయాకు కార్మికుల వుజ్వల పోరాటాలలోను, ట్రాంవే చార్జీల పెంపుకు వ్యతిరేకంగా కలకత్తాలో, బెంగాల్ ఆహారపు పోరాటాలలోను యీ ఐక్యతా ఉద్వేగవాంఛ కన్పడుతున్నది. బీజప్రాయంగావున్న యీ పోకడ, అన్ని ప్రాంతాలలో విస్తృతిపొంది సామాన్య లక్షణంగా అభివృద్ధిచెందినప్పుడే దానికి నిర్ణయాత్మక ప్రాధాన్యత నివ్వవలసివుంటుంది.

## కాంగ్రెసు, కాంగ్రెసు ప్రభుత్వం, మధురై అవగాహన :

విస్తృత ఐక్యకార్మిక, కర్షక, ప్రజాపోరాటాలు, ప్రభుత్వవిధాన వైఫల్యం, బలమైన వుద్యమాల ఫలితంగా, కాంగ్రెసులో అంతర్గత వైరుధ్యాలు తీవ్రతరమై, కాంగ్రెసు వివిధశాఖలు యుద్ధరంగాలుగా మారుతున్నవి. కాంగ్రెసు కమిటీలు, కాంగ్రెసు మంత్రివర్గాల మధ్య సంఘర్షణలు ఎక్కువై, కాంగ్రెసు ప్రజలనుండి దూరమగుటకు మీరంటేమీరని నిందాప్రచారం జరుగుచున్నది కాంగ్రెసుఅసెంబ్లీపార్టీలలో అంతర్గత కలహాలు తీవ్రరూపం ధరించాయి. కాంగ్రెసు బలహీనంగావున్న రాష్ట్రాలలో కాంగ్రెసుకు, దాని మిత్ర సహకారులమధ్య సంఘర్షణలు తీవ్రమై ప్రభుత్వ విధానాల, మంత్రివర్గాల సంక్షోభానికి దారితీస్తున్నాయి. తిరువాన్కూర్ - కొచ్చిన్ ప్రభుత్వ పతనం యీ విభేదాల సంఘర్షణల తీవ్రతనే తెలియజేస్తుంది.

"ఇవన్నీ నేడు మనం చూస్తున్నది ఆర్థిక సంక్షోభపు పరిపక్వత మాత్రమే కాదని, దానితోపాటు రాజకీయ సంక్షోభపు అభివృద్ధి ప్రాథమిక దశలని నిస్సందేహంగా స్పష్టమైంది.ఎన్నికల ఫలితాలు నేటి ప్రభుత్వంపై ప్రజల విశ్వాసం సడలుట మాత్రమేకాదని, ప్రజలు దానిని తమ శత్రువుగ నెంచే విధానక్రమం ప్రారంభమైందని, కాంగ్రెసు మైనారిటీ పార్టీగ అసెంబ్లీలో వచ్చుటయేగాక, రాజకీయ సంక్షోభం ఉప్పెనలాగ లేచె అవకాశముందనుట స్పష్టం. ఆర్థిక సంక్షోభం తీవ్రమగుటతో అవకాశం వాస్తవమగుట ప్రభుత్వ ఆర్థిక రాజకీయ విధానాలపై వైఫల్యంతోపాటు ప్రజోద్యమాల వెల్లువ విజృంభించుట చూడగలము.

"కాంగ్రెసు నాయకత్వంలోని కొన్ని వర్గాలు యీ పరిస్థితి వెదుర్కొనుటకు ప్రజా సోషలిస్టు పార్టితో కొయలిషన్ ప్రయత్నాలు మొదలిడినా, జయాన్ని యింకా పొందలేదు [1]"

ప్రభుత్వాన్ని బలవత్తరం చేయుటకై ప్రజా సోషలిస్టు పార్టీ లో కొయలిషన్ యేర్పాటుచేయు నెహ్రూ ప్రయత్నం విఫలమైంది. ప్రజా సోషలిస్టు కార్యకర్తలతో మధ్యంతర నాయకత్వంలో ప్రజా సోషలిస్టు పార్టి అగ్ర నాయకత్వం తమ అభివృద్ధి నిరోధక విధానాలను కొనసాగించుటకు వ్యతిరేకత ప్రబలుటయేగాక, అట్టిచర్య అసాధ్యమైంది, ప్రజా పోరాటాలు అభివృద్ధియై, ప్రజాస్వామ్య శక్తులతో వాటి ఐక్యతావాంఛ ప్రబలుటతో యిది జరిగింది. ఈ పరిస్థితులలో ప్రజా సోషలిస్టుపార్టీ నాయ్యత్వం ప్రజాస్వామ్య వుద్యమ విచ్ఛిన్న విధానాలను, ప్రజాస్వామ్య శక్తుల ఐక్యతకు వ్యతిరేకంగా, కాంగ్రెసుకు మద్దతు చేకూర్చే విధానాన్ని ముందుకు నెట్టజాలకపోయింది. ప్రజా సోషలిస్టు పార్టీ లో సంక్షోభానికి, విచ్ఛిన్నానికి దారితీస్తుందని భయపడింది.

---

2. భారత కమ్యూనిస్ట్ పార్టి చరిత్ర (1977) అధికారపత్రాలు (ఆంగ్లంలో) వా. VIII. పే. 302.

"కాంగ్రెసు యిప్పటికే శక్తినంతటిని కోల్పోయిందని, యింక యేమాత్రం భ్రమలను కలిగించగల శక్తిలేదని తలంచుట పొరపాటు. అది యింకా బలంకలది. బలమైన శక్తులెన్నిటినో నడిపించగలదు. ఆ సంస్థకు పండిట్ నెహ్రూ వ్యక్తిత్వ బలం అప్రతిమానమని మరువరాదు. ప్రభుత్వ దేశీయ విధానం అప్రదిష్టపాలైనా విదేశాంగ విధాన ఖ్యాతి బలాన్ని చేకూర్చుతునేవుంది. ప్రజాసామాన్యంలో గాంధేయ సిద్ధాంతాల ప్రభావం కార్మిక యితర వర్గాలలోకూడ భూదానం, సత్యాగ్రహ పోరాట పంధా బలమైన సాధనంగా యింకా యెంతో బలంగా వుంది.

కాంగ్రెసుపై భ్రమలు తొలగిన ప్రజాసామాన్యంలో ప్రజా సోషలిస్టు పార్టీ నియంతృత్వానికి వ్యతిరేకత, తటస్థత అంటూ నూతన భ్రమలను యింకా కలుగ చేయగల శక్తిని కలిగివుంది. అదేవిధంగా మతతత్వశక్తులు వాటి బలాన్ని కోల్పో యాయని తలంచుట పొరపాటు కాగలదు.

"ఏమైనా వాస్తవ పరిస్థితులు, సంక్షోభ తీవ్రత ప్రజాఐక్యతా ఉద్వేగం ఎంతగా పెరిగిందంటే కమ్యూనిస్టుపార్టీ తన పాత్ర సరిగా నిర్వహించిన ప్రజా హక్కులకు రక్షకుడుగా, వారి పోరాటాలకు నాయకుడుగా ప్రజాస్వామ్య శక్తులకు ఐక్యతాబంధంగా, ధైర్యంగా అనుకూల, ప్రతికూల భావాలను అధిగమించగలదు."

"గతంలోనే జనరలు ఎన్నికలలో అత్యంత ప్రాముఖ్యత వహించి పార్టీ కాంగ్రెసు పాలనకు వ్యతిరేక ప్రతిపక్ష ప్రజాస్వామ్య శక్తుల నాయకుడుగా వుద్భ వించింది. కార్మిక, కర్షక, విద్యార్థివర్గాల వుద్యమాల ఐక్యతకై పోరాడి నేడు వివిధ రాష్ట్రాలలో పోరాడుట రాష్ట్ర అసెంబ్లీలలో సూత్రబద్ధంగా సడలింపులేని ప్రతి పక్షంగా పోరాడీ, 1951 పార్టీ కాన్ఫరెన్సు నాటినుండి రాజకీయ పరిణామాలపై చెర గని ముద్రవేసింది. తిరువాన్కూర్ కొచ్చిన్‌లలో అసెంబ్లీచర్చకు దారితీసిన రాజ కీయ పరిణామాలపై హైదరాబాద్, పెప్సూలలోని సంక్షోభం, పరిస్థితులలో అనేక యితర రాష్ట్రాలలో పార్టీ పాత్ర, పార్టీ సభ్యులు అసెంబ్లీల బయట కొనసాగించిన పోరాటాలు నిర్ణయాత్మక పాత్రవహించాయి[1]."

"పరిపక్వత చెందే పరిస్థితులు, అభివృద్ధిచెందే ప్రజాచైతన్యం, కరుకుదనం ప్రజాస్వామ్య వుద్యమాల నినాదాలను, ఎత్తుగడలను నిర్ణయించగలవు"[2] పోరాడే ప్రజలే అనే మాటకూడ చేర్చాలి.

**మధురై కాంగ్రెసు ఐక్యసంఘటనా పంధా:**

"ఐక్య ప్రజాస్వామ్య ప్రభుత్వ నినాదం, విస్తృత ప్రజా ఐక్యసంఘటనా నిర్మా ణం, ఐక్య ప్రజా పోరాటాల విజృంభణ ఫలితంగా యివ్వబడాలి. పాలకవర్గాల ఆర్థిక, రాజకీయ విధానాలను, ప్రజల జీవన ప్రమాణాల, హక్కుల, స్వాతంత్ర్యా

---

1. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర (1977) అధికారపత్రాలు (ఆంగ్లంలో) వా. VIII పే. 304.
2. అదే. పే 305.

లపై జరుగుదాడిని, త్రిప్పికొట్టి, ఓడించుటకై జరిగిన నిర్ణయాత్మకమైన ప్రజా పోరాటాల ఫలితంగా ఆ క్రమంలో అది సాధించబడుతుంది. కాన నేటి అత్యంత ప్రధాన కర్తవ్యం కార్మిక, కర్షక విద్యార్థుల, యితర వర్గాల తక్షణ నిర్ణయాత్మక కోర్కెలపై అట్టి మహోద్యమాన్ని నిర్మించాలి. బలమైన ప్రజాసంఘాలను, పార్టిని నిర్మించాలి అభివృద్ధి చెందే సంక్షోభం నేపథ్యంలో ఆర్థిక కోర్కెలపై కార్మిక సంఘాలు, రైతు సంఘాలు నడిపే ప్రజోద్యమాలు, యింతకు ముందెన్నటి కంటె అత్యంత ప్రాముఖ్యత కలిగివుంది. గత రెండు సంవత్సరాల చరిత్ర రుజువు చేసినట్లు యీ పోరాటాలతోనే బలం పెరుగుతుంది, ఐక్యతామార్గం మలచబడుతుంది, యిదే విజయానికి మార్గం అప్పుడుమాత్రమే కాంగ్రెసులోని సంఘర్షణలు ప్రయోజనాత్మకంగా వుపయోగపడుతవి. ఈ వాస్తవాన్ని చూడజాలకపోతే, వ్యూహాత్మకనినాదాలు, తక్షణ కర్తవ్యాలనుండి ప్రజోద్యమాలను ప్రక్కదారుల పట్టించుట, అగ్రనాయకులతో సంభాషణలపై ఆధారపడుట, ఎత్తుకు పైఎత్తులు, ప్రజోద్యమాలను బలహీనపరచుట అగుతుంది.[1]"

"ప్రచారోద్యమాల విజయాలు ఆధారపడిన మూడు విడదీయరాని ముఖ్య కర్తవ్యాలు, పార్టి నిర్మాణం, ప్రజా సంఘాల నిర్మాణం, ప్రజాస్వామ్య సంఘటనలుగా గుర్తించాలి. సమన్వయ. సంలీనపథంలో యీ కర్తవ్యాల యే మేరకు నిర్వహింపబడునో ఆ మేరకు, సంక్షోభం బరువును ప్రజలపై రుద్దే ప్రభుత్వపు, పాలక వర్గాల ప్రయత్నాలను వమ్ముచేయుట, ప్రజోద్యమం బలపడుట, తన లక్ష్యసాధనకు ఎదుగుట జరుగుతుంది.

"ప్రజలపై పెరిగే భారం, దుర్భర జీవన పరిస్థితులు, ప్రభుత్వపు ప్రజావ్యతిరేక విధానాలు పెరుగుదలతోపాటు, భారత స్వాతంత్ర్యానికి పెరుగుతున్న ప్రమాదం, ప్రజాస్వామ్య శక్తులన్నీ ఐక్యమవ్వాలని వొత్తిడి చేస్తున్నవి. అట్టి ఐక్యతావకాశాలు బహుళంగా ఉన్నవి. ఈ ఐక్యతను క్రమాభివృద్ధి క్రమంలో బలవత్తరం చేయుటయే కమ్యూనిస్టు పార్టి మౌలిక కర్తవ్యం. అందుకు ఐక్యతా సమస్యపై స్పష్టత అవసరం. నిర్మించవలసిన ఐక్యతా స్వభావం, నిర్మాణక్రమంపై స్పష్టమైన అవగాహన అవసరం.

'ప్రజాస్వామ్య సంఘటన అన్ని వర్గాల గ్రూపుల ఐక్యసంఘటన. సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజం రద్దు చేయబడుటలో ప్రజల ప్రయోజనాలు నిర్మాణాత్మకంగా పెంపొందుతాయి. ప్రజలు యెదుర్కొనే తక్షణ ఆర్థిక, రాజకీయకోర్కెల, పోరాటాల ప్రాతిపదికపై విస్తృత ప్రజోద్యమాలను అభివృద్ధి చేయుట ద్వారానే అది నిర్మించబడుతుంది. ప్రజాసామాన్యం వివిధ రాజకీయ పార్టీల ప్రభావాలలో ఉన్నపుడు, కార్మికవర్గంకూడ చీలికతై ఉన్నపుడు, ప్రతి సమస్య, కోర్కెలపై, పోరాటాల నినాదాలపై వివిధ రాజకీయ పార్టీల, సంస్థల ఐక్య సంఘటనా వొప్పందాలు, ప్రజ

1. భారత కమ్యూనిస్టు పార్టి చరిత్ర (1977) అధికారపత్రాలు (ఆంగ్లంలో) వా. VIII. పే. 306.

అను ఐక్యపోరాటాలలో సమీకరించుటకు, శక్తివంతమైన చోదక శక్తులగుతాయి. అట్టి ఐక్య సంఘటనలు కాంగ్రెసు అనుసరించే ప్రజాసామాన్యాన్నిగూడ, సాధారణ పోరాటంలో సమీకరించుటకు తోడ్పడుతుంది. కాన కమ్యూనిస్ట్ పార్టీ వాటిని కొనసాగించుతూ, అట్టి ఒప్పందాలకై తీవ్రప్రయత్నాలు చేయుట అవసరం. అదే కాలంలో ఐక్య సంఘటనాభివృద్ధి, ముఖ్యంగా కార్మికవర్గాన్ని, కష్టజీవులను సమీకరించుటలో పార్టీ వహించే పాత్రపై ఆధారపడి వుంటుందని గుర్తుంచుకొనాలి.[1]

"ఐక్యసంఘటన అంటే కమ్యూనిస్టు పార్టీ, వామపక్షాల ఐక్యసంఘటన అని మాత్రమే అర్థంకాదు. ప్రధానంగా ప్రజాసమూహాల ఐక్యసంఘటన. అంతేగాక, కాంగ్రెసు ప్రభావంలోవున్న ప్రజా సమూహాలతోసహా సంఘటన. కాన ఐక్య సంఘటన ఉద్యమాభివృద్ధి, విస్తార కాంగ్రెసు, ప్రజా సోషలిస్టు పార్టీ ప్రజా సామాన్యాన్ని, అభివృద్ధి కాముకులైన వ్యక్తులను సమిష్టి కార్యాచరణ పోరాటాలతో సమీకరించుటగ నొక్కి చెప్పుతుంది. కాంగ్రెసు అభివృద్ధి నిరోధక నాయకత్వం. ప్రజా సోషలిస్టు పార్టీ నాయకత్వపు విచ్ఛిన్నకర విధానాల వలన కాంగ్రెసువాదులందరిని, ప్రజా సోషలిస్టులందరిని అభివృద్ధి నిరోధకులుగ నెంచే పోకడలను వ్యతిరేకించాలి. ప్రజా పోరాటాల అభివృద్ధితో కాంగ్రెసు, ప్రజా సోషలిస్టు నాయకత్వాల భ్రమలు వీడిన ప్రజాసామాన్యం పోరాటాలలో సమీకరించబడే అవకాశాలు యిప్పటికే వున్నాయి, అవి యినుమడించే అవకాశాలు భవిష్యత్తులో కన్పడుతున్నవి.[2]"

ఆ విధమైన సమిష్టి కార్యాచరణను అభివృద్ధి చేయునపుడు, ప్రజలు అంత ముందుకు రానపుడు, వారు నిర్వహించే సత్యాగ్రహ పోరాటరూపాన్ని ప్రజాపోరాట రూపంగా మార్చ ప్రయత్నించే పోకడ లేక ప్రజా పోరాటరూపాలు అభివృద్ధి చెందు నపుడు తమంతట తామే పోరాటాన్ని సత్యాగ్రహ పరిధికి కుదించే ప్రయత్నం, నిర్దిష్ట విమర్శనకు బదులు సాధారణ విమర్శన, అసెంబ్లీ, పార్లమెంటులలో 'ఊక దంపుడు' ఉపన్యాసాలు, ఐక్యసంఘటనా వేదిక పార్టీ వేదికల భేదాన్ని గుర్తించక పోవుట, ఐక్యతను, ఐక్యసంఘటనను, ప్రజోద్యమాభివృద్ధిని కుంటుపరుస్తుంది.

వ్యవసాయ రంగంలో విస్తృత రైతు ఐక్యత. రైతుల వ్యవసాయ కూలీల సంఘాల నిర్మాణం, బేదఖళ్ళకు, కౌలు తగ్గింపుకు, అధిక పన్నులకు వ్యతిరేకంగా జరుగు పోరాటాలతోపాటు కొనసాగించి బలోపేతం చేయాలి. శేష సెక్టేరియన్ పోకడలు కార్మిక సంఘాల ఐక్యతకు ఆటంకంగా వున్నది. కార్మిక సంఘాల ఐక్యత సూత్రప్రాయంగా మాత్రమే ఆమోదించబడి అదిపోక ఎత్తుగడగా చూడబడుతుందే గాని మూలసిద్ధాంతంగా ఆచరించబడుటలేదు. అది సాధించకపోవుట కార్మికవర్గాన్ని నిరాయుధులను చేయుటయే కాగలదు. ఐక్యతా సూత్రాన్ని మేజువాణిగా ఆమోదించి వాస్తవంగా ప్రజాసంస్థలైన చోట్లగూడ ఐయన్‌టియుసిని హెచ్‌యంయస్ సంస్థలను

---

1. భారత కమ్యూనిస్ట్ పార్టి చరిత్ర (1977) అధికారపత్రాలు (ఆంగ్లంలో) మధురై 3వ, కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెసు, రాజకీయ తీర్మానం పే. 306.
2. అదే అదే పేజి 307-8

యజమానుల జేబు సంస్థలుగానెంచే సెక్టేరియన్ విధానాన్ని విడనాడాలి ఆ సంస్థలు కొన్నిచోట్ల జరిపే పోరాటాలకో పాల్గొనకపోవుట లేక చూచిచూడనిపై ఖరి కార్మిక సంఘాల ఐక్యత, సంవిలనానికి హృదయపూర్వకంగా ముందుకువచ్చే చోట్లగూడ, ఐక్యతా నిర్మాణ విజయాన్ని పొందలేకపోవుటకు కారణమైంది. నాయకత్వాన్ని బహిరంగ విమర్శన ప్రధానలక్ష్యంగా కొనసాగించే సెక్టేరియనిజాన్ని, పోకడలను, అన్ని సంఘాలలో నిరోధించే పోరాటాన్ని కొనసాగించాలి. కార్మిక ప్రజా సామాన్యాన్ని వారి తక్షణ కోర్కెలపై చైతన్యవంతులను చేయజాలకపోవుట. వారిలో సంఘ ప్రాథమిక చైతన్యాన్ని కలుగజేయకపోవుట, గిరిగీసుకొని గిరిలోనే వుండుటతో కార్మిక వుద్యమాల ఐక్యతతో ముందుకుపోజాలక పోయింది.

కార్మికవర్గ ఐక్యతకు, ఐక్య ఫ్యాక్టరీ కమిటీలు, యేర్పడి పనిచేయుట సరియైన మార్గం. ఉన్న అట్టి ఫ్యాక్టరీ కమిటీలను బలవత్తరం చేయాలి. ప్రభుత్వ, యాజమాన్యపు దాడులను ఎన్నికకాబడిన ఐక్య సంయుక్త కమిటీలు త్రిప్పికొట్టాలి.

కార్మిక, కర్షక వర్గ ఐక్యతా నిర్మాణం అత్యంత ప్రాముఖ్యతగల కర్తవ్యం. రైతుల కోర్కెలను కార్మికవర్గం చొరవ, ధైర్యంతో బలపరచుటకు తన స్వంత కార్యాచరణతో పాల్గొనుటయే కార్మికవర్గ, రైతువర్గ ఐక్యతకు మార్గం.

## కేంద్రసమితి ఏప్రియల్ 1954 నిర్ణయాలు

సమితి వివిధ సమస్యలను చర్చించి తీర్మానాలు చేసింది. ఆ నిర్ణయాలపై "పార్టీకాంగ్రెసు ఆమోదించింది. అంతర్జాతీయంగా, జాతీయంగా జరిగిన ప్రధాన పరిణామాలు, పార్టీ కాంగ్రెసు రాజకీయ అవగాహనలను బలపరచాయి.[1]" అని అజయ్‌ఘోష్‌వ్యాఖ్యానించారు సమితి గోవా, పుదుచ్చేరి యితర వలసలపై హైడ్రోజన్‌బాంబు ప్రయోగం, ఇండో చైనాపై, పరిశ్రమ రేషనలైజేషన్‌పై, రాష్ట్రాల పునర్నిర్మాణంపై వివిధ తీర్మానాలు చేసింది. వీటితోపాటు కేంద్రసమితి "రైతాంగంలో మన కర్తవ్యాలు" అనే పత్రాన్ని ఆమోదించింది. ఈ సమావేశం "కొన్ని లోపాలున్నా మూడవ పార్టీ మధురై కాంగ్రెసు విధానాలను ముందుకుతీసుకొని పోయింది పార్టీలో రాజకీయ ఐక్యతను, నిర్మాణాన్ని బలపరచుటలో కొంత తోడ్పడిందని" అజయ్ అన్నారు.

భారతదేశంలోని ఫ్రెంచి వలసప్రాంతాల ప్రజలు విముక్తి పోరాటాలకు కేంద్రసమితి సౌహార్ద అభినందనలను, మద్దతును ప్రకటించింది. గత ఏడు సంవత్సరాలుగ దేశభక్తులను అమానుషంగా అణచివేయుటను గర్హించి మాసం రోజులుగా భారత యూనియన్‌లో కలసిపోవాలని ప్రజలు జరుగుతున్న పోరాటాన్ని బలంతో అణచజాలరని పేర్కొంది. ఫ్రెంచి వలసలు యింకా కొనసాగుట భారత సార్వభౌమత్వానికి, శాంతికి, రక్షణకు ప్రమాదమని స్పష్టంచేసింది. ఫ్రెంచి ప్రాంతాలలో

---

1. అజయ్‌ఘోష్(1954) కమ్యూనిస్టుపార్టీ కేంద్రసమితి నిర్ణయాలగురించి సుయేజ్ 2మే, 1954 వీక్లీనుండి పునర్ముద్రితము. పే. 1.

ప్రజలు జరిపే ఈ పోరాటం, భారత స్వాతంత్ర్య పరిరక్షణకై ప్రజలందరూ జరిపే పోరాటమని, అన్ని విధాలా ఈ పోరాటానికి భారత ప్రభుత్వం మద్ధతునివ్వాలని విజ్ఞప్తి చేసింది.

అమెరికా పసిఫిక్‌లో హైడ్రోజన్ బాంబు ప్రయోగాన్ని గర్హించింది. ఆటం, హైడ్రోజన్ బాంబులను పూర్తిగ నిషేధించకపోయినచో మానవప్రపంచానికి ఎంతటి ఘోరవిపత్తును కొనిరాగలవో స్పష్టమైంది. పార్లమెంటులో ఏప్రియల్ 2న ప్రధాని నెహ్రూ హైడ్రోజన్ బాంబు ఆపుదలకు, యధాస్థితి ఒడంబడిక, ప్రజా నాశనాన్ని చేసే అట్టి యితర ఆయుధాల నిషేదానికై నిరాయుధీకరణ కమిటీ సమావేశానికై ప్రపంచ రాజ్యాలకు నెహ్రూచేసిన విజ్ఞప్తిని పార్టీ బలపరచింది.

ఇండోచైనా సమస్య, వియత్నాం, చైనాలపై "బృహత్తరదాడి" అంటూ అమెరికా భయపెట్ట ప్రయత్నించుట; బ్రిటన్, ఫ్రాన్స్, ఆస్ట్రేలియా, న్యూజీలాండ్ థాయిలాండ్, ఫిలిప్పైనులచే సంయుక్తంగా చైనా, వియత్నాంలకు హెచ్చరికచేయించే యత్నం ఆసియాలో శాంతికి ముప్పును తెచ్చిపెట్టుచున్నది, కొరియాకు మద్దతుగా చైనా వలంటీర్లు అమెరికాను వీరోచితంగా ప్రతిఘటించుటతో అమెరికా యెత్తులు తలక్రిందులై బెర్లిన్ రష్యాతో సమావేశానికి అమెరికాను సిద్ధంచేశాయి. యుద్ధాన్ని చైనాకి విస్తరింపజేయాలనే అమెరికా ఎత్తుగడ విఫలమైంది. ఫ్రెంచి సామ్రాజ్య వాదంపై వియత్నాం వీరుల విజయం ఆసియా విముక్తి పోరాటాలకు ప్రోత్సాహ మిచ్చింది. కేంద్ర సమితి భారతప్రజలు యేకమై అమెరికా ఎత్తుగడలు వమ్ముచేసి జనీవా సమావేశాన్ని జయప్రదం చేయాలని కోరింది.

కేంద్రసమితి గుడ్డల మిల్లుల ఆధునీకరణ ప్లానులకు ఆందోళన చెందుతున్నది. దీనిని ప్రత్యామ్నాయం కార్మికులు చూపించకుండా అమలుచేయుట, వారిని నిరుద్యోగానికి లోనుచేయుటతప్ప మరొకటిగాదు. కార్మిక నిరుద్యోగం మరెన్నోరెట్లు పెరిగి పోతుంది వారి జీవితం దుర్భరమౌతుంది. కాన కేంద్రసమితి ఈ అధునీకరణను, ప్లానును వెంటనే ఆపివేయాలని కోరుతున్నది. లేనిచో ప్రభుత్వం కార్మికుల ప్రతి ఘటనను ఎదుర్కొనవలసి వుంటుందని హెచ్చరించింది

కేంద్ర సమితి భాషాప్రయుక్త రాష్ట్రాల ప్రాతిపదికపై రాష్ట్రాల పునర్నిర్మాణం అంటే బాల్కనైజేషన్ అనే ప్రతిపక్ష వాదాన్ని బట్టబయలు చేస్తూ భాషా ప్రయుక్త రాష్ట్రాలు దేశ ఐక్యతను బలపరచునని స్పష్టంచేసింది. ప్రజాస్వామ్య పార్టీలకు, శక్తులకు రాష్ట్రపునర్నిర్మాణ కమీషన్‌కు భాషాప్రయుక్త రాష్ట్రాల ప్రాతి పదికపై రాష్ట్రాల పునర్నిర్మాణం దేశాన్ని చీల్చకపోగా, ఐక్యతను పెంపొందిస్తుం దని, ఆ సూత్రాన్ని ఆమోదించునటుల ఆందోళన వొత్తిడి చేయవలసిందిగా విజ్ఞప్తి చేసింది.

## వ్యవసాయరంగంలో కర్తవ్యాలు :

"వ్యవసాయ సమస్యలపై పార్టీలో అనేక అంశాలపై పరస్పర విరుద్ధ అభి ప్రాయాలున్నవి రైతుల వర్గీకరణ, వలస వ్యవసాయ ఆర్థిక విధానంపై వ్యవసా

యాభివృద్ధి పోకడలు, కాంగ్రెసు వ్యవసాయ సంస్కరణల పంథా, ప్యూడలు అవశేషాలుపై తీవ్రచర్చలు జరుగుచున్నవి అంగీకృత అవగాహనకు యింకా రావలసివుంది[1]" అని అజయ్, ఏప్రిల్ 1954 కేంద్రసమితి నిర్ణయాలపై వ్యాఖ్యానించారు.

మధురై 3వ, పార్టీ కాంగ్రెసు కేంద్రసమితిని వ్యవసాయ సమస్యలను అధ్యయనం చేయాలని కోరినా, అన్ని సమస్యలను చర్చించజాలక పోయింది. మరికొంత అధ్యయనం చర్చించవలసిన అవసరముంది. అయినా కేంద్రసమితి వొక తీర్మానాన్ని ఆమోదించింది. వ్యవసాయరంగంలో తక్షణ కర్తవ్యాలను నిర్ణయించి, వివాదాస్పదమైన ఎత్తుగడలను పరిష్కరించింది కాంగ్రెసు ప్రభుత్వం ప్రవేశపెట్టుతున్న సంస్కరణ చట్టాలు దీర్ఘకాలంగా రైతులు, ప్రజాస్వామ్య ఉద్యమం బలపడి పోరాడిన ఫలితంగా వాటి నెంచాలి. దీనర్థం పాలకవర్గాలనుండి సంపాదించిన వీటిలో కొన్ని రాయితీలు ఉన్నవి అదే కాలంలో యీ సంస్కరణలు కాంగ్రెసు బలాన్ని స్థిరీకరించుకొనుటకు, రైతాంగాన్ని చీల్చుటకు వుద్దేశించబడినవని గుర్తించాలి. రైతాంగంలోని పైవర్గాలకు లాభం చేకూర్చిన కారణంగా వారిలో కాంగ్రెసు పునాది విస్తరించుతుంది. యిది పరిగణలోనికి తీసుకొనవలసిన అంశం.

"కాబట్టి యీ వ్యవసాయ సంస్కరణల యెడల వైరుధ్య దృక్పదాన్ని కలిగివుండుట, అనుసరించుట పొరపాటు కాగలదు. సంస్కరణలోని రాయితీలను రైతులు పొందగలగుటకై రైతాంగాన్ని, ప్రజాస్వామ్య ఉద్యమాన్ని సమీకరించవలసివుంది. రైతాంగాన్ని చీల్చి వారిలో గందరగోళం సృష్టించే కాంగ్రెసు విధానాన్ని వోడించవలసివుంది.

"వ్యవసాయ భూముల గరిష్ట పరిమితి సమస్యను కేంద్రసమితి పరిశీలించింది. ఈ సమస్యలోని రెండు పెడధోరణులను పోరాడవలసి ఉంది.

"మొట్టమొదటి పెడధోరణి; గరిష్ట పరిమితి సామాన్య సూత్రప్రాయంగా అంగీకరించుట, మరోవైపున నవీన పెట్టుబడిదారి వ్యవసాయ భూములకు, జాతీయ బూర్జువావర్గం భూముల ఉత్పత్తి పడిపోతుందని సాకుతో, లేక జాతీయ బూర్జువా వర్గాన్ని దూరం చేసుకొనుట జరుగుతుందనో గరిష్ట పరిమితి ఉండరాదనుట.

రెండవ పెడధోరణి; గరిష్ట భూపరిమితిని, ధనికరైతు భూములకుకూడ వర్తించే అంత తక్కువగా ఉండాలనుట.

ఈ సమస్యపై సరియైన దృక్పధం చేబట్టుటకై ప్రధానంగా కావలసింది వర్గ దృక్పధమని కేంద్రసమితి తలచింది. ఉత్పత్తి సమస్య దృక్పధం ప్రధానంగా సాంకేతిక సమస్య నేడు ఉత్పత్తి ప్రధాన ప్రతి బంధకాలు, ఉత్పత్తి సంబంధాలు, రైతు ప్రజానీకం పోరాటంద్వారానే వాటిని మార్చుట సాధ్యం. కాబట్టి విస్తృత రైతాంగపు

1. అజయ్‌ఘోష్ (1954) కమ్యూనిస్టు పార్టీ కేంద్రసమితి నిర్ణయాలపై న్యూయేజ్ మే 2, 1954 నుండి పునర్ముద్రితం చిరు పుస్తకము పి పి హెచ్. పే. 10.

ఐక్యతా ఆవశ్యకత, భూస్వామ్య వ్యతిరేక పోరాటంలో ఆవశ్యకతా కోణా న్నుండి చూడవలసి వుంటుంది. వారి కోర్కెలను ఆచరణలో సాధించుకొనుటకై రైతాంగాన్ని సమీకరించుటకై తగిన గరిష్టపరిమితి, రైతాంగ ప్రజాసామాన్యానికి భూపంపకంలో తగుమాత్రంకూడ లభించనంతటి ఎక్కువ గరిష్ట పరిమితి వుండ రాదు. రైతులకు, వ్యవసాయకూలీలకు తగుమాత్రం భూమి లభించగలనంతటి గరిష్ట పరిమితి ఉండాలి.

"కాబట్టి, ఒక వ్యక్తి అతని కుటుంబం ధనికరైతు స్థాయిలో జీవించుటకు అవుసరమైన ఆదాయాన్ని యివ్వగలిగిన "గరిష్ట పరిమితి" ఉండాలి. అయితే రైతాం గానికి, వ్యవసాయ కూలీలకు పంచుటకు తగినంత లేనివిధంగా, అంత ఎక్కువగా గరిష్ట పరిమితి వుండరాదు.

"ఆయా ప్రాంతాలలో అధ్యయనం కావించి, రైతాంగంతో చర్చించి నిఖర మైన గరిష్ట పరిమితిని నిర్దిష్టంగా లెక్కగట్టి నిర్ణయించవలసి ఉంటుంది.[1]"

## రైతాంగంలో మన కర్తవ్యాలు :

పార్టీ రెండవ కాంగ్రెసు రాజకీయ విధాన తీర్మానం.1949లో పొలిట్‌బ్యూరో వ్యవసాయ సమస్యను వివరించిన ప్రత్యేక పత్రం, తదితర పత్రాలతోపాటు గత ఆరు సంవత్సరాలనుండి తీవ్రచర్చలకు గురి అగుతూనే వచ్చాయి. కమ్యూనిస్టు పార్టీ 1951లో కలకత్తా కాన్ఫరెన్సులో ఆమోదించిన రాజకీయ విధానం. ఎత్తుగడల విధా నం, కార్యక్రమాలలో కొన్ని సమస్యలకు కొంత వివరణ లభించినా, వ్యవసాయ సమస్య ప్రత్యేక సమస్య అయింది. ఆచరణలో రోజువారి సమస్యలతో కొంత ముడివడివున్న కారణంగా మధురై 3వ, పార్టీ కాంగ్రెసుకు ముందు, అనంతరం తీవ్రచర్చలు జరిగాయి.వివిధ అవగాహనలను, అభిప్రాయాలను ఏప్రిల్ 1954 ఢిల్లీ కేంద్రసమితి "రైతాంగ ప్రజాసామాన్యంలో మన కర్తవ్యాలు[2]" అనే పత్రాన్ని చర్చించి, ఆమోదించి ప్రకటించింది.

## పొలిట్‌బ్యూరో ఉపోద్ఘాతం :

"మనం గత రెండు సంవత్సరాలనుండి రైతులలో, వ్యవసాయ కూలీలతో మన కర్తవ్యాలకు స్పష్టమైన రూపాన్ని ప్రయత్నిస్తున్నాము. ఈ చర్చా విధాన క్రమంలో వివిధ సమస్యలపై విరుద్ధ అభిప్రాయాలు ముందుకొచ్చాయి. ఇందులో ముఖ్యమైనవి కొన్ని యీ క్రింది విధంగా ఉన్నాయి" అవి సంక్షిప్తంగా చూద్దాము.

కేంద్రసమితి వొక నిర్ణయానికి రాని కారణంగా, ఆ ప్రధాన సమస్యలను తీర్మానాలలో తీసుకోవబడలేదన్నది ఈ విరుద్ధ అభిప్రాయాలుగల సమస్యల పరిష్క రించుట మరికొంత అధ్యయనం చర్చలు అవసరం అన్నది పొలిట్ బ్యూరో.

---

1. అజయ్‌ఘోష్(1954) కమ్యూనిస్టు పార్టీ కేంద్రసమితి నిర్ణయాలపై చిరు పుస్తకం పి పి హెచ్. పే. 11.
2. అవర్ టాస్క్స్ అమాంగ్ పీజెంట్సుమాసెస్ (1954) సి సి 1954 ఏప్రియల్ తీర్మానం. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర. అధికారపత్రాలు. పే. 32.

కాంగ్రెసు ప్రభుత్వ వ్యవసాయ సంస్కరణలు చట్టాల యెడల అవలంభించ వలసిన విధానాలు అత్యవసర సమస్యలైన కారణంగా, తీర్మానం కార్యాచరణకొన్ని సూచనలు యిస్తున్నది. కాంగ్రెసు వ్యవసాయ చట్టాల అధ్యయనంలోనికి వెళ్ళకుండా కేంద్రసమితి యీ క్రింది నిర్ణయాలకు వచ్చింది.

ఎ) రైతాంగ పోరాటాల అభివృద్ధి, ప్రజాస్వామ్య వుద్యమ సాధారణాభివృద్ధి ఫలితంగా కాంగ్రెసు వ్యవసాయ సంస్కరణల చట్టాలు లభించాయని యెంచాలి. సహజంగానే రైతాంగ పోరాటాలు నిర్మాణయుతంగా, తీవ్రంగా జరిగి, ప్రజా స్వామ్య వుద్యమం పురోగమించిన ప్రాంతాలలో లభించిన రాయితీలు తప్పనిసరిగా రైతులకు యెక్కువ ప్రయోజనకారిగా వున్నవి.

బి) కాంగ్రెసు ప్రభుత్వాలు పెరిగే రైతాంగ పోరాటాలను ఎదుర్కొనుటకు ద్విముఖ ఎత్తుగడల నవలంభించాయి.

-ఒకవైపు కొన్ని రాయితీలనిస్తూ వ్యవసాయ సంస్కరణచట్టాలను చేస్తు న్నారు. ఈ చట్టాలు కౌలుదారులను తొలగించుటకు, రైతుల దోపిడిని కొనసాగించు టకు, చాలినన్ని కంతలు కలిగివున్నవి. ఫలితంగా బేదఖల్ల తొలగింపులు విస్తారంగా భూస్వాములు కొనసాగిస్తున్నారు.

-మరోవైపు ప్రభుత్వపు పోలీసువర్గాలు నేరుగా రైతాంగంపై దాడిని కొన సాగిస్తున్నారు భూదాన వుద్యమం, పంచవర్ష ప్రణాళికలు, కమ్యూనిటీ ప్రాజెక్టులు, ప్రభుత్వం కార్యక్రమాలు రైతాంగంలో భ్రమలు కల్పించుతున్నవి. ప్రజాస్వామ్య వాదులను గందరగోళపరస్తున్నవి.

మన ఎత్తుగడలు తప్పనిసరిగా

-రైతుల ప్రయోజనాలకై లభించిన రాయితీలు వుపయోగపడనట్లు మరికొన్ని రాయితీలకై పోరాటం సాగించాలి.

-ఉన్నహక్కులపై దాడి జరిగినపుడు, రక్షణ పోరాటం,

-భూదాన నినాదాలతో ప్రభుత్వం కలిగించే భ్రమలను, అసలు సమస్యలను వదలి 'సరిగ' సమస్యలను చేబట్టి, కలిగించే భ్రమలను రాజకీయ, సైద్ధాంతిక పోరా టంలో ఎండగట్టాలి.[1]

**తీర్మానం సారాంశం :**

ప్రభుత్వం యీ రాయితీలను పెరుగుతున్న రైతాంగ పోరాటాల కారణం గాను, రైతాంగాన్ని చీల్చి, పై వర్గాలలో తన రాజకీయ పునాదిని బలపరచుకొను టకై చేయుచున్నదనే స్పష్టమైన అవగాహన వుండాలి. ఈ రాయితీలను వుపయో

1. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర (1977) అధికార పత్రాలు.
వా. VIII. పే. 324-5.

గించుకొంటూ, రైతులను వ్యవసాయకూలీలను, పేద రైతులను సమీకరించి పోరాటాలు కొనసాగించి ప్రభుత్వ ప్రధాన వుద్దేశ్యమైన రైతాంగాన్ని చీల్చు వ్యూహాన్ని వమ్ముచేయాలి.

కాంగ్రెసు వ్యవసాయ సంస్కరణల యెడల పూర్తి వ్యతిరేక వైఖరి కలిగి వుండుటను కేంద్రసమితి హెచ్చరిస్తున్నది. రాయితీల నుపయోగించుకొనుటద్వారానే, మరిన్ని రాయితీలకొరకు పోరాడుటద్వారానే పోరాడే రైతాంగపు పూర్తికోర్కెలను రూపొందించగలము.

ప్రతి సమస్యకు తీర్మానం పరిష్కారమార్గాన్ని సూచించుటలేదని, అది సాధ్యంకాదని వివిధ రాష్ట్రాలలో పరిస్థితులు, సమస్యలు, భిన్నంగా వుండునని, ఒకే రాష్ట్రంలోనే వొక ప్రాంతానికి, మరో ప్రాంతానికీ తేడాలుంటవని, ఆయా కమిటీలు, రైతాంగంతో దగ్గరి సంబంధాలు పెట్టుకొని తగిన నినాదాలను రూపొంచవలసి వుంటుందని కేంద్రసమితి స్పష్టం చేయదలచుకొన్నది తీర్మానం వారు ఆ పనిని నిర్వర్తించుటకై విస్తృతబాటను మాత్రమే చూపుతున్నది.

వ్యవసాయ కూలీల కొర్కెలు రూపొందించి ప్రత్యేక నిర్మాణాన్ని చేబట్టుట తక్షణ కర్తవ్యమని కేంద్రసమితి మరోసారి నొక్కి చెప్పదలచుకొంది. గతంలో అశ్రద్ధ వహించాము. మన కిసాన్ వుద్యమపు ప్రధాన బలహీనతయింది. వ్యవసాయ కూలీల, పేదరైతుల నిర్మాణసంఘాలు లేకుండా రైతు ప్రయోజనాల రక్షణను, వారి కోర్కెలు సాధించగలిగిన విస్తృత వుద్యమం వుండజాలదు.

"మన వ్యవసాయ, జాతీయ పారిశ్రామికాభివృద్ధికి, కార్మికవర్గ జీవన ప్రమాణాన్ని మెరుగుపరచుటకు, సాంస్కృతికంగా మన వెనుకబాటు తనాన్నుండి బయటపడుటకు, మన ప్రభుత్వానికి స్థిరత్వాన్ని చేకూర్చుటకు, రైతాంగంలో మానవతా పరిస్థితులను సృష్టించుట అత్యవసరం" అని అదే వ్యవసాయ, జాతీయ సంక్షోభాన్ని పరిష్కరించుటకు యేకైకమార్గమని కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమము స్పష్టము చేసింది.

అందుకుగాను, 1) నష్టపరిహారం లేకుండా భూస్వామ్య విధానాన్ని రద్దుచేసి, భూమిని రైతులకు, వ్యవసాయ కూలీలకు ఉచితంగా యిచ్చుట. 2) రైతుల, చిన్న చేతివృత్తులవారి అప్పుల రద్దు, స్వల్పవడ్డీకి దీర్ఘకాలపు అప్పులు యిచ్చుట, 3) వ్యవసాయ కూలీలకు జీవనభృతికి తగిన వేతనాలు. 4) రైతుల పంటలకు తగిన ధరలు, పన్నుల తగ్గింపు. 5) నీటి పారుదల సౌకర్యాలు తప్పనిసరిగా చేయవలసినవి.

ఈ కోర్కెలకై రైతాంగం పోరాటాలు జరుపుచున్నారు. ఇంకా పోరాడవలసిన అవసరముంది.[1] కేంద్రసమితి తీర్మానం వీటితోపాటు జమీందారి, ఈనాందారీ రైతుల 12 అంశాల కోర్కెల కార్యక్రమాన్ని యిచ్చింది. ఇది ప్రధానంగా బేదఖళ్ళకు వ్యతిరేకంగా, కౌలు తగ్గింపు సమస్యలపై కేంద్రీకరించబడివున్నాయి.[2]

---

1. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర (1977) అధికారపత్రాలు
   వా. VIII. పే. 330.

2. అదే పేజి 337-8.

కమ్యూనిస్టు పార్టీ ప్రప్రధమంగా అఖిల భారతస్థాయిలో ప్రత్యేకవర్గ ప్రజా సంఘాలను యేర్పాటు చేయాలని నిర్ణయించింది. గ్రామీణ ప్రాంతాలలోని యితర రోజు కూలి వేతనాన్ని పొందేవారిని, వ్యవసాయ కూలి సంఘాలలో సమీకరించాలని నిర్ణయించింది. పెద్ద ఫ్యూడలు భూస్వాములున్న ప్రాంతాలలో వెట్టికి వ్యతిరేకంగా, బేదఖళ్ళకు వ్యతిరేకంగా వ్యవసాయ కూలీలను, రైతాంగాన్ని యితర వర్గాలను సమీకరించాలని, అవకాశం లేని ప్రాంతాలలో తక్షణం వ్యవసాయ కూలి సంఘాలను యేర్పాటు చేయవలసిన అవసరం లేదని గుర్తుంచుకోవాలి. అయితే సంయుక్త పోరాటం విజయవంతమైన వెంటనే ధనికరైతు పొందిన రాయితీలను తన కనుకూలంగా చేసుకొనుటకు, వ్యవసాయకూలీల, పేద రైతుల ప్రయోజనాలకు వ్యతిరేకంగా ప్రయత్నం చేస్తాడు. అప్పుడు వ్యవసాయ కూలి సంఘ మేర్పాటు తప్పనిసరి అగుతుంది.

కేంద్రసమితి తీర్మానంపై అవగాహనను యిచ్చి, 9 అంశాల తక్షణకోర్కెల ప్రణాళిక నిచ్చింది.[1]

## రైతాంగ ఐక్యత :

రైతాంగంలో అత్యధికభాగానికి భూసమస్య కాంగ్రెసు ప్రభుత్వ భూ సంస్కరణలద్వారా పరిష్కరింపబడుననే భ్రమలున్నవి. కాని కోర్కెలు రైతులలో బలంగానే వున్నవి. దేశంలో అభివృద్ధి నిరోధకులకు వ్యతిరేకంగా విస్తృతకిసాన్ వుద్యమంలోనికి రైతాంగాన్ని సమీకరించే అవకాశముంది కాంగ్రెసుతో అసంతృప్తి చెందిన అనేక లక్షలమంది జాతీయశక్తులు తమ సమస్యల పరిష్కారానికి ప్రజా సోషలిస్టు తదితర పార్టీల ప్రభావాలకు లోనగుతున్నారు. అయితే పంజాబులో అధిక సంఖ్యాకులైన శిక్కురైతులు యింకా అకాలీలనే అనుసరిస్తున్నారని, వ్యవసాయ కూలీలలోని అత్యధికులైన హరిజనులు షెడ్యూలు తరగతుల ఫెడరేషన్ వెనుక వున్నారని మరువరాదు.

"రైతాంగంలో మన కర్తవ్యాలు' అన్న తీర్మానం, అన్ని వర్గాల రైతాంగ ఐక్యతా నిర్మాణానికి యీ క్రింది అంశాలను సూచించింది.

1) పార్టీ యీ ప్రజాసామాన్యాన్ని, కాంగ్రెసు, ప్రజా సోషలిస్టు కార్యకర్తలను ఐక్యసంఘటనా కార్యాచరణతో సమీకరించాలి.ఆ పోరాటాలలోనే వారి భ్రమలు తొలగిపోతాయి. కాంగ్రెసు ప్రచారంచేసే సర్వోదయ, భూదానోద్యమాలు వలన సమస్య పరిష్కారం కాదనే సిద్ధాంత పోరాటాన్ని క్రమంగా సాగించుట వలన సంస్కరణ భ్రమలు పోగలవు.

ఈ సైద్ధాంతిక పోరాటం, ఐక్యకార్యాచరణా పోరాటాల నిర్మాణక్రమంలో బలపరచుటతో, లక్షల కొలది రైతాంగం, వ్యవసాయకూలీలు వ్యవసాయ విప్లవంలో సమీకరించబడగలరు. బేదఖళ్ళకు, నూతన పన్నులకు వ్యతిరేకంగా; కౌలు, శిస్తు

1. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర (1977) అధికారపత్రాలు
 వా. VIII పే. 340.

తగ్గింపులకై జరుగు ఐక్యపోరాటాలలో విస్తృతంగా రైతాంగాన్ని సమీకరించి, కిసాన్‌సభలో సభ్యులు కాకుండానే రైతు సమస్యలపై పనిచేసేవారిని రైతు సంఘాలలో చేర్చి వాటి బలాన్ని పెంపొందించాలి. ఆ విధంగానే రైతాంగమంతటినీ ఐక్య ప్రజాసంఘాలలో సమీకరించగలము.

2) ఐక్య కిసాన్‌సభ నిర్మాణక్రమంలో భూస్వామ్య, సామ్రాజ్యవాద దోపిడికి వ్యతిరేకంగా రైతాంగమంతటిని ఐక్య పోరాటంలో సమీకరించే కర్తవ్యం అత్యంత ప్రాముఖ్యత వహించుతుంది.

రైతాంగ ఐక్యతా సమస్య ప్రధానంగా వ్యవసాయ కూలీల, రైతుల, ధనిక రైతులతోసహా అందరూ ప్యూడలు, భూస్వాములకు, సామ్రాజ్యవాదులకు, గుత్తపెట్టుబడిదారులకు వ్యతిరేకంగా ఐక్యమగుట, గ్రామీణ శ్రామిక వర్గాల వేతనాల తదితర కోర్కెలను బలపరచుటద్వారా రైతు-కూలీ ఐక్యతామార్గం, పరిస్థితులు పరిపక్వమగునని రైతు కార్యకర్తలు గుర్తించవలసివుంది.

రైతాంగమంతా ప్రభుత్వం నష్టపరిహారం చెల్లింపు సమస్య, అధిక పన్నులు, కరువుసమస్యలపై ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా ఐక్య పోరాటాలలో ఐక్యమై పాల్గొంటుంది. భూస్వాముల గరిష్టపరిమితికిమించిన భూములను, సాగుకులాయక్కైన బంజరు భూములను వ్యవసాయ కూలీలకు యివ్వాలనే వుద్యమంలో రైతాంగాన్ని కూడ సమీకరించుట ద్వారా రైతు-కూలి ఐక్యత, గ్రామసీములలో అన్నివర్గాల ఐక్యత యేర్పడి భూస్వామ్య వ్యతిరేక పోరాటంతో ఆ ఐక్యత మరింత సుస్థిరత యేర్పడుతుంది.

3) విస్తృత ఐక్యకిసాన్ వుద్యమాభివృద్ధికి, రైతు వుద్యమం సాధించిన వివిధ రాయితీలు, భూసంస్కరణలు ఎంతటి వీరోచిత రైతాంగ పోరాటాలద్వారా సాగించగలిగింది ప్రచారం చేయాలి ప్రజల ఆత్మబలాన్ని, స్థయిర్యాన్ని పెంపొందించుటకు, వారు తమ కోర్కెలు, హక్కులకై పోరాడునట్లు చేయుటకై వారు సాధించినట్టి చిన్న విజయమైనా ప్రచారం చేయాలి. ఆ ప్రాథమిక విజయాలనుండి నూతన విజయాలకు మార్గమేర్పడుతుంది. అదే జాతి విముక్తి పోరాటమగుతుంది.

4) విస్తృత ఐక్య రైతువుద్యమాన్ని అభివృద్ధిచేయుటకు ప్రతి ప్రభుత్వ చిన్నచట్టాన్నైనా, రాయితీలనైనా రైతులకు విస్తరించుటకై ప్రచారంచేయాలి. రాయితీలను రైతుల అనుభవంలోనికి తీసుకొనివచ్చి, రైతులు మరికొన్ని రాయితీలకై పోరాడునట్లుచేయాలి. పార్లమెంటులో పనిని, కిసాన్‌సభల వెలుపలి పనిని సమన్వయం చేయాలి.

5) కిసాన్‌సభ, వ్యవసాయ కూలిసంఘాలు సామాజిక, ఆర్థిక, రాజకీయ సమస్యలన్నింటిని చేబట్టి, వాటితోబాటు సాంస్కృతిక, విద్య, వినోద, ఆరోగ్య, ఆటలు, కరువుకాటకాలు అన్ని సమస్యలు చేబట్టి, వారినైతిక పోరాటబలాలను పెంపొందించు రైతు, కూలి వుద్యమాలను పెంపొందించాలి.

6) రైతులను వారి తక్షణకోర్కెలు రూపొందించునపుడు సమీకరించి, వారు ఆ చర్చలలో పాల్గొనునట్లు చేసిన రైతువుద్యమం అత్యంత బలమైనదగుతుంది. కిసాన్‌సభ రైతులుచెప్పే విషయాలను పార్టీ అత్యంత శ్రద్ధతో వినాలి. వాస్తవపరిస్థితులబట్టి పట్టువిడుపులతో తక్షణ కోర్కెలను రూపొందించాలి. ఆచరణలో అన్ని స్థాయిలలో ఈ క్రమాన్ని అనుసరించాలి.

7) కిసాన్ పోరాటాలను అభివృద్ధిచేయునపుడు, పోరాటరూపాలను రూపొందించునపుడు, రైతాంగ మనోబలస్థితి, సమాయత్తత, సంఘ నిర్మాణ స్థితి, పట్టువిడుపులతో కోర్కెలకు, పోరాటానికి చివరి రూపాన్నియివ్వాలి ఉన్న పరిస్థితినిబట్టి సంతకాలు, పిటీషనులు, వూరేగింపులు, ప్రదర్శనలు, సత్యాగ్రహాలు, సమ్మెలు, హర్తాళులు అన్ని పోరాట రూపాలు చేపట్టాలి.

ఒక్కమాటలో రైతు, వ్యవసాయ కూలి సంఘాలపని గ్రామీణ జీవితంలో భాగమవ్వాలి. దానినినుండి సలహా, సహాయం లభించాలి.

8) కోర్కెలు విస్తృత ప్రచారం పొందితే ముఖ్యంగా వాటి వలన బాధపడుతున్న వర్గాలకు వివరించితే వుద్యమంలో వారు విశేషంగా పాల్గొంటారు. పరిసర పట్టణ, గ్రామ ప్రాంతాలతో కోర్కెల విస్తృత ప్రచారం జరిగితే వారినుండి సహాయ సానుభూతి, మద్దతులను పొందే అవకాశంవుంది.[1]

## కార్మిక-కర్షక ఐక్యత

1) రైతాంగ పోరాటాలలో విజయాన్ని పొందుటకు కార్మికవర్గ మద్దతును ఆచరణలో పొందగలగాలి. ఈ విషయంలోనే పార్టీ విఫలత కనపడుతుంది. కార్మికవర్గంలో రైతాంగపు విస్తృత ప్రచారం పొందజాలక పోయాయి. వారి జీవితం సమస్యలు, రైతాంగ పోరాటాలతో ఎంత సన్నిహిత సంబంధం కలిగివున్నవో గుర్తించగలుగునట్లు ఆ విధంగా ఆ పోరాటాలకు అన్ని విధాల మద్దతు లభించునట్లు పార్టీ చేయజాలకపోయింది. కార్మికవర్గం వూరేగింపులు, ప్రదర్శనలు సానుభూతి సమ్మెలు సార్వజనీన సమ్మెలతో రైతు పోరాటాలకు మద్దతుగావచ్చునట్లు ఎప్పుడూ చేయజాలక పోయింది పార్టీ. పార్టీ యీ వైఫల్యం పార్టీ చరిత్రంతావుంది. అదేవిధంగా, పార్టీ కార్మికవర్గ కోర్కెలను, వారి పోరాటాలను రైతాంగంలో ప్రచారంగావించి, సానుభూతి సమీకరణ చేయజాలకపోయింది. రెండువైపులనుండి సానుభూతి, సౌహార్థత, మద్దతులను క్రమబద్ధంగా పెంపొందించిన కార్మిక-కర్షక ఐక్యతను నిర్మించుటలో విజయాన్ని పొందగలం.

పార్టీ కార్మికవర్గ కార్యకర్తలు ప్రధాన బలమైన పారిశ్రామిక కేంద్రాలనుండి పరిసర రైతాంగ పోరాట ప్రాంతాలకు రైతు వుద్యమాభివృద్ధికి, ఆ విధంగా బలమైన రైతు వుద్యమ ప్రాంతాలనుండి నగరాలకు పోరాట కాలంలోనైనా కనీసం పార్టీ ఆచరణలో పెట్టగలిగితే కార్మిక-కర్షక ఐక్యత సులభమౌతుంది.

---

1. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర(1977) అధికారపత్రాలు (ఆంగ్లంలో) వా. VIII. పే. 249-5.

2) అమెరికా నాయకత్వంలో సామ్రాజ్యవాదం యుద్ధోన్మాదంతో మూడవ ప్రపంచయుద్ధంతో వినాశనానికి చేయు ప్రయత్నాలకు వ్యతిరేకంగా పార్టీ రైతాంగ వుద్యమాన్ని, గ్రామీణులను సమీకరించాలి

3) కమ్యూనిస్టుపార్టీ తన రాజకీయ విధానాన్ని, కార్యక్రమాన్ని, ప్రజా దృక్పథాన్ని రైతాంగంలో విశేషంగా ప్రచారం చేయవలసివుంది చురుకైన రైతు, వ్యవసాయ కూలి కార్యకర్తలను చేర్చుకొని విద్య, విజ్ఞానం, రాజకీయ పరిజ్ఞానాన్ని కలిగించుట, మధ్యతరగతి మేధావి వర్గాల కార్యకర్తలను రైతాంగంలో తదితర ప్రజాసామాన్యంలో పనిచేయుటకు వినియోగించుట వలననే రాజకీయ సిద్ధాంత నిర్మాణ సంబంధాలను కోట్లకొలది రైతు, వ్యవసాయ కూలీలలో బలవత్తరంచేయుట తక్షణ అవస్యకర్తవ్యం. ఈ విషయంలో వైఫల్యం, భూస్వాములు, సామ్రాజ్యవాదుల, గుత్తపెట్టుబడిదారుల దాడిని ఎదుర్కొనుటతో రైతు, వ్యవసాయకూలీలను నిర్వీర్యులను చేయుట అగుతుంది.

4) పార్టీ, రైతు వుద్యమం రైతులు, రైతు స్త్రీలు; రైతు యువకులు, రైతు వుద్యమాలలోచేరి పాల్గొనునట్లు చేయుటకు ప్రత్యేకశ్రద్ధ వహించాలి.

5) అనేక విషయాలలో వుద్యమ అవసరాలకు యెంతో వెనుకబడి వున్నాం. కారణం మౌలిక సమస్యలపై సిద్ధాంత అవగాహన లేకపోవుట ప్రధానమైంది, పార్టీ రైతాంగ విశ్లేషణ, వర్గీకరణ, వలస వ్యవసాయ ఆర్థిక విధానం, నేటి కాంగ్రెస్సు వ్యవసాయాభివృద్ధి పథకాలు అధ్యయనం చేయాలి. కేంద్రసమితి కిసాన్‌సభ ముఖ్యులను సంప్రదించి యీ కర్తవ్యాన్ని నెరవేర్చాలి.

6) అన్ని స్థాయిలలో కిసాన్‌సభ, వ్యవసాయ కూలి సంఘాలు పనిచేయుటను పార్టీ ప్రధాన కర్తవ్యంగా నెంచాలి. రోజువారి సూచనలు కేంద్రంనుండి లభించవు. కాన రాష్ట్ర శాఖలను బలవత్తరంచేసి పనిచేయించాలి. గ్రామ తాలుకాశాఖలు జీవం వుట్టిపడే శాఖలు కావాలి. ఇప్పటివరకు శాఖలు నామమాత్రంగానే వున్నాయి. వాటిని నిర్మించుట, పనిచేయుట మౌలిక కర్తవ్యం. అన్నిస్థాయిలలో రైతులు, వ్యవసాయ కూలీలు తమ తమ వృత్తి పనులలో చురుకుగా పాల్గొనే వారిని సమర్థులను మన వివిధ కమిటీలలో కొంతకాలాన్ని వినియోగించునట్లు చేయుట అత్యావసరం. ఆ విధంగానే కిసాన్‌సభ, వ్యవసాయ కూలీ సంఘాలు ప్రజావుద్యమాలగుతవి. పార్టీ నాయకత్వమే, పార్టీ రాజకీయ కమిటిలే బాధ్యత వహించాలనుట సరికాదు. రైతు, కూలీలలో అప్పుడు మాత్రమే వివిధ శాఖల కమిటీలు జీవ సంబంధాలను కలిగివుంటవి[1].

ఈ తీర్మానం ప్రధానంగా రైతాంగంలోని వివిధ వర్గాల ఐక్యతను అదే విధంగా కార్మిక, కర్షక, వ్యవసాయకూలివర్గాల ఐక్యతను పెంపొందించుటకై బలోపేతమైన కిసాన్ వుద్యమాన్ని నిర్మించుటకు వివిధ వర్గాలకు వివిధ కోర్కెల ప్రణాళికలు సమన్వయ దృక్పథంతో వివరించింది. అంతేగాక ప్రప్రథమంగా వ్యవసాయ కూలి వుద్యమ నిర్మాణానికి సూచనలు, పిలుపునిచ్చింది.

---

1. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర (1977) అధికార పత్రాలు (ఆంగ్లంలో) వా. VIII పే. 353-3.

# తప్పొ - ఒప్పుల పట్టిక

| పేజి | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 26 | ఎడారిలో | ఏడాదిలో |
| 3 | 6 | సిద్ధాంతచర్యలు | సిద్ధాంతచర్చలు |
| 4 | 20 | వి స్త్రిత | వి స్తృత |
| 5 | 3 | ఛేదించక | భేదించక |
| 5 | 6 | సిద్ధాంతచర్యలు | సిద్ధాంతచర్చలు |
| 5 | 10 | యీ చర్యలలో | యీ చర్చలలో |
| 6 | 23 | ట్రాంలే | ట్రాంవే |
| 7 | 7-8 | పేర్కొనంతగా | పేర్కొనతగినంతగా |
| 8 | 12 | హ స్తత్ మెరాని | హస్రత్ మెహరాని |
| 13 | 21 | లిట్లీకమిషన్ | విట్లీకమిషన్ |
| 14 | 18 | పరిషత్తులో | భవిష్యత్తులో |
| 23 | 29 | భారతదేనిశ్నా | భారతదేశాన్ని |
| 30 | 4 | వాదవర్గాలకు | వాదవర్గాలు |
| 45 | 7 | సిద్ధాఃతపత్రం | సిద్ధాంత పత్రంలో |
| 50 | 18 | వచ్చేవికాదు | వచ్చేది కాదు |
| 50 | 28 | మానువిస్కీ | మానులిస్కీ |
| | 30 | మానువిస్కీ | మాన లిస్కీ |
| 51 | 5 | కొమిఃటర్లను | కొమింటరను |
| 52 | 8 | సమగ్రచర్యలకు | సమగ్రచర్చలకు |
| 53 | 3 | నేరుగాసామ్రాజ్య | వేరుగా పామావ్య |
| 60 | 28 | వృద్ధిచేయుకివ్వాలి | వృద్ధిచేయునది కావాలి |
| 62 | 32 | వుపయోగపడదాయని | వుపయోగపడతాయని |
| 63 | 25 | కాంగ్రెలు | కాంగ్రెను |
| 66 | 21 | పంసినా | పంపినా |
| 67 | 4 | వెంచరు | భావించరు |
| 67 | 14 | సోషలస్టు | సోషలిష్టు |
| 88 | 1 | అలఅనారు | అని అన్నారు |
| 93 | 19 | వేతనాలలో | వేతనాలలో |
| 96 | 12 | 91 99 లక్షలలో | 91.99 లక్షలలో |
| 102 | 9 | ఫాకతైన | పార్టీవలైన |
| 123 | 17 | సంరణలు | సవరణలు |
| 125 | 35 | నాయకుల | నాయకుల |
| 126 | 12 | ఫ్రాంసు | ఫ్రాన్సు |
| 134 | 18 | మాల్దార్ | మాల్దావ్ |
| 135 | 24 | నవంబరు | నవంబరు |

| | | | |
|---|---|---|---|
| 146 | 10 | చెందిందనది | చెందిందనేది |
| 147 | 20 | బంచాలను | బంధాలను |
| 152 | 23 | మ్యునిస్ట్ | కమ్యూనిస్ట్ |
| 154 | 32 | మాత్రయె | మాత్రమే |
| | 13 | శ్రద్ధవహిందనా | శ్రద్ధ వహించినా |
| 156 | 29 | పెట్టుబడిచారి | పెట్టుబడిదారి |
| 157 | 30 | తమ కిష్షమైన | తమ కిష్టమైన |
| 160 | 31 | ప్రభుజ్వ | ప్రభుత్వ |
| 161 | 23 | కేంద్రాన్ని | కేంద్రానికి |
| 165 | 13 | కొన్నిచో | కొన్నిచోట్ల |
| 167 | 4 | కాంగ్రుసు | కాంగ్రెసు |
| 168 | 9 | సంటునను | సంఘటనను |
| 171 | 33 | తెలియప | తెలియపరచ |
| 176 | 4 | పరిపట్టం | పటిష్ఠం |
| 177 | 1 | జాగదూకత | జాగరూకత |
| 177 | 12 | నిబమైన | నిజమైన |
| 177 | 27 | జనజాతులకు | జాతులకు |
| 178 | 14 | శ్కూర్తి | స్ఫూర్తి |
| 178 | 29 | తక్షతుం | తక్షణం |
| 178 | 34 | చేబట్టంది | చేబట్టింది |
| 179 | 27 | విప్రుత | విస్తృత |
| | 30 | వాసుపక్ష | వామపక్ష |
| 180 | 7 | స్వాతంక్రోనికి | స్వాతంత్ర్యానికి |
| 181 | 6 | మావసికధోరయలు | మానసికధోరణులు |
| | 9 | గానిపై | దానిపై |
| | 25 | యూజినెరార్గా | యూజెనెవార్గా |
| 182 | 6 | సోవియట్ కి | సోవియట్ |
| | 7 | ఏర్పటు | ఏర్పాటు |
| 183 | 18 | వర్గవివక్షణ | వర్గవిచక్షణ |
| 184 | 8 | రాజులా | రాజులు |
| 185 | 14 | పునర్నిర్మించి | పునర్ముద్రించి |
| 187 | 4 | తిరుగురాటు | తిరుగుబాటు |
| | 33 | వ్యరేకంగా | వ్యతిరేకంగా |
| 188 | 27 | దానివెలెనె | దానివలెనే |
| 190 | 19 | సవిరణ | సవిరంగా |
| 193 | 2 | పురంకితం | పునరంకితం |
| 195 | 2 | అవుదానం | అప్రదానం |

| | | | |
|---|---|---|---|
| 195 | 5 | ప్రభుత్వానికి | ప్రభుత్వాన్ని |
| 197 | 27 | మధ్యతగతి | మధ్యతరగతి |
| | 32 | యేర్పడుటకువ | యేర్పడుటకు ఎంత |
| | 33 | వామవ | వామపక్ష |
| 200 | 14 | చేయబడిమవి | చేయబడాలి |
| 204 | 29 | విట్ష ప్తి | విజ్ఞప్తి |
| 211 | 23 | ఇంటియా | ఇండియా |
| 213 | 12 | పునరుద్ఘాటించు | పునరుద్ఘాటించారు |
| | 21 | నాయత్వాన్ని | నాయకత్వాన్ని |
| 215 | 19 | యెతుగడలు | ఎత్తుగడలు |
| 224 | 20 | ప్రాతికపై | ప్రాతిపధికపై |
| 226 | 31 | వరోక్షకంగా | పరోక్షంగా |
| 229 | 15 | శమీకరించు | సమీకరించు |
| 230 | 34 | వమ్మెకు | సమ్మెకు |
| 231 | 6 | ఆంరపత్రం | ఆంధ్రపత్రం |
| 236 | 1 | డిశెకబరు | డిశెంబరు |
| 237 | 28 | మెజారిటిద్దతను | మెజారిటి మద్దతును |
| 243 | 2 | ఆ సంఘటిలో | ఆ సంఘటనల్లో |
| 253 | 20 | దృషికి | దృష్టికి |
| 254 | 30 | తెలింది | తెలిపింది |
| 227 | 12 | మం | మత |
| 262 | 35 | టాలకు | పోరాటాలకు |
| 262 | 27 | సాయుధగెల్లా | సాయుధగెరిల్లా |
| 265 | 3 | ముఖ్యమైదననే | ముఖ్యమైనదనే |
| 266 | 21 | వు రు | వున్నారు |
| 270 | 15 | వి వంలో | విప్లవంలో |
| 271 | 4 | బూర్షువా | బూర్జువా |
| 275 | 2 | సి. పి. ఐ ల | సి. పి. ఐ లో |
| 276 | 35 | ముంలీగుల | ముస్లింలీగుల |
| 280 | 10 | బలవర్తర | బలవత్తర |
| 289 | 22 | అంబేత్కర్ | అంబేద్కర్ |
| 295 | 5 | కతే | లేక |
| | 14 | వీక్ | లీగ్ |
| 304 | 4 | అధిప్రాధాన్యత | అధిక ప్రాధాన్యత |
| 312 | 3 | రాటీమూకల | రాడీమూకల |
| 320 | 7 | 1943 | 1948 |
| | 12 | మేర్పాటును | యేర్పాటును |